శుభమస్తు　　　శ్రీరామజయం　　　శుభమస్తు

# ప్రజలు తమ స్వలాభము నిమిత్తము సావధానముగ దీనిని చదువవలెను!



మేము నగలవర్తకము సత్పద్ధతులపై ప్రారంభించి ప్రజలకు నమ్మకమును, తృప్తిని గలిగించుచున్న విషయము దీర్ఘకాలమునుండీ మాతో లావాదేవి చేయుచు, మాకు అమితప్రోత్సాహము నొసగుచున్నట్టి మా ఖాతాదారు లందరికిని బాగుగ తెలియును.



నారీమణులకు, పురుషులకు, బాలబాలికలకు, పసిబిడ్డలకు, గృహములకు కావలసిన కెంపులబొట్లు, కెంపులజడబిళ్లలు, నాగరములు, కుచ్చులు, మాటీలు, బేసరీలు, రాజావతి, గొలుసులు, నాగవత్తులు, ఉంగరములు, వంకీలు మొదలగు బంగారునగలను, మిరియాలగొలుసులు, సేమియాగొలుసు, రిస్టులు, గడియారములతో జేబునందు ధరించు గొలుసులు, సాదాఉంగరములు, బహుమాన పతకములు, టూర్న మెంటు కప్పలు, లోలాకులు, మెడచెయినులు, ఉచ్చిబిళ్లలు, మొలగజ్జలు, మొలత్రాడులు, టీకాలు, పాలెడలు, ముక్కుచెంబులు, కంచములు, టీ, కాఫీ సెట్లు మొదలగునవి మావద్ద స్టాకులో నున్నవి.



నవరం బంగారుకు సీమవెండికి పూచీ నిచ్చెదము.



నమ్మకమునకు, తృప్తినిచ్చుటకు ... సుప్రసిద్ధమైనది.



అక్కరలేనివి వాపసు తీసుకొని యితరనగలు యిచ్చెదము.



మావద్ద మీరొక్కసారి ఒక్కబేరముచేసి స్వయముగా పరీక్షింపుడు.
మా ఖాతాదారులకు సహాయము చేయుటయే మా ముఖ్యోద్దేశ్యము.
బయటవూరి ఆర్డరులు కోరికమేరకు నమ్మకముగా తయారుచేసి సకాలమున పంపబడును.
మజూరితక్కువ చేదారములేదు అను డాబుప్రకటనలను చూచి మోసపోకుడు
ముఖ్యగమనింపు:—మాకు ఈ చెన్నపురియందు ఈ దిగువ తెలుపబడిన విలాసమునందుగల దుకాణము తప్ప యితర బ్రాంచీలు లేవు. గాన మోసపోకుండుటకై నేరుగా ఈదిగువవిలాసమునకే మీరు రావలెను.



తంతివిలాసము:
"ఉమ్మిడియార్"
టెలిఫోను నెం. 2802.

పరిశ్రమశాల,
62, గోవిందప్పనాయక వీథి,
(వసంతమంటపము బంగాళాకు ఎదుట), మద్రాసు.



## ఉమ్మిడి రామయ్యశెట్టి-గురుసామిశెట్టి కంపెనీ,

నగలవర్తకులు, 25 చైనాబజారు రోడ్డు, మద్రాసు.



# ఆంధ్రపత్రిక

## పదునెనిమిదవ సంవత్సరాది సంచిక

### ప్రభవ సంవత్సరము

ఆంధ్రవిద్వన్మహాజనులచే వ్రాయఁబడిన

### రాజకీయ సారస్వత చారిత్రక సాంఘికాది

విషయకవ్యాసములును, దేశభక్తుల చిత్రములును గలవు

ఆంధ్రపత్రికా ముద్రాలయమున ముద్రితము; ఆంధ్రపత్రికాధిపతిచేఁ బ్రకటితము

6-7, తంబుశెట్టి వీథి, జార్జిటవును, మద్రాసు

1927-వ సంవత్సరము ఏప్రిల్ 3-వ తేది

## నూతన రాజప్రతినిధి దంపతులు



శ్రీ ఇర్విను ప్రభువుగారు



శ్రీ ఇర్విను ప్రభ్విగారు



శ్రీ యం. ఆర్. జయకరుగారు



చిదిరెమఠం వీరభద్రశర్మగారు



గా. డాక్టరు పరంజపిగారు



కీ. శే. యస్. రంగస్వామి అయ్యంగారు

# విషయానుక్రమణిక

# చిత్రములు

శ్రీ రావు రామారాయ పురమందిర సభ్యులు-కొత్తపల్లి (పిఠాపురం), శ్రీ సీతారామ భక్తసంఘము-తుమ్మపూడి, డాక్టరు శ్రీసూర్యదేవర సంజీవరాయణం గారు, శ్రీరావు రామారాయపురమందిరము—కొత్తపల్లి (పిఠాపురం); కుష్ఠనివారణవైద్యాలయము, గోరక్షణ సంఘము, పురపాలకసంఘ గ్రంథాలయము, పురపాలక గ్రంథాలయము, తంతుకారకసంఘము-గుంటూరు. (6)

నన్నయభట్టు యజ్ఞముచేసినచోటు - తణుకు, శ్రీ కన్యకాపరమేశ్వరీ జాతీయపాఠశాల - గుంటూరు, స్వచ్ఛందసేవాదళ మహాసభ-ఏలూరు, నల్లగట్టుమీద ఓషధ్యన్వేషణవైద్యసంఘము; దుర్గముయొక్క- సింహద్వారము-తూర్పువైపు, దుర్గముచేరువనున్న పంటపొలము, వెదుళ్ల చెఱువు, కత్తులబావి—కొండవీడు. (7)

శ్రీబొమ్మన మహమ్మదు రెడ్డిగారు, శ్రీనూతి వెంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు, శ్రీ లేపాక్షి రామకృష్ణప్పగారు, శ్రీపెనుమత్స సత్యనారాయణరాజుగారు, శ్రీకొత్త సుబ్బరాజుగారు, శ్రీడాక్టరు బూదిహాళ్ మాధవాచార్యులు గారు, శ్రీదంటు సీతారామశాస్త్రిగారు, శ్రీ శ్రీ రామ్ పీర్‌బ్రహ్మంగారు, శ్రీమహమ్మద్ అబ్దుల్‌కరీంసాహెబు; శ్రీకస్తూరీదేవి జాతీయపాఠశాల- నూలువడుకు తరగతి, హిందీతరగతి, తృతీయవార్షికోత్సవము (౨౧-౨-౨౭), పాఠశాలబాలికలు, సంగీతపు తరగతి, పేముపని తరగతి —నెల్లూరు. (8)

శ్రీజెట్టా అప్పయ్యగారు, శ్రీ దేవరకొండజగన్నాథరావు పంతులుగారు, శ్రీజెట్టా అప్పయ్యగారి ౨౦ ధర్మపాఠశాలల బాలురు-బాపట్ల, ఆంధ్రగ్రంథమండలి-విశాఖపట్టణము, శ్రీకొత్తపల్లి వెంకటరామలక్ష్మీనారాయణశర్మగారు; శ్రీచర్ల నారాయణశాస్త్రిగారు, శ్రీరామకృష్ణ విగ్రహము, శ్రీయస్. అప్పలరాజుగారు, శ్రీ తుంపూడి భగవత్ గారు,బి.ఏ., శ్రీస్తుమతమునగలిసియుండి మరల హిందూమతమును స్వీకరించిన పంచములు,గుడివాడ. (9)

ఆయుర్వేదకళాశాలా పట్టభద్రులు - చెన్నపురి (౧౯-౨౧-౨౭), హిందూవిశ్వవిద్యాలయాంధ్ర విద్యార్థి సంఘము-కాశీ; శ్రీ ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు, శ్రీ కేశవ దేవజ్ఞానిగారు, శ్రీటంకాల జగన్నాథమూర్తి గారు, శ్రీ యం. రుద్రప్పగౌడుగారు, శ్రీధవళేశ్వరపు నరసింహాచార్యులు గారు, కీ. శే. మొసలి వెంకట స్వామిగారు. (10)

ఆరోగ్యవారము, శిశుప్రదర్శనము-వేటపాళెము, జాతీయారోగ్య శిశువారము - పెంటపాడు యూనియను, గుజ్జారినారి, రాజకీయోన్నత బాలికాపాఠశాల బాలికల నాటకప్రదర్శనము-అనంతపురము, బొబ్బిలి శిశుప్రదర్శనమున బహుమానముగాంచిన శిశువు, ఆరోగ్యప్రదర్శన సంఘము, ఆరోగ్యప్రదర్శనమున బహుమతులనుగాంచిన వారు-వేటపాళెము; ఓంకార స్వామివారు అమెరికా నుండి తిరిగివచ్చినపుడు తీసినచిత్రము, శాంత్యాశ్రమ ధర్మవైద్యశాల, శ్రీ ఓంకార స్వామివారు, శాంత్యాశ్రమస్థాపకులు - శ్రీ శాంత్యాశ్రమము, తోటపల్లి కొండలు, గోదావరిజిల్లా. (11)

స్వశక్తి ముద్రణాలయ ప్రారంభోత్సవము, సారస్వతనికేతన అష్టమవార్షికోత్సవసభ-వేటపాళెము,కవితా సమితిసభ్యులు; హిందూయువజనసంఘము కొండపల్లి, ఆంధ్రసోదరసంఘము-జెముపెడుపూరు, శ్రీభాగవతుల సుబ్బరామయ్యగారు, వడ్లూరు కట్లవైద్యము. (12)

---



# చిత్ర వివరణము

అప్పయ్యగారు, జెట్టి; బాపట్ల (గుంటూరుజిల్లా): వీరు తెలగకులమునకు జెందినవారు. పదిసంవత్సరములనుండి నిమ్నజాతులకొఱకు ఇరువది ధర్మపాఠశాలలను స్థాపించియున్నారు. విద్యార్థులకు పలకలు, పుస్తకములు ఉచితముగ నిచ్చెదరు. గుంటూరుజిల్లా విద్యావిషయికసభ (Educational Council) యందొకసభ్యుడు. ధర్మ పఠనమందిరమొకటి, గ్రంథాలయమొకటి వీరు జరుపుచున్నారు. ఈ పాఠశాలయందు చదువు బాలుర చిత్ర మిందు ప్రకటితమయినది.

అప్పలరాజుగారు, సూర్యంపల్లి:—వీరి నివాసస్థానము విజయనగరము. వైశ్యవర్ణమునకు చెందినవారు. గానచిత్రలేఖనాది కళలయందు ప్రవేశముగలవారు. వీరు చిత్రించిన శ్రీ రామకృష్ణపరమహంసగారి చిత్రముయొక్క ప్రతిబింబము నిందు ప్రచురింపబడినది.

ఆయుర్వేద కళాశాల పట్టభద్రులు, చెన్నపురి ౧౯౩౬-౩౭:— ఈ కళాశాలయం దీసంవత్సరము 'భూషణ' పట్టభద్రులు, ఇద్దరు, భిషగ్వరపట్టభద్రులు ఇరువదిరెండుగురు గలరు. వీరిలో ఆంధ్రులు ౧౪, తమిళులు ౧౦. ఈ కళాశాల ప్రారంభమైన నాటినుండి యిందఱు విద్యార్థులు పట్టభద్రులగుట యీ యేడునే.

కవితాసమితి:—ఇది విశాఖపట్టణమునందలిది. దీనికి శ్రీ. పురిపండా అప్పలస్వామిగారు కార్యదర్శిగా నున్నారు.

కృష్ణారావు గారు కలియుగార్జున, బాలకవి- గుంటూరు:—వీరి నివాసస్థానము సేపూరు. వీరు ధనుర్విద్య నభ్యసించినారు. వీరు చెన్నరాజధానియందేకాక రంగూన్, బర్మా, బండేల్ ఖండు మొదలైన ప్రసిద్ధనగరములయందును తమ విద్యాకౌశల్యమును ప్రదర్శించి మెప్పుగాంచి, కలియుగార్జున బిరుదమును, విజయవీరసువర్ణ ఘంటికాదులను బడసినారు. 'ధనుర్విద్య'యను గ్రంథము నాంధ్రమున రచియించినారు.

కేశవదేవజ్ఞానిగారు:—వీరు గుడివాడలో క్రీస్తుమతమున చేరియుండిన పంచములను మరల హిందూమతమున చేర్చుటకు పాటుపడినవారు.

కొండలరావుగారు, నిడసనమెట్ల:—రాజమహేంద్రవరమునందలి "శ్రీవేణుగోపాల విలాసనాటకసభ"కు వీరు కార్యదర్శిగానున్నారు. వీరికి నాటకకళయం దభిరుచి మెండు.

కౌసల్యాకన్య, బి. ఎ., యల్. టి. సి. కే.:— ఈమె మేరీకళాశాలలో నుపాధ్యాయినిగా నున్నది. అకెడమిక్ కౌన్సిలునుండి యీమె సెనెటుసభకు సభ్యురాలుగ నెన్నుకొనబడినది. ఇట్టి గౌరవమును బడసిన మొదటి హిందూయువతి యీమెయే. ఈమె న్యాయమూర్తి కృష్ణమగారి సోదరుని పుత్రిక.

గుజ్జారినారి:—ఈమె బళ్లారిమండలమునందున్న ముప్పది యేండ్లుదాటిన ముత్తయిదువరాలు. ఈమె రెండడుగులకుపైన కొంచె మెక్కువపొడవుగ నుండును. సుగుణవతి.

గోరక్షణసంఘము, గుంటూరు:— ఈసంఘమునకు శ్రీయుత వడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావుగారు అధ్యక్షులు. ఇందు నలువది గోవులున్నవి. వానిపాలు రోగిబిడ్డల కుపయోగపడుచున్నవి. ఈసంఘమున కనుబంధముగ శిశురక్షణసంఘమొకటి నెలకొల్పబడినది.

చంద్రశేఖరయ్యరుగారి సతి, కె. యన్.:— ఈమె బెంగుళూరు జిల్లాబోర్డు సభ్యురాలుగా మైసూరుప్రభుత్వము వారిచే నియమింపబడెను. మైసూరున స్త్రీ సభ్యురాలుగ నియమింపబడుట కిదియే మొదటిసారి. దీ. బ. చంద్రశేఖరయ్యరుగారు ప్రధాన న్యాయమూర్తిగనుండి పింఛను దీసికొనిరి.

చిదంబరయ్యగారు, ఘుడికూరం:—వీరిది జమ్మలమడుగు. కాంగ్రెసుపక్షమునకు చెందినవారు. ఖద్దరువ్యాపనమునందును, మద్యపాన నిషేధప్రచారమునందును పాటుపడుచున్నారు.

జగన్నాథమూర్తిగారు, టంకాల:—వీరిది గంజాం జిల్లాలోని పెర్కులి. వీరు పరోపకారపరాయణులు.

దయామని (దయామణి) గారు:—బొబ్బిలియందున్న సి. బి. యం. బాలికాపాఠశాలలో ౭ వతరగతి చదువుచున్న బాలిక. మద్యపానమునుగూర్చి యీబాలిక తెనుగున కథారూపమున నొక వ్యాసమును వ్రాసి, క్రైస్తవస్త్రీ మద్యపాననిషేధసంఘము వారిచే ప్రథమబహుమానమును బడసినది.

నరసింహాచార్యులుగారు, ధవళేశ్వరపు, ఇంజనీయరు:—వీరు బి. జే. టి. ఇన్‌స్టిట్యూటునందు మెకానికల్ ఇంజనీరింగువిద్య నభ్యసించినారు. వీరికి సంస్కృతము, హిందీభాషలుకూడ తెలియును. చిత్రవిద్యను పైతము వీరు నేర్చియున్నారు. జగన్మోహినీ సుగుణాకరవిజయ మను ప్రబంధమును తెలుగున రచియించినారు.

నల్లగట్టుమీద ఓషధ్యన్వేషణవైద్య సంఘము:— నల్లగట్టు అనునది నూజివీడుప్రాంతములయందుగల ఒకకొండ.

నారాయణశాస్త్రిగారు, చర్ల:—తణుకుతాలూకా కాకరపఱ్ఱుగ్రామమున వీరు కాపురమున్నారు. వీరు ఆరామద్రావిడశాఖకు చెందినవారు. సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యము గలవారు. భాష్యాంతము వ్యాకరణశాస్త్రమును బఠించినారు. మహిమ్నశతకమును, అనర్ఘ్యణకారికలను తెలిగించినారు.

**బ్రహ్మసమాజమందిరము, దక్షిణహైద్రాబాదు:** దీనికి శ్రీమాన్ యన్. జి. వెలింకరుగారు అధ్యక్షులు. రెండవచిత్రమున నూత్నవధూవరులను బ్రహ్మసమాజ మతాచార్యులు శ్రీశివశ్రేష్ఠి భాగ్యరెడ్డివర్మగారు ఆశీర్వదించుచున్నారు.

**బ్రాకుదొరగారు, రెవరెండు:**—వీరు కనిగిరి ఎ. బి., యం. మిడిల్ స్కూలు మేనేజరు. వీరు కనిగిరిలో ౩౫ సంవత్సరముల నుండి మిషనరీగా పనిచేయుచున్నారు. వీరు అన్ని జాతులవారియందును సమబుద్ధితో ప్రవర్తించుచుందురు. ఈపాఠశాలను ౧౦ ఏండ్లక్రిందట వీరే స్థాపించినారు. అన్నివర్ణములకు, మతములకు జెందినవారు నిచట చదువుచున్నారు.

**భగవత్ గారు, బి.ఏ., యం.ఆర్.ఏ.యస్., తుంపూడి:** చెన్నపురి ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుగారును, వైశ్యకులీనులునగు శ్రీయుత తుంపూడి భగవంతంగుప్తగారి జ్యేష్ఠపుత్రులు. న్యాయశాస్త్రము నభ్యసించుచున్నారు. వాసవీపత్రికకు సంపాదకులుగ నున్నారు. వీరు సంఘసేవయం దాసక్తిగలవారు.

**భీమరావు పాట్నాయకు గారు, బి. ఏ., బి. యల్., జీ:**—వీరు నివాసస్థానము బరంపురము. వీరు గంజాంజిల్లా యందలి యొకానొక సుప్రఖ్యాత కుటుంబమునకు జెందినవారు. వీరు ౧౯౩౬ వ సం. మేనెల ౩౦,౩౧ తేదీలు సాలూరులో జరిగిన ద్వితీయాఖిలభారత శిష్టకరణసమ్మేళనమునకు అధ్యక్షులుగా నుండిరి.

**మహమ్మదు అబ్దుల్ కరీమ్ సాహెబుబహదురుగారు:** వీరు ఏలేశ్వరప్రాంతముల ప్రసిద్ధిగాంచిన యూనానివైద్యులు.

**మాధవ రావుగారు, న్యాపతి:**—మైసూరు రాజ్యమున నున్నతపదవియందున్న ఆంధ్రప్రముఖులు. బి. ఏ. పరీక్షయందు మొదటి తరగతిలో నుత్తీర్ణులైరి. బి. యల్. పరీక్షయందు రాజధానిలో మొదటివారుగ ఉత్తీర్ణులయి శ్రీ. వి. భాష్యమయ్యంగారి స్వర్ణపతకమును బహుమతిగా బడసిరి. మైసూరు సివిల్ సర్వీసు పరీక్షయందును మొదటివారుగ నుత్తీర్ణులయి అసిస్టెంటు కలెక్టరుగ నియమింపబడిరి. క్రమముగ కలెక్టరుపదవినిపొంది, తరువాత భద్రావతి ఇనుప పరిశ్రమకు అధికారిగా నియమింపబడిరి. మైసూరు మునిసిపాలిటికి అధ్యక్షస్థానమున కొంతకాలముండిరి. మైసూరు ప్రభుత్వపు సెక్రటరి పదవిని అచిరకాలమున పొందనున్నారు.

**మాధవాచార్యులు గారు, డాక్టర్ బూదిహాళ్, యల్. యమ్. యస్:**—వీరు మంచినటకులు, శ్రావ్యమగుకంఠస్వరముతో గానముచేసి శ్రోతలకానందమును గలుగచేయుదురు.

**మాలతీ పటవర్ధనమ్మగారు:**—ఈమె వ్యాయామరంగమున పాల్గొనిన ప్రథమ భారతీయయువతీమణి. ఈవరకు చెన్నపురమున జరిగిన టెన్నిసుపందెములందు శ్రీ బాలగోపాలముగారితో గలసి పోటీచేసినది. ఈమె కన్నడరాష్ట్రమునకు చెందినది. ఈమెభర్త ఇటీవల నంతరించిన న్యూయిండియాపత్రికకు సహాయ సంపాదకుడుగానుండెను. ఈమె అడయారు బాలికా పాఠశాలలో నుపాధ్యాయినిగా నున్నది.

**ముత్తులక్ష్మమ్మగారు, యమ్. బి.సి. యమ్., యమ్. యల్. సి.:**—వీరు చెన్నపుర వైద్యకళాశాలయందు వైద్యమును చదివి యం.బి. డిగ్రీనిపొందిన తమిళ మహిళామణి. పదిపండ్రెండేండ్ల నుండి వైద్యవృత్తియందు వన్నెకెక్కి చెన్నపురమునందే యున్నారు. ప్రసూతి శిశుచికిత్సలయందు తమశిక్షను బొందుటకై నిరుడీమె ఇంగ్లండునకుపోయి యటనుండి ప్యారిసునగరమున జరిగిన ప్రపంచమహిళాసభకు భారతీయ ప్రతినిధులలో నొకరుగా పోయియుండిరి. ప్రస్తుతపు చెన్నపురి శాసనసభలో సభ్యురాలుగా నీమెను ప్రభుత్వమువారు నియమించిరి. తరువాత నీమెను శాసనసభకు ఉపాధ్యక్షురాలుగా నెన్నుకొన్నారు. బ్రహ్మసమాజమతానుసారముగ ఆంధ్రప్రముఖులును, వైద్యకళాశాలయం దుపాధ్యాయులును నగు సుందరరెడ్డిగారిని వివాహమై సంతానమును గాంచియున్నారు.

**రాఘవేంద్రరావుగారు, ఈద్పుగంటి:**—వీరుకృష్ణాజిల్లాగుడివాడతాలూకాలోని పెదమద్దాలి గ్రామవాసులు. వీరి తండ్రిగారగు నాగన్నచౌదరిగారు ౬౦ సం. క్రిందట మనదేశమున రైల్లురాక పూర్వము మిలిటరీవారితో మధ్యరాష్ట్రములకు వారిసామగ్రి ఎడ్లమీద మోయించుకొనిపోవుటకు కంట్రాక్టుమీద వలసవెళ్లియున్నారు. వీరితోపాటుకమ్మవారు అనేకమందివెళ్లి నాగపూరు, బిలాసపూరు, జబ్బల్పూరు మున్నగు ప్రాంతముల నివాస మేర్పరచుకొన్నారు. రాఘవేంద్రరావుగారితండ్రి మిలిటరీకంట్రాక్టులుచేసి, ధనమార్జించి, విశేషము పలుకుబడి సంపాదించిరి. రాఘవేంద్రరావుగారు లండనులో బారిష్టరు ప్యాసయి, బిలాసపురమున న్యాయవాదివృత్తినుండి పురపాలకసంఘాధ్యక్షులైరి. జిల్లాబోర్డు అధ్యక్షులై గతశాసనసభలలో స్వరాజ్యపార్టీనాయకులై విశ్వాసరాహిత్యతీర్మాన మునుపపాదించిరి. మంత్రిపదవి గూడ నిరాకరించిరి.

స్వరాజ్యపార్టీ కార్యనిర్వాహకసభయందు సభ్యుడుగా వీరు పనిచేసినారు. కాని ఆపార్టీసిద్ధాంతములందు విశ్వాసముపోవుటచే ఇండిపెండెంటు కాంగ్రెసుపార్టీని స్థాపించి గతఎన్నికలలో పోటీ లేకయే గెల్చినారు. ఇప్పుడు పార్టీ సిద్ధాంతప్రకారము మంత్రిపదవి స్వీకరించి ప్రధానమంత్రి అయినారు. ఇట్లు యౌవనమునందే ఇట్టి గౌరవపదవి నెవ్వరు, ఎచటను మనదేశమున పొందలేదు. వీరివయస్సు 35 సం. మాత్రమే యుండును. వీరు పలుకుబడి గలవారు; ధనవంతులు; మనదేశముతో సంబంధబాంధవములు గలవు. ప్రతిసంవత్సరము స్వగ్రామమగు పెదమద్దాలికి వచ్చుచుందురు. అచట వీరికి భూములుగూడ గలవు.

**రామకృష్ణప్పగారు, లేపాక్షి:**—వీరి నివాసస్థానము పెనుగొండ తాలూకాలోని లేపాక్షి. వీరు గొప్పకుటుంబమునకు జెందినవారు. తాలూకాబోర్డు, జిల్లాబోర్డు, దేవాదాయ సంఘములయందు మెంబరుగా నుండిరి.

**రాములుగారు, వాసిరెడ్డి:**—వీరిది రాజమహేంద్రవరము. వెలమవారు, జాతీయవాదులు; రాజమహేంద్రవర పురపాలక సంఘమునను, పంచాయతీకోర్టునను మెంబరుగానున్నారు. శ్రీసీతారామభక్త సంఘముయొక్క రాజమహేంద్రవరశాఖకు కార్యదర్శిగ నున్నారు.

**రుక్మాబాయి గారు:**—ఈమె మదనపల్లె చెంతనున్న గంగవాయకోట హళ్లియం దొక నియోగిబ్రాహ్మణ కుటుంబమున జనించినది. బాల్యమునందే ఆంగ్లవిద్య నభ్యసించినది. జననము మొదలు మంచి ఆరోగ్యమును, దేహదార్ఢ్యమును గలిగియుండి యనుదినమును శరీరసాధన చేయుచు బలమును పెంపొందించుకొనినది. ఈమె కిపుడు ౨౫ ఏండ్లు వయస్సు. పదియేండ్లకుపూర్వ మొక సర్కసుకంపెనీలో చేరి వ్యాయామప్రదర్శనములను గావింప నీమె మొదలిడినది. తరువాత ఛత్రి పరశురామరావు సర్కసుకంపెనీలలో కొంతకాలముండి యిప్పుడు జాక్కార్సను సర్కసులో వ్యాయామప్రదర్శనములు గావించుచున్నది. మొన్న ఫిబ్రవరిలో చెన్నపురమున ఫోర్డు మోటారుకారును ఆపి తన యద్భుతశరీరమును ప్రకటించి ఆంధ్రలోకమునకు వన్నె దెచ్చినది. ఈమె యిట్లు చేయుట కిదియే ప్రారంభము. ఈమె అవివాహిత; మితభాషిణి; సామాన్యస్త్రీవలె గాన్పించును. ఈమె యిప్పుడు ననుదినము, శరీరసాధనమును, ప్రాణాయామమును జేయుచుండును. స్త్రీలలోగూడ నిట్టివారు బయలుదేరు టాంధ్రదేశాభ్యుదయసూచకము.

**రుద్రప్పగౌడుగారు, యం:**—హోసూరుతాలూకా మాచినాయకనపల్లి వీరి స్వగ్రామము. వీరుప్రజాహిత కార్యములందు పాటుపడు ప్రముఖులు.

**లక్ష్మీదేవి, యం. బి., బి, యస్:**—ఈమె డాక్టరు ఆచంట లక్ష్మీపతి (యం. బి., బి. యస్.) గారి పుత్రిక ఢిల్లీనగరమందలి లేడీహార్డింజి వైద్యకళాశాలలో నేడు సంవత్సరములు వైద్యవిద్యనభ్యసించి యం. బి., బి. యస్. పరీక్షయందు విజయము గాంచిన యాంధ్రయువతీమణి యిప్పటి కీమె యొక్కరితయే. డబ్ల్యూ. యం. యస్. ఐ. (Training reserve of Women's Medical Service in India) పట్టమును పొందుటకై మూడుసంవత్సరములు వైద్యశాఖయందు పనిచేయ నీమె నియమితయయ్యెను. తరువాత నీమె వైద్యశాస్త్రమున నెక్కుడుసామర్థ్యమును గడించి ఉత్తమ పట్టాములను గాంచ నింగ్లాండునకు బోవుచున్నది.

**వి. యస్. శాస్త్రిగారు:**—వీరిది తెనాలి, వి. యస్. శాస్త్రి అందురన్న ప్రఖ్యాతులు. నేత్రపరీక్ష చేయగలవారు. ఉదారస్వభావులు.

**విఖనసాచార్య వర్షవర్ధనోత్సవము:**—ఈ యుత్సవమును ప్రతిసంవత్సరము శ్రావణ శుద్ధపూర్ణిమనాడు శ్రీ. విఖనసాచార్య సేవాసంఘమువారు జరుపుదురు.

**వీరబ్రహ్మము గారు, శ్రీరామ్:**—వీరు విశ్వబ్రాహ్మణులు; మచిలీపట్టణమువారు. విశ్వజ్ఞగ్రంథనిలయస్థాపకులు. సంస్కృతాంధ్రములయందు పరిచయము గలవారు. కొన్ని తెలుగుపుస్తకములను రచియించి ప్రకటించియున్నారు. 'విఖ్యాతచరిత్ర'యను గ్రంథమును ప్రకృతము రచియించి ప్రకటింపనున్నారు.

**వీరభద్రశర్మగారు, చిదిరెమఠము; బాలకవి:**—వీరి జన్మస్థానము నిజాము రాష్ట్రమునందలి నల్లగొండనగరము. తమ చిన్నవయసుననే సంస్కృతాంధ్రములయందు పరిశ్రమించి కవిత్వమునలవఱుచుకొన్నారు. 'వీరశైవ వివాహవిధి'యను గ్రంథమును వ్రాసిరి. ప్రస్తుతము కాశీక్షేత్రమునందు శాస్త్రము నభ్యసించుచున్నారు.

**వీరరాఘవయ్య గారు, చేగు:**—వీరు గుంటూరునందలి గాంధీ హిందీమందిర గ్రంథాలయమునకు అధ్యక్షులుగా నున్నారు. గుంటూరుపురమున హిందీభాషాప్రచారము గావించుచున్న యువకులు.

**వెంకటగోపాలకృష్ణంరాజు గారు, సయ్యపరాజు, క్షత్రియ సేనాని:**—వీరుక్షత్రియులు. వీరిది పశ్చిమగోదావరిజిల్లా లంకలకోడేరుగ్రామము. వీరు జాతీయవాదులు. వీరికి మల్లవిద్య, బాణాకఱ్ఱత్రిప్పుట, కత్తిసాము, గడకట్టుమొదలయినవి బాగుగ తెలియును. కాకినాడ కాంగ్రెసునందు వీరు గావించినసేవ యమూల్యమయినది. వీరు మల్లయుద్ధమున పెక్కురువస్తాదులను ఓడించిరి. ఉత్తరహిందూస్థానమున సంచరించి కాశీమొదలయినపట్టణములయందు తమ మల్లయుద్ధకౌశల్యమును గనుపఱచి పేరుగాంచిరి.

**వెంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారు, నూతి:**—వీరు కర్నూలు పట్టణమునందు వైశ్యప్రముఖులలో నొకరు. అసహాయోద్యమమున పాలుగొని దేశమాతృసేవ గావించుచున్నారు. కర్నూలు పురపాలక సంఘసభ్యులు.

వీరు ఆర్యవైశ్య సేవాసంఘము నొకదానిని స్థాపించి దానికి కార్యదర్శిగా నున్నారు. బీదలగు పదుగురు కోమటిబిడ్డలకు అన్నవస్త్రముల నొసగి చదువు చెప్పించుచున్నారు.

**వెంకటసుబ్బారాయుడుగారు, మధ్యాహ్నపు; (ఏలూరు, (పడమరవీధి):**—ఏజాతిపామయినను మనుష్యులనుగాని, ఇతరజంతువులలో దేనినిగాని కరచినయెడల వెంటనే వీరివద్దకువెళ్లవలెనని చెవిలో చెప్పవలెను. తోడనే యొకరుబయలుదేరివచ్చి వీరికి ఆవిషయము చెప్పవలెను. వీరు తీర్థము మంత్రించిన ద్రవమును తెచ్చినవారికిచ్చెదరు. వారుదానిని త్రాగినతోడనే, పాముకరిచిన మనిషికిగాని, పశువునకుగాని విషముదిగిపోవును. ఒకవేళ నీరు దొరికిలో లేనియెడల పాముకరచినసంగతి వారియింటియొద్ద చెప్పవలెను. ఇంటివారు ఒకకాటుకనిచ్చెదరు. దానిని కొనిపోయి కంటికిపెట్టినయెడల విషముతగ్గును. దూరప్రదేశములనుండి తంతియిచ్చినను తంతితెచ్చినవానికి తీర్థముమంత్రించి యిచ్చెదరు. దానినాతడు త్రాగినవెంటనే పాముకరచినవారు సుఖముగ నుందురు.

**వెంకటస్వామిగారు, మొసలి కీ. శే.:**—వీరు శ్రీసుభిక్షసంపదభివృద్ధి (దీనపోషక) సమాజస్థాపకులు. రంగూనుపురమందలి ప్రథమాదిమాంధ్రనాయకులు. జాతీయసాంఘికాభివృద్ధికొఱకు కృషి సలుపుచుండెడివారు.

**శ్రీకన్యకాపరమేశ్వరీజాతీయపాఠశాల, గుంటూరు:** ఇది ౧౯౩౬-వ సంవత్సరము నవంబరు ౨౪-వ తేదినాడు, పాఠశాల విద్యార్థులును, ఉపాధ్యాయులును కొండవీడుకెళ్లినను ఎక్కినపుడు తీసిన ఛాయాచిత్రము.

ఈపాఠశాల నాలుగేండ్లనాడు స్థాపింపబడినది. ఇందుపదునెనమండుగురు వైశ్యవిద్యార్థులకుచితముగ భోజనాదులొసగబడుచున్నవి. ప్రకృతము మూడు తరగతులున్నవి. ఎనమండ్రు ఉపాధ్యాయులు గలరు. సంస్కృత ఆంధ్ర ఆంగ్ల భాషలయందు శిక్షణవిధానమునకు వలసినవియు

యము లిందు నేర్పబడును. రాబోవు సంవత్సరమున వ్యాపారమునకు వల సినవిద్యయు బోధింపబడును.

**శ్రీరావు రామారాయపురమందిరము, క్రొత్తపల్లి:** ఈమందిరము ౧౯౧౮-వ సంవత్సరమున స్థాపితమైనది. శ్రీరావు రామారాయణంగారి జ్ఞాపకార్థము వారిపుత్రులు దీనిని స్థాపించినారు. ౧౯౦౦ సంవత్సరమున స్థాపితమైన శ్రీరామారాయ పుస్తకభాండాగారము మూడువేలగ్రంథములుగలది యీమందిరమునకలదు.

**సంజీవరాయణం గారు, సూర్యదేవర; డాక్టరు:—** వీరు గుంటూరుజిల్లాలోని తుమ్మపూడి నివాసులు. శ్రీ సీతారామ భక్త సంఘస్థాపకులు. గుంటూరు గోరక్షణసంఘ ప్రతిష్ఠాపకులు.

**సత్యనారాయణరాజుగారు, పెనుమత్స:—** వీరు క్షత్రియులు. అమలాపురం తాలూకా కాకరపఱ్ఱు వీరి జన్మస్థానము. తెనుగు, సంస్కృతము బాగా చదివినవారు. కవిత్వమును చెప్పగలరు. వీరికి పండితబిరుదము గలదు. చంపకమాలినీపరిణయము మొదలయిన గద్యపద్యపుస్తకములు వీరు రచియించినవి అచ్చయినవి. ఇపుడు తణుకు హైస్కూలు తెలుగుపండితులుగా నున్నారు.

**సన్న్యాసి రాజయోగి గారు, దంతులూరి:—** అన కాపల్లి కి చేరువనున్న తుమ్మపాల వీరికి జన్మభూమి. వీరు గొప్ప ప్రొప్ర యిటరీ గ్రామములు గలవారు. ప్రకృతము వరిపిపట్టను రోడ్డువద్ద రాజయోగాశ్రమము గట్టుకొని యందున్నారు. నాలుగేండ్లనుండి నిర శనవ్రతమును బూనియున్నారు. ఉదారమైనస్వభావము గలవారు.

**సారస్వతనికేతనము, వేటపాలెము:—** అష్టమ వార్షి కోత్సవ సందర్భమున తీసిన ఛాయాచిత్రమిది. శ్రీ ఆంధ్రవాల్మీకి వావిలికొలను సుబ్బారావు పంతులుగారు అధ్యక్షులు.

**సీతారామ శాస్త్రిగారు, దంటు:—** వీరు సంస్కృతాంధ్రములయందు మంచిపాండిత్యము గలవారు. ప్రస్తుతము గుంటూరు నందలి శ్రీ కన్యకాపరమేశ్వరీ జాతీయపాఠశాలయందు తెనుగు పండితులుగ నున్నారు.

**సుబ్బరాజుగారు, క్రొత్త:—** ఆర్యవైశ్యకులమునకు జెంది నవర్తకులు. వీరు రాజమహేంద్రవరమునందలి అన్నదానసమాజమున సభ్యులు. రాజమహేంద్రవరమునుండి భద్రాద్రికి స్టీమలాంచి వేసి యున్నారు.

**సుబ్బరామయ్య గారు, భాగవతుల:—** ౧౯౨౧-వ సంవత్సరములో గవర్నమెంటు ఉద్యోగమును వదలుకొని కాంగ్రెసు పక్షమున జేరి ఆంధ్రరాష్ట్రీ కాంగ్రెసుసంఘమున గుమాస్తాగా పని చేయుచున్నారు.

**సూర్యనారాయణ గారు, గుత్తుల:—** అమలాపురం తాలూకా జగన్నాథపురం వీరి నివాసస్థానము. వీరు గొప్ప భూస్వా ములు; శెట్టిబలిజ యువజన సంఘాధ్యక్షులు. తమ సంఘముయొక్క అభివృద్ధికి మిగుల పాటుపడుచుందురు. పేరూరునందలి డి. యన్. శెట్టి హైస్కూలునకు రు. ౩,౦౦౦ విరాళము నిచ్చినారు. ఉదార స్వభావము గలవారు.

**సూర్యనారాయణమూర్తి దంపతులు, అప్పికట్ల:—** వీరి నివాసస్థానము ఛత్రపురము. సూర్యనారాయణమూర్తిగారు గంజాంమండల ప్రముఖులయం దొక్కరు. చిన్ననాటనుండియు పెక్కు దేశీయోద్యమములయందు పాల్గొనుచున్నారు. గంజాంమండల స్థానిక సంఘముల పక్షమున నాంధ్రవిశ్వవిద్యాలయ ప్రతినిధిగ నున్నా రు. గంజాంజిల్లా పరపతిసంఘ కార్యనిర్వాహకసభ్యులలో నొక్కరు. గంజాంజిల్లా బోర్డునకు, ఛత్రపురం తాలూకాబోర్డునకు అధ్యక్షప్రతి నిధులు. గంజాంజిల్లా వ్యవసాయసంఘమునకు కార్యదర్శి. గంజాం జిల్లా విద్యావిమర్శసభ (EducationalCouncil)కును, జిల్లారు ఆంధ్రసాయుసంఘమునకును సభ్యులు. సివిల్ జస్టిస్ కమిటీవారు ప్రభు త్వమువారి యాజ్ఞ ప్రకారము వీరి సాక్ష్యమును గైకొనిరి.

వీరి సతీమణి ఆంధ్రదేశమునకు చిరపరిచితులైన శ్రీ శ్రీపాద కామేశ్వరరావుగారి పుత్రిక. ఈమె యెల్లవిధముల పతికి అనురూప పతియగు సతి.

**సూర్యప్రకాశరావుగారు, డి. బాలకవి:—** వీరిది కాకినాడ. తెలుగులో సరసముగా కవిత్వము నల్లగలరు.

**'స్వశక్తి' ముద్రణాలయ ప్రారంభోత్సవము:—** విశాఖపట్టణమందలి స్వశక్తికార్యాలయమువారు ముద్రణాలయ ప్రా రంభసమయమున తీసిన ఛాయాచిత్రమిది. దీనికి శ్రీ. పురిపండా అప్పలస్వామిగారు మేనేజరు.

**హనుమత్పుస్తకభాండాగారము:—** గోదావరిజిల్లా రామచంద్రపురమున ౧౯౨౩ వ సంవత్సరమున స్థాపితమైనది. ఈ గ్రం థాలయమునకు శ్రీ. దేవరకొండ జగన్నాథరావు పంతులుగారు, (యం. ఏ.), నాలుగువందల సంస్కృతాంధ్రాంగ్ల ముద్రితగ్రంథముల నుచిత ముగ నిచ్చినారు.

**హిందీబాలికాపాఠశాల, గుడివాడ:—** ఈ పాఠశాల యందు నలువదిమంది బాలికలు హిందీ నభ్యసించుచున్నారు. శ్రీయుత జంధ్యాల శివన్న శాస్త్రిగారు రధ్యాపకులుగానున్నారు.

**హిందూ యువజనసంఘము, కొండపల్లి:—** ఈ సం ఘము 1918 లో స్థాపితమైనది. 1919-1920 వ సంవత్సరములలో సహాయనిరాకరణోద్యమమున పాల్గొనినది. కార్యదర్శి శ్రీ. మా. వెంక టేశ్వర గుప్తగారు; అధ్యక్షులు: బాలకవి, శ్రీ బుద్ధిరాజు హనుమంత రావుగారు.



శ్రీ శివాభ్యాం నమః

# శ్రీ ప్రభవ సంవత్సర సిద్ధాంత పంచాంగము

శ్లో॥ శ్రీకల్యాణగుణావహం రిపుహరం దుస్స్వప్నదోషాపహం, గంగాస్నాన విశేషపుణ్యఫలదం గోదానతుల్యం నృణామ్;
ఆయుర్వృద్ధిద ముత్తమం శుభకరం సంతాన సంపత్ప్రదం, నానాకర్మసుసాధనం సముచితం పంచాంగ మాకర్ణ్యతామ్.



ఈ పంచాంగము

శ్రౌతశైవమార్గప్రవర్తకులు, జ్యోతిష్యల వంశార్ణవ పూర్ణశశాంకులు నగు
బ్రహ్మశ్రీ మల్లయారాధ్యులవారి పుత్రులిందును, బ్రహ్మశ్రీ కుప్పా వేంకటకృష్ణశాస్త్రి,
యా. నాగేశ్వరశాస్త్రులుగార్ల ప్రియశిష్యుండును నగు

## కనకయ్య సిద్ధాంతిగారు గణించినది

ఆంధ్రపత్రికా ముద్రాశాలయందు ముద్రితమైనది.

## సంవత్సరఫలితాంశము

ఈ ప్రభవసంవత్సరమున చైత్రవైశాఖమాసములయందు అచ్చటచ్చటస్వల్పవృష్టియు,వేడియు, పశ్చిమవాయువు మెండయి అప్పుడప్పుడు భిన్నభిన్న దేశముల పాషాణవృష్టి గురియును. జ్యేష్ఠమాసమున స్వల్పముగవర్షించును; ఖండవృష్టిగురియును. ఆషాఢమాసమున సస్యానుకూలముగవర్షించును. శ్రావణమున సామాన్యవృష్టియు, భాద్రపదమున సస్యానుకూలవృష్టియు, ఆశ్వయుజమాసమున సంపూర్ణవృష్టియు గురియును. కార్తికమున మధ్యవృష్టి గురియును. పశునాయకుడు యముడగుటచే పశువులు రోగములవలనను, తృణాభావమువలనను కొంత బాధ నొందినను స్థానసంరక్షకుడు బలభద్రు డగుటచే తిరిగి సుఖమును బొందును. ఈ సంవత్సరమున రాజు సూర్యుడగుటచే చోరాగ్నిబాధలు మెండుగా నుండును. నువ్వులు, మినుములు, ఉలవలు మొదలుగాగల నల్లధాన్యములు, తెల్లధాన్యములు, బాగుగ ఫలించును. నల్లభూములును బాగుగఫలించును. నువ్వులు, నూనె, బెల్లము, తేనె, నెయ్యి, చక్కెర మొదలుగాగలవస్తువులకు ధరలు హెచ్చుగా నుండును. కొమ్ములు,లోహములు,కఱ్ఱలు,ఉన్ని,బంగారు మొదలగువాటికి ధరలుసామాన్యముగ నుండును. మార్గశిర శు. ౧౫, గురువారము రాత్రి, 'అపవర్దన' నామక ఖచ్ఛన్న చంద్రగ్రహణముగలుగును. భాద్రపద శు. ౯ సోమవారము మొదలు బ. ౪ గురువారము వరకు పశ్చాదస్తంగత శుక్రమౌఢ్యము. చైత్ర బ. ౧౪ శనివారమునాడు ప్రణీతానదీ పుష్కరప్రవేశము. ఈసంవత్సరమున రెండుతూములు వానకురియును. పంటలు పదివీసములు కొక్కువఫలించును. జ్యేష్ఠ శు. ౮ నాడు మృగశిర్షకార్తె ప్రవేశము. పగటియందు ఆర్ద్రకార్తె ప్రవేశించినను తద్దోషము భంగమగును. రాజు లన్యోన్యవైరము గలిగియుందురు.

స్వస్తి: సర్వేజనా స్సుఖినో భవంతు.

### శ్రీగురుభ్యోనమః.

వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే,
యన్నత్వాకృతకృత్యా స్స్యు స్తన్నమామి గజాననమ్.
అవాచ్యాత్మ స్వరూపాయ శివభావ ప్రదాయినే,
నమ స్సద్గురునాథాయ షట్స్థల బ్రహ్మరూపిణే.
గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్,
నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః.

### గురు స్తవము

శ్రీకుప్పాన్వయవారిరాశిశశినా కౌండిన్యగోత్రాంచితా
విద్యార్థిప్రజవత్సలా సుచరితా సాంగత్రయీపారగా;
రాజద్రాజసుపూజితా సవినయం శాస్త్రార్థభాజా గురూ
ప్రాజ్ఞా వేంకటకృష్ణనామసుమనో నాగేశ్వరాఖ్యౌ భజే.

### దైవజ్ఞవంశావళి

శ్రీమజ్జ్యోతిష్కుల వంశముక్తికమణి రాజ్యే హేళజాలాగ్రణీ
శ్శ్రద్ధాత్రేయ మహర్షి గోత్రమహితో మోహాదివిధ్వంస కృత్;
విశ్వఖ్యాతచరాశ్వలాయన మహర్షి ప్రోక్త సూత్రాంచిత
శ్రైవాచార పరాయణోహి కనకారాఖ్యస్సముజ్జృంభతే.
తస్య హ్యాత్మభవో భవాంఘ్రియుగళీసద్భక్తి సంభోద్భవో
దూరోత్సారిత ధూర్తమానసవచోదోషాగోల్లపుత్రాభిధః;
పల్లీలాలయుత మల్లికార్జున సమాఖ్యాఖ్యాతదిగ్వైభవో
దేశే మధ్యతనే చకాస్తి పరనమ్రాపాస్తపాపోద్భవః.
తస్యాహం తనయస్సమిద్ధ వినయ స్సర్వేశ్వరాంఘ్రిద్వయీ
సేవాసాదిత తత్కృపాధిగత సత్యాత్మ ప్రబోధోదయః;
శ్రీమజ్జ్యోతిష తంత్రవారిధివిగాహోదగ్రబుద్ధ్యాశయ
స్సాధుశ్రీ కనకాహ్వయో వ్యరచయన్ పంచాంగ మేత న్ముదా.

### సంవత్సరాదిదివసకృత్యము

అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నాన మాచరేత్;
వస్త్రైరాభరణై ర్దేహ మలంకృత్య తత శ్శుచిః.
విఘ్నేశం భారతీం ఖేటా న్దైవజ్ఞ మభిపూజ్యచ;
సంవత్సరఫలం సమ్య క్ఛ్రుత్వా విప్రాన్ సమర్చయేత్.

ఈ (ఆంధ్ర) దేశమున లోకవ్యవహారమునకు చాంద్రమానాబ్దము గ్రహించునది. శేషాచలమునకు దక్షిణదేశమున సౌరమానాబ్దము గ్రహించునది. వింధ్యమున కుత్తరదేశమున బార్హస్పత్య మానాబ్దము గ్రహించునది. అంతటను గురూదయవశమున భాద్రపదాబ్దమని గ్రహించునది. చాంద్రమానము ననుసరించి యీసంవత్సరమునకు ప్రభవసంవత్సరమని పేరు. సౌరమానము ననుసరించి యీసంవత్సరమునకు చైత్ర శు. ౧ మొదలు ౧౫ వరకు అక్షయనామసంవత్సరమనియు, అటుపైన సంవత్సరాంతము వరకు ప్రభవనామసంవత్సరమనియు పేరు. బార్హస్పత్యమానము ననుసరించి ప్రమాథినామ సంవత్సరమని పేరు.

ఈ ప్రభవనామ సంవత్సరము నాటికి

| | |
|---|---|
| సృష్ట్యాదిగత సౌరాబ్దములు | ౧౯౫,౫౮,౮౫,౦౨౮ |
| కల్యాది గతాబ్దములు | ౫౦౨౮ |
| శాలివాహనశక గతాబ్దములు | ౧౮౪౯ |
| ప్రభవాది గతాబ్దములు | — |
| హూణశక గతాబ్దములు | ౧౯౨౭-౧౯౨౮ |
| ఫసలీ | ౧౩౩౬-౧౩౩౭ |
| హిజిరి | ౧౩౩౬ |

అగుచున్నవి.

సకలకల్యాణభాజనమైన ఈ ప్రభవనామ సంవత్సరము నాటికి సౌరసిద్ధాంతము ననుసరించి ఆదిసృష్టికర్తయగు బ్రహ్మయొక్క పరమాయుష్యమున సగమునకుపైన మొదటివత్సరమున, మొదటి మాసమున, మొదటిపక్షమున, మొదటిదినమున, పగలు, ౧౩ గడియలు, ౪౨ విగడియలు గడచినవి.

### సంవత్సరముల ఫలములు

#### చాంద్రమానాబ్ద ఫలము

శ్లో. క్వచి ద్వృష్టిః క్వచి ద్ధాన్యం క్వచి ద్భీతిః క్వచిత్సుఖమ్;
తథాపి మోదతే లోకః ప్రభవాబ్దే వివత్సరః.

#### సౌరమానాబ్ద ఫలము

శ్లో. కార్పాస గుడతైలేక్షు మధుసస్య వినాశనమ్;
క్షీయమాణాశ్చాపి నరా జీవంతి క్షయవత్సరే.

[ఈఫలముసంవత్సరారంభమునుండి చైత్ర శు. ౧౫ వరకు. తరువాత సంవత్సరాంతమువరకు పైనిచెప్పిన చాంద్రమానప్రభవసంవత్సర ఫలమే కలుగును].

#### బార్హస్పత్యమానాబ్దఫలము

శ్లో. వలాహకానముంచంతి కుత్రచిత్ప్రచురం జలమ్;
ప్రమాథ్యబ్దే వీతరోగా స్తథాపి సుఖినో జనాః.

#### గురూదయాబ్దఫలము

శ్లో. అబ్దే భాద్రపదే లోకే క్షేమాక్షేమా క్వచిత్క్వచిత్,
ధనధాన్య సమృద్ధిశ్చ సుభిక్ష మతివృష్టయః.

#### ఈ ప్రభవసంవత్సరమునకు రాజు మొదలుగునపరిపాలకవర్గము,తత్ఫలము

##### రాజు-సూర్యుఁడు

శ్లో. అన్యోన్యవైరం క్షితిపాలకానాం నాత్యంబు ముంచంతి బలాహ[కాశ్చ,
భూపాద్భయం శస్త్రభయంనరాణాంచోరాగ్ని బాధాబ్దపతౌ పతంగే.
గ్రంథాంతరమున—శ్లో. అబ్దాధిపే దినపతౌ ఖలు మధ్యసృష్టి
ర్మందప్రభార్త గణశీతకరం నభశ్చ,
హంతుం సపత్నవిమతా న్నిఖిలా క్షితీశా
నిత్యం చరంతి భువి భూరిబలాహకాశ్చ.

[ఈఫలము విదర్భ పాంచాలసౌరాష్ట్ర దేశముల కధికముగా కలుగును].

### మంత్రి-బుధుడు

శ్లో. వాయునా పీడితా మేఘా స్సర్వే పాపరతా నరాః;
సోమపుత్రస్య మంత్రిత్వే జాయతే మధ్యమం ఫలమ్.
[ఈఫలము పౌండ్రకళింగదేశములయందధికముగా కలుగును]

### సేనాధిపతి-బుధుడు

శ్లో. వాతాహతా వా రిపవా కదాచిత్
వర్షన్తి సస్యాని ఫలాన్వితాని ;
లోకాస్సదా పీడితకామచారాః
సైన్యాధిపత్యే ఖలు చంద్రజస్య.
[ఈఫలము అన్ని దేశములకును ప్రాప్తించును]

### సస్యాధిపతి - శని

శ్లో. తిలమాషకులుత్థాని కృష్ణధాన్యాని యానిచ;
కృష్ణభూమిస్తు ఫలితా మందే సస్యాధిపే సతి.
[ఈఫలము యవనఘూర్జర దేశములకు చెందినది]

### ధాన్యాధిపతి - శుక్రుడు

శ్లో. అతివృష్టి స్సుభిక్షంచ ఫలితా ధాన్యజాతయః;
మానవా నీరుజా స్సర్వే శుక్రే ధాన్యాధిపే సతి.
[ఈఫలము ఎల్లదేశములకును గలుగును.]

### అర్ఘాధిపతి - బుధుడు

శ్లో. అర్ఘాధినాథే రజనీకరాత్మజే
ప్రవృద్ధయః సస్యాని బహూనిచ స్యుః;
కుమార పాషండజనైంద్రజాలికా
ప్రభూతయ స్సుఖ్యర్ణతథా పరే జనాః.
[ఈ ఫలము అన్ని దేశములకును గలుగును]

### మేఘాధిపతి - బుధుడు

శ్లో. గర్జితాశనిపాషాణవాతాన్వితపయోధరాః;
మధ్యదేశే మహావర్షం బుధే మేఘాధిపే సతి.
[ఈఫల మాంధ్రదేశమునకు జెందినది.]

### రసాధిపతి - చంద్రుడు

శ్లో. తిలతైల గుడక్షౌద్రపయాంసి ఘృతశర్కరాః;
అర్ఘవృద్ధ్యై ప్రజాయంతే చంద్రే యదిరసాధిపే.
[ఈఫలము కొంకణ మగధదేశములకు జెందినది.]

### నీరసాధిపతి - శని

శ్లో. శృంగాశ్మపలలం దారులోహపాత్రాణి యానిచ;
అనర్ఘం యాతి సర్వత్ర శనౌ నీరసనాయకే.
[ఈఫలము మాళవదేశమునకు కలుగును]

### పశునాయకుడు-యముడు

శ్లో. అనర్ఘ మల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథాగవామ్;
పశుపీడా భవే న్నిత్యం యమేతు పశునాయకే.

### స్థానసంరక్షకుడు - బలభద్రుడు

శ్లో. బలభద్రే ప్రవర్తనమ్.

### పురోహితుడు-శని

శ్లో. మధ్యసస్యార్ఘ వృష్టిస్స్యాత్ బుద్ధిహీనాః పురోహితాః;
నరాణాం సుఖమత్యంతం సూర్యపుత్రే పురోహితే.

### గణకుడు-సూర్యుడు

శ్లో. సర్వే యుద్ధరతా భూపా అనర్ఘం వ్యాధిసంకులమ్;
అన్యోన్యవైరిణ స్సర్వే గణకే భాస్కరే సతి.

### పరీక్షకుడు-శని

శ్లో. పరీక్షకే సూర్యసుతే బుద్ధిహీనాః పరీక్షకాః;
అనర్ఘ మల్పవృష్టిశ్చ కృష్ణద్రవ్యం సమృద్ధిదమ్.

### గ్రామపాలకుడు-బుధుడు

శ్లో. గ్రామాణాం పాలకే సౌమ్యే సుఖినో గ్రామవల్లభాః;
గ్రామాణాం సుఖ మత్యంతం రాజానో నయశాలినః.

### దైవజ్ఞుడు-కుజుడు

శ్లో. హోమాగ్నిశస్త్రబాధాశ్చ రాజానో యుద్ధకాంక్షిణః;
దైవజ్ఞే భూమితనయే దైవజ్ఞా మందబుద్ధయః.
[ఈపైఫలములు ఎల్లదేశములయందును గలుగును.]

### మేఘము- వర్షము

ఈప్రభవసంవత్సరమున 'కాలమేఘము' అను పేరుగల మేఘము మేరువునకు దక్షిణదిక్కున పుట్టుచున్నది.

శ్లో. నిరంతరం మహావర్షం మధ్యదేశే మహాజలమ్;
ఫలంతి సర్వధాన్యాని కాలమేఘస్య లక్షణమ్.

వర్షము- రెండుతూములు—ఫలము: మధ్యము.

ఇందు పదిపాళ్లు సముద్రమునను, ఆరుపాళ్లు పర్వతములయందును, నాల్గుపాళ్లు భూమిపైనను వర్షించును. ఇట్లు ఇంద్రుడు నియమించినాడు.

### తూముయొక్క పరిమాణము

శ్లో. షష్టియోజన విస్తీర్ణం శతయోజనమున్నతమ్;
ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే.

### వర్షధాన్యాదుల వృద్ధిక్షయములు

వర్షము ౯; ధాన్యము ౧౪; శీతము ౧౪; తృణము ౯; ఉష్ణము ౧౨; వాయువు ౪; ప్రజావృద్ధి ౧౧, ప్రజాక్షయము ౯; రాజవిస్వరము ౧౧; ఉగ్రము ౧౧; పుణ్యము ౧౧, పాపము ౧౧; వ్యాధి

లు ౧౩, ఆరోగ్యము ౧౧; ఆచారము ౧౮, అనాచారము ౧౯; జననము ౨౧, మరణము ౮; దేశోపద్రవము ౧౯, దేశస్వాస్థ్యము ౮; చోరభయము ౮, చోరనాశము ౧౯; అగ్నిభయము ౯, అగ్ని శాంతి ౯; మృగవృద్ధి ౧౬, మృగక్షయము ౫; కీటవృద్ధి ౨౧, కీట నాశము ౯; మూషకోత్పత్తి ౫, మూషకనాశము ౧౯; సర్పవృద్ధి ౧౯, సర్పనాశము ౧౩; కామము ౧౯, లోభము ౨౧, మోహము ౯, మదము ౧౫, మాత్సర్యము ౯; సుఖము ౧౩, దుఃఖము ౧౫; భోగము ౧౫; విడంబము ౧౩; మనోవ్యథ ౯; ద్వేషము ౨౧; ప్రతిష్ఠ ౧౩, అప్రతిష్ఠ ౫; దుశ్శీలము ౧౩; మత్తత ౨౧; పురుషవృద్ధి ౯, స్త్రీవృద్ధి ౧౫; ధాతువాదము ౨౧; శౌర్యము ౧౧; దుష్టనిగ్రహము ౧౫, శిష్టపాలనము ౧౦; సత్యము ౫, అసత్యము ౮; విశ్వాసఘాతము ౯; దయ ౧౧, నిర్దయ ౧౩; న్యాయము ౧౫, అన్యాయము ౧౮; జ్ఞానము ౧౮, అజ్ఞానము ౩; కపటము ౫, నిష్కపటము ౯; ధర్మము ౧౮, అధర్మము ౧౮; జంబుకవృద్ధి ౮, నాశము ౮; పక్షికీటవృద్ధి ౧౮, నాశము ౮; శలభవృద్ధి ౧౬, నాశము ౧౩; మశకవృద్ధి ౧౬, నాశము ౭; మర్కటవృద్ధి ౧౬, నాశము ౧౩; వృశ్చికవృద్ధి ౧౬, నాశము ౧౩; సర్పవృద్ధి ౧౦, నాశము ౧౦; పశువృద్ధి ౧౦, నాశము ౧౦; అశ్వవృద్ధి ౧౨, నాశము ౧౨; గజవృద్ధి ౨౧, నాశము ౪; శుకవృద్ధి ౧౬, నాశము ౪; క్షుత్తు ౯, తృష్ణ ౮; నిద్ర ౧౧, ఆలస్యము ౯, ఉద్యోగము ౧౩; శాంతము ౫, క్రోధము ౩; దంభము ౧౩; మిత్రభేదము ౫; రసనివృత్తి ౧౧; ఫలనివృత్తి ౧ ; ఉత్సాహము ౩, విద్యుత్తు ౩; శిలాపాతము ౩, గర్జనము ౩; పత్రివృద్ధి ౩; నాశము ౪; ధేనువృద్ధి ౪, నాశము ౩; మహిషవృద్ధి ౩, నాశము ౫; మృగవృద్ధి ౫, నాశము ౪; ఛాగవృద్ధి ౫, నాశము ౪; బ్రమవృద్ధి ౩, నాశము ౨; ఉష్ట్రవృద్ధి ౫, నాశము ౨; విప్రవృద్ధి ౨, నాశము ౨; క్షత్రియవృద్ధి ౨, నాశము ౬; వైశ్యవృద్ధి ౫, నాశము ౩; శూద్రవృద్ధి ౪, నాశము ౪; మ్లేచ్ఛవృద్ధి ౩, నాశము ౬; సంకరవృద్ధి ౩, నాశము ౬; వజ్రవృద్ధి ౩, వైడూర్యవృద్ధి ౪, మరకతవృద్ధి ౨, మాణిక్యవృద్ధి ౫, గోమేధికవృద్ధి ౫, పుష్యరాగవృద్ధి ౫, నీలవృద్ధి ౫, మౌక్తికవృద్ధి ౫, ప్రవాళవృద్ధి ౫; సువర్ణవృద్ధి ౬, రజతవృద్ధి ౬, తామ్రవృద్ధి ౪, కాంస్యవృద్ధి ౨, లోహవృద్ధి ౭, అయోవృద్ధి ౨, త్రపువృద్ధి ౧౦, సీసవృద్ధి ౧౮, రసవృద్ధి ౬; అతివృష్టి ౫, అనావృష్టి ౯; స్వచక్రభయము ౫, పరచక్రభయము ౧౧; అండజములు ౧౧, స్వేదజములు ౧౧, ఉద్భిజ్జములు ౯, జరాయుజములు ౮; స్థావరములు ౧౯, జంగమములు ౧౯, ఇతరజీవరాసులు ౮.

### ఆర్ద్రానక్షత్రప్రవేశకాలము-ఫలము

ఈసంవత్సరము జ్యేష్ఠ బ. ౭ బుధవారమునాడు, పూర్వాభాద్రానక్షత్రమున, ఆయుష్మాన్ నామయోగమున, బాలవకరణమున సూర్యోదయానంతరము గ. ౧, విగ. ౪ లకు సూర్యుడు ఆర్ద్రానక్షత్రమున ప్రవేశించును.

తిథిఫలము: "అష్టమ్యామల్పవృష్టిస్స్యాత్"

వారఫలము: "సౌమ్యవారే శుభప్రదః"

నక్షత్రఫలము: "పూర్వాభాద్రాసువృష్టిస్స్యాత్"

యోగఫలము: "ఆయుష్మాన్సౌఖ్యకృత్ప్రకీత్"

కరణఫలము: "బాలవేతు సుభిక్షంస్యాత్"

కాలఫలము: "దివార్ద్రా సస్యనాశాయ" గ్రంథాంతరే: "పూర్వాహ్ణకాలే జగతోవిపత్తిః"

### భరణ్యాదిమణ్డలఫలము

భరణ్యాది మణ్డలములో ఆరవమండలమున చంద్రుండుండుటవలన క్షేమముగలుగును.

### దివార్ద్రాదోషభంగము

శ్లో. "ఆర్ద్రాప్రవేశేయది భాస్కరస్య చంద్రేకోణేయది కేంద్రగేవా;
జలాలయస్థే భృగుజీక్షితేవా సంపూర్ణమేఘా స్సుదుఘాభికంతి.

### మేషసంక్రాంతికాలము-ఫలము

ఈసంవత్సరము చైత్రశు. ౧౨ బుధవారము పూర్వఫల్గునీ నక్షత్రమున సూర్యోదయానంతరము గ. ౬, విగ. ౪౯ లకు సూర్యుడు మేషరాశియందు ప్రవేశించును.

కాలఫలము:

"రాత్రౌ సస్యాభివృద్ధిస్స్యాత్ క్షేమారోగ్యంసుభిక్షకృత్.

వారఫలము: "సౌభాగ్యం సౌమ్యవాసరే."

### జ్యేష్ఠశుద్ధప్రతిపద్యుక్తభౌమవారఫలము

శ్లో. "దుర్భిక్షయుద్ధామయ భీతికృచ్చ
లోకా స్సదాపోశ్య నృపాశ్చ క్రుద్ధాః
దగ్ధం పురగ్రామవనం నగాశ్చ
జ్యేష్ఠాదిభౌమానుదితే మునీంద్రైః."

### ఆషాఢశుద్ధపంచమీయుక్తసోమవారఫలము

శ్లో. "సోమవారే జలప్రదః."

### ఆషాఢశుద్ధనవమీయుక్తస్వాతీనక్షత్రఫలము

శ్లో. "ఆషాఢేతు సితే పక్షే నవమీ స్వాతి సంయుతా,
వాయు స్సర్వత్రసంవాతి భూమౌ బీజం నవాపయేత్"

### ఆషాఢకృష్ణైకాదశీయుక్తరోహిణీనక్షత్రఫలము

శ్లో. "ఏకాదశ్యాంతు మధ్యమమ్."

ఈనాలుగు ఫలములును చాంద్రమానమునకు ఎక్కువగా వర్తించునవి.

### గ్రహములచారములు

#### కుజచారము

ఈసంవత్సరమున కుజునకు వక్రగతిలేదు. కుజుడు మృగశిరానక్షత్రమునూడవపాదము మొదలు ధనిష్ఠానక్షత్రము మొదటి పాదము వఱకు ఋజుమార్గమున సంచరించును.

ఫలము: శ్లో. "స్వాతిచిత్రేంద్రరౌద్రాహి ప్రాజాపత్యోత్తరాసుచ;
సంచరన్ జలదాన్ హంతి భౌమ స్సంవర్తకానపి."

ఆషాఢ శు. ౧౩ మంగళవారము మొదలు శ్రావణ బ. ౧౧ మంగళవారమువఱకు సింహరాశియందు కుజుడుండును. దీనికి ఫలము:

"సింహంగతే క్షితిసుతే యది సింహభాగే
శోషం నయేత్ప్రళయకాలమివాంబురాశిమ్;
భీమేంద్రనీలసదృశం ఘనమేఘబృందం
ఖద్యోతకైః కృపణదానమివాంబురాశిమ్.
యామ్యపార్శ్వవిశాఖాసు త్రిపూర్వాసుద భూమిజః;
కరోతి మహతీం వృష్టిం వారిపూర్ణా వసుంధరా.
చిత్రావిశాఖాతుహివాంశుభేషు
విశ్వంభరానూస్తనయః ప్రయాతః;
ధరాం సమస్తా ముదకప్రపూర్ణా
ముదగ్రకైః స్థూలతనుం కరోతి.
మఘార్ద్రాశ్రి ఉత్తరా సార్ప స్వాతీ జ్యేష్ఠాసు రోహిణీ;
స్థిత స్త్వేతాసు భౌమ శ్చే త్తావదేవ నవర్షణమ్."

బుధచారము

బుధుడు చైత్ర బ. ౧౩ తూర్పున అస్తమించును.
జ్యేష్ఠ శు. ౨ పడమర ఉదయించును.
ఆషాఢ శు. ౬ పడమర అస్తమించును.
ఆషాఢ బ. ౮ తూర్పున ఉదయించును.
శ్రావణ బ. ౧౧ తూర్పున అస్తమించును.
భాద్రపదబ. ౩౦ పడమర ఉదయించును.
కార్తిక శు. ౩ పడమర అస్తమించును.
కార్తిక బ. ౫ తూర్పున ఉదయించును.
మార్గశిర బ. ౯ తూర్పున అస్తమించును.
పుష్య బ. ౧౦ పడమర ఉదయించును.
మాఘ బ. ౧౩ పడమర అస్తమించును.
ఫాల్గుణ శు. ౧౫ తూర్పున ఉదయించును.

ఫలము: శ్లో. పౌషాషాఢశ్రావణవైశాఖే ష్విందుజ స్సమాఘేషు;
దృష్ట స్సభయాయ జగతాం శుభఫలకృ త్త్వస్తగ స్తేషు.
ఇషోర్జమాసయో ర్వక్రీ శస్త్రదుర్భిక్షకారకః;
ఉదిత శ్శశిజో న్యాణా మితరేషు శుభప్రదః.

గురుచారము

గురువు "ఈసంవత్సరారంభమునుండి చైత్ర బ-౧౮ వరకు కుంభరాశియందుండును. అది మొదలు సంవత్సరాంతము వఱకు మీనరాశియందుండును.

ఫలము: శ్లో. స్ఫురత్పృథ్విజనా ధాత్రీ ఫలపుష్పార్ఘవృష్టిభిః;
సంపూర్ణా కుంభగే జీవే వీతరోగయుతా ధరా.
ధాన్యార్ఘవృష్టిసంపూర్ణాః క్వచి ద్రోగాః క్వచిద్భయమ్.
న్యాయమార్గరతా భూపా స్సర్వే మీనస్థితే గురౌ.

శుక్రచారము

శుక్రుడు భాద్రపద శు. ౯ పడమర అస్తమించును
భాద్రపద బ. ౮ తూర్పున ఉదయించును.

దీనికిఫలము: "శ్లో. ఉదయాస్తమయే యాతి శుక్లపక్షే యదా భృగుః;
గజాశ్వరాజపుత్రాణాం శోణితం పిబతే మహీ.
ఉదయాస్తమయే యాతి కృష్ణపక్షే యదా సితః;
గజాశ్వరాజ పుత్రాణాం వృద్ధిం స కురుతే న్వహమ్.

శుక్రుడు పూర్వఫల్గునీ నక్షత్రమున నుదయాస్తమయములను జెందుటకు ఫలము:

"భార్గవ స్యోదయశ్చాస్తం యదా పైత్ర్యకపంచకే;
నృపాణాంచ నరాణాంచ మరణం భవతి ధ్రువమ్."

శనిచారము

శని ఈసంవత్సరప్రారంభమునుండి అంతమువరకు వృశ్చికరాశియందుండును. అందు సంవత్సరారంభమునుండి మార్గశిర శు. ౫ వరకు వక్రఋజుమార్గముల అనూరాధానక్షత్రమున సంచరించుచుండును. తరువాత సంవత్సరాంతమువరకు జ్యేష్ఠానక్షత్రమున నుండును.

ఇందుకుఫలము: "మైత్రాఖ్య సంక్రమణస పౌష్ణభేషు, చరన్ సదా సూర్యసుతః కరోతి; ఈతేర్భయం వ్యాధిభయం నరాణాం, కళింగ బాహ్లీకజనాభివృద్ధిః. అళిస్థితే రోగభయం ప్రజానాం, భవే త్ప్రసూనాం మృతి రర్కపుత్రే; వీణీకులానాంచ గణస్య నాశో, మహీపతీనా ముపజీవనంస్యాత్."

గురుశుక్రమౌఢ్యనిర్ణయము

ఈసంవత్సరమున గురుమౌఢ్యము లేదు.

ఈసంవత్సరమున భాద్రపద శు. ౯ మొదలు బ. ౮ వరకు పడమర శుక్రుడు అస్తమించును గనుక శుక్రమౌఢ్యముగలదు.

మకరసంక్రాంతికాలము-ఫలము

ఈసంవత్సరము పుష్య బ. ౭ శనివారము, చిత్తానక్షత్రము, సుకర్మనామయోగము, బవకరణమున సూర్యోదయానంతరము గడి. ౧౮, విగ. ౧౧ లకు భోగసమయమున సూర్యుడు మకరరాశియందు ప్రవేశించును.

శ్లో. "త్రిశీర్షం ద్విముఖంచైవ పంచవక్త్రం త్రినేత్రకమ్,
లంబకర్ణం రక్తదంతం లంబభ్రూ దీర్ఘనాసికమ్;
అష్టబాహుం ద్విపాదంచ వికృతం కృష్ణవర్ణకమ్,
శతయోజన మౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశస్మృతమ్;
ఏవంరూపం సువిజ్ఞేయం సంక్రాంతేః పురుషస్యతు."



అస్య పురుషస్య రాక్షస నామధేయః- చండాలా నామరిష్టమ్; నిర్మలోదక స్నానమ్- శుభంభవతి; శ్వేత వస్త్రమ్- ఆరోగ్యమ్; పున్నాగ పుష్ప ధారణమ్-యశోహానిః; మాణిక్యాభరణమ్- మణినాశనమ్; సువర్ణపాత్రే భక్షణమ్ - సువర్ణహానిః; అన్నాహారమ్- రోగభయమ్; నారికేళ ఫలభక్షణమ్ - ప్రజాపీడ; సింహవాహనమ్- మృగనాశనమ్; ముసలాయుధధారణమ్- యుద్ధభయమ్; శ్వేతచ్ఛత్రమ్- ఆరోగ్యమ్; వీణాధారణమ్- వీణాచానామరిష్టమ్; పూర్వదిగ్యానమ్- తద్దేశానామరిష్టమ్; కించిత్ స్మితచేష్టా- ప్రజాపీడా; నివిష్టావస్థా- సస్యవృద్ధిః; కస్తూరీగంధలేపనమ్-పణ్యస్త్రీణా మరిష్టమ్;

పక్షఫలమ్:

శ్లో. కృష్ణపక్షే యదా పుష్యే మకరస్థే దివాకరే;
సువృష్టిః క్షేమ మారోగ్యం సుభిక్షం సర్వ సంపదః.

తిథిఫలమ్-రోగనాశనమ్; వారఫలమ్-యుద్ధమ్; నక్షత్రఫలమ్- శుభంభవతి; లగ్న ఫలమ్- అర్ఘవృద్ధిః; కాలఫలమ్-విప్రాణామరిష్టమ్; ముహూర్తఫలమ్-ఈతిబాధా.

ప్రజలు సంక్రాంతి పురుషోత్పత్తికాలమున స్నానదానాదులు చేయవలెను.

ఈప్రకారము చర్చించి ఈప్రభవసంవత్సరమున త్రిణాము మొదలు ఎల్లసస్యములు ౧౦పాళ్లకన్న ఇక్షు-విఫలించునని నిశ్చయింపబడినది.

పుష్కరనిర్ణయము

ఈసంవత్సరము చైత్ర బ. ౧౪ శనివారమునాడు సూర్యోదయానంతరము గ. ౨, విగ. ౪౫ లగు భోగకాలమున ప్రణీతానదీ పుష్కరప్రవేశము.

గ్రహణము

అపమర్దనమను ఖచ్ఛన్న చంద్రగ్రహణము

ఈ సంవత్సరము మార్గశిర శు. ౧౫ గురువారము రోహిణీ నక్షత్రమున వృషభరాశియందు రాహు గ్రస్త చంద్రగ్రహణము; పింగళవర్ణము; ఆగ్నేయదిశను స్పర్శము; నైరృతిదిశను మోక్షము. ఈశాన్యమున నిమీలనము; వాయవ్యదిశను ఉన్మీలనము; సర్వగ్రహణము; మాహేంద్ర మండలము. పేరు అపమర్దనము.



| సూర్యాస్తమయము మొదలు | గడి. వి. | గం. ని. | |
|---|---|---|---|
| స్పర్శకాలము | ౯-౨౨ | ౯-౧౭ | రాత్రి. |
| నిమీలనకాలము | ౧౨-౧౫ | ౧౧-౧౫ | |
| మధ్యకాలము | ౧౩-౪౭ | ౧౧-౪ | |
| ఉన్మీలనకాలము | ౧౫-౩౧ | ౧౧-౪౫ | |
| మోక్షకాలము | ౧౭-౦ | ౧౨-౪౮ | |
| బింబదర్శనకాలము | ౩-౧౬ | ౧-౧౭ | |
| ఆద్యంతపుణ్యకాలము | ౮-౩౮ | ౩-౨౭ | |

అయనఫలము: "విట్చూద్రాన్ దక్షిణాయనే, హన్తి."

మాసఫలము: "కాశ్మీరకాన్ కోసలకాన్ సపుండ్రాన్
మృగాంశ్చ హన్యా దపరాంతకాంశ్చ;
యే సోమపా స్తాంశ్చ నిహంతి సౌమ్యే
సువృష్టికృత్ క్షేమ సుభిక్షకృచ్చ.

(అపమర్దన) నామఫలము:

అపమర్దనమితి నిశ్శేష మేవ సంచాద్యయది చిరంతిష్ఠేత్;
హన్యా త్ప్రధానభూపాన్ ప్రధానదేశాంశ్చ తిమిరమయః.

లగ్న ఫలము:

గోపాః పశవో ఒథగోమినో మనుజా యేచ మహత్వ మాగతాః;
పీడా ముపయాతి భాస్కరే గ్రస్తే శీతకరేఒథవా వృషే.

వర్ణ ఫలము:

పాంసుబిలోహితరూపః క్షుత్త్రిగ్వంపాయభవతి వృష్టేశ్చ.

మండలఫలము:

"మాహేంద్రమండలే గ్రస్తే గ్రహాణాంచంద్రసూర్యయోః
రాష్ట్రింసుభిక్షసత్యర్ఘం ప్రజానాంస సుఖంభవేత్."

పర్వఫలము: (చంద్రపర్వము)—

"చంద్రపర్వణ్యనావృష్టి ర్జనానాశో భవే ద్ధ్రువమ్."

వృషభ మిథున సింహ కన్యా తులా వృశ్చిక రాసులయందును, కృత్తికారోహిణీ మృగశిర పూర్వాభాద్రా నక్షత్రములయందును జననమొందినవారలు శాంతిచేసుకొనవలెను.

ప్రకారాంతరమున వృషభ మిథున వృశ్చిక ధనుర్మకర కుంభ రాసులయందు జననమొందినవారును శాంతిచేసుకొనవలెను.

"శ్లో. జన్మసప్తాష్టరిఫ్ఫాంక దశమస్థే నిశాకరే,
దుష్టారిష్టప్రదో రాహు ర్జన్మర్క్షే నిధనేఒపిచ;
యన్నక్షత్రగతో రాహు ర్గ్రసతే శశిభాస్కరౌ,
తజ్జాతానాం భవేత్పీడా యే నరా శ్శాంతివర్జితాః;
సూర్యస్య సంక్రమోవాపి గ్రహణం చంద్రసూర్యయోః
యస్య త్రిజన్మనక్షత్రే తస్య రోగోఒథవా మృతిః.

[త్రిజన్మనక్షత్రము: జన్మనక్షత్రము, దానికి పూర్వోత్తర నక్షత్రములు రెండునుకలిసిన త్రిజన్మనక్షత్ర మనబడును. కొందరు జన్మ

నక్షత్రము, జన్మనక్షత్రమునుండి పదవ నక్షత్రము, పందొమ్మిదవ నక్షత్రముకలిపి [త్రిజన్మనక్షత్ర మందురు]

"త్రిషడ్దశాయోపగతం నరాణాం
శుభప్రదంస్యా ద్గ్రహణం రవీంద్వోః;
ద్విస ప్తపంచేషుచ మధ్యమం స్యాత్
శేషే ష్వనిష్టం కథితం మునీంద్రైః.

[జన్మరాశియనగా జన్మకాలమున చంద్రుడున్న రాశిగాని జన్మలగ్నముకాదని ప్రాజ్ఞులు చెప్పుదురు.]

[శ్రాద్ధభోజనాదులు యథాకీతిగ జరుపవచ్చును.]

కందాయములు

| అశ్వి | భ | కృ | రో | మృ | ఆర్ద్రి | పున | పుష్య | ఆశ్రే | మఖ |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ |
| ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ |
| ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ |

| పూఫ | ఉఫ | హ | చి | స్వా | విశా | అనూ | జ్యే | మూ | పూషా |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ | ౧ |
| ౦ | ౧ | ౨ | ౪ | ౧ | ౨ | ౧ | ౧ | ౨ | ౦ |
| ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ | ౦ | ౩ | ౧ |

| ఉషా | శ్రో | ధ | శత | పూభా | ఉభా | రే |
|---|---|---|---|---|---|---|
| ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ | ౬ |
| ౧ | ౨ | ౪ | ౧ | ౨ | ౪ | ౧ |
| ౪ | ౨ | ౦ | ౩ | ౧ | ౪ | ౨ |

కందాయఫలములు

శ్లో. ఆదిశూన్యే మహావ్యాధి ర్మధ్యశూన్యే మనోవ్యథా;
అంత్యశూన్యే ఫలం స్వల్పం త్రిశూన్యే నిష్ఫలం భవేత్
విషమే త్వర్థలాభంస్యా త్సమేతు సమతా భవేత్;
శూన్యే శూన్యత్వ మాప్నోతి కందాయఫల వివాదృశమ్.

ఆదాయ వ్యయములు

| | ఆ. | వ్య. | | ఆ. | వ్య. |
|---|---|---|---|---|---|
| మేషవృశ్చికములకు | ౨ | ౧౪ | సింహమునకు | ౧౧ | ౧౧ |
| వృషభతులలకు | ౧౧ | ౫ | ధనుర్మీనములకు | ౫ | ౫ |
| మిథునకన్యలకు | ౧౪ | ౨ | మకరకుంభములకు | ౮ | ౧౪ |
| కటకమునకు | ౮ | ౨ | సర్వరాసులకు | ౫– | ౫౩ |

రాజపూజ, రాజావమానము

| | పూ. | అ. | | పూ. | అ. |
|---|---|---|---|---|---|
| మేషవృశ్చికములకు | ౫ | ౨ | సింహమునకు | ౬ | ౬ |
| వృషభతులలకు | ౨ | ౬ | ధనుర్మీనములకు | ౩ | ౩ |
| మిథునకన్యలకు | ౪ | ౭ | మకరకుంభములకు | ౪ | ౪ |
| కటకమునకు | ౫ | ౪ | | | |

అశ్విన్యాదినక్షత్రములకు సంవత్సరఫలము

అశ్విని, పుష్యమి, స్వాతి, అభిజిత్తు, ఈనక్షత్రములకు భూమిలాభ ప్రాప్తి.
భరణి, ఆశ్లేష, విశాఖ, శ్రవణము ,, రోగము
కృత్తిక, మఖ, అనూరాధ, ధనిష్ఠ ,, ఆయుర్వృద్ధి
రోహిణి, పూర్వఫల్గుని, జ్యేష్ఠ, శతభిషము,, అర్థలాభము
మృగశీర్ష,ఉత్తరఫల్గుని,మూల,పూర్వాభాద్ర ,, మనస్తాపము
ఆర్ద్రి, హస్త, పూర్వాషాఢ, ఉత్తరాభాద్ర,, రాజపూజ
పునర్వసు, చిత్త, ఉత్తరాషాఢ, రేవతి యుద్ధభయము

వెలల హెచ్చుతగ్గులు

చాంద్రమాసము ననుసరించి:

ఆషాఢ కార్తిక మాసములయందు వెలలు హెచ్చుగ నుండును
జ్యేష్ఠ పుష్యమాసములయందు వెలలు తక్కువగనుండును
తక్కినమాసములయందు వెలలు రాశిగ నుండును

సౌరమానము ననుసరించి:

మేష సింహ కన్యామాసములయందు వెలలుతక్కువగనుండును
కటక తులా కుంభమాసములయందు వెలలు రాశిగనుండును
మిగిలినమాసములయందు వెల లధికముగనుండును

చాంద్రమాన మాసచారములు

చైత్రమాసము:

బుధుడు, గురువుతప్ప తక్కినగ్రహములు దహనచండవాయు నాడులయందు సంచరించుటచేతను, బుధుడు గురువు స్వల్పకాలము జలనాడియందు సంచరించుటచేతను పశ్చిమవాయువు ప్రబలి అచ్చట చ్చట నల్పవృష్టి కురియును.

వైశాఖమాసము:

సూర్యుడు, శని, రాహుకేతువులు, బుధుడు చండవాయు దహననాడులయందు సంచరించుటచేతను, ఇతరగ్రహములు జలమేఘ నాడులయందు సంచరించుటచేతను పశ్చిమవాయువు ప్రబలి వర్షము స్వల్పముగ వర్షించును. క్రూరగ్రహములు క్రూరనాడులయందుండు టచే ఎండలు తీవ్రముగ నుండును.

జ్యేష్ఠమాసము:

జ్యేష్ఠ శు. ౮ మొదలు బ. ౮ వరకు సూర్యుడు మృగశిరయం దున్నకాలమున బుధ గురు శుక్ర కుజులు సౌమ్య జలామృతనాడుల యందు సంచరించుటచేతను, సూర్యుడు స్త్రీపున్నక్షత్రమున నర్ధజల రాశియందు ప్రవేశించుటచేతను మృగశిరకార్తెయందు వర్షించును. కాని, శని రాహు కేతువులు వాతదహననాడులయందు సంచరించుట చేత విశేషముగ పశ్చిమ వాయువువీచును.

జ్యేష్ఠ బ.౮ మొదలు ఆషాఢ శు.౭ వరకు సూర్యుడు ఆర్ద్రా నక్షత్రమున (స్త్రీపున్నక్షత్రమున) ప్రవేశించినను నిర్జలరాశియందుండుటచేతను శని రాహు కేతువులు, రవి గురువులు, కుజ శుక్రులు అతి వాతదహన జలామృతనాడులయందు సంచరించుటచేతను పశ్చిమవాయువు మిక్కిలిగను, వర్షము మితముగను ఉండును.

ఆషాఢమాసము:

(స్త్రీస్త్రీనక్షత్రమున) ఆషాఢశు.౭ మొదలు బ.౬వరకు సూర్యుడు పునర్వసునక్షత్రమునను, పూర్ణ జలరాశియందుండుటచేతను, రవి గురువులు, కుజశుక్రులు జలామృతనాడులయందు సంచరించుటచేతను, అంగారక చలనముచేతను సువృష్టిగలుగును. ఆషాఢ బ.౬ మొదలు శ్రావణ శు.౬ వరకు సూర్యుడు పుష్యమీనక్షత్రమున సంచరించు కాలమున స్త్రీపున్నక్షత్రమున నిర్జలరాశియందు ప్రవేశించుటచేతను, రవి, కుజ శుక్రులు జలామృతనాడులయందు సంచరించుచున్నను, సింహాంగారక దోషము సంభవించుటచేతను, బుధ రాహు కేతువులు దహన నీరస నాడులయందు సంచరించుటచేతను వర్షము మితముగ కురియును.

శ్రావణమాసము:

శ్రావణ శు. ౭ మొదలు బ. ౫వరకు సూర్యుడు ఆశ్రేషానక్షత్రమున సంచరించుకాలమున స్త్రీ స్త్రీనక్షత్రయుక్తుడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతను, శని వాతనాడియందును, రాహుకేతువులు దహననాడియందును, బుధశుక్రులు నీరసనాడియందును సంచరించుటచేతను, పురోంగారక, సింహాంగారక దోషములచేతను వర్షాభావముకలిగినను రవి, కుజ, గురువులు అమృతజలసౌమ్యనాడులయందు సంచరించుటవలన, జలచంద్రయోగకాలమున నచ్చటచ్చట స్వల్పముగ వర్షించును. శ్రావణ బ.౫ మొదలు భాద్రపద శు. ౩వరకు సూర్యుడు మఖానక్షత్రమున సంచరించుకాలమున స్త్రీపున్నక్షత్రయుక్తుడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతను, సింహాంగారక దోషముండుటచేతను గురు కుజ రవి బుధులు సౌమ్య జలామృతనాడులయందు సంచారముచేయుటచేతను, అంగారక చలనము గలుగుటచేతను, పురశ్శుక్రయోగము సంభవించుటచేతను సస్యముల కనుకూలముగ వర్షము కురియును.

భాద్రపదమాసము:

భాద్రపద శు.౪ మొదలు బ.౨వరకు సూర్యుడు పూర్వఫల్గునీ నక్షత్రమున సంచరించుకాలమున స్త్రీస్త్రీ నక్షత్రయుక్తుడైయున్నను పూర్ణ జలరాశియందు ప్రవేశించుటచేతను గురు రవి బుధ శుక్రులు సౌమ్య జలనాడులయందు సంచరించుటచేతను మితముగ వర్షించును. భాద్రపద బ. ౩ మొదలు ఆశ్వయుజ శు. ౨ వరకు సూర్యుడు ఉత్తరఫల్గునీ నక్షత్రమున సంచరించుకాలమున స్త్రీ పున్నక్షత్రయుక్తుడై అర్ధజలరాశియందు ప్రవేశించుటచేతను, రాహు కేతు రవి కుజులు వాతదహన నీరస నాడులయందు సంచరించుటచేతను, వృష్టిభంగకారకులైన గురు కుజ బుధులు సౌమ్యనాడియందును, శుక్రుడు జలనాడియందును ఉండుటచేతను, శుక్రోదయయోగముచేతను వృష్టిమితముగ నుండును.

ఆశ్వయుజమాసము:

ఆశ్వయుజ శు ౨ మొదలు శు. ౧౫ వరకుసూర్యుడు హస్తానక్షత్రమున సంచరించుకాలమున స్త్రీ స్త్రీనక్షత్రయుక్తుడై నిర్జలరాశియందుండుటచేతను, శని, బుధకుజ, రాహుకేతువులు వాతదహనాది దుష్టనాడులయందు సంచరించుటచేతను, వర్షప్రతిబంధకమయినను, ఇతరగ్రహములు సౌమ్యనాడులయందు సంచరించుటచేత జలచంద్రకాలమున నల్పముగ వర్షించును. ఆశ్వయుజ శు. ౧౫ మొదలు బ. ౧౪ వరకు సూర్యుడు, చిత్తానక్షత్రమున సంచరించుకాలము స్త్రీపున్నక్షత్రయుక్తుడై పూర్ణజలరాశియందు ప్రవేశించుటచేతను, గురు శుక్రులు సౌమ్యనాడియందుసంచరించుటచేతను, కుజచలనముచేతను, ఇతరగ్రహములు దుష్టనాడులయందు సంచరించినను సువృష్టికలుగును.

కార్తికమాసము:

ఆశ్వయుజ బ. ౩౦ మొదలు కార్తిక శు. ౧౨ వరకుసూర్యుడు, స్వాతీనక్షత్రమున సంచరించుకాలమున స్త్రీ స్త్రీ నక్షత్రయుక్తుడై నిర్జలరాశియందు ప్రవేశించుటచేతను, బుధశని, కుజ, రవి, రాహు కేతువులు వాతాది దుష్టనాడులయందు సంచరించినను ఇతరగ్రహములు శుభనాడులయందుసంచరించుటచేతను మితముగవర్షించును.

కార్తిక శు. ౧౨ మొదలు బ. ౧౧ వరకు సూర్యుడు, విశాఖానక్షత్రమున సంచరించుకాలమున పుం పున్నక్షత్రయుక్తుడై అర్ధజలరాశియందు ప్రవేశించుటచేతను, శని అస్తమించుటచేతను, రవి కుజ శని బుధులు దుష్టనాడీగతులైనను, ఇతర శుభగ్రహములు సునాడులయందు సంచరించుటచేతను గాలితో గూడిన ఖండవృష్టి గలుగును.

కార్తిక బ. ౧౨ మొదలు మార్గశిర శు. ౮ వరకు సూర్యుడు, అనూరాధానక్షత్రమందు సంచరించుకాలమున స్త్రీ పున్నక్షత్రయుక్తుడై పూర్ణజలరాశియందు ప్రవేశించుటచేతను, సూర్యుడు మొదలయినగ్రహములువాతాది వాతనాడులయందుసంచరించుటచేతను భిన్నభిన్న దేశముల సువృష్టిగలుగును.

పంచాంగశ్రవణఫలము

యచ్ఛృణోతి మధు శుక్లపక్షకే వర్షనాథ సచివాదికం ఫలమ్;
ప్రాప్నుయాద్దురితముక్తవిగ్రహః ఆయురర్థమతులం యశస్సుఖమ్.
కన్యావనీ కాంచన దిగ్గజానాం గవాం సహస్రం శతతంద్విజేభ్యః;
దత్వా ఫలం యల్లభతే మనుష్య స్తత్తత్ఫలా న్యబ్దఫలాని శ్రుత్వా.

రాజా మంత్రీ సస్యనాథో రసానా
మీశస్సార్థం స్వామినో నీరసానామ్;
అర్ఘాధీశః కించ మేఘాధినాథో
దద్యు శ్శ్రేయ శ్శృణ్వతాం తత్ఫలాని.

## రామానుజీయ శ్రీవైష్ణవ తిరునక్షత్రములు

| చిత్రి | అశ్వని | మేషమాసము | వడుగనంబి తిరునక్షత్రము |
|---|---|---|---|
| | కృత్తిక | ,, | ఉయ్యక్కొండార్ ,, |
| | ఆర్ద్ర | ,, | యెంబెరుమానార్ ,, |
| | పునర్వసు | ,, | ముదలియాండాన్ ,, |
| | ,, | ,, | చక్రోశ రితిరుమఖనార్ ,, |
| | చిత్త | ,, | మధురకవుల ,, |
| | హస్త | ,, | దేవప్పెరుమాళ్ ,, |
| వైయ్యాశి | స్వాతి | వృషభమాసము | అరగసింగర్ ,, |
| | ,, | ,, | పెరియతిరుమలనంబి ,, |
| | విశాఖ | ,, | నమ్మాళ్వార్ ,, |
| | అనూరాధ | ,, | పెరియభట్టర్ ,, |
| ఆని | స్వాతి | మిథునమాసము | పెరియాళ్వార్ ,, |
| | అనూరాధ | ,, | నాథమునుల ,, |
| ఆడి | పూర్వఫల్గుని | కటకమాసము | శ్రీ ఆండాళ్ ,, |
| | ,, | ,, | యదుగిరినాచ్చియార్ ,, |
| | ఉత్తరాషాఢ | ,, | ఆళవందారు ,, |
| | ,, | ,, | పుండరీకాక్ష ,, |
| ఆవణి | రోహిణి | సింహమాసము | శ్రీ కణ్ణన్ ,, |
| పెరటాశి | విశాఖ | కన్యామాసము | తిరుమలనంబి ,, |
| | శ్రవణము | ,, | వేదాంత దేశికుల ,, |
| | ,, | ,, | తిరువేంగడముడయాన్ ,, |
| అల్పిశి | కృత్తిక | తులామాసము | హరకులోత్తమదాసర్ ,, |
| | మూల | ,, | మనవాళమహామునుల ,, |
| | పూర్వాషాఢ | ,, | సేనమొదలియాళ్వార్ ,, |
| | శ్రవణం | ,, | పొయిగైయాళ్వార్ ,, |
| | ,, | ,, | పిళ్ళైలోకాచార్యర్ ,, |
| | ధనిష్ఠ | ,, | భూదత్తాళ్వార్ ,, |
| | శతభిషము | ,, | పేయాళ్వార్ ,, |
| కార్తికై | కృత్తిక | వృశ్చికమాసము | తిరుమంగైయాళ్వార్ ,, |
| | ,, | ,, | నంబిళ్లైగారి ,, |
| | రోహిణి | ,, | తిరుప్పాణియాళ్వార్ ,, |
| మార్గళి | జ్యేష్ఠ | ధనుర్మాసము | తొండరడిప్పొడియాళ్వార్ ,, |
| | ,, | ,, | పెరియనంబి ,, |
| తై | పునర్వసు | మకరమాసము | యంబార్ ,, |
| | మఖ | ,, | తిరుమడిశైయాళ్వార్ ,, |
| | హస్త | ,, | కూరత్తాళ్వార్ ,, |
| మాశి | మృగశిర | కుంభమాసము | తిరుకచ్చినంబి ,, |
| | పునర్వసు | ,, | కులశేఖరాళ్వార్ ,, |
| | రోహిణి | ,, | వంబెరుమాళ్ ,, |
| పంగుని | పుష్యమి | మీనమాసము | యతిరాజసంపత్కుమారర్ |
| | ఉత్తర | ,, | శ్రీరంగనాచ్చియార్ ,, |
| | రేవతి | మేషమాసము | పెరియ పెరుమాళ్ ,, |

## శ్రీమాధ్వపుణ్యదినములు

చైత్ర శు. ౨ వేదవ్యాసతీర్థుల పుణ్యదినము
శు. ౬ కవీంద్రతీర్థుల ,,
౧౩ సత్యవ్రతతీర్థుల ,,
బ ౩ వాగీశతీర్థుల ,,
బ. ౧౩ సత్యవిజయతీర్థుల ,,
వైశాఖ శు. ౩ విద్యాధిరాజతీర్థుల ,,
జ్యేష్ఠ శు. ౩ సత్యసంధతీర్థుల ,,
బ. ౨ సత్యపూర్ణతీర్థుల ,,
బ. ౩ రఘువర్యతీర్థుల ,,
ఆషాఢ శు. ౯ సత్యాధిరాజతీర్థుల ,,
బ. ౫ శ్రీజయతీర్థుల ,,
శ్రావణ శు. ౧ రాఘవేంద్రతీర్థుల ,,
శు. ౭ సత్యవరతీర్థుల ,,
భాద్రపదశు. ౧౦ సత్యేష్టకామతీర్థుల ,,
బ. ౩౦ మాధవతీర్థుల ,,
ఆశ్వయుజశు. ౭ సత్యపరాయణతీర్థుల ,,
కార్తిక శు. ౧౦ సత్యవరతీర్థుల ,,
శు. ౧౧ వేదనిధితీర్థుల ,,
బ ౭ విద్యానిధితీర్థుల ,,
బ. ౧౪ పద్మనాభతీర్థుల ,,
మార్గశిర శు. ౧౧ సత్యనిధితీర్థుల ,,
శు. ౧౨ రఘునాథతీర్థుల ,,
పుష్య శు. ౧౨ రఘూత్తమతీర్థుల ,,
బ. ౬ సత్యకామతీర్థుల ,,
బ. ౭ వరహరితీర్థుల ,,
బ. ౧౪ విద్యాధీశతీర్థుల ,,
బ. ౩౦ పురందరదాసతీర్థుల ,,
మాఘశు. ౯ (మధ్వనవమి) ఆనందతీర్థ ,,
ఫాల్గుణ శు. ౨ సత్యబోధతీర్థుల ,,
శు. కవ్యాసరాజస్వాముల ,,
శు. ఉపత్యవ్రతతీర్థుల ,,

### ప్రసూతిశాంతి నక్షత్రములు

| | |
|---|---|
| ఉత్తర (పా. ౧) | ఆశ్రేష (పా. ౪) |
| పుష్యమి (పా. ౨, ౩) | మఖ (పా. ౧) |
| పూర్వాషాఢ (పా. ౩) | రేవతి (పా. ౪) |
| చిత్త (పా. ౧, ౨) | అశ్వని (పా. ౧) |

జ్యేష్ఠ, మూల ఈ నక్షత్రములయందును, తండ్రి యొక్క జన్మనక్షత్రములయందును శిశువులు పుట్టినచో శాంతిచేయవలెను.



 

## శంకుస్థాపనాది ముహూర్తములకు శుభమైన తిథి వార నక్షత్రములను తెలియజేయు చక్రము

| ముహూర్తముల పేరు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | విశేషవిధులు |
|---|---|---|---|---|---|
| శంకుస్థాపనము | ౩-౫-౭-౧౧-౧౩ | బు-గు-శు | రో-మృ-హ-రే-అనూ-ఉఫ-పుష్య-శ్ర-పున-ధ-శ-అశ్వి-స్వా | వృ-కర్క-కుం-మీ | చతుర్థశుద్ధి |
| గృహప్రవేశము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-స్వాతి-అనూ-శ్ర-ధ-శత | వృష-సింహ-వృశ్చి-కుం-మీ-క-ధ-మి | అష్టమ,ద్వాదశశుద్ధి |
| నిషేకము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-రో-ఉఫ-హ-స్వా-అనూ-మూల-ఉషా-శ్ర-శత-ఉభా | వృ-మి-కర్కా-సిం-తు-ధను-కుం-మీన | లగ్నశుద్ధి |
| గర్భాధానము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | రో-ఉఫ-హ-స్వాతి-అనూ-ఉషా-శ్రవ-శత-ఉభా-ధని-మృగ | వృ-మి-క-సిం-తు-ధను-కుంభ | లగ్నశుద్ధి-సప్తమమందు పాపగ్రహములు లేకుండుట-పర్వవర్జ్యము |
| పుంసవనము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృగ-పున-పుష్య-ఉఫ-హ-చి-స్వా-అనూ-మూల-ఉషా-శ్రవ-ధ-శత-ఉభా-రే | మే-ధ-మి-మీ | నవమశుద్ధి-మూడవ మాసము |
| సీమంతము | ౨-౩-౫-౭-౧౦-౧౩-౧౫ | ఆ-మం-గు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-హ-చి-స్వా-అను-మూ-ఉషా-శ్ర-ధ-శ-ఉభా-రే | మే-ధ-మీ | ౪-౬-౮-మాసములు-నవమశుద్ధి |
| జాతకర్మ | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | రో-ఉభా-ఉషా-స్వా-పున-శ్ర-ధని-శత-అశ్వి-హస్త-పుష్య-అనూ | వృష-తు-మి-క-ధ-మీన-కటక | అష్టమశుద్ధి |
| నామకరణము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-ఉఫ-ఉషా-ఉభా-స్వా-పున-శ్ర-ధ-శ-హస్త-పుష్య-అనూ | వృ-తు-మి-కన్యా-ధను-మీన-కటక | అష్టమశుద్ధి |
| డోలారోహణము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-ఉఫ-ఉషా-ఉభా-పున-హ-చి-స్వాతి-వి-అనూ | వృ-మి-కర్కా-కన్య-తు-ధను-మీ | ౧-౩-౫ మాసములు శుభము-అష్టమశుద్ధి |
| అన్నప్రాశనము | ౨-౩-౫-౭-౧౦-౧౩ | సో-బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-ఉషా-ఉభా-హ-చి-స్వా-అనూ-శ్ర-ధ-శత-రే | వృ-మి-కర్కా-క-తు-ధను-మీ | పురుషులకు-౬-౮-౧౦ మాసములు, స్త్రీలకు ౫-౭-౯-మాసములు, శుభము. దశమశుద్ధి లగ్నమందు పాపగ్రహములు లేకుండుట |
| కర్ణవేధ | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-మృ-పుష్య-హ-చి-స్వాతి-అనూ-శ్ర-ధ-శ-రే-ఆర్ద్ర-ఉఫ-ఉషా-ఉభా | వృ-మి-కర్కా-క-తు-ధ-మీ | ౬-౮ మాసములయందు శుభము-అష్టమశుద్ధి |
| కేశఖండనము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-మృ-పున-పుష్య-హ-చి-స్వా-శ్ర-ధ-శ-రేవతి | వృ-మి-కర్కా-క-తు-ధ-మీ | ఉత్తరాయణం - పూర్వాహ్ణము |
| అక్షరస్వీకారము | ౨-౩-౫-౭-౧౦ | సో-బు-గు-శు | అశ్వి-పున-పుష్య-హ-చిత్త-అనూ-శ్ర-ధ-రేవతి | మే-కర్కా-తు-మ | ఉత్తరాయణం, ౫-వ సం. అష్టమశుద్ధి, సూర్యుడు చరస్థిరరాసులయందుండగా |
| విద్యారంభము | ౨-౩-౫-౭-౧౦-౧౧-౧౩ | ఆ-సో-బు-గు-శు | అశ్వి-మృ-ఆర్ద్ర-పున-పుష్య-ఆశ్లే-పూఫ-పూషా-పూభా-హ-చి-స్వా-అనూ-మూల | మే-కర్కా-తు-మ | అనధ్యయనములను విడిచి పెట్టవలెను. శాస్త్రవిద్యాభ్యాసమునకు-ఆది-మంగళవారములు-శుభము |
| ఉపనయనము | ౨-౩-౫-౭-౧౦ | బు-గు-శు | అశ్వి-రో-మృ-పున-పుష్య-ఉఫ-ఉషా-ఉభా-హ-చి-స్వా-శ్రవ-ధ-శత | పాపగ్రహములు కేంద్రమందు లేకుండుట-లగ్నము | అష్టమశుద్ధి-లగ్నమందు పాపగ్రహములు లేకుండుట-పూర్వాహ్ణము |

# రస్టన్ ఆయిల్ ఎంజినులు




## అన్ని పనులకు ఉపయోగించబడుచున్నవి.

మేము ఎంజినీరింగు వ్యాపారమునందు గడచిన 24 సంవత్సరములనుండి అన్నిరకముల ఎంజిను ఇన్‌స్టలేషను, ప్లాస్టింగులందు మంచి అనుభవము, ప్రఖ్యాతిగడించి యుండుటచే మాకు మాస్సి అండు కో లిమిటెడ్ వారు మద్రాసునందు లోకల్ ఏజన్సీని యిచ్చియున్నారు.

ఈ దిగువ విలాసముకు ఖుద్దువచ్చినను, ఉత్తరములు వ్రాసినను బదులు తెలుపబడును.



## గృహనిర్మాణములకు

అగత్యమైన గర్డరులు, సీమెంటు, రంగులు, వార్నీషులు, పైకప్పుకు కావలసిన జింక్ కారికేటెడ్ రేకులు, మేకులు వగైరాలు కూడ సరఫరా చేయబడును.

## శ్రీ ఆంజనేయ ఐరన్ వర్క్సు, 5, కీల్‌పాక్ గార్డన్సు, మదరాసు.

ఈ మాస్వంత కర్మాగారమునందు ముడుచుకొనునట్టి (Collapsible) గేట్లు, ఇనుపజాలీ రేకులు (expanded band Plates), గ్రాదెలు మొదలగునవి, యే కొలతలో కావలసినను సరఫరా చేయబడును.

## గవర్నమెంటు ఎంజినీరులు, ఆక్షనీరులు

యే వస్తువైనను మావద్దకు పంపిన న్యాయమైన ధర ప్రకారము వేలము వేసి విక్రయించబడును.

పైవిషయములలో యెందులోనైనను మమ్మును ఒకసారి పరిశీలించి చూడుడు. మీకు తప్పక తృప్తిగలుగును.

*Teleg. Add.:* "GALY" *Telephone No* 2117

# GALLEY & Co., ESTD 1903.

MACHINERY AND HARD-WARE MERCHANTS,

**164, Broadway, MADRAS.**

మద్రాసు, ఆనందాప్రెస్సువారి, సులభశైలి గల

# ఆంధ్రవచన భారత భాగవత రామాయణములు

మనదేశము ఇప్పుడు జాతీయాభివృద్ధికై సర్వశక్తులను ధారపోయుచున్నది. నిజముగుజాతీయాభివృద్ధికి భారత భాగవతరామాయణములు మూలకందములు. అట్టివీనిని పండితపామరసాధారణముగా నందజేయుటకై ఈవఱకెన్నియో ప్రయత్నములు చేయబడినవి; కాని తుది సెగ్గలేదు. భగవంతుని దయచే, మేము దాదాపు ఈప్రయత్నమునందు నెగ్గగలిగినందులకు సంతసించుచున్నాము.

మేము ఈప్రయత్నము నారంభించి యిప్పటివఱకు రామాయణ భాగవతములను, మూలమునందలి ఒక్కవిషయము నైనను వదలక, సంపూర్ణముగా తేటయైన శైలితో ముద్దులు గులుకుపటములతో సహా ముద్రించి ప్రకటించితిమి. ఇప్పుడు అదేరీతిగా భారతమును ముద్రించి ప్రకటించుచున్నాము. ఇంతవఱకు ఆదిసభావిరాటపర్వములును, శాంతిపర్వము పూర్తిగను వెలువడినవి. తక్కిన భాగములను త్వరగా ముగించుటకై మిక్కిలిగ ప్రయత్నించుచున్నాము. ఇదివఱకే అనేకులు ఆంధ్రులు చందాదారులై లాభమును పొందియున్నారు.కనుక చందాదారులుకానివారు వెంటనే చందాదారులై మాప్రయత్నమునకు తోడ్పడగోరెదము, క్రొత్తగా చందాదారు లగువారికి, వారివారి సదుపాయముల ననుసరించి, వెనుకటి వాల్యుములను ఒక్కసారిగాగాని, లేక దఫాలవారిగాగాని, వారు కోరినట్లు పంపుదుము. చందాదారుల కిది మంచి యనుకూలము. కావున ఆంధ్రు లందఱును వెంటనే చందాదార్లగుట మంచిది.

**శ్రీమద్వాల్మీకిరామాయణము:** 9 వాల్యుములుగ అట్టబైండు రు.11-0-0, 8 వాల్యుములుగ క్యాలికోబైండు రు.12-12-0.
**శ్రీమదాంధ్ర వచన భాగవతము:** 8 వాల్యుములుగ క్యాలికో బైండు రు. 9-0-0.
**శ్రీమదాంధ్ర మహాభారతము:** ఆదిపర్వము 3వాల్యుములుగ క్యాలికో బైండు 4-0-0,సభాపర్వము 1వాల్యుముగ క్యాలికో బైండు 1-8-0, శాంతిపర్వము 6 వాల్యుములుగ క్యాలికో బైండు 7-4-0.

**ఆర్. వేంకటేశ్వర్ అండు కో.,** ఆనందముద్రణాలయము, లోన్ స్క్వేర్, మద్రాసు.

## పద్మినీ తలనూనె (రిజిష్టరు చేయబడినది)




మెదడుకు చలువను కలిగించి, వెండ్రుకలను రాలకుండ జేయు ముఖ్యలక్షణములే గల యుత్తమమైన ఓషధులచే తయారు చేయబడిన మా పద్మినీ తలనూనె గూడ అన్ని యితర సుగంధనూనెల వలెనే బజారునందు క్రయమునకు దొరకును. ఆయుర్వేదశాస్త్రప్రసిద్ధముగ బహు జాగ్రత్తగ తయారు చేయబడిన దగుటచేత మిగత అన్ని నూనెలకంటె శ్రేష్ఠమైనదని ప్రఖ్యాతి బొందినది.

సీసా 1-కి రు. 1-0-0

ఆయుర్వేదాచార్య యస్. మాధవమీనన్ ఎ. ఎమ్. ఎ. సి. గారిచే స్థాపింపబడిన, మలబార్ ఆయుర్వేదిక్ స్టోర్సు, 107, బ్రాడ్వే, మదరాసు. టెలిగ్రాఫ్:—"పెుల్లోమ్".

## అందఱకు ఉచితముగా బంపబడును.




ఈ గ్రంథమునందు శరీరవ్యాయామ విషయములు పూర్తిగా చర్చింపబడినవి. ఇందు నాయొక్కయు, నా శిష్యుల యొక్కయు, పెక్కు పద్ధతులను సూచించు ఛాయాపటములు గూడ కలవు. దీనిని సమగ్రముగ పఠించితిరేని నా వ్యాయామపద్ధతి మీకు బాగుగ బోధపడగలదు.

ప్రతిభారతీయునకును దీని జదివిన మాత్రమున నూతనోత్సాహమును శరీరవ్యాయామాసక్తియు కలిగి తీరును. తపాలాఖర్చుకు మాత్రము 2 అణాలు పంపితిరేని యీగ్రంథము వెంటనే పంపబడును. దీన మీజీవయాత్రయందు నిస్సంశయముగ మార్పుగలిగి తీరును. ఈసమయము పోగొట్టుకొనవలదు. ఈవిషయము మీచిత్తమునం దుండగనే లేఖను వ్రాయుడు. దీనిజదివి ఆయురారోగ్యబలముల ననుభవింతురుగాక. ఉచితము. ఉచితము.

ప్రొఫెసర్ యం. వి. కృష్ణారావు, అఖిలభారతీయ శరీరవ్యాయామమార్గదర్శి, పోస్టు బసవనగుడి, బెంగుళూరు (సిటీ).

# కేసరి లోధ్ర గర్భాశయరోగ నివారిణి

Kesari's Lodhra

A Panacea for all diseases peculiar to Women

MAKES STERILITY A THING OF THE PAST

CURES
Dysmenorrhœa
Amenorrhœa
Menorrhagia
Leucorrhœa
Etc. Etc.

KESARI KUTEERAM
Indian Chemists & Druggists,
EGMORE, MADRAS

స్త్రీలపాలిటి కిది వరప్రసాదమనిన్ని, కామధేనువనిన్ని, కొంగుబంగారమనిన్ని, రత్నఖచితయాభరణమనిన్ని, సర్వాభీష్టప్రదాయిని యనిన్ని వాడినవారు పలువిధములుగ స్తోత్రము చేయుచున్నారు.

ఈ ఔషధరాజము హిందూదేశపు వనౌషధులతో తయారు చేయబడినది. దీని స్వరూపము, రుచి, జుంటె తేనెను బోలియుండును.

ఇది, ఋతుశూల, ఋతుస్రావదోషము, ఋతుస్రావము హెచ్చుతక్కువలగుట, ఋతుస్రావము వివిధరంగులుగ స్రవించుట, ప్రదరరోగము, అస్థిస్రావము, సోమరోగము, సూతికావాతము, సంతానహీనత, సూతికగడ్డ, మూర్ఛ, పిశాచబాధ, మొదలగు గర్భాశయ రోగములను కుదుర్చుటయేగాక, రక్తహీనత, అజీర్తి, మలబద్ధకము, నడుమునొప్పి, కాళ్లుచేతులు మంట, ఉబ్బసము మొదలగు వ్యాధులనుకూడ నమ్మకముగ కుదుర్చుచున్నది.

ఇది అన్ని మందులషాపులలో దొరకును.

పెద్దబుడ్డి రు. 3-0-0. చిన్నబుడ్డి రు. 1-10-0.

టెలిగ్రాం: "కేసరి" మద్రాసు. టెలిఫోన్: 3486

కేసరికుటీరం, ఆయుర్వేద ఔషధశాల, ఎగ్మూరు - మదరాసు.

ఓం

# ప్రస్తావన

శ్లో. ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే
నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః.

శ్రీమన్మహాదేవుని యాజ్ఞానుసారముగ ప్రవర్ధమానం బగుచున్న విశ్వవిలాసమునం దొకచాంద్రమానాబ్దము ముగిసినది. బ్రహ్మకల్పమునందు ప్రథమ పరార్ధము ముగిసి ద్వితీయపరార్ధమునందు ప్రథమ సంవత్సరముజరుగుచున్నది. రెండవపరార్ధమునందు ప్రథమదినమునను పగలు 13 గడియలు 42 విగడియలుగతించినవి. వైవస్వతమన్వంతరమునందు కలియుగమునందు ప్రథమపాదమునందు 5,028 వత్సరములు గతించినవి. శాలివాహన శకాబ్దములు 1,849, హూణశకాబ్దములు 1,926, ఫసలీ సంవత్సరములు 1,335, విక్రమార్కశకాబ్దములు 1,983 భరతశకాబ్దములు 5,071 గడచిపోయినవి. సృష్ట్యాది నుండియును 195,58,85,028 సంవత్సరములు ముగిసినవి. కలియుగాదినుండి చాంద్రమానపరివృత్తులు 83 గతించి, 84వ పరివృత్తి ప్రారంభమైనది. ప్రభవసంవత్సరము మహాకాలచక్రమునందు నవపరివృత్తి కారంభముగ నేర్పడుచున్నను అనంతకాలచక్రము గణనాతీతముగ నున్నది. అఖండమైన బ్రహ్మాండమునందు కాలనిర్దేశమువలె, దిఙ్నిర్దేశమును మానవులకు దుర్గ్రాహ్యముగ నున్నది. బ్రహ్మాండమునందుగల గ్రహతారాగణముల కాద్యంతము లగమ్యములుగ నున్నవి. ఆకసమునందు 200,00,00,000 తారలు గలవని పరిశోధకులు నిర్ణయించుచున్నారు. సూర్యమండలము సన్నిహితముగ నున్నను దురవగాహముగ నున్నది. సూర్యమండలమునందు కాంతికిరణము కేంద్రమునుండి భూమండలమునకు ప్రసరించుటకు 4,000 కాంతివత్సరములు పట్టుననియు, తారామండలమునుండి భూమండలమునకు కాంతికిరణము ప్రసరించుటకు 3,00,000 కాంతివత్సరములు పట్టుననియు పరిశోధకులు నిర్ణయించుచున్నారు. ఆ నిర్ణయములు మానవగణనమునందు దురవగాహములుగ నుండగలవు. కాంతికిరణము సంవత్సరమునకు 600,000,00,00,000 మైళ్ల ప్రమాణమున ప్రసరించునపుడు అనంతమైన దిక్కాలముల ప్రభావము దురూహ్య మగుచున్నది. అనంతములైన దేశకాలములను సాంతములైన సాధనసామగ్రితో గ్రహించుట యసాధ్యమైనను మానవలత్యమనంతవిలాసమునందు లగ్న మగుచు సనాతనమైనపరమేశ్వరవిలాసములను గ్రహించుటకు వినియోగపడుచున్నది.

ప్రభవసంవత్సర ఫలము

ప్రభవసంవత్సరమునకు సూర్యుడు రాజు, గణకుడు; ఫలము:—ప్రభువులకువైరము,స్వల్పవృష్టి,చోరాగ్ని శస్త్రభయము, అనర్ఘము. బుధుడు మంత్రి, సేనాధిపతి, అర్ఘాధిపతి, మేఘాధిపతి, గ్రామ పాలకుడు; ఫలము:— మేఘపీడ, సస్యఫలసమృద్ధి, అతివృష్టి, కామ పీడనము, పాపండుల వృద్ధి, గ్రామసౌఖ్యము. శని సస్యాధిపతి, నీరసాధిపతి, పురోహితుడు,పరీక్షకుడు; ఫలము:—తిలమాషకుళుత్థ కృష్ణధాన్యసమృద్ధి, కృష్ణభూములఫలము, శృంగలోహదారు పాత్రాదులకు అనర్ఘము, మనుజులకు సుఖము, పురోహితులకు పరీక్షకులకు బుద్ధిమాంద్యము. చంద్రుడు రసాధిపతి; ఫలము:—తిలతైల గుడ మధు పయోఘృతశర్కరాదులకు అర్ఘవృద్ధి. కుజుడు దైవజ్ఞుడు; ఫలము:—చోరాగ్నిశస్త్రబాధలు, రాజులకు యుద్ధము, దైవజ్ఞులకు మందబుద్ధి. యముడు పశునాయకుడు; ఫలము:—అనర్ఘము, అల్పవృష్టి, క్షీరక్షయము, పశు

పీడ. సంక్రాంతి పురుష వాహనము సింహము; ఫలము:— మృగనాశనము. ప్రభవ సంవత్సరమునకు సామాన్య ఫలము:—

శ్లో. క్వచి ద్వృష్టిః క్వచి ద్ధాన్యం క్వచి ద్భీతిః క్వచిత్సుఖమ్,
తథాపి మోదతే లోకః ప్రభవాబ్దే విమత్సరః.

సామాన్యపంచాంగఫలమును జాడ్కేలు పంచాంగమువే ఆ్కవిధమున నిర్ణయించుచున్నది. 1914 సం॥ముతో నారంభమైన మహాసంక్షోభము 1932 సం॥ అంతమువఱకును వ్యాపించుచు, విభవసంవత్సరమునందు మహాసంక్షోభము గలుగునని జాడ్కేలుపంచాంగము తెలుపుచున్నది. యురేనసునకును, గురువునకును మేషరాశియందు సంయోగమేర్పడునపుడు సంక్షోభముగలుగుననియును, ముఖ్యముగను ఇంగ్లాండునకీ సంక్షోభ మధికమనియును జాడ్కేలు పంచాంగము తెలుపుచున్నది. పిరమిడు పరిగణనములను బట్టి 1928 సంవత్సరము మేనెల 29 వ తేదినుండి 1936 సెప్టెంబరు 16వ తేదివఱకు యూరపు దుఃఖవేదన ననుభవించునని జాడ్కేలుగారు సిద్ధాంతమును జేయుచున్నారు. ప్రభవసంవత్సరముతో నవయుగారంభ మగునని భారతీయ దైవజ్ఞులు నిర్ణయించు చున్నారు. కాలగర్భము ప్రసవింపనున్న ఫల మజ్ఞాతమై దైవాధీనమై యున్నది. ఒకక్షణకాలములో మహాఖండమును మహాసముద్రమును జేయుటకును, మహాసముద్రమును మహాఖండమును జేయుటకును మహాయోగీశ్వరుడు శంకరుడు సమర్థుడు. జాడ్కేలుగారిజ్యోతిషము యూరపియను రాజ్యములకు సంబంధించినను యూరపురాజ్యములకు క్రీడారంగమైన ఆసియా రాజ్యములకును నీ స్పర్శ గలుగుట సహజము.

ఐరోపా మహాసంగ్రామము యూరపురాజ్యముల యదృష్టము నస్తంగతము చేసినది. యూరపురాజ్యములకు పరపీడనజీవనము దుస్తరమగుచున్నది. యూరపురాజ్యములకు విజయాపజయములు పరమానర్థముల నొడగూర్చినవి. ధననాశనము, జనక్షయము సంఘజీవనమునందు మహాపరివర్తనమును గలుగజేసినవి. జీవయాత్రయందు

యూరపురాజ్యములు

స్త్రీపురుషులకు, కార్మిక ధనస్వాములకు తీవ్రమైన స్పర్థ ప్రబలినది. గ్రేటుబ్రిటనునందు సగటున 18,00,000 మంది నిరుద్యోగదశయం దున్నారు. నిరుద్యోగులకుగాను ఇంతవఱకును 5,362 లక్షల సవరనులు వ్యయము చేయబడినవి. బొగ్గుసమ్మె కోట్లసవరనుల నష్టమును గలుగజేసినది. బొగ్గుసమ్మెయందు కార్మికులు పరాజయమును బొందిరి. ఆపరాజయము ధనస్వాములకును, కార్మికులకును గలవైరమును దృఢతరముచేసినది. గ్రేటుబ్రిటను వ్యాపారము మందగించుచున్నది. 1925 వ సంవత్సరమునందు 132 కోట్ల సవరనుల దిగుమతులును, 77 కోట్ల సవరనుల ఎగుమతులును జరిగినవి. 1926 సంవత్సరమునందు వ్యాపార మింకను తగ్గినది. వ్యాపారముల క్షీణత పరిశ్రమల క్షీణతకు గారణంబుగ నున్నది. గ్రేటుబ్రిటనుకు పట్టినదుర్గతియె ఫ్రాన్సు, ఇటలి మొదలగు రాజ్యములకు బట్టినది. ఫ్రాన్సు మొరాకోయందు విజయమును బడసినను పరపీడనము దుఃఖభాజన మగుచున్న విధమును ఫ్రాన్సు పరిస్థితులు విశదము చేయుచున్నవి. రుష్యాయందు సుస్థాపితమైన సాంఘికత్వము యూరపురాజ్యములందు క్రమముగను వ్యాపించుచు ధర్మహానికి సాధనంబగుచున్నది. గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు మొదలగు దేశములందు వివాహవిచ్ఛేదములసంఖ్య పెరుగుచున్నది. ఇంగ్లాండునందు సంవత్సరమునకు 2,605, ఫ్రాన్సునందు 33,000, అమెరికా సంయుక్తరాష్ట్రములందు 1,50,000 వివాహవిచ్ఛేదములు గలుగుచున్నవి. గ్రేటుబ్రిటను ఫ్రాన్సు దేశములందు జననములసంఖ్య తగ్గుచున్నది. వ్యభిచారజననములు గ్రేటుబ్రిటనునందు 30,000, ఫ్రాన్సునందు 70,000 సంవత్సరమునకు గలుగుచున్నవి. గ్రేటుబ్రిటనునందు మద్యపానమునకు 1925 సంవత్సరమున తల 1-కి రూ.103 వంతున 3,152 లక్షలసవరనులు వినియోగపడినవి. త్రాగుడు నేరములకు 1926 వ సంవత్సరమున 80,000 మంది దండింపబడిరి. గ్రేటుబ్రిటను అమెరికాసంయుక్తరాష్ట్రములకు 11,107 లక్షల సవరనులు బాకీ యున్నను గ్రేటుబ్రిటనుకు రావలసిన బాకీలు 21,946 లక్షల సవ

రములు గలవు. రావలసిన బాకీలు అప్పుకన్నను హెచ్చుగ నున్నను సంగ్రామమువలన నేర్పడిన పరివర్తనాంకురములు మహాసంక్షోభమునకు గారణంబు లగుచున్నవి. ఇటలియందు ముస్సులోనిగారు నాటుచున్న బీభత్స బీజములు మహాసంక్షోభమును గలుగజేయుట సహజము. ఐరోపా మహాసంగ్రామము అమెరికా సంయుక్తరాష్ట్రములకు ప్రపంచమునందు ధనాధిపత్యమును సుస్థిరము చేసినది. యూరపురాజ్యములు అమెరికా సంయుక్తరాష్ట్రములకు 3,600 కోట్ల రూప్యములు బాకీపడినవి. యూరపు రాజ్యముల శుభస్థితికి మూలాధారమైన వ్యాపారమును పశుబలసమ్మోహమును సంగ్రామము శిథిలముచేసినది. యూరపు శక్తప్రభావ మంతరించినవిధమును ప్రపంచవ్యవహారములు విశదము చేయుచున్నవి.

నానాజాతిసమితి

నానాజాతి సమితియొక్క సప్తమ సమావేశము జినీవాయందు గతించిన సెప్టెంబరుమాసమునందు గూడినది. ఆసమావేశమునందు 47 రాజ్యముల ప్రతినిధులు గూడి సామాన్య వ్యవహారములను నిర్ణయించిరి. లొకార్నొ యొడంబడిక జర్మనీకి జాతిసమితియందు ప్రవేశమును గలుగజేసినది. స్ట్రెసుమనుగారు జర్మను ప్రభుత్వ పక్షమునను ప్రవేశము నంగీకరించిరి. స్థాయిసంఘమునందు గ్రేటుబ్రిటను, ఫ్రాన్సు, ఇటలి, జర్మనీ, జపాను సభ్యత్వమును గలిగియున్నవి. ఇంకను 9 రాజ్యములకు వరుసవంతునను ప్రాతినిధ్యము గలుగుచున్నది. ఆయుధధారణనియమమునకుగాని, శాంతి సంరక్షణమునకుగాని జాతిసమితి చేయుచున్న ప్రయత్నములు స్వల్పముగ నున్నవి. చీనాసంగ్రామప్రస్థానము నానాజాతిసమితియొక్క నిర్లేపత్వమును విశదము చేయుచున్నది. సమితి తెల్లజాతుల ప్రయోజనములకు వలెను నల్లజాతుల ప్రయోజనములకు వినియోగపడ కున్నది. తెల్లజాతులయందైనను పెద్దరాజ్యములలాభమునకే వినియోగపడుచున్నది. జాతిసమితియందు భారతవర్షమునకుగల ప్రాతినిధ్యము వ్యయమునకువలెను ప్రయోజనములకు సాధనము గాకున్నది. గతసంవత్సరమునందు సమితి సమావేశమునందు సర్ సి. పి. రామస్వామి అయ్యరు ఛటర్జిగారులు భారత ప్రతినిధులుగ నుండిరి. ప్రతినిధుల ప్రతిభకు సమావేశ ముపచరించినను దేశప్రయోజనముల కుపచరింపలేదు. అమెరికా సమితియందు జేరక ఆయుధధారణనియమమునకు ప్రత్యేకసమావేశమును జేయగోరుట యసంగతముగనున్నది. సమితికి నిర్ణయముల నాచరణమునందు బెట్టుటకు ధర్మబలముగాని ఆయుధబలముగాని కలుగనంతవఱకును సమితినిర్ణయములు మృతాక్షరములుగ నుండును గాని ప్రయోజనకరములుగ నుండజాలవు. సంరంభభరితమైన ప్రపంచమునందు శాంతసమావేశము సయితము ఆశాజనకముగ నుండగలదు.

ధనదాస్యము

మానవులదాస్యమునకు పశుబలమువలెను ధనబలమును పరమసాధనముగ నున్నది. రుష్యారాజ్యము స్థాపించిన సాంఘికధర్మము ప్రపంచమునందు నవయుగస్థాపనమునకు వినియోగపడుచున్నది. రుష్యా జర్మనురాజ్యముల బలములేని యూరపురాజ్యముల బలము యూరపురాజ్యముల సంరక్షణమునకును, ఆసియారాజ్యముల దాస్యసంవర్ధనమునకును పరిమితముగనున్నది. రెండువంతుల దేశము 22 కోట్ల ప్రజలులేని యూరపురాజ్యముల బలము క్రమముగ శిథిలమై ఆత్మనాశనమునకు సాధనం బగుచున్నది. ఐరోపామహాసంగ్రామమునకు వివిధ రాజ్యములు గలిసి 5,60,869 లక్షల నవరసులను వ్యయము చేసినవి. బ్రిటీషుసామ్రాజ్యము చేసిన 1,35,779 లక్షల నవరసుల వ్యయమునందును భరతఖండము 6,871 లక్షల నవరసుల వ్యయభారమును వహించినది. బ్రిటీషు సామ్రాజ్యమున కాపత్కాలమునందు భారతీయులు చేసిన సహాయమునకు బ్రిటీషు ప్రభుత్వము ద్వంద్వప్రభుత్వమును ప్రసాదించినది. గతించిన 12 ఏండ్లయందును భరతవర్షపు అప్పు 551 కోట్ల రూప్యములనుండి 1,013 కోట్ల రూప్యములకు పెరిగినది. ఇంగ్లాండునకు భరతఖండము 511 కోట్ల రూప్యములు బాకీయున్నది. అమెరికా సంయుక్తరాష్ట్రములు గాక శేషించిన దేశములు కొంచెమో

గొప్పో గ్రేటుబ్రిటనుకు బాకీపడి యున్నవి. ఈ ధన దాస్యమునుండి తప్పించుకొనుటకు రుష్యాప్రభుత్వము 17,462 లక్షల నవరసుల ప్రాతబాకీలను నిరాకరించినది. జర్మనీకి చిరకాలము ధనదాస్యము తప్పనిసరియైయున్నది. జర్మనీ సంవత్సరమునకు 81 లక్షల నవరసుల చొప్పునను 60 ఏండ్లు అప్పును చెల్లింపవలసియున్నది. అప్పులను నిరాకరించిన రుష్యాదేశము, అప్పులను చెల్లింపవలసిన జర్మనిదేశము, యూరపురాజ్యముల నావహించిన మహోతృష్ణ, ప్రపంచసంక్షోభమునకు సాధనము లగుచున్నవి. ఐరోపామహాసంగ్రామము యూరపురాజ్యముల సంయోగమును శిథిలము చేసినది. నిరాయుధమై నిస్సహాయస్థితి యందున్న జర్మనియును, సాంఘికత్వము నారాధించుచు దారిద్ర్యము ననుభవించుచున్న రుష్యాయును యూరపు రాజ్యాధిపత్యమును శిథిలముచేయుట కేర్పడుట దైవనిర్ణయముగనున్నది. మహాసామ్రాజ్యాధిపత్యమును, ధనాధిపత్యమును వహించుచు భాగ్యభోగ్యముల ననుభవించుచున్న ఇంగ్లాండునకు జర్మని రుష్యాదేశములస్థితి దుర్భరముగ నున్నది. ఇంగ్లాండింతవఱకును ననుభవించుచున్న వ్యాపారాధిపత్యమును, ధనాధిపత్యమును క్రుంగిపోవుచున్నవి. సాంఘికత్వవిప్లవమును బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములందు బ్రిటీషురాజ్యాధికారులు పసిపట్టుచున్నారు. స్వదేశమునందు కార్మికపక్షబలమును, వ్యాపారసంఘములబలమును నాశనముచేయుటకు కన్సర్వేటివుపక్షము పూనుకొనుచున్నది. భరతఖండమునందు నిర్బంధసాధనములను ప్రయోగించుచున్నది. చీనాయందు దండయాత్రకు బూనుకొనుచున్నది. శిథిలమగుచున్న సామ్రాజ్యాధిపత్యము నుద్ధరించుటకు బ్రిటీషురాజ్యాధికారులు విశ్వప్రయత్నములను జేయుచున్నను కాలప్రవాహము నరికట్టుట బ్రిటీషురాజ్యాధికారులకు సాధ్యము గాదని ప్రపంచపరిస్థితులు విశదము చేయుచున్నవి. బ్రిటీషు సామ్రాజ్యము యొక్క యోగక్షేమములను నిర్ణయించుటకు 40 వ సామ్రాజ్యసభ లండనునగరమునందు అక్టోబరు మాసమునందు గూడినది.

సామ్రాజ్యసభ

బ్రిటీషుసామ్రాజ్యరాజ్యముల సమావేశము 1887వ సంవత్సరమునం దారంభమైనను గ్రేటుబ్రిటనుకు గాని ఇతర భాగములకు గాని విశేషమైన ప్రయోజనము గలుగలేదు. గతసంవత్సరమునందు కూడిన సమావేశమునందు బ్రిటీషుసామ్రాజ్యసభకు అంగనిర్మాణము ఏర్పడి అంతర్భాగముల స్థితి నిర్ణయింపబడినది. గ్రేటుబ్రిటను బాధ్యతాయుతస్వపరిపాలనము గల రాజ్యములు బ్రిటీషు రాజ్యాధికారపాశబద్ధములై బ్రిటీషుసామ్రాజ్యమునందుసమానాధికారమును గలిగియుండునటులు నిర్దేశింపబడినది. సామ్రాజ్యసంరక్షణభారమును పూర్వమువలెనే విశేషముగ గ్రేటుబ్రిటను వహింపవలసియున్నను గ్రేటుబ్రిటనుగాని, వలస రాజ్యములుగాని పరస్పరము సంప్రతింపక సంగ్రామసన్నాహములకు బూనుకొనజనదని నిర్ణయింపబడినది. బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములకు వ్యాపారసౌకర్యములు గలుగుట కేర్పాటులుచేయుటకు నిర్ణయింపబడినది. వ్యాపారసంఘాధిపతి కున్లిఫు లిస్టరుగారు 1926 వ మొదటిభాగమునందు గ్రేటుబ్రిటనుదిగుమతులందు మూడవవంతును, ఎగుమతులందు సగముభాగమును సామ్రాజ్యాంతర్భాగములకు సంబంధించియున్న విధమును విశదముచేసిరి. గ్రేటుబ్రిటనువ్యాపారమునందు విశేషభాగము భరతఖండమునకు సంబంధించియున్న విధమును లెక్కలు విశదము చేయుచున్నవి. బ్రిటీషు సామ్రాజ్యసభయందు భరతఖండమునకు ప్రాతినిధ్యము లేదు. భారతీయవ్యాపారమునకు సౌకర్యములు గల్పింపబడలేదు. భరతఖండము కేవల మాంగ్లేయులకే కాక సామ్రాజ్యమునందు గల తెల్లవారి కందఱకును వ్యాపారాధికారరంగముగ నేర్పడుచున్నది. సామ్రాజ్యసభ తెల్లజాతుల ప్రయోజనముల కేర్పడినది గాని నల్లజాతుల ప్రయోజనముల కేర్పడ లేదని సభా వ్యవహారములు విశదము చేసినవి. గ్రేటుబ్రిటను వ్యాపారాభివృద్ధికిని సామ్రాజ్యసంరక్షణమునకును జనాకీర్ణమైన భరతఖండము సాధనముగాని జనశూన్యములైన వలసరాజ్యములు సాధన

ములు గావు. బ్రిటీషు సామ్రాజ్యమునందుగల 45 కోట్ల ప్రజలయందును 32 కోట్ల ప్రజలు భరతఖండమునందు గలరు. సామ్రాజ్యమునందు 6 కోట్లు మాత్రము తెల్లవారు గలరు. ఈ స్వల్పసంఖ్యాకులువ్యాపారాభివృద్ధికిని, సామ్రాజ్యసంరక్షణమునకును జాలనివిధమును రాజ్యవ్యవహారములు వెల్లడిచేయుచున్నను శ్వేతజాత్యభిమానము ధర్మనిర్వహణమునకు ప్రతిబంధకముగ నున్నది. ఐరోపా సంగ్రామము, బ్రిటీషు సామ్రాజ్యసభ శ్వేతజాత్యభిమానమును, సామ్రాజ్యాభిమానమును వృద్ధిచేసినను ప్రాచ్యప్రబోధమునకు వినియోగపడుచున్నవి. స్వాతంత్ర్యవాతావరణము విశ్వమునందంతటను వ్యాపకమును బొందుచు శ్వేతాధిపత్యమును నిరంతరము శిథిలము చేయుచున్నది. బ్రిటీషు రాజ్యాధికారులు కన్నులను మూసికొని ప్రపంచమునందు జరుగుచున్న మహాపరివర్తనమును గనుగొనకుండుట శోచనీయముగ నున్నది.

ప్రాక్ప్రపంచము

చిరకాలమునుండియును ప్రాచీప్రతీచీభావములకు సంరంభము గలుగుచున్నది. ప్రాచ్యులలక్ష్య మాధ్యాత్మికము: పాశ్చాత్యులలక్ష్య మాధిభౌతికము. ప్రాచ్యదేశీయులైన బుద్ధుడు, ఏసుక్రీస్తు, శంకరుడు, రామానుజుడు, మహమ్మదు, కణ్ఫ్యూషియసు మొదలగు మహానుభావులు ప్రపంచలక్ష్యము నాధ్యాత్మికపరము చేసిన విధమును ప్రపంచమతచరిత్రము విశదము చేయుచున్నది. బుద్ధభగవానుని విజయములు, ఏసుక్రీస్తు విజయములు నేటికిని ప్రపంచమునందు సుస్థిరముగ మానవహృదయము నావరించియున్నవి. ఏసుక్రీస్తు, బుద్ధుడు బోధించిన ప్రేమతత్త్వము మానవసంఘమును నేటికిని పాలించుచున్నది. అలెగ్జాండరు, సీజరు స్థాపించినరాజ్యములు నామరూపములు లేక నశించి శిథిలశిల్పములయందుమాత్రము గోచరం బగుచున్నవి. మతోద్ధారకులబోధలు చైతన్యామృతపూరితములై పురుషార్థమునకు సాధనములుగ నున్నవి. రాజ్యస్థాపకుల విజయములు దురంతపూరితములై ఆత్మవినాశమునకు సాధనములుగ నున్నవి. ప్రపంచచరిత్రమునం దీవిషయము పునరావృత్తినిబడయుచున్నను క్రొత్తవిషయముగ గనుపట్టుచుండును. పాశ్చాత్యరాజ్యములు పశుబలాధారమున ప్రాచ్యదేశములను జయించి రాజ్యాధికారమును నిర్భయముగ ననుభవించుచున్నవి. రుష్యాకు జపానువలన గలిగిన పరాభవము ఆసియాఖండవాసుల కాత్మవిశ్వాసమును గలుగజేసినది; శ్వేతరాజ్యముల దుర్జయసిద్ధాంతమును శిథిలము చేసినది. జపానువిజయము లాసియాప్రతిభను వ్యక్తము చేసినను యూరపురాజ్యముల విజయమువలె పరపీడనమునకు సాధనము లైనవి. ఐరోపామహాసంగ్రామము శ్వేతరాజ్యముల దుర్జయసిద్ధాంతమును సంపూర్ణముగ నాశనము చేసినది. వ్యాధిగ్రస్తరాజ్యముగ నెంచబడిన తుర్కి స్వాతంత్ర్యమును బడసి వికసించుచున్నది. పారశీకము, అఫ్గనిస్థానము స్వాతంత్ర్యమును బడసి వృద్ధిని పొందుచున్నవి. చీనాయందంతశ్ఛేదములు చెలరేగుచున్నను స్వాతంత్ర్యప్రసవ మతీవిచిత్రముగ జరుగుచున్నది. భరతఖండమునందును స్వరాజ్యప్రస్థానము నెమ్మదిగ నడుచుచున్నది. యూరపురాజ్యములయొక్క ప్రతాపము చల్లారుచున్నను దురాశమాత్రము బలిసి సంక్షోభమును గలుగజేయుచున్నది. భరతవర్షమునందు పర్యాప్తంబగుచున్న స్వరాజ్యసంరంభమునందు బ్రిటీషు రాజ్యాధికారులు చూపుచున్న యధర్మప్రతిఘటనము సామ్రాజ్యముల దుర్నయములకు నిదర్శనముగ నున్నది.

భరతఖండము 33 కోట్లప్రజలను, సహజసంపదలను, ప్రాచీనసభ్యత్వమును గలిగియుండియును పరాధీనస్థితియందుదుఃఖవేదననుభవించుచున్నది.

కాంగ్రెసు విభేదములు

మాంటుఫర్డు సంస్కరణములు పారతంత్ర్యబంధనమునకువలె స్వాతంత్ర్యసిద్ధికి వినియోగపడుటలేదు. నిరర్థకమైన ద్వంద్వప్రభుత్వమునకు దోడుగ నిర్బంధములను, లీకమిషను నిర్ణయములను బ్రిటీషుపార్లమెంటు ప్రసాదించి ఉక్కుపంజరమును బిగదీసినది. దేశబంధు చిత్తరంజనదాసు మరణానంతరము భారతీయనాయకులకు నిరంకుశకాలప్రవాహము నరికట్టు

టకు శక్తి క్షీణించినది. కానపూరుకాంగ్రెసు బహిష్కార పక్షమునకును, స్వరాజ్యపక్షమునకును గల విభేదముల నంతరింపజేయుటకు జేసిన ప్రయత్నములు కొంతవఱకు సఫలములైనను స్వరాజ్యపక్షమునందు చీలికలేర్పడి నాయకులయం దభిప్రాయభేదము లేర్పడినవి. స్వరాజ్యపక్షమునందు యథోచితసహకారపక్ష మేర్పడి స్వరాజ్యపక్ష బలమును క్షీణింపజేసినది. నాయకులదృష్టి సహాయనిరాకరణసిద్ధాంతములనుండి శాసనసభలకు మరలినది. సిద్ధాంతములందు ప్రతిష్టంభము, ప్రతిఘటనము ప్రతిపాదింపబడినను వ్యవహారములందు యథోచితసహకారము ప్రబలినది. యథోచితసహకారపక్షమునకును, స్వరాజ్యపక్షమునకును, నబర్మతిసమావేశమునందు సంయోగ మసాధ్యమై రెండుపక్షములును స్థిరపడినవి. పండిత మోతీలాలునెహ్రూగారికిని, లాలా లాజపతిరాయిగారికిని గల భేదాభిప్రాయములు తీవ్రమైన వివాదములకు లోనై స్వరాజ్యపక్షబలమును శిథిలము చేసినవి. పండిత మోతిలాలు నెహ్రూ, శ్రీనివాసయ్యంగారు, సేనుగుప్త, రంగస్వామయ్యంగారు, ప్రకాశం, సత్యమూర్తిగారులు మొదలగువా రొక పక్షమునందును, పండిత మదనమోహన మాలవ్యా, లజపతిరాయి, డాక్టరు మూంజి, కేల్కారు, రాఘవేంద్రరావుగారులు మొదలగువారు రెండవ పక్షమునను జేరి గతసంవత్సరమునందు దేశమును వాదప్రతివాదములతో నింపిరి. మొదటిపక్షము దాసుగారి సిద్ధాంతములను సమర్థించుచున్నను, రెండవపక్షము హిందూపక్షాభిమానమును వహించుచు హిందూమహమ్మదీయ విభేదములను వృద్ధిచేసినది. మహారాష్ట్రపక్షమారంభమునుండియును యథోచితసహకారసిద్ధాంతములను విశ్వసించినవిధమును చింతామణి కేల్కారుగారి వ్యాఖ్యానములు విశదముచేసినవి. గౌహాతికాంగ్రెసు చేసినతీర్మానము చూపులకు గంభీరముగనున్నను వ్యవహారమునందు నిరర్థకముగ నున్నది. తీర్మానము ద్వంద్వప్రభుత్వవినాశనమును అధికారనిరాకరణమును నిర్ణయించుచున్నను. నిర్మాణనిర్దేశములు నిరర్థకము చేయుచున్నవి. కాంగ్రెసు తీర్మానమునకు విరుద్ధముగను రాష్ట్రీయశాసనసభలయందు ద్వంద్వప్రభుత్వము సాగుచున్నది. శాసనసభావ్యవహారములవలెను నిర్మాణవిధానమును నిరుత్సాహకరముగ నున్నది. గాంధిమహాత్ముని సంచారమైనను ప్రజలను తిరిగి కార్యపరతంత్రులను జేయుట కుపచరించునని నమ్ముచున్నాము. వర్తమాన పరిస్థితులం దంతయును నంధకారబంధురముగ గనుపట్టుచున్నది. దేశమునందు కార్యదీక్ష ప్రబలనంతవఱకును దేశమోక్షమునకు సాధనము దుస్తరమగుచున్నది. ద్వంద్వప్రభుత్వవిధానము, సంఘటనోద్యమము, స్వార్థపరత్వము, తీవ్రాభిప్రాయములు గతసంవత్సరమునందు హిందూమహమ్మదీయవిభేదములను పెంచి సంక్షోభమును గలుగజేసినవి. హిందూమహమ్మదీయ విభేదములు ఘోరమైన హత్యలకును, దురంతములకును గారణములై నిరంకుశవర్గమును పోషించుటకు వినియోగపడినవి.

**హిందూమహమ్మదీయ విభేదములు**

మహాత్యాగాదర్శముతో నారంభమైన సహాయనిరాకరణోద్యమము ఖిలాఫతుఉద్యమము కాలక్రమమునను క్షీణించి స్వార్థపరాయణత్వము నందు సంక్రమించినవి. ఢిల్లి, కలకత్తా, లక్నో మొదలగు స్థలములందు గలిగిన దురంతములు హిందూమహమ్మదీయసంఘములందు ప్రబలిన తీవ్రావేశమును విశదము చేయుచున్నవి. కలకత్తా అల్లరులయందు 100 మంది చనిపోయిరి. మూడువందలమందికి గాయములు గలిగినవి. సాంఘికవిభేదములను నిరసించెడి లాజపతిరాయిగారును సర్ అబ్దుర్ రహీంగారును సాంఘికప్రయోజనములందు వారి దృష్టిని లగ్నము చేయుటవలన దేశావృతమైన సాంఘికసంఘర్షణము విశదమగుచున్నది. విభేదములకు గారణములైన మేళములు, భజనలు, గోహత్యలు నిమిత్తకారణములు గాని యథార్థమైన కారణములు గావు. హిందూమహమ్మదీయ సంయోగమునకై పరితపించిన గాంధిమహాత్ముడు తన నిస్సహాయతను విశదముచేసెను. వంగరాష్ట్రమునందు సాగుచున్న పట్టుకాలి సత్యాగ్ర

హము, కుల్కాటియందు సంప్రాప్తమైన దుర్మరణములు హిందూమహమ్మదీయ భేదమును విశదము చేయుచున్నవి. అల్లరుల నణచుటకు చులుకనగ తుపాకులను కాల్చుట నిరంకుశత్వమునకు పరిపాటియైనది. నిరంకుశవర్గమునకు భారతీయులప్రాణములపట్లను గల విలువను నిరంతరము సంప్రాప్త మగుచున్న తుపాకుల ప్రయోగములు విస్పష్టము చేయుచున్నవి. మహమ్మదీయుల నావరించిన ప్రచండమైన మతావేశమునకు స్వామి శ్రద్ధానందునిహత్య నిదర్శనముగ నున్నది.

శ్రద్ధానందస్వామి

మానవవికాసమునందు రాజకీయ మత సాంఘికార్థికవ్యవస్థలు పరస్పరము వైరుధ్యము లేక సంబంధమును గలిగియున్నవి. ఒక కాలమునందు మతావేశము వేఱొక కాలమునందు రాజ్యాంగాందోళనము ప్రబలినను సకలసాధనములును అన్యోన్యాశ్రయమును గలిగి మానవవికాసమునకు వినియోగపడుచున్నవి. పాశ్చాత్యసంపర్కము భారతీయులదృష్టిని రాజ్యాంగసంస్థలయందు లగ్నము చేసినది. తుర్కీ జపాను విజయములు, దేశదారిద్ర్యము, దేశదాస్యము, నాయకులదృష్టిని భౌతికసాధనములందు లగ్నముచేసినవి. హిందూమతము నామరూపవిలసితమై, సత్త్వవిరహితమై మతప్రయోజనములకు నిరర్థకమైనది. మతభేదములను, శాఖాభేదములను, కులభేదములను, స్థలభేదములను, హిందూమతధర్మములు పెంపొందించి హిందూమతమును నిస్సారము చేసినవి. ఏటేటను వేలకొలదిహిందువులు క్రీస్తుమతమునందును, మహమ్మదీయ మతమునందును జేరుటవలన హిందూమతము క్షీణించుచున్నది. అస్పృశ్యత హిందూసంఘమునకు వేరుపురుగై సంఘబలమును సన్నగిలజేయుచున్నది. హిందూమతము నుద్ధరించుటకును, సంఘబలమును గాపాడుటకును దయానందసరస్వతీస్వాములు స్థాపించిన ఆర్యసమాజమును శ్రద్ధానందస్వాములు త్రికరణశుద్ధిగ పోషించుచు హిందూమతాభ్యుదయమున కాత్మార్పణమును జేసిరి.

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకే చ పండితా స్సమదర్శినః.

శ్రద్ధానందస్వాములవారు శుద్ధిసాధనమున అన్యమతస్థులను హిందూమతప్రవిష్టులను జేసి హిందూమతమును చైతన్యప్రదము చేయగలిగెను. వేలకొలది మహమ్మదీయులను పంచములను శుద్ధిచేసి హిందూమతస్థులను స్వాములవారుచేయుచుండిరి. క్రైస్తవులకును, మహమ్మదీయులకును నితరులను వారి మతమునందు గలుపుకొనుటకు గలహక్కు హిందువులకును గల దని శ్రద్ధానందస్వాములు కార్యరూపమున రుజువుచేసి హిందువుల కృతజ్ఞతకును మహమ్మదీయుల యాగ్రహమునకును పాత్రులైరి. శుద్ధిసంస్కారమునకు దోడుగ హిందూసంఘటనోద్యమమును స్వాములవారు నిర్వహించుచు హిందువుల కుద్ధరణసాధనమును విశదము చేసిరి. హరిద్వారమునందు స్వాములవారు స్థాపించిన గురుకులము స్వాములవారిమహత్త్వమునకు చిహ్నముగ నున్నది. తక్షిక, నలంద, ధరణికోట మున్నగు ప్రాచీనవిద్యాపీఠముల పద్ధతిని గురుకులమునందు హిందీభాషాముఖమున విద్యాభ్యాసము చేయబడుచున్నది. గీతాశాస్త్రమునందు బోధించినటులు శరీర వాఙ్మనస్తపములు కాంగ్రా గురుకులమునం దభ్యసింపబడుచు భారతీయసంస్కారముద్ధరింపబడుచున్నది.

భారతజాతియోద్ధరణమునకు జీవితమును ధారవోసిన మహానుభావుని అబ్దులురషీదు నిర్దయస్వాంతుడై హత్యచేయుట పరమవిషాదకరమైన విషయముగనున్నది. అబ్దులురషీదు దోషియని న్యాయమూర్తి నిర్ణయించి మరణశిక్షను విధించెను. హిందువు లందఱును రషీదుకు మరణదండనము గలుగకుండుటకు యత్నించి స్వాములవారి నిర్యాణముతో హిందూమహమ్మదీయ సమ్మేళనమును సార్థకము చేయుదురుగాత! శ్రద్ధానందస్వాముల పుత్రుడు పండిత ఇంద్రుడుగారు మరణదండనమును తీసివేయుటకు విజ్ఞాపకులుగ నుండుట కంగీకరించి సహజమైన యుదారస్వభావమును విశదముచేసిరి. శ్రద్ధానంద

స్వాములవారి స్మరణచిహ్నమును నెలకొలుపుటకు శుద్ధిసంస్కారమును, సంఘటనోద్యమమును, గురుకులాశ్రమమును స్థిరతరముచేయుటకు సాధనములుగనున్నవి. పండిత మదనమోహన మాలవ్యా, గాంధిమహాత్ముడు, లాలా లజపతిరాయిగారులు మొదలగువారు చేయుచున్న విన్నపముల నాలకించి యథాశక్తిని సహాయముచేసి హిందూమతోద్ధరణమునకును, ధర్మాభ్యుదయమునకును భారతీయులు దోడ్పడుదురు గాత! గురుకులముయొక్క 25 వ వర్ధంత్యుత్సవమునకు గాంధిమహాత్ముడు బ్రహ్మత్వమును వహించుచు భారతీయుల కుపదేశించిన స్వధర్మానుష్ఠానము ప్రజానాయకుల కాచరణయోగ్యముగ నున్నది.

**గాంధిమహాత్ముడు**

మమకారాహంకారభరితమైన ప్రపంచమునందు సత్యాన్వేషణము సత్యవ్రతము దురారాధ్యములు. ఆబాలగోపాలము స్వీయాభిప్రాయములను సమర్థించుటకు విచిత్రతర్కమును వ్యక్తముచేయుచు తమతప్పులను దాచుచుందురు. మహాత్ములు నిర్భయముగ సత్యము ననువదించుచు కష్టనిష్ఠురములకు లోనయ్యెడివిధమును సత్యవ్రతులచరితములు విశదము చేయుచున్నవి. గాంధిమహాత్ముడు ప్రచురించుచున్న స్వీయచరిత్రము జిజ్ఞాసువులకు సత్యాన్వేషణవిధానమునకు సాధనముగ నున్నది. మహాత్ము డరమరలు లేక బహిరంగము చేయుచున్న స్వీయచరిత్రాంశములు వారివినయవిధేయతలను సత్యశీలమును విశదము చేయుచున్నవి. మమకారావరణమును విడిచి ధర్మావరణమును జేరుటకుగల ప్రతిబంధకములను గాంధిగారి స్వీయచరిత్రము తెల్లముచేయుచున్నది. కర్మయోగమును జ్ఞానయోగమును ధర్మక్షేత్రమునందు సమన్వయము చేయగల విధమును మహాత్ములచరిత్రములు చాటుచున్నవి. సత్యవ్రతారాధనమున కభిమానవిరహితమైన మహాత్యాగము పరమసాధనమని గాంధిగారిచరిత్రము విశదము చేయుచున్నది. త్యాగారాధనము స్వార్థవిరహితమైన సేవావిధానమునందు నిరంతరము గోచరం బగుచుండును. లాభాలాభములనుపాటింపక నిష్కామసేవను జేయునపుడు పురుషార్థమునుబడయుటకు సకలావస్థలయందునుమానవుల కవకాశములు గలవని మహాత్మునిస్వీయచరిత్రాంశములు తెలుపుచున్నవి. నిష్కామసేవను జేయుటకు పండితులకు-పామరులకు, శ్రీమంతులకు-దరిద్రులకు, రోగులకు-భోగులకు, సాధువులకు-శూరులకు వారి స్థితిగతులకు దగిన యవకాశములు గలవు. ఉన్న యవకాశములను వినియోగించుట వివేకముగాని లేనియవకాశములకు శోచించుట వివేకము గాదు.

గాంధిమహాత్ముడు గతసంవత్సరమునందు దేశసంచారమును విడిచి సబర్మతిసత్యాగ్రహాశ్రమమునందు తంతుకారసంఘాభివృద్ధికి కాలమును వినియోగించెను. దేశమోక్షమునకు రాజ్యాంగాందోళనమే సాధన మని నమ్మెడివారికి మహాత్ముని విశ్రాంతి యసంతృప్తిని గలుగజేసినను స్వయంసహాయసిద్ధాంతమును నమ్మినవారల కసంతృప్తిని గలుగజేయజాలదు. తాము తరింపక యితరులను తరింపజేయుటకు బూనుకొనుట యనుచితము. గతించినసంవత్సరమున విశ్రాంతిసమయమునందు గాంధిమహాత్ముడు తంతుకారసంఘాభ్యుదయమునకు తన యావచ్ఛక్తిని వినియోగించెను. గౌహాతికాంగ్రెసు ముగిసినవెంటనే మహాత్ముడు దేశసంచారమున కుపక్రమించి, నిర్మాణకార్యవిధానమును, ముఖ్యముగ ఖద్దరు నిర్మాణమును వ్యాపింపజేయుటకు పాటుపడుచున్నవిధమును వారి సంచారము విశదము చేయుచున్నది. వంగబీహారురాష్ట్రములందును, బీరారు మహారాష్ట్ర దేశములందును వేలకొలది ప్రజలు మహాత్ముని సందర్శించి ఖద్దరునిధికి కానుకల నర్పించిరి. ప్రజలకు గాంధిమహాత్మునిమీదగల భక్తివిశ్వాసములు నిలిచియున్న విధమును సుస్వాగతములు, జనసమూహములు విశదముచేయుచున్నవి. గాంధిమహాత్ముని సంస్మరణము, సందర్శనము, స్వరాజ్యలక్ష్యమును ఖద్దరును ప్రజలకు హృద్గతము చేయుచున్నవి. స్వరాజ్యసంపాదనమునకు ప్రజలకృషి సాధనము గాని ప్రభుత్వకటాక్షము సాధనము గాదు. ప్రజల యుత్సాహము తాత్కాలికముగాక స్థిరతరముగనుండుటకు జనారాధ్య

# చెన్నపురి శాసనసభ - కాంగ్రెసు సభ్యులు

శాసనసభాధ్యక్షులు



శ్రీ సి. వి. యస్. నరసింహరాజుగారు



శ్రీ ఆర్కాటు పరశురామరావుగారు



శ్రీ పిల్లలమఱ్ఱి ఆంజనేయులుగారు



శ్రీ సి. గోపాలమీననుగారు



శ్రీ పి. శివరావుగారు



శ్రీ టి. ఆదినారాయణశ్రేష్ఠిగారు



శ్రీ యు. రామస్వామిఅయ్యరుగారు



శ్రీ యస్. ముత్తయ్యమొదలియారుగారు

## చెన్నపురి శాసనసభ - కాంగ్రెసు సభ్యులు



శ్రీ డాక్టరు తయాజుద్దీనుగారు



శ్రీ చీమలవాగుపల్లి నారాయణరెడ్డిగారు



శ్రీ
కందుల వీరరాఘవస్వామి
నాయుడుగారు



శ్రీ పి. సి. వెంకటపతిరాజుగారు



శ్రీ దండు నారాయణరాజుగారు



శ్రీ సి. వెంకటరంగంనాయడుగారు



శ్రీ యమ్. ఆర్. సేతురత్న అయ్యరుగారు



శ్రీ పి. యస్. ముత్తురంగముదలియారుగారు



శ్రీ యమ్. ఏ. మాణిక్యవేలునాయకర్ గారు

ఆంధ్రపత్రిక - సంవత్సరాదిసంచిక

చెన్నపురి శాసనసభ - కాంగ్రెసు సభ్యులు



శ్రీ సి. వి. వెంకటరమణయ్యంగారు



శ్రీ సామి వెంకటాచలం శ్రేష్ఠిగారు

ప్రభవ సం. చైత్ర శు. ౧ ఆదివారము



జనాబ్ కే. ఉప్పిసాహెబుగారు



శ్రీ జె. ఎ. సల్డానాగారు



జనాబ్ బషీర్ అహమదు సాహెబుగారు



జనాబ్ టి. కె. సైయద్ ఇబ్రహీంగారు

## చెన్నపురి శాసనసభ - కాంగ్రెసు సభ్యులు



శ్రీ మోతే నారాయణరావుగారు



శ్రీ చిన్నపడమల ఓబిరెడ్డిగారు



శ్రీ పి. విశ్వనాథదాసుగారు



శ్రీ పి. భక్తవత్సలనాయుడుగారు



డాక్టరు బి. యస్. మల్లయ్యగారు



శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు



శ్రీ బిక్కని వెంకటరత్నంగారు



శ్రీ సి. యస్. గోవిందరాజులు మొదలియారుగారు

మైన సులభసాధనము గావలసియున్నది. ఆ సులభసాధనము ఖద్దరురాట్నములందు గోచరంబగుచున్నది. ఖద్దరు ధారణము, రాటము స్వరాజ్యచిహ్నములుగ గ్రహింపబడుచున్నవి. ప్రజాసామాన్యమునకు స్వరాజ్యప్రయోజనము చేతలవలన గ్రాహ్యమైనటులు సిద్ధాంతముల మూలమున గ్రాహ్యము గాజాలదు. తంతుకారసంఘము ఖద్దరుమూలమున ప్రజలయందు స్వరాజ్యలక్ష్యమును వ్యాపింపజేయుచున్నవిధమును ఖద్దరువ్యాపనము తెలుపుచున్నది.

తంతుకారసంఘము

తంతుకారసంఘము ఖద్దరునిర్మాణవ్యాపనములకు వ్యవహారదక్షులను నియమించి, దూది నూలు నేత సాధనములను సంస్కరించుటకును, వృద్ధి చేయుటకును యత్నించుచున్నది. వివిధప్రాంతములందు 50,000 రాటములమీద నూలు తయారగుచు, సంవత్సరమునకు 16 లక్షల రూప్యముల ఖద్దరు తయారగుచున్నది. తంతుకారసంఘమునందు నూలుచందాను చెల్లించెడి సభ్యులసంఖ్య యభివృద్ధిని బొందుట లేదు. దేశమునందు 1925 వ సంవత్సరమునందు 337 బట్టలయంత్రములందు 200 కోట్లగజములబట్ట తయారైనను 82 కోట్ల రూప్యముల వస్త్రములు, నూలు మున్నగు దూదిసరకులు దిగుమతి చేయబడినవి. దూది యంత్రములందు సగుటున 3,67,877 మంది పనిచేయుచున్నారు. బట్టలయంత్రములు రెండురెట్లు పెరిగినను గ్రామవాసులకు జీవనోపాధిని గల్పించుటకును, స్వదేశవస్త్రములను సమకూర్చుటకును సరిపోవు. పనిపాటులు లేక గర్భదారిద్ర్యము ననుభవించుచున్నవారికి రాటము కామధేనువుగ నున్నది. ప్రజలయందు 100 కి 75 మందికి వ్యవసాయము జీవనోపాధియై వారు గ్రామసీమలందు నివసించుచున్నారు. దేశపరిస్థితుల నెరుగని సకలత్యాలాగారు చేసినయాక్షేపణలు నిరర్థకములు. కార్మికసంఘములు పారిశ్రామిక దేశములందువలె వ్యవసాయదేశములందు ప్రయోజనకరములు గావు. పురుషార్థమునకు త్యాగమువలె రాగభోగములు సాధనములు గావు. నాగరకత్వమునకు ధర్మాభ్యుదయము పరిమాణముగాని వాంఛాభ్యుదయము పరిమాణముగాదు. భగవద్గీతయందు దైవాసురసంపద్విభాగయోగమునందు

శ్లో. దైవీ సంప ద్విమోక్షాయ నిబంధా యాసురీ మతా,
మాశుచ స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ!

శ్లోకమునందు వ్యక్తముచేయబడినభావము జీవయాత్రయందు గాంధిమహాత్మునకును, సకలత్యాలాగారికిని గల లక్ష్యభేదమును విశదముచేయుచున్నది. సకలత్యాలాగారికి చార్వాకసిద్ధాంతములందు గల నమ్మకము భక్తియోగమునందు లేదు. పాశ్చాత్యవిజ్ఞానము వ్యాపింపజేయుచున్న యంత్రాలయములు సంపన్నులకును, కార్మికులకును వైరమును వృద్ధిచేయుచు, మహాసంక్షోభమును గలుగజేయుచున్నవి. సంపన్నులకును, కార్మికులకును సాహచర్యము సమాధానము మానవ వికాసమునకు ప్రయోజనకరములు గాని సంరంభము ప్రయోజనకరము కాదు. యంత్రములు మానవులను దాసులను చేయుటకు బదులు మానవులకు దాస్యముచేయుట ధర్మము. యంత్రయుగమునందు యంత్రములను నిర్మూలముచేయుటయసాధ్యమైనను యంత్రములవాడుకయందు మానవలక్ష్యము పరిగణించుట పురుషార్థమునకు ప్రయోజనకరము. ప్రపంచప్రవృత్తియందు భౌతికాధ్యాత్మికధర్మములకు జరుగుచున్న సంరంభములందు మానవలక్ష్యమును ఆధ్యాత్మికపరము చేయుటకు గాంధి మహాత్ముడు చేయుచున్న హితోపదేశములు ప్రపంచాదరణమును క్రమముగ బడయుచున్నవి. ప్రపంచమున భిన్నావస్థలయందు దుఃఖవేదన ననుభవించుచున్న ప్రజలకు సుఖసాధనముల నుపదేశించెడి మానవులు స్వీయసంస్కారావరణము నతిక్రమించి విశ్వావరణమును సందర్శించి మహాత్ములగుచున్నారు. మానవకల్యాణలక్ష్యము గల సహాయనిరాకరణోద్యమము దురారాధ్యమై ఫలప్రదము గాకపోయినను ధర్మనాశనమునకు గాక ధర్మాభ్యుదయమునకు వినియోగపడుచున్నది.

**సహాయ నిరాకరణోద్యమము**

అహింసాధారభూత మైన సహాయనిరాకరణో
ద్యమ మసిధారావ్రతము వలెను దురారాధ్యముగ
నున్నది. గాంధిమహాత్ముడు చేసిన
బార్డోలినిర్ణయము దురభిప్రాయము
లకు మూలమైనను ధర్మనిర్ణయ
ముగ నున్నది. త్రికరణశుద్ధిగ నహింసాధర్మమును
గ్రహింపనివారలు సహాయనిరాకరణతత్త్వమును గ్ర
హింపజాలరు. సహాయనిరాకరణోద్యమము క్షీణించు
టకు గారణము ప్రజలయజ్ఞానముగాని ధర్మలక్ష్యలోపము
గాదు. అజ్ఞానులు ధర్మలక్ష్యమును విస్మరించి దౌర్జన్యము
లకు బూనినపుడు గాంధిమహాత్ముడు నిర్భయముగ
నుద్యమవిరామమును ప్రకటించి ధర్మ సంరక్షణమును
జేయగలిగెను. దేశవ్యవహారములును మహాత్ముని యాచ
రణమును సమర్థించుచున్నవి. శాసనసభల బహిష్కరణ
ముతో నారంభమైన సహాయనిరాకరణోద్యమము శాసన
సభల ప్రవేశమునందు బరిణమించినది. దేశబంధు దాసు
గా రుపక్రమించిన ప్రతిష్టంభము యథోచితసహకార
ముగ మారినది. యథోచితసహకారము క్రమముగ
సహకారముగ మారుచున్నది. శాసనసభయందు సహ
కారనిరాకరణములకు హద్దులను నిర్ణయించుట దుస్త
రము. స్వరాజ్యపక్ష ముపక్రమించిన శాసనసభాప్రవేశ
మును కాంగ్రెసుపక్ష మామోదించినది. శాసనసభల
యందు కాంగ్రెసు సభ్యులప్రవేశము సహాయనిరాకర
ణోద్యమమును నిరర్థకము చేసినది. ఎన్నికల ఫలము
కాంగ్రెసుపలుకుబడిని దెలుపుచున్నను కాంగ్రెసు లక్ష్య
మును పాడుచేసినది. ప్రజలలక్ష్యము విశాలమైన స్వరా
జ్యమునుండి స్వల్పము లైన స్థానికప్రయోజనములకు
మరలి విన్నపముల విధానము తిరిగి ప్రబలినది. విద్యా
వంతులలక్ష్యము స్వయంసహాయమార్గమును విడిచి ప్రభు
త్వాధికారులు కోరునటులు ప్రభుత్వావలంబనమార్గ
ము నందు లగ్నమై, నిస్సహాయస్థితిని జెందినది. రీడింగు
ప్రభువు, బర్కెనుహెడుప్రభువు, ఇర్విను ప్రభువు శాసన
సభావ్యవహారములు వివేకోదయమునకు నిదర్శనములని
యానందించుచున్నారు. కాంగ్రెసుసంస్థలకు గలిగిన నిస్స
హాయస్థితి శాసనసభలనిరుపయోగమును చాటుచున్నది.
శాసనసభలు స్వరాజ్యసాధనములు గావని చాటుచు,
నాయకులందఱును శాసనసభలయందు జేరి వాదప్రతి
వాదములతో గాలయాపనము జేయుచున్నారు.

కాంగ్రెసునాయకులయం దేర్పడిన భేదాభిప్రాయ
ములు ఎన్నికలయందు కాంగ్రెసుబలమును చెడగొట్టినవి.

**సామ్రాజ్య శాసనసభ**

లజపతిరాయి, నెహ్రూగారులు ప్రకటించిన
యాగ్రహపూరితము లైన భావములు
కాంగ్రెసు ప్రతిభకు కళంకమును గలుగ
జేసినవి. హిందూమహమ్మదీయవిభేదములు కాంగ్రెసు
బలమును తగ్గించినవి. సామ్రాజ్యశాసనసభయందు శ్రీని
వాసయ్యంగారు నెహ్రూగారులు కాంగ్రెసుపక్షమును, లజ
పతిరాయి, మాలవ్యా, జయకరుగారులు జాతీయపక్షమును,
జిన్నాగారు స్వతంత్రపక్షమునునడపుచు, పరస్పరసంయో
గము లేక నిరంకుశవర్గమునకు పోషణము నొసంగుచు,
దౌర్భాగ్యస్థితిని విశదముచేయుచున్నారు. ఆర్థికస్థితికి బీజ
ములైన మారకపుపరిమాణశాసనమును, ఉక్కుసంర
క్షణశాసనమును స్వతంత్రపక్షసహాయముతో ప్రభుత్వము
నెగ్గించినది. నిర్బంధితుల విమోచనము, సైన్యవ్యయము,
రైల్వేబోర్డు, రైల్వేస్టోర్సు మొదలగువిషయములందు ప్ర
భుత్వ మోడిపోయినది. కాంగ్రెసుపక్షము బడ్జెటును నిరా
కరింపజాలక ప్రతినిధుల విభేదములను విశదము చేసి
నది. భారతీయుల కోడుటయును, గెలుచుటయును
సమాన ప్రయోజనమును గలుగజేయుచున్నవి. భారతీ
యులహృదయము నావరించిన పరమవిషాదమును జయ
కరుగారి సంభాషణము వ్యక్తముచేసినది. "నిరంకుశ
దేవతలను ప్రసన్నులను జేయుట దుర్లభము. మా రా
జ్యాంగతీర్థయాత్ర నిరర్థకముగ నున్నది. భారతీయుల
హృదయములందు నిరాశ జనించినది. నిరాశ పుట్టినపుడు
పరమదుర్బలులకును పట్టరానియాగ్రహముగలుగగలదు.
గత్యంతరము గనబడనపుడు వేఱుమార్గము శరణ్యము
గాగలదు." అని పరమసాధువైన జయకరుగారు తెలిపి

నపుడు ప్రజాహృదయమునందు గలిగిననిరాశ విశదమగు చున్నది. జయకరుగారు సహాయనిరాకరణోద్యమము నందు జేరిరి. తదనంతరము స్వరాజ్య పక్షమునందును, ఇపుడు యథోచితసహకారపక్షమునందును జేరి ఆ సహకారమార్గమునవలంబించుచున్నారు. ఇంతకన్నను పాదాక్రాంతులు గాగలవిధమును బర్కేనుహెడు ప్రభువు వ్యక్తముచేసిన బాగుండును. బర్కేనుహెడు ప్రభువునావరించినసామ్రాజ్యదురభిమానమును వారి ప్రసంగములు విశదము చేయుచున్నవి. భారత రాజ్యాంగసమస్యను బర్కేనుహెడు ప్రభువు సమాలోచన చేయుచున్న విధమును వారివిశ్రాంతి, దేశసంచారము, ప్రసంగములు విశదము చేయుచున్నవి. బర్కేనుహెడు ప్రభువుగారి మాటలతో భారతీయులకడుపు నిండకపోయినను పత్రికలునిండుచున్నవి. సర్ అలెగ్జాండరు మూడిమనుగారు వారి నిస్సహాయస్థితి నంగీకరించుచున్నారు. బ్లాకెటు మూడిమనుగారులు స్వార్థపరాయణులను వశంవదులను జేసికొని, బొమ్మలనువలె నాడించుట రాజ్యాంగముల దుర్దశను తెలుపుచున్నది. ఆత్మగౌరవము గల భారతీయులు శాసనసభలయందు కీలుబొమ్మలవలె నాడజాలరని జిన్నా, జయకరు, శ్రీనివాసయ్యంగారు, లాలాజీగారల ప్రసంగములు విశదముచేసినవి. నిరంకుశవర్గము తెగువజూపును బిగబట్టక రాజ్యాంగ సంస్కరణముల విమర్శనమునకు బూనుకొనుట వివేకము. అట్టియాశ లడియాసలని బర్కేనుహెడు ప్రభువు మూడిమనుగారులు తెలిపినభావములును, లండను విలేఖరులు వ్రాసెడివ్రాతలును విశదము చేయుచున్నవి. సంస్కరణవిచారణసంఘము 1929 వఱకును నియమింపబడనియెడల రాజ్యాధికారులమాటలు బూటకము లనియును, శాసనసభావ్యవహారములు ప్రహసనములనియును విస్పష్టము గాగలదు. నాయకులు వారి శక్తిసామర్థ్యములను అరణ్యరోదనమునకు వినియోగింపక గాంధిమహాత్మునివలె ప్రజాసేవకై వినియోగించుట యాత్మగౌరవమునకును స్వరాజ్యమునకును సాధనము గాగలదు.

శ్రీరీడింగు ప్రభువుయొక్క నిర్గమనముతో న్యాయవాదివాదములు గంభీరోపన్యాసములు తగ్గినవి. రీడింగు ప్రభువుయొక్క పరిపాలనమునందు దేశమునకు నిర్బంధఫలములు ఫలించినవి గాని స్వాతంత్ర్యఫలములు లభింపలేదు. గతసంవత్సరము ఏప్రిలుమాసమునందు ఇర్విను ప్రభువు గవర్నరు-జనరలు పదవిని స్వీకరించిరి.

ఇర్విన్ ప్రభువు

ఇర్విను ప్రభువు రీడింగు ప్రభువువలె దంభోక్తులను ప్రకటింపక సాధుస్వభావమును వారిసంభాషణములయందు విశదముచేయుచు ప్రశంసలకు పాత్రులగుచున్నారు. ఇర్విను ప్రభువు శ్వేతభవనమునందు గల దేవతలబలమును దాపరికములేక అంగీకరించుచున్నారు. బర్కేనుహెడ్డు ప్రభుదేవతను గాని, భారత ప్రభుత్వమునందుగల యుపదేవతలనుగాని ప్రసన్నులను జేయుట దుస్తరమని ఇర్విను ప్రభువు గ్రహించినట్లుగా వారి ప్రసంగములు విశదము చేయుచున్నవి. దేశమునందు హెచ్చుపెరిగినసాంఘికకులభేదములను నిరసించుచు రాజప్రతినిధి చేసిన హితోపదేశములు ప్రశంసనీయములుగనున్నవి. హిందూమహమ్మదీయ విజ్ఞాపనములకు, బ్రాహ్మణేతర ప్రయోజనములకు, యూరపియనుసంఘపు విన్నపములకు, మహారాజుల సన్మానపత్రములకు ఇర్విను ప్రభువు చేసినహితోపదేశములు ధర్మబద్ధములై, దేశారాధనవిధానమును విశదము చేసినవి. హిందూమహమ్మదీయవిభేదములు గతసంవత్సరమునందు విపరీతాకారమును దాల్చినను ఇర్విను ప్రభువు సాంఘిక ప్రయోజనములను, స్వార్థప్రయోజనములను సంతరింపజేయుటకు జేయుచున్న ప్రయత్నములు ఫలోన్ముఖము లగుచున్నవి. బహుళప్రయోజనములకును వివిధజాతి మతములకును నిలయమైన దేశమునందు సకలజనులును, వివిధసంఘములును వారి స్వప్రయోజనములను దేశార్పణమునకు వినియోగింపవలసిన యవసరమును గ్రహించుట దేశమోక్షమునకు పరమసాధనముగనున్నది. ఇర్విను ప్రభువువారి ప్రజ్ఞాధికారముల నీమహాత్కార్యమును సాధించుటకైనను వినియోగించి వారి యధికారమును సార్థకముచేయుదురు గాక!

ద్వంద్వప్రభుత్వము శాసనసభలు మంత్రిపదవులు హిందూమహమ్మదీయవిభేదములను విస్తరింపజేసిన వని మూడిమనుగారు సయితమంగీకరించుచున్నారు.

హిందూమహమ్మదీయ సంయోగము

మోంటుఫర్డు సంస్కరణవిధానము హిందూ మహమ్మదీయులప్రాతినిధ్యమును లక్నోయొడంబడిక ననుసరించి నిర్ణయించినది. మహమ్మదీయులకు ప్రత్యేకనియోజకవర్గము నేర్పాటుచేసి సాంఘికవిభేదములను స్థిరతరము చేసినది. ఉత్తరదేశమునందు హిందువులు మహమ్మదీయులు దేశక్షేమమును మాటుపఱచి స్వీయసంఘప్రాబల్యమునకు పెనగులాడుచున్నారు. రాష్ట్రీయసభలయందును, సామ్రాజ్యసభయందును హిందూమహమ్మదీయుల ప్రాతినిధ్యపరిమాణమును తిరిగి నిర్ణయింపవలసిన యవసర మేర్పడినది. జనపరిమాణమునుబట్టి ప్రాతినిధ్యమును నిర్ణయించుట ధర్మమైనను అవసరమునుబట్టి హెచ్చుతగ్గులు గలుగవచ్చును. ఢిల్లీయందు మార్చి 20వ తేదిని గూడిన మహమ్మదీయనాయకులు కొన్ని షరతులతో సామాన్య నియోజకవర్గము నంగీకరించుట శుభసూచకముగ నున్నది. సింధురాష్ట్రనిర్మాణమును, పశ్చిమోత్తరసీమాంత రాష్ట్రములందు సంస్కరణప్రవేశమును, సామ్రాజ్యశాసన సభయందు మూడవవంతు ప్రతినిధులను జనాభా ననుసరించి ప్రాతినిధ్యమును మహమ్మదీయనాయకులు కోరిరి. కాంగ్రెసునాయకులును హిందూ సభానాయకులును మహమ్మదీయుల నిర్ణయముల నామోదించుచు సామాన్య నియోజకవర్గమును స్థాపించి భారతజాతీయనిర్మాణమును సార్థకము చేయుట కంగీకరించుచున్నారు. ఈపనిని నిర్వహించుట కేర్పడిన సరోజినిదేవి, మహమ్మదాలి, శ్రీనివాసయ్యంగారు, మోతీలాలు నెహ్రూగారులు సమదృష్టితో హిందూ మహమ్మదీయుల ప్రయోజనములను నిర్ణయించి ధర్మసంవర్ధనమునకు దోడ్పడుదురు గాత! బ్రాహ్మణేతర నాయకులును మహమ్మదీయ నాయకుల మార్గము నవలంబించి స్వసంఘారాధనమును, దేశారాధనమును యథార్థముగను జేయుదురు గాత!

రాజ్యాదాయము 81 కోట్లరూప్యములనుండి 133 కోట్ల రూప్యములకును, వ్యయము 77 కోట్లనుండి 130 కోట్లకును 12 ఏండ్లలో పెరిగినవి.

దేశాదాయ వ్యయములు

వ్యయమునందు 60 కోట్లు సైన్యమునకు వ్యయ మగుచున్నది. సైన్యవ్యయము 12 ఏండ్లయందు రెట్టింపు పెరిగినది. సైనికులందు బ్రిటీషుసైనికులు 58,614, భారతీయసైనికులు 1,34,742 గలరు. సైన్యమునందు భారతీయులసంఖ్య బ్రిటీషుసైనికుల సంఖ్యకు రెట్టింపున్నను వ్యయము బ్రిటీషు సైనికులకు రెట్టింపగుచున్నది. ఐరోపా సంగ్రామసమయమునందు 14,57,000 భారతీయులు సైనికులుగను పరిచారకులుగను పనిచేసి భారతీయులకు సహజమైన శౌర్యప్రతాపములను వ్యక్తముచేసిరి. మహాసంగ్రామసమయమునందు పనికివచ్చిన భారతీయులు స్వదేశసంరక్షణమున కేల పనికిరారో తెలియకున్నది. దేశసంరక్షణమునకు సైన్య మవసరమని కేకలు వేసెడి యధికారులు భారతీయసైనికుల నేల తయారుచేయరో తెలియకున్నది. ఒక మనిషినిగాని ఒకరూపాయిని గాని తగ్గించుటకు వీలు లేదని సేనాధ్యక్షుడు తెలుపుచున్నాడు. సైనికులసంఖ్యను తగ్గింపకపోయినను బ్రిటీషుసైనికులసంఖ్యను తగ్గించుటకు వీలున్నపుడు దాని నేలచేయగూడదో తెలియకున్నది. సైన్యస్థితి యిటులున్నపుడు నౌకాదళస్థితిని వాయుబలస్థితిని యోచింపవలసిన యవసరము గనుపట్టదు. సైన్యవ్యయమును చర్చించునపుడు భారతీయనాయకులు చేసిన ప్రసంగములు భారతీయుల నిస్సహాయస్థితిని విశదము చేసినవి. మాఱశపుగారడిని చేసి సర్ బేసిలు బ్లాకటుగారు రాష్ట్రీయ దత్తాంశములను తొలగించి కలుగజేసిన సంతృప్తి కృత్రిమము గాని యథార్థము గాదు. దేశమునకు తీఱని నష్టమును గలుగజేయుచు రాష్ట్రీయుల కప్పములను తగ్గించుట నిరర్థకము.

స్వదేశమునందు స్వాతంత్ర్యము, గౌరవము లేని భారతీయులకు పరదేశములందు గౌరవము, స్వాతంత్ర్య

పరదేశస్థ భారతీయులు

ము గలుగజాలవు. యూరపియనులు వారి గనులను, భూములను, తోటలను బాగు చేయించుకొనుటకు భారతీయులను వలస రాజ్యములకు గొనిపోయి వారిని నిర్బంధములపాలుచేయు చున్నారు. బ్రిటీషు వలసరాజ్యములందు 20,31,241 మందియును, నితరదేశములందు 1,00,525 మందియును భారతీయులు నివసించుచున్నారు. వలస రాజ్యములందు యూరపియనులకుగల పౌరత్వస్వత్వములు భారతీయులకు లేకపోవుటయె కాక మిాదుమిక్కిలి నిర్బంధములు గల్పింపబడుచున్నవి. దక్షిణాఫ్రికాయందు నివసించుచున్న 1,60,000 భారతీయులు దుర్భరమైన నిర్బంధముల ననుభవించుచున్న విధమును గాంధిమహాత్ముని దక్షిణాఫ్రికా సత్యాగ్రహము విశదముచేసినది. గతసంవత్సరమునందు దక్షిణాఫ్రికాయందు భారతీయసమస్యను నిర్ణయించుటకు హబీబుల్లారాయబారము చేసిన యొడంబడిక సంతృప్తిని గలుగజేయజాలకున్నను పరిమిత పరిస్థితులందు మహాత్ముని యామోదమువలెను ప్రజామోదమును బడసినది. శ్వేతాభిమానులు మాలనుగారిని నిందించుటయును యొడంబడికను నిరసించుటయును రాయబారుల కష్టములను విశదముచేయుచున్నవి. ఒడంబడిక యుద్దేశము భారతీయులను వెడలగొట్టుటగాని వారి ప్రతిబంధకములను తొలగించుట కాదు. నల్లవారిని తెల్లవారివలె జీవయాత్రను గడపుటకు శిక్షించుట యసాధ్యము. నల్లవారికి తెల్లవారికిగల విద్యాసౌకర్యములు గల్పించుటయును దుర్లభము. దక్షిణాఫ్రికానుండి వెడలినవారు మూడేండ్లలోపల తిరిగి వచ్చుటకు వీలున్నను ద్రవ్యాభావముచే సాధ్యము కాదు. ఆఫ్రికాప్రభుత్వమును, భారతప్రభుత్వమును భారతీయుల విద్యాభివృద్ధికి జేసెడి ప్రయత్నములును విశేషవ్యాపకమును గలిగియుండజాలవు. ఆఫ్రికాయందు రాయబారిని నియమించుటవలన విశేషలాభము గలుగజాలదు. ఆఫ్రికాయందు చిరకాలమునుండియును నివసించుచు దేశాభివృద్ధికి పాటుపడిన భారతీయులకు పౌరత్వస్వత్వముల నొసంగుట పరమధర్మముగ నున్నను శ్వేతజాత్యభిమానము ప్రతిబంధకముగనున్నది. దక్షిణాఫ్రికాయందు అనుభవించుచున్న నిర్బంధములనే మలయా, సింహళము, బ్రిటీషుగయానా, ఫిజీద్వీపములు, కెనియా మొదలగు ప్రదేశములందును భారతీయు లనుభవించుచున్నారు. పరాధీనస్థితియందున్న భారతీయులు పరదేశవాసులైన స్వదేశస్థులకు సహాయము చేయుటకు శక్తిసామర్థ్యములు లేక పరితపించుచున్నారు. భారతీయుల సహాయమును బొంది బాగుపడిన బ్రిటీషుద్వీపములును, వలసరాజ్యములును న్యాయమార్గము నవలంబించుటకు పూనుకొనజాలకున్నవి. భారతీయులకు స్వరాజ్యము గలుగనంతవఱకును స్వదేశమునందును, పరదేశములందును నిర్బంధము లనుభవించుట విధికృతముగ నున్నది. దక్షిణాఫ్రికా రాయబారమును యథాశక్తిని సఫలముచేసిన శ్రీనివాసశాస్త్రిగారు, హబీబుల్లా సాహేబుగారు మొదలగువారు ప్రజలకృతజ్ఞతకు పాత్రులు. ఆఫ్రికాయందలిభారతీయుల క్షేమమునకు నిరంతరము కృషిచేసిన ఆండ్రూసుగారు ధన్యులు. భారతీయసమస్యలను ఏప్రాంతములం దవలోకించినను నిరాశ గలుగుచున్నది గాని సదాశ గలుగుట లేదు.

చెన్నరాష్ట్రీయ

సామ్రాజ్యశాసనసభయందు సంప్రాప్తమగుచున్న నిస్సహాయస్థితియే రాష్ట్రీయ సభలయందును ప్రత్యక్షమగుచున్నది. వంగరాష్ట్రీసభయందు నిర్బంధితుల విమోచనము విషయమై చేసినతీర్మానము నిరర్థకముగ నున్నది. వివిధరాష్ట్రీయములందు ప్రభుత్వములకు కొన్ని సందర్భములందు పరాజయము గలిగినను ద్వంద్వప్రభుత్వము నిరభ్యంతరముగ సాగుచున్నది. గౌహతికాంగ్రెసు ద్వంద్వప్రభుత్వమును నిర్మూలము చేయవలయునని నిర్ణయించినది. కాంగ్రెసు పక్షము మంత్రిపదవులను నిరాకరింపవలయు ననియును, మంత్రివర్గ మేర్పడకుండ జేయవలయుననియును నిర్ణయించినది. కాంగ్రెసుపక్షము వంగ, మద్రాసు రాష్ట్రములందు మంత్రివర్గము నేర్పాటుచేయుటకు నిరాకరించినను మంత్రు లేర్పడి పనిచేయుచున్నారు. అన్ని రాష్ట్రములందును మంత్రి

వర్గము లేర్పడి పనిజేయుచున్నవి. ఎన్నికలయందు కాంగ్రెసుపక్షమునకు కొంతవిజయము గలిగినను ప్రతిష్టంభమును జేయుటకు దగినంతబలము లేకున్నది. చెన్నరాష్ట్ర శాసనసభయం దారంభమునందు '46 కాంగ్రెసు సభ్యులున్నను వారిసంఖ్య క్రమముగ తగ్గుచున్నది. చెన్నరాష్ట్ర శాసనసభయందు గల 132 సభ్యులందును కాంగ్రెసు పక్షమువారు 41, జస్టిసు పక్షమువారు 16, స్వతంత్రపక్షమువారు 14, ప్రభుత్వపక్షావలంబనులు 61 మందియును గలరు. ప్రభుత్వేతరపక్షములందు స్వల్పపక్షమైన స్వతంత్రపక్షము మంత్రివర్గము నేర్పాటుచేయుట విచిత్రముగ నున్నది. ఇట్టి విచిత్రస్థితికి జస్టిసుపక్షము గలుగజేసిన బీభత్సము గారణముగ నున్నది. పానుగల్లు ప్రభుత్వ మాత్రేండ్లయందు జేసినబీభత్సము ద్వంద్వప్రభుత్వమును మించిన భయభ్రాంతులను గలుగజేసినది. జస్టిసు పక్షము కాంగ్రెసునిర్బంధముల కభయము నొసంగినది; ఖద్దరును నిరసించినది; గాంధిమహాత్ముని పరిహసించినది; కులాభిమానమును పెంచినది; అధికారపిశాచము నుచ్ఛిష్ట సాధనములతో నారాధించినది; స్థానికసంస్థలను కులాభిమానదుర్గములను జేసి పరిహాసపాత్రములను జేసినది. స్వార్థారాధకులకు దుస్తంత్రములు సహజము లైనను ప్రజలు తంత్రములను సహింపజాలరు. ప్రజాహృదయమునందు ధర్మదేవత సూక్ష్మరూపమున నుపస్థితయైయున్నను, ఆవాహన చేయబడినపుడు భయంకరాకృతిని దాల్చి ప్రత్యక్షమగుచుండును. నిరంకుశత్వము అస్థిరమైన భాగ్యభోగాధికారవ్యామోహమునందు మునిగి తేలుచు, స్థిరమైన ధర్మవిసర్జనము చేయుచు, దుఃఖభూయిష్ఠ మగుచున్నది. అధికారలాభమున కాత్మగౌరవమును విడిచి నిరంకుశవర్గమునకు సమయాసమయములు లేక జయమంగళములను పాడిన జస్టిసుపక్షమునకు ఎన్నికలయందు సహజముగ ప్రజలు మంగళములను పాడి జ్ఞానోపదేశమును జేసిరి. బ్రాహ్మణేతరుల నుద్ధరించుటకు దీక్షను బూనిన బ్రాహ్మణేతరనాయకులు బ్రాహ్మణేతరసంఘములందు సంక్షోభమును గలుగజేసి జస్టిసు పక్షాశయములను స్వరాజ్యప్రస్థానమును దుస్తరము చేసిరి. పరాజయానంతరము జస్టిసుపక్ష మవలంబించుచున్న వ్యవహారక్రమము ప్రజాహృదయమునందు విశ్వాసమును గలుగజేయజాలదు. అధికారకాలమునందు ఖద్దరుపేరునే పరిహసించిన మంత్రులు ఖద్దరునిధికి ద్రవ్యము నిచ్చియును ఖద్దరు తీర్మానమును జేసియును ప్రజలను వంచింపజాలరు. ద్వంద్వప్రభుత్వమును కొనియాడి సేవించిన మంత్రులు ద్వంద్వప్రభుత్వసంహారమునకు దోడ్పడుట విశ్వాసపాత్రము గాదు. ప్రధానమంత్రిత్వమును వహించి యారేండ్లవిచ్ఛిన్నముగ నధికారలాభమునుబొందిన పానుగల్లురాజాగారిసిద్ధాంతాచరణములను ప్రజలు విస్మరింపజాలరు. ప్రజలసంస్తవములను బడసిన హైందవ న్యాయవిచారణ కర్తలమీద పానుగల్లు రాజాగా రారోపించిన దోషములు రాజాగారి యాశాభంగమును దెలుపుచున్నవి గాని యథార్థస్థితిని దెలుపుటలేదు. మునిస్వామినాయుడుగారు ప్రతిపాదించిన విశ్వాసరాహిత్యతీర్మానమును జస్టిసుపక్షమువారుచేసిన ప్రసంగములును నక్క-ద్రాక్షపండ్లకథను బోలియున్నవి. శాసనసభయందు జస్టిసు పక్షమునకును, కాంగ్రెసుపక్షమునకును సంయోగము ధర్మాధర్మములకు సంయోగమువలె నుండగలదు. చెన్నరాష్ట్రశాసనసభయందు కాంగ్రెసుపక్షము పూనిన నిరపేక్షా విధానమునకు జస్టిసుపక్షము గారణముగనున్నది. కాంగ్రెసుపక్షము గౌహతితీర్మానమున కనురూపముగ లాభాలాభములతో నిమిత్తములేక మంత్రుల నిర్గమనమును చేయుట ధర్మముగ నున్నది. కాంగ్రెసుపక్ష మవలంబింప దలచిన రాజ్యాంగవిధానమును పక్షనాయకుడు సామి వెంకటాచలము శ్రేష్ఠిగారు విశదముచేసిరి. కాంగ్రెసు అధికారులకు కాంగ్రెసునిర్ణయముల నాచరణమునందు బెట్టుటకు గల యవకాశాధికారములు సంకుచితముగ నున్నవి. సహాయనిరాకరణోద్య మారంభమునందు కాంగ్రెసునకు గలిగిన నైతికార్థికబలము లంతఃకలహములమూలమునను క్షీణించినవి. అంతరంగమునందు యథోచితసహకారము బాహ్యమునందు సహాయనిరాకరణము సంరంభ

ముసకు సాధనము లగుచున్నవి గాని కార్యసిద్ధికి సాధనము లగుటలేదు. శాసనసభా ప్రవేశముతో సహాయనిరాకరణము రూపపరిణామమును బొందినది. కాంగ్రెసు ప్రాబల్యము తగ్గి తిరిగి శాసనసభల ప్రాబల్యము హెచ్చినది. కాంగ్రెసుఅధ్యక్షుడు, కార్యదర్శి, శాసనసభాసభ్యులు శాసనసభలను నిరసించుచున్నను, వారి లక్ష్యము శాసనసభలయందు లగ్నమగుచున్నవిధమున కాంగ్రెసునందు లగ్నము గాజాలదు. కాంగ్రెసు తిరిగి మూడునాళ్ల ముచ్చటగను పరిణమించుచున్నది. శాసనసభ్యులను సమావేశముచేసి కన్వెన్షను పార్లమెంటును స్థాపించుటకు శ్రీనివాసయ్యంగారు చేయదలచిన ప్రయత్నములును శాసనసభల ప్రాబల్యమును విశదము చేయుచున్నవి. శ్రీమతి బెజంటుగారి కన్వెన్షను పార్లమెంటు నాక్షేపించిన నాయకులు తిరిగి ఆమార్గము నవలంబించుట విచిత్రము. అఖిలభారత కాంగ్రెసుకమిటి ప్రతిభ యంతరించుచున్నది. శాసనసభల వ్యవహారములను నిర్ణయించుటకుసభాధ్యక్షులు కార్యదర్శి కాంగ్రెసుకమిటీని సమావేశము చేయలేదు. చెన్నరాష్ట్ర శాసనసభయందు కాంగ్రెసుపక్ష మవలంబించిన తటస్థభావమును శాసనసభా ప్రాబల్యమును విశదము చేసినది. కాంగ్రెసునాయకులు ద్రావిడ ప్రాణాయామమును విడిచి యథార్థస్థితిని నిర్ణయించుట ధర్మముగ నున్నది. అఖిలభారతజాతీయమహాసంఘము వెంటనే కూడి గౌహతితీర్మానమునకును, శాసనసభావ్యవహారములకును గల సంబంధమును నిర్ణయించి సంశయ విచ్ఛేదమును జేయుట యవసరమై యున్నది. ఈకార్యమును వెంటనే నిర్ణయించి భేదాభిప్రాయములను అంతఃకలహములను నాపి కాంగ్రెసుప్రతిష్ఠను గాపాడుట కాంగ్రెసుఅధ్యక్షుని ధర్మముగ నున్నది.

చెన్నరాష్ట్ర శాసనసభ

చెన్నరాష్ట్రాదాయమున 1925-26 సంవత్సరములందు రూ. 16,92,95,536 రాష్ట్రాదాయము, రూ. 11,62,00,385 కేంద్రప్రభుత్వాదాయము సమకూడినది. వ్యయము రాష్ట్రమునకు రూ. 13,72,07,303, కేంద్రప్రభుత్వమునకు రూ. 2,88,69,135 చేయబడినది. ఆదాయమునం దరణ్యాదాయము తగ్గినను మిగిలిన శాఖల యాదాయము పెరిగినది. మద్యాదాయము 490 లక్షల నుండి 494 లక్షలకు పెరిగినది. ఎన్నికల సందర్భమునందు మద్యపాన నిషేధమును కాంగ్రెసు అభ్యర్థులు బోధించిరి. ఆబోధల కనురూపమైన యాచరణమునకు కాంగ్రెసు సభ్యులు పూనుకొనకుండుట యన్యాయము. అభివృద్ధిశాఖయందు గతసంవత్సరమున విశేషమైన పని జరిగియుండలేదు. వర్తమాన సంవత్సరమునందు శాఖామంత్రి రంగనాథము మొదలియారుగారు చేతిపనులు, గృహపరిశ్రమలు వృద్ధిబొందదగిన సాధనముల నన్వేషించుట కధికారిని నిర్ణయించిరి. ఆయధికారి వెంటనే పనిని పూర్తిచేసి కార్యానుకూలము చేయునని నమ్ముచున్నాము. రంగనాథము మొదలియాగారు రెడ్డినాయుడుగారివలె రాటమును నిరసింపకుండుట ప్రశంసనీయమైనను కార్యనిర్వహణమునందు సాహసధైర్యములను జూపుదురని నమ్ముచున్నాము. కేంద్రప్రభుత్వము 348 లక్షల రూప్యములను త్రోసివేసినందున నభివృద్ధి శాఖలకు వ్యయమును జేయుటకు గల యవకాశములను మంత్రులు సార్థకము చేయుదురుగాక! శాసనసభ గ్రామోద్యోగుల జీతములను హెచ్చించి చిరకాలమునుండియును వారు చేయుచున్న న్యాయమైన విన్నపమును సఫలము చేసినది. శాసనసభకు శ్రీమతి ముత్తులక్ష్మమ్మగారిని నియమించుటయును, నామెను నుపాధ్యక్షపదవి కేకగ్రీవముగ నెన్నుకొనుటయును స్త్రీలస్వాతంత్ర్యాభ్యుదయమును వెల్లడిచేయుచున్నవి.

ఆంధ్రోద్యమము

ఆంధ్రోద్యమారంభమున నీయుద్యమముపట్ల నెట్టి యపోహలు గలిగినను దేశమంతయును నీయుద్యమ తత్త్వము నిపుడు గ్రహించుట సత్యప్రకాశమునకు లక్ష్యముగ నున్నది. బాపట్లయందుగూడిన నాయకాగ్రేసరుల ప్రతిఘటనమును, నేటి నాయకుల సానుభూతిని సంస్మరించు

నపుడు మహోద్యమ నిర్వాహణమునందుగల కష్టములు
విశదమగుచున్నవి. ప్రథమాంధ్రమహాసభ కధ్యక్షులుగ
నున్న సర్ బయ్యా నరసింహేశ్వర శర్మగారు ప్రభుత్వ
సంస్కారమునుబొంది ఆకాలము నందుపిలెనే లాభ
నష్టములను గణనము చేయుచు జీవయాత్రను చేయు
చున్నారు. ఆహ్వానసంఘాధ్యక్షులుగ నుండిన దేశభక్త
కొండ వేంకటప్పయ్యపంతులుగారు గాంధి సంస్కారమును
బొంది త్యాగపరాయణులై దేశసేవను శేయుచున్నారు.
ఆంధ్రోద్యమాదర్శములు సంస్కారభేదమువలన నవరో
ధమును పొందుచున్నను పురోగమనము చేయుచున్నవి.
భౌతికాధ్యాత్మికములు, భోగత్యాగములు, రాగవిరాగ
ములు, స్వధర్మపరధర్మములు, స్వదేశపరదేశములు, పా
శ్చాత్య ప్రాచ్యసంస్కారములు జీవయాత్రయందు గలుగ
జేయుచున్న సంక్షోభము నవజీవనసంభావనను విశదము
చేయుచున్నవి. భరతఖండమునందు ప్రాచ్యపాశ్చాత్య
సంస్కారములకు గలిగిన సంసర్గ మనర్ఘఫలమును సమ
కూర్చుచున్నది. చిరకాలము పరాధీన వ్యామోహము
నందు లగ్నమైన ప్రజాహృదయమునందు ప్రబోధోదయ
ము గలిగినది. ప్రబోధోదయకాంతులు సర్వత్ర వ్యాపించి
నవవికాసమును గలుగజేసినవి. ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞాన
ముల సంయోగసాహచర్యముల కవకాశము గలిగినది.
కర్మయోగ జ్ఞానయోగముల ఏకస్వభావము విశదమైనది.
గాంధి రవీంద్రనాధులు, వివేకానంద జగదీశచంద్ర
బోసులు, విద్యాసాగర రామకృష్ణ పరమహంసలు, వీరేశ
లింగము హనుమంతరావులు, రాధాకృష్ణయ్య ముకర్జులు,
అవనీంద్రనాథ తాతాలు వెలసి జాతీయప్రత్యభిజ్ఞానమును
పరిస్ఫుటము చేసిరి. దేశావృతమైన ప్రత్యభిజ్ఞాన మాం
ధ్రోద్యమమునకు బీజముగ నున్నది.

భారత జాతీయేతిహాసమునం దాంధ్రవ్యక్తిత్వము
చిరకాలాగతంబై నేటికిని సజీవమై యున్నది. దేశమున

ఆంధ్రవ్యక్తిత్వము

కనేకములైన యుగాంతరములు సంప్రాప్త
మై ఆంధ్రత్వము కాలాంతరమునందు
వృద్ధిక్షయములకు బాలైనను నేటికిని వీర్యవంతమై నిలిచి
యున్నది. భరతఖండమునందు వాడుకయందున్న 222
భాషలయందును హిందిభాషను 10 కోట్లు బంగాళిని
492 లక్షలు, ఆంధ్రభాషను 2,36,01,000 జనులు మాట
లాడుచున్నారు. ఆంధ్రభాష భారతీయ భాషలందు మూ
డవభాషగ నున్నది. పదేండ్ల కాలమునం దాంధ్రభాషను
మాటలాడువారి సంఖ్య 100 కి 2 వంతునను వృద్ధిని
బొందినది. చెన్నరాష్ట్రమునం దాంధ్రదేశము 83,000
చదరపుమైళ్ల వైశాల్యమును, 170 లక్షల ప్రజలను గలిగి
వర్ధిలుచున్నది. భారతసామ్రాజ్య సౌభాగ్యమునకు వ్యక్తి
త్వముగల జాతులవికాస మాధారముగ నున్నది. ఆంధ్రో
ద్యమ మిా ప్రకృతిసిద్ధమైన ధర్మమును సఫలము చేయుట
కవతరించినది. స్వదేశ స్వభాషా స్వధర్మములు మానవ
వికాసమునకు మూలాధారములని పండిత పామరు లంగీ
కరించుచున్నారు. మానవులకు తాము తరించుటకుగల
సాధనములను వికసింపజేయుటయే తమకును లోకమున
కును తరణోపాయముగ నున్నది. ఆంధ్రభాష, ఆంధ్రదే
శము, ఆంధ్రస్వభావము వికాసమును బొందుట కాంధ్ర
రాష్ట్రనిర్మాణ మవసరంబని ప్రపంచానుభవము, ఆంధ్రుల
స్థితి విశదము చేయుచున్నవి. కాంగ్రెసు ప్రయోజన
ముల కేర్పాటుచేసిన ఆంధ్రరాష్ట్ర సంఘము ఆంధ్రుల
వ్యక్తిత్వమును సువ్యక్తము చేసినది. విజయవాడయందు
నిర్ణయింపబడిన కాంగ్రెసు కార్యవిధాన మాంధ్రనామ
మును దేశమునందంతటను ప్రతిబింబింపజేసినది. సహాయ
నిరాకరణోద్యమమునం దాంధ్రులు చూపిన త్యాగోత్సా
హము లాంధ్రుల సహజశీలమును బహిర్గతము చేసినవి.
ఆంధ్రులకు ప్రత్యేకాంధ్రరాష్ట్రసంఘ మేర్పడి యుండని
యెడల సహాయనిరాకరణోద్యమమునందును, ఖద్దరు
ఉద్యమమునందును ఆంధ్రులకు నామరూపములు లేక
గతించిన యారేండ్ల చరిత్రమును శూన్యముగ నుండి
యుండెడిది. శాసనసభయం దాంధ్రమంత్రులాంధ్రరాష్ట్ర
విషయమున చూపిన నిరాదరణకును కాంగ్రెసు వ్యవ
స్థలందు కాంగ్రెసు చూపిన యాదరణమునకును గలిగిన

# ఏలవుపయోగింపరాదు?

ఈక్రింద పేర్కొనిన అద్భుతమైన ఔషధములన్ని వుపయోగింపుడు.

## నేత్రరోగములకు-"అక్ష్యాకుర" ను ఉపయోగింపుడు.

## తామరకుం "కురెఝిన్"ను "

## శ్వాసకాసరోగములకు- ఆస్త్మాక్యూర్"ను "

## బలమునకు-సైర్వర్సు ఎమల్షన్ ఆఫ్ కాడ్‌లివర్ ఆయిలు"ను "

## టానిక్ లకుం-" నర్వైన్ టానిక్ మాత్రల"ను. "పారిష్ కెమికల్‌ఫుడ్"ను "ఈస్టన్స్ సిరప్"ను"హైపోఫాస్ఫైట్సు ఆఫ్ లైము"ను "

## గనేరియాకుం-"జినో"ను "లికర్ శాంటల్‌ఫ్లావా సి. కొపెయి బాకంబుచు"ను

మాఔషధము లన్నియు, శాస్త్రోక్తముగా మా ఆధునిక ఔషధశాలలో తయారు చేయబడినవి. గనుక చాలా నవీనమైనవి, కోరిన వార్లకు కేటలాగు పంపబడును.

**N. POWELL & Co.,**
**CHEMISTS, BOMBAY.**

# ముఖ్యగమనింపు.

| | రూ. | అ. |
|---|---|---|
| వైద్యచింతామణి 2 సంపుటములు | 8 | 0 |
| బసవరాజీయము | 7 | 0 |
| అష్టాంగహృదయము సూత్రస్థానము | 6 | 0 |
| " శారీరస్థానము | 1 | 8 |
| " నిదానస్థానము | 2 | 0 |
| " చికిత్సాస్థానము | 4 | 8 |
| " కల్పస్థానము | 0 | 12 |
| " ఉత్తరస్థానము | 6 | 0 |
| అనుపానమంజరి ప్రాచీనము మేలు | 0 | 8 |
| అనుపానరత్నాకరము | 0 | 12 |
| " మేలుప్రతి | 1 | 0 |
| అనుపానతరంగిణి | 0 | 12 |
| " మేలుప్రతి | 1 | 0 |
| సద్వైద్యజీవనము, లోలంబరాజీయము ప్రాచీనము | 0 | 8 |
| చికిత్సారత్నము, స్త్రీ బాలరోగ చికిత్స | 1 | 4 |
| చికిత్సాసారము | 2 | 8 |
| సుశ్రుతము శారీరస్థానము ప్రాచీనము సవరణప్రతి కలిగి | 2 | 8 |
| శార్ఙ్గధరసంహిత " | 3 | 0 |
| వైద్యామృతము మేలు | 1 | 4 |
| సర్వౌషధీగుణకల్పము | 2 | 8 |
| రసరత్నసముచ్చయము | 2 | 0 |
| వాజీకరణకల్పద్రుమము, శరీరపుష్టివిధానము | 1 | 8 |
| వైద్యకాలజ్ఞానము, ప్రాచీనము | 0 | 4 |
| ధన్వంతరి నిఘంటువు | 2 | 8 |
| వస్తుగుణపాఠము ద్రవ్యగుణము గలది | 2 | 8 |
| " మేలుప్రతి | 3 | 0 |
| నాడీనక్షత్రమాల ప్రాచీనము | 0 | 4 |
| నాడీజ్ఞానము " | 0 | 3 |
| యవనజాతకము (జ్యోతిషము) | 0 | 8 |
| జాతకాలంకారము " | 0 | 6 |
| జ్యోతిషార్ణవనవనీతము " | 1 | 8 |
| " మేలుప్రతి | 2 | 0 |
| ఆరూఢరత్న సిద్ధాంజనము | 0 | 8 |
| " మేలుప్రతి | 0 | 10 |

దరఖాస్తులను పంపుడు !

ఓలేటిపాటి వెంకటరామానుజ శర్మగారి గ్రంథములు అచ్చగుచున్నవి. త్వరలో వెలువడును.

పోకల శేషాచలము నాయునివారి గ్రంథములు కూడా తయారగుచున్నవి.

పిడుగు వెంకటకృష్ణారావు పంతులు,
2/40 పెద్దినాయనివీథి, మద్రాసు.

# PAIN VERSUS VITALITY

If you have pain, you lack your full force of vitality. You know that nothing saps your energy so quickly as PAIN. But you can get rid of any pain

# AMRUTANJAN

Pain cannot exist in one and the same place with Amrutanjan. Amrutanjan cures and prevents all aches and pains. A curative and preventive pain balm with wonderful healing properties. Amrutanjan Sold every-where at As. 10 per bottle.

## AMRUTANJAN DEPOT BOMBAY & MADRAS.

# A RARE OPPORTUNITY.

## The most Reliable House.





మావద్ద మిక్కిలి నాగరికమైన క్రొత్త జవిళిసరకులు ఎల్లప్పుడును సరసమైన ధరలకు దొరకును.

కరాచి, బెనారసు, పట్టుడినుసులు, ప్రతి యొకరకము లోను,

మధుర, బెంగుళూరు, ధర్మావరం, కంచి, ఇతర ముఖ్యమైన అనేక ప్రదేశములనుండి ప్రస్తుతకాలపు నాగరికమునకు తగినట్టి జవిళిసరకులు అధికముగ మావద్ద స్టాకులో నున్నది.

**మిక్కిలి సరసమగు ధర.** ఒకసారి పరీక్షింపుడు.

అసలు పట్టు, గట్టిచాయ, వెండి జరీ మొదలగువానికి పూచీనిచ్చెదము.

ఆర్డరులు ఏమాత్రముఆలశ్యములేక పంపబడును. కేటలాగు ఇనాము.

*Apply to:—*

**R. R. Subbiyer & Sons,**
FANCY SILK WARE-HOUSE
**1/80 Nyniappa Naik Street, MADRAS, P. T.**



శ్రీ యస్. సత్యమూర్తిగారు



శ్రీ కే. యస్. శివసుబ్రహ్మణ్యఅయ్యర్ గారు



శ్రీ కే. ఆర్. కరంతుగారు



శ్రీ వరదా కామేశ్వరరావునాయడు గారు



శ్రీ కే. మాధవన్‌నాయరు గారు



అబ్దుల్ హమీదుఖాను గారు



చెన్నపురి శాసనసభ కాంగ్రెసుసభ్యులు—సకలత్వాలాగారు

ఫలము ఆంధ్రరాష్ట్ర ప్రయోజనములకు ప్రత్యక్షప్రమాణముగ నున్నది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సిద్ధాంతావస్థను దాటి కార్యాచరణావస్థయందు చేరినవిధమును దేశ వ్యవహారములు విశదము చేయుచున్నవి.

**భారత రాజ్యాంగము**

కాంగ్రెసు నిర్ణయించిన భాషాప్రయుక్తరాష్ట్ర విభాగములు ప్రజాప్రబోధమునకు దోడ్పడి భరతఖండమునందు రాష్ట్రముల పునర్నిర్మాణావసరమును ధ్రువపరచినవి. సర్ శంకరం నాయరుగారు, రామారావుగారు, రామదాసు పంతులుగారు రాజ్యసభయందు తమిళకర్ణాటకాంధ్రరాష్ట్రముల నిర్మాణమును చేయవలయునని తీర్మానములను ప్రతిపాదించిరి. సామ్రాజ్యసభయందు ఉత్కలరాష్ట్రనిర్మాణమును జేయుటకు తీర్మానములు ప్రతిపాదింపబడినవి. సర్ అలెగ్జాండరు మూడిమనుగారు భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణముల ప్రయోజనము నంగీకరించిరి. మోంటుఫర్డు సంస్కరణశాసనమునందలి 52-ఏ. నిబంధన భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణ విధానమును నిర్ణయించుచున్నది. అనిర్ణయమున కనురూపముగ చెన్నరాష్ట్రశాసనసభ ఆంధ్రరాష్ట్రతీర్మానము నామోదించినది. ఆంధ్రప్రబోధము వలన లాభమును బొందిన పానుగల్లు రాజాగారు తీర్మానమునకు వ్యతిరేకాభిప్రాయమును దెలిపి వారి రాజ్యాంగజీవితమును స్తంభితము చేసికొనుట శోచనీయముగనున్నది. అనుకూల ప్రతికూలాభిప్రాయములు కాలము పరిపక్వమైనపుడు నిరర్థకము లగును. రాజ్యాంగసంస్కరణ విచారణ సంఘము భాషాప్రయుక్తరాష్ట్ర విషయమును, సాంఘాతిక రాజ్యాంగ విధానమును రానున్న విచారణయందు విమర్శించునని క్రీరారుగారు, మూడిమనుగారు, ఫ్రెడరికు హ్వైటుగారు తెలిపిన భావములు విస్పష్టముచేయుచున్నవి. కోటుమనుగారి యాజమాన్యము క్రిందను ప్రభుత్వము ప్రచురించిన 1925-26 నివేదికయందు రాష్ట్రముల పునర్నిర్మాణలక్ష్యము సూచింపబడినది. బర్మారాష్ట్రము గాక శేషించిన రాష్ట్రములన్నియును స్వపరిపాలనాసౌకర్యమునకు సాధనములైన జాతిదేశభాషలతో నిమిత్తములేక పరిపాలన నిమిత్తము నిర్మింపబడినవని కోట్మనుగారంగీకరించుచున్నారు. భరతఖండమునందు 662 స్వదేశ సంస్థానము లున్నను 200 సంస్థానములు ప్రముఖములు. సంస్థానములు బ్రిటీషు రాజ్యాధికారము క్రిందను స్వతంత్రపరిపాలనము ననుభవించుచున్నవి. బ్రిటీషు ప్రదేశమునందు గల 10 రాష్ట్రములు రెండువంతుల ప్రదేశమును, 662 సంస్థానములును మూడవవంతు ప్రదేశమును నాక్రమించుకొనుచున్నవి. కేంద్రప్రభుత్వాధికారము క్రింద రాష్ట్రములు, సంస్థానములు స్వపరిపాలనమును గలిగియుండవలసిన విధానమును సంస్కరణవిచారణసంఘము నిర్ణయింపవలసియున్నది. సర్ ఫ్రెడరికు హ్వైటుగారు భరతఖండమునందు సంయుక్త సాంఘాతిక విధానమును స్థాపించి రాజ్యాంగ నిర్మాణమును చేయవలసిన విధమును విశదముచేసిరి. సంస్కరణ విచారణసంఘమునకు సాధనసామగ్రిని సమకూర్చుచున్న క్రీరారుగారును భాషాప్రయుక్త రాష్ట్రవిభాగమునకు సుముఖులు. కాంగ్రెసు విధానము భాషాప్రయుక్తరాష్ట్రవిభాగము నంగీకరించుచున్నది. స్వపరిపాలనము గల రాష్ట్రముల నిర్మాణమునకు దేశభాషాసాంప్రదాయ బద్ధములైన రాష్ట్రముల పునర్నిర్మాణము శరణ్యముగ నున్నది. ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు కాలము పరిపక్వమై ప్రజానాయకుల వ్యవసాయపరాయణత్వమును గోరుచున్నది. ఆంధ్రనాయకులు లీలబ్ధావకాశముల నాంధ్రోద్యమమునకు మూలాధారమైన ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు వినియోగించి కామితార్థములను బడయుదురు గాత!

**ఆంధ్రోద్యమ వికాసము**

దేశావ్యాప్తమైన స్వరాజ్యసంరంభమునం దాంధ్రరాష్ట్రాందోళనము మందగతిని బొందినను సాహిత్యకళావికాసము నిరాటంకముగ గలుగుచున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయము స్థాపితమై వ్యవహారవిధానమును నిర్వహించుచున్నది. ఆంధ్రభాషా మూలమున విద్యాభ్యాసమును చేయుట కేర్పాటులు జరుగుచున్నవి. విజయవాడయందు

విశ్వవిద్యాలయముయొక్క కార్యాలయ నిర్మాణమునకును, గ్రంథాలయనిర్మాణమునకును ప్రయత్నములు జరుగుచున్నవి. ఆంధ్రవిశ్వవిద్యాలయశాసనము నిర్మాతల సంకల్పమును సఫలము చేయజాలకపోవుట శోచనీయము. వైసుఛాన్సెల్లరు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు నిర్మాతల సంకల్పమును సఫలము చేయుటకు చేయుచున్న ప్రయత్నములు ప్రశంసాపాత్రములు. విద్యావిధానమును విశ్వవిద్యాలయాధికారుల వశముచేయుటయును, ప్రత్యేక శాస్త్రకళాభ్యాసమునకు ప్రత్యేకకేంద్రముల నేర్పరచుటయును ప్రయోజనకరములు. ఆంధ్రదేశమునకు నడుమనున్న విజయవాడ కార్యస్థానముగ నుండుటకును, కేంద్రస్థానముగ నేర్పడుటకును సకలవిధములను తగియున్నది. అధికారులును నాయకులును పక్షపాతాభిమానములను విడిచి విజయవాడ నాదరించి ఆంధ్రోద్యమ వికాసమునకు దోడ్పడి కృతార్థులగుదురు గాక! ఆంధ్రత్వవికాసమునకధికారాదరణము లేకపోయినను స్వయంసహాయమున ప్రవర్ధమానం బగుచున్నవిధమును సాహిత్య శిల్పరచనలు విశదము చేయుచున్నవి. ఆంధ్రమునందు 1925-26 సంవత్సరమునందు 1090 గ్రంథములును, 1926-27 నందు 1100 గ్రంథములును ప్రచురింపబడినవి. ఈ గ్రంథములందు చాలభాగము పునర్ముద్రణములు గలవు. ప్రచురితములైన గ్రంథములందు నాటకములు ప్రధానములు. శతకములును, స్తోత్రములును, నవలలును ప్రముఖములుగ నున్నవి. గేయకావ్యము లాంధ్రసాహిత్యమునకు సహజమైన శీలమును విశదము చేయుచున్నవి. గత సంవత్సరమునందు ప్రచురితములైన భావగీతములందు యెంకి పాటలు వాదప్రతివాదములకు గారణములైనను ఆంధ్రసాహిత్యము నడచుచున్న నవీనమైన పోకడలను విశదము చేయుచున్నది. హనుమంతరాయ చిత్రకళా మందిరమునందును, రామారాయ చిత్రకళా మందిరమునందును చిత్రింపబడిన చిత్రములు శిల్పమునం దాంధ్రశిల్ప మవలంబించుచున్న స్వతంత్రవిధానమును విశదము చేయుచున్నవి. అజంతాశిల్పము భావకల్పమునందును, రూపనిర్మాణమునందును, వర్ణవిక్షేపమునందును ప్రాచ్యశిల్పమునకు మాతృకయై, ఆంధ్రశిల్పమునకును మాతృకగనున్నది. ప్రభుత్వాదరణము లేకపోయినను స్వయం సహాయమున నాంధ్రులు పొందుచున్న వికాస మాంధ్రోద్యమ ఫలమును, ఆంధ్రరాష్ట్రనిర్మాణావసరమును విశదము చేయుచున్నది. గతించిన ఆరేండ్లయందును, ఆంధ్రరాష్ట్రవిషయమున రాజకీయపక్షములందు భేదాభిప్రాయము లేర్పడినను నిపుడాస్థితిపోయి భావైక్యము గలిగినది. భారతరాజ్యాంగము నవీనాకృతిని దాల్చనున్నది. ఆశుభసమయమునందు నాయకులును ప్రజలును వారి శక్తిసామర్థ్యముల నాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు వినియోగించి భగవత్కటాక్షమునకు పాత్రులగుదురు గాత!

**గ్రామ పునర్నిర్మాణము**

భరతఖండమునందు 100 కి 76 మందికి వ్యవసాయము జీవనాధారముగ నున్నది. ప్రజలు విశేషభాగము గ్రామసీమలందు నివసించు చున్నారు. బ్రిటీషుపరిపాలనము గ్రామసీమలందు జీవనమును శిథిలము చేసి పట్టణవాస జీవనమును నాకర్షించినను దేశసౌభాగ్యమునకు గ్రామము లాయువుపట్టులుగ నున్నవి. పంటలను గ్రామములు పండించుచున్నవి. పన్నులను గ్రామములు చెల్లించుచున్నవి. ప్రజలను గ్రామములు పోషించుచున్నవి. ప్రాచ్యవిజ్ఞానమును గ్రామములు రక్షించుచున్నవి. భారతసౌభాగ్యమునకు నిలయములైన గ్రామసీమలు దుర్దశకుపాలై పట్టణములకు దాస్యమును చేయుచున్నవి. ప్రాజ్ఞులు, సంపన్నులు స్వగ్రామములను విడిచి ఉద్యోగములకును, విద్యాధనోపార్జనమునకును, సౌఖ్యమునకును నగరవాసమును జేయుచున్నారు. గ్రామములకు నీటివసతులు, బాటలు, ధనాగారములు, విహారస్థలములు, వైద్యాలయములు, విద్యాలయములు, గ్రంథాలయములు, తపాలాఫీసులు లేక ప్రజలు కష్టముల ననుభవించుచున్నారు. గ్రామములందు చేతిపనులు నశించినవి. కూలిపని జీవనాధారముగ నున్నది. పాశ్చాత్య వ్యాపారము గృహపరిశ్రమ

లను పాడుచేయగలిగినటులు భాగ్యాభివృద్ధిని చేయుటకు వినియోగపడలేదు. ప్రజలయందు భాగ్యభోగాభిలాష వృద్ధిని బొందినటులు భాగ్యాభివృద్ధి గలుగలేదు. వాంఛలభివృద్ధిని బొందినటులు వృత్తులు, పరిశ్రమలు వృద్ధిని బొందలేదు. పారతంత్ర్యస్థితియందధికారమునకు గల పరువుప్రతిష్ఠలు వ్యవసాయవ్యాపార పరిశ్రమలకు గలుగలేదు. మూలాధారచక్రమునందు బలములేక ఆజ్ఞాచక్రము మందగమనమును జేయుచున్నది. వ్యాధిగ్రస్తమైన దేశమునకు వైద్యులు గ్రామవాసచికిత్సను నిర్ణయించుచున్నారు. నాయకులు గ్రామపునర్నిర్మాణమును ప్రశంసించుచున్నారు. ప్రభుత్వము వ్యవసాయ విచారణ సంఘమును రోగనివారణార్థము నియమించినది. నివేదిక నిర్ణయించెడి వ్యవసాయక్షేత్రములు, ఎరువులు, పరపతి సంఘములు, పంచాయతులు జీవనోద్ధరణమునకు సామాన్యానుకరణములుగాని యథార్థసాధనములు గావు. పునరుద్ధరణమునకు పరమార్థము ప్రయోజనముగ నున్నది. స్వయంపోషణము, స్వాతంత్ర్యము పునరుద్ధరణమునకు బీజములు. స్వయం వ్యక్తిత్వముగల రాష్ట్రములవలె స్వయం వ్యక్తిత్వముగల గ్రామములును ప్రజాక్షేమమునకవసరముగ నున్నవి. స్వాతంత్ర్య సంరంభ భారమును గతించిన 40 ఏండ్లయందును పట్టణవాసులైన ఆంగ్లవిద్యావంతులు వహించుచుండిరి. గాంధిమహాత్ముడాభారమును గ్రామవాసులపరము చేయుటకు జేయుచున్నప్రయత్నములు సర్వతోముఖమైన గ్రామపునర్నిర్మాణమునకు సాధనములుగ నున్నవి. గ్రామపునర్నిర్మాణమునకు ప్రాచీన నవీనసంస్కారముల సాహచర్యమువలె విశ్లేషము ప్రయోజనకరముగాదు. విశ్వసాహచర్య యుగమునందు గ్రామపరిపాలనము, సామ్రాజ్య పరిపాలనము స్వాతంత్ర్యానుభోగమునందు సమానప్రతిపత్తిగల సంస్థాపనలుగ నున్నవి. స్వపరిపాలన నిర్వహణమునందు గ్రామవాసులకును పట్టణవాసులకును దశావకాశములందును, నిర్వహణ విధానమునందును భేదమున్నను స్వయం వికాసావధియందు భేదములు గనుపడవు. వ్యవసాయ విచారణ సంఘనిర్ణయములు, రాజ్యాంగసంస్కరణ విచారణ సంఘనిర్ణయములు గ్రామములకును, పట్టణములకును ప్రతిఘటనమును గలుగజేయుచు నిరంకుశత్వ పోషణమునకు సాధనములు గాకుండుటకుగాను ప్రజానాయకులు పాటుపడి గ్రామపునర్నిర్మాణమునకు దోడ్పడుట యవసరము. ఆంధ్రమహాజను లీపరమార్థమును గ్రహించి గ్రామపునర్నిర్మాణోద్యమమును సార్థకము చేయుదురు గాక!

భగవదనుగ్రహము వలనను, ఆంధ్రమహాజనుల యాదరణము వలనను ప్రభవ సంత్సరాదిసంచికను ప్రచురింపగలిగినందులకు కృతార్థులము. సాధారణసంవత్సరమునందు ప్రచురించిన మొదటిసంచికను, ప్రభవసంవత్సరమునందు ప్రచురించిన పదునెనిమిదవసంచికను చూచినపుడు కాలప్రవాహము గలుగజేయుచున్న మహాపరివర్తనము గోచరం బగుచున్నది. మొదటిసంచికకు వ్యాసములను వ్రాసి సహాయముచేసినపండితులిపుడును వ్యాసములను వ్రాయుచు చేయుచున్న దేశసేవ, భాషాసేవ ప్రశంసనీయములుగ నున్నవి. మొదటిసంచికను ప్రచురించుటకు సహాయభూతులైన లక్ష్మణరావు పంతులుగారు స్వర్గవాసమును గైకొనిరి. కోటంరాజు పున్నయ్యగారు సింధు ఆబ్జర్వరుపత్రికకు సంపాదకులుగ నున్నారు. ఆంధ్రప్రపంచమునందును, లోకమునందును ప్రవర్ధమానంబగుచున్న స్వయంవికాసమును సంచికలయందలి వ్యాసములు, పటములు, ప్రచురణవిధానము విశదము చేయుచున్నవి. ప్రభవసంచికయందుగల వ్యాసములు, చిత్రములు సాహిత్యమునందును, శిల్పమునందును, శాస్త్ర పరిశోధనలందును ఆంధ్రహృదయావృతమైన స్వాతంత్ర్య వికాసమును గోచరింపజేయుచున్నవి. తెలుగుకైతల క్రొత్తతెన్నులు తెలుగుకావ్యములందు గలుగుచున్న పరిణామమును విశదముచేయుచున్నవి. నవీనత ప్రాచీనతాన వీనతల ప్రభావమును తెలుపుచున్నది. కావ్యానందము- శోకరసము- నటులు, నాటకౌచితి నాటకరంగములందు రసోదయవిధానమునువిశదముచేయుచున్నవి. ప్రాచీన హిందూగ్రామ పరిపాలనము పరిశోధనాశక్తిని తెలుపుచున్నది. కామకవి,

నాగరం, నరపతి, ఉగాదికానుకలు నవయుగసాహిత్యనిర్మాణ విధానములను దెలుపుచున్నవి. సమాలోచనము, ప్రభవ, వివేకోపాసనము, విహారీవిహారము, జన్మభూమి మొదలయిన పద్యవ్యాసములు రసవంతములై కల్పనాచాతుర్యముగలిగి యలరారుచున్నవి. చాటుసందేశము సరస్వతి, స్నానానంతరము, కథలయందలిబొమ్మలు, శిల్పవికాసమును దెలుపుచున్నవి. చిత్రపటములందు జాతీయ మహాసభల యధ్యక్షులు, శాసనసభాసభ్యులు, చీనానాయకులు, అజంతాచిత్రములు, సాంవత్సరికసమావేశములు, సాహిత్యవిశారదులు, మంత్రులు మొదలగు పటములు చాలగలవు. పటములందుగల యువతీమణులపటములు గమనార్హములుగ నున్నవి. శ్రీమతి ముత్తులక్ష్మమ్మగారు చెన్నరాష్ట్రశాసనసభ కుపాధ్యక్షులుగ నున్నారు. శ్రీమతి లక్ష్మీదేవమ్మగారు, డాక్టరు పరీక్షయందు తీర్ణులైరి. శ్రీమతి రుక్మాబాయమ్మగారు 'సింహబలమును గలిగి మోటారుకారు నాపగలిగిరి. ఆంధ్రయువతుల యభివృద్ధికి వీరు నిదర్శనముగ నున్నారు. శ్రీమతి కౌసల్యాకన్యకగారును జకరయగారును సెనేటునందు సభ్యురాండ్రుగ నెన్నుకొనబడిరి. సంచికయందుగల వ్యాసములు, పద్యములు, చిత్రములు, సంచికను ప్రచురించుటకు నిర్వాహకులుపూనిన శ్రమను విశదముచేయుచున్నవి. ప్రచురణమునకు పంపిన వ్యాసములనన్నిటిని ప్రచురింపజాలనందులకు నిర్వాహకులు చింతిలుచున్నారు. సంచికను ప్రచురించుటకు బాటుపడినవారి నందరిని పేర్కొనుటయు, కృతజ్ఞతను తెలుపుటయు దుర్లభము. వ్యాసలేఖకులు, చిత్రకారులు, పరిశీలకులు, ముద్రాపకులు మొదలగు వారందరును ప్రచురణమునకు సాధకులై కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు. ప్రచురణమునం దవలంబించిన క్రొత్తపద్ధతి సంచిక ప్రయోజనమును వృద్ధిచేయుననినమ్ముచున్నాము. పదునెనిమిదేండ్లనుండియును ఉగాదిసంచికలకు వ్యాసములను వ్రాసియును, చిత్రపటములను పంపియును, నితరవిధములను సహాయముచేసియును సంచికల ప్రచురణమునుసాధ్యముచేయుచున్న మహాజనులకును, ముఖ్యముగ ప్రభవ సంవత్సరాదిసంచికకు సహాయముచేసిన మహాజనులకును కృతజ్ఞతాంజలుల నర్పించుచున్నాము. పరమేశ్వరానుగ్రహమున ప్రభవసంవత్సరము శాంతిప్రదమై సకలజనులకును కామితార్థముల నొసగుగాత!





శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

ప్రేమించి చుక్కల పేరులొక్కని కిచ్చి
వికచ ప్రసవహార మొకని కొసఁగి
మేలెంచి నీలాలచేల లొక్కని కిచ్చి
కనకాంబరంబు లొక్కని కొసంగి
మన్నించి యొకనికి మాపుఁదోడుగ నంపి
యింకొక్కనికి రేపు నెదురు కొలిపి
దీవించి పడమటి తెర యొక్కనికిఁ దీసి
ప్రాగ్ద్వార మొకనికి బయలుపఱిచి
క్షయుని సాగనంప స్వాగతంబును దెల్పి
ప్రభవు నాదరింపఁ బాలుగొన్న
సుప్రభాత సంధ్య సోలుచుఁ దూలుచుఁ
బాడుపుమలఁ దేలిపోవుచుండె.

గీ. పోయినది క్షయ నిన్నటి ప్రొద్దుతోన,
ప్రభవవచ్చిన దీనాఁటి పగటిపూట
ప్రళయసర్గ క్రియాపరంపరలె కాని
కానఁబడదేమి తుదిమొదల్ కాలమునకు?

గీ. అఱువ దేండ్లకు మొదటియేఁడైన ప్రభవ
అఱువదవయేఁటఁబుట్టిన యట్టి క్షయకు
వెనుక నుదయించె నిదియేమి వింత యనుచు
నవ్వుచున్నది తొలికారు పువ్వుగుత్తి.







ఆ.వె. నిన్నఁ జన్నవాఁడు చిన్నవాఁడై నేఁడు
కన్నవాఁడు వాని కన్నయగుటఁ
గన్నవిన్నవార లున్నారొ "కో" యంచుఁ
గొసరి కూయుచుండెఁ గోకిలంబు.

ఆ.వె. సకల మెడసి చన్నతీయు నవ్వలికిఁ ద్రోసి
సహజవిభవుఁ బ్రభవు సరసఁ జేరి
కులుకుచుండెఁ దీగఁ వెలబోడి యని చిల్క-
పండ్లు కొఱికికొనుచుఁ బలుకుచుండె.

ఆ.వె. మాఱుపేరె కాని మఱి తీయ ప్రభవల
గతుల భేదమేమి కల దటంచు
మల్లెతీవలందుఁ మాధవీ లతలందు
తేఁటి యొక్కలాగె చాటుచుండె.

సీ. గిరిగహ్వరములు నిర్ఝరులు పొంగెడిచోటఁ
గొలఁకుల దరు లొడ్డగిలెడిచోటఁ
గఱకుఱా నేలలు కందళించెడిచోట
నడవులు దావాగ్ని మడఁగుచోట
వలరులఁ దేలి పిందెలు క్రమ్ముకొనుచోట
వాలుగొమ్మలపండ్లు రాలుచోట
ప్రాఙ్ముఖంబున మణిప్రభలు తోఁచెడి చోటఁ
గడలఁ జీకటితెరల్ నడలుచోట
జగతిఁ బ్రభవతీయ క్రియల్ జరగుచుండఁ
గనియు తీయపోయెఁ బ్రభవ వచ్చెనటంచుఁ
దలఁచి యాకాశపంచాంగములు గుణించి
పలుకుచుండుట వట్టి విభ్రాంతి కాదె!





సీ. అలరుఁ దెమ్మెరల రవ్వంతైన నిట్టూర్పు
పొదరు చేరకయుండఁ బోయినదియొ!
అమలవాహినుల గోరంతైనఁ గన్నీటి
బొట్టు జాఱకయుండఁ బోయినదియొ!
అలము వెన్నెలలఁ గాసంతైనఁ జీకటి
చాయ దేఱకయుండఁ బోయినదియొ!
అచలగర్భములఁ బూసంతైన మిణుఁగురు
పొరక దూరకయుండఁ బోయినదియొ!
ప్రాఁతసంవత్సరముకంటె నూతనముగ
నిపుడు వచ్చిన దేమి? పోయినదియేమి?
ఇంతలోఁ బేరుమాఱిన దంతెకాని
నిన్న నేఁటికి భేద మేమున్న దయ్యా!

సీ. ఆకాశసరసీ సముంచితావర్తముల్
కన్నుంచి లెక్కింపఁ గలుగువారు
రోదసీప్రాసాద రుచిర సోపానముల్
కాన్పించి యెక్కింపఁ గలుగువారు
పవమానసాగరాభ్ర విమాన మార్గముల్
తిలకించి వెలయింపఁ గలుగువారు
జలపటాంచల సముజ్జ్వల సువర్ణాకృతుల్
గ్రహియించి చదివింపఁ గలుగువారు
శూన్యమున సంకములఁ దేర్చి చూపువారు
ఘటకులై గంటములఁ దీర్చి కవిలెఁ గూర్చి
వ్రాసి చూపించిరే కాని వాస్తవముగఁ
గాలమునకును బరిణామగతులు గలవె?



శ్రీమాన్ యస్. శ్రీనివాసయ్యంగారు.

నలువదియొకటవ భారతజాతీయ మహాసభాధ్యక్షులు, గౌహతి.

సామ్రాజ్యశాసనసభాసభ్యులు.



కీ. శే. శ్రద్ధానందస్వామిగారు



శ్రీ గాంధీమహాత్ముఁడు,
ఖద్దరుప్రదర్శన ప్రారంభకులు, గౌహతి



సర్ పి. శివస్వామి అయ్యరుగారు,
మితవాదిమహాసభాధ్యక్షులు, అకోలా



శ్రీ టి. ఆర్. ఫూకన్‌గారు,
41 వ జాతీయమహాసభాహ్వాన సంఘాధ్యక్షులు, గౌహతి

# ౧. రాజకీయము

## ౪౧-వ భారతజాతీయమహాసభ - గౌహాతి

### శ్రీమాన్ యస్. శ్రీనివాసయ్యంగారి అధ్యక్షోపన్యాసము

మిత్రులారా!

అవిముక్తినగు భారతదేశము నాకొనరించిన యీమహాగౌరవమునకు నేను మిక్కిలి కృతజ్ఞుడనుగా నున్నాను. గాంధి మహాత్ముడు నడిపినట్లు నిరుపమానమగు కష్టదశలో సుప్రసిద్ధ నాయకు లగువారిచే అధిష్ఠింపబడిన యీస్థానసంబంధమగు బాధ్యతవహించుట కంగీకరించుటలో యిందువలన దక్షిణ రాష్ట్రమునకు అధికమగు గౌరవము కలుగుననియును మీరందరును మనఃపూర్వకముగ నాకు సహాయము చేయుదురనియును నాకుగల నమ్మకమే కారణము.

### ప్రజాప్రతినిధులకోరిక దానిఫలితము

ప్రజాప్రతినిధులు ప్రభుత్వమువారిని కోరిన సమస్యను గూర్చి మనమందరమును పట్టుదలతో పనిజేయుట రానున్న సర్వరమునందలి కార్యక్రమమున ముఖ్యతమమై యున్నది. 1924 సం. ఫిబ్రవరినెలలో భారతశాసనసభలో స్వరాజ్య స్వతంత్రపక్ష సమ్మేళనమువలన ఏర్పడిన జాతీయపక్షమువారి అనుమతి ప్రకారము పండిత మోతీలాలు నెహ్రూగారు ఈకోరికలను దొరతనమువారి కెరిగించిరి. "భారతదేశమునందు సంపూర్ణ బాధ్యతాయుతప్రభుత్వమును నెలకొల్పుట కనువగునట్లు భారత ప్రభుత్వచట్టమును మార్చుటకు ఏర్పాటులు చేయవలెను. ప్రాముఖ్యముగల అల్పసంఖ్యాకసంఘముల హక్కులకు భంగము కలుగని పద్ధతిని భారతదేశరాజ్యాంగవిధానమునుగూర్చి సూచించుటకు శీఘ్రముగ అఖిలపక్షప్రతినిధిసభను జరుపవలెను. అట్లు సిద్ధపరుపబడిన విధానమును ఇపుడున్న భారత శాసనసభను ముగించి క్రొత్తగ ఎన్నుకొనబడిన సభ్యులు గల భారతశాసనసభవారియెదుటనుంచి వారియామోదమును బడయవలెను. పిమ్మట చట్టముల పొత్తమునచేర్చుటకు దానిని బ్రిటిషు దేశపు పార్లమెంటువారికి పంపవలెను" అని ఆసభలో నెహ్రూగా రుపపాదించిన తీర్మానమునకు 76 గురు అనుకూలురుగను 48 మంది ప్రతికూలురుగ నుంటచే ఆతీర్మానము అంగీకరింపబడెను. ఈరీతిగ భారతశాసనసభలో స్వరాజ్యపక్షమువారు ఆత్మగౌరవముతో గూడిన సహకారమును సూచించుచునే పనిని ప్రారంభించిరి; కాని, దొరతనమువారు దురభిమానముతో ఆ సూచనను తృణీకరించిరి. ఈ ప్రధానాంశమువంకనుండి ప్రజలదృష్టిని మరల్చుటకు వారు సంస్కరణలవిచారణసంఘము నేర్పాటు చేసిరి. భారతప్రభుత్వచట్టముయొక్క నిర్మాణమునకును, పద్ధతికిని అనుగుణమగు రీతిని దాని ననుష్ఠానమునకు తెచ్చుటలోగల యిబ్బందులను, లోపములను తొలగించుటకు ఆవశ్యకతను, అవకాశములను గూర్చి విచారించుటకు ఆసంఘమును నియమించిరి. భక్తిశ్రద్ధలతో ద్వంద్వపరిపాలనమును కొనసాగించినవారు ఆ సంఘము నెదుట నొసంగిన సాక్ష్యమును బట్టియును, విచారణసంఘములో అల్పసంఖ్యాకులు ప్రత్యేకముగ వ్రాసిన నివేదికనుబట్టియును ద్వంద్వపరిపాలనము బాధ్యతాయుతప్రభుత్వమునకు సోపానముగనుండు విషయమునను, ఇతరవిషయములందునుగూడ విఫలమయ్యెనని స్పష్టముగ వెల్లడియయ్యెను. విచారణసంఘమువారిలో హెచ్చుమంది వ్రాసిన నివేదికను భారతశాసనసభవారు ఆమోదించునటులు చేయుటకు ఇండియా దొరతనమువారు మరల ప్రయత్నించినపుడుకూడ, 1924 ఏప్రిలులో ఆమోదింపబడిన తీర్మానమునందలి విషయములనే 1925 సెప్టెంబరులో జరిగిన భారతశాసనసభలో గూడ సభవారు విపులముగ, మరియొక తీర్మానరూపమున నుపపాదించిరి. ఆ తీర్మానమునకు స్వరాజ్యస్వాతంత్ర్య పక్షములవారు 72 మంది అనుకూలముగ సమ్మతులను దెలిపిరి. 45 మంది మాత్రమే ప్రతికూలురగుటచే రెండవసారి కూడ ఈ తీర్మానము ఆమోదింపబడినది. రెండవసారి కూడ దొరతనమువారు దానిని తృణీకరించిరి.

1925 డిసెంబరులో కానుపూరునందు జరిగిన కాంగ్రెసు మహాసభవారు గూడ శాసనసభలో నామోదింపబడిన తీర్మానమునే స్థిరపరచిరి. దొరతనమువారు దానిని తృణీకరించినయెడల దానిని నిలువబెట్టుటకును, స్వరాజ్యసమరమును సాగించుటకును శాసనసభలలోను, దేశమునందును జరుగవలసినవిధానమును గూడ కాంగ్రెసువారు నిర్ణయించిరి. కాంగ్రెసు మహాసభయొక్క పద్ధతిని దేశీయులకందరకును బోధింపవలెననిరి. భారత రాష్ట్రీయ శాసనసభలలోని స్థానముల నన్నింటిని కాంగ్రెసువారు ఆక్రమించుటకు ప్రత్యేకప్రమాణములను గావించి ఎన్నికలకు నిలువవలెనని ఆజ్ఞాపించిరి.

1926 మార్చిలో దొరతనమువారు ప్రజల కోర్కెలను నిరాకరించినపుడు కాంగ్రెసువారి ఉత్తరువుప్రకారము స్వరాజ్య పక్షమువా రందరును భారతరాష్ట్రీశాసనసభ అన్నింటినుండియు ఏకకాలమున వెడలిపోయిరి. "దొరతనమువారు

నిష్కారణముగ ప్రజల కోర్కెలను నిరాకరించినందులకు దేశీయులు తగినప్రత్యుత్తరమును ఇయ్యగలరనియు, నింతకంటెను బలవత్తరమగు ఆజ్ఞ నొసగి మరల మమ్ములనే యింత హెచ్చుమందిని శాసనసభలకు పంపగలరనియు, భగవదనుగ్రహమున ప్రజల ఆజ్ఞలను నెరవేర్చుటకు అవసరమగు ఉత్తరువులు గూడ నీయగలరనియు మేము ఆశించుచున్నాము” అని భారతశాసనసభనుండి స్వరాజ్యపక్షమువారు వెడలిపోవునపుడు వారినాయకులగు పండిత మోతీలాలు నెహ్రూగారు నుడివిరి.

శాసనసభల ఎన్నికలు - వానిభావము

ఈ రీతిగ ప్రారంభింపబడిన ఉద్యమఫలితమును పిమ్మట జరిగి యిపుడు ముగిసిన శాసనసభల యెన్నికల ఫలితములనుబట్టి జూడ భారతరాష్ట్రీయశాసనసభలలో స్వరాజ్యపక్షమువారవలంబించినట్టియు, కాన్పూరులో కాంగ్రెసు మహాసభవారు స్థిరపరచినట్టియు గొప్పప్రయత్నము సహేతుకమని నిర్ధారణ యయినది. ఎన్నికల సందర్భమున కాంగ్రెసువారు దేశమునందొనరించిన ప్రచారమువలన ప్రజలలో రాజకీయవిజ్ఞానము అత్యధికముగ వ్యాపించినది. కేవల మతసాంఘికాది విషయములకు సంబంధించిన ప్రతిఘటనము అత్యధికముగ నెలకొనినను కాంగ్రెసువారి విధానము చాల శ్రేష్ఠతమ మనియు, ప్రజలకు కాంగ్రెసుపట్లగల యభిమాన మత్యధికమనియు స్పష్టపడుటకే యదికారణమైనది. మదరాసు వంగ బీహారు ఉత్తరరాష్ట్రములు అత్యధికముగను, పంజాబు మున్నగు ఇతరరాష్ట్రములు కొంతవఱకును కాంగ్రెసువారి ఉత్తరువును నెరవేర్చి కాంగ్రెసు నియమములకు బద్ధములై యుండెను. కొన్ని రాష్ట్రములలో కాంగ్రెసువారికి సంపూర్ణవిజయము కలుగకపోవుటకు కారణము ఆయా రాష్ట్రములలో కాంగ్రెసువారలలో పరస్పరవివాదములు కలుగుటయే కాని యితర రాజకీయపక్షములవారు శ్రేష్ఠమగు విధానముల నేర్పరచుటగాదు. కాంగ్రెసువారు భారతదేశమునం దంతటను శాసనసభల ఎన్నికల విషయమున పనిచేయుట కిదియే తొలిసారి. దానికి తోడుగ కాంగ్రెసు నాయకులలోను, అనుచరులలోను ప్రబలములగు నభిప్రాయభేదములుగూడ కలిగినవి. ఇట్టిపరిస్థితులలో ఎన్నికలలో ఎన్నుకొనబడినవారి సంఖ్యబట్టియు, సామర్థ్యమును బట్టియుగూడ కాన్పూరు మహాసభవారి యుత్తరువుప్రకారము కలిగిన యీవిజయము మహత్తరమనియే చెప్పవలసియుండును. ఇట్టి విజయమువలన మనకు వింతకలుగలేదు. కాని నిరంకుశాధికారులకు, వారిమిత్రులకు ప్రతిరాష్ట్రమునందును చాల మనస్తాపము మాత్రము కలిగినది. కాంగ్రెసు అభ్యర్థులకు పోటీగానిలిచి ఎన్నుకొనబడినవారిలో చాలమందిగూడ యిపుడు కాంగ్రెసు ప్రమాణములకు ఆమోదము తెలుపకపోయినను వారుగూడ కాంగ్రెసువారేయని ప్రజలు భావించుటవలననే వారు విజయమును బడయగల్గిరి. మొత్తముమీద ఎన్నికల ఫలితములను బాగుగ గమనించినచో రాజకీయాకర్షణాకేంద్రము నిరంకుశోద్యోగ వర్గమును, వారియాశ్రితులను త్యజించి జాతీయమహాసభయందు స్థిరపడినదని స్పష్టము గాకమానదు.

శాసనసభల ఎన్నికలలో మనకుగలిగిన విజయము— అనగా కాన్పూరు కాంగ్రెసుమహాసభవారి యాజ్ఞల ననుసరించినవారికి కలిగిన విజయముయొక్క భావమును— మనము సామాన్యముగ విస్తరింపజాలము. భారతశాసనసభలో ప్రజాప్రతినిధులు వెల్లడించినప్రజాభిమతమును, దానిని దొరతనమువారు తృణీకరించుటచే శాసనసభాసభ్యులు సభనువదలిపోవుటను దేశీయులు మనఃపూర్వకముగ నామోదించిరనియే ఎన్నికలఫలితము స్పష్టపరచుచున్నది. రాజకీయ విషయములందు మతసాంఘికాభిమానము ప్రధానముకాదనియు, గాఢమగు జాతీయాభిమానమే ప్రధానమనియుకూడ ఎన్నికలవలన స్పష్టమయినది. చెన్నపురియందు ఇప్పటివరకును బ్రాహ్మణ బ్రాహ్మణేతర వివాదములు విదేశీయ నిరంకుశాధికార వర్గమునకు మూలాధారమై యుండెను; కాని యిపుడవి తొలగిపోయినవి. ద్రవిడ బీహారు రాష్ట్రములందు కాంగ్రెసుపక్షమునజేరి ఎన్నికలలో విజయమొందుటగూడ సంతోషకరమగు విషయమై యున్నది. అన్నిటికంటె ముఖ్యముగ ద్వంద్వపరిపాలనమును, సంస్కరణముల చట్టమువలన యేర్పడిన యితర రాజకీయయంత్రజాలమును నిరుపయోగమని దేశీయులు నిస్సంశయముగ ప్రకటించిరి. ప్రతి శాసనసభలోను గల వివిధపక్షముల సంఖ్యను బట్టిచూడ తక్కిన ఒక్కొక పక్షమువారికంటె అన్ని రాష్ట్రములందుగూడ కాంగ్రెసువారే హెచ్చుగానున్నారని మీరందరు నెరిగియేయున్నారు. కొన్ని శాసనసభలలో కాంగ్రెసువారిసంఖ్య మిక్కిలి హెచ్చుగాకూడ నున్నది. “భారతశాసనసభలో ప్రజాప్రతినిధులు కోరిన కోర్కెలకు ప్రభుత్వమువారు సరియగు ప్రత్యుత్తరము నిచ్చువరకును మేము మంత్రిపదవుల నంగీకరింపజాలము” అని ఎన్నికలకు నిల్చినపుడు కాంగ్రెసు పక్షమువారు స్పష్టముగ తెలిపియేయున్నారు. ఎన్నికలసందర్భమున ఎన్నియో కష్టములు మనల నెదుర్కొనినను, స్వరాజ్యమునకు మనకుగలసామర్థ్యముగూర్చి కఠినమగు పరీక్ష జరిగినదని మనము గ్రహింపవలెను. ఓర్పు, నైపుణ్యము, శాంతముతోగూడిన ఆత్మవిశ్వాసము, దేశమునందంతటను సంఘోపసంఘనిర్మాణము, స్వపక్షమునకు విధేయత, సంపూర్ణమగు ప్రజాధికారపరత్వము మున్నగునవి ఎన్నికలవలన మనకు లభించినవి.

## ద్వంద్వపరిపాలనము సాగించుట

మనమిపుడు కార్యమును ప్రారంభించుటకుగల అభ్యంతరము లన్నింటిని చాలవరకు నివారించితిమి. ఇటుపైని ప్రజలతో క్యాలను కొనసాగించువిషయమున ప్రభుత్వమువారు నిర్బంధించుటలో అధికమగు శ్రద్ధను జూపవలసియున్నది. మనగౌరవమునకు భంగము లేకుండను, న్యాయముగను వారు సమాధానమును చేయదలచినచో అందులకు మనము అవకాశము గలుగజేయుట ప్రస్తుతము అవసరము. అట్లు భారతీయులతో క్యాలను నెరవేర్చుటకుగాని ఆవిషయమున రాయబారముల జరుపుటకుగాని భారత బ్రిటను ప్రభుత్వములు సుముఖములుగ నున్నవని భావించుట నట్టిభ్రాంతియే. వారికి తీయనిమాటలు చెప్పుటలో మంచి ప్రజ్ఞ గలదు. ఫలితముమాత్రము శూన్యము. కాలయాపనము చేయుటకుతగిన చమత్కారములన్నింటిని వారు చూపుచుందురు. "మీరిపుడు స్వరాజ్యమును కోరగూడదు; మనఃపూర్వకముగను వివేకముతోను ద్వంద్వపరిపాలనమును సాగింపవలెను" అను ప్రత్యుత్తరమునే దొరతనమువారు పలుసారులు పటుత్వముతో మన కొసంగియున్నారు. మొదటి శాసనసభలలో మితవాదులు మున్నగు రాజకీయనాయకులు మనఃపూర్వకముగను, వివేకముతోను ద్వంద్వపరిపాలనమును సాగించియేయున్నారను విషయమును తమసదుపాయముకొరకు దొరతనమువారిపుడు మరుగుపరచుచున్నారు. కాంగ్రెసువారు శాసనసభల బహిష్కరించుట వలన సంస్కరణములను చక్కగ కొనసాగించుటకు శైథిల్య మేర్పడెనేకాని నిరోధము లెంతమాత్రము కలుగలేదు. ఏలయనగ ప్రభుత్వమువారి విశ్వాసమునకు పాత్రులైనట్టియు, ప్రభుత్వమునందు విశ్వాసము కలిగినట్టియు నితర రాజకీయపక్షములవారు మనఃపూర్వకముగ సంస్కరణములను కొనసాగించుటలో దొరతనమువారికి తోడ్పడియేయున్నారు. రెండవసారి శాసనసభలలో పెక్కురాష్ట్రములందును - ముఖ్యముగ మదరాసు బొంబాయి రాష్ట్రములందును- కొన్ని తెగల రాజకీయవేత్తలు దొరతనమువారు కోరినరీతినే సంస్కరణములను కొనసాగించియున్నారు. ఈరీతిగ దొరతనమువారితో మనఃపూర్వకముగను, వివేకముతోను సహకార మొనరించుటకు పూనుకొనిన భారతీయులు గత 6 వత్సరములలోను ద్వంద్వపరిపాలనమును సరిగ పరీక్షింపలేదని యిపుడు దొరతనమువారెట్లు చెప్పగలరు! రెండవ శాసనసభలలో వంగ మధ్యరాష్ట్రములందుతప్ప తక్కిన రాష్ట్రములలో స్వరాజ్యపక్షమువారు చేసిన ప్రతిఘటనము పార్లమెంటు పద్ధతిని కొంచెమైన నతిక్రమించియుండలేదు. ద్వంద్వపరిపాలనమును కాంగ్రెసువారు కొనసాగించినను, మితవాదులు కొనసాగించినను దొరతనమువారికి సమానమేయగును. కావున నిపుడు దొరతనమువారు కోరునది కాంగ్రెసువారు స్వరాజ్యమును కోరుటమాని నిరంకుశోద్యోగులలో చేరవలెననియే.

మనమింకను మనభావముల కనుగుణములైన పోలికలను భావించుకొనుచుండుటగాని, పత్రికావిలేఖకులు తెలిపెడు చిత్రములగు సూచనలందును, పెద్దయుద్యోగులతో పరిచయము గల్గియుండువారు తెలిపెడి వార్తలందును, బ్రిటిషుదేశీయులయొక్కయు, అచటి రాజకీయ పక్షములయొక్కయు భావములను మార్పుజాలకపోయినను మనకు సలహాచెప్పుటలో మాత్రము చాల సమర్థులగు పార్లమెంటుసభ్యుల వాక్యములలోను హృదయపరివర్తనమునకు నిదర్శనములను కనుగొనుటయందు కాలమును వృథచేయుట వివేకమని మనమింకనూహింపవచ్చునా? కావున ఇండియా దొరతనమువారుగాని, ఇంగ్లాండు దొరతనమువారుగాని సంగ్రహముగను, బహిరంగముగను, స్పష్టముగను, సంతృప్తికరముగను, అనుకూలమగు ధోరణిలోను తమభావమును వెల్లడింపవలెనని మనము గట్టిగకోరుట విధియైయున్నది. ఈలోగా మనకు కలిగిన విజయములను ఉపయోగించుకొని, మనదళములను బలపరచుకొని శాసనసభలలోను, దేశమునందును దొరతనమునకు అధికముగ ఒత్తిడిని కలిగించుచుండవలెను. మనకు సాహాయ్యకములగు సంపదలనన్నింటిని మనము కేంద్రీకరించి, అసహాయపద్ధతిని అవలంబించిన నిరంకుశోద్యోగులను గట్టిగా నెదిర్చి మనకొసంగ నిష్టములేనివారి చెంతనుండి స్వరాజ్యమును బలవంతముగ స్వీకరింపవలెను. ఈరాజకీయసంస్కరణములు వచ్చి ఆరేండ్లయినందున వాని మిథ్యాస్వరూపమునుగూర్చి దేశీయులకు మరపుకలిగియుండదనియు, సహవాసదోషమున వానిపై నేడు క్రొత్తగ ప్రేమ గలిగియుండదనియు నేను నమ్మెదను. సంస్కరణములవలన ప్రజాప్రతినిధులకు నిజమగు నధికార మెంతమాత్రమును కలుగలేదు. స్వపరిపాలనమాటయటుండ, సత్పరిపాలనమైనను కలిగించుటకు ఈసంస్కరణములం దవకాశములేదని మన యనుభవములవలన మనకు స్పష్టముగ తెలిసియేయున్నది. సంస్కరణముల చట్టముయొక్క ముఖ్యలక్షణములను సంగ్రహముగను, నిష్పాక్షికముగను పరీక్షించినచో, మన మిపుడు వానిపైని క్రొత్తనమ్మకమును కలుగజేసికొనినచో మనఅభివృద్ధిని నిరోధించినవార మగుదుమని నిశ్చయముగ మనము గ్రహింపగల్గుదుము.

## ద్వంద్వపరిపాలనమును సాగించుట సాధ్యమా?

బాధ్యతాయుతప్రభుత్వము సమకూర్చుటకుగాని, సత్పరిపాలనమైనను ఏర్పరుచుటకుగాని ద్వంద్వపరిపాలనము సాహాయ్యపడు ప్రథమ సాధనము కూడ కాజాలదని అనుభవజ్ఞులందరును ఏకగ్రీవముగ దెలిపియేయున్నారు. ఇపుడందరునుగూడ ఈవిషయము నామోదించియేయున్నారు. ద్వంద్వపరిపాలనము భారతీయులు సాగింపవలెనని బర్కెన్‌హెడుప్రభువు పట్టుపట్టుచున్నను అది లోపభూయిష్ఠమని ఆతడుగూడ పెక్కుసారు లొప్పుకొనక తప్పినదికాదు.

ద్వంద్వపరిపాలనము ననుసరించి రాజకీయశాఖలలో కొన్నిటిని పరిపాలించుటకు గవర్నరునకును అతని కార్యనిర్వాహకసంఘమునకును సంపూర్ణాధికారము గల్గుటయేకాక మంత్రులయధికారము నుతగ్గించుటయును, ప్రజాయత్తశాఖలపై శాసనసభవారి పరిశీలనము కొరంతచేయుటయును గూడ యేర్పడుచున్నది.

ఈవిపరీతపద్ధతి ననుసరించి మంత్రులు ఎల్లప్పుడును ఉద్యోగుల చెప్పుచేతలలో వారి యధీనులయ్యే యుండవలసి వచ్చుచున్నది. వారు స్వాతంత్ర్యప్రాణవాయువు నాఘ్రాణించుటకే అవకాశములేదు. మంత్రులును కార్యనిర్వాహకసంఘసభ్యులును కలసి ఆలోచించెదరని విల్లింగుడన్ప్రభువు గొప్పగా చెప్పుకొనెనుగాని అది ప్రభుత్వాయత్తశాఖల లాభమునకే యని స్పష్టమయినది. మరియును ప్రజాయత్తశాఖలనుగూర్చి కూడ ప్రభుత్వాయత్తశాఖాధికారులు ఆలోచించవలసియుండును. అందువలన వారియభిప్రాయానుగుణ్యముగనే యీశాఖల పరిపాలనముగూడ జరుగుచుండును. సంస్కరణల విచారణసంఘమువారియెదుట నీయబడిన సాక్ష్యములో ఈ విషయము స్పష్టముగ దెలుపబడెను. సివిలుసర్వీసు ఉద్యోగులందరును ప్రభుత్వమునకు చెందినవారేయగుటచే సివిలుసర్వీసు ఉద్యోగస్థులతో మంత్రులకుగల సంబంధములందు మంత్రు లేమియును చేయజాలకున్నారు. ధనసంబంధములైన నిరోధములనుగూర్చిన నిబంధనల వలనను, ప్రభుత్వాయత్తశాఖాధికారియగు ఆర్థికసభ్యుడే ప్రజాయత్తశాఖలనుగూడ పరిశీలింపవలసియుండుటవలనను, మంత్రుల యధికారము కేవలము నామమాత్రమే యగుచున్నది. వారు కీలుబొమ్మలగుచున్నారు. రాజకీయ శాఖలను విభజించుటలో గూడ ముఖ్యమైనవాని నన్నింటిని ప్రభుత్వమువారే వశపరచుకొన్నారు. మంత్రులకును కార్యనిర్వాహకసంఘమువారికిని యేవిషయమునందైన చర్చ గలిగినచో గవర్నరు ఉత్తరువే కడపటి తీర్పయియున్నది. గవర్నరు అధికారమునుబట్టియే ద్వంద్వపరిపాలనము సాగవలసియున్నది. శాసనసభవారు చేసిన తీర్మానమునకు వ్యతిరేకముగ స్వతంత్రించి చట్టముచేయుటకుగూడ గవర్నరుకు అధికారముగలదు. సంస్కరణములు రాకపూర్వముండెడి శాసనసభలకుండిన అధికారముగూడ ఇప్పటి శాసనసభలకు లేదనుటకు యిదియే ముఖ్యనిదర్శనము. శాసనసభ్యులందరును కలసిచేయునట్టి తీర్మానములను రద్దుపరచి వారందరును కాదనుచున్నను గూడ తానొక్కడే చట్టమును చేయుటకు గవర్నరు కధికార మొసంగుటవలనను, ఆచట్టము దేశమునందు అమలు జరుగుననుటవల్లను సంస్కరణముల చట్టముప్రకారము ప్రభుత్వాయత్తశాఖలలో బాధ్యతలేని నిరంకుశత్వ మేర్పరుపబడెననుటకు మనకు గట్టియాధారము లభించుచున్నది.

సంస్కరణముల చట్టమునందు ద్వంద్వపరిపాలన యొక్కటియే అపభ్రంశమనియు, దానిని తొలగించినచో మనకు కష్టములన్నియు నివారణయగుననియు తరుచుగ పలువురు నుడువుచుందురు; కాని ప్రజాయత్తశాఖలస్థితిగూడ నెంతమాత్రము బాగుగ లేదు. ప్రజాయత్తశాఖలవిషయమున బాధ్యతాయుత ప్రభుత్వమే లేదు. ఇపుడు మంత్రులకు వశపరుపబడిన శాఖలనుగూర్చి జరిగిన యేర్పాటుల ప్రకారమే యితరశాఖలనుగూడ మరికొన్నిటిని మంత్రులకు వశపరచినను ఎట్టిలాభమును కలుగదు. ప్రతిశాసనసభలోను ప్రజాయత్తశాఖలనుగూర్చి నియోజితసభ్యులందరును ఒకవిధముగ తీర్మానించినను నిరంకుశోద్యోగులపద్ధతిని భావములను బలపరచుటకు అధికారసభ్యులును, నియమితసభ్యులను హెచ్చుమంది యుండనేయుందురు. ఈరీతిగ నియమితసభ్యులు, ప్రత్యేకసంఘ ప్రతినిధులు, నోరువిప్పజాలనివారు దేశహితమునకు ప్రతికూలురు, నిరోధకులు మున్నగు వారు శాసనసభలలో హెచ్చుమంది యుండుటవలన మంత్రులు గవర్నరుపైనను కార్యనిర్వాహకవర్గముపైనను ఆధారపడుట విధియే అయియున్నది. శాసనసభలో నియోజితసభ్యులు పెక్కుమంది గలయొకపక్షముండినను ఆపక్షమునుండిగాక అల్పసంఖ్యాకులు గలమరియొకపక్షమునుండి మంత్రుల నియమించుటకు గవర్నరు కెట్టి కష్టము లేదు. నియమితులు, ఉద్యోగులు మున్నగుసభ్యులు ఈయల్పపక్షమునకు తోడ్పడుచునే యుందురు. ప్రతిశాసనసభలోను ఈపద్ధతిని చాలసారులు దొరతనమువారు అవలంబించియే యున్నారు. శాసనసభలనిర్మాణమునందు సహజముగ ఈ యవర్థక ముండుటచే శాసనసభలకు నిజమయిన ప్రాతినిధ్యమును నియోజితసభ్యులకు సరియైన అధికారమును లేకుండ పోవుచున్నది. గవర్నరు మంత్రులను నియమించవచ్చునను అధికారము అధికసంఖ్యాకముగు పక్షముయొక్క నాయకులను నియమించుటమాత్రమే కాదు. గవర్నరుపద్ధతిని కొనసాగింపగల యే అనామకునినైన ఒకనాయకునిగ నేర్పరచి ప్రభుత్వమును సాగింపగల అధికారముగూడ గవర్నరుకు గలదు. ప్రజాయత్తశాఖలలో సుపీరియరు సర్వీసునకు చేరిన ఉద్యోగుల జీతములు బత్తెములు మున్నగు వ్యయములనుగూర్చికూడ శాసనసభల కెట్టి పరిశీలనాధికారము లేదు. ప్రజాయత్తశాఖ లన్నింటిలోను గూడ యీవ్యయములు చాలహెచ్చుగనే యున్నవి. ప్రజాయత్తశాఖలలో ఉద్యోగులుగనుండు సివిలుపబ్లికు సర్వీసు వారి నందరిని నియమించు నధికారముగూడ గవర్నరుకే కలదు కాన మంత్రులకు వారిపై నధికార మేమియు లేదు. ఇండియను సివిలుసర్వీసు వారి స్వాతంత్ర్యమే సంస్కరణముల చట్టముయొక్క ముఖ్యలక్షణము. శాసనసభ్యులందరును ఎన్నుకొనబడినవారే కావలెను. మంత్రులు శాసనసభలకు బాధ్యులుకావలెను. సివిలుసర్వీసు మున్నగు ఉద్యోగులందరు మంత్రులకు విధేయులుకావలెను. అట్లు

జరుగనిచో బాధ్యతాయుత ప్రభుత్వ మను పేరుతో నేర్పరుపబడిన పార్లమెంటుపద్ధతిగల అధికవ్యయప్రద మగు ఈపరిపాలకవర్గమంతయును నిరర్థకాడంబరమే యగును. ప్రజాయత్తశాఖలలోగూడ మంత్రిచేసిన నిర్ధారణను రద్దుజేయుటకును తన యిష్టప్రకారము మంత్రిచే పనిచేయించుటకునుగూడ గవర్నరు కధికారముగలదు. ప్రజాయత్తశాఖలవ్యయమునుగూర్చి శాసనసభవారొకవిధముగ నిర్ధారణచేసినను దానిని రద్దుపరచి తన యిష్టానుసారము వ్యయము జరిపించుటకు గవర్నరుకు అవసరాధికారము గూడ గలదు. ఆ అవసరాధికారమును నిర్ణయించు అధికారము గూడ గవర్నరుకే విడిచిపెట్టబడినది. ప్రజాయత్తశాఖలను గూర్చి శాసనసభవారు చేయు చట్టములను ఆపివేయుటకు గూడ గవర్నరు కధికారము గలదు. ప్రజాయత్తశాఖలను గూర్చి శాసనసభవారొక చట్టమును జేసి గవర్నరు కంపినపుడు గవర్నరు తన అభిప్రాయమును వానిపైన వ్రాసి మరల శాసనసభ కంపవచ్చును. అప్పుడు శాసనసభవారు గవర్నరు యిష్టానుసారము చేయవలసినవారే యగుదురు. చెన్నపురి శాసనసభలో హిందూధర్మాదాయములగూర్చి గవర్నరుగానుండిన విల్లింగుడన్ప్రభువు యీ యధికారమును విజృంభణముతో జూపించియేయున్నాడు. మంత్రులద్వారా గవర్నరు శాసనసభను సంతృప్తికరముగ సాగించలేనపుడు మంత్రులతో పనిలేకుండ తానే ప్రజాయత్తశాఖల పరిపాలించుటకు గూడ గవర్నరు కధికారముగలదు. మధ్యరాష్ట్రములలో గవర్నరు ఈరీతిగనే చేసెను. ఒకవ్యక్తి గవర్నరు అనుగ్రహమున్నంతకాలమే మంత్రిగ నుండగలడు. శాసనసభవారి యిష్టముతో నెంతమాత్రము పనిలేదు. వంగరాష్ట్రమున లిట్టన్ప్రభువు దీనిని స్పష్టపరచియే యున్నాడు. ప్రజాయత్తశాఖలను గూర్చి కూడ అవసరమగు విషయములను చర్చించుటకు,ఇతరకార్యక్రమముల నిలిపివేయుడని శాసనసభాసభ్యు లెవరైన నుపపాదింప గోరినచో ఆ తీర్మానమును తిరస్కరించుటకునుగూడ గవర్నరు కధికారము గలదు. ప్రజాయత్తశాఖలకు సంబంధించిన ఆదాయమును నిర్ణయించు నధికారము గూడ గవర్నరునకును, కార్యనిర్వాహక సంఘమునకును మాత్రమే కలదు కాని శాసనసభల కెంతమాత్రమును లేదు.

దీనినిబట్టి చూచినచో ద్వంద్వపరిపాలనము పోయినను గవర్నరు అనుమతించినపుడు తప్ప ఎల్లప్పుడును ప్రజాయత్తశాఖలపై శాసనసభలకు అధికారముండదని స్పష్టముకాగలదు.

"ద్వంద్వపరిపాలనము చాలచిక్కులతోగూడిన పద్ధతియైయున్నది. దీనికి సహేతుకమగు ఆధారమేదియు గనపడదు. ఎల్లపుడును సామరస్యముపైననే ఆధారపడవలసియుండును. తాత్కాలికప్రయత్నమను కారణముననే యిది సమర్థింపబడదగియున్నది" అని సంస్కరణములనుగూర్చి విచారణజేసిన వారలలో హెచ్చుమంది వ్రాసిననివేదికయందే యున్నది. స్వరాజ్యమునొసంగుటకును, లేక స్వరాజ్యమునకు సాధకములగు మంచి సంస్కరణములను చేయుటకును కాలవిలంబమును కలిగించుటకు ఈద్వంద్వపరిపాలనము సాధనమగునేకాని మరెటుల నిది తాత్కాలిక సాధనమగునో, యెటుల సమర్థనీయమో దురూహ్యముగనున్నది. "ద్వంద్వపరిపాలనము సరిగ నెరవేరినదని నిర్ధారణగ జెప్పుటకు ఈపద్ధతి అమలులోనికి వచ్చి చాల స్వల్పకాలముమాత్రమే అయినది. కాని దేశీయులు మాకెరిగించిన విషయములనుబట్టి చూడ ఈపద్ధతి విఫలమైనదని మాత్రము మేమంగీకరించుటకు మా కెట్టియాధారమును కనబడదు" అనికూడ ఆ నివేదికయందు వ్రాయబడెను. ఈసంఘమువారి వచోనైపుణ్యముతోగూడిన యీపరిష్కారము చాల విచిత్రమైనదికాని దీనివలన నెవరును మోసపోజాలరు. సంకరములగు కార్యనిర్వాహకవర్గములును, నియోజిత నియమితసభ్యులతో గూడిన శాసనసభలును, మరి పెక్కు కృత్రిమపద్ధతులును కలవనియు, వానివలన వివాదలు కలుగుట కవకాశము కలదనియు ఈసంఘమువారే యొప్పుకొనియున్నారు. కావున వారి నివేదికయే సంస్కరణములచట్టమునకు బలవత్తరమగు ఖండన యగుచున్నది. "సంస్కరణములచట్టము విఫలమైనది. ఇకముందుగూడ దీనివలన మంచి ఫలితములు కలుగవు" అని విచారణసంఘమునందలి అల్పసంఖ్యాకులు తమ నివేదికయందు స్పష్టముగ వ్రాసియున్నారు.

### భారతప్రభుత్వము

భారతప్రభుత్వము భారతశాసనసభకు బాధ్యమైయున్నదని చెప్పుట కెంతమాత్రము వీలులేదు. భారత శాసనసభకు ఆదాయవ్యయములపై నెట్టియధికారము లేదు. వ్యయములో సైన్యాల వ్యయముగాకుండ మొత్తములో ముప్పాతికవంతుపైని శాసనసభకెట్టి అధికారమును లేదు. మిగిలిన నాల్గవవంతులోనైనను శాసనసభవారు నిరాకరించిన దానినిగూడ మరల వ్యయపరచుటకు దొరతనమునకు అధికారమున్నది. ఏ వ్యయమునైనను అనుమతించుటకు గవర్నరు జనరలుకు వ్యక్తిరీత్యా ప్రత్యేకాధికారముగూడగలదు. ఏ చట్టమునుగాని,మరతునుగాని,సవరణనుగాని నిలిపివేయుటకుగూడ అతనికి అధికారముగలదు. తాత్కాలిక నిబంధనలను (ఆర్డినెన్సులు) జేయుటకుగూడ గవర్నరు జనరలు కిప్పుడు క్రొత్తగ అధికారము లభించినది. సంస్కరణములచట్టము రాకముందు గవర్నరు జనరలు కెట్టి అధికారములేదు. శాసనసభవారు తిరస్కరించినయే చట్టమునైనను సర్టిఫికెటు ద్వారా స్థిరమగు చట్టముగ జేయుటకు గూడ గవర్నరు జనరలుకు స్థిరమగు నధికారమీయబడినది. ఏ విధముగ జూచినను భారత శాసనసభకు

పూర్తిగగాని కొంతవరకుగాని ప్రజాప్రాతినిధ్యమును ప్రజాధికారమునుగూడ లేదు. ఆ సభలో నాల్గవవంతుకు హెచ్చుగను మూడవవంతుకు తక్కువగను నియమిత సభ్యులుందురు. ఎన్నుకొనబడిన సభ్యులలో ముప్పాతికమంది ఏకీభవించినగాని దొరతనమువారిని ఓడింప వీలులేదు. దొరతనమువారికి నలువది ఓట్లు నికరముగ నున్నవి. ఇవిగాక రాష్ట్రీయసభలందువలె భారతసభలోగూడ ప్రత్యేకసంఘముల ప్రతినిధులుగూడ దొరతనము పక్షమునే చేరుచుందురు. ఇవన్నియునుగాక స్టేటు కౌన్సిలు ఇండియా దొరతనమునకు పెట్టనికోటయైయున్నది. ఆసభ ప్రాంతశాసనసభకు అంకుశప్రాయముగ నున్నది. ఆసభ యొక్క అంగనిర్మాణము ఆరీతిగ నేర్పాటుచేయబడెను. అది ప్రభుత్వమునకు అభేద్యస్థానమే. చాలసారులు శాసనసభవారామోదించిన ముఖ్యతీర్మానములను స్టేటుకౌన్సిలువారు త్రోసివేసియున్నారు. ఉప్పుపన్నును హెచ్చించుటకు వారు సమ్మతించిరి. ఆర్థిక చట్టమునుగూర్చి శాసనసభవారు చేసిన తీర్మానమును రాజప్రతినిధి రద్దుపరచినపుడు స్టేటుకౌన్సిలువారు రాజప్రతినిధి చర్యనే సమర్థించిరి. క్రిమినలు లా సవరణ చట్టమును సవరించుటకు శాసనసభవారు చేసిన చట్టమునుగూడ స్టేటుకౌన్సిలువారు త్రోసివేసిరి. వంగదేశనిర్బంధితులవిషయమున దొరతనమువారి చట్టమును శాసనసభవారు తిరస్కరింపగ స్టేటుకౌన్సిలువారు దాని నామోదించిరి. లీ కమిషను సూచనల విషయమునగూడవారటులనే సమర్థించిరి. సంస్కరణల విచారణసంఘములో హెచ్చుమంది వ్రాసిన నివేదికను శాసనసభవారు నిరాకరించినను స్టేటుకౌన్సిలువారామోదించిరి.

కావున యెట్లుచూచినను ప్రాంత శాసనసభలోను, రాష్ట్రీయ శాసనసభలలోను, ప్రజాయత్త శాఖలలోను ప్రభుత్వాయత్తశాఖలలోను, క్రియలలోను, సూత్రములలోను గూడ అధికారము ప్రభుత్వమునందే అనగా నిరంకుశ వర్గమునందే కేంద్రీభూతమైయున్నది. ఇట్టికృత్రిమ ప్రభుత్వయంత్రమున స్వపరిపాలన జీవాణువుల కొరకు మన మింకను వెదుకగోరినచో అది వ్యర్థప్రయత్నమే యగును.

### దేశబంధు దాసుగారి సూచన

భారతశాసనసభలో ప్రజాప్రతినిధుల తీర్మానము తిరస్కరింపబడుటయేకాక యోధమూర్తియగు దేశబంధుదాసుగారుజేసిన సూచనకుగూడ ఎట్టిప్రత్యుత్తరము రాలేదు. సమాధానమును కోరుచు ఫరీదుపూరులో దాసుగారు చేసిన మనసులను కరగింపజాలునట్టి గంభీరోపన్యాసమునందు గోచరించిన సూచనకంటె న్యాయమైనదేదియు నుండజాలదు. "బ్రిటీషు సామ్రాజ్యమున (కామనువెల్తులో) త్వరలో స్వరాజ్యమును స్థాపించుటకు మాకుగల అధికారమును దొరతనమువారు పూర్తిగా ఆమోదించినట్లు మాకు నిదర్శనములను జూపవలెను. స్వరాజ్యము వచ్చులోగా స్వరాజ్యమునకు సమ్మతమైనట్టియు అధికమైనట్టియు ప్రారంభప్రయత్నములను జరుపవలెను. ఇపుడు దొరతనమువారికి ప్రజాప్రతినిధులను నిరోధింపగల అధికారము అపారముగ నున్నది. దొరతనమువారు ఆయధికారమును పూర్తిగ వదలిచేయవలెను. మరియును రాజకీయ ఖైదీలనందరినిగూడ వదలివేయవలెను" అని దేశబంధు దాసుగారప్పుడు సూచించిరి. మనము స్వరాజ్యముకొరకు జేయుచున్న ప్రయత్నముగూర్చి చిరకాలమునుండి దొరతనమువారు రాజకీయనాయకులను దారుణశిక్షలకు పాలుచేయుచునేయున్నారు. ఈరీతిగ కఠినశిక్షలును సంస్కరణములును లంకెగానే వచ్చుచున్నవి. కఠినశిక్షలకు మెరుగుగ సంస్కరణములను, సంస్కరణములను శుష్కింపజేయుటకు కఠినశిక్షలును కలసియేవచ్చుచున్నవి. ప్రజల ప్రధాన హక్కులను నిర్లక్ష్యముగ దొరతనమువారు తృణీకరించిరనుటకు వంగనాయకులను, సిక్కువీరులను కారాగృహములకంపుటయే నిదర్శనము. వంగరాష్ట్రమునందలి కఠినచట్టముల దారుణచరిత్రయును, ఇంటర్న్ జేయబడిన యుకెరుల వృత్తాంతమును, పంజాబునందలి సంతాపయుతమగు ప్రాచీనచరిత్రమును పరికించిచూడ అవమానమును అగౌరవమునే మనకు చిహ్నములుగ కనబడుచున్నవి. స్వరాజ్యము మనకు జన్మహక్కుగ కనబడుటలేదు. విషాదకరమగు నీచక్రభ్రమణమున మనము చిక్కుకొనియున్నాము. ఇపుడున్న కఠినశాసనములన్నియును పూర్తిగ రద్దుపరచుటకును, ఇకముందు మరల నిట్టి శాసనముల జేయకుండుటకును దొరతనమువారు పూచీ పడనియెడల ఆత్మగౌరవమునకు అనుగుణ్యము, న్యాయమునకు సమాధానము దొరతనము వారితో కలుగ నవకాశము లేదు.

నిర్ణీతకాలము వచ్చువరకు ఇండియా ప్రభుత్వమును మార్చవీలులేదని చెప్పుచున్నవారె లీసంఘమువారి సూచనల ప్రకారము చట్టమునుమార్చుటకు నిరభ్యంతరముగ సాహసింపగల్గిరి. ఉన్నతప్రభుత్వశాఖల జీతములలో 1కోటి 25 లక్షల రూపాయలను ప్రతిసంవత్సరము హెచ్చించుటకు దొరతనమువారి కట్టినిరోధమును కలుగలేదు.

### భారతదేశ గౌరవస్థితి

భారతదేశమునకు స్వరాజ్యమును వారిచ్చుటలేదు. కాని అధినివేశనములు బ్రిటీషు సామ్రాజ్యమున సంపూర్ణ స్వపరిపాలనముగల స్వతంత్రదేశములనియును, బ్రిటీషు సామ్రాజ్యమున సమానాధికారముగల మిత్రదేశములనియును దేశీయవిషయములందును, విదేశవిషయములందునుగూడ ఈ దేశములో ఒక

దేశము మరియొకదేశమునకు లొంగియుండ పనిలేదనియును, ఐకమత్యమునకు మైత్రియేకారణమనియును, అన్నిదేశములును బ్రిటిషుదేశపురాజులపట్ల భక్తికల్గియుండవలెనియును సామ్రాజ్య ప్రధానమంత్రుల అన్యోన్యసంబంధసంఘమువారు స్పష్టముగ మరల ప్రకటించియున్నారు. ఏదేశము ఎంతవరకు ఇతరదేశములకు నేవిధముగ సహాయము చేయగల్గునదియును నిర్ణయించు నధికారముకూడ ఆయాదేశములకే ఈయబడినదనికూడ వారుప్రకటించిరి. ఇట్టి ప్రత్యేక హక్కులను గలిగిన దేశములలో భారతదేశమును మాత్రము వారు చేర్చలేదు. ఇతరదేశములవలె భారతదేశము స్వాతంత్ర్యమును సమానగౌరవమును కలిగియుండ వీలులేదటగాని మనశ్శల్యముగనుండు సామ్రాజ్యవ్యయమును మాత్రము భారతదేశము భరించుచుండవలెనట. భారతదేశము చేయవలసిన సహాయమును నిర్ణయించునధికారముగూడ ఇతరదేశములవారే నిర్ణయింతురట. కావున మనము మనయభిప్రాయములను స్పష్టముగ దెలుపవలసిన తరుణమువచ్చినది. భారతదేశము బ్రిటిషుసామ్రాజ్యమునందే యుండవలెనని ఆంగ్లేయులు కోరదరేని పైనవివరింపబడిన స్వాతంత్ర్యములన్నియుగూడ నిచ్చిననేకాని అదిసాధ్యముగాదు. భారతదేశ స్వాతంత్ర్యమునుగూర్చి యితరులు మితిని ఏర్పరుపగూడదు; ఏర్పరుపజాలరు.

ద్వంద్వపరిపాలనమును తొలగించినంత మాత్రమున ప్రత్యేకాధికారమును గవర్నరులు వదలుకొందురా? భారతప్రభుత్వము బాధ్యతాయుతముకానపుడు రాష్ట్రప్రభుత్వములు బాధ్యతాయుతములయినమాత్రము ఏమిలాభము? భారతప్రభుత్వము పూర్తిగా బాధ్యతాయుతము కానంతవరకును ప్రదర్శనస్వరూపము మారినను సంకల్పమును భావమును మాత్రముమారవు. భారతప్రభుత్వమును రాష్ట్రీయప్రభుత్వములునుగూడ బాధ్యతాయుతములే యయినను సివిలుసర్వీసు శాఖాధికారము చెక్కుచెదరకుండనున్నచో స్థితి యెప్పటివలెనే యుండును. యజమానులలో మార్పేమియును కలుగదుగాని విదేశీయ నిరంకుశవర్గము వారి అనుచరులగు భారతప్రతినిధుల సంఖ్య చాలహెచ్చగును. మంత్రిపదవులకు పోటీగూడ చాలమిక్కుటమగును. కావున సివిలుసర్వీసు మున్నగుశాఖల ఉద్యోగులను నియమించుట, పరిశీలించుట మున్నగు విషయములందు మన మెంతమాత్రమును చోటీయగూడదు. ఈశాఖలపై నిరంకుశవర్గమునకును, ప్రజాప్రతినిధులకునుగూడ పరిశీలనాధికారముండుటయును లాభకరముగాదు. సైన్యము, నౌకాదళము, భారతదేశపు సంస్థానములు-వీనినిగూర్చి శాసనసభలకు సంపూర్ణాధికారమొసంగిననేకాని స్వపరిపాలనము సార్థకముగాజాలదు. విదేశప్రభుత్వముల సంబంధముపై పరిశీలనాధికారము నీయకపోయినను భారత సంస్థానములపై [illegible]ట్టియధికారమును ముఖ్యముగ ఇచ్చితీరవలెను. అట్టియధికారము నీయనిచో భారతప్రజలపైనను, సంస్థానాధిపతులపైనను స్వరాజ్యప్రభుత్వమునకు ఆర్థిక రాజకీయ పరిపాలనాధికారము సమగ్రముగ లభింపజాలదు. మరియును సేన విదేశీయుల అధికారముక్రింద నున్నచో స్వపరిపాలనమునకు అది హానికరమగును. స్వపరిపాలనమునకు లోబడని సంస్థానములు ప్రక్కలో బల్లెములే యగును. ఈశాఖలిపుడు అధినివేశాధికార నిర్వచనమునందు చేర్చబడినవి. ఒకటిమొదలు నాలుగువరకును ప్రస్తుతము భారతప్రభుత్వమువలన పరిపాలింపబడుచున్నను యథార్థముగు స్వరాజ్యప్రభుత్వ మేర్పడుటకు ఇవి ముఖ్యమైనవిగా నున్నవి.

## సైనికదళము-నౌకాదళము

మనలో కొందరు సేనను నౌకాదళమును పరిపాలింప మనకిపుడు శక్తిలేదని సూచనగ నుడువుటచే సేనను నౌకాదళమును లేకుండ మీరెట్లుల రాజ్యముచేయగలరని ప్రతిపక్షులు మనలనడుగుట కవకాశముగలుగుచున్నది. మనము సేనను నౌకాదళమును పాలించలేమని తలచుటవలన మన చిత్తవృత్తియందు కల వైకల్యము వెల్లడియగుచున్నది. ఇది యెంతమాత్రము నిజముగాదు. ఇపుడున్న భారతసైన్యము చాలప్రసిద్ధమైనది. ప్రపంచమునందు అనేకయుద్ధములలో విజయమును బడసియున్నది. ప్రాచీనకాలమున అప్పటియేర్పాటుల కనుగుణరీతి మహమ్మదీయులును మహారాష్ట్రులును సైన్యములేర్పరచి విజయయాత్రల సాగించియున్నారు. కావున సేనలను పరిపాలించు విషయమున భారతీయులకు సామర్థ్యము లేదనుటకు చారిత్రక నిదర్శనమేమియును అగుపడదు. ప్రాచీనచరిత్రలు భారతవీరుల శౌర్యాతిరేకమునే వేయివిధముల బ్రకటించియున్నవి. ప్రాచీనకాలమందు భారతీయులు నౌకలనునిర్మించి,సముద్రప్రయాణముల నొనర్చి, దూరదేశములలో భారతజనస్థానములను నిర్మించియున్నారు. మనకు స్వాతంత్ర్యము లభించినచో మనము క్రొత్తపద్ధతిని శ్రేష్ఠమయిన నౌకాదళమును సైన్యమును నేర్పరుచుటకు నెట్టిసంశయము లేదు; ధనవిషయమునను, సైనికశిక్షావిషయమునను గూడ నెట్టి సంశయమును లేదు. జపాను చీనా మున్నగు స్వపరిపాలనగల చిన్నదేశము లన్నియును గూడ స్వతంత్రముగ సేనలను నౌకాదళములను నేర్పరచియేయున్నవి. అట్టిచో భారతీయులుమాత్రము వాని నేర్పరుపజాలరనుటకు ఆధారమేమియును లేదు. కావున స్వరాజ్యమనగా నేమో మీరు బాగుగ విచారణచేసి దాని అంగములను కోరుటలో లేశమైన సంశయింపగూడదని నేను నొక్కి చెప్పుచున్నాను.

ఇట్లుగా దొరతనమువారి శుభసూచనలకొరకు మనమెంతమాత్రము నిరీక్షింపగూడదు. దేశీయులందరును స్వరాజ్యమును మనఃపూర్వకముగ కోరుటకుతగిన ప్రచారమును వెనుకటికంటె వేయిరెట్లధికముగ మనమిపుడు చేయవలెను.

## శాసనసభలో జరుగవలసిన పని

జాతీయాభివృద్ధికి సాధకములగు అన్నివిషయములందును ఆత్మవిశ్వాసమును, జాతీయాభివృద్ధికి నిరోధకములగు అన్నివిషయములలోను ప్రతిఘటనమును మనకు ముఖ్యాధారములుగ నుండవలెను. అసహాయోద్యమము ప్రబలముగనున్న రోజులలో ఈరెండు సూత్రములే ప్రజలకందరికిని ముఖ్యాధారములుగ నుండెను. ఈవిషయమున ప్రస్తుతము దేశమునందును శాసనసభలలోను జరుగవలసిన పనినిగూర్చి కాన్పూరులో కాంగ్రెసుమహాసభవారు చేసిన యేర్పాటులలో ముఖ్యమైనవానిని మార్చుటకు నెట్టి అవకాశమును గనుపడదు.

భారతశాసనసభలలోను ఇతరశాసనసభలలోను దొరతనమువారును ఇతరులును స్వరాజ్యప్రాప్తికి నిరోధకములగు కార్యములను చేసినపుడు ప్రతిఘటనమే కర్తవ్యము. మరియును

(1) ప్రజాప్రతినిధుల కోర్కెలకు దొరతనమువారు సరియగు ప్రత్యుత్తర మొసగువరకును దొరతనమువారిచ్చుఉద్యోగములను వేనినిగూడ కాంగ్రెసువారు స్వీకరింపగూడదు.

(2) భారత కాంగ్రెసు కార్యసంఘమువారు మరియొకరీతిగ నిర్ణయించినపుడు తప్ప సాధారణముగ సప్లయిలను త్రోసివేయవలెను.

(3) ఆర్థికపత్రములను నిరాకరింపవలెను. నిరంకుశోద్యోగులు తమ అధికారములను బలపరచుకొనుటకు చేసెడిసూచనలనన్నిటిని తిరస్కరింపవలెను.

(4) జాతీయతపరియగుపద్ధతిని అభివృద్ధినొందుటకును, ఆర్థికవ్యవసాయ పరిశ్రమ వాణిజ్యాది విషయముల యభివృద్ధికిని సాధకములగు చట్టముల నుపపాదించుచు బలపరచుచు నుండవలెను.

(5) జమీందారుల హక్కులకు భంగము కలుగకుండ వ్యవసాయవిషయమున రయితులస్థితిని బాగుచేయుటకు పెర్మనెంటుసెటిల్ మెంటు మున్నగువానిని జేయుటకు తగినప్రయత్నములను జేయుచుండవలెను.

(6) భూస్వాములకును రయితులకును, పరిశ్రమల యజమానులకును పనివాండ్రకును, పరస్పరము సద్భావమును కలిగించుచు మొత్తముమీద వ్యవసాయపుపనులుచేయు పనివాండ్రయొక్కయు, యంత్రశాలలలో పనిచేయు కార్మికులయొక్కయు హక్కులను కాపాడుచుండవలెను.

అను నీయేర్పాటు లనుభవముమీద రాజకీయము లందు దేశసేవచేయువారిలో హెచ్చుమందికి సంతృప్తియగునటుల కాన్పూరు మహాసభలో ఆమోదించబడెను. మనయుద్యమము సఫలమగుటకు ఇదియే కనీసపక్షముగు ప్రతిఘటనము.

## పదవులను స్వీకరించుట

ఈవిషయమునుగూర్చియే యిపుడు చాల వివాద మేర్పడినది. నిరంకుశోద్యోగులతో మనకు కలిగియున్న సంఘర్షణమునకు నిజముగ నుద్దేశమేమని బాగుగ నాలోచించినచో నీసమస్యను సులభముగనే పరిష్కరింపగల్గుదుము. కాంగ్రెసువారు పదవులను స్వీకరించి తమ సంకల్పమును గవర్నరును, కార్యనిర్వాహకవర్గమువారును నెరవేర్చునట్లు చేయుటకు శాసనసభలలో కాంగ్రెసువారిసంఖ్య మిక్కిలి హెచ్చుగ నుండవలెను. ఇప్పుడు ఒకరాష్ట్రమునందుగూడ కాంగ్రెసువారి సంఖ్య అంతహెచ్చుగ నుండియుండలేదు. ఇపుడు కాంగ్రెసువారు మంత్రిపదవులను స్వీకరింపవలెననిన తమ వ్యక్తిత్వమును వదలుకొని తమ పతాకమును క్రిందకు దింపి యితరపక్షములవారితో చేరవలసివచ్చును. ప్రస్తుత పరిస్థితులలో ఏపక్షమువారు మంత్రివర్గము నేర్పరచినను దొరతనమువారిసహాయత లేకుండ పరిపాలనమును సాగింపజాలరు. ఇతరపక్షములవారు మంత్రిపదవులను స్వీకరించి చేయగలదానికంటె కాంగ్రెసువారును హెచ్చుగా నేమియు చేయగల్గియుండరు. అట్టి స్థితిలో మంత్రిపదవులకు రాజీనామానైన నియ్యవలెను; లేక తమ పరాజయమునైన దీనముగ ప్రకటింపవలెను. దృఢచిత్తుడగు మంత్రి పరిపాలనావిధానములలో కొన్ని చిన్నమార్పులను చేయగల్గునేమో కాని గొప్పగొప్పమార్పుల నేమియును చేయజాలడు. ఇక ప్రభుత్వపద్ధతిని మార్చుట అసంభవము. ఈరీతిగ చిన్నచిన్న మార్పులను చేయుటవలన ఈనిరంకుశప్రభుత్వమునకు మంత్రులు మరింతబలమును కలిగించినవారే యగుదురు. ఆయారాష్ట్రములలో మంత్రులు చేసిన పనిని శ్రద్ధగ గమనించినచో స్వపరిపాలనావిధానము చక్కగ నేర్పడినగాని మంత్రులు సత్పరిపాలనము కలుగజేయజాలరని స్పష్టము కాకపోదు.

ఒకశాసనసభలో ప్రతికూలపక్షమువారి సంఖ్య హెచ్చుగానుండి వారు కట్టుదిట్టముగ నున్నచో వారికిగల సౌకర్యములు మంత్రుల కింతమాత్రమును లేవు. వారి అధికారము నిజమయినది. వారు తమపద్ధతిని సులభముగ కొనసాగింప గలరు.

దొరతనమువారు తగినప్రత్యుత్తర మిచ్చువరకును పదవులను స్వీకరింపకుండుటలో దొరతనమువారు లొంగివచ్చుటకు తగినంత ఒత్తిడిని కలిగింపవలెనను భావము ఇమిడియున్నది. కాంగ్రెసువారు పదవులను స్వీకరించినచో అప్రయత్నముగ వారు నిరంకుశవర్గమునకు తోడ్పడినవారగుదురు. ప్రబలమగు కాంగ్రెసుపక్షము ఇట్లు చేసినచో నిక దేశమునందు ద్వంద్వపరిపాలనమును నిర్మూలించుటకును, స్వరాజ్యము బడయుటకును శాసనసభలలో ప్రతిఘటింపగల పక్షము మరేదిగలదు? మంత్రు

## ౪౧-వ జాతీయమహాసభ - గౌహతి



నార్త్‌బ్రూకు ద్వారము



నార్త్‌బ్రూకు ద్వారము - మరియొకదృశ్యము
కుడివైపున శుక్రేశ్వర దేవాలయ మున్నది



ఉమానందద్వీపము లేక నెమలి



ఊర్వశీపర్వతము - ఈకొండపైన దీపస్తంభ మున్నది

# చెన్నపురిరాజధాని నూతన మంత్రివర్గము



ప్రధానమంత్రి
శ్రీ డాక్టరు సుబ్బరాయన్‌గారు



రెండవమంత్రి
శ్రీ ఏ. రంగనాథ మొదలియారుగారు



మూడవమంత్రి
దివాన్‌బహద్దర్ శ్రీ ఆర్. యన్.
ఆరోగ్యస్వామి మొదలియారుగారు

బలహీనులకును, పాలిపోయిన వారికిని ప్రొఫెసర్ జేమ్సుగారి

# తప్పక గుణమిచ్చును! ఎలక్ట్రో టానిక్ ముత్యములు తప్పక గుణమిచ్చును!!




అధిక శ్రమవల్లను, క్షుద్రనడతవలనను కలిగిన నరముల బలహీనత, నిద్రలేమి వీర్యస్ఖలనము, మెదడు బలహీనత, మెదడు చీకాకు, చదువునందుగాని, వ్యాపారమునందుగాని యిష్టత లేకుండుట, నిస్సత్తువ, దేహపటుత్వము తగ్గుచుండుట, నష్టమైపోయిన వీర్యమును వృద్ధిపరచుట మున్నగు వాటికి తప్పక గుణమిచ్చును.

ఉద్యోగీయులకు, నిరుద్యోగియయ్యు అధికశ్రమ నొందువారికి, పాదిరీలకు, ఉపాధ్యాయులకు, విద్యార్థులకు, న్యాయవాదులకు, గుమాస్తాలకు, శెట్టీలకు, వ్యవహారులకు, మనశ్శక్తి నుపయోగించు ప్రతి యొక్కరికి అవసరమైన దార్ఢ్యమును జేకూర్చు యెల్లపదార్థము లిం దిమిడియున్నవి.

వార్థక్యముచే సంభవించిన దౌర్బల్యమును పోగొట్టుటయు, నరములకు బలహీనతను తగ్గించి దార్ఢ్యమును కూర్చుటయు, ఈ ముత్యములయొక్క అమోఘమైన గుణమై వెలయుచున్నవి.

విపరీత వీర్యనష్టము నాపుటయందును, సన్నితమైన రక్తనాళములకు పుష్టిని కూర్చుటయందును, అన్నివిధముల డీలా అయిపోయిన మానవునకు నూతనముగ దార్ఢ్యమును ప్రసాదించుటయందును వీటి నుపయోగింపదగును.

ఈ మందును సేవించుటకు ప్రారంభించు మొదటిదినమునందే నరములకు పుష్టి, మానసికవికాసము, మనోధైర్యము, దార్ఢ్యము, సౌఖ్యము ప్రసాదింపబడుచున్నటు లెరింగి యీ మహత్తరౌషధముయొక్క అద్భుతగుణములే యని ప్రశంసింపగలవు. జఠరాగ్ని దీపించును. వీర్యస్ఖలనముకట్టుట ఒక్క సమ్మోహనమే అనిపించును. అద్భుతమైన ఆకలి జనించును. పేగులు సరియైనస్థితిలో నుండగలవు. ముఖమునకు తేజస్సు నిచ్చి, కుందనపుఛాయ వచ్చును. నేత్రములయందు జీవకళ లుట్టిపడుచుండును. దృష్టిలోపముల నణచును. నీనడక, తీరునం దొకపొంకము బయలుదేరును. స్త్రీప్రకృతికి వన్నెగలుగును. మెదడు వికసించును. మంచి జ్ఞాపకశక్తి నొసగును. కండలుపెంచి బలమును ప్రసాదించును.

ఉపయోగించు విధానము:—ఉదయమున నొకమాత్రయు, సాయంకాల మొకమాత్రయు స్వల్పముగ నీటితో భోజనానంతరము సేవించవలెను.

| | | | పోస్టుఖర్చు ప్రత్యేకము | | | | పోస్టుఖర్చు ప్రత్యేకము |
|---|---|---|---|---|---|---|---|
| ధర 25 మాత్రలుగల | బుడ్డి 1 కి రు | 1-4-0 | 0-6-0 | 40 మాత్రలుగల | బుడ్డి 1 కి రు | 2-0-0 | 0-6-0 |
| | బుడ్లు 3 కి ,, | 3-8-0 | 0-6-0 | ,, | బుడ్లు 3 కి ,, | 5-8-0 | 0-6-0 |

సోల్ ఏజంట్లు:-ఆంగ్లో ఇండియన్ డ్రగ్ & కెమికల్ కంపెనీ, డ్రగ్గిస్టులు కెమిస్టులు

జుమ్మామసీదు, బొంబాయి 2.

లను వారిపక్షమువారును శాసనసభలో ప్రజాయత్త శాఖలను గూర్చి ప్రతికూలముగ మాటలాడగూడదు; ఓటుచేయగూడదు. మనకోరికకు ప్రభుత్వమువారు ప్రత్యుత్తర మీయలేదు. రాజకీయఖైదీలను, ఇంటర్నీలను వదలలేదు. ఈ సందర్భములలో మనము మంత్రిపదవులను స్వీకరించినచో మనము పూర్తిగ లొంగితిమనియే ప్రపంచవాసులు గ్రహించెదరు కాని మరియొట్లు గ్రహింపగలరు? మనమట్లు లొంగకున్నచో మనకు విజయము నిశ్చయమైయున్నపుడు ఆత్మగౌరవమునకు భంగకరమగు ఈదైన్యమునకు మన మేల ఒడంబడవలెను?

మనము వెంటనే శాసనోల్లంఘనమును ప్రారంభింపజాలనపుడు మనము లొంగిపోతిమని ఒప్పుకొని పదవులను స్వీకరించుటయే మంచిదని కొందరనుచున్నారు. ఇది వట్టిభ్రాంతి. మనపద్ధతి చాల సముచితమైనది. పట్టుదలతో కొంతకాలము సాగించినచో విజయము నిశ్చయము. సంస్కారవాదుల చట్టమును వేలకొలది సభలలో నాయకులు పూర్తిగ నిరసించియున్నారు. పదవులను స్వీకరించుటవలన లాభములేదని స్పష్టపరచియున్నారు. అట్టిచో నిపుడు మనము మంత్రిపదవులను స్వీకరింపవలె ననుట యిదియేటి వెర్రి? వివేకములోను, నిష్పూర్వకముగను నిరంకుశత్వమునకును, కార్యనిర్వాహకవర్గమునకును సహాయము చేయగోరినచే కాంగ్రెసువారు మంత్రిపదవుల స్వీకరింపవలెనని దొరతనమువారి అభిప్రాయమని నేను దలంచుచున్నాను. స్వార్థత్యాగములేకుండ మనమేదియును సాధింపజాలము. నిరంతర ప్రతిఘటనము సాగించుటకు మన యుద్యమమునకు నూతనోత్సాహము అత్యవసరము. ఎప్పటికిని మేము పదవులను స్వీకరింపము అని మేము చెప్పుటలేదు. ఫరీదుపూరులో దేశబంధు దాసుగారు చేసినసూచనలకు గాని, యించుమించుగ నట్టివానికిగాని దొరతనమువారు అంగీకరించినచో మనపద్ధతిని మార్చుట కెట్టి యాక్షేపణయు లేదు.

కడచిన మూడేండ్లలో శాసనసభలలో మీరు ప్రతిఘటనము సాగించినను అందువలన నెట్టిలాభమును కలుగలేదని కొందరనుచున్నారు; కాని యిది నిజముగాదు. వెనుకటి భారతశాసనసభలోను రాష్ట్రీయసభలలోను మనపక్షమువారు చాలసుకార్యముల చేసియున్నారు. ఎన్నికల ఫలితముగూడ దీనికి ప్రబలనిదర్శనముగ నున్నది. దేశమునందును, శాసనసభలలోను ప్రజలలోను ప్రతిఘటనశక్తిని వృద్ధినొందించుటకే మనము శాసనసభలకు వెళ్ళియుంటిమి. మనము వెళ్ళిన పిదప శాసనసభలలో అద్భుతముగు మార్పు కలుగనే కలిగినది. ప్రతిఘటనశక్తి మన కింకను పూర్తిగా కలుగనేలేదు. కార్యసిద్ధికి నెంత అధికముగ నది కలుగవలెనో అంత అధికముగ దానిని మనము అలవరచుకొనవలెను. ఈసారి మనము దేశమునందు గూడ అధికముగ పని చేయవలెను. అప్పుడే ప్రతిఘటనశక్తి అత్యధికముగా వృద్ధినొంది సర్వమును లోబరచుకొనగల్గును.

భారతదేశ చరిత్రలో కాన్పూరుకాంగ్రెసు నూతన శకారంభ మనదగును. ఆసభలో స్వరాజ్యపక్షమువారి విధానమును కాంగ్రెసు స్వీకరించి ఆపక్షమును తనలో నిముడ్చుకొనగల్గెను. దొరతనమువారిచే నేర్పరుపబడిన శాసనసభలను కూడ వశపరచుకొని వానిని జాతీయసంస్థలుగ జేయవలెనని కూడ సంకల్పించెను. కాంగ్రెసువారు ఈరీతిగా శాసనసభలను గూర్చి తీర్మానించినందులకు పెక్కు సంఘములవారు తీవ్రముగ విమర్శించిరి. శాసనసభలపై కాంగ్రెసువారు పరిశీలనాధికారమును కోరుటనుచితమనిరి. కాని యది సముచితమైనహక్కే యగును. అసహాయోద్యమము ప్రబలముగ నున్న రోజులలో శాసనసభలు జాతీయతను నిర్మూలించుటకు సాధనములైనవి. కాంగ్రెసువారి ప్రయత్నములకు ఆటంకములను కలిగించినవి. కావున దొరతనమువారును ప్రజలును ఏర్పరచిన సంస్థలన్నియును జాతీయసంస్థలుగమారి ఏకరీతిని పనిచేయుట అత్యావశ్యకమైయున్నది.

### జాతీయప్రభుత్వము

స్వరాజ్యమును గూర్చియే మన మెల్లప్పుడును ధ్యానించుచుండవలెను. స్వరాజ్యమనగనేమి? దానికొరకు మనమేమి చేయవలెను? ఏమి చేయగూడదు? అను విషయములనుగూర్చి తలపోయుచుండవలెను. ప్రజలపైని కాంగ్రెసునకు సంపూర్ణాధికార ముండవలెను. గాఢమగు నైకమత్యమును, అత్యధికమగు దేశాభిమానమును, స్వార్థత్యాగమును గల దేశారాధకులు వేలకొలదిగను, లక్షలకొలదిగను ఏకీభవించి నిరంతరము దేశసేవ చేయుచుండవలెను. కాంగ్రెసునకు ప్రజలపై నధికార మెంత అధికముగనుండునో దానిపైననే మన మేర్పరుపగల స్వరాజ్య మాధారపడియుండును. భారతీయులొనర్చునట్టి సకలకార్యములకును కాంగ్రెసు మహాసభయే కేంద్రస్థానముగ నుండవలెను. కాంగ్రెసునందును, కాంగ్రెసుసహాయమునను మనము స్వరాజ్యమును ఏర్పాటుచేయవలెను. కావున శాసనసభలకును, స్థానికసంఘములకును ప్రతినిధుల నెన్నుకొనుటకు అధికారముగల ప్రజలనందరిని వశపరచుకొని వారిలో తగిన కట్టుబాటును కలిగించుట కాంగ్రెసువారి కర్తవ్యమైయున్నది. కాంగ్రెసు మహాసభవారి యాజ్ఞలే జాతీయప్రభుత్వమువారియాజ్ఞ లనుభావములో ఆయాజ్ఞలకు వడుగు దాటకుండునటులు నియోజనాధికారము కలిగినవారును, లేనివారును అగు భారతీయులందరిని కాంగ్రెసువారు సరియైన పద్ధతిలోనికి దీసికొని రావలసియున్నది. అసహాయోద్యమముప్రకారము రాజకీయ పరిపాలకవర్గములను ప్రభుత్వమునకు వదలివేసి ప్రత్యేకముగ జాతీయపరిపాలనము నేర్పరుచుటకు ప్రయత్నింపబడెను. ఇప్పుడు రాజకీయ పరిపాలకవర్గ

ములకు చేరనివారిని, వారివిషయమున శ్రద్ధగ పనిచేయుచున్న వారినిగూడ కాంగ్రెసు పరిశీలనక్రిందకు తెచ్చుటకే ప్రయత్నింపవలసినది. దేశీయులలో హెచ్చుమందికి కాంగ్రెసుపై ప్రేమ గలదనియు,వారు కాంగ్రెసుఆజ్ఞలకు బద్ధులు కాగోరుచున్నారనియు మొన్నటి యెన్నికలవలన స్పష్టమైనది. కాంగ్రెసు భావమునకు ననుగుణ్యమైన భావమునే శాసనసభలకును, స్థానిక సంఘములకును నియోజితులగు వారందరును కలిగియుండునటులు ప్రచారముచేయుట ముఖ్యతమము. గ్రామసంఘములు, స్థానిక సంఘములు, శాసనసభలు మున్నగు వానికన్నిటికిని కాంగ్రెసువారే ఆజ్ఞల నీయవలెను గాని దొరతనమువారు కాదు. అటులుజరిగినచో దేశమునందును,శాసనసభలలోను జరుగు పనికి మిక్కిలి సన్నిహితసంబంధ మేర్పడును. అందువలన దొరతనమువారి కత్యధికముగు ఒత్తిడి కలుగును. నియోజక వర్గములును, శాసనసంఘములును, కాంగ్రెసును ఏక సంఘముగ పనిచేయగల్గినపుడు ప్రజలహక్కులను, కోరికలను అమలు జరుపుటకు ఉత్తరువులు సహజముగనే లభించగలవు.

ఇపుడు ప్రజల ముఖ్యమగుహక్కులెన్నియో నిరాకరింపబడుచున్నవి. తమకట్టి హక్కులు గలవను విషయముగూడ చాలమందికి తెలియదు. కావున నీవిషయమున కాంగ్రెసువారు శ్రద్ధ పూనవలసియున్నది. దేశమునందు అన్ని రాష్ట్రీముల శాసనసభలందు సభ్యులుగ నుండు కాంగ్రెసువారు ప్రత్యేకజాతీయ చట్టనిర్మాణసభగా నేర్పడి ప్రజ లనుసరింపదగిన ఆవశ్యక చట్టములను జేయవలెను. ఇబ్బందులను తొలగించుటలో ఆత్మవిశ్వాసమును ప్రతిఘటనమునే మూలసూత్రములుగ నుండవలెను గాని ప్రభుత్వముతో సహకారము మూలసూత్రముగ నుండగూడదు. ప్రజలు తమహక్కులను ప్రకటించి ఆత్మ విశ్వాసముతో ప్రతిఘటించుటకు తగిన శక్తిని ప్రజలలో కల్గింపవలెను. మద్యపాననిరసనము, భూములపై పన్ను, నిరుద్యోగ సమస్య మున్నగు సమస్యలను మనము పరిష్కరింపగలిగినచో మన కధికముగు నభివృద్ధి చేకూరగలదు.

శాసనసభాసభ్యులు, నితరులునగు కాంగ్రెసువారందరును శ్రద్ధబూని గ్రామములలోను,పట్టణములలోను నిరంతరము ప్రచారమునుసాగించి దేశసేవలో నొండొరులకు తోడ్పడుచు ప్రజలకు అధికముగు ఇబ్బందిని కలిగించుచున్న సమస్యలనుగూర్చి ప్రజలలో కట్టుబాటును కలిగింపగల్గినచో త్వరలోనే ఫలసిద్ధి కలుగగలదు.

కాంగ్రెసువారి వుత్తరవుప్రకారము స్వరాజ్యమునకు శాశ్వతోపశాఖగానుండి గ్రామపరిపాలనమును సాగించగల గ్రామసభలను మనమేర్పాటుచేయవలెను. ఈవిషయమున చాల కష్టములు మనల నెదుర్కొనునని మనము నిరుత్సాహమును చెందకూడదు. వానినన్నిటిని అతిక్రమించగల ఉత్సాహమునే కలిగియుండవలెను. దీక్షతోగూడిన మిత్రత్వమువలననే కార్యసిద్ధి చేకూరును. స్వరాజ్యముకొరకు గ్రామములలో కట్టుబాటును జేసి గ్రామనాయకత్వమును వహించుటకు ఆశలను జయించి దీక్షపూనుటయందే భారతీయనాయకుల దేశాభిమానమును నిర్మాణకౌశలమును ప్రస్ఫుటము కావలసియున్నవి. గ్రామపునర్నిర్మాణము నెరవేరుటకు సమర్థులగు నాయకులను అన్వేషించుటయే పరమరహస్యము. ఈరీతిగ జేయగల్గినచో కాంగ్రెసు త్వరలోనే జాతీయప్రభుత్వము కాగలదు.

### స్థానికసంఘములను వశపరచుకొనుట

అటుపిమ్మట జేయగల్గిన ముఖ్యకర్తవ్యము స్థానికసంఘములను వశపరచుకొనుటయే. నిర్మాణ విధానమునుగూర్చియు, ఇతరకార్యములగూర్చియు ఇది అత్యంతావశ్యకము. స్థానిక కాంగ్రెసుసంఘముల సలహాప్రకారము నిర్మాణకార్యమును సాగించుటకు దీక్షబూనిన కాంగ్రెసువారు మునిసిపాలిటీలలోను, లోకలుబోర్డులలోను అధికముగు స్థానములను వశపరచుకొన గల్గినచో జాతీయోద్యమమునకు అపారముగుశక్తి లభింపగలదు. ముఖ్యముగ మద్యపాన నిర్మూలమునకు ఘనమగు సహాయము చేయగల్గుదుము. స్థానికసంఘముల క్రింద నున్న విద్యాశాలలలో జాతీయవిద్యను నెలకొల్ప వీలగును. ఆ పాఠశాలలలోని విద్యార్థులలోను, ఉపాధ్యాయులలోను, స్థానికసంఘముల ఉద్యోగులలోను, నియోజకులలోను ఖద్దరును బాగుగ వ్యాపింపజేయ వీలగును. ప్రజలలో చాలమందికి జీవనాధారమును కలిగించుటకుగూడ అవకాశము లభించును. స్థానికసంఘములు కాంగ్రెసువారి పరిపాలనకు వచ్చినచో ఆయుద్యోగులందరునుగూడ జాతీయవాదు లగుదురు. స్థానికసంఘములు ప్రజల కెట్టి సదుపాయములు చేయనుద్దేశింపబడినవో అట్టిసదుపాయముల నిపు డాసంఘములు చేయజాలకున్నవి. ఆలోపమునుతీర్చుటకును, ఇంకను అధికముగు సహాయము చేయుటకును కాంగ్రెసువారు వానిని వశపరచుకొనవలెను. అందువలన ఆస్థానికసంఘములకు సంబంధించిన కాంగ్రెసునకు ప్రజలుగూడ వశులగుదురు. కాంగ్రెసు నాయకుల నాయకత్వమునకు వారు సమ్మతింతురు. ప్రస్తుతము ఈప్రజలు కొన్నిచోట్ల జాతీయవాదులు కానివారికే వశంవదులై యున్నారు. కొన్నిచోట్ల మనకును, అట్టివారికిగూడ పలుకుబడి విభజింపబడియున్నది. ప్రస్తుతము స్థానికసంఘములపైని నిరంకుశోద్యోగులకును, వారిమిత్రులకునుగల పలుకుబడిని తొలగించి ప్రజలపై కాంగ్రెసుయొక్క పలుకుబడిని చాల వృద్ధిపొందించవలెను. అందువలన మీలో గాఢముగనుండు దేశభక్తిని ఇతరులలోగూడ మీరు వ్యా

పింపజేయ గల్గుదురు. కాంగ్రెసువారిలో అన్ని తెగలవారును ఏకీభవించి కాంగ్రెసుసంఘముల సంఖ్యల వృద్ధినొందింప గలరు. అందువలన స్వరాజ్యసమరమును అధికముగ కొనసాగింప వీల గును. గ్రామపునర్నిర్మాణమును జరుపుటకు స్థానికసంఘముల సహాయము లేకుండ పూనుకొనుటకంటె స్థానికసంఘముల సహాయముతో పూనుకొనినచో సౌలభ్య మధికముగును. స్థానిక సంఘములను జాతీయసంఘములుగ జేయు ప్రయత్నమునందు మన కిదివరకే కొంత జయము సిద్ధించియున్నది. అది సాధ్యమనికూడ జూపింపగల్గియున్నాము. ఒకప్పుడు మనకు విజయము కలుగక పోయినందునవలనను, కేవల శాస్త్రాధారములకు ప్రతికూల వాదములవలనను, పక్షములను యేర్పాటుచేసి సాగించుటలోను రెండింటి కలహ ప్రయత్నించుటలోను కలుగు మితిలేని యిబ్బందుల వలనను మనపట్టుదలను పరిత్యజింపగూడదు. స్థానికసంఘములలో సభ్యులను నియమించుపద్ధతిని పూర్తిగ తొలగింపవలెను. కాంగ్రెసుసంఘములు జాతీయసంఘములు గావలెను.

## నిర్మాణవిధానము

శాసనసభలలోను, స్థానికసంఘములలోను పని యెంతముఖ్యమో నిర్మాణవిధానముగూడ అంతముఖ్యమైనదేయగును. ఖద్దరు, మద్యపాననిర్మూలనము, అస్పృశ్యతానివారణము మున్నగు నిట్టినిర్మాణకార్యములు అత్యంతముఖ్యములని అందరు గ్రహింపవలెను. రాజకీయములు మున్నగు ఇతరకార్యములభారము ఎంతహెచ్చుగనున్నను నిర్మాణవిధానమును మాత్రము అశ్రద్ధచేయకూడదు.

## ఖద్దరు

పూజనీయుడగు గాంధిమహాత్ముని ప్రోత్సాహమువలనను, దృఢమగు దీక్షవలనను దేశమునందు రాట్నముల పవిత్రధ్వనులు మరల అధికమయినవి. విదేశవస్త్రబహిష్కరణము చాలవరకు నెరవేరినది. దేశమునందు దేశీయపరిశ్రమలన్నిటియందు ప్రజల కభిమాన మధికమయినది. జాతీయభావము వృద్ధిచెందినది. స్త్రీలకును, పురుషులకును ఆత్మగౌరవము హెచ్చినది. ప్రపంచమునందు భారతదేశ విఖ్యాతి విస్తరించినది. మొదట కేవలము ప్రతికూలురుగనుండి నిరసించినవారుగూడ ఇప్పుడు దాని నామోదించియున్నారు. దేశములో చాలమంది పనులులేక అల్లాడుచుండగ దొరతనమువారేమియు చేయజాలకున్నను అట్టివారికి పనులను కల్పించుటకు ఖద్దరు ఉద్యమము ఆధారమయినది. ఈయుద్యమమునకు ప్రేమయే జీవనము. ప్రేమవలననే పలుకుబడి కలుగును. విదేశవస్త్రబహిష్కారమువలన కలుగునట్టి రాజకీయముగు ఒత్తిడి యిప్పుడును నిలచియేయున్నది. కాంగ్రెసువారు ఖద్దరుశాఖాపరిశీలనమును ఒకనిపుణులసంఘమునకు వశపరచుటవలన ఆశాఖకు స్థైర్య మేర్పడినది. కాంగ్రెసులో కలుగునట్టి రాజకీయసంబంధములగు మార్పులవలన ఈసంఘమున కెట్టి చలనమును కలుగదు. దేశమునకు ఈ సంఘమువలన కలుగులాభ మపారము. గ్రామపరిపాలనమునకును, గ్రామపునర్నిర్మాణమునకును ఈ సంఘము అధికముగ సహాయము చేయగలదు. 1925-26 లో 19 లక్షలవెలగల ఖద్దరు బట్టలు తయారయినవి. 1926-27 లో ఆమొత్తముపై నూటికి 25 వంతున హెచ్చుగగూడ తయారగును. బట్టల నాణ్యము అందమునుగూడ వృద్ధియయ్యెను. ధరగూడ చాలతగ్గినది. కాని అమ్మకము మాత్రము జరుగవలసినంత హెచ్చుగ నింకను జరుగుటలేదు. ఆ విషయమై దేశీయులును నాయకులును గూడ చాలశ్రద్ధగ పనిచేయవలెను. గాంధిమహాత్ముడు సాధింపగల్గిన ఘనకార్యములు రెండు: ఒకటి - అసహాయోద్యమము, రెండు-ఖద్దరు. ఈ రెంటిలో నేది ప్రథమగణ్యమను విషయమిప్పుడు నిర్ధారణచేయజాలముకాని ఖద్దరు మాత్రము ఆత్మవిశ్వాసమునకు, ప్రతిఘటనశక్తికి ప్రకాశవంతమగు చిహ్నమనుటకు మాత్రమెట్టి సంశయము లేదు.

## మద్యపాన నిర్మూలనము

ఈవిషయమున ఇటీవల మనమంతగా శ్రద్ధ బూనుట లేదు. ప్రజలకు ఈ సమస్యయందు అధికముగు శ్రద్ధను మనము కలిగించినచో మనయుద్యమమునకు నైతికముగు వైభవము హెచ్చగును. అసహాయోద్యమము ప్రబలముగనున్న రోజులలో పలువురు ఘనముగు త్యాగమునుజేసి అధికోత్సాహముతో పనిచేసినమాట నిజమే. కాని యది తాత్కాలికోద్రేకముగుటవలన స్థిరముగు లాభ మేమియు గలుగలేదు. మద్యమును పూర్తిగ బహిష్కరింపవలెనుచట్టము నుపపాదించుటకును, దాని నుపపాదింపగూడదనిగాని లేక తిరస్కరించినను తన పదవికి రాజీనామానిచ్చుటకును ధైర్యసాహసములుగల మంత్రి యిదివరకారేండ్లలోను ఎవరును కనబడలేదు. ఇకముందైన కనుపడుదురనుట సంశయాస్పదమే. స్వరాజ్యముకొరకు దేశమునందును, శాసనసభలలోను ఆందోళనమును జరుపుచుండియు ప్రజల దారిద్ర్యమును వృద్ధిచేయుటకు ముఖ్యకారణముగు త్రాగుడును అడచివేయుటకుగూడ గట్టిశ్రద్ధను పూనవలెను. మదరాసు రాష్ట్రమున శాసనసభలోని కాంగ్రెసుపక్షమువారు స్వరాజ్యసమస్యతో సమానమగు ప్రాముఖ్యమును మద్యపాన నిర్మూలన సమస్యకుగూడ నొసంగుటకు దీక్షవూనియున్నారు. అట్టి మదరాసు రాష్ట్రములో మొత్తము ఆదాయము 16 కోట్లలో త్రాగుడువలన వచ్చు ఆదాయమే 6 కోట్లయియున్నది. మద్యమువలన దొరతనమువారికి వచ్చు ఆదాయమునకు కనీసము రెండురెట్లధికముగ ప్రజలకు నష్టము గల్గుచున్నది. మద్యపానమును

నిర్మూలించినచో దొరతనమునకునష్టముకలుగునను వాదము నిరాధారము. మద్యపానమును నిర్మూలించినచో దేశమునం దైశ్వర్య మధిక మగుట నిశ్చయము. కావున ఈవిషయమున మనము గట్టిశ్రద్ధవూనుటకు సంశయింపగూడదు. ప్రస్తుతము ఈ విషయమున ప్రజలలో సంపూర్ణోత్సాహము ఇంకను కలుగలేదు. కాని మనము శ్రద్ధవూనినచో హిందూమతమును మహమ్మదీయ మతమునుగూడ మనకు తోడ్పడగల్గును.

## అస్పృశ్యతానివారణము

అస్పృశ్యతా నివారణముగూర్చి చాలకాలమువరకు వేదికలపై నుపన్యసించుటతప్ప మరేమియు జరుగలేదుకావున ఆవిషయమై యభివృద్ధి యేమియు అగపడలేదు. వెనుకటిరోజులలో సంఘసంస్కరణసభలయందు మాత్రమే ఆవిషయమై చర్చలు జరుగుచుండెను. ఇపుడు గాంధిమహాత్ముని నాయకత్వముక్రింద ఈవిషయమునుగూడ నిర్మాణవిధానమునం దొకయంశముగ చేర్చుటచే విద్యాధికులలోను, జనసామాన్యములోను గూడ అత్యల్పకాలములోనే అత్యధికమగు భావపరివర్తనము కల్గినది. ఇక చేయవలసినది అస్పృశ్యుల ఆర్థికస్థితిని బాగుచేయుటే. ఈసమస్య త్వరగ నెరవేరుటకు అధికముగ శ్రద్ధ వూనవలసిన సమయమువచ్చినది. ఖద్దరువిషయమున ప్రత్యేకముగ నిపుణులసంఘమునకు పరిశీలనాధికార మిచ్చినటుల అస్పృశ్యతానివారణవిషయమున అత్యుత్సాహము గల సంఘసంస్కర్తలకు తగిన ప్రోత్సాహమొసంగినచో కాంగ్రెసువారిచే ప్రశంసనీయముగ ప్రారంభింపబడిన యీసమస్య సఫలముకాగలదు. కాని యీసమస్య స్వరాజ్యమునకు ప్రబల నిరోధమనియు, ఇదిపూర్తియైన తత్‌క్షణమే స్వరాజ్యమువచ్చుననియు విదేశీయులలోను, స్వదేశీయులలోను కొందరుచేయు వాదము ఎంతమాత్రము సరియయినదికాదు. వర్ణభేద మంతరించువరకు మన మెట్లు తాళజాలమో అటులే అస్పృశ్యత తొలగువరకుగూడ మనము స్వరాజ్యముకొరకు వేచియుండజాలము. అమెరికా సంయుక్తరాష్ట్రములలో దాస్యసమస్య అత్యధికముగ నుండినను గూడ దానిని తొలగించకపూర్వమే వారు స్వరాజ్యమును ఏర్పాటుచేయగల్గిరి. తరువాత ఎన్నియేండ్లకో కాని యీసమస్య అచట తొలగలేదు. మనదేశమునందుమాత్రము స్వరాజ్యమువచ్చినను రాకున్నను అస్పృశ్యతను అంతరింపజేయుటకు మనమందరము పూనికొని తీరవలెను. తొలగునంతవరకు విదేశప్రభుత్వమే యుండవలెనను వాదమును నేనునిరసించుచున్నాను. హిందూమతహృదయమునకును, అస్పృశ్యతానిబంధనలకును ఎట్టిసంబంధమును లేదని నేను ధైర్యముగ చెప్పగలను. ప్రజలలో కొందరిని అస్పృశ్యులనిబహిష్కరించుట మతధర్మమునకు, దేశాభిమానమునకు, భగవద్భక్తికి, భూతదయకు, హేతువాదమునకు, ప్రజాసత్తాకమునకు గూడ విరుద్ధమైనది. కావున అస్పృశ్యత స్థిరముగ నుండవలెనను వాదమును మన మెంతమాత్రమును సమర్థింపగూడదు. ఈదురాచారమువలన మనదృష్టికి మాంద్యమును, అనుభవమునకు పరిమితియును, హృదయమునకు కాఠిన్యమును, బాధ్యతాశక్తికి సంకోచమును కలుగును. అందువలన న్యాయము, ప్రేమ, నిష్కాపట్యము మున్నగు ఆశయములు సమగ్రములు కాజాలవు. హిందూ మతసిద్ధాంతము ప్రకారము ప్రతిమానవుని హృదయకమలమందు భగవంతుడు నివసించుచుండును. అట్టిచో మానవులలో కొందరు జన్మవలననే పరమపూజ్యులనియు, మరికొందరు పరమనీచులనియు, నిట్లు భగవంతుడు నిర్ణయించెననియు భావించినచో ప్రతిమానవుని హృదయమందును భగవంతుడున్నాడను సత్యమెట్లు నిలువగలదు? ఇందువలన సవర్ణులకును అసవర్ణులకునుగూడ లాభములేదు. "ఎద్దునకును దున్నపోతునకును భేదమును జూడగల్గినటులు మనుష్యునకును మనుష్యునకును భేదము నెవరైన జూడగలరా? పంకమునందు జనించిన ఎర్రకలువవలె వసిష్ఠుడు బ్రహ్మకు ఒకనీచస్త్రీయందు జనించెను. వసిష్ఠునకు ఒకచండాలస్త్రీవలన శక్తియనుకుమారుడు కల్గెను. శక్తికి పుల్కసస్త్రీవలన పరాశరుడు పుట్టెను. పరాశరునకు పల్లెదానివలన వ్యాసుడు పుట్టెను. వీరందరును వేదముల నభ్యసించి పరమ పవిత్రులైరి" అని మహారాష్ట్రమునందు కపిలవాక్యము గలదు. "మనలోనున్నటులే మాలవానియందుగూడ రక్తమును మాంసమునుగూడనుండలేదా? మాలవాని హృదయకమలమందు వ్యాపించియున్న మత మేది"యని వేమన్న ప్రశ్నించియుండెను.

కావున అస్పృశ్యతయనునది మానవనిర్మితమగు నాచారమేకాని దైవనిర్మిత మెన్నటికిని కాదు. ఈ దురాచారమువలన హిందూమతము ప్రపంచమంతటను వ్యాపించి మానవకోటిని ఉద్ధరించుటకుగూడ అభ్యంతరమగుచున్నది.

కావున నిట్టి విషయములలో - అనగా నిర్మాణకార్యక్రమమునందలి విషయములలో శాసనసభలలోని కాంగ్రెసు సభ్యులు అధికముగ శ్రద్ధను పూనవలెను. దొరతనమువారి పాఠశాలలలోను, వారి సహాయమును పడయుచున్న పాఠశాలలలోను దేశభక్తి, ధైర్యము, జాతీయాభిమానము మున్నగు సుగుణములను వృద్ధిపొందించు గ్రంథములు నిర్బంధముగ బోధించునట్లు చేయవలెను.

## కార్మికసమస్య

కార్మిక సమస్యనుగూడ నిర్మాణవిధానములో చేర్చునట్లు కాన్పూరులో కాంగ్రెసు మహాసభవారు తీర్మానించిరి. 1927 లో ఈ విషయమునుగూర్చి మన మధికముగ శ్రద్ధను

పూనవలెను. కార్మికుల సౌఖ్యము, వారియిండ్లు, వారి భీమా కంపెనీలు, ప్రావిడెంటుఫండు, ఇండస్ట్రియలు ఇన్షూరెన్సు) వారి స్థితిగతులు, యజమానులవలన వారికిగల్గు ఆదరణ మున్నగు వానినిగూర్చి కూడ మనము చాల శ్రద్ధ పూనవలెను. కార్మికులతో ప్రభుత్వమునకంటె ప్రజలకే యెక్కువ సంబంధమున్నను కార్మికవిషయము ప్రభుత్వాయత్తశాఖలలో చేర్పబడినది. కార్మికులనుగూర్చిన చట్టములు(రిజిస్ట్రేషను, ట్రేడుయూనియన్సులు మున్నగు విషయములు) ఎంతమాత్రమును సంతృప్తికరముగ లేవు. ఇప్పుడున్న నియోజకవర్గములు అమితములును, అధికవ్యయసాధ్యములును నగుటచే కార్మికులే శాసనసభలలో సభ్యులుగ నుండుటకు అవకాశము లేకున్నది. కార్మికులకుగాని, నిమ్నజాతులకుగాని, మరియే తెగకుగాని శాసనసభలలో ప్రవేశము కల్గించుటకు వారిని సభ్యులనుగ నియమించుపద్ధతి యెంతమాత్రమును సరియైనదికాదు. కావున కార్మిక సమస్యనుగూర్చి కాంగ్రెసువారు ఎక్కుడు శ్రద్ధ పూనవలెను. ప్రతిశాసనసభలోను కాంగ్రెసు సభ్యులు కార్మికులలాభము, వారి ఆదాయము మున్నగువానిగూర్చి గట్టి కృషి సలుపవలెను. ప్రస్తుతము మనదేశమునందు కార్మికవర్గములు క్రమక్రమముగ బలపడి సంఘముల నేర్పరుచుకొని తమ హక్కులను స్ఫుటముగ ప్రకటించుచుండుట సంతృప్తికరము. జాతీయోద్యమమునకును కార్మికోద్యమమునకును సమానాశయములు మెండుగనున్నవి. ధనికులకు లాభముకలిగించుటకుకార్మికులకు నష్టము కలిగింపబడునను భయము భారతదేశమున నెవరికి కలుగగూడదు. ధనికులకును కార్మికులకును కాంగ్రెసువారు సమాధానము కలిగింప జాలరనియు ఈ రెండు తెగలకును సమముగ న్యాయము చేయజాలరనియు నెవరును జడియపనిలేదు.

## నిరుద్యోగసమస్య

భారతదేశమునందు ప్రజలలో దారిద్ర్యమును, పనిలేకుండుటయును అధికముగ అనర్థమును కలిగించుచున్నవి. అనేక కారణములచే నీరెండు అనర్థములును చాలమెండయినవి. దామాషాను ఒక భారతీయునకు ఆదాయము సాలుకు రూ 68 మాత్రమే అయియున్నది. అందువలన ప్రజలలో చాలమంది తిండిలేక మాడుచున్నారు. దుర్భరకష్టములకు పాలైయున్నారు. కావున నా యనర్థములను తొలగించుట దొరతనమువారికి ముఖ్యకర్తవ్యమైయున్నది. ప్రస్తుతమున నున్న దొరతనమువారు ఈవిషయమునుగూర్చి యేమియును జేయరు. దొరతనమువారు పెద్దయెత్తున ఓడలనునిర్మించు పరిశ్రమను ప్రారంభించి దొరతనమువారే స్టీమరులు నడిపింప నారంభించినచో వానివలన దేశమునకు అధికముగ ఆదాయమువచ్చుటయేకాక, రైల్వేలయందువలె లక్షలకొలది ప్రజలకు పనులుగూడ లభింపగలవు. కాని దొరతనమువా రటులుచేసెదరా? ఎంతమాత్ర మటులుచేయరు. భారతీయ ప్రాచీనవిజ్ఞానము ననుసరించి యిది మన ప్రధాన కర్తవ్యముగావున దీని నెరవేర్చుటకే మనము స్వరాజ్యమును కోరుచున్నాము. స్వరాజ్యము లభించిననేకాని పెద్దపెద్ద పరిశ్రమలను మనము ఏర్పరుపజాలము; వానినేర్పరచిననేకాని ప్రజలకు పనులు లభింపవు; పనులు లభించిననేకాని దారిద్ర్యము తొలగదు. కావున ఈలోపుగ కాంగ్రెసుపక్షము వారు శాసనసభలలో దొరతనమువారికి చాల ఒత్తిడిని కలుగజేయవలెను. దొరతనమువారు క్రొత్త పరిశ్రమల నేర్పరుచునట్లును, ఇదివరకు వ్యవసాయము జరుగనట్టి తావులలో వ్యవసాయమును జరుపుటకు వసతులను కల్పించునట్లును శాసనసభలలో కృషిసలుపవలెను. ప్రజలకు సకలవిషయములను బోధించి నిరుద్యోగసమస్యను స్వరాజ్యసమస్యను చేర్చివేయవలెను. అట్లు చేసినచో దొరతనమునకు ఒత్తిడి అధికమగును.

## దొరతనమువారి కరెన్సీపద్ధతి

దొరతనమువారి నాణెములు మారకము పద్ధతినిగూర్చి ఇటీవల దేశీయులకు అధికముగ కష్టమేర్పడినది. కరెన్సీసంఘమువారు చేసిన సూచనలను దొరతనమువారు అవలంబించుటచే భారతీయులకు నష్టమే కల్గుచున్నదికాని భారతదేశమైశ్వర్యభరితమగుటకు కావలసిన బంగారు నాణెములకు సంబంధించిన లాభకరమగు గోల్డుస్టాండర్డు ఏర్పడుట తటస్థింపదు. ఒకరూపాయికి 18 పెన్నుల చొప్పున దొరతనమువారు నిర్ణయించుటచేతను, ఆర్థికసభ్యుడు చేసిన వాగ్దానమునకు భిన్నముగ వారు రివర్సు కౌన్సిలు బిల్లులు అమ్ముచుండుటవలనను మనదేశీయులకు అధికముగ ఆగ్రహము కలిగియున్నది. ఇందువలన మనదేశమున పరిశ్రమాధికారులకు, వ్యవసాయము చేయువారికిని, ఎగుమతులు జేయువారికిని అధికముగ నన్యాయము జరుగుట నిశ్చయము. దేశీయులకగు మొత్తము వ్యయములో విదేశీయులనుండి వచ్చుసరకులకగు వ్యయము చాల కొద్దిగానే యుండునుగాన నుండినను మనకెట్టి లాభమును లేదు. మనదేశమునుండి యెగుమతిచేయబడుచున్న పంటవస్తువులధరలో నూటికి 12½ వన్నెపోవుటవలనను, విదేశవస్తువులకు స్వదేశవస్తువులకు జరుగుచున్న పోటీలవలనను, వ్యవసాయదారులకు ఋణబాధ అధికముగుచుండుటవలనను గూడ మనదేశమునకు నష్టమధికముగుచునే యున్నది. రూ 1 కి 16 పెన్నుల చొప్పున ఏర్పరచినచో అధికముగ పన్నులు వేయవలసిన అవసరమే కలుగదు. ఈవిషయమును నిపుణులేకాని యితరులు చర్చింప వీలులేదని భావింపగూడదు. మరియును ముందెప్పుడో దీనిని సవరింప బోయినను ప్రస్తుత మధికముగు నష్టము కలుగక తప్పదు. ఎటు చూచినను ఈకరెన్సీ పాలిసీవలన మనదేశమునకు అధికముగు నష్టము కలుగుట నిశ్చయము. భారతదేశమునందలి ధనికుల

లోనే కొందరు ప్రజలధనమును హరింప జూచుచున్నారనుట విశ్వసనీయము గాదు. అది మనలో మనకు విరోధములు కల్పించుటకొరకు కల్పింపబడినది. భారతదేశమునకు అధికనష్టమును, ఆంగ్లదేశమునకు లాభమును కలిగించుటకును, విదేశీయులగు ధనికులు మనధనమును హరించుటకును మన మెంతమాత్రమును నంగీకరింపగూడదు. మనదేశమునందు అనేకమతములవా రున్నను మన మెట్లు సామరస్యమును కలుగజేయదలచుచున్నామో అటులే వేరువేరు ధనికవర్గముల విషయమునగూడ సామరస్యమును మనము కలుగజేసుకొనగలము. మనదేశమునందు ఇండియను కరెన్సీలీగును ఏర్పరచుట నాకు సంతృప్తికరముగ నున్నది. ఈసంఘమువారు ప్రజలకీ విషయములను బాగుగ బోధించెదరని నమ్మెదను. ఈసంఘమువారు, కాంగ్రెసువారు ఏకీభవించిననే కాని శాసనసభలలో చర్చించుటవలనను, దేశములో నిరసనసభలను జేయుటవలనను ఎట్టిలాభమును కలుగదని నానమ్మకము.

## భారతసంస్థానములు

స్వరాజ్యసంపాదన ప్రయత్నముల సందర్భమున సంస్థానములవిషయమై ఆలోచించుట అవసరము. సంస్థానములందు ఒకవిధమగు అసంపూర్ణమగు స్వరాజ్యమున్నది. మనము పూర్వము ఎట్టిదశయందున్నది ఇప్పుడు ఎట్టి అధోగతిపాలైనదియు ఈ సంస్థానములస్థితి తెలుపుచున్నది. ఆధునిక పరిస్థితుల ననుసరించి సంస్థానాధీశులు తమకుగల నిరంకుశాధికారము వదలుకొనిన తమకును, తమప్రజలకును లాభము కలుగును. సంస్థానములందు ప్రజాయత్తపరిపాలన ప్రతిష్ఠాపనలు స్థాపింపబడవలెను. అప్పుడే సంస్థానాధీశులకు ఎక్కుడు గౌరవమేర్పడును. బ్రిటిషు ప్రభుత్వమువారి సహాయము అవసరమగును. సంస్థానములందు 7 కోట్లమంది ప్రజలున్నారు. రాజకీయ సాంప్రదాయములందు భేదమున్నది కాని బ్రిటిషు ఇండియా ప్రజలకును, సంస్థానములందలి ప్రజలకును ఇతరవిషయములందు ఎట్టిభేదము లేదు. మనము బ్రిటిషు భారతదేశమున సలుపుచున్న స్వరాజ్యాందోళనమునకు ప్రతిధ్వనులు సంస్థానములందు వినబడుచున్నవి. మనకు స్వరాజ్యము లభించుటకు పూర్వము సంస్థానములందలి పరిస్థితులు కూడ చక్కబడుట అవసరము. వారినికూడ మనము దగ్గరచేర్చుకొని ఈ స్వాతంత్ర్యసంగ్రామమును జరుపవలయును. కేంద్రశాసనసభయందు సంస్థానపు ప్రజలకుకూడ ప్రాతినిధ్య ముండవలెను.

## విదేశములందలి భారతీయులు

పూర్వము ప్రపంచమున భారతీయులెంత అధికముగ గౌరవింపబడుచుండిరో నేడు అన్ని దేశములందు అంత నిరాదరింపబడుచున్నారు. దక్షిణాఫ్రికా, కెన్యా, ఫిజి, మలేలయందు మనవారు అవమానకరమగు విధమున జీవితములను గడపుచున్నారు. భారతీయులే ఈదేశములకు ఐశ్వర్యము కలుగజేసిరి; కాని తామ చేసిన కష్టమువల్ల ఏర్పడిన ఐశ్వర్యమునందు పాలుగైకొనుటకు భారతీయునకు అధికారము లేకున్నది. స్వాతంత్ర్యము, సమానములగు హక్కులు అట్లుండ గౌరవకరముగ జీవించుటకు కూడ వీలులేకున్నది. భారతీయులు కూలివారని ఈదేశములందు పిలువబడుచున్నారు. మనము స్వాతంత్ర్యము పొందినగాని విదేశములందలి మన సోదరులస్థితి చక్కబడదు. ఇందులకు విదేశములందు ప్రచారము సల్పి అంతర్జాతీయసానుభూతిని సంపాదింపవలయును. దక్షిణాఫ్రికాకు పోయిన రాయబారమువల్ల కొంత లాభము కలుగునని నమ్ముచున్నాను.

## ఆసియాఖండపు జాతులసమితి

ఆసియాఖండపు జాతులన్నియు తమ స్థితిని అభివృద్ధిపరచుటకై ఒకసమితి నేర్పరచు విషయమై తీవ్రముగ ఆలోచించుటావశ్యకము. ఆసియాఖండమునందలి దేశములలో ముఖ్యమైనవి ఇంతవరకు నిరంకుశాధిపతులచే పరిపాలింపబడుచుండెను. కాని నేడు పరిస్థితులు మారినవి. అంగోర, పర్షియా, చైనా, సైబీరియాలయందు ప్రజాయత్త పరిపాలన ప్రతిష్ఠాపన లేర్పడియున్నవి. కావున ఆసియా ఖండపు జాతుల సమితి ఏర్పడుట అసంభవమని చెప్పు సమయము పోయినది. మన చుట్టుప్రక్కల నున్న రాష్ట్రములవారు మనదేశపు వ్యవహారముల విషయమై ఎక్కువశ్రద్ధ పుచ్చుకొను చున్నారు. కావున మనముకూడ ఇతరదేశములవిషయమై ఎక్కువశ్రద్ధ వహించుట అవసరము. ఆసియాఖండమునందలి వివిధజాతుల వారికి అన్యోన్యత ఏర్పడుటకు అప్పుడప్పుడు ఒకదేశమువారు మరియొక దేశమునకు రాయబారముల నంపుట లాభకరము.

## సాంఘికాభిమానముల జాతీయత

సాంఘికాభిమానమునకును జాతీయతకును ఏర్పడుచున్న సంఘర్షణమును గుర్తెరుగుట అవసరము. ఇటీవల దేశమునందంతటను వ్యాపించిన అల్లరులవల్ల, జాతీయదురభిమానమువల్ల ఎట్టి విపరీత నష్టములు కలుగునో తెలిసికొనవచ్చును. ప్రజలయందు జాతీయతాభిమానము క్రమముగ వృద్ధియగుచున్నదనియు, సాంఘికదురభిమానము క్షీణించుచున్నదనియు చెప్పుటకు పెక్కు నిదర్శనములు కనుపడుచున్నవి. పంజాబు సంయుక్తరాష్ట్రములందు ఈఎన్నికలలో కాంగ్రెసు పక్షమువారు ఓడిపోవుటకు కాంగ్రెసు పక్షమునం దేర్పడిన విభేదములేకాక వివిధ సంఘముల సంఘర్షణము కూడ కారణ మని చెప్పవచ్చును. కాని ఈరెండు రాష్ట్రములవారు సాంఘికవాదమును

ఆమోదించుచున్నారని చెప్పుటకు వీలులేదు. ఏలయన హిందూ మహాసభవారు నియమించిన అభ్యర్థులకన్న కాంగ్రెసువారిచే నియమింపబడిన అభ్యర్థులే అధికముగ విజయముగాంచిరి. భారతదేశమునందలి ఇతరరాష్ట్రములందును—అందుముఖ్యముగ బెంగాలు బీహారు మద్రాసులయందు—సాంఘికవాదము ఎంతమాత్రము పనికిరాదని ప్రజలుతమనిశ్చితాభిప్రాయమును ప్రకటించిరి. విలింగ్డను ప్రభువుగారి ఆదరణమువలన ఈయేడేండ్లనుండి వృద్ధిగాంచి బ్రాహ్మణులకును, బ్రాహ్మణేతరులకును విభేదములను వృద్ధిచేయుచున్న జస్టిసుపక్షమును మద్రాసు వోటర్లు సంపూర్ణముగ మూలకు నెట్టిరి. జాతీయతకును, వివిధసంఘముల ఐకమత్యమునకును నెలవగు కాంగ్రెసు ప్రతిష్ఠాపనము పట్ల ప్రజలు నిరుపమానమగు భక్తివిశ్వాసములను ప్రకటించిరి. బ్రాహ్మణేతరులగువోటరులతో నిండిన నియోజకవర్గములు జాతీయతాభావముగల బ్రాహ్మణులను బ్రాహ్మణేతరులనే ఎన్నుకొనినవి. బీహారులో కాంగ్రెసు భక్తి అత్యధికముగ ప్రకటింపబడినది. వంగరాష్ట్రమున కాంగ్రెసుపక్షము బలపడినది. పూర్వమువలెనే బెంగాలు రాజకీయవిషయములందు ఇతరరాష్ట్రములకు దారిచూపగలదని నమ్ముచున్నాను.

సాంఘికదురభిమానము జాతీయతాభివృద్ధికి ఆటంకమను సత్యమును ప్రజలు ఇప్పుడిప్పుడు గుర్తెరుగుచున్నారు. చక్కని ప్రచారము జరిగి సాంఘిక దురాభిమానమువల్ల కలుగు నష్టములు వివరింపబడిన,ప్రజలు సాంఘికాభిమానమును విడనాడి జాతీయాభిమానమును ప్రకటింపగలరని అనుభవమువల్ల చెప్పుచున్నాను. వివిధసంఘములవారు తమలో తాము తగవులాడుకొనుచున్నంతకాలము విదేశీయులమధ్యవర్తిత్వము తప్పనిసరియగును. జాతీయైక్యతను ఆదర్శముగ నుంచుకొనవలెను. హిందువులు, మహమ్మదీయులు కేవలము తమ సంఘముల ప్రతినిధులమని తలపక తాము భారతీయులప్రతినిధులమని తలపవలయును.

గ్రేటుబ్రిటనులో ఇంగ్లీషువారు, స్కాచ్ వారు, వెల్షులు భిన్నసాంప్రదాయములు గలవారు. భాషవేరు, జాతివేరు అయినను ఈమూడుజాతులవారు కలసి రాజకీయస్వాతంత్ర్యము ననుభవించుచున్నారు. ఇంగ్లండు ఫ్రాన్సు కనడాలయందు ప్రాటెస్టాంటులకు, రోమను కాథలికులకు ఎన్నియో తగవులు అల్లరులు జరిగినను ఈదేశములు స్వాతంత్ర్య మనుభవించుచున్నవి. దక్షిణాఫ్రికా తెల్లవారియందు ఎన్నియో భేదములున్నను, వారు స్వాతంత్ర్య మనుభవించుచున్నారు. ఏవిషయమునందు తగవున్నను జాతికంతకు సంబంధించిన విషయములందును, స్వాతంత్ర్య సంరక్షణవిషయములందును కలసి పనిచేయుట అవసరమగుసమస్యయని ఇతరదేశములచరిత్రవల్ల మనము తెలిసికొనవలెను.

ఒక్కొక్క మతమునకు ప్రత్యేక సాంప్రదాయములు, ప్రత్యేకమతప్రతిష్ఠాపనలు నున్నవి. ఇట్టి ప్రతిష్ఠాపనల హక్కులను, గౌరవమును కాపాడుట ఆవశ్యకము. స్వరాజ్యము లభించినను మతసాంప్రదాయముల గౌరవమునకుగాని,వ్యక్తిమతస్వాతంత్ర్యములకుగాని ఎట్టిభంగ ముండగూడదు. సాంఘిక సంఘర్షణమును అంతమొందించి అల్పసంఖ్యాకులహక్కులను సంరక్షించుటకై ఈక్రింది నిబంధన అవసరమని కాంగ్రెసు కార్యసంఘమువారు తీర్మానించినారు:

“ఒక శాసనసభయందు మతసంబంధమైనబిల్లును, ఆమతమునకు చేరిన వారిలో నాలిగింట మూడు వంతులు సభ్యులు బిల్లును ఆక్షేపించిన అట్టిబిల్లును కాంగ్రెసు సభ్యులు ఉపపాదింపకూడదు. శాసనసభయందలి సభ్యులందరు ఇట్టి నిర్ణయమును ఆదరించునట్లు కాంగ్రెసు పక్షమువారు పనిచేయవలయును.”

## పరమతసహనము

ఇతరమతములవారిని తమ మతమునందు చేర్చుకొనుటకై మతబోధకులు పలువురు ప్రయత్నించుట సాంప్రదాయమైనది. కాని ఈకాలమున ఇట్లుచేయుట అవసరమా అను విషయమై ఆలోచింపవలయును. ఒక్కొక్కసంఘమునందలి ఉత్కృష్ట పురుషుల పవిత్రజీవితమువల్లనే ఇతర మతస్థులకు ఆమతముపై గౌరవము అభిమానము ఏర్పడవలయును గాని మతబోధకుల ప్రచారమువల్ల లాభము కలుగుట అసంభవము. మతబోధకులు కూడ బహిరంగముగ క్రమపద్ధతుల ననుసరించి ప్రచారము సలుపవలయును గాని రహస్యముగ కుట్రచేసి ఇతర మతములవారిని తమమతమునందు చేర్చికొన ప్రయత్నింపకూడదు. కేవలము అనుచరుల సంఖ్యను బట్టి మతగౌరవము ఏర్పడ దనియు, మతసాంప్రదాయముల ఉత్కృష్టత ననుసరించియే మతమునకు గౌరవము ఏర్పడుననియు గుర్తెరుగవలయును.

ఇతరమతములను గాని, ఇతర మతములవారిని గాని ద్వేషించుటవల్ల స్వమతము వృద్ధిచెందునని తలచుట అవివేకము. పరమతసహనమును బోధించుచు అశోకుడు ఈక్రింది శాసనమును ప్రకటించెను:— “తన మతమునకు గౌరవము కలుగునను ఉద్దేశముతో ఎవడు తన మతమును గౌరవించుచు ఇతర మతములను దూషించునో వాడు నిజముగ స్వమతమునకు కళంకము తెచ్చుచున్నాడు.”

## సాంఘికప్రాతినిధ్యము

జాతియంతయు ఒకటియని భావించి, ఏసంఘమువారు వృద్ధిచెందినను, ఇతరసంఘములవారు సహించుచున్నగాని జాతి వృద్ధిచెందజాలదు. అన్నిసంఘముల అభివృద్ధికి పాటుపడుట అవసరము. ఒక్కొక్కసంఘమువారు తీవ్రమగు సాంఘికాభిమాన

మును ప్రకటింపుచుండుట నష్టప్రదము. స్వసంఘాభివృద్ధిని కోరుట తప్పుకాదు గాని ఇతరసంఘముల ఆధిక్యమును వృద్ధిని సహింపజాలకుండుట నష్టప్రదము. ఒకసంఘమునకు చేరిన వ్యక్తి ఒక ఉన్నతోద్యోగముపొందినను, ఏన్నికలలో జయము గాంచినను ఆసంఘమునకు లాభముకలుగునని తలచుటకు వీలు లేదు. గొప్పఉద్యోగమునందున్నవారు తమధర్మమునకు విరుద్ధముగ తమచేతియందుండు ఉద్యోగములన్నియు తమసంఘము వారికే ఇచ్చుట అసంభవము. ఒకటే సంఘమునకు చేరిన ఇరువురు ప్రతినిధులు పలువిషయములందు భిన్నాభిప్రాయులై పోరాడుచుండుటను మనము చూచుచునే యున్నాము. కావున సాంఘికప్రత్యేకప్రాతినిధ్యము అర్థములేని మాట. దేశమునకుసంబంధించిన అన్ని సమస్యలు, తత్పరిష్కారవిధానము అన్నిసంఘములవారికి సమానముగముఖ్యమైనవది. పన్నులబరువు, ప్రభుత్వమువారి నిరంకుశపరిపాలనము అన్నిసంఘములవారికి దుస్సహమైనదే. లెక్క పెట్టిఒక్కొక్క సంఘమువారికి ఇన్నిన్ని ఉద్యోగముల నొసగిన న్యాయముగ ప్రవర్తించిన ట్లగునని చెప్పుటకు వీలులేదు. అన్ని సంఘముల వారికి సమానముగ హక్కులు, గౌరవములు అభివృద్ధిచెందుటకు సమానమగు అవకాశము లుండవలయుననుట కాంగ్రెసు ఆదర్శమైయున్నది. భారతజాతీయవాదులు ఈ ఆదర్శము ననుసరించియే ప్రవర్తించుచున్నారు.

## మతము—రాజకీయములు

మతవిషయములకును రాజకీయములకును ముడిపెట్టుట ఎంతమాత్రము సరికాదు. ఇట్టి సంబంధము మతమునకు రాజకీయములకును కూడ నష్టప్రదము. రాజకీయముతో మతమునకు సంబంధము లేకున్న హిందువహమ్మదీయమతములు రెండును ఎక్కుడుపవిత్రముకాగలవు. అన్నిమతములందును సత్యము ఒకటే. కాని మతోద్రేకము నష్టప్రదమని చరిత్రవల్ల స్పష్టముగ తెలియుచున్నది. మతావేశముగల దేశములందు సక్రమపరిపాలన ముండుట అసంభవము. ఇట్టిదేశములు ఐశ్వర్యవంతము లగుట అసంభవము.

## హిందుమతము—ఇస్లాము

హిందూమతమువల్ల మహమ్మదీయమతమునకుగాని, మహమ్మదీయమతమువల్ల హిందూమతమునకుగాని నష్టముకలుగునని తలచుట అవివేకము. ఈరెండుమతములు అతిప్రాచీనమైనవి; వివిధసాంప్రదాయముల సంఘర్షణములను సహించి పవిత్రమై ఇంతకాలము నిలిచియున్నవి. నాగరికతలు నశించినను, సామ్రాజ్యములు అంతరించినను ఈమతములు నిలిచియున్నవి. భిన్నమతములకు చేరిన రాజుల పరిపాలనమునందుకూడ ఈమతముల బలము తగ్గలేదు. ఈకాలపురాజులు మతవిషయములందు జోక్యము పుచ్చుకొనుటలేదు. పరమతసహనము ఆవసరమను సిద్ధాంతమును అందరు ఆదరించుచున్నారు. అట్టి ఈకాలమున ఒకమతమువల్ల మరియొక మతమునకు నష్టముకలుగునని తలచుట పిచ్చిభ్రమ. అధికసంఖ్యాకులగు మహమ్మదీయులున్న రాష్ట్రమున హిందూమతము అపాయకరమగు స్థితియందుండునని తలచుట కెట్టి ఆధారములేదు. ఒకమతమునుండి మరియొకమతమున చేర్చుకొను ప్రచారము ఎంత వ్యాపించినను మతములకు నష్టము కలుగజాలదు. మహమ్మదీయమతమును రూపుమాప యత్నించు హిందూ సంస్థానము ఒక్కక్షణములో అంతరించును. హిందూమతమును అంతరింపజేయు మహమ్మదీయ సంస్థానమునకు కూడ ఇట్టి గతియే పట్టును.

మతమునకుగల బలము ప్రభుత్వములమీదను, వ్యక్తులమీదను ఆధారపడియుండదు. మతవిశ్వాసముగల మహాపురుషుల ఆత్మబలముపై మతగౌరవము ఆధారపడియుండును. స్వరాజ్యము తత్ప్రయత్నములు వేరు, మతము మతగౌరవమువేరు. ప్రహ్లాదులవంటివారు మతగౌరవమునునిలువబెట్టిరి. విదేశప్రభుత్వములుగాని, స్వదేశ ప్రభుత్వములుగాని, ప్రజాయత్తపరిపాలనావిధానములుగాని, నిరంకుశాధికారవర్గమువారుగాని మతవిశ్వాసమును నిర్మూలింపజాలరు. ఇహలోకమున జీవించుటకును, పరలోకమున సుఖించుటకును మతవిశ్వాసము అవసరము. ప్రపంచజీవమునకు మతమే పునాది కావున వ్యావహారికజీవితమున అన్నివిషయములందును మతవిషయికముగ లేక లౌకికముగ ప్రవర్తించుట సులభము. కావున హిందువులు మహమ్మదీయులు తమ విభేదములను విడనాడి దేశవిముక్తికై పాటుపడుట అవసరము.

## ఐకమత్యము అవసరము

మనలో మనము తగవులాడుకొనుచుండుటచే స్వరాజ్యసంపాదనవిషయమై మనము అశ్రద్ధవహించి వ్యక్తివైమనస్యములను పెంచుకొనుచున్నాము. వ్యర్థవివాదములతో కాలము గడపక కలసి పనిచేయుట అవసరము. వ్యక్తులు తమ పౌరుషమును, మూర్ఖ్యమును విడనాడి దేశీయస్వాతంత్ర్యమునకై పాటుపడుట అవసరము. అనవసరముగు ఆలోచనలతో కాలముగడపక తగునిర్మాణము నేర్పరచుకొని కాంగ్రెసుకార్యక్రమమును కొనసాగించు విషయమై పట్టుదల వహించుట అవసరము. భారతదేశమున రెండుపక్షములు మాత్రము ఉండుటకు అవకాశమున్నది: ప్రభుత్వపక్ష మొకటి, ప్రజాపక్ష మొకటి; ప్రజల ఆశయములను నిరోధించు పక్షమొకటి, స్వరాజ్య సంపాదనమునకై కృషిచేయు పక్షమొకటి. ఒకసేనలో పలు అంగము లుండవచ్చును. కాని ఒక సేనకు చేరినవారే తమలో తాము తగవు

ఆంగ్లభాషాపరిచయము లేనివారలకు బహుసులభముగ
నేర్చుకొనుటకు తెలుగు అర్థములతో నుండు

# ఆనంద ఆంగ్లభాషాబోధిని

అను గ్రంథము మిక్కిలి సహకారిగ నుండును.

ఇది 700 పేజీలును, చక్కని కాలికోబైండును, భారత కథలును, ఆకథలకు సంబంధించిన 16 ఆఫ్టోను పటములును గలిగియున్నది.




దీనియందు ప్రతి పదమునకు తెలుగు ఉచ్చారణ, ఇంగ్లీషుపదము, అర్థము చేర్చి నేర్చుకొనువారలకు బహుసులభముగ తెలియునట్లు ముద్రించినారము. ఇంగ్లీషు పాఠశాలలో 10 సంవత్సరములు వేలకొలది రూపాయలు ఖర్చుచేసి సంపాదించిన జ్ఞానమును ఇంటియందుండియే సంపాదింపవచ్చును. ఉపాధ్యాయుల వెదక పనిలేదు. గ్రామోద్యోగులు, కరణములు, దొరలతో సంబంధముగల బట్లర్లు, వంటవారలు, మరి యితర సిబ్బందులు మీరలకును, ఆంగ్లభాషాపరిచయము లేని వారలకును మా ఆనంద ఆంగ్లభాషాబోధిని చాల ఉపకారిగ నుండును. ప్రతి కుటుంబమునకును ఇది ముఖ్యావశ్యకము.

పుస్తకము వెల రు. 2-0-0. ఒక పుస్తకమే కొను వారికి పోస్టుఖర్చులు అణాలు 0-8-0 అగును. రెండుప్రతుల నొకేసారి కొనువారికి పోస్టుఖర్చులు మేమే భరించెదము.

## ఆనందబోధిని ఆఫీసు,

పోస్టు బాక్సు నెం. 167, మద్రాసు.

# రిజిష్టరుబడ్డ సర్వవృశ్చికవిషసంజీవిని రిజిష్టరుబడ్డ




ప్యాకెట్టు 1-కి వెల అ 8. 1 డజను ప్యాకెట్ల వెల రూ 5. పోస్టేజి వేరు. ఒకేసారి 4 ప్యాకెట్లు కొనువారలకు పోస్టేజి ఇనాం. వర్తకులకు 100-కి 25 రూ. కమీషను ఇవ్వబడును.

ఇది ప్రతికుటుంబమునందుండవలసిన ముఖ్యౌషధము. ఎన్నిదినము లుంచినను మందుగుణము మారదు.

తేలునకు మాత్రమేగాక ఎలుక, కుక్క, పాము, జెర్రిమొదలగు విషజంతువుల కాటులకు నుపయోగింపవచ్చును.

గుణము లేదని రుజువుచేయువారలకు 100 రూపాయలు ఇనాము ఇవ్వబడును.

# అయఃతంగ ద్రావకము

ధాతుపుష్టికి సేవింపదగిన లోహము ఇనుము. ఇనుము తిన్నవారికి ముదుపు, ముసలితనము లేదని అగస్త్యాదులు వచించియున్నారు. దీనిని సేవించుటచే మనకుండిన బలమునకన్న విశేషబలము నిచ్చునటులను చూచుకొని పరీక్షింపవచ్చును. ఈద్రావకమును తీసి సేవించి గుణముల గ్రహింపుడు.



## ద్రావక సేవనముచే గలుగు గుణములు

1. ఉష్ణముచేరాలేదు వెండ్రుకలు పెరుగును. 2. కాలు చేతులు కండ్లమంటలు పోవును. 3. ముఖమునకు తేజస్సునిచ్చును. 4. వాతమును ఉష్ణమును పోగొట్టును. 5. కాళ్లుచేతుల దుర్బలము నణచి నొప్పులను పోగొట్టి బలము నిచ్చును. 6. ఆకలిని జీర్ణశక్తిని కలిగించును. 7. పలుచని నరములు బలముగ జేయును. 8 పచ్చకామిలా, పాండువు, గుల్మము, కాళ్లచేతుల వాపు, గుండెనొప్పికలవారు 8 రోజులు సేవించిన జాలును. నెత్తురుపుష్టి లేనివారు 40 రోజులు దీనితీసి సేవించిన జాలును. రోగములుపోయి సుఖమును పొందుదురు.

(అర్థమండలం) 20 రోజులకు వచ్చు ద్రావకం సీసా 1కి 1-0-0
(ఒకమండలం) 40 రోజులకువచ్చు ద్రావకం సీసా 1కి 1-12-0

## ధనలక్ష్మీ అండు కంపెని

6 వెంకటేశమేస్త్రీవీధి, సావుకార్ పేట మదరాస్.

లాడుకొనుట ఆత్మవినాశకరముకదా! కావున మనశత్రువు ఎవరో గుర్తెరిగి శత్రువును సాధించుటకై స్వరాజ్యసంపాదనాభిలాషగల వారందరు స్వల్పభేదములను విడనాడి ఐకమత్యముతో కలసి పనిచేయుట కర్తవ్యము.

మన ప్రతిపక్షులు గొప్పబలముగలవారు; నేర్పు, సామర్థ్యముగలవారు. ఇట్టిపరిస్థితులలో వ్యక్తుల వృథాపౌరుషము ప్రకటించుచు జాతీయైక్యతకు భంగముకలుగజేయ పూనుకొనుట విచారకరమగు విషయము. తన అభిప్రాయమే ప్రమాణమని తలచుట ఎంతమాత్రము సరికాదు. మత నైతిక ఆత్మగౌరవమునకు సంబంధించినవిషయమై ఎవరి అభిప్రాయములు వారికి ప్రమాణములు. కాని దేశీయ వ్యవహారములందు వ్యక్తులు తమ సొంత అభిప్రాయములే ప్రమాణములని తలచి దేశీయుల నిర్ణయము నుల్లంఘించి తద్వ్యతిరేకముగ ప్రవర్తించుట సరికాదు. భిన్నాభిప్రాయములున్నను ప్రజానిర్ణయమును ఆదరించి తదనుగుణ్యముగ ప్రవర్తించుట అవసరము; ఇట్టి క్రమశిక్షకు మనము లోబడకున్న మనము వృద్ధిచెందజాలము; స్వరాజ్యము సంపాదింపజాలము. ఒక యుద్ధమునందు పోరాడు ప్రతిసైనికుడు తన కిష్టమువచ్చిన విధమున యుద్ధవిధానము నిర్ణయింపబడవలయునని కోరిన ఆసేన కెట్టిగతి పట్టునో వేరుగ చెప్పవలయునా? మనము స్వాతంత్ర్యము కోరుచున్నాము. స్వాతంత్ర్యము పొందుటకు కొంత త్యాగము చూపక తప్పదు.

సమయము వచ్చినప్పుడు వెనుదీయుట ఆర్యధర్మము కాదు. నిర్ణయము ననుసరించి పనిచేయకుండుట అగౌరవకరము. ప్రజలయందు నూతనోత్సాహము పురికొల్పి స్వరాజ్య సైనికుల సంఖ్యను బలమును వృద్ధిచేయుటకు మార్గముల నన్వేషింపవలయును. పట్టుదల విడనాడి, ప్రభుత్వనిరోధమును శాంతముగ ధరించుచు, హ్రస్వదృష్టి గలవారమై, సత్యమును విడనాడి, తాత్కాలిక లాభము కొరకు దేవులాడుటకు వెంపలిడిన అధోగతిపాలయ్యెదము.

ప్రస్తుతము భారతదేశమునంతయు పరిపాలించుచున్నది భారతీయులే కదా! పేరునకు ఆంగ్లేయులు పెద్ద ఉద్యోగము లందున్నారు. ప్రభుత్వనిర్మాణమును నిర్వహించుచున్నది మనవారేకదా. ఇట్టి స్థితిలో మనము స్వరాజ్యము ననుభవింప నర్హులముకామని చెప్పుట ఎంతమాత్రము సరికాదు.

మనలను బంధించియున్న సంకెళ్లను త్రెంచివైచికొనుట అవసరము. విదేశీయుల సమ్మోహనాస్త్రమునకు మనము లోబడి వ్యక్తి స్వాతంత్ర్యము లేనివారమైయున్నాము. మనము నిజముగ పట్టుదలతో పనిచేసిన సులభముగ స్వరాజ్యముపొందగల మను నమ్మకము నాకున్నది. ఒక్కొక్క గ్రామమునందును, ఒక్కొక్క నగరమునందును ఒకరు లేక ఇరువురు నాయకు లేర్పడి ప్రజలను సరియగు దారికి త్రిప్పిన మనదేశము విముక్తి గాంచగలదు. సత్సంకల్పము, నిష్కళంకమగు దేశభక్తి, ధైర్య సాహసములున్న చేయజాలని పనిలేదు. పైపూతలతో ఇంతవరకు మనము తృప్తిచెందుచుంటిమి. పునాది ఏర్పడినగాని పై నిర్మాణము రమ్యముగను స్థిరముగను నిలువజాలదు. ప్రతి గ్రామమునందును ప్రబోధమువ్యాపించి, నాయకులు, నాయకులందు విశ్వాసముగలప్రజలు ఏర్పడినగాని మనము స్వరాజ్యము పొందజాలము. ప్రతిగ్రామమునందును పంచాయతీలు ఏర్పడి గ్రామనాయకునిపై గ్రామమునందలి ప్రజలకు విశ్వాసము ఏర్పడిన గాని మనము స్వరాజ్య మనుభవింప అర్హులము కాజాలము.

కావున నాయకులు, ప్రచారకులు, ప్రజలు అందరు ఒక సంవత్సరకాలము తమ విభేదములను మరచి స్వరాజ్య రణరంగమున కలసి పోరాటము జరుపవలయునని వినయముతో ప్రార్థించుచున్నాను. అన్నిపక్షములవారు ఐకమత్యము కుదురవలయునని కోరుచున్నారు. విభేదములు వృద్ధిగాంచవలయునని ఎవ్వరు కోరుటలేదు. అందరు స్వరాజ్యసంపాదనాపరులై యున్నారు. కాని స్వరాజ్యకాంక్షయే ప్రధానముగ గైకొని స్వల్ప విభేదములను పాటింపక ఐకమత్యముతో కలసి పనిచేసి ఈ సందిగ్ధసమయమున బ్రిటిషు ప్రభుత్వమునకు ఆశ్చర్య సంభ్రమములను కలుగజేయవలయునని కోరుచున్నాను. ఒకరిపైఒకరికి విశ్వాసము ఏర్పడిన మనబలము అధికమగును. 1922 సంవత్సరమున ప్రపంచమునకు అచ్చెరువు కలుగజేసిన నిర్మాణబలము క్రమశిక్ష మరల మనము ప్రకటింపవలయునని కోరుచున్నాను.

స్వరాజ్య సంపాదనకు వివేకసంపదకన్న మన సత్త్వమే ముఖ్యము. సంపూర్ణవిశ్వాసముతో మన యీ ఆదర్శమును పూజింపవలయును. పరుల దూషణభూషణములుగాని, మిత్రుల ప్రోత్సాహములుగాని, శత్రువుల తిరస్కార ఆగ్రహములుగాని, ప్రతిపక్షుల నిందలుగాని, దేశభక్తి ఉత్సాహమును క్షీణింపచేయకూడదు; కార్యదీక్షకు భంగముకలుగజేయకూడదు. స్వరాజ్యమే తారకమంత్రముగ భావించి, తత్ప్రయత్నమునందు ఏర్పడు ఆటంకములను పాటింపక, నిష్కళంకమగు దేశభక్తితోను, పరాజయమను చింతలేని కార్యదీక్షతోడను, కారాగృహాది నిర్బంధముల భయములేని సాహసముతోడను కృషి సలుపవలయును.

తస్మా దసక్తః సతతం కార్యం కర్మ సమాచర, అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః;
కర్మణైవహి సంసిద్ధి మాస్థితా జనకాదయః, లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి;
యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదే వేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

# తీర్మానములు

## ౧
## శ్రీ శ్రద్ధానందస్వామి దారుణహత్య

"శ్రీ శ్రద్ధానందస్వాములవారిని వంచనతోను పిరికితనముతోను ఒకహంతకుడు హత్యజేసినందులకు కాంగ్రెసువారు తమ హాహాకారమును, ఆగ్రహమును వెల్లడించుచున్నారు. స్వామిజీ దారుణమరణమువలన భారతదేశమునకు అపారమగు నష్టము సంభవించినది. ధీరుడును ఉదారుడును దేశభక్తుడును అగు స్వామిజీ ఘనమగు తనపాండిత్యమును జీవితమునుగూడ దేశమాతకు సమర్పించి పతితులను బలహీనులను ఉద్ధరించుటకు అసమానధైర్యముతో గూడిన ప్రేమతో ఘనమగు సేవ జేసెనని యీమహాసభవారు తీర్మానించు చున్నారు."

## ౨
## ఉమరు సోభనీగారి మరణమునకు సంతాపము

"అసహాయోద్యమము ప్రబలముగానున్న రోజులలో కాంగ్రెసునకును దేశమునకును అత్యధికముగ సేవచేసిన ఉమరుసోభనీగారు అకాలమరణమునకు పాల్పడినందులకు కాంగ్రెసువారు సంతాపమును వెల్లడించుచున్నారు."

## ౩
## దక్షిణాఫ్రికా తీర్మానము

"ఇపుడు దక్షిణాఫ్రికాలో భారతీయుల సౌకర్యములనుగూర్చి ఆలోచించుటకు నాయకులసభజరుగుటకు కాంగ్రెసువారు ఆమోదించుచున్నారు. భగవంతుడు వారికి మంచి ప్రేరణ జేయుగాక యని ప్రార్థించుచున్నారు.

ఈ విషయమున అధికముగ శ్రద్ధను బూనుచున్నట్టియు అచట శాంతి నెలకొల్పుచున్నట్టియు సాధుపుంగవుడును ఆంగ్లప్రముఖుడును అగు సి. ఎఫ్. ఆండ్రూసుగారికి ఈసభవారు మరియొకసారి వందనము లర్పించుచున్నారు."

ఈతీర్మానములోని విషయములను జనరలు హార్టజాగు, సర్ హబీబుల్లా, సి. ఎఫ్. ఆండ్రూసుగార్లకు తంతివార్తలమూలమున తెలియజేయుటకు అధ్యక్షున కధికారమియ్యడమైనది.

## ౪
## కెన్యాలో భారతీయుల తలపన్ను

"దక్షిణాఫ్రికాలో కెన్యాలో దొరతనమువారు ఇదివరలు భారతీయులు చెల్లింపవలసిన తలపన్నును హెచ్చించిరి. అది మొదట 20 షిల్లింగు లుండెను. తరువాత నాణెముల మారకపు విషయములో 30 షిల్లింగులుచేసిరి. ఇపుడది 50 షిల్లింగులు చేయుటకు చట్టముచేసిరి. ఈరీతిగా వారు పాశ్చాత్యుల అభిమతానుసారము భారతీయుల లాభమును స్వాతంత్ర్యమును వాంఛలను భంగపరచుచున్నారు."

## ౫
## శాసనసభలలో కార్యక్రమము

(1) "ప్రజాప్రతినిధులకొర్కెలకు దొరతనమువారొసంగు ప్రత్యుత్తరము సంతృప్తికరముగనున్నదని కాంగ్రెసుమహాసభవారుగాని స్థాయిసంఘమువారుగాని నిర్ణయించువరకును మంత్రిపదవులను దొరతనమువా రీయుగల యితరఉద్యోగములను దేనినిగూడ శాసనసభలోని కాంగ్రెసువారు స్వీకరింపగూడదు. ఇతరులు మంత్రివర్గముల నేర్పరుపగోరినచోగూడ నెదిరించుచుండవలెను."

(2) "దొరతనమువా రట్టిప్రత్యుత్తర మిచ్చునరకుగాని, కాంగ్రెసు స్థాయిసంఘమువారు వేరొకవిధముగ నిర్ణయించువరకుగాని యీదిగువ 4వ క్లాజులోని విషయమునకు లోబడి శాసనసభలోని కాంగ్రెసువారు సప్లయిలను త్రోసివేయుచుండవలెను. బడ్జెటుల నిరాకరించుచుండవలెను."

(3) "నిరంకుశోద్యోగులు తమఅధికారములను బలపరచుకొనుటకు ఉపపాదించెడి చట్టముల నన్నింటిని తిరస్కరించుచుండవలెను."

(4) "జాతీయత సరియగుపద్ధతి నభివృద్ధి నొందుటకును ఆర్థిక వ్యవసాయ పారిశ్రామిక వాణిజ్యాది విషయముల యభివృద్ధికిని సాధనములగు చట్టముల బలపరచుచు తీర్మానముల నుపపాదించుచుండవలెను."

(5) "వ్యవసాయమునందు రయితులస్థితిని శీఘ్రకాలమున వృద్ధి నొందించుటకు పెర్మనెంటు సెటిల్ మెంటు సౌకర్యములను జేయుటకు సాధనములగు తీర్మానముల నుపపాదించుచు చట్టములను బలపరచుచు నుండవలెను."

(6) "భూస్వాములకును కైతులకును, పరిశ్రమల యజమానులకును రయితులకును నిష్పాక్షికమగు న్యాయము కలుగునటుల పరస్పరము సద్భావమును కలిగించుచు వెంత్రముమీద వ్యవసాయపు పనులను జేయు పనివాండ్రయొక్కయు యంత్రశాల

ఆలో పనిజేయు కార్మికులయొక్కయు హక్కులను కాపాడు చుండవలెను."

౬

## నిర్మాణవిధానము

"దేశమునందు ప్రజలకుగల రాజకీయహక్కులనుగూర్చి వారికి బాగుగ బోధించుటయును ఆహక్కులను బడయుటకు ప్రజలు నిర్మాణవిధానమును ముఖ్యముగ నవలంబించుట, ఖద్దరుకట్టుట, అన్ని మతములవారికి ఐకమత్యము కుదుర్చుట, అస్పృశ్యతను తొలగించుట, నిమ్నజాతుల నుద్ధరించుట, ప్రజలు నిషావస్తువులను వాడకుండ జేయుట, స్థానికసంఘములను వశపరచుకొనుట, గ్రామసంఘములను వశపరచుకొనుట, జాతీయవిద్యను వ్యాపింపజేయుట, యజమానులకును కార్మికులకును, భూస్వాములకును,రయితులకును, సామరస్యము కలిగించుట, పారిశ్రామిక వ్యవసాయిక కార్మికసంఘముల నేర్పరచుట, జాతీయారీకపారిశ్రామిక వాణిజ్యాది సౌకర్యములను వృద్ధిపొందించుట మున్నగు కార్యములను నెరవేర్చుచు తమహక్కులను బడయుటకు కావలసిన ప్రతిఘటనశక్తిని బలమును ప్రజలు పడయగల్గునట్లు వారిని సిద్ధపరచుట మున్నగుశాఖలకు సంబంధించిన నిర్మాణవిధానమును దేశమునందు కొనసాగింపవలెనని కాంగ్రెసు సభవారు నిశ్చయించిరి."

౭

## విదేశములందు ప్రచారము

"(1) భారతదేశస్వాతంత్ర్యమునుగూర్చి విదేశీయులకుగూడ అభిమానమును కలిగించుటకు యథార్థములగు విషయములను విదేశములలో ప్రకటించుచుండవలెను. (2) 1927 జనవరి 20 వ తేదిని బ్రుసెల్సునగరమందు జరుగనున్న పరాధీన జాతుల సభలో కాంగ్రెసు ప్రతినిధిగ నుండవలెనని ప్రస్తుత మచ్చట నున్న పండిత జవహరిలాలు నెహ్రూగారిని నియమించడమైనది."

౮

## వంగరాష్ట్రపు ఆర్డినెన్సుఖైదీలు

"1818 మూడవ రెగ్యులేషను అక్రమమని కాంగ్రెసు మహాసభలవారును నితరసభలవారును చాలసారులు నిరసించియున్నారు. శాసనసభలలోని నియోజితసభ్యులు ఏకగ్రీవముగ నిరసించినను గూడ 1925 బెంగాలు క్రిమినలు లాసవరణచట్టమును గూడ ఆమోదించియున్నారు. ఈరెండవచట్టము ప్రకారము శాంతముగ ప్రజాసేవ జేయుచున్నవారు పెక్కుమందిని అరెస్టుజేసి వారిపైన నేరములమోపకుండను న్యాయస్థానములందు విచారణ జేయకుండను ఇప్పటికిని కారాగృహములందు నిర్బంధించియున్నారు. వారుచేసిన నేరమేమో యిప్పటికిని వారికి దెలుపబడలేదు. ఇట్టి అవసరచట్టములను అమలులోబెట్టుట దొరతనమువారి కంతమాత్రమును న్యాయముగాదు. వారి నింకను చెరసాలలనుండి వదలకుండుటయు, వంగరాష్ట్రమునుండి యితరరాష్ట్రముల కంపుటయు అక్రమమని కాంగ్రెసువారు ఖండితముగ నిరసించుచున్నారు."

౯

## హిందూమహమ్మదీయసఖ్యము

"ప్రస్తుతము దేశమునందు హిందువులకును మహమ్మదీయులకును మిక్కిలి సంతాపకరములగు కలహములు జరుగుచున్నవి. కాన ఈ విరోధభావమును అంతరింపజేయుటకు తగిన సాధనములను కనిపెట్టుటకు హిందూమహమ్మదీయ నాయకులతో ఆలోచించి భారత కాంగ్రెసు కార్యసంఘమువారు వెంటనే పనిబూనవలెనని యీ మహాసభవారు కోరుచున్నారు. కార్యసంఘమువారు నివేదికను పంపగానే స్థాయిసంఘమువారు ఆవిషయమునుగూర్చి కాంగ్రెసువారి కందరికి తెలియజేయవలెను. అవసరమగు ఇతరప్రయత్నములను గూడ చేయవలెనని యీసభవారు కోరుచున్నారు."

౧౦

## కరెన్సీ విషయము

"కరెన్సీనిగూర్చి రాయలుకమిషను విచారణవలన చాల ముఖ్యాంశములు ఏర్పడగలవని మహాసభవారు గ్రహించుచున్నారు. కావున అవసరమైనచో ప్రవీణుల సహాయముతోగూడ కార్యసంఘమువారు ఈ సమస్యను సాకల్యముగ పరిశీలించి భారతీయులకు నష్టము కలుగకుండుటకు తగిన ఏర్పాటులను జేయుటకొరకు శాసనసభలలోని కాంగ్రెసువారికి సలహానొసంగవలెను."

౧౧

## కార్యదర్శుల నియామకము

"ఎ. రంగస్వామి అయ్యంగారు, వల్లభాయి పటేలు, డా. యం. ఏ. అన్సారిగార్లను మరల కార్యదర్శులుగ నియమింపవలెను.

సేటు జమునాలాలు బజాజు, సేటు ఆర్. వి. జవేరిగార్లను కోశాధిపతులుగా నియమింపవలెను.

౧౨

## ఆడిటరులు

దలాలుగారిని షాగారిని (బొంబాయి) 1927 వ సంవత్సరమునకు ఆడిటరులనుగా నియమింపవలెను.

## ౧౩

## సర్వదా ఖద్దరుధారణము

### ఏడవ ఆర్టికిలులో మార్పు

"ఎల్లప్పుడును శుద్ధ ఖద్దరును ధరింపనట్టి కాంగ్రెసు సభ్యులు మహాసభకు ప్రతినిధులను, భారత కాంగ్రెసు సభకు సభ్యులను ఎన్నుకొనునపుడును, ఏకాంగ్రెసుసంఘములోను,ఏఉపసంఘములోను కూడ ఓటు చేయకూడదు. అట్టివారిని ప్రతినిధులుగను, సభ్యులుగను ఎన్నుకొనగూడదు. అట్టివారు ఏకాంగ్రెసు సభలోను,సంఘములోను,ఉపసంఘములోను పాల్గొనగూడదు. ఈ తీర్మానమును సరిగ అమలుజరుపుటకు అవసరమగు నిబంధనలను కార్యసంఘమువారు చేయవలె నని యీ మహాసభవారు కోరుచున్నారు."

## ౧౪

## 1927 లో కాంగ్రెసు మహాసభ

1927 లో కాంగ్రెసు మహాసభను జరుపవలసిన స్థలమును భారతకాంగ్రెసు స్థాయిసంఘమువారు నిర్ణయింపవలెను.

## ౧౫

## శిక్కు ఖైదీలు

"(1) గురుద్వారా ఉద్యమముగూర్చి శిక్కుల కాంద్రోళనము ధర్మయుతమును, న్యాయమైనదియునని దొరతనమువారంగీకరించి గురుద్వారా చట్టమును జేసిరి కాని సర్దారు కారకు సింగుగారు మున్నగు గురుద్వారా ఖైదీలను నింకను వదలియుండలేదు. గురుద్వారముల యుద్యమముసంబంధమున ఖైదు జేయబడిన వారినందరిని ఎట్టి షరతులను కోరకుండ విడుదల జేయవలెను. శిక్కులను గూర్చి చేయబడిన కఠినశాసనమును రద్దుపఱచవలెను. శిక్కులకు గల యిబ్బందులన్నిటిని తొలగించవలెను. అటులుచేసినగాని శిక్కుల సమస్య పూర్తిగ పరిష్కరింపబడదు. (2) దొరతనమువారితో శిక్కులకు జరుగుచున్న సంఘర్షణము నందు కాంగ్రెసువారికి సంపూర్ణమగు సానుభూతి యుండుటయే కాక శిక్కులు తమహక్కులను బడయుటకు అహింసావిధానమున జరిగించునట్టి సక్రమములగు కార్యములన్నిటియందు వారికి కాంగ్రెసువారు మనఃపూర్వకముగ సహాయము చేయుదురని కూడ కాంగ్రెసువారు శిక్కులకు అభయమిచ్చుచున్నారు."

## ౧౬

## కాంగ్రెసు నిబంధనలమార్పు

### ఎనిమిదవ ఆర్టికిలులో రెండవ పేరా

"(1) ఏసంవత్సరమున గాని అక్టోబరు 1 వ తేది నాటికి కాంగ్రెసుసభ్యులుగ నుండనివారిని ఆసంవత్సరము డిశెంబరులో జరుగు కాంగ్రెసుమహాసభకు ప్రతినిధులుగ ఎన్నుకొనగూడదు.

### మూడవపేరా

భారతకాంగ్రెసు స్థాయిసంఘసభ్యులు అధికారరీత్యా (ఎక్సుఅఫీషియో) మహాసభలో ప్రతినిధులగుదురు. వీరినిగాకుండ రాష్ట్రీయ కాంగ్రెసుసంఘములు ఆరాష్ట్రమునందలి జనసంఖ్యనుబట్టి 50 వేలమంది కొకనిచొప్పునమాత్రమే ప్రతినిధుల నెన్నుకొనవలెను. (50 వేలకు తక్కువగానున్నను ఒక్కనినే ఎన్నుకొనవలెను) జనసంఖ్యను నిర్ణయించుటలో రాష్ట్రమునందుండు స్వదేశసంస్థానముల జనసంఖ్యనుగూడ చేర్చుకొనియే ప్రతినిధుల నెన్నుకొనవలెను. 1921 జనాభాపై నాధారపడవలెను. సంస్థానముల జనసంఖ్యను ప్రతినిధుల ఎన్నికకుమాత్రమే రాష్ట్రీయకాంగ్రెసు సంఘములవారు స్వీకరింపవలెనుగాని సంస్థానముల పరిపాలనాదివిషయములం దెంతమాత్రమును కల్పించుకొనగూడదు.

### నాల్గవపేరాను కొట్టివేయవలెను.

ఏడవపేరాలో రెండవలైనులో "జరుగనున్న మహాసభ సన్నాహసంఘము" అను వాక్యమునకు బదులుగా "భారతకాంగ్రెసు సంఘకార్యాలయము" అని చదువవలెను. పేరా చివర నున్న మాటలలో "అట్టినిబంధనలు" అను మాటలు మొదలు తీసివేసి యిటుల చదువవలెను:"అట్టినిబంధనలు ముందుగా భారత కార్యసంఘమువారిచే నామోదింపబడిననే కాని అవిచెల్లవు". 'అట్టి' అనుమాటలకుముందు ఫులుస్టాపు పెట్టవలెను.

### పదకొండవఆర్టికిలు నిటుల చదువవలెను:

"ప్రతి ప్రతినిధియును మహాసభ జరుగుచోట శిబిరములలోనుండు భారత కాంగ్రెసు సంఘ కార్యాలయమువారికి అట్టి సర్టిఫికెటును చూపించి ఒక రూపాయిని చెల్లించినచో ప్రతిప్రతినిధిని కాంగ్రెసు మహాసభలకు రానిచ్చుటకొక టిక్కెటు ఇయ్యబడును."

### తాత్కాలిక నిబంధన

గౌహతీ మహాసభకు ప్రతినిధిరుసుము అయిదు రూపాయిలుగా ఏర్పరుపబడెను. ప్రతినిధిరుసుమువలనవచ్చిన ధనమంతయు సన్నాహసంఘమున కిచ్చివేయవలెను.

17 వ ఆర్టికిలులో మొదటిక్లాజు నిట్లు చదువవలెను.

"మహాసభ ముగిసిన పిమ్మట 15 రోజులలోగా భారత కాంగ్రెసు సంఘమువారు ప్రతినిధిరుసుమువలనవచ్చిన మొత్తములో సగము మొత్తమును సన్నాహసంఘమున కిచ్చివేయవలెను.




వి. వాసిరాజు గారు, బి. ఏ., బి. యల్.

యుద్ధానంతరమునుండియు, కౌటిల్యుని యర్థశాస్త్ర మందలి నూతనవిషయప్రబోధము పాశ్చాత్యపండితుల నాకర్షించిననాటినుండియు మైకవిలీయొక్క సిద్ధాంతములయం దాధునికవిమర్శకుల కొక నూతనాదరము కలుగ జొచ్చెను. చంద్రగుప్తునినాటి చాణక్యు డెక్కడ; ఐరోపామహాసంగ్రామపు మొలకలను పెంచి యభివృద్ధిచేసిన బిస్మార్కు ఎక్కడ; నవయుగాదినాటి ఫ్లారెన్సుదేశపు మైకవిలీ యేడ? ఇట్టి సంబంధములేని వారి చర్యలు చరిత్రకారులకు క్రొత్తయుత్సాహ మెట్లు కలుగజేయు నను సందేహము కలుగవచ్చును. కాని యొక్కవిషయము మాత్రము గ్రహించినచో నిది స్పష్టము కాగలదు. మానవస్వభావ మెల్లెడలను నొక్కటియే కాన మానవచరిత్రకూడ భిన్నభిన్నములుగా నగపడుచున్నను నిది యొక్కటియై పరిణమించుచున్నది. ఈయేకత్వమును నిరూపించుటయే చరిత్రకారుని ముఖ్యోద్దేశమై యున్నది.* ఈయేకత్వమే పైన పేర్కొనబడిన మువ్వురివ్రాతలయందును క్రియలయందును నగపడుచున్నది. ఇదియే పండితుల నాకర్షించుచున్నది. దీనినే వీరు మువ్వురు దృఢపరచుచున్నారు.

మైకవిలీసిద్ధాంతములనే దేశకాలానుచితముగ మగధదేశసంస్థాపకు డనబరగు చాణక్యుడు వెల్లడిచేసెను. లివి యను చరిత్రకారుని నాధారముగ గైకొని మైకవిలీ తన సిద్ధాంతములను నవయుగాదియందు స్వదేశస్థితిగతుల కనుగుణ్యముగ వెల్లడిచేసెను. ఈసిద్ధాంతములనే యాధారభూతములుగ జేసికొని బిస్మార్కు జర్మనీదేశమును సంగ్రామమునకు సిద్ధపరచెను. ఇట్టి యీమువ్వురిసందేశ మొక్కటియై వీరలను రాజకార్యనిర్వాహకులలో గొప్పవారుగ పరిగణింపబడునట్లు కావించినది.

ఈమువ్వురిలో మధ్యస్థుడైన మైకవిలీ 1469 సం. జన్మించి 1527 సం.న కాలధర్మము నొందెను. 1513 సం. ప్రాంతమునందు తనవ్రాతలలో ముఖ్యమైన "ప్రిన్సును" సంపూర్ణము చేసెను. 1520 సం. మతగురువు సందేశానుసారముగ తన ఫ్లారెన్సుచరిత్రను ప్రారంభింపగలెను. అంత్యకాలమందు "మాండ్రగోలా" యను నాటకమును రచించెను. ఈమూటియందును ముఖ్యముగా తన "ప్రిన్సు" నందు తన రాజకీయసిద్ధాంతములను వెల్లడిచేసెను.

ఈసిద్ధాంతములను గమనించినయెడల నివి యనుభవమునుండి వ్రాయబడినవి కానట్లును, కేవలము కల్పితములై మనస్సృష్టిమాత్రమైనట్లును, న్యాయపరుల కాచరణలోనికి తే ననర్హములైనట్లును, ధర్మవిరుద్ధముగా నున్నట్లును చదువరులకు తోపకమానదు. కాని యథార్థమేమన: ఇవి యాచరణీయములనియు, మైకవిలీకాలమునాటికి ఇటలీదేశ మనుభవించుచున్న ఘోరసంగ్రామావస్థనుండి విముక్తినొందించు ప్రయత్నముల కనుగుణ్యమగు ననుభవజ్ఞానముతో వ్రాయబడినవి కాబట్టి యివి యనుసరణీయములనియు ననేకవిమర్శకు లిటీవల వ్రాయుచున్నారు. తత్కాలమందలి ఇటలీదేశపు సంక్షోభము బాహ్యమునకు రక్తపాతకరమైనను సంక్షోభమే కావచ్చునుగాని దీని

* ఇందువలననే చరిత్రకారులకు పితామహు డనబరగు హెరొడొటస్ వ్రాసిన చరిత్రలు పిట్టకథలవలె గాన్పించుచున్నవే కాని యీ చరిత్రాత్మకసందేశమును వెల్లడిచేయుటయందు 'థూసిడైడిస్' వ్రాతలకు సరి కాకున్న వని కొందఱి యభిప్రాయము.

యంతరార్థము వేరొందుగలదు. ఆయాపరిస్థితుల ననుసరించి పెంపొందిన చిన్నచిన్న ప్రజారాజ్యములయొక్క ప్రవృద్ధి శాంతిదాయకమా? లేక వీనినన్నిటినికలిపి ప్రజల సౌఖ్యభారమును వహించిన యేకచ్ఛత్రాధిపత్యము శాంతికరమా? యను రెండువాదనల సంక్షోభమే దీని యంతరార్థము. ఈసంక్షోభమే చంద్రగుప్తుని కాలమందును బిస్మార్కుకాలమందునుగూడ పొడసూపినది. మరియు చంద్రగుప్తునినాటినుండియు కలత గలుగజేయుచున్న రాజకీయ మతవిషయసమ్మేళనముయొక్క యనర్థకములుగూడ "ప్రిన్సు"నందు చర్చింపబడెను. కాబట్టి రాజకీయవిషయములకు మతవిషయములు ప్రధాన మనువాదన నిది ఖండించుచున్నట్లు తేలుచున్నది. ఇట్టివిషయములను చర్చించుటలో మైకవిలీ చూపించిన విశేష మేమన తనచర్చలను సమకాలికవిషయప్రాముఖ్యముతో గాక, మానవచరిత్రకు సంబంధమైన విశాలదృష్టితో గమనించియున్నాడు. మానవచరిత్ర శతాబ్దిమాత్రము గలది కాదని స్థూలదృష్టితో చరిత్రకారులకు చూపించవలసిన యేకత్వముతో నిరూపించియున్నాడు. అరిస్టాటిల్‌నాటినుండియు నాచరణలో లేని యీచరిత్రరచన పద్ధతిని పునర్నిర్మాణముగావించెను. ఇదేరీతిని గావింపబడిన జాతీయసేనాదళములను గూర్చిన చర్చలు కూడ చంద్రగుప్తునినాటియు, జర్మనీవిజృంభణకాలమునాటియు జాతీయదళములను జ్ఞాపకపరచుచున్నవి. వీని యావశ్యకత నేటి ప్రతిపౌందవునకును స్పష్టమై యున్నది. ఈకారణములచేత నింతవరకు ధర్మవిరుద్ధము లనబడిన మైకవిలీసిద్ధాంతములు కొంతకాలమునుండియు విశేషప్రాముఖ్యమును వహించుచున్నవి.

ఇక "ప్రిన్సు" నందలి విషయములను సూక్ష్మముగా విచారింతము. దీనియందు ధర్మవిరుద్ధమైన రాజ్యాంగతంత్రము బోధింపబడె నని చాలమంది యభిప్రాయము. ఇది మానవధర్మము నణగద్రొక్కి తాత్కాలికావశ్యకతనే ప్రధానముగ గైకొని నీతిబాహ్యముగ ప్రవర్తింపవలె నని బోధించుచున్నది. కాని యిదియంతయు వక్రోక్తిని వ్రాయబడినదే కాని యథార్థముగా నిట్టి విషయములను బోధించుటలేదని కొందఱి యభిప్రాయము. సమకాలికచరిత్రను దాని కనుకూలమగు నిరంకుశాధికారముయొక్క యావశ్యకతను గమనించినయెడల నిది వక్రోక్తితో వ్రాయబడ లేదని స్పష్టము కాగలదు. చాణక్య బిస్మార్కులవలెనే "అవశ్యకత నీతిమార్గము నెరుంగజాల" దను సారాంశమునే 'ప్రిన్సు'కూడ బోధించుచున్నది. అట్లు కానిచో రాజకార్యనిర్వహణము కాజాలదని వీరిమతము. కావుననే మైకవిలీ "తాను గావించిన వాగ్దానము తనకు లాభకరము గాదని తోచినయెడల వివేకియైన రాజకార్యధురంధరుడు వాగ్దానభంగము గావించుటకు జంకకూడ" దని వ్రాయుచున్నాడు. దేశసంరక్షణాభంగము కానున్నయెడల, దానిసంరక్షణమునే ప్రధానముగ జేసికొని, యవమానమునకుగాని, యవినీతికిగాని వెఱవగూడదని వ్రాయుచున్నాడు. "జనసామాన్యము నీచమైనదియు స్వలాభాపేక్షను కోరునదియుగానున్నది. వారికి స్వలాభసిద్ధి యగునంతవరకు వారు రాజునకు మిత్రులే కాని యట్లు కానిపక్షమందు వారు శత్రువులై రాజునకు హాని చేయజూతురు. కాబట్టి రాజు మెలకువగల్గి న్యాయశాస్త్రమును, బలమును ఆధారము చేసికొని పరులనునమ్మకుండ ప్రవర్తింపవలెను. ఇట్లు ప్రవర్తించుచు నెల్లకాలములయందును యుద్ధసన్నద్ధుడైయుండవలెను." ఇట్టివ్రాతలతో 'ప్రిన్సు'నిండియున్నది. నేటి డిస్‌ఆర్మమెంటు సభల పర్యవసానముదీనినే దృఢపరచుచున్నది. మరియు మానవులయందు జంతుస్వభావమిమిడియున్నది కాబట్టి జంతువులపట్లనుపయోగింపబడు పశుబలమును మానవులపట్ల నుపయోగించుటకు పాలకుడు జంకకూడదు. దేశముకొరకు లాభకరమేమైనగాని రణరంగమందుచావకూడదని వ్రాయుచున్నాడు. దేశక్షేమము కాదనితోచినయెడల నెంతఘనకార్యముకొఱకునైనను చావకూడదనియు, యుక్తిచేత కార్యమును సాధింపవలెననియు మైకవిలీ యభిప్రాయము. ఇట్టిమతమే సామ్రాజ్యసంస్థాపకులగు కొందఱు మొగలాయిచక్రవర్తులను, శివాజీనికూడ నావహించియున్నట్లు తోచుచున్నది. ఇట్టిమతము నవలం

బింపకపోవుటచేతనే కొన్ని రాజపుత్ర సంస్థానములు క్షీణించినట్లుకూడ చరిత్రలయందు విశదీకరింపబడినది. "మార్గాన్వేషణమునకు మంచిచెడ్డలు, గౌరవాగౌరవములును సమానమే" యనికూడ 'ప్రిన్సు' సూచించుచున్నది. తుద కన్నిటిలోను ప్రధానమైనది దైవఘటనమేయనియు, నది స్వశక్తిని బంధించుచున్న దనియు మైకవిలీ నమ్ముచున్నాడు.

మైకవిలీ కడు స్వతంత్రాభిలాషి; కావుననే యితడు ప్రజారాజ్యపక్షపాతి. కాని యితని మతమందు ప్రజాస్వాతంత్ర్యము దేశక్షేమంకరము. అట్టిపక్షమందే యితడు గ్రీకుప్రజాపాలితరాజ్యములవంటివానినభిలషించును. కాని యెడల దేశమందు శాంతిని స్థాపింపగల్గు నిరంకుశాధికారమే యీతనికి ప్రియమగును. ఇట్టిశాంతిస్థాపకుడు నిరంకుశాధికారియైనను తనజీవితకాలమందు బాగుగ పరిపాలించుటయేకాక, తనయనంతరమందుగూడ నట్లు పరిపాలింపబడు నేర్పాటులను గావించి గతించినచో నట్టినిరంకుశాధికారియే మైకవిలీకి ప్రియుడగును. ఇక ప్రజాస్వాతంత్ర్యమన్ననో అది వ్యక్తిగతమైనదిగానుండక, సాంఘికస్వాతంత్ర్యమై యంత్యమందు రాష్ట్రమునకు శ్రేయోదాయకమైనదిగా నుండవలెను. కావున మైకవిలీకి ప్రధానమైనది రాష్ట్రము, దాని యభివృద్ధియేకాని దానిని సమకూర్చువిధానము ప్రధానముగాదు.

పదునారవ శతాబ్దమున నిట్టివిషయములతో మైకవిలీయిటలీదేశమునుసంక్షోభమధ్యమునుండితప్పించి ప్రజారాజ్యసంస్థాపనకుబూనుకొనెను. ఇట్టిసిద్ధాంతములతోడనే బిస్మార్కు నిరంకుశాధికారభూయిష్ఠమైన సామ్రాజ్యస్థాపనకు గడంగెను. యుద్ధానంతరమున తేలినవిషయమేమనగా ఇట్టిసిద్ధాంతములయందు ప్రపంచమున కసహ్యతగల్గి శాంతినిగోరుచున్నదని కొంద అభిప్రాయపడుచున్నారు; కాని మరికొంద ఱీసిద్ధాంతములయొక్క ప్రాముఖ్యము హెచ్చైనదని చెప్పుచు మానవులు నమ్మదగినవా రనియు, స్వాభిలాషాపరులు కారనియు తలచి యేదేశపురాజనీతి నిపుణుడైనను కార్యసాధనము చేయగల్గినాడా, చేయగలడా యనియు; రక్తపాతము కాకుండగను, నిరపరాధులనుసమర్పణచేయకయు, నిష్కాపట్యముతో యుద్ధము చేయగల్గుదురా యనియు; యేదోయొకమానవుడు నీతిమార్గముతో ప్రవర్తించినట్లుగా రాజు ప్రవర్తించినచో రాష్ట్రమునకు కీడుమూడక యుండునా యనియు; ఇట్లు సంకోచించుచున్నారు. ఈసంకోచముయొక్క భావమేమనగా నేటిరాజ్యపాలనలకు విజయమును చేకూర్చునవి మైకవిలీ యుదాహరించిన సారాంశములేకాని, శత్రువు చేతజిక్కినచో మేలుగూర్చి పొమ్మనుటే చాలునను బద్ధనీతులు రాజ్యసంస్థాపనలకు లాభకరముగావనియు, అట్లయ్యేనేని మధ్యయుగమందలి రాజపుత్ర సంస్థానముల వలె రాజ్యములు కీటకములట్లునశించి రూపుమాయుననియునే తాత్పర్యము. పరిస్థితు లిట్లున్నపుడు యుద్ధసన్నాహములను మూలద్రొక్కి శాంతిని నెలకొల్పుయత్నము లెట్లు కొనసాగగలవు?

---

# విహారీ విహారము

జంధ్యాల శివన్నశాస్త్రి గారు

కృష్ణుఁడు



నల్లకల్వల చాయను నవ్వుమేనఁ
బసిఁడిపుట్టము వింత శోభను నొసంగ
బాలభానుసువర్ణ ప్రభాలలామ
నీలమణి భూధరంబటు గ్రాలు శౌరి.

హృదయదుర్గమ్ముఁ జొచ్చుచు మదనవిభుఁడు
ద్వారమున నుంచిపోయిన ధ్వజము లనఁగ
యదుకిశోరుని కర్ణములందుఁ గ్రాలు
మకరకుండలములఁ గాంచుమా లతాంగి!

హరితరుచిగల్గు వంశిక నల్లకృష్ణుఁ
డధరమునఁ దాల్చినంతనె యధర నయన
వసనసుందరకాంతి శబలిత మగుచు
నభ్రగతశక్రచాపము ననుకరించు.

నెమలిపింఛము, కృష్ణుమూర్ధమున నెక్కి
తనుచు నిలు మిడిసిపడెద వెందనుక నీవు?

వింటివో లేదొ రాధ కోపించె నంత
యామె పదధూళి దుడువగా నగును నీకు.

విరహిణీ సమాశ్వాసము

గగనమున మేఘపటలము గానరాదు
పొలఁతి! యల్లదె కాంచుము పురులువిప్పి
నెమలు లాడుచు నున్నవి నిక్కువమ్ము
కృష్ణుఁ డీయెడ నీ కడ కేగు దెంచు.

అభిసారము

ఇరువు రాశ్లిష్టులై నిశి నేగుచుండ
రాధికామాధవుల శరీరములు వరుసఁ
గౌముదీఛాయలందునఁ గానరాక
యభిసరణజయమునకు సాయ మొసఁగె.

వయస్సంధి

శైశవచ్ఛాయ యింకను జనఁగ లేదు
యౌవనజ్యోతి యొడలెల్ల నలముకొనియె
రమణిగాత్రమ్ము [1]తాపితారంగువిధము
మెరయుచున్నది మెచ్చులబరణియగుచు.

యౌవనము

యౌవనోద్వేగమంగము లావరించె
దాని వ్రేఁగునఁ గాఁబోలు తరుణినడుము
జవ్వజవ్వన నూఁగుచు జనులకనుల
కమితమోదమ్ము గూర్చుచు నలరుచుండె.

వేణి

జారుపమ్మెదఁ గుచములు చవుకళింప
వెనుకకు నొమ్మద్దుకరముల వెంట్రుకలను
బట్టి వేణిని బంధించు భాసురాంగి
యెవని మనసును బలిమి బంధింపలేదు?

నీలములు గోమలమ్ములౌ నిడుదకురులు
విడినఁ జూపఱ ధైర్యమ్ము వీడఁజేయు
జడగ బంధింపఁబడియుండు నెడలనింక
నెట్టిమనసుల నేని బంధించు బళిర!

వేణి యెవ్వతె పదము చుంబించుచుండు
నెపుడధోగతి నెవ్వతె యిచ్చగింప
దట్టి కాంతయుండఁగ హృదయమ్మ! నీకు
జడమయంబగు తీర్థంపుగొడవ యేల?

తిలకము

సొగసు కిరవగు మగువ నెమ్మొగమునందుఁ
గ్రాలు రతనంపుబొట్టును గంటె సఖుఁడ!
చంద్రమండలమునఁ జేరి సాంద్ర తేజ
మినుమడించెడు దినకరు ననుకరించు.

పసిమినిగ్గులు దేరెడు వదనమందు
కప్పురము, కుంకుమమ్మును, కస్తురియును
తిలకముగఁ జేరి కరము శోభిలుచునుండు
సుందరస్థానముల నన్నె నొందరెవరు?

[2]బిందుసంయోగమున జగమందు సంఖ్య
దశగుణాధిక గరిమమ్ము దాల్చునండ్రు
బిందుసంయోగమున నీవెలందిముఖము
బాపురే! యసంఖ్యగుణప్రభావము వహించు.

రవిసహాయుతఁ గాలరాహువును జెల్చి
సమధిక ప్రభ వెల్గెడు చంద్రుఁడనఁగ
విడువడిన నల్లకురులు గప్పినను నామె
కుంకుమాంకితముఖము వెల్గొందుఁ గరము.

చాల వెలగల్గియును మణి చానపాద
కటకమున జటితమయ్యెడు గతివహించె
గవ్వచేయని ముచ్చెబంగారు బళిర!
కామిని లలాటమున కలంకారమయ్యె.

కలికి గోరోజనపుఁ దిలకమ్ముపైన
నిడిన ధవళాక్షతలు గాంచి తేవయుస్య!
రాహుభయమునఁ గుజమండలమున దూరు
నిందుకళలన శోభవహింపుచుండె.

కలితమధుపానజనిత రాగమ్ము పర్వ
గుట్టుతెలుపనిదనుక నాకోమలాంగి
పసిఁడివన్నె మొగంబున నెసఁగుపీత
చందనముబొట్టు నయనగోచరముగాదు.

కనుబొమలు

ముగ్గరమ్మును, గనుబామల్, ముంగురులును,
గానమును, విల్లు, చూపులు, గామినియును
వక్రతాగుణ మెంతెంత వఱలుచుండు
గౌరవాతిశయమ్మును గాంచుఁ గాదె.

నేత్రములు

మరుఁడు కౌతుకపరుఁడయి మచ్చరమ్ము
గొలుప నన్యోన్య జయమునకును గడంగి
నాతిచాతుర్యమును నయనములు నంత
కంతకును బెరుగుచున్నవి పంతమునను.

---

1. ఎఱుపు నలుపు రంగుల మిశ్రణము. 2. సున్న, తిలకము.



జనరల్ ఫెంగు యుసియాంగు



జనరల్ యాంగు సెను



యుజన్ చెను గారు,
చీనా జాతీయప్రభుత్వ ప్రధానమంత్రి



ఓ. సి. ఓమల్లె గారు,
చీనాలో బ్రిటిషుప్రభుత్వ ప్రతినిధి



మార్షలు చాంగ్‌ట్సో లిను



మార్షలు ఊ పే ఫూ

తూర్పు చీనాదేశపు నూతన పటము.




ప్రస్తుతము యుద్ధసన్నాహములు జరుగుచున్న ముఖ్యస్థానము లిందు గనుపరుపబడినవి.



# చీనా స్వాతంత్ర్య సంరంభము

జయంతి వెంకటకిరీటిరావు గారు

దేవభూమియని ప్రసిద్ధికెక్కిన చీనాదేశ మిప్పుడు అన్యోన్య సమరసంకులములకాకరమై, ప్రపంచ రాష్ట్రములకు భయము గొల్పుచున్నది. తత్సమర ఫలితము లొక్క చైనీయులకు మాత్రమే సంబంధించినవి కావు. కొన్ని వత్సరములుగా, బలవంతములగు ప్రపంచ రాష్ట్రముల చర్యలవలన, చీనాయందు ప్రతివిషయము అంతర్జాతీయ ప్రాముఖ్యమును వహించుచున్నది. ప్రస్తుతము చీనాయందు జరుగుచున్న సమరము ప్రాక్పశ్చిమ విజ్ఞాన సంఘట్టనము, పాలకపాలితజాతుల సహజవైరము, భూమండులకు కార్మికులకునుండు నిరంతరమగు పోటీయని చెప్పవచ్చును. కడచిన యిరువదేండ్లనుండియు చీనా చారిత్రమును గమనించినవారు చీనాజాతీయోద్యమము విదేశీయ నిరంకుశ దాస్యమును తిరుగద్రోసి ప్రాగ్దేశముల విజ్ఞానభాస్కరుని స్వచ్ఛకాంతులతో ప్రకాశింపజేయుట కెట్లు యత్నించుచున్నదియు, ఎట్లు విజయము గాంచుచున్నదియు దెలిసికొనగలరు.

సామ్రాజ్యకాంక్షకు గురియగుట

చీనా సంరంభమునకు రాజకీయసాంఘిక ప్రాముఖ్యముగలదు. సామ్రాజ్యకాంక్షను తృప్తిపరచుకొను నిమిత్తము, "వెనుక బడియున్న" దేశములలోనికి వ్యాపార మిషపై ప్రవేశించి దేశమునం దార్థికసంపర్క మేర్పరచుకొని, మతప్రచారకులను ప్రవేశపెట్టి, వారిద్వారా జనవశీకరణ తంత్రములు బన్నుటయు, క్రమేణ యీగుట్టు బయలుపడి దేశీయులు తిరుగబడెదరని భయముతో చగనే మతసంరక్షణము, వర్తకపుహక్కులసంరక్షణ మనుకారణముల జూపి, సైన్యములదెచ్చి దేశము నాక్రమించుకొనుటయు, ఆధునిక రాజనీతియైయున్నది. ఈపద్ధతి చీనాలో విక్టోరియాకాలమునందు ప్రారంభమయినది. అప్పటికి చీనావారికి ఇతరదేశములతో రాజకీయసంబంధము లేదు. పాశ్చాత్యులు పలుదేశములవారు వచ్చి వర్తకము చేసికొని పోవుచుండిరి. చీనాప్రభుత్వమువారికి ఎట్టి ఆక్షేపణయు లేకుండెను.

బ్రిటీషువారు విదేశములనుండి నల్లమందు చీనాలోనికిదిగుమతిచేయ మొదలిడిరి. విషతుల్యమగు ఈమందును చీనాప్రభుత్వమువారు నిషేధించియుండిరి. బ్రిటీషువారు తమవర్తకపు హక్కులను నిలబెట్టుకొనుటకై పోరాడిరి. 1840 సం. నల్లమందు యుద్ధములు ప్రారంభమయినప్పటి నుండి ఆర్థికసంపర్కమంతయు రాజకీయముగ మారెను. ఒకదానివెనుక నొకటి రేవుస్థలములను బ్రిటీషువారాక్రమించుకొనిరి. హాంకాంగు, కొటాను వీరివశమయ్యెను. చీనావారియొద్ద నష్టపరిహారముగొని, మతప్రచారపు హక్కునుగూడ బడసిరి. చీనా భూగర్భమున లోహపు గనులు, బొగ్గుగనులు గలవని పాశ్చాత్యులు త్వరలో గుర్తించిరి. ప్రత్తి, పట్టు, తేయాకేకాక, రైళ్లు, స్టీమర్లు నిర్మించుటకు వలయు సామగ్రిగూడ గొంపోవచ్చునని తలంచిరి. అందుచే బలవత్తరమగు రాజ్యములన్నియు నెవరిమట్టునకు వారు వేర్వేరు భూభాగములను స్వాధీనపరచుకొనిరి. వీటికి "కన్సెషన్సు" అనిపేరు. ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాంసు, అమెరికా, రషియా, జపాను దేశములకు ఇట్టి భూవిభాగము లేర్పడియున్నవి. ఫలవంతమును, ప్రజాసమృద్ధమునగు యాంగ్ట్సులోయ బ్రిటీషువారిదయ్యెను. షాంటాంగు రేవుస్థలము అందరి కన్నిభాగములుగా విభజింపబడియున్నది.

ఈ పద్ధతిలోనున్న చిత్రమేమన, ఈ ప్రాంతములందుండు విదేశీయులు చీనాదేశపు చట్టములకు లోబడి యుండరు. వారిపై చీనాప్రభుత్వమునకెట్టి యధికారము లేదు. ఎవరిసుంకములను వారే విధించుకొందురు. అందలి నగరములలో మునిసిపాలిటీలు ఐరోపియనుల వశమై యుండును. అందుండు చీనావారు పన్నులు చెల్లింపవలెను గాని ఓటు చేయరాదు. ఈ 'కన్సెషన్సు'లో అధికారులు తమసైన్యములను తెచ్చియుంచుకొని యిష్టము వచ్చినరీతిని పరిపాలించుచుండిరి. వర్తకపు ఖానాలను తామే యుంచుకొనుటగాక, రైల్లు తంతివార్తల నిర్మాణముగూడ స్వాధీనపరచుకొని తమకనుగుణ్యముగ నుపయోగపరచుకొనుచుండిరి. మిలిటరీవారి దౌర్జన్యములు సామాన్యకృత్యము లయినవి. చీనాయందలి బ్రిటీషువారి ప్రవర్తనగూర్చి ఒక ఆంగ్లేయప్రముఖుడే (ప్రఫెసరు పెవర్డుగారు) యిట్లు వ్రాసియున్నారు: "హాంకాంగును బలాత్కారముగ లాగికొంటిమి. బ్రిటీషు శతఘ్నిగోళములచే బెదరించి చీనా నౌకాలయముల ప్రవేశించితిమి. చీనాయందు నివసించుచును చీనాశాసనములను న్యాయస్థానములను ధిక్కరించి స్వేచ్ఛాప్రవర్తనకు గడంగితిమి. చీనా సముద్రతీరములందు నదులలోను మన యుద్ధనౌకలను పహారాద్రిప్పుచు అనేక సంవత్సరములుగ నిరంతరము చీనాదేశీయుల ఆత్మగౌరవమును కాలమట్టుచుండుట విషాదకరమగు కాలవైపరీత్యముగాక వేరేమనదగును. ఈ చర్యలవలన చీనాజాతీయౌన్నత్యమునకు ఇంతవరకు మనమే (బ్రిటీషువారు) ప్రబలశత్రువులుగ నున్నాము."

ఐరోపా యుద్ధానంతరము మార్పులు

ఐరోపా యుద్ధానంతరము వాషింగ్టను సంధిషరతుల ప్రకారము అందు పాల్గొనిన తొమ్మిది ప్రభుత్వములుగూడ చీనావారి స్వాతంత్ర్యాభిలాషను పోషించుటకును, తామెవ్వరు చీనాదేశ పరిపాలన విషయమునందు జోక్యము కలుగజేసికొనకుండుటకును, తమదేశీయుల సంరక్షణార్థము మాత్రము కొలదిగ సేనలనుంచుటకును, అట్టి సంరక్షణ చీనాప్రభుత్వమువల్లనే చేకూరునను నమ్మకము తోచినవెంటనే సేనల తీసివేయుటకును అంగీకరించియుండిరి. కాని చీనాలోని పరరాజ్యస్థానములందు యథారీతి చర్యలు జరుగుచునే యున్నవి. జర్మనీవారుమాత్రము ప్రత్యేకసౌకర్యములను వదలుకొనవలసివచ్చెను. ఈషరతుల ననుసరించుచు పరరాజ్యములన్నియు చీనా మెడల అనుకూలముగనుండినట్లే యుండి, చీనాలో తమకుగల పలుకుబడినంతను నుపయోగించి మెవరిబలము వారభివృద్ధిచేసికొనుటకును, ప్రజాభిప్రాయమును తమవైపు త్రిప్పుకొనుటకును, మిషనరీలద్వారాను, విద్యాసంస్థలద్వారాను యత్నించుచుండిరి. దీనిబట్టి యీసంరంభముయొక్క ఆర్థిక సాంఘిక ప్రాముఖ్యమునుగూడ గుర్తింపవచ్చును. ఇట్లు చేయుటలో రషియాసోవియటు ప్రభుత్వము వారిసేవ చీనాజాతీయవాదులకు సహాయకరముగనున్నది. రషియావారు తమ ప్రత్యేకహక్కులను వదలుకొనిరి. తమకు సహజముగు సాంఘికదృష్టితో పరిస్థితులుపరికించి, చీనాదేశము ధనాతిశయము సామ్రాజ్యకాంక్షగల విదేశీయులచే పీల్చి పిప్పి చేయబడుచున్నదని తలంచి, యీఉపద్రవమునుండి తప్పించుటకై 1925 సం॥న సంధి చేసుకొనిరి. అంతకుముందే కాంటనీసుఉద్బోధనవలన విదేశీయులయెడ ద్వేషభావము ప్రజలలో ప్రబలియుండెను.

జాతీయోద్యమ ప్రారంభము

మూడుతరముల క్రిందటిచీనావారికి పాశ్చాత్య వర్తకముయొక్క గూఢార్థము తెలియకపోవచ్చును. అంతేకాక విదేశీయవర్తకులకు ప్రత్యేకసౌకర్యము లొసంగుట ప్రాగ్దేశములం దాచారమయియుండెను. భారతదేశమునందేమి జరిగెను? ఈసౌకర్యములనిచ్చుట తమకే ముప్పు కల్గునని దేశీయులెరుంగకుండిరి. ఇట్టి పరిస్థితులను చీనా యువకులు భరింపజాలకుండిరి. చీనాలో జాతీయోద్యమము బయలుదేరెను. 1911 సం॥నకు పూర్వము చీనాదేశము "మంచు"యను రాజకుటుంబమువారిచే పరిపాలింపబడుచుండెను. పాలకుల అశ్రద్ధచేతను, నానాటికి స్వాతంత్ర్యేచ్ఛ పెరుగుచుండుటచేతను, పాశ్చాత్యనాగర

కతా సంపర్కమువల్లను, ప్రజలలో ఏకవ్యక్తిపరిపాలన తొలగించి ప్రజాస్వామిక ప్రభుత్వమును స్థాపింపవలెనను కోర్కె ప్రబలియుండెను. పెక్కండ్రు సేనానాయకులు సైన్యముల గూడదీసికొని ఒకరినొకరు మించయత్నించు చున్నారు. అనేక వత్సరములనుండి స్థాపితమయియున్న రాజ్యమును పడగొట్టి నూతనాధికారమును స్థాపించులోపున దేశములో అరాచకము ప్రబలుట యొకవింతగాదు. దీనికితోడుగ వర్తకవ్యాపారములకై వచ్చిన పాశ్చాత్య జాతులు తమలో తమకుగల యీర్ష్యచేత స్వాధికారమును పెంపొందించుకొనుటకో, లేక యితరుల యధికారము వృద్ధిపొందకుండ జూచుటకో, చీనాయొక్క అంతఃకలహములందు పాల్గొనుచు అచ్చటి పరిస్థితుల మరింత కలవరపెట్టుచున్నవి. విదేశీయులవలన గలుగు నిరంతర నిర్బంధములచే దేశీయులలో జాతీయభావము పెంపొందుచున్నది.

దక్షిణదేశమందు డా. సనుయటుసేనుగారి నాయకత్వముక్రింద జాతీయోద్యమము బయలుదేరి, హాంకోలో గొప్ప తిరుగుబాటు జరిగెను. చీనాప్రభుత్వస్థానమగు పెకింగు నాక్రమించుకొని రాజవంశమువారిని వెడలగొట్టి, జాతీయపక్షమువారు ప్రజాస్వామిక ప్రభుత్వము నేర్పరచిరి. డా. సనుయటుసేనుగారు అధ్యక్షులుగ నెన్నుకొనబడిరి. వారి తరువాత అధ్యక్షుడుగ నుండిన యూంగుషికికాయిగారు నిరంకుశముగ నేలిరి. పాశ్చాత్యుల ప్రోద్బలముచే వీరు జాతీయప్రభుత్వ పద్ధతిని ధ్వంసము చేసిరి. వీరి మరణానంతరము పెక్కుమంది నాయకులు, సేనాధిపతులు బయలుదేరి వివిధరాష్ట్రములను ఎవరికి వశమయినదానిని వారు ఆక్రమించుకొనిరి.

కాంటను ప్రభుత్వము

దక్షిణమున డా. సేనుగారి పక్షముమాత్రము జాతీయదృష్టిని విడువలేదు. కాంటను కేంద్రస్థానముగ గల వేరొకప్రభుత్వమును స్థాపించి, అదియే న్యాయమగు చీనాప్రభుత్వమని ప్రకటించెను. దేశమంతటిపై కాంటను ప్రభుత్వాధికారము స్థాపించుటకు ఈ జాతీయపక్షము వారు యత్నించుచున్నారు. కాంటను ప్రభుత్వమునకు ఆదినుండియు విదేశీయులన్న సరిపడదు. విదేశీయ బహిష్కారమునుగూర్చి తీవ్రమగు ప్రచారమును సలుపుచుండును. సనుయటుసేనుగారి మరణానంతరముగూడ (1925) కాంటనుప్రభుత్వమువారు వారి యుద్దేశ్యములను నెరవేర్చుచుండిరి. యూంగుకాయిషేకుగారు సేనానాయకులుగను, యుజనుచేనుగారు విదేశాంగమంత్రిగను నుండి దేశమంతను ఆక్రమించుచున్నారు. చేనుగారు స్వాతంత్ర్యప్రియులు; ధీరులు; రాజనీతినిపుణులు; ధర్మగుణము గలవారు. విదేశీయుల నిరంకుశనిర్బంధములనుండి తొలగిపోవ నిరంతరకృషి వీరు సలుపుచున్నారు.

దేశహితముకన్న స్వార్థపరత్వము నెక్కువపాటించు ఉత్తరదేశ సేనానాయకులు ఇట్టి కాంటను ప్రభుత్వమును అణచివేయ జూచుచున్నారు. వివిధసేనానాయకుల మధ్య అంతఃకలహములు జరుగుచునే యున్నవి. వారికి పట్టుదలలేదు. కలసికట్టుగా ఒక్కమారు కాంటనుపైబడుటకు వారిలో వారికి సఖ్యములేదు. కాంటనుకుగల కట్టుదిట్టములు, ప్రోద్బలము వారిలో నెవ్వరికిని లేవు. బ్రిటీషు వర్తకులు వీరికి ధనసాహాయ్యము, ఆయుధసాహాయ్యము చేయుచున్నారు.

ఇతర నాయకులు

ఉత్తరదేశమందు అంతస్సంగ్రామమున పాల్గొనుచున్న సేనానాయకులలో ముఖ్యులగువారు నలుగురు గలరు. (1) చాంగ్‌ట్సొలినుగారు—మంచూరియా, యీశాన్యదిక్కునందలి నాయకుడు. ఇతర సేనాధిపతులకన్న ధనికుడు. గడచిన మూడునెలలలో వీరిబల మధికమయినది. పెకింగు ప్రభుత్వము వీరిపై నాధారపడియున్నదని చెప్పవచ్చును. వీరు హోనానువైపునుండి కాంటనుపై దాడి వెడలుచున్నారు.

(2) ఫెంగుయుశియాంగు గారు— పశ్చిమోత్తర భాగమునందు నాయకుడు; క్రైస్తవుడు. ఈయన జాతీయవాది. విదేశీయులకు తీవ్రమగువిరోధి. కాంటనువలెనే విదేశబహిష్కారములందు, బ్రిటీషుప్రతికూలాభిప్రాయము

వ్యాపింప జేయుటయందు ఉత్తరభాగమున మిక్కిలి పాటుపడుచున్నారు. కాంటను ప్రభుత్వమునకువలెనే వీరి కిని జయము కలుగుచున్నది.

(3) ఉపేఫూనేవాని — వీరు మధ్యభాగమునందు ఎక్కువ అధికారము గలిగియుండిరి. ఆధునిక సైనిక విద్య లందు ఆరి తేరినవారు. ధనసాహాయ్యమట్టే లేదు. 1926 సం.న వీరి ప్రభ వెలుగుచుండెను గాని రెండు మూడు నెలలనుండి వెనుకబడి యున్నారు.

(4) సను చెంగుఫాంగుగారు — యాంగ్‌ట్సీ లోయను షాంటూంగును ఆక్రమించుకొనిరి. అవైపునుండి కాంటను పైకి దాడి వెడలజూచిరి. షాంగేయందలి విదేశీయులు తమసంరక్షణ కార్యమునందు వీరు ప్రబలసాహాయ్యమొన ర్చగలరని ఆశపడియుండిరి. కాని వీరు ఫిబ్రవరిలో పూర్తిగ ఓడిపోయిరి. వీరి సేనలు కాంటను సేనల జేరుచున్నవి.

హాంకో నగరాక్రమణము

కాంటను జాతీయపక్షమునకు ప్రజల ఆర్థిక నైతిక ప్రోద్బలము మెండుగగలదు. విదేశీయుల నిరంకుశాధికార మును పడగొట్టి వారిని చీనా శాసనముల నంగీకరింపజేయు టయే వారి ముఖ్యోద్దేశమగుటచే ప్రజలు, విద్యార్థులు, కార్మికులు వారికి తోడ్పడెదరు. విదేశబహిష్కారములు, సమ్మెకట్టులే వారి ఆయుధములు. అందుచే నెట్టి దౌర్జన్య ములేకయే అన్ని పట్టణముల నాక్రమించుకొనుచున్నారు. శత్రుపక్షమువారి స్వాధీనమునందున్న పట్టణములలో ముందుగ కార్మికులు, విద్యార్థులు వీరిపక్షమున జేరుచుం దురు. నగరిలోనుండి వీరు సమ్మెకట్టుగట్టి, నగరపాలకుల పనుల కాటంకము గలిగింప, కాంటను సేనలు వెలుపల నుండి ముట్టడిచేయుటచే నగరము సులభముగ వీరివశ మగుచున్నది. ఆరీతిగనే 1927 జనవరి 3 వ తేదీన బ్రిటీ షువారి స్వాధీనమునందున్న హాంకో నగరమును, కియు కాంగు నగరమును ఆక్రమించుకొనిరి. బ్రిటీషువారు ఎట్టి ప్రతీకారమును చేయజాలక వెడలిపోయిరి. హాంకో నగరపాలనము పూర్తిగ చీనావారికి విడిచిపెట్టిరి. అందు బ్రిటీషువారికిగల ప్రత్యేక హక్కులన్నియు గూడ వదలు కొనిరి. ఇందు కనుగుణ్యముగ బ్రిటీషు ప్రతినిధియగు ఓమల్లెగారు, యుజను చెనుగారు ఒడంబడిక గావించు కొనిరి. అది యీమార్చి 15 నుండి అమలునకు వచ్చెను.

ప్రస్తుత పరిస్థితులు

షాంగేలోను, తదితరచోట్లను తమకుగల ప్రత్యేక సౌకర్యముల కేమిభంగముకలుగునో యని తలచి బ్రిటీషు వారు తమ దేశీయుల సంరక్షణార్థము ఇంగ్లాండునుండి, ఇం డియానుండి అధికముగ సేనల దెప్పించిరి. అమెరికా జపాను వారలకుగూడ తమ దేశీయులనుగూర్చి యిట్టిభయమే యుండుటచే వారి సేనలు గూడ దెచ్చిరి. అన్ని సేనలు షాంగే రేవులందు విడిసియున్నవి. కాంటనీసు దీనిని లక్ష్యము చేయువారు గారు. హాంకోనుండి షాంగేపైనే వారి రెండవమెట్టు. ఆవిషయము సూచించుటకుగాను ఈ ఫిబ్రవరి నెలలో అప్పుడే షాంగేయందు సమ్మెకట్టు జరిగెను. చిన్నయుద్ధమునందు షాంగేను కాపాడుచున్న జనరలు సను చంగుఫాంగుగారి సేనలు తరుమగొట్టబడెను. చాంగ్‌టొసొలిను మొదలగు ఉత్తరరాష్ట్ర నాయకులు జాతీ యోద్యమను నరికట్టుటకు దక్షిణప్రభుత్వముపై దం డెత్తివచ్చుచున్నారు. ఈవ్యాసరచనాసమయమునకు, యుద్ధరంగము నాన్‌కింగ్ ప్రాంతములకు మరలినది. జపాను రాజనీతిజ్ఞులు సూచించినటులు కాంటను ప్రభు త్వమునకు విజయము తథ్యము. ఉత్తర ప్రభుత్వమువారి కిని, దక్షిణప్రభుత్వమువారికిని సఖ్యము కుదురగలదని వదంతి పాశ్చాత్యదేశములలో వ్యాపించుటచే ప్రజలాం దోళనపడుచున్నారు. అదియే సాధ్యమగునో చీనా స్వా తంత్ర్యము బడసినదని చెప్పవచ్చును.

"ప్రస్తుతవిప్లవము ఇంతటితో ముగియవలసినది కాదు. సామ్రాజ్యకాంక్షాపరులచే బాధింపబడు ఇతర దేశములు గలవు. అడుగంటియున్న జాతులన్నియు స్వాతంత్ర్యమును బడయువరకు నిట్టి విప్లవములు జరు గుచునే యుండును. ఇతర దేశములలో గూడ సామ్రాజ్య

కాంతుడు వచ్చినగాని ప్రపంచము శాంతిని బడయజాలదు." అని కాంటను సేనానాయకుడగు చంగుకాయిషేకుగా రొకపత్రికా ప్రతినిధికి దెలిపియుండిరి.

బ్రిటిషు తంత్రము

చీనాయెడల సానుభూతి యెక్కువచూపుచు, నూతన జాతీయోద్యమవిజృంభణము ననుసరించి అధికారరాజ్యములు తమ సంధిషరతులను మార్చుకొనవలసియుండుననియు, చీనాతో సంప్రతించువిషయమున, పన్నులు వసూలుచేయు విషయమున విదేశప్రభుత్వములన్నియు కలిసి ఒకే ప్రభుత్వమువలె పనిచేయవలెననియు గోరుచు, బ్రిటీషువారు జనవరిలో నొక మెమోరాండమును ప్రకటించిరి. దానికి అమెరికావారుగాని చైనీయులుగాని అంగీకరించలేదు. అమెరికా తనంత తానే చీనాతో సంప్రతించుకొనెద ననెను. పరరాజ్యములను సమష్టిగా నేర్పాటుచేసికొనుట యెప్పుడు యోగ్యముగ నుండును? ఒకే శత్రువును అందరు నెదిర్చినపుడు. ఇట్టి సమష్టిచర్య కవసరములేదు; చీనాను తమతోపాటు సమానగౌరవముతో జూడవలెను; ప్రత్యేకముగ నే ప్రభుత్వమున కనుకూలమగు నేర్పాటుల నాప్రభుత్వము వారు చేసికొనవచ్చునని చీనావారు మెమోరాండమునకు ప్రత్యుత్తర మిచ్చిరి.

ఈమెత్తు విఫలమగుటచే బ్రిటీషువారు వేరొక యెత్తు సాకుచెప్పిరి. చీనా అంతఃకలహములతో తమకు జోక్యములేదనియు, ఎవరికిని సహాయము చేయమనియు పైకి ప్రకటించిరి. షాంగేలో తమ దేశీయులకు, తమ మతస్థులకు ప్రాణాపాయమువచ్చినదని సేనాపరంపరను అచ్చటికి గొంపోవుచున్నారు. దాక్షిణ్యము,అన్యాయచర్య మాపద్ధతి కాదని కాంటనీసు చాటుచున్నను వీరికి నమ్మకము లేకపోయినది. సమ్మెకట్టులందు, చిన్నకొట్లాటయందు పట్టువడు జాతీయపక్షము సిపాయిలను తాము శిక్షింపకున్నను, ప్రతికూలపక్షమువారి కొప్పగించి చిత్రవధల జేయించుచున్నారు. కార్మికులు కాంటనీసుకు తోడ్పడుచుండుటచేతను, వారి పద్ధతులన్నియు సాంఘికవాదపద్ధతులుగ నుండుటచేతను, రషియాబాల్షివిజము ప్రోద్బలము వారికెక్కువగ నున్నదని ఇంగ్లీషువారి భయము. బ్రిటీషు-రషియాసంఘటనమునకు చీనాను రంగస్థలముగ జేయుచున్నారు.

చీనాజాతీయోద్యమము నణచివేయుటకు బ్రిటీషు రాజనీతిజ్ఞులు త్రివిధముల యత్నించుచున్నారని ఫార్వర్డు పత్రిక పారిసులేకరి వ్రాయుచున్నాడు: చాంగ్ట్సులిను, ఉపెఫూ మున్నగు సేనానాయకులకు వస్తుధనసహాయము చేయుట; కోమింగుటాంగు (జాతీయ)పక్షమునందలి మితవాదపక్షమును తమవైపునకు మరల్చుకొన జూచుట; ప్రత్యక్షముగ సేనల హాజరుచేయుట. 75 యుద్ధనౌకలు, అనేకవేలమంది సిపాయిలు, మోటారులు చీనాకు గొంపోయిరి. ఇండియానుండికూడ కొన్ని సేనల నంపుట భారతీయులకు లజ్జాకరముగ నున్నది. ఆసియావాసులును, తమవలెనే స్వాతంత్ర్యసాధనకై పాటుబడుచున్న వారను అగు చీనావారిపై తమసేనల నంపరాదని భారతీయులు వేయివిధముల నిరసనము దెలిపియుండిరి. కాని యేమి లాభము? భారతదేశము బానిసయైయున్నది.

చీనాజాతీయోద్యమము చీనాతో నంతమొందవలసినదికాదు. అందు కార్మికులు, విద్యార్థులు, సామాన్య ప్రజ యెక్కువ పాల్గొనుచున్నారు. దానికి రాజకీయముకన్న ఆర్థిక, సాంఘిక ప్రాముఖ్య మెక్కువగ నున్నది. సామ్రాజ్యాధికారులు సామాన్యప్రజల అణచివేయుచున్నారు. నిరుడు జరిగిన షాంగే వాన్షియాను దుర్ణయములిందుకు నిదర్శనములు. పాలితరాజ్యములను, వలసరాజ్యములను కాపాడుటకై గొప్ప ఉద్యమము బయలుదేరవలెను. పైదేశపు గొడవతో మనకేమని భారతీయు లశ్రద్ధచేయరాదు. చీనా జాతీయోద్యమమునకు భారతీయులు సానుభూతి జూపుచు నైతికప్రోద్బలమొసంగి, చేతనైన సహాయము చేయవలెను. చీనాసంరంభము భారతదేశమునకు గుణపాఠము కాగలదు.

# అసహాయోద్యమ ప్రచారకునియనుభవములు

ఇంద్రకంటి సుబ్రహ్మణ్యశర్మగారు, బి. ఏ.

**1921** సంవత్సరము హిందూదేశ చరిత్రలో ప్రసిద్ధికెక్కినది. ఏలయన హిందూదేశము తనకు స్వతంత్రతకావలెనని కోరినసంవత్సరమే యిది. గాంధీమహాత్మునిచే నిర్మింపబడిన సహాయనిరాకరణోద్యమము ప్రజలందరిచేతను ఆమోదింపబడి, దేశమును మహోన్నతదశకు గొనితెచ్చెను. ప్రజలు సంపూర్ణముగా దీని నాచరణలో పెట్టి పనిచేసిరి. కాని తగినంతదౌర్జన్యరాహిత్యము ప్రజలకు ఇంకను పట్టుబడలేదని గాంధీమహాత్ముడు గ్రహించి శాసనోల్లంఘనము ప్రవేశపెట్టుటకు సమయమురాలేదనియు, నిర్మాణకార్యక్రమము ముందుగా ప్రజలు కొనసాగింపవలయుననియు, తగినపునాదులు లేనిదే స్వరాజ్యసౌధము నిలువదనియు, నిర్మాణకార్యక్రమమే పునాదియనియు బార్డోలీసభలో తీర్మానించెను. కాని యీక్రొత్తతీర్మానముచే ప్రజలలో నుత్సాహము కొంత తగ్గినది. అట్లయ్యును మరల వెనుకటియుత్సాహము ప్రజలలో కలుగుటకు తగినయవకాశము లున్నవని చెప్పవచ్చును. ఏలయన, ఆరోజులలో నుద్యమ మంతమహోన్నతదశలో నుండుటకు కారణముల నుబట్టి చూడ, తగినసమయమువచ్చిన రెట్టించిన యుత్సాహముతో ప్రజలు విజృంభించెదరని చెప్ప వీలగును. ఆరోజులలో ప్రజలయుత్సాహము, పల్లెలలోని ప్రచారము, అప్పటి అనుకూలపరిస్థితులు మొదలగునవి విచారించిన నిది బోధపడును. అందులకు ప్రచారకుని యనుభవములు అనునీవ్యాసము కొంతవరకు సాయపడగలదు.

## ప్రచారము—ప్రచారకులు

**1920** సం. డిసెంబరులో నాగపురిజాతీయమహాజనసభలో గాంధీమహాత్ముని సహాయనిరాకరణతీర్మాన మామోదింపబడినతరువాత దేశములో గొప్పసంచలనము కలిగెను. ఉద్యమమూలపురుషుండగు గాంధీమహాత్ముడు కొన్ని ముఖ్యసూత్రముల గల్పించి అవి దేశీయు లాచరణలో పెట్టినయెడల త్వరలో స్వరాజ్యము పొంద వీలగునని వాక్రుచ్చెను. ఆసూత్రములు:—ఖద్దరుఅభివృద్ధి, మద్యపాననిరసనము, కోర్టులబహిష్కారము మొదలగునవి. ఇవియన్నియు జయప్రదముగా కొనసాగించుటకు గ్రామములలోను, పట్టణములలోను నీయుద్యమసూత్రములను ప్రజలకు బోధించుట యావశ్యకమైనది. దీనికే ప్రచారమని పేరు. ఈసందేశమును ప్రజలకు బోధించినవారే ప్రచారకు లనబడిరి.

## ప్రచారక్రమము

ప్రచారకులు ప్రతిపట్టణమందును, పల్లెయందును కాంగ్రెసు సంఘములను 5 గురు సభ్యులకు తక్కువగాకుండ నేర్పరచవలసియున్నది. పావలాచందా నిచ్చిన ప్రతివాడును సభ్యుడుగానుండ నర్హుడు. ఈ సంఘములే మహాత్ముని సందేశమును వ్యాపింపజేయుటకు, తన్మూలమున స్వరాజ్యమును సంపాదించుటకు మూలస్థానములు. యావద్భారత కాంగ్రెసుసంఘమువారు ఎప్పటికప్పుడు ప్రజ లవలంబింపవలసిన విధానమును ఈసంఘములద్వారా తెలియపరచుచుండెడివారు. స్వరాజ్యసాధనమునకు గ్రామనిర్మాణమే పునాదికావున నీసంఘములను స్థాపించుటకు, అభివృద్ధిచేయుటకు కాంగ్రెసువారు కృషిచేసిరి.

## పట్టణములు—పల్లెలు

పట్టణములో ప్రచారమునకును, పల్లెలలో ప్రచారమునకును చాలభేదము కలదు. పట్టణములలో భోజనాదిసదుపాయములు హెచ్చు. హోటలులలో భోజనము దొరకును. కాని పల్లెలలో భోజనసదుపాయములు తక్కువ. కావున పల్లెలలోని ప్రచారకులు అప్పుడప్పుడు చిక్కులకు లోనగుచుండువారు.

పట్టణములలో చాలమంది విద్యాధికులు. ఉపన్యాసమన్న వారెరుగుదురు. కావున ప్రచారము సులభము. పల్లెలలో నట్లుగాదు. ఇట చాలమంది విద్యలేనివారు; సభలన్న నెరుగరు. కావున వీరి నొకచో కూర్చుటయే కష్టముగా నుండెడిది. చెప్పునది శీఘ్రముగ గ్రహింపలేరు. అందుచే మొండిప్రశ్నలను వేయ ప్రచారకులు సమాధానము చెప్పుసరికి కష్టమయ్యెడిది. అదిగాక వీరికి గవర్నమెంటన్న భయము. కావున కాంగ్రెసుసభ్యులుగ చేరుటకే జంకెడివారు. ప్రచారకులు మోసముచేయునుద్దేశముతో వచ్చిరేమోయని వారికనుమానము. చెవరు తీరకపోవుటకు నిట్టిచిక్కు లుండెడివి. పట్టణములలోని ప్రచారకులు ఎక్కువగా రాజకీయజ్ఞానముకలవారు, పెద్దవారు, విద్యావంతులు వేయుప్రశ్నలకు జవాబు చెప్పవలెను. పల్లెలలోని ప్రచారకులు ఎక్కువగా రాజకీయజ్ఞానము లేకపోయినను, ప్రజలప్రశ్నలకు జవాబుచెప్పుటకు తగినశక్తిగల్గి, వారిని ఆకర్షించుకంకము కలవారుగ నుండవలయును. వీరిలో చాలమంది విద్యార్థులే; బాగుగ విద్యనభ్యసించినవారు.

పట్టణములలో సభలు సాయంకాలమున జరుగును. కాని పల్లెలలో రాత్రి భోజనానంతరము మాత్రమే జరుగును. పగ లెవ్వరును అగపడరు; పొలములలో నుందురు. రాత్రి భోజనము చేసి రామునికోవెల యొద్ద కూడుచుందురు. కావున అప్పుడు సభ జరుపవలెను. గట్టిగ మాట్లాడువా డుత్తముడు.

## పల్లెలలోని ప్రచారము

పట్టణములలోని ప్రచారమున కనేక సౌకర్యము లుండుటచే సంతగ చెప్పనక్కరలేదు. పల్లెలలోని ప్రచారమునుగురించి మాత్రము చర్చింతము. ప్రచారకుడు ముందుగా గ్రామప్రవేశముచేసి, కరణముగారింటికో, మునసబుగారింటికో, ఆయుద్యమమునం దిష్టమున్న మరే గృహస్థునింటికో వెళ్లుట మామూలు. మొట్టమొదట నెరుగకపోయినను, ప్రజలు క్రమముగా నెదురువచ్చి ప్రచారకులకు స్వాగతము చెప్పెడివారు.

## భోజనసదుపాయము

సాధారణముగా కరణముల ఇండ్లలోగాని మరియే భాగ్యవంతుని యింటిలో గాని భోజనము చేయుచుండెడివారు. ప్రచారకుడు వచ్చినాడని తెలియుటతోడనే గ్రామమంతయు సంచలనము కలిగెడిది. చీకటిపడినకొలది మీటింగుకు చేరవచ్చుచుందురు. ఈలోపుగ కొంతమంది వచ్చి ప్రచారకునితో కొంచెము ముచ్చటించి పోవుచుందురు.

## ఉపన్యాసపద్ధతి

ఉద్యమప్రారంభదినములలో ప్రచార మింతక్రమముగా నుండెడిది. సభయన నేమో ప్రజ లెరుంగరు. మీటింగుకు అని పిలిచిన తెలియరు. కావున డప్పువానిసహాయముతో రామకోవెలయొద్ద గాంధిగారి హరికథ యనికాని, ఏదో కథయని కాని ప్రజలను జేర్చి ఉపన్యసించెడివారు.

## సభ—ప్రజలు

సమర్థుడైనప్రచారకుడు ఉపన్యాసమిచ్చుచుండ ప్రజలముఖములయం దాశ్చర్యమును, సంతోషమును అగపడుచుండెడివి. అందునను రాటము పూర్వమునుండియు నుపయోగించుచోట్ల ప్రజలు రాటముయొక్క మాహాత్మ్యమును విని 'మహాత్మాగాంధికీ జై' అని అందరు ఒక్కసారిజయజయధ్వానములు చేయుచుండువారు. అందులకు కారణము అదివరకు రాటముయొక్క ప్రయోజనము పూర్తిగా జరుగకపోవుటే. త్రాగుడును గురించికాని, కోర్టులబహిష్కారమును గురించికాని చెప్పినపుడు ప్రజలలో మిగులసంచలనము కలిగెడిది. ఇందులకు ఫలితముగ కొన్నిపంచాయతీసభ లేర్పడి త్రాగినవారిని కులములోనుండి వెలివేయుట, జరిమానాలు, కోర్టులకు పోనక్కరలేకుండ గ్రామములలోనే విచారణలు కావించుట జరిగినవి. ఈప్రచారమువలన ఖద్దరు విరివిగా దేశమునందు వ్యాపించెను. శుభసమయములందు ఖద్దరుతప్ప వాడమని పట్టుపట్టి అట్లేచేయుచుండిరి. త్రాగుడు మొదటిలో చాల వరకు తగ్గినదికాని, ప్రభుత్వమువారి జోక్యముచే నంతగా నిలువలేదు. సాధ్యమైనంతవరకు కోర్టులకు పోకూడదని అందరు నెరింగి అందులకు తగినకట్టుదిట్టముల చేసిరి.

## అధ్యక్షుడు

సాధారణముగా సభలకు అధ్యక్షుడుగా ఆగ్రామములో గౌరవముగల పెద్దనే యేర్పరచువారు. అందువలన సభలో అల్లరి జరుగకుండ ఆగెడిది. ఒకప్పుడు గాంధీమహాత్ముని పటము కుర్చీలో నుంచువారు. లేక గ్రామస్థులకోరికపై ప్రచారకులలో నొకరు అధ్యక్షుడుగా నుండెడివారు.

## గ్రామ భజనసంఘములు

ఈప్రచారమునకు ఫలితముగ కొన్ని గ్రామములలో 'గాంధిభజనసంఘములు' బయలుదేరినవి. వీరిపని యేమన, ఏదైన నుపన్యాసము జరుగవలసినపుడు ప్రజలను వీధులవెంట బయలుదేరి పిలుచుట, అప్పుడప్పుడు ప్రబోధము చేయుట, ఖద్దరుప్రదర్శనము, ఉషఃకీర్తనము చేయుట. కడపటిది ప్రతిదినము జరుగుచుండెడిది. ఉషఃకాలమున లేచి వీధులవెంట నూరేగుచు నూరిబయటస్నానమునకు వెడలి తిరిగి వచ్చుచుకూడ "మరువకుడార్యులారా!" అనియు "నూలువడికేవిధము తెలియండీ" అనియు, "జగద్రక్షకుడు గాంధిమహాత్ముడు" అనియు పాడుచున్నపుడు ప్రజలదేహములు పులకరించి కార్యదీక్షయందు పట్టుదలకు కారణములగుచుండెడివి.

## గ్రామ పరిస్థితులు

ప్రతిగ్రామములోను ఉద్యమమునం దభిమానముకలవా డొక్కడైన నుండెడివాడు. అందువలన ప్రచారకునికి చాలసుళువుగనుండెడిది.. తిన్నగా ఆయనయింటికి ప్రచారకుడు పోగానే మిగిలినపను లన్నియు వారే చూచుకొనెడివారు.

రాత్రి 8 గంటలకుసరికి, రామకోవెలవద్దనో, కరణముగారియింటివద్దనో సభకు వందలకొలదివచ్చువారు. ప్రచారకుడు ప్రార్థనాదిపద్యముల జదివి, యుదివరలో చెప్పినది సంక్షిప్తపరచి ముందు చెప్పబోవునది సూచించి గాథలోనికిదిగును. ఒక్కొక్కడు సభలోనుండి తనకు తోచినసందేహములను తీర్చుకొనును. కాని అల్లరిజరుగకుండ వారిలో పెద్దలు జాగ్రత్తచేయుదురు. ఉపన్యాసానంతరము అందరును ఉపన్యాసకుని పొగడి యెవరిఇండ్లకు వారుపోవుదురు.

ఉపన్యాసమునందలి విషయములనుగూర్చి ముచ్చటించుకొనుచు కొందరు ప్రచారకుని దిగబెట్టుటకు బయలుదేరి, దారిలోతమకు గల సందేహముల దీర్చుకొందురు.

ఉపన్యాసములేనివేళల, అనగా పగటికాలమున గ్రామములలోని ధనికులు ప్రచారకుని తమయిండ్ల విందారగింప దీని కొనిపోవుచుండెడివారు ప్రచారకులు ప్రచారముతోపాటు ప్రజల కందుబాటులో నుంచుటకు ఖద్దరుబట్టలమూటలను మోసికొనిపోవువారు.

## చిక్కులు

ప్రచారకులకు ఇన్ని అనుభవములు లున్నను అచ్చటచ్చట చిక్కులుకూడ నుండకపోలేదు. ప్రతిగ్రామమునందును భోజనసదుపాయము లుండవు. కొన్ని గ్రామములలో బ్రాహ్మణులుండరు. ఒకరిద్దరున్నను భోజనముపెట్టుటకిష్టపడరు. పలుకుబడిగల కాపుగాని, మరియొకరుగాని బలవంతముగా స్వయంపాకము పంపించిరైన భోజనము పెట్టించువారు. ఒక్కొక్కచో 5 లేక 6 వరకు ప్రచారకులుసంఘముగావెళ్లువారు. అట్లు వంట చేసికొనుటకు వీలులేనిచోట్ల పాలో, పెరుగో దాహముపుచ్చుకొని ఆరాత్రి అచట యుపన్యాసముగావించి, ముందు గ్రామమునకు బోవువారు.

ఇంతియకాక కొందరు గాంధి అన్న నిష్కారణవైరము చూపెడివారు. వీరికి గవర్నమెంటన్న తెలియదు. అయినను గాంధిమతమును దూషించుచు, గవర్నమెంటువారే మంచివారనియు వాదించువారు. వీరు 'మేము గవర్నమెంటుపక్షమువారము' అని చెప్పుచు 'మీటింగు జరుగనివ్వ'మనియు, 'ఒకవేళ చేసినచో కొట్టెద'మనియు బల్కెడివారు. 'డప్పులతో సాటింపు చేయనీయ'మనియు, మాలవాళ్లను బెదరింతురు, అట్లువాయించువారిని కొట్టి డప్పు బ్రద్దలుకొట్టుచు చెలరేగుచుండిరి. ఒకవేళ మీటింగు జరిగినను, మధ్య అల్లరిచేయుచు, అసందర్భముగ ప్రశ్నలువేయుచు, సమాధానము చెప్పబోవునప్పుడెల్ల మాట కడ్డమువచ్చి అల్లరిచేయువారు. కాని ఈచిక్కులు నూటికి ఒకటిరెండు గ్రామములలో జరుగుచుండెడివి.

## పోలీసువారు

ఇక నొక్కవిశేషము. ప్రచారకు లేమి బోధించుచున్నారో కనుగొనుమని పోలీసులను గవర్నమెంటువారు పంపుచుండువారు. ప్రచారకుల కున్న సుఖము వీరికి లేదు. వీరికి భోజనాదులు తిన్నగలేక, పెక్కు చిక్కులు పడుచు, వారిని రహస్యముగా వెంటాడుచు, గ్రహించునది లేక, వారు బోధించుదానిలో తప్పుపట్టుట కేమియు లేక చిన్నపుచ్చుకొని, ప్రచారకుల నిర్భయత్వమునకును, త్యాగమునకును, సాహసమునకును మెచ్చుకొనుచుండెడివారు. ఇట్లు రహస్యముగనే కాక ప్రత్యక్షమునగూడ వీరుకలసికొనుటచే నీక్రిందిసంభాషణములుజరుగుచుండెడివి:

పోలీసు—'మీ దేయూరు?'.

ప్రచారకుడు—'గ్రామం'.

పో—'ఎచ్చటికి వెళ్లుచున్నారు?'

ప్ర—'నిర్ణయము లేదు?'.

పో—'ఏల'.

ప్ర—'కాంగ్రెసు ఎచటకు అప్పటికి వెళ్లుచున్న నట్లు చేయుదుము'.

పో—'మీ రెందుల కిట్లు వెళ్లుట'.

ప్ర—'గాంధీమహాత్ముని స్వరాజ్య సందేశమును ప్రజలకు బోధించుటకు'.

పో—'మీరు నాన్‌కోఆపరేషనువారా?'.

ప్ర—'అవును.'

పో—'అంత మొద్దుబట్టలను ఎలాగ మోస్తారు?'.

ప్ర—'ఇవి మా దేశములో తయారైనబట్టలు. మాకు పైదేశపువి వలదు—కాని నీబట్టలు మొద్దుగా లేవు కాబోలు. చెక్కగుడ్డలకన్న బరువా?'

పో—'మీరు మీటింగులు చేస్తూన్నారా?'

ప్ర—'కాకపోతే ఎందుకిలాగ తిరగడం?'.

పో—'అలాగచేస్తే పట్టుకొమ్మని మేజస్ట్రీటుగారి సెలవైంది.

ప్ర—'సరే, బాగానేవుంది'.

పో—'గవర్నమెంటు మిమ్మల్ని పట్టుకుని శిక్షిస్తారు.'

ప్ర—'అందుకు మేము సిద్ధంగా నున్నాము'.

పో—'144 సెక్షను ప్రయోగించి నాలుగురోజులైంది; మిమ్మలిని ఖైదులో వుంచుతాము.'

ప్ర—'ఖైదు ఏమిటి, శ్రీకృష్ణజన్మస్థానమనుము. అందుకొరకే ఇన్నిపాట్లు. ఒక్క 144 గే కాదు ఇంకో 60 సెక్షనులు వేసి యావజనము ఖైదువెయ్యి. ఇపుడు పట్టుకుంటే సిద్ధము'.

## ఉపసంహారము

ఈపై ప్రచారకుని యనుభవములను బట్టిచూడ; వీరు ఎంత బెదురు లేకుండ నుండువారో, వారి కార్యదీక్ష యెట్టిదో, వారికి స్వరాజ్యసంపాదనయం దెంతపట్టుదల యున్నదో, చిక్కుల కెట్లు లక్ష్యమిడకుండిరో, సంపూర్ణత్యాగమున కెట్లు సిద్ధముగా నుండిరో, ప్రజలకు గాంధీసహాయనిరాకరణోద్యమమం దెంత నమ్మకము, భక్తి యుండెడిదో, అద్దానియెడ వారి కెంత యుత్సాహ ముండెడిదో, దానింబట్టి ఉద్యమ మెంతపవిత్రమైనదో గ్రహింప వీలగును.

పైవిషయములబట్టి చూడ మరల సట్టిపరిస్థితు లేర్పడుట కవకాశ మున్నదనియు, అయుద్యమమే మరల కార్యరంగమున ప్రవేశపెట్టినయెడల తప్పక జయము నిశ్చయమనియు, ఉద్యమారంభమునుండి యిప్పటివరకు శాశ్వతమైన మార్పు కొంతవరకు దేశములో కలుగుటను బట్టి చూచుటవలన గూడ రుజువగుచున్నది. త్వరలో నట్టిశుభసమయమే తెంచుగాక! మరల నట్టిప్రచారము జరిగి సంపూర్ణస్వరాజ్యము లభించుగాక!—

# శృంగార గ్రంథమాల.

వెలువనీనది. ప్రథమకుసుమము. వెలువడినది.



సర్వాంగసుందరమయిన యిట్టి శృంగార ప్రబంధమింతవర కాంధ్రులు కనివిని యెరుగరని ఘంటాపథముగ చెప్పుచున్నాము.

## శృంగార రాధామాధవం,

ఇందు రాధామాధవుల శృంగారలీలలు, రాధామాధవుల ప్రథమాను రాగము, రాధావిరహము, శుకసందేశము, రాధామాధవుల సంవాదము, సవతులసంభాషణములు, రాధరాగోక్తులు, మాధవుని మంద లింపులు నిందు నెఱజాణతనపు నేర్పుతో నిర్వహింపబడినవి. రాధికా సాంత్వనరచనకిది మేలుబంతి. అత్యద్భుతమగు రాధామాధవుల శృంగార చిత్రపటముతో సువర్ణాక్షరములుగల కాలికో బైండుతో ఫెదర్‌వైటు పేపరుపై ముచ్చటగూర్పు నచ్చుకూర్పుతో విరాజిల్లుచున్నది.

వెల పోస్టేజితో రు. 2-6-0

☞ మేనేజరు, శృంగార గ్రంథమాల, పోస్టుబాక్సు 110, మద్రాసు.

# భారతీయ మహిళా మండలి



శ్రీమతి పటవర్ధనమ్మగారు



శ్రీమతి రుక్మాబాయిగారు



శ్రీమతి ఆచంట లక్ష్మీదేవి గారు యం.బి.బి.యస్.



ది. బ. కే. యస్. చంద్రశేఖరయ్యరుగారి సతీమణి



డాక్టరు ముత్తులక్ష్మమ్మగారు, యమ్. బి. సి. యమ్.,
మదరాసు శాసనసభకు ఉపాధ్యక్షురాలు



డాక్టరు పార్వతీబాయి
పంజాబు శాసనసభాసభ్యురాలు



సి. కే. కౌసల్యాకన్య, బి. ఏ., యల్. టి.
ఈమె అకాడెమిక్ కౌన్సిలువారిచే మదరాసు సెనేటుసభకు సభ్యురాలుగ ఎన్నుకొనబడినది.



మిస్. యస్. ఇ. జే. జకరయగారు, బి. ఏ., యల్. టి.
మదరాసు సెనేటుసభకు సభ్యురాలుగ ఎన్నుకొనబడిన ప్రథమస్త్రీమణి



# కావ్యజీవము

యస్. శ్రీకంఠశాస్త్రి గారు, బి. ఏ.

వీనులకు విందులై డెందంబున కమందానందపీయూష వర్షమును జిలుకరించు ప్రబంధము లనేకములు భరతఖండమున విఖ్యాతి గాంచియున్నవి. అర్వాచీనకాలమునుండియుఁ గావ్యాస్వాదనముచేఁగల్గు హృదయానందకరవిషయములనుగూర్చియు, ఏతత్కారణములనుగూర్చియు అనేకాలంకారశాస్త్రజ్ఞులు చర్చించియు, వేలువేలు వ్యాఖ్యానములను జేసియు, వివిధాభిప్రాయములను వెల్లడించి విఖ్యాతి గాంచియున్నారు. గ్రీకుసాహిత్యచరిత్రయందు లాంగినస్, క్వింటిలియన్, హారెస్ ఇత్యాది కవులు తమ మతానుసారముగా ఎట్లు సాహిత్యసిద్ధాంతములను వెల్లడించిరో అట్లే హైందవసారస్వతసిద్ధాంతములయందును వైశేషికులు, మీమాంసకులు, సాంఖ్యులు, వేదాంతవాదులు తమయొక్క మతానుసారముగా ననేకవిధము లగు వాదములను బ్రకటించియున్నారు.



వ్యాసకర్త

ఉదాహరణార్థము: “విభావానుభావవ్యభిచారీభావసంయోగాద్రసనిష్పత్తిః” అను భరతసూత్రమునకు అద్వైతవాదులు, సాంఖ్యమతానుయాయులు వ్యాఖ్యానములను వ్రాసియున్నారు. దుఃఖనిత్యత్వముఁ బ్రతిపాదించు సాంఖ్యమతము “ప్రకృతి త్రిగుణ విశిష్టమైనది. సత్త్వగుణము సుఖంబును, రజోగుణము దుఃఖమును, తమోగుణము అజ్ఞానమోహములను మానవుని మనోవ్యాపారమందుఁ గల్పించుచున్నవి. ఈమూఁడుగుణములే కావ్యప్రపంచంబున వ్యాపారత్రితయంబగు అభిధా భావనాభోజకత్వముల నుత్పాదించి, విభావానుభావవ్యభిచారీభావముల రూపాంతరము నంది, ప్రేక్షకశ్రోతృజనంబుల మనంబుల స్థాయీభావముగాఁ బరిణమించి, రసనామంబును గాంచి, ఇహలోకంబున నిత్యంబగు దుఃఖంబును మఱవఁ జేసి, త్రిగుణాతీతం బగు కావ్యలోకంబున నానందముఁ గల్గఁజేయు” నని సిద్ధాంతముఁ జేసినది.

వేదాంతమతము స్ఫోటార్థవాదియైనది. పాణిని పతంజలులకాలమునుండియే నాదము శబ్దబ్రహ్మమనియు, స్ఫోటార్థము తదవలంబియై సచ్చిదానందస్వరూపమగు కావ్యరసాస్వాదనానందమును సృజియించుననియు సిద్ధాంతము గానవచ్చును. పరమపవిత్రమగు ప్రణవమే శబ్దబ్రహ్మస్వరూపమగు స్ఫోటము. మహాభాష్యకారుఁడు స్ఫోటార్థముయొక్క అఖండత్వమును, నిత్యత్వమును, సుఖస్వరూపంబును అంగీకరించి యున్నాఁడు. సచ్చిదానందస్వరూపమగు నాదబిందువు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరియను నాల్గురూపములయి, కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, మనంబులకు గోచరమగును. దానిచేఁ గావ్యావలోకనము ఆనందమును గల్గఁజేసి క్షణమాత్రమైనను దన్మయత్వసుఖ మిచ్చును. కావ్యముయొక్క ఆత్మయగు రసమే ఆనందస్వరూపమని తలంపఁబడి యున్నది.

“సోఽయ మానందసంభేదో భావకై రనుభూయతే.”

ముఖ్యముగ నానందప్రాధాన్యప్రతిపాదియగు వేదాంతమతము ననుసరించి వ్యంగ్యమతమును, దుఃఖనిత్య

త్వమును బ్రతిపాదించు సాంఖ్యమతము ననుసరించి వస్త్వలంకారరసప్రాధాన్యమతములు జనించెనని యూహింపవచ్చును. కాలక్రమంబుగా ననేకమతములు బయలుదేఱినవి. ప్రాయశః అతిప్రాచీనమతము భామహాచార్యుల శబ్దార్థప్రాధాన్యమని తోఁచుచున్నది.

"వక్రోక్తిః కావ్యజీవితం, శబ్దార్థౌ సహితౌ కావ్యం"

అని వక్రోక్తి. అథవా శబ్దార్థమే జీవమని తలంపఁబడియుండెను. భట్టరుద్రటుఁడు

"నను శబ్దార్థౌ కావ్యం"

అనియు, జగన్నాథపండితుఁడు

"రమణీయార్థ ప్రతిపాదక శబ్దః"

అనియు, విద్యానాథుఁడు

"శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ జీవితం వ్యంగ్యవైభవమ్"

అనియు భామహాచార్యుని మతమునే అనుసరించియున్నారు.

మతభేదము లెట్లు హెచ్చినవని చూపుటకు రాజానకరుయ్యక కృతమగు అలంకారసర్వస్వవ్యాఖ్య సముద్రబంధమునుంచి యొక భాగము సహాయ మగును:

"ఇహ విశిష్టౌ శబ్దార్థౌ కావ్యమ్; తయోశ్చ వైశిష్ట్యం ధర్మముఖేన, వ్యంగ్యముఖేన చేతి త్రయః పక్షాః; ఆద్యేఽప్యలంకారతో గుణతో వా ఇతి ద్వైవిధ్యమ్; ద్వితీయేఽపి భణితివైచిత్ర్యేణ భోగకృత్త్వేన వా ఇతి ద్వైవిధ్యమ్; ఇతి పంచసు పక్షేషు ఆద్య ఉద్భటాదిభి రంగీకృతో, ద్వితీయో వామనేన, తృతీయో వక్రోక్తిజీవితకారేణ, చతుర్థో భట్టనాయకేన, పంచమ ఆనందవర్ధనేన; వ్యక్తివివేకకారాభిమతస్తు అనుమానపక్షః సిద్ధాంతః ప్రదర్శ్యతః, సమనంతరం విచారసహత్వేన మాషితత్వాత్. మంఖకస్యపూర్వపక్షత్వేనాభిమతా ఇత్యాహుః—ఏషు ప్రస్థానేషు స్వాభిమతం ప్రస్థానం తస్య సర్వైరంగీకరణీయతాం చ దర్శయితుం తేషా ముపన్యాసః."

శబ్దాలంకారము ననుసరించి రసప్రాధాన్యమతము ప్రచురింపఁబడియె. ఉపనిషత్కాలమునందే రసము బ్రహ్మమని యభేదస్వరూపము నిరూపింపఁబడియుండుటచే, భరతమునియే రసప్రాధాన్యమతమును సృజియింపకపోయినను, ఈ మతప్రాధాన్యమునకు అతఁడే ముఖ్యకారణమని తలఁపవలయు. భరతసూత్రములు శ్రవ్యకావ్యములకన్నను దృశ్యకావ్యములకే యను వైనను, ప్రతిపాదిత కావ్యతత్త్వములు హైందవసాహిత్యమునకు మహోపకార మొనరించియున్నవి. గుణదోషాలంకారాది మతములు రసమతమునకు ఆలంబనభూతమే కాని వేఱుగావు. ఎందు కనిన గుణాలంకారములు రసోత్పత్తికి సహాయకరమగు వాచికాభినయానుభావముల భాగములు. "కావ్యస్యాత్మా రసః" యనునట్లు ఆత్మస్వరూప మగు రసమునకు

"యే రసస్యాంగినో ధర్మాః శౌర్యాదయ ఇవాత్మనః;
ఉత్కర్ష హేతవ స్తే స్యు రచలస్థితయో గుణాః.
ఉపకుర్వంతి తం సంతం యేఽంగద్వారేణ జాతుచిత్;
హారాదివదలంకారా స్తేఽనుప్రాసోపమాదయః."

హారాద్యలంకారములు శరీరమునకుఁ గాంతి నొసగూర్చునట్లు ఉపమాద్యలంకారములు రసమున కుత్కర్షమును, నూతనకాంతిని నిచ్చుచుండును.

ఈరసమతానుయాయు లనేకముగా నుండురు. శౌద్ధోదనీసూత్రమున

"కావ్యం రసాదిమద్వాక్యం శ్రుతం సుఖవిశేషకృత్"

అనియు, అగ్నిపురాణమున

"వాగ్వైదగ్ధ్యప్రాధాన్యేఽపి రస ఏవాత్ర జీవితమ్"

అనియు, సరస్వతీకంఠాభరణమున

"నిర్దోషం గుణవత్కావ్య మలంకారై రలంకృతమ్
రసాన్వితమ్................"

అనియు, క్షేమేంద్రునిమతమున

"అలంకారా స్త్వలంకారా గుణా ఏవ గుణాః సదా,
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్"

అనియు, ముఖ్యముగ విశ్వనాథపండితుని సాహిత్యదర్పణమందు

"వాక్యం రసాత్మకం కావ్యం; రసవదేవ కావ్యం"

అనియుఁ బ్రఖ్యాతమైనది.

రీతిమతానుయాయులు భట్టవామనుఁడు, దండి మొదలగు ఆలంకారికులు. వామనవృత్తియందు

"రీతి రాత్మా కావ్యస్య"

యనియు, కావ్యాదర్శమున

"శరీరం తావ దిష్టార్థం వ్యవచ్ఛిన్నా పదావళీ."

వాగ్భటునిమతమున

"సాధుశబ్దార్థసందర్భం గుణాలంకారభూషితమ్;
స్ఫుటరీతిరసోపేతం కావ్యం కుర్వీత కీర్తయే."

అనియు, ఇత్యాదిగా రీతిమతము వెడలినది.

రీతి ఏమనిన:

"విశిష్టపదరచనా రీతిః."

దండిప్రభృతులు గాడివైదర్భిరీతులను బ్రతిపాదించిరి. ఈ రెంటిటికి వామనుఁడు పాంచాలీరీతిని గూర్చెను. ఇదానీంతన కాలమున భోజరాజాదులు రీతిత్రయముచేఁ దృప్తులుగాక లాటీత్యాదులను జేర్చిరి.

అలంకారమతమును బ్రతిపాదించు గ్రంథములు అలంకారశేఖరము, పీయుషవర్షీయము.

"అదిప దేవ అలంకారపరిగ్రహః, తథాచ తదుభయాన్యతరవత్త్వం సుఖవిశేషసాధనత్వం వా లక్షణమ్"

అని అలంకారశేఖరము.

నిర్దోషా లక్షణవతీ సరీతి గ్గుణభూషితా;
సాలంకారరసానేకవృత్తి ర్వాక్ కావ్యనామభాక్"

అని పీయూషవర్షీయము.

ఈవిధమున క్రీ. శ. ౮-వ శతాబ్దమునకు ముందుగా సాహిత్యవిషయకచర్చ లనేకముగా జరుగుటచే వీనినన్నిటి నతిక్రమించిన ధ్వనిప్రాధాన్యమతము బయలు దేఱినది. ప్రాచీనయవనసాహిత్యచరిత్రయందు అరిస్టోటల్ మొదలగు నాలంకారికులు సారస్వతతత్త్వమును గురించి చర్చింపఁగా క్రీస్తుజననకాలమునందుండిన లాంగినస్ అను నతఁడు Theory of Sublime తత్త్వమును స్థాపించినట్లు భారతీయవాఙ్మయమునందును ధ్వనిమతమును కాలక్రమముగా మార్పాటులఁ జెందుచుండును.

యస్మి న్నస్తి న వస్తు కించన మనఃప్రహ్లాదసాలంకృతిః
వ్యుత్పత్తై రచితం చ నైవ వచనై ర్వక్రోక్తి శూన్యం చ తత్;
కావ్యం తద్ధ్వనినా సమన్విత మితి ప్రీత్యా ప్రశంసన్ జడో
నో విద్మోఽభిదధాతి కిం సుమతినా పృష్టస్వరూపం ధ్వనేః.

సామాన్యముగా వ్యవహారమునందుండు పదముల కొక్క-సంకేతార్థముండును.ఏకపదోచ్చారణముచేసిన నేకవస్తువే నిర్దేశింపఁబడుటచే సర్థపల్లవము,గానరాదు. ఈ సంకేతార్థము అభిధ, లక్షణ, తాత్పర్యము అను వ్యాపారమూలకముగా నవగాహనమునకు స్ఫురించుచున్నది. శబ్దోచ్చారణముచే జనించు అర్థబోధకవ్యాపారమునకు అభిధయనియు, అభిధావృత్తిచే సూచింపఁబడు అర్థమునకు శక్యార్థమనియు నామాంతరములు గలవు. "గంగాయాం ఘోషః" అనువాక్యము 'గంగా' యనుటచే గంగాప్రవాహార్థముఁ దెలియఁజేయును. లక్షణార్థము శక్తివ్యాపారసూచితమగు సంకేతార్థమున కన్యప్రత్యయార్థముచేఁ గుందకము దోఁచిన నాయభిధేయసంబంధార్థ మేవ్యాపారముచే వ్యక్తమగునో దానికి లక్షణావృత్తి యనియు, నావృత్తిజనితార్థము లక్ష్యమనియుఁ బరఁగుచుండును. తాత్పర్యార్థ మఖండార్థము. ఇది యేపదముచే వ్యక్తముగా సర్వపదసంయోజన మగు వాక్యమున జనించును? "గంగాయాం ఘోషః" యనిన గంగయందుండు ఆభీరపల్లి యని తాత్పర్యార్థము దోఁచును.అయితే గంగాప్రవాహ మధ్యమున పల్లెటూ రుండుట ప్రత్యక్షప్రమాణవిరుద్ధమగుటచే "గంగాతీరే ఘోషః" యనియర్థము చేయవలెను. ఈతీరార్థము ఏవ్యాపారముచే జనించునో అది లక్షణావ్యాపార మనఁబడును.

ఇఁక వ్యంగ్యార్థము నిర్ణయింపవచ్చును. ఈవృత్తిత్రయముచేతను సాధింపనేరని అర్థము కవిప్రతిభచేతను, భా వ సం బంధము చేతను నవగాహమునకు వచ్చును. గంగాపదోచ్చారణము మన మనస్సునందు సద్యర్థమే కాక శైత్యపావనత్వాదిగుణములను జూపును.

"అస్త మేతి గభస్తిమాన్"

అను ఏకవాక్యోచ్చారణము వివిధజనములకు చిత్తవృత్తిప్రకారముగా వేఱువేఱుఅర్థము సూచించుటయే వ్యంగ్యవృత్తి యనఁబడును. వ్యంగ్యవ్యాపారము కేవలప్రతిభాప్రభూత మయినది.

ఆనందవర్ధనాచార్యులకాలానంతరము (౮ వ శతాబ్దము) వ్యంగ్యమే కావ్యజీవ మని యంగీకరింపఁబడియున్నది. కొందఱు ప్రాచీనులు ప్రాధాన్యాప్రాధాన్యభేద

ములు దెలియక వస్త్వలంకారవ్యంగ్యములను పర్యాయోక్తపదము లని చెప్పియుండినను, త్రివిధవ్యంగ్యముల కనుప్రాధాన్యమీయకున్నను క్రమేణ ధ్వనియే ముఖ్య మనవలెను. ధ్వన్యాలోకము

"కావ్యస్యాత్మా ధ్వనిః" "రసాత్మకం వాక్యం కావ్యమ్"
అనియు, కావ్యప్రకాశము

"ఇద ముత్తమమతిశయిని వ్యంగ్యే వాచ్యాద్ధ్వని ర్బుధైః కథితః"
అనియు ధ్వనిమతమును బ్రతిపాదించుచున్నవి. రీతి, రస, అలంకారమతములకును వ్యంగ్యమతమునకును విరోధము లేదని చూపుట ఆవశ్యక మని తోఁచుచున్నది. అభినవగుప్తాచార్యులు

"శబ్దార్థయో శ్చారుత్వం స ధ్వనిః; తచ్చారుత్వం ద్వివిధమ్: స్వరూపమాత్రనిష్ఠమ్ సంఘటనాశ్రితం చ; తత్ర శబ్దానాం స్వరూపమాత్రకృతం చారుత్వం శబ్దాలంకారేభ్యః; సంఘటనాశ్రితం తు శబ్దగుణేభ్య ఏవ మర్థానాం చారుత్వం స్వరూపమాత్రనిష్ఠం ఉపమాదిభ్య స్సంఘటనాపర్యవసితం తు అర్థగుణేభ్య ఇతి న గుణాలంకారవ్యతిరిక్తో ధ్వనిః కశ్చిత్ ఇతి."

"రీతిధ్వనివాదమతయో రయం భేదః తత్ర ప్రథమో 'రీతిరాత్మా కావ్యస్య' తద్వ్యవహారప్రయోజకాః గుణాః ఉభయత్రాపి ఆత్మనిష్ఠాగుణాః, 'శబ్దార్థయుగళం శరీరం' తన్నిష్ఠాలంకార ఇతి చ సర్వ మవిశిష్టమ్."

గుణములు రసధర్మములు; రసాలంబములగు నియమముల చే రసోత్పాదనము చేయుచు స్వతః రసోపకారకములుగ నుండును. అలంకారములు శబ్దార్థధర్మములయి రసాలంబనములేని రసోత్కర్షానియమరహితములగుటచేతను, శబ్దార్థ మూలకముగా రసోపకారకము లగుటచేతను గుణప్రాధాన్యమత మంత యాదరణీయము గాదు. ఉత్తమకావ్యమందు

"తదదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాపి"
యను సూత్రానుసారముగ అలంకారాభావ ముండినను కావ్యమునకుఁ గొఱఁత లేదు.

"యత్ సర్వత్ర సాలంకారౌ క్వచిత్తు స్ఫుటాలంకార విరహేఽపి న కావ్యత్వహానిః."

ఉదాహరణము:

శూన్యం వాసగృహం విలోక్య శయనా దుత్థాయ కించిచ్ఛనై
ర్నిద్రావ్యాజ ముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్;
విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకా మాలోక్య గండస్థలీం
లజ్జానమ్రముఖీ ప్రియేణ హసితా బాలా చిరం చుంబితా.
అంబా శేతేఽత్ర వృద్ధా పరిణతవయసా మగ్రణీ రత్ర తాతో
నిశ్శేషాగారకర్మశ్రమశిథిలతనుః కుంభదాసీ తథాత్ర;
అస్మిన్ పాపాహ మేకా కతిపయదివసప్రోషితప్రాణనాథా
పాంథాయేత్థం తరుణ్యా కథిత మవసరవ్యాహృతి ర్వ్యాజపూర్వమ్.

ఇత్యాది కావ్యములందు వ్యక్తమగు అలంకారములు కానరాకున్నను రసోత్పాదనము శ్లాఘ్యముగా నున్నది. గుణములు కావ్యమునకు కాంతిఁ గల్గఁజేయును. అలంకారము లాకాంతి హెచ్చుచేయఁగలవే కాని స్వతః కాంతి సిద్ధి చేయుశక్తి లేకున్నవి.

కావ్యప్రభేదములు చతుర్విధముగ విభజింపఁబడియున్నవి. ఉత్తమోత్తమ కావ్యమందు వ్యంగ్యార్థమే యతిశయముగ నుండును. అప్రధానమైనను వ్యంగ్యార్థము వాచ్యార్థమునకు హెచ్చుగ చమత్కారమైయుండిన నుత్తమకావ్య మనఁబడును. వ్యంగ్యము వాచ్యముకన్న నల్పముగ నుండిన మధ్యమకావ్య మనఁబడును. స్ఫోటార్థము స్పష్టముగాలేనిది యవరకావ్యమని తలంపవలెను. ఈ యుత్తమకావ్యమే ధ్వనికావ్య మనఁబడును.

ఉత్తమకావ్యమున కుదాహరణము:

నిశ్శేషచ్యుతచందనం స్తనతటం నిర్మృష్టరాగోఽధరో
నేత్రే దూర మనంజనే పులకితా తన్వీ తవేయం తనుః;
మిథ్యావాదిని, దూతి, బాంధవజనస్యాజ్ఞాతపీడాగమా
వాపీం స్నాతు మితో గతాసి న పున స్తస్యాధమస్యాంతికమ్.

మధ్యమకావ్యము—

"అపర్స్పందిగ్ధతుల్యప్రాధాన్యే మధ్యమమ్."
గచ్ఛామ్యచ్యుత! దర్శనేన భవతః కిం తృప్తి రుత్పద్యతే
కిం చైవం విజనస్థయో ర్హతజనః సంభావయ త్యన్యథా;
ఇత్యామంత్రణభంగిసూచితవృథావస్థానఖేదాలసామ్
ఆశ్లిష్యన్ పులకోత్కరాంచితతను ర్గోపీం హరిః పాతు వః.

అధమకావ్యము—

"శబ్దచిత్రం వాచ్యచిత్ర మవ్యంగ్యం త్వవరం స్మృతమ్."
స్వచ్ఛందోచ్ఛలదచ్ఛకచ్ఛకుహరచ్ఛాతేతరాంబుచ్ఛటా
మూర్ఛన్మోహమహర్షిహర్షవిహితస్నానాహ్నికాహ్నాయ వః;
భింద్యాదుద్యదుదారదర్దురదరీ దీర్ఘాదరిద్రద్రుమ
ద్రోహోద్రేకమహోర్మిమేదురమదా మందాకినీ మందతామ్."

యథావా,

వాఞ్ఛారేట్ ధ్వజభృక్ ధృతోఽద్వధిపతిః కుద్రేడ్జాని ర్గణేడ్
గో రాడారుహ రస్సరేసురుతరస్త్రిస్రైతుక ప్రాడరస్;
ఉద్వేడుడ్ నరకాస్త్రిదృక్ త్రిస్బృగ్భిదార్ద్రాత్రిశివాచ్ఛస్ఫురి
స్త్రస్తా దంబుమదంబుదాళిగళరు ట్ద్వో ముదే వో మృడః.

అపరకావ్యమందు శబ్దవైచిత్ర్యమే కాని వ్యంగ్యార్థము కానరాదు. ఆంధ్రభాషావాహినియం దత్యుత్తమగ్రంథము లత్యల్పముగా నుండును. శబ్దాడంబరము, వాగ్వైచిత్ర్యము మొదలగు చిత్రకవిత్వతత్త్వములే ఆధునిక పండితులను ముగ్ధులుగాఁ జేయుచు, పరబ్రహ్మస్వరూప మగు చిదానందముఁ గల్గఁజేయు ధ్వనిగ్రంథములు బయులు దేఱుటకు ప్రబలనిర్బంధములుగఁ బరిణమించియున్నవి. వ్యంగ్యప్రభేదము లనంతముగ నుండును. ముఖ్యముగ వివక్షితవాచ్య,వివక్షితాన్యపరవాచ్య మొదలగు ౫,౩౦౪ ప్రభేదములు గల్గును.

“అర్థాంతరే సంక్రమితవాచ్యాఽత్యంతం వా తిరస్కృతవాచ్యాస్సంకరః; అసంలక్ష్యక్రమవ్యంగ్యా స్త్రయః; శబ్దశక్తిమూలౌ ద్వౌ, అర్థశక్తిమూలా ద్వాదశ, ఉభయశక్త్యుద్భవస్త్వేక ఇతి సంలక్ష్యక్రమవ్యంగ్యాః; పంచదశమిలిత్వా అష్టాదశ, నవరసప్రభేదసమ్మేళనేనానంతత్వాత్.”

అసంలక్ష్యక్రమ, సంలక్ష్యక్రమ వ్యంగ్యభేదద్వయమందు అసంలక్ష్యక్రమము అర్థాంతరసంక్రమితమనియు, అత్యంతతిరస్కృతమనియు రెండురూపముల నుండును. సంలక్ష్యక్రమప్రభేదములు శబ్దశక్తిమూలము, అర్థశక్తిమూలము, ఉభయశక్తిమూలము అని మూఁడుగలవు. శబ్దశక్తిమూలము వస్త్వలంకారప్రకారముగ ద్వివిధ మగును. అర్థశక్తిమూలము స్వతః సంభవి, ప్రౌఢోక్తిమాత్రసిద్ధము, ప్రతిభాధిష్ఠము అని త్రివిధముగ నుండును. ఉభయశక్తిమూలము ఏకవిధము. ఈయష్టాదశప్రభేదములు నవరససమ్మిళితములయి యనేకములగును. సంలక్ష్యక్రమమందు వ్యంగ్యము వ్యంజకము వివిధముగఁ దోఁచును. అసంలక్ష్యక్రమమందు వ్యంగ్యవ్యంజకక్రమ ముండినను అతిసూక్ష్మముగా రెండును ఏకకాలమందే యవగాహనమునకుఁ దోఁచుచుండును.

ఇఁక ధ్వనికావ్యము రసమును స్ఫురింపఁజేయు క్రమమును విచారించెదము:

“విభావానుభావవ్యభిచారీభావసంయోగా ద్రసనిష్పత్తిః”

యను భరతసూత్రోక్త మగు విభావానుభావవ్యభిచారీభావవ్యంజకసామగ్రులచేతనే వ్యంగ్య మగును. స్థాయీభావము స్థిరచిత్తవృత్తిని, ఆనందభాజకత్వమును కల్పించి రస మనఁబడును. ఈస్థాయీభావము నూహించుటకు విభావము సహాయ మగును. అనుభావము స్థాయీభావమును స్ఫురింపఁజేయును; స్థాయీభావకార్యము, స్థాయీభావమునకు ఉపకారకముగను, అభిముఖముగను సంచరించునది వ్యభిచారీభావ మనఁబడును. దీనియందు నిర్వేదగ్లానిశంకాది ముప్పదిమూఁడు ప్రభేదములుగలవు.విభావము కార్యమును జేయును.అనుభావముస్ఫురణనుగల్గఁజేయును.వ్యభిచారీభావము భావమును పుష్టీకరించును. పూర్వోక్తమగు భరతసూత్రమునకు భట్టలొల్లట, శ్రీశంకుక, భట్టనాయక, అభినవగుప్తాచార్యప్రభృతులు వివిధాభిప్రాయములను సూచించియుండినను ముఖ్యముగా

ఏతే చ స్థాయిన స్సర్వే విభావై ర్వ్యభిచారిభిః;
సాత్త్వికై రనుభావై శ్చ నటాభినయగోచరాః.
సాక్షాత్కార మివానీతాః ప్రాపితాః స్వాదురూపతామ్;
సామాజికానాం మనసి ప్రయాంతి రసరూపతామ్.
రామాదే ర్హృది కారణోపజనితః కార్యైః ప్రతీతిం గతః
సంపృష్ట స్సహకారిభి ర్జనయతి స్థాయీ సుఖం వాసుఖమ్;
భావానా మనువర్ణనానుకరణైః కావ్యేఽపి నాట్యేఽపి చ
వ్యక్తోఽయం తు నిరాశ్రయ శ్శుభకర స్సహృద్యై రస శ్చర్వ్యతే.

ఆలంబనభూతనాయకనాయికాదుల మనస్సునందుఁ గారణాంతరములచే సృజియింపఁబడి, కార్యములగు అనుభావాదులచే స్ఫురణమునకు వచ్చి, వ్యభిచారీభావపోషితమయి, స్థాయీభావములను వ్యక్తపఱచి, భావముల యనుకరణానువర్ణముల సాహాయ్యముచేఁ గావ్యమందును, నాట్యమందును నిరాశ్రయమగు సుఖస్వరూపరసము సామాజికులచే నాస్వాదింపఁబడును.

నవనీతం యథాఽఽజ్యత్వం ప్రాప్నోతి పరిపాకతామ్;
స్థాయీభావో విభావాద్యైః ప్రాప్నోతి రసతాం తథా.

నవనీతమును పాకముచేసిన నెయ్యి యగువిధమున స్థాయీభావమును విభావాదులచే రస మగును. కౌశల్య మన నేమి? ఈరసోత్పాదనక్రమమే.

"తత్ర చేత్యరసానుగుణ్యేన వస్తుసంపాదనే ఔచిత్యానుసరణేన నాయకపరిజనాదీనాం అవస్థాప్రతిపాదనే రసానా మంగాంగీభావానుగుణ్యేన విభావానుభావవ్యభిచారీభావయోజనేనిర్దోషగుణాలంకారవినివేశనే ప్రబంధోచితవృత్తరీతిపరిగ్రహే చ కౌశలమిత్యర్థః."

ఈభావపరివర్తనకార్యమే నటుని పాండిత్యమును పరీక్షించుటకు నికషోపలప్రాయమైనది. ఆంధ్రనాటకపితామహుఁడగు కృష్ణమాచార్యులును, రాఘవాచార్యులును, కర్ణాటకనాటకలక్షణశిక్షాచార్యుఁడగు వరదాచార్యులును వస్తుప్రదర్శనయందును,నవస్థాప్రతిపాదనయందును,విభావానుభావవ్యభిచారీభావసంయోజనమును,గుణాలంకారసూచనమును, సమయోచితరీతిని గల్పించుటయందును నిరుపమవిచక్షణదక్షులు. వ్యంగ్యరసములకుఁ గల సంబంధమును జూపి కౌశల్యమును నిశ్చయించితిమి. ఇఁక రసమునకు గుణమునకుఁగల సంబంధము చూడవలెను.

యే రసస్యాంగినో ధర్మాః శౌర్యాదయ ఇవాత్మనః;
ఉత్కర్షహేతవ స్తేస్యు రచలస్థితయో గుణాః.

కావ్యశరీరమునకు రసమే యాత్మస్వరూపము. శౌర్యధైర్యగాంభీర్యాదిగుణము లేరీతిగ జీవాత్మను విడువకయుండునో గుణములును రసమున కుత్కర్షహేతువులును, నాస్వాదాతిశయకరములును నయి యుండును.

"చారుత్వహేతుశ్చ ధ్వనిః"

యను రీతిగా ధ్వనికావ్యమే యుత్తమ మని నిర్ణయించితిమి. భారతీయరూపకసాహిత్యమును, ప్రాచీనయవననాటకవాఙ్మయమును విమర్శించిన ననేకసామ్యములును, వ్యత్యాసములును దృగ్గోచర మగును. ప్రాయః వస్తువు ప్రఖ్యాతము, పౌరాణికవిషయకము, లేక మాళవికాగ్నిమిత్ర ముద్రారాక్షస నాటకములందువలెఁ జరిత్రాంశకమునయి యుండును. నాయికానాయకాదులు బహుశః దేవతాంశసంభూతులు లేక రాజవంశీయులు, కులీనులు నుందురు. ఏకాంకము ఒకనాఁటికార్యమునే నిర్దేశింపవలెను. శైలి సమయోచితముగను నైసర్గికముగను నుండవలెను. యవనసిద్ధాంతానుసారముగ, సామాజికమనస్సంశుద్ధియే (Purgation) రూపకముల ముఖ్యధ్యేయ మని అరిస్టోటల్ మొదలగు భావజ్ఞులు నిర్ధరించిరి. ఈ మనశ్శుద్ధికిఁ గరుణభయానకరసము లే (Pity and Terro ) ముఖ్యసహాయ మగుటవలన కల్యాణాంతనాటకములు, విషాదాంత దృశ్యరూపకములవలె బహూకరింప నర్హము గాదనిరి. హైందవసారస్వతచరిత్రయందును ఆధునికకావ్యకారులు శాంతకరుణరసములే ముఖ్యమనియు, శృంగారాదీతరరసములు తజ్జన్య మనియు నభిప్రాయపడిరి. మహాకవి భట్టభవభూతి కరుణరసమునే ప్రధానముగా నుత్తరరామచరిత రూపకమునురచించెను.

"ఏకోరసః కరుణ ఏవ నిమిత్తభేదాత్
భిన్నః పృథక్ పృథగివాశ్రయతే వివర్తాన్;
ఆవర్తబుద్బుద తరంగమయా న్వికారా
నంభో యథా సలిలమేవ తు తత్సమగ్రమ్."

ఈకరుణరసప్రాధాన్యముచే భారతరూపకసాహిత్యఖనియందు జీవరత్నములని పొగడ్తగాంచిన భాసుని ప్రతిమానాటకము, కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలము, భట్టభవభూతి యుత్తరరామచరిత్రము విశ్వవిఖ్యాతిగాంచినవి.

భవభూతే స్సంబంధాత్ భూధరభూరేవ భారతీ భాతి;
ఏతత్కృతకారుణ్యే కిమన్యథా రోదితి గ్రావా.

సాంస్కృతికులచే వ్యంగ్యమే ముఖ్యమని నిర్ధరింపఁబడినట్లు, ఏతాదృగ్గుణమగు Sublimity అనునది లాంగినస్ మొదలయినవారలచే గ్రహింపఁబడెను. సత్కావ్యము ముఖ్యముగా విజ్ఞానమిచ్చుటకుఁగాదు; హృదయంబున నావేశము గల్గఁజేయుటకే (Transport). ధ్వనిశబ్దములు "Are indeed and in fact the very light of the Spirit." "Sublimity is something oppurtunely outflung." ఇట్లు తన్మయత్వమునఁ దనువు మఱవఁజేయుటయే కవికర్తవ్యము. శ్రేష్ఠకవిని

"మహోపకారకో లోకే కవి రేవ న సంశయః"

అని శ్లాఘన చేసినారు. వ్యంగ్యమున కీరీతిగా పాశ్చాత్యులు, పౌరస్త్యులు ఏకవిధముగ,ఏకకంఠ్యముగ ప్రాధాన్య మిచ్చినారు.



# ఆశాతాండవము

పెనుమర్తి వేంకటరత్నము గారు

నేను

నీ విద్యుల్లతికాభదీధితి సముస్మేషంబులో, ధర్మవి
ద్యావైశద్యములో భయంపడితి నీదాష్ట్యంబు చేష్టాగతిన్
ద్రోవంబూనితి, లేచిపొమ్ము! ననునేదో పేరుమీఁదన్ వృథా
లీవాల్లభ్యముఁ బొందఁజేతువు! కరాళింపంగ నీకేలనే!
నీబంధములఁ జిక్కి దివ్యపదవీ నిష్కామభోగంబులన్
బోఁబోఁ ద్రోలెడు వెఱ్ఱివాఁడనఁటె! యేపుంజూప నీకేల ఆ
శాబాలా! భవదీయచంచల సుహాసవ్యగ్రమైపోయి పృ
థ్వీభాగంబున మించిపోయెడినిగాదే! జన్మవైఫల్యముల్!
ననుమాటాడఁగనీకు! నిశ్చలములై నాళీకపత్రాయతాం
గణ విద్యావిదులైన నేత్రముల నాకాంక్షింతు దివ్యప్రతీ
ష్టనివిష్టాంతరమూర్తిఁ గన్గొనఁగఁ దత్పావిత్ర్యఘంటామయ
స్వనగాంధర్వ కళానుభూతుల వికాసంబంద నాశాసతీ!

ఆశాదేవి

నీవు వెఱ్ఱివాఁడవు! నను నిందఁజేతు
నేన నీవు స్మరించు కల్యాణమూర్తి
నేన లోకాంతరాళ కాంతిచ్ఛటావ
లీపరీవాహమును! గుబాళించుకొందు!
నన్ను విడిపోవనీవు నానన్న దివ్య
మూర్తులకె తప్పినదిగాదుపో! అతీత
మైన యేక తేజస్సున కాసపుట్టె
బహుళరూప సంకీర్ణతా పదవిచెంద.
నేన పరిణామరూపిణి, నేన విశ్వ
నాట్యమంజీరకింకిణీనాదగతిని!
కడలి జగమెల్ల మ్రింగి తాఁ గడుపులోన
దాఁచుకొనుటకుఁ బ్రళయాంబుదములలోన
తరళితంబగు నాతోడ తాండవించు!
నేను నిను వెంటఁబడివత్తు! నీవు వద్దు
పొమ్మటన్నను నేరాకపోను సుమ్ము!
ఇది మనకు జన్మసాహస్రపథమునందుఁ
బడి యనుగమించు సంబంధబాంధవంబు!



# తెనుఁగు కైతల క్రొత్తతెన్నులు

ఆండ్ర శేషగిరిరావు గారు

[సారస్వత సమాజము]

నవరసమ్ములు నాట్య మాడగ - చివురుపలుకుల కెవ్వులు విందుగ,
కవితలల్లే క్లాంతహృదయుల - గారవింపవె తుమ్మెదా!

—రాయప్రోలు సుబ్బారావు

## ౧

## అభినవాంధ్ర కవితావతరణము

ఇపుడు మనము తిలకింపఁ బోవునది ఆంధ్రకవితాసారస్వతచరిత్ర మందలి యొక రసవదధ్యాయము.

పింగళిసూరనకుఁ బిమ్మట ఆంధ్రసరస్వతి 'అరుణిమ దూఁగవ యధరము' వలె పసి చెడి దీర్ఘమైన నిద్రావస్థఁ బొందినది. పంతొమ్మిదవ శతాబ్దిమధ్యభాగమున బ్రౌనుదొర నిఘంటువు ప్రచురించుటతో ఆంధ్రభాషాప్రపంచమున నొక సంచలన ముదయించినది. చిన్నయసూరి, వీరేశలింగముపంతులు మొదలగు పండితప్రకాండు లీసంచలన మందికొని తీఁగసాగింపఁ జొచ్చిరి. వచనరచనయందుఁ గ్రొత్తఫణుతు లన్వేషించి, అవలంబించి నూతనయుగప్రవర్తకుఁడైన వీరేశలింగము పంతులు తెనుఁగుకైతను ప్రాచీనులవలెనే ప్రబంధవీధుల బందీకృతఁ గావించెనే కాని క్రొత్తతెన్నులు పరీక్షింపలేదు. తిరుపతివేంకట కవులు కవితాసతికి బాహాటప్రచార మిచ్చి ఆంధ్రప్రజల దృష్టి కవిత్వమువైపు మరలించిరి. కాని వారు సరస్వతిని త్రిప్పరానిచోట్లఁ ద్రిప్పినారు. వారి బుద్ధచరిత్రములోనిది నిజమైనకవిత్వము. కవితాప్రపంచమునఁ గ్రొత్తతెన్నులుగొని రాలేక పోయినను వారు మనకు వేఱొక మహోపకారము కావించిరి. వా రాంధ్రయువకుల హృదయక్షేత్రములందుఁ గవితాంకురములు విత్తి కవితాసరస్వతిభావ్యభ్యుదయస్థితికిఁ బునాదులు వైచి కవితోపాసకులఁ గొందఱ వెడలఁదీసిరి. ఇందుల కాంధ్రులు వారిని చిరకాలమువఱకు మఱవనేరరు.

ఆంధ్రకవితాప్రపంచమున నవవసంతోదయమై నూతనవికాసము, నూతనచైతన్యము, నూతనవిలాసము, నూతనప్రబోధమును ఇరువదియవ శతాబ్దాదిని జరిగినది. అప్పుడు సముద్రతరంగములవలె నువ్వెత్తుగ మూలమూలల వ్యాపించిన వందేమాతరోద్యమము, స్వదేశాభిమానము తీవరించి, స్వభాషాభిమానము నుద్రేకించినది. అందుతో భాషోద్ధరణోద్యమము వెల్లివిరిసినది. ఆంధ్రకవితాసతి నాఁటి ఆవేశతరంగిణియొక్క ఉత్తుంగతరంగడోలికలలో రాయంచవలె ముచ్చటలాడఁగి, దిక్కుతోఁచకుమలందు ఎలుఁగెత్తి చాటుచున్న సముచితాంభీకుని వికాసపుంజములలోఁగొని విక్రమతనాద మారించినది. అందుతో నవ్యాంధ్ర కవితాప్రపంచమునం దొక మహావిప్లవము ప్రారంభ మైనది.

నవ్యాంధ్రకవిత్వశుభోదయమునకు గురుజాడ అప్పారావు వేఁగుఁజుక్క. ప్రబంధవీధుల బందీకృతయైన కవితాసతిని క్రొత్తతెన్నులకుఁ గొనితెచ్చి ఆమెకు స్వేచ్ఛానిశ్వాసము కల్గించిన ప్రజ్ఞానిధి. అతఁడు 'క్రొమ్మెఱుంగులు చిమ్మ'గాఁ గవితాగానము చేసి అనూనశోభ ఘటించి నూతనయుగారంభప్రకాశకాంతు లెల్లెడలం బరపిన సిద్ధహస్తుఁడు; తనకవితాహస్తముతో ముత్యాలసరులకు రూపసిద్ధి నొసఁగిన లక్షణవేత్త.

ప్రబంధవాసన వెడలించి, 'నూతనయుగోదయరాగము' లాలపించి ఆంధ్రకవిత్వమునకు నవీనత్వము గొనితెచ్చినవాఁడు రాయప్రోలు సుబ్బారావు. భావరసభరితములు, నవోద్యమదీపితములు నగు 'తృణకంకణము, కష్టకమల' ఇత్యాదిమనోహరకావ్యముల రచించిన సాహిత్యసార్థముఁ డాతఁడు. అతఁడాంధ్రకీర్తిని సంకీర్తనము చేసిన వారిలో ప్రథమాంధ్రమహాకవి. కుసుమకుట్మలములవలెఁ గోమలములును, చిగురుటాకులవలె నూతనవికాసభాసురములును నగు మనోదియ్యని పదములతోఁ గావ్యములను జిత్రింప నెఱిగిన యాతఁడు. క్రొత్తపోకడ లలవఱచుకొని పదశిల్పము చేర్చికొనిన నవీనాంధ్రకవితాసతికి నూతనవాతావరణములో సరిపోవు ఛందోవిన్యాస మర్పించిన రచనాభిజ్ఞులు వేంకటపార్వతీశ్వరులు. ఖండకావ్యములు, భావగీతములు రచించుటకు అన్నివిధముల అనువైనది తేటగీతి యని నవీనాంధ్రకవికోటికి నివేదించిన కవితారసికులు వీరే. వీరి తేటగీతములు పదాంతములందు విరుపులతోఁ జెన్నొంది లాలిత్యలావణ్యములు కలిగియుండు పూలరేకులు.

# తెప్పల సారథిగారు:

వీరు గంజాంజిల్లా బారువగ్రామము వాస్తవ్యులు.

వీరు బర్మాసముద్రపు ప్రాంతముల బత్తీగృహంబుల సర్వీసు (Burma Coast Light-Houses Service) లో 1887 వ సంవత్సరములో ప్రవేశించి 1927 వ సంవత్సరము జనవరిమాసములో పించను పుచ్చుకొనుచున్నారు. వీరు ఒకటవ తరగతి లైటు కీపరు, వీరు చాలా విధేయతగా



తెప్పల సారథిగారు

నున్ను చాలా ఓపికగా 40 సంవత్సరములు గవర్నమెంటు సర్వీసులో పనిచేసినందుకుగాను శ్రీ బర్మా గవర్నరుగారు వీరికి గౌరవనీయమైన సర్టిఫికెటున్ను ఒక బంగారపు గడియారమున్ను (Certificate of honour and a Gold watch) బహుమానముగా నిచ్చుటకు (1927 వ సంవత్సరం జనవరి 1 వ తారీఖున, బర్మా గజెట్‌లో ముద్రించినారు. బర్మా సముద్ర ప్రాంతముల బత్తీగృహంబులో పని జేయు ఆంధ్రులలో నిట్టి బహుమానము పొందిన మొదటివారు వీరే. వీరు ఉద్యోగములో ఉన్నకాలములో తమ దిగువపనివారలయందు చాల అభిమానముగానున్ను, కొన్ని సమయములలో వారికి సహాయము చేయుచు కీర్తి వడసినవారలు.

నవ్యాంధ్రకవితాపతికి గురజాడ అప్పారావు క్రొత్తతెన్నులు రుచిచూపెను; రాయప్రోలు సుబ్బారావు పద శిల్పము నివేదించెను; వేంకటపార్వతీశ్వరులు తేటగీతముల మంజరుల కానుక నిచ్చిరి. ఈ కవులు కావ్యేందిర రూపురేఖలకు మార్పుఁ దొడిగి కవితారథమును నూతనపథములఁ బట్టించిరి. వీరలు నవీనాంధ్ర కవిత్వమునకు సూత్రధారులు.

ఇట్లీకవిపుంగవులు భాషాయోషకుఁ బూజాపుష్పము లర్పించుచుండ నాంధ్రోద్యమ మారంభమై దేశము నుత్సాహతరంగితము గావించెను. 1906-1908 ప్రాంతమున సముద్రతరంగమువలె దేశము నలుమూలల వ్యాపించిన స్వదేశోద్యమము కవిత్వావేశమునకుఁ, గావ్యసామగ్రికి నంతులేని ఆవేదన పడుచున్న నాఁటి తెనుఁగుకైత గాంద్రకావేశము కల్గించి కావ్యసామగ్రిని గల్పించినది. ఆంగ్లవిద్యావంతులైన ఆంధ్రులు పెక్కురు అంతదనుక డిగ్రీలు పొందినవెంటనే ఉద్యోగధర్మ మవలంబించుచు వచ్చిరి. కావున అట్టివారు సారస్వత జీవనులు కాలేకపోయిరి. స్వదేశోద్యమానంతము సేవకవృత్తిపై విద్యావంతులకు ఏవపుట్టుటయే కాక ఉద్యోగపదవులు కూడఁ దక్కువ కాఁజొచ్చెను. అట్లగుట కొందఱు విద్యాధికులకు సారస్వతముపై దృష్టిపోవుటకుఁ దగినయవకాశము కలిగెను. ఇట్లు వందేమాతరం ఉద్యమము మనకవులకుఁ గవిత్వరచనకు వలయు అవకాశమును, ఆవేశమును, సామగ్రిని కల్గించినది. అతరుణమున గురజాడఅప్పారాయని నూత్నభావవీచియు, రాయప్రోలుసుబ్బారాయని ప్రౌఢపదవిన్యాసమును, వేంకటపార్వతీశ్వరుల తేటగీతముల క్రొత్తందనమును ప్రజాహృదయవీథి నడతెంచి, వారి రుచి కంది, వారి మనముల నాటుకొనుచుండెను. ఆసమయమున ఆంధ్రపత్రిక, ఉగాదిసంచికలు, ఆంధ్రభారతి, మొదలగు పత్రికలు బయలుదేఱి యువకవుల ఖండకావ్యములకు, భావగీతములకు సుస్వాగతము చేయుచు వానిని తలఁదాల్చుచుండెడివి. ఆసమయముననే ఆంధ్రోద్యమ మారంభమై ఆంధ్రులకు శుభోదయమును గొనితెచ్చెను. ఆంధ్రమహాప్రజల హృదయక్షేత్రములం దవబోధ మంకురించినది. దేశోద్ధరణమునకు దేశభాషాభివృద్ధి సహజసాధనమను సిద్ధాంత మంగీకృతమై తెలుఁగునాట దృఢతరమైన ఆంధ్రభాషాభిమానమును గల్గించినది. అందుతోఁ గావ్యరచనాపరులగు ఆంధ్రకవుల కాంధ్రప్రజలపోషణ ప్రోత్సాహములును, అభిమానాదరణములును లభించి వారిని ఉత్సాహవంతులనుగా నొనర్చెను. ప్రపంచమునంతను కలగుండు వెట్టిన ఐరోపామహాసంగ్రామము కూడ ఆంధ్రలోకవ్యాప్తమైన ఈనూతనోత్సాహమును, కవిత్వావేశమును చప్పబఱుపఁజాలకపోయెను. ఆంధ్రోద్యమ మారంభించిననాఁటినుండియు తెనుఁగుకైత పాలసముద్రమువలె నపారముగఁ బెరుఁగుచు మున్నెన్నఁడుఁ ద్రొక్కని చూడని పెక్కు నూతనమార్గములఁ బరువెత్తుచున్నది. ఆనూతనమార్గములఁ బరామర్శింతము.

## ౨

## ప్రాచీనాధునాతన కవితావిభేదములు

ఆంధ్రకవితాసారస్వతమును విమర్శకదృష్టితోఁ బారఁజూచితిమేని ప్రాచీననవీనకవిత్వములందుఁ గల విభేదములు కొన్ని విస్పష్టముగఁ గాన నగును.

### కావ్యపరిమాణము

మొదటిది కావ్యపరిమాణము. పూర్వకవులు సాధారణముగ మహాకావ్యములను రచించిరి. నేఁటివారన్ననో అలఁతి యలఁతి విషయముల నితివృత్తములుగా నెన్ని ఖండకావ్యములు రచించుచున్నారు. ఇక్కాలమున ఖండకావ్యరచనకు విశేషప్రాబల్యము గలదు. ఏతత్కారణము లారయ నగును.

'కావ్యగీతిప్రియు'లగు రాజరాజనరేంద్రులను గాని, 'కవితాప్రావీణ్యఫణీశు'లగు కృష్ణదేవరాయచక్రవర్తులను గాని పరాధీనమందున్న ఆంధ్రు లిటఁ జూపఁబోరు. అట్లగుట:

చ. 'నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన భోజన ముయ్యెలమంచము......

—చాటుధార.

'ఇచ్చి మహాకావ్యముల రచింపుఁడని కవులను గోరు ప్రభువతంసము లుండరు. మహాకావ్యరచనకు అవకాశముఁ గల్పించు రాజపోషణమిట్లు కొఱవడి యుండుటచే నీకాలమున ఖండకావ్యరచనమే కొనసాగుచున్నది.

మఱియొక కారణము: ప్రస్తుతయుగమున కవితాపోషకులగు ప్రజలు తీరికఁగూర్చుండి మహాకావ్యములు పఠింపనేరని త్వరజీవనులు, లౌకికులు. వారికి తీరిక తక్కువ; వారి మనములు వివిధవ్యాపారములందు బర్యాప్తములు. అందువలన స్వల్పకాలములో సమాప్తముకాఁగల ఖండకావ్యములపైకి వారిచిత్తములు పోయినవి. కావున-నట్టి కావ్యరచనకు ఆధునికయుగమున విశేషమైన ప్రోత్సాహము, ప్రాబల్యము కల్గుట నైసర్గికము.

వేఱొండు హేతువు: ప్రస్తుతకాలమున పత్రికలే పెక్కుసందర్భములలోఁ గావ్యప్రచురణసాధనములు. సుదీర్ఘమయిన కావ్యసామగ్రిని దలదాల్చుట ప్రజాభిరుచికి దూరమగుటయే యని నేఁటి పత్రికలు నిజ మారసినవి. అట్లగుట నేఁడు కావ్యప్రచురణసాధనములైన పత్రికలు కూడ ఖండకావ్యరచనముచే అభిమానించుచున్నవి.

వేఱొకకారణము: నవీనాంధ్రసారస్వతమునకు అదృష్టవశమున ఆంగ్లసారస్వతసంపర్కము లభించినది. ఆంగ్లసారస్వతమున ఖండకావ్యములు వేనవేలు. అనుకరణమునకుఁ బెట్టినది పేరగు మన ఆంధ్రకవులు అది చూచి తెనుఁగుకైతను ఖండకావ్యభూషలతో సింగారింపఁ దొడఁగిరి. ఖండకావ్యరచనము ఆంగ్లసారస్వతసాహచర్యము వలన మన కబ్బినమహాభాగ్యములలో నొకటి.

ఇఁక నొక కారణము: 'సతతము కావ్యరసముం గొనియాడుచు' 'మహాకవిత్వదీక్షావిధిఁ' బూనఁగల తిక్కనసోమయాజివంటి రసోపాసకులను, కవిబ్రహ్మలను గనఁజాలని పిదపకాల మిది. ఆధునికాంధ్ర సారస్వతమహాసభాభవన మలంకరించిన 'కలికిపాటల కోయిలకోలలు' వారికి సారస్వతమువలన జీవనోపాధి కల్గుట లేదు. వారు ఇతరత్ర ఉద్యోగధర్మమును స్వీకరించియో, వ్యాపారవ్యవసాయము లవలంబించియో పొట్ట పోసికొనుచు దేశాభిమానులును, భాషాభిమానులును నగుటచే తీరికసమయములందు ఉద్విగ్నమనస్కులై కవన మల్లుచున్నారు. వారి శ్రద్ధాబుద్ధులను ఒక్క కవిత్వరచనమందే అవధాన మొనర్చుటకు వారు ఉదరపోషణార్థ మవలంబించిన ఇతరవ్యాపారము లొప్పుకొనవు. కావున వారికి మహాకావ్యరచనకు వలయు దీక్షాపరత్వము లేకుండఁ బోయినది. అత్యభిరుచిగల వారి కవిత్వాభినివేశము ఖండకావ్యరూపమున జాలువాఱుచున్నది.

కవితాపోషకులైన ప్రజలును, కావ్యప్రచురణసాధనములైన పత్రికలును, నవీనాంధ్రకవిత్వాభివృద్ధికిఁ బ్రోద్బల మొసంగుచున్న ఆంగ్లసారస్వతమును, కవితానిర్మాతలగు యువకవులును ఇట్లు ఖండకావ్యములవైపే మల్లు చూపుచుండుటచేత ఆధునికయుగమున ఏతత్కావ్యరచనము మెండుకొనుచున్నది.

## కవితాసామగ్రి

ప్రాచీనకవిత్వమునుండి నేఁటి తెనుఁగుకవిత్వమును వేఱుపఱిచెడి రెండవవిషయము కవితాసామగ్రి. పూర్వకవులు ఉన్నతకుటుంబములవారి ప్రేమజీవితములు, మహాపురుషుల యుద్ధవీరత్వము మొదలైన సామాన్యజనుల కందుపాటుకాని ఉదాత్తవిషయములను గవితావస్తువుగా గ్రహించిరి. వారికిఁ బ్రకృతివర్ణనములు మహాకావ్యకల్పనలో నడపదడపఁ దోఁతెంచు నుపాఖ్యానములు. నవీనకవుల కట్లు కాదు. ప్రకృతివర్ణనములే వీరి ఖండకావ్యములకుఁ బ్రాణము వోయు ప్రధానవిషయములు. అందు సీతాకోకచిలుక మొదలు గగనదీపమగు చంద్రునివఱకును గల సమస్తవస్తువులును వీరి కవితాకుంచిక కనువగు వస్తువులే. వీరు ప్రాకృతజనుల సామాన్యజీవితవిషయములను గూడ కవితాసామగ్రిగ స్వీకరింతురు. ఇది ప్రాచీనాంధ్రపండితకవు లెవ్వరును త్రొక్కిచూడని క్రొత్తతెన్ను. ఇది ప్రజాస్వామిక (Democratic) ప్రభుత్వముల కాలము. కావున 'కవితలల్లే క్లాంతహృదయులు' సామాన్యప్రజల జీవితవిషయమును కవితాసామగ్రిగా స్వీకరించుట కాలధర్మము. ఇది జాతీయపునరుద్ధరణదీక్షాదినము లగుటచే ఆంధ్రచారిత్రకవిషయములను దేశోద్ధారకు లనఁదగిన యువకవు లొకరిద్దఱు గానము చేయుచు 'ఆంధ్రావళి మోదముం బొరయు' చున్నారు. ప్రబంధకవులు కృతిపతి నభినందించు ఘట్టమునఁ దప్ప మిగిలిన స్థలముల సమకాలికాంశములను బ్రస్తావింపలేదు. నవ్యకవు లట్లుకాక సమకాలికాంశములను కావ్యవస్తువుగాఁ జేకొనుచున్నారు.

## శైలి

మూఁడవది శైలి. ప్రబంధకవులు తమకావ్యములను బ్రౌఢాతిదీర్ఘసమాసములతో నించియుంచిరి. అందు బంధశ్లేషద్వ్యర్థిత్యాది ఐంద్రజాలికకవిత్వము మెండుకొనియుండుటయుఁ గలదు. ప్రబంధకవులలోఁ జెక్కురు సంస్కృతసాహిత్యమండను లగుటచే వారి గ్రంథములందలి శైలి సాంస్కృతికము. 'తోడ నర్థమెల్లఁ దోఁచకుండు గూఢశబ్దములతో' నిండియుండు నాప్రబంధములు పండితులకుఁ గూడ కొఱుకుపడని కొఱముట్టెలు. నవకవులు చిన్నిపదముల నాతిదీర్ఘసమాసములు, జానుఁదెనుఁగుపదములు వాడి సులభసుందరశైలిలోఁ గావ్యరచనము చేయుచున్నారు. బంధశ్లేషద్వ్యర్థికవిత్వములు మన యదృష్టవశమున విస్మృతికూపమునందుఁ బడి అడఁగారుచున్నవి. ఆంధ్రకవితాసతి యదృష్టరేఖ బయలుపడుటచే ఆసుకవితాప్రాబల్యము త్వరితగతి నడఁగంటుచున్నది. పరకుపాటుగఁ జూపట్టుచున్నను రసికప్రజల సాదరదృష్టి అట్టికవిత్వముపైఁ బ్రసరించుట లేదు. పదకాఠిన్యమే గొప్పకవిత్వమునకు యోగ్యతాపత్రముగా భావించిన ప్రబంధకవుల శైలికిని, శిరీషకుసుమపేశలములైన లలితపదములతోఁ గవనమల్లు నేఁటివారిశైలికిని గల వ్యత్యాసము సముద్రమంత. పూర్వులు మూరుమూలపదములను, రెండర్థములు స్ఫురించు పదములను శ్రమచేసి ఏర్చి కూర్చి తమకావ్యములను బండితజనైకవేద్యముగా నొనరించిరి. నేఁటివా రన్ననో 'కందువమాటలు, సామెతలు' అందముగాఁ బొందుపఱిచి తమగీతికాప్రసవములను జనసామాన్యము తావిగొనునట్లు చేయుచున్నారు. వ్యావహారికశైలినుపయోగించుచుఁ గళాదక్షులును, మహామతులును నగు నవ్యాంధ్రకవులు కొందఱు జీవద్భాషామాధుర్యమును ఆంధ్రలోకమునకు నంజుకొనఁ బెట్టుచున్నారు. సులలితాంధ్రపదములు, వ్యావహారికభాషాపదములు, జాతీయములు, సామెతలు ఇత్యాదిజీవద్భాషాపరికరములు నవీనాంధ్రకవుల శైలికి సవరఁదనముఁ గొనితెచ్చు మేరువుపూసలు.

## ఛందస్సు

నాల్గవది ఛందస్సువిషయము. పూర్వులు రచించిన గ్రంథములలో శతకములును, ద్విపదకావ్యములును మాత్రమే ఏకవృత్తపూర్ణములు. మిగిలిన వన్నియు వివిధగద్యపద్యాత్మకములగు చంపువులు. నవీనుల గ్రంథములో విశేషము తేటగీత, మంజరి, ముత్యాలసరులు మున్నగు ఏకవృత్తములతో - రచింపఁబడిన ఖండకావ్యములు. ఉత్పలమాల, చంపకమాల, మత్తేభము, శార్దూలము మొదలగు వృత్తములను విశేషముగను, సీసము, గీతము మున్నగు జాతులను ప్రాయికముగను ప్రబంధకవులు వాడియుండిరి. ఆధునికయుగమున నియమబాహుళ్యము గల వృత్తముల రచన కొంచెము వెనుబాటు నొందినది. యతిప్రాసలకుఁ గట్టువడుట యనినను, వ్యర్థపదపూరణములతో యతిప్రాసల నిల్పుట యనినను స్వేచ్ఛాపరులును, పదశిల్పులును నగు

నేఁటి కవులకుఁ దలచీడలు. యతిప్రాసలు ఎత్తికట్టి భాషాసౌలభ్యసంపాదన మొనరించుటకు స్వేచ్ఛాపరు లయ్యు నవ్యాంధ్రకవులు పూర్తిగా సాహసింపలేక వృత్తములను మాని నియమములు తక్కువగ నుండు మంజరులపైకి, తేటగీతములపైకిఁ దమ దృష్టి మరలించిరి. నవ్యాంధ్రకవితాసూత్రధారులలోనివారైన వేంకటపార్వతీశ్వరులు తేటగీతములు, మంజరులు లాలిత్యలావణ్యములు కలిగి విశృంఖలము లగు నవ్యభావవర్ణనముల కమరియుండుటను గనిపెట్టినారు. తేటగీతి ఆంధ్రమునకు అనుష్టుప్పు; సర్వతోముఖమగు నవ్యభావపరంపరకు ననువైన చక్కని వాహిక. మఱి యిఁక మంజరీద్విపద మధురభావమయగు ఆంధ్రముకొఱకే అవతరించినది. కావుననే నవకవులు తేటగీతములు, మంజరుల విశేషముగ నాశ్రయించుచున్నారు. పరంపరానుగతములగు ఛందములు యతిప్రాసదూషితములై తగినస్వేచ్ఛను తృప్తిని ఈయకుండుటచే నూతనచ్ఛందములను నిర్మించుటకు నేఁడొకవిపుల ప్రయత్నము జరుగుచున్నది. ఈవిపులప్రయత్నము నవీనాంధ్రకవులలోఁ బెంపు పెరుగుచున్న స్వతంత్రబుద్ధి వలనఁ గలిగిన ఆరోగ్యవంతమును, శ్లాఘ్యమును నగు కృషి. ఫల మెట్టి దగునో?

## భావము

ఐదవది భావములవిషయము. ప్రబంధకవులలో భావదాస్యము హెచ్చు. వారి కావ్యనిర్మాణపద్ధతియే ఇట్టిభావదాస్యమును బోషించినది. దేవతాప్రార్థన, కవిస్తుతి, కుకవినింద, కృతిపతివంశవర్ణన, షష్ఠ్యంతములు, పురవర్ణన, బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రవర్ణన, వేశ్యాభిసారికాపుష్పలావికాదివర్ణన, నాయికానాయకుల వర్ణన, వారి విరహము, చంద్రోపాలంభము, మన్మథోపాలంభము, మొదలైన విషయము లన్నియుఁ దప్పనిసరిగాఁ గావ్యనిర్మాణములోఁ బూర్వులు చేర్చికొని యుండుటచే వారి భావములకు సంక్షేపవిక్షేపములు గాని, అనేకత్వము గాని లేకపోయినది. ఒకరి నొక రనుకరించుటచే వారి భావములకు నవీనత్వము కూడ లేకుండఁ బోయినది. నవీనకవులవిషయమున అట్లుకాదు. వీరు స్వేచ్ఛాప్రియులు. అనుకరణము వీరి 'ఇంటబంట' కూడ లేదన సాహసింప నేరము కాని వీరు కావ్యనిర్మాణపద్ధతిలో వివిధత్వ మవలంబించుటచే వీరిభావములకు సరిక్రొత్తదనమును, సంక్షేపవిక్షేపములును లభించినవి. లక్షణగ్రంథముల బందుకట్లకు లోఁబడి కావ్యరచనముఁ గావింప నొల్లని రసోపాసకులు నేఁటికవులు.

ప్రాఁదెనుఁగుకైతనుండి వేఱైయున్న నేఁటి తెనుఁగుకైతల క్రొత్తతెన్నుల నిట్లు స్థూలదృష్టితోఁ బరామర్శించుకొంటిమి.

## తెనుఁగుకైతల క్రొత్తతెన్నులు

ఇఁక నాక్రొత్తతెన్నులను ప్రత్యేకనిదర్శనములతో విమర్శించుకొందము.

## ప్రకృతివర్ణనము

నవీనాంధ్రకవులకుఁ బ్రకృతిచింతనము, తత్సాంగత్యము నెక్కువ. ప్రబంధకవులు తమకుఁ దామై ప్రకృతితో సాంగత్యమను భవించి ప్రకృతివర్ణనము చేయలేదు. ప్రకృతివర్ణనావసరమున వారు గ్రంథస్థములను, కవిసమయములను నైన వర్ణనాక్రమమును నవలంబించిరి. ప్రవాహవేగ యగు గంగానదిలోఁ దామరమొలపించెడి ప్రబంధకవులెక్కడ? ప్రకృతిసాంగత్య మెక్కడ? ఇట్టి విరుద్ధకవిసమయముల చెంతఁ జేరక ఆంధ్రకవితాపితామహునివలె నొక్కింత మనోహరముగఁ బ్రకృతివర్ణన గావించిన కవులును కొందఱు ప్రాచీనులలో లేకపోలేదు. కాని అట్టివారైనను బ్రకృతి యథారూపవర్ణనము మాత్రమే చేసిరి కాని ప్రకృతిలోని అంతర్లీనవిషయముల నవగాహము చేసికొన ప్రయత్నింపరైరి. ప్రకృతిలోని వివిధవిచిత్రములఁ దిలకించి, ఆనందింప్,కలరూపు కవితాకుంచికతోఁ జిత్రించుట ప్రాచీనాధునాతనకవులకు సమానవిషయము. కాని ఆధునికాంధ్రకవులు ప్రకృతి వివిధరూపములను దూరమునుండి తిలకించి వర్ణించుటతోఁ దృప్తినొందరు. వీరు ప్రకృతిలో నంతర్లీన మగుదురు. [చూడుః ఏకాంతసుఖము—భారతి సంపు. ౧, సంచిక ౨, పే. ౫౮.]

ప్రకృతితో సాహచర్యము హెచ్చు గావుననే వీరికి ప్రకృతిరూపవికారములందొక అనిర్వాచ్యమైన మహాశక్తి, మహావ్యక్తి పొడగట్టును. ఆమహావ్యక్తిని గురువుగను, తమ్ముశిష్యులుగను నిర్దేశించుకొని నవీనాంధ్రకవులు ఆమహావ్యక్తితో మానసికసల్లాపసంతోషము నొంది అందుండి నీతిని గ్రహింతురు. ఒజ్జగా నిర్దేశింపఁబడిన ప్రకృతిమనసము క్రమముగా నతిశయిల్లి జీవాత్మపరమాత్మలకుఁ గల సంబంధసోపానమార్గమును వ్యక్తము చేయును. ఇట్టి ప్రకృతివర్ణనము వేంకటపార్వతీశ్వరకవుల 'ఏకాంతసేవ' లోఁ బ్రకృతిపురుషులకుఁగల పవిత్రప్రణయలీలల రూపముగఁ బ్రస్తావింపఁబడినది. నవీనాంధ్రకవులకుఁ బ్రకృతి జీవితాదర్శములఁ బ్రదర్శించు గురువు; అంతరాత్మనుఁ బ్రబోధించు వేదాంతి.

## లిరిక్కు కవిత్వము

దీనినే కొందఱు భావకవిత్వ మనుచున్నారు. ఏజాతికిఁ జెందినను ఉన్నతకవిత్వమునకు భావము ప్రాణాధారము. అట్లగుట ఒకజాతికవిత్వమునే భావకవిత్వ మనుట కువాదమే యగును. కావున భావకవిత్వమని మనవారు పిలుచు కవిత్వమును 'లిరిక్కు' కవిత్వమని పిలుచుట న్యాయభిమతము. ప్రబంధకవిత్వములో కవి చదువరులకుఁ దనకు తానైఁ గనుపించఁడు. కాని లిరిక్కుకవిత్వమో కవి ఆత్మోదంతమే. ఇందుఁ గవి తనహృదయమున మట్టుమీఱి మల్లాడు సుఖదుఃఖాద్యనుభవమును బ్రవహింపఁజేయును. కవిస్వీయానుభవవ్యక్తీకరణముగావున లిరిక్కుకవిత్వము విశ్వాసమండితమై యుండును. లిరిక్కుకవితాప్రధానలక్షణ మెద్దియనిన: కవితావస్తువులోఁ గవికి ప్రచ్ఛన్నముకాని

సంబంధ ముండుటయే. ఇంతియే కాని వస్తువునందుఁగాని భావమునందుఁగాని లిరిక్కవిత్వమునకు నియమము లేదు. 'ముక్తావళి' యను ఖండకావ్యమున (భారతి సంపు. ౧, సంచిక. ౭, పేజి. ౧౪౭) నందు "నావలె శుష్కజీవనమునకా........." అని కల్లడించిన దుఃఖభాజనమైన యాత్మోద్దంతమును, 'తిక్కన' యను ఖండకావ్యము (భారతి, సంపు. ౨, సంచిక ౯, పే. ౧-౩) నందుఁ గావింపఁబడిన "పేటివిపంచి కేలఁగొని" ఇత్యాది మహాకవిస్తోత్రమును ఆంధ్రసారస్వతమున లిరిక్కవిత్వమున కుత్కృష్టనిదర్శనములు.

## ప్రాకృతజనుల జీవితము

ప్రాచీనాంధ్రకవులు మహారాజుల కథలనే కాని సామాన్యుల కథలను కావ్యసామగ్రిగా గ్రహింపలేదు. వారు రాజాశ్రితులు. అట్లగుట వారి భావప్రపంచమున నంతఃపురసంవాసితులైన రాజదంపతుల విరహాగ్నికే కాని పల్లెటూరి పాటకపుజనుల నిసర్గరమ్యప్రణయ జీవితములకుఁ జోటు లేక పోయినది. వారు 'పల్లెటూరి తొయ్యలుల నిసర్గరమ్యదరహాసరుచిలోకనచేష్టలందు గుబులొన్ను నిష్కలుషపు గ్రామ్యజీవనపుఁ గమ్మఁదనంబు' గ్రహింప లేక పోయిరి. 'రాచోరింటికైనా రంగూ తెచ్చేపిల్ల'లు ప్రాకృతజనులలో నుందు రని వారు కలలోనైన నూహింపలేదు. నవీనాంధ్రకవులకట్లు కాదు.—

ప్రేమకురియించు మోహనరాగాలాపములు గావించెడి కాపుపడుచు కలికివలపు విద్యావంతులగు నవీనాంధ్రకవుల 'విరజాజి బజారు'లోని పరిక్రొత్తసరకు. ఈతరగతి కవిత్వమును బెంపొందించు రసికావతంసములలో నండూరివేంకటసుబ్బారావు మేటి. ప్రణయస్వరూపిణియగు యెంకిద్వారా ప్రాకృతజనుల సాంసారికపు ముచ్చటలను అనువగు కవితాసంభారములతో మేళవించి భోగ్యద్రవ్యముగా నొసర్చిన యీకవి ప్రతిభను 'అంజలి సేయక తీర దెవరికిన్.' ప్రాకృతజనుల సాంసారికపు ముచ్చటలు భోగ్యద్రవ్యముగా నొనర్చిన ప్రతిభయే కాక వానికి శిష్టత్వ మాపాదించి సభాపూజ్యతఁ గొనితెచ్చిన గౌరవము కూడ సుబ్బారావుకే చెందును. 'యెంకిపాటల'లో శ్లాఘ్యమైన మఱియొక విశేషము కలదు. హిందూదేశము కర్మభూమి; జ్ఞానభూమి. అందుఁ బుట్టువుఁ గన్న విద్యాగంధహీనుఁడగు కడజాతి వానినుండి తపస్స్వాధ్యాయనిరతుఁడగు మునీశ్వరునివఱకుఁ గల ప్రతి వానికిని బారలౌకికోత్తరజన్మజిజ్ఞాస తల్లిపాలనాఁటినుండి యుండునదే. హిందూదేశౌన్నత్యము కలకాలము చిరస్థాయి యై యుండుటకు వేరుదుంప యనఁదగిన దీవిజ్ఞానము. అది భారతీయుల కొల్లఱకు ఉమ్మడిసొమ్ము. కావుననే నాయుడుబావయు

'యెనకజల్మములోన యెవరమో' నంటి
సిగ్గొచ్చి నవ్వింది సిలక నాయెంకి !
'ముందు మన కేజల్మ ముందోలె' యంటి
తెల్ల తెలవారియింది పిల్ల నాయెంకి !

అని నివేదించుచున్నాఁడు. ప్రాకృతజనుల జీవితవిశేషములను వర్ణించుటలో విశేషవ్యాసంగము చేయు కవికొండల వేంకటరావు భావకుంజులమగు కైతను ఆంధ్రలోక మనుభవించి ఆనందింప నేరకున్నది. అతని భావవాహిక తెలియని తెన్నులఁ బడి పోవుచుండుటచేత, నవ్యభావవర్ణనమునకు ఒదుగని ప్రాచీనవృత్తములను దిగనాడి నూతనఛందముల సృష్టింప నావేదన పడుచున్న వేంకటరావు విశేషకృషి శ్లాఘనీయమే కాని అతని నూతనఛందములఁ బఠింపవలసిన ధోరణి పలువురకుఁ దెలియకున్నది.

## గోపకావ్యములు

గోపకావ్యము (Pastorals) లనఁబడు నొకతరగతి కావ్యములు ఆంగ్లసారస్వతసంపర్కమువలన మనవాఙ్మయములోనికి దిగుమతి నొందుచున్నవి. గోపకావ్యనిర్మాత యనఁదగిన థియోక్రిటసు (Theocritus) శాద్వలస్థలములు, నదీతీరవిహారములు, పామరజనవ్యవహారములు, ఇత్యాదివిషయముల వర్ణించెను. కాలక్రమమున కవులు గోపకావ్యములను మతసాంఘికసారస్వతరాజకీయాదివిషయములపై తమ అభిప్రాయముల వ్యక్తీకరించుట కుపయోగించిరి. భాగవతములోని గోపాలకృష్ణుని వనవిహారవర్ణన మీతరగతి సారస్వత మనవచ్చును. ఇంతకు మించి మనలోఁ బ్రాచీనగోపకావ్యములు ప్రత్యేకించి లేవు. ఇప్పుడిప్పుడు ఆంగ్లసారస్వతసాహచర్యమువలనఁ గొలఁదిగ బయలు దేరుచున్నవి. దువ్వూరి రామిరెడ్డి 'వనకుమారి' ఇట్టిదే. ఇందు గోపకావ్యసాంప్రదాయము లన్నియు సమకూరినవి. కథానాయిక యగు 'వనకుమారి' గొఱ్ఱెల కాచుకొనుచు

"సీ. కొండ నెత్తమ్ములఁ గోరాడు మబ్బుల
గమనసౌందర్యంబుఁ గాంచి కాంచి;
మేఘోదయంబున మినమినఁ బురి విచ్చి
యాడునెమ్మిల యొప్పు లరసి యరసి;
యమృతధారలరీతి నచ్ఛమై ప్రవహించు
సెలయేళ్లలోఁ గ్రీడ సలిపి సలిపి;
ప్రకృతిమంజులమైన పక్షుల గానంబుఁ
దమి దీఱ వీనులఁ ద్రావి త్రావి;
యెండవేళలఁ బొఁబొదరిండ్లఁ దూరి
హరిణకర్ణిణులకుఁ జివురాకు లొసఁగి
ప్రసవమాలల ధరియించి ప్రతిదినంబుఁ
గానవంబుల రాణియై గ్రాలుచుండు."

ఇట్లు నాయికచేఁ బ్రకృతివర్ణన చేయించుటయే కాక రామిరెడ్డి నాయకునిచే నంతఃపురజీవితము, పరలోకవృత్తాంతము మున్నగు విషయములను వర్ణింపించి లౌకికజీవితముపై తన అభిప్రాయములను కల్లడించెను. కావుననే గోపకావ్యలక్షణములు 'వనకుమారి' యందుఁ గొంతవఱకు పీకిభావ మొందిన వనుట. ఈగోపకావ్యనిర్మాణమునందాంధ్రకవులు విశేషమైన యభినివేశ మగపఱచుట లేదు.

## మృతస్మృతులు

నెనరైన చుట్టములు గాని, దేశారాధనతత్పరులైన మహానుభావులుగాని మరణించినపుడు కలిగిన దుఃఖావేగముచే రచింపఁబడిన శోకగీతికలు ప్రాచీనాంధ్రసారస్వతమునం దంతగాఁ గనపట్టవు.

"సీ. ఎదురైనచోఁ దనమదకరీంద్రమునిల్పి......"

అని పెద్దన్న చెప్పినచాటుపద్యము ప్రాచీనాంధ్రసారస్వతమునఁ గల శోకగీతము. ఈకాలమున నిట్టి మృతస్మృతుల రచనము విస్తృతిఁ జెందుచున్నది.

సుతస్మృతులు, మిత్రస్మృతులు, పేరుప్రతిష్ఠలు గల పురుషులు మరణించినపుడెల్ల పత్రికలలో మనము గాంచు స్మరణగీతములు మొదలైనవి శోకగీతికావాఙ్మయమును బెంచుచున్నవి; కాని సారవంతము చేయుటలేదు. శోకగీతములను—ఆత్మీయులు మరణించినపుడు చెప్పినవి, మహాపురుషులు మరణించినపుడు చెప్పునవి అని రెండువిధములుగా విభజింప వచ్చును. ఆత్మీయులు మరణించినపుడు చెప్పుశోకగీతికలకు శ్లాఘనీయమైన నిదర్శనముగా దువ్వూరి రామిరెడ్డి 'ప్రియావియోగము' (భారతి సంపు. ౫, సంచిక ౯, పే. ౫౭-౫౯) చేకొననగును. మహాపురుషుల మృతస్మృతులకు నిదర్శనముగా సత్యనారాయణమూర్తి "తూర్పుదిక్కున కాంతికిరణము............" అను "దామెర్ల రామారాయస్మరణము"ను జేకొననగును.

## మర్మకవిత్వము

మర్మకవిత్వ (Mystic Poetry) మనఁబడు ఆధ్యాత్మికకవిత్వ మీకాలమున విస్తృతి నొందుచున్నది. నోబిలుబహుమాన మందిన రవీంద్రుని గీతాంజలి సంగీతములకుఁ బారుసువారైన ఆంధ్రయువకవులు ఆలించి అందలి మేలెంచి మిన్నందినారు. గీతాంజలి సాహచర్యమున తెనుఁగుకవులు జయదేవుని గీతగోవిందము, లీలాశుకుని కృష్ణకర్ణామృతము మొదలగు వైష్ణవభక్తిప్రతిపాదకములగు గ్రంథరాజములపైఁ దమ కవితాదృష్టిని బ్రసరించినారు. అందుతో భక్తుఁడు ప్రణయినీరూపమున భగవంతునిఁ గొల్చునట్లు కవిసాంప్రదాయము మనలో నేర్పడినది. ఈమర్మకవిత్వరచనమున యువకులగు నవీనాంధ్రకవులు విశేషవ్యాసంగముఁ జూపుచున్నారు. అట్టి విశేషకృషికామృతఫలముగా వేంకటపార్వతీశ్వరుల 'ఏకాంతసేవ' ఉదయం బొందినది. ఆధునికాంధ్రకవులు ఆంధ్రభారతి కుపాయనముగ నర్పించుచున్న గ్రంథరాజములలో 'ఏకాంతసేవ' ఉత్తమమైనది. ఇందుఁ బ్రణయినీప్రణయులకును, ప్రకృతిపురుషులకును, భక్తపరమేశ్వరులకును గల పవిత్రప్రణయలీల యభివర్ణితమైయున్నది.

## వేణుగానవర్ణనము

వైష్ణవభక్తిప్రతిపాదకములగు గ్రంథములను బఠించుటఁ జేతనవ నేఁటి యువకవులలో శ్రీకృష్ణుని వేణుగానవర్ణనము పెచ్చు మీఱినది. సంస్కారులును, సనాతనమార్గగాములును గూడ నిట్టివర్ణన మొనర్చి ఆంధ్రకవితాసతిచే గుడుగుడుకుంచము లాడించుచున్నారు. ఇకనైన నిట్టిది విరమించుట మంచిపని.

## జాతీయ భావము

నేఁటి తెనుఁగుకవులలో జాతీయభావము పెల్లుబ్బి వెల్లువయై ప్రవహించుచున్నది. నవీనాంధ్రకవులలో కొందఱు స్వదేశీయోద్యమాంధ్రోద్యమములచే నుత్సాహతరంగితులై కవన మల్లుచున్నారు. అట్టికో వారికవనములందు సమకాలీనమైన ఉత్సాహబీజములు అప్రయత్నముగ నైన ఉరళింపక మానవు. 'ఆంధ్రావళి మోదముం బొరయ' గ్రంథరచనోద్యుక్తుండైన తిక్కన కూడ ఆంధ్రకీర్తిని బ్రత్యేకించి సంకీర్తనము చేయలేదు. కాకతీయాంధ్రచక్రవర్తి ప్రతాపరుద్రుఁడు మున్నూరు యవనవీరులను దెలుఁగుమాగాణి నుండి తఱిమివైచిన ఆ విజయలక్ష్మీప్రసాదాంకవిభవదినములలోఁ నాఁటి తెనుఁగుకవులయందు జాతీయభావము పాలసముద్రమువలె పొంగి పొరలవలసినది. కాని ప్రాచీనాంధ్రకవులలో జాతీయభావము పూజ్యము. అనగా అభావ మనుట. 'లోక మంతకుఁ గాక వెట్టిన' ఆనాఁటి 'కాకతీయుల కదనపాండితి'ని 'చీకిపోవని చేవమాటల' తో నిరువదియవ శతాబ్దిలోనున్న రాయప్రోలు సుబ్బారావు ప్రస్తావించెనే కాని సమకాలికు లందఱును మూఁగలై యుండిరి. ఇవి జాతీయపునరుద్ధారణ దీక్షాదినములు.

"ఉ. జారిన దేశగౌరవముఁ
జక్కన దిద్ది,మహాంధ్ర మండలీ
భారము శ్లాఘనీయముగఁ
బాలనఁ జేసి, సమానరాష్ట్రికుల్
కూరిమి నాసఁ జేయ, తెలుఁ
గుం బడవాల్ గయిసేసి"

—రాయప్రోలు సుబ్బారావు

ఔన్నత్య శిఖరమునకుఁ గొంపోవలయునను దీక్షతో దేశారాధకులగు కవులు

"సీ. తనగీతి యఖిలజాతిని పాటకులను గా
దిద్ది పరిఢిల్లిన తెనుఁగు వాణి
తనపోటులు విరోధితండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుఁగు కత్తి
తనయందములు ప్రాంతజనుల కభిరుచి వా
సన నేర్ప నలరిన తెనుఁగు రేఖ
తనపేటికలు వసుంధరను సస్యశ్యామ
లను జేయఁ జెలగిన తెనుఁగు భూమి
అస్మదార్ద్రిమనోవీథి నావహింప
జ్ఞప్తి కలయించుచున్నాఁడ చావలేదు

చావలేదు ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చి చదువు డోసగయులార!"

—రాయప్రోలు సుబ్బారావు.

అని ప్రాక్తనవైభవపునస్స్మరణము చేయుచున్నారు. రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథను సత్యనారాయణ, శేషాద్రిరమణ కవులు మొదలైనవారు జాతీయభావసముద్దీపితములగు కావ్యముల గొన్నిటిని రచియింపుచు ఆంధ్రకీర్తిని సంకీర్తనము చేయుచున్నారు. ప్రత్యేకమైన ఆంధ్రజాతీయాభిమానమే కాక నవీనాంధ్రకవులలో సాముదాయికమైన భారతజాతీయాభిమానము కూడ వెల్లివిరియుచున్నది. నండూరి బంగారయ్య "రక్షరా! శ్రీరామరక్షరా! తండ్రీ" అనురచనమిందు కుదాహరణము.

ఇందులో నొకవిశేషము: కవి సమకాలీనమైన చారిత్రికాంశములను కావ్యవస్తువుగా స్వీకరించియున్నాడు. ప్రబంధకవులు కృతిపతి నభినందించు ఘట్టమునఁ దప్ప మిగిలినతావుల సమకాలికాంశములను గ్రంథస్థ మొనర్ప లేదు. సమకాలికాంశములను గావ్యసామగ్రిగా నంగీకరించు నాచారము నవీనులలో మాత్రమే నెలకొన్నది. నవీనాంధ్రకవులందుఁ జూపట్టుజాతీయభావవిజృంభణమే ఇట్టిఆచారస్వీకరణమునకు ముఖ్యకారణము.

## చిన్నికథలు

పూర్వాంధ్రకవులు ప్రత్యేకించి చిన్నికథలను రచింపలేదు. మహాకావ్యసృష్టిలో నెడనెడఁ బొడతెంచు ఉపాఖ్యానములు వారికి ఏదేని ఒకవిషయమును సమర్థించుటకో, లేక ఏదేని ఒకనీతి నుపదేశించుటకో కొనితేరబడిన అప్రధానవిషయములు. నవీనాంధ్రకవులు విశేషము ఖండకావ్యరచయితలు గావున స్వల్పేతివృత్తముల నెత్తికొని వానికిఁ దగినయెత్తుగడ, నిర్వహణము, సమాప్తి సమకూర్చి చిన్నికథలు విరచించుచున్నారు. నేఁటి ఖండకావ్యములలో నేదే నొకభావము కాని, అవస్థ గాని ఉల్లేఖింపఁబడి, మథింపఁబడి, పరామర్శింపఁబడునట్లే నేఁటి చిన్నకథలలో నేదే నొకసాంఘికదురాచారము గాని, చిత్తవిభ్రమము గొల్పు విచిత్రసంఘటనము గాని ప్రస్తరింపఁబడును. నిదర్శనముగా జిత్రావూరి కామేశ్వరరావు 'ఏకాంతప్రేమ', వేంకటపార్వతీశ్వరుల 'జలజమాలిక', అబ్బూరిరామకృష్ణారావు 'మల్లికాంబ' చేకొన నగును.

## వృత్తములు

ఈకాలమున వృత్తరచనము వెనుబాటు నొందిన దని చెప్పవచ్చును. వేంకటపార్వతీశ్వరులు వెలయించిన గేయగీతముల సమ్మోహనమే ఇందులకు ముఖ్యకారణము. ప్రబంధవాసన పట్టనీయక వృత్తములను నవ్యసాంప్రదాయముతో నడపించు యువకవులు కొందఱున్నారు. వారిలో రాయప్రోలు సుబ్బారావు, దువ్వూరి రామిరెడ్డి, వేదుల సత్యనారాయణశాస్త్రి, వెమ్మరాజు లక్ష్మీపతి మొదలగువారు ముఖ్యులు. ఇందుఁ వెమ్మరాజు లక్ష్మీపతి వృత్తములలోఁ జూపు బిరిక్కు అందము అసాధారణంబుగ నున్నది.

## బాలవాఙ్మయము

బాలబాలికాలీలలు విరివిగ వర్ణించుటకు, వారికొఱకై ప్రత్యేకించి వాఙ్మయము సృష్టించుటకు ఇక్కాలమున సత్ప్రయత్నము జరుగుచున్నది. ఇందు బాలబాలికాలీలలు విరివిగ వర్ణించుసారస్వతమునకు నిదర్శనముగా అమ్మణ్ణి (భారతి సంపు. ౧, సంచిక 3, పే. ౮౭) అనునది స్వీకరింపనగును. ఇఁక బాలబాలికలకుఁ బ్రత్యేకముగసృష్టింపఁబడు వాఙ్మయమునకు ఉదాహరణముగా 'దొంగాట' (భారతి సంపు. ౧, సంచిక ౧, పు. ౫౫) చేకొననగును. మునిమాణిక్యము నరసింహారావు 'కాకమ్మ' అనునది ఈతరగతికే చెందును.

## ప్రేమ

ప్రబంధములలో వర్ణితమైనప్రేమ 'పూఁతపసిండి' వంటిది. ఇప్పుడు పెక్కుఱు యువకవుల లేఖినినుండి జాలువాఱు ప్రేమ విశుద్ధమైనది. అది హృదయగతమైనది. 'ప్రణయతపస్సు' లోని నాయికను గమనింపుడు—

ఉ. చిత్తములోని ప్రేమరస శీకరము ల్పయిఁ జిల్కరించి, రే
కెత్తిన భావపుష్పముల నేర్చి, హృదీప్సితమాల గూర్చి యా
యత్తము నైతివీవు హృదయాధిపు కంఠ మలంకరింపఁ దా
నిత్తరికైన రాఁడు హృదయేశ్వరు డో ప్రణయైకజీవనీ!

—వెమ్మరాజు రాజగోపాలము.

హృదయోద్గారితమగు నిట్టి విశుద్ధప్రేమ వర్ణింపఁబడు ఈనాగరికయుగమున పాడఁగేవలము ప్రబంధధోరణిలోఁ గాముకప్రేమవర్ణించు కవులు లేకపోలేదు. 'నిరీక్షణము' (జనరంజని సంచిక ౧, పేజి 33) మండలి భోగలాలసయగు నాయికను గాంచనగును.

## ఉపసంహారము

అభినవాంధ్రకవితా రథమిట్లు హుటాహుటి నడలతో నూతనజీవలావణ్య కళ్యాణపథములఁ బరతెంచుచున్నది. గాంధిమహాత్ముని నిరాకరణోద్యమాపజయ ఫలితముగ తెలుఁగునాటఁ బొడచూపిన నిర్లిప్తత, నిరుత్సాహము లీకవితారథగమనవేగమునకు ప్రబలప్రతిరోధకములుగ నున్నవను జనవాక్యములో సత్యము లేకపోలేదు. నిర్లిప్తతను దూరముగాఁ దొలగించి యువకవుల మనములందు నూతనోత్సాహము పూరించుటకుఁ గళ, శారద, భారతి మొదలగు ఉత్తమ సచిత్రమాసపత్రికలు, వారపత్రికలలోని సారస్వతాను బంధములు, రసమంజరులు విపులప్రయత్న మొనర్చుచున్నవి. ఈవిపులప్రయత్నము ఫలసాయుజ్యము నొందుసూచనలు సర్వత్ర కన్పట్టుచున్నవి. అట్టిచో నివి ఆంధ్రభారతికి కృష్ణపక్షపు నిశలను ప్రబంధకవితారాధకుల వాక్యము నిలువఁజాలనిది. వృత్తములలో బిరిక్కుసౌందర్యము 'ఆంధ్రప్రశస్తులు', 'భావపల్లవములు', 'ముక్తావళులు', 'గోపికాగీతాలాపములు', ప్రాకృతజనుల జీవమాధుర్యములు మొదలగువాని నర్పింపఁగల యువకవిచంద్రులతోఁ బ్రకాశమానమగుచున్న నవ్యాంధ్రకవితాప్రపంచమునకా కృష్ణపక్షపునిశలు?



# ద్రౌణినిర్వేదము

మండలేముల వేంకటశాస్త్రి గారు, బి. ఏ., యల్. టి.



వ్యాసకర్త

పాపుఁడ బాలఘాతుకుఁడ బ్రాహ్మణధర్మము నమ్మునర్పఁగా
నోపినదుష్టబుద్ధి నయయో! తొలుబాముఁ జేసినట్టి యా
పాపము లేపుమీఱి నను భ్రష్టునొనర్పకయున్నె? దుర్మదా
టోపవివేకహీనుఁ గపటున్ గులపాంసను బ్రహ్మబంధునిన్?

మ. "ధనురాచార్యునిపుత్రుఁ డీతనికి నిందాభాజనంబౌ ప్రవ
ర్తన మెట్లబ్బెను? గంగిగోవునకు వ్యాఘ్రంబెట్లు జన్మించె? నీ
తనిఁ జూడన్ బెనుపాపమౌ" ననెడి నిందావాక్యముల్ సైచి, హే
యమని మోమెత్తక సంచరింతును జగంబందున్ ద్రపాశూన్యతన్.

ఉ. నాయెడ వైరమూనరు రణంబున నాకెదురాడలేని లేఁ
బ్రాయపువారు చెక్కిళులఁ బాలొలుకన్ వసయొంట నొల్కువా
రాయెడ నిద్రవోవుచు సుఖాంబుధిఁ దేలుచునుండఁగా, నసా
హాయత నున్న వారిఁ దెగటార్చితి నే నొకమేటిబంటనై.

ఉ. ఎక్కటి కయ్యమున్ సలిపి యేపువహించి సమీరనందనుం
డుక్కడఁగించినంతనె సుయోధనుపై నిటు రాజభక్తి నా
కెక్కడినుండివచ్చె! మదినింత దలంపక యేల చంపితిన్
నెక్కొని దుష్టబుద్ధిమెయి నిద్దురవోయిన చిన్నిపాపలన్ !!

చ. సమరము పాడిగా దనువిచార మొకింతయులేక, పౌరుష
క్రమముఁ దలంప కింతకనికారముఁ బూనక క్రోధపుంబిశా
చమునకు లోఁబడంగ, మనసా! యెటులోపితి! సారసావివే
కము నెటుగోలుపోయితి! వకార్యము నే క్రియఁ జేయఁజాలితో?

క. "ఇదితగు నిదితగ"దని తలఁచెద నెపుడు నిరూఢముగ నినీ! నీవిటు దు
ర్మదమునఁ బడి మడియుట నాకొదవె మహాఘమ్ము దుర్ణయోన్నతి మనసా!

క. మనసునె కల్గు బంధమ్మును మోక్షము నరుల కండ్రు మోక్షేతరవ
ర్తను నన్నొనరించితి విట మనసా! నీవెంతకును సమర్థవుగావే?

చ. పరమున కేమికాని ననువంటి దురాత్ములు లేరటంచుఁ బ
ల్కురు పలుకన్ యశోధనముఁ బూడిదపా లొనరించుకొంటి దు
ర్భరమగు పాపతాపమున స్వాంతము ప్రీలెడి నెట్టు లీవసుం
ధర కతిభారమౌ తనువుఁ దాలిచి నేవ ధరింతుఁ బ్రాణముల్?

ఉ. "పాపియితండు నాసుతులఁ బట్టి వధించెను గొంకులేక త
త్పాపఫలంబుగా నితఁడు బ్రాహ్మణుఁ డయ్యును జచ్చు"నంచుఁ దా
ద్రౌపది శాపమిచ్చినఁ గరమ్ము శుభమ్మగు నంచు నెంచెదన్
సైపఁగవచ్చునే నరువశమ్ముగ నా కవమాన మాటకున్.

చ. చలమున ద్రౌపదేయులను జక్కడఁగించిన నన్నుఁ జంపఁ జే
రలుక వహించి మించి నయనాంతములన్ బడి వేఁడి నిప్పుకల్
జలజలరాలఁ గాలయము చందమునన్ ననువెంబడించు వే
ల్పులదొరబిడ్డ నెంచి మదిలో భయమందుచునుందు నిచ్చలున్.

క. అపౌరుష మావిక్రమ-మా పృథుదోర్బలముఁ జలము నాహవకేళీ
వ్యాపారము గుణసారము-నా పార్థున కగునుగాక! యన్యుల కగునే?

తే. ప్రళయకాలాగ్నికీలల భంగి నడరు-పార్థుకోపానలజ్వాల వ్యర్థమగునె?
మనసులోఁ జొచ్చి హర్షసంభ్రమము లొల్కు-గనఁబడును నేఁడుఁ గన్నులఁ గట్టినట్లు.

క. నాయేసిన బ్రహ్మాస్త్రం-బాయనఘుని గాండివమున వ్యర్థంబగుటన్
జేయునదిలేక లోఁబడి-పోయితిఁ బ్రాణములఁ గోలుపోయితి ననుచుని.

చ. అనయముఁ బుత్త్రశోకమున నాతురయై దురపిల్లు ద్రౌపదిన్
గని ననుఁజూపి యర్జునుఁడు "కాంతరో! యీ శిశుహంతఁ దెచ్చి య
ప్పనమొనరించితిన్ ద్విజుఁ డవధ్యుఁ డటంచు క్షమించిపుచ్చెదో
కొనెదవొ వీని ప్రాణములఁ గోరినయట్లొనరింపుమీ" యనన్.

చ. ననుఁ గనినంత ద్రౌపదిమనమ్మునఁ బొంగు విషాదమల్లన
ల్లన దిగఁద్రావి కన్నులకొలంకుల బాష్పకణమ్ము లొల్కఁ ని
ట్లను "గురుపుత్త్రు వీనిఁ జతురాననవంశ్యు భయమ్ము వాపి కా
చినఁ గడుఁబున్నెమౌ నితని చేసినచేఁతల కేమి? ఫల్గునా?

ఆ. బ్రాహ్మణుం డితండు భయమునఁ జేసి జీ-వచ్ఛవంబువగిది బ్రతికియుండె
నిట్టివానిఁ జంప నెట్లు పాల్పడెద వీ-వమరలోకనాథు ననుఁగుఁబట్టి!

ఉ. అంతియెకాక, వీనిఁ దెగటార్చినమాత్రన ద్రౌపదేయు ల
త్యంతము నాకు సౌఖ్యమును హర్షము నించెడిభంగిఁ గ్రమ్మఱన్
గాంతురె ప్రాణవాయువులఁ? గానిమొదల్ మన కేల పాతకం?
బింతకువచ్చెఁ జాలుఁ జననిమ్మితనిన్ ద్విజహింస యొప్పునే?



శ్రీ విఖనసాచార్య వర్ష వర్ధనోత్సవము, కురుముద్దాలి



శ్రీ దక్షిణాంధ్ర భాషాభివర్ధనీ సభ, ౧౯౩౦

క. ప్రాణము లెడలించుటయును- మానమును హరించుటయు సమానము గావే
మానధనులైనవారికి? మానముఁ గొని విడువు ప్రాణమాత్రుఁగ నిన్నున్."

చ. అనిన సతీలలామ వచనాస్త్రములన్ బడి భిన్నమయ్యెఁ దు
త్తునియలుగాఁగ మానసము తోడనె మేనుఁ జెమర్చె "నిందఁ గాం
చిన బ్రతుకేల నాకిఁక నిసీ" యని యెంచితి "నెట్టులైన న
ర్జునకృతమౌ పరాభవముఁ జూడక తీర"దటంచు నెంచితిన్.

ఉ. అంతఁ గిరీటి నన్నుఁ దెగటార్చు తలంపును మాని యిట్లనున్
"బంతము పట్టి ద్రౌపది కుమారులఁ జంపిన పాపి వాఁడు గా
లాంతకు మందిరమ్మునకు నంపుట న్యాయమె కాని ద్రౌపదీ
కాంత సహింపకుంట నినుఁ గాచితిఁ; బొమ్మిఁక ద్రోణనందనా!

చ. చలము బలంబుఁ జేటపడ సంగరరంగమునందు నిల్చి వై
రులఁ బోరిగొంట పౌరుషము రోషమునన్ బసివారిఁ జంపినన్
గలుగునె కీర్తి? నీబ్రతుకు గాల్పనె? ద్రోణుని సద్యశంబు నీ
వలనఁ గళంకమొందెఁ గులపాంసన! బ్రాహ్మణవేషధారణా!

ఉ. పౌరుషమెల్లఁ బోవిడిచి బ్రాహ్మణధర్మము వమ్మొనర్చి ని
ష్కారణవైర మూని సుతకల్పకపంచకమున్ వధించినన్
సైరణసేసె నీపరమసాధ్వి తదీయపటిష్ఠశాలి సం
స్కారముగల్గ నీకెటులు చావకపోవఁగవచ్చు బ్రాహ్మణా!

చ. ఘనతరపాపవహ్నిఁ బడి గాలియుఁ గాలక తాపమొందు ని
న్ననుపమగాండివోద్గతశరాగ్నుల భస్మము సేసితేని మే
లొనరిచినట్టులౌ బ్రతుకు నోజయుఁ గీర్తియుఁ గోలుపోయి నీ
మనమున రోఁతపుట్టు నవమానపు జీవిత మొందు బ్రాహ్మణా!

ఆ. వె. చంపఁదగినయట్టి శత్రుఁడ వీవు చేఁ-జిక్కినావు కరుణచేసి విడిచి
పుచ్చుకెటులు నిన్నుఁ బోరిగొనఁ జూచు నీ-ధర్మజాని యనుంగుఁదమ్ముఁ డకట!"

చ. అని వచనేషువహ్ని హృదయంబు సమూలము గాల్చివైచి య
ర్జునుఁడు మదీయకోమలశిరోజతతిన్ మొదలంట నూడ్చి చ
క్కని రుచులొల్కు దివ్యతరకౌస్తుభసన్నిభమౌ శిరోమణిన్
గొని ననుఁ బుచ్చెఁ గృష్ణుఁడు వినోదముఁ జూచి హసించుచుండఁగన్.

ఉ. పౌరుషహీనుఁడన్ గులము పాడిఁ దలంపని నీచుఁడన్ సదా
చారము నీరుసేసిన విచారవిహీనుఁడ దుర్మదాంధుఁడన్
ధీరహితుండనై మెలఁగితిన్ శిశుహంతయనంగ పాపపున్
గీరితి నొందితిన్ గురునికీర్తి హరించితి నేమిసేయుదున్?

గీ. వ్రతము సెడినను ఫలమైన వచ్చుననుచుఁ-జేయరానట్టి పనులను జేసియుంటి
ఫలమునకుమారు పాపము గలిగె యశము-తొలఁగె నుసురులుమాత్రము తొలఁగవయ్యె.

శా. స్వాధ్యాయంబుఁ బఠించుటో క్రమత షట్ఛాస్త్రార్థముల్ నేర్చుటో
విధ్యుక్తక్రియ వేల్చుటో క్రతువులన్ వేమారు గావించి దై
వధ్యానంబునఁ బ్రొద్దుఁబుచ్చుటో కదా బ్రాహ్మణ్యధర్మంబు లే
వధ్యుం డైతిని క్షత్త్రధర్మమునఁ బాపం బిట్లు గావించుటల్.

సీ. బ్రాహ్మణధర్మంబుఁ బాటింతునందునా, స్వాంతంబు పాషాణసదృశమయ్యె
క్షత్త్రియధర్మంబు సవరింతునందునా, పిఱికిపందను నిజం బరసిచూడ
వైశ్యధర్మంబునఁ బరగుదునందునా, చిల్లిగవ్వైన నాచేత లేదు
హాలికధర్మముఁ బూని మెలఁగెదనందునా, పొలము దున్నఁగలేను మూరెఁడైన
వెలివడితి నిట్లు నాలుగుకులములకును-రెంటికిఁ జెడ్డ రేవడరీతి నుంటి
నేమి సేయుదు? దిక్కు నా కెవ్వ? రెట్లు-పాపము శమించు? నెట్లు సంతాప మడఁగు?

క. తనకులధర్మము విడిచిన-మనుజుఁడు చెడునం ట్రుగాదె మాన్యులు? నేని
య్యనువున నిహపరములు నా-శన మొందిన భ్రష్టుఁడైతి సత్యం బకటా!

తే. గీ. బ్రతుకఁజాలను నిందకు భాజనముగఁ-జావఁజాలను నరక మసహ్యమగుట
బ్రతుకకయుఁ జావకయు నుండవచ్చునొక్కొ?-నూయిముందర వెనుకనుగోయి యకట!

చ. గురువర! నీసుతుండ ననుకొంటకుఁగూడ ననర్హుఁడైన ము
ష్కరుఁడను; నీయశోలతకు ఘాతయొనర్చిన పాతకుండ; దు
ర్భరతరపాపతాపమున ప్రాణముపోవఁగనున్న నాకు
నీచరణసరోజ మూఁతఁగనొసంగి క్షమించి యనుగ్రహింపవే?

ఉ. పాపము లెన్ని చేసినఁ గృపాపరిపూర్ణుఁడవై క్షమించి ని
ష్పాపులఁ జేసి ప్రోచెదవు భక్తగణంబుల నీవు; క్రూరుఁడన్
పాపిని నీవెదిక్కని ధ్రువంబుగ నమ్మెదఁ బ్రోవరావె! సం
తాపమడంపవే! యభయదానము సేయవె! భక్తపోషణా!

ఉ. నీయెడ ద్రోహులైన యవినీతులనేనిఁ బరిత్యజించితే?
వాయసరావణానుజులఁ బాలన సేయవె? వాలికంటె నే
నే యధముండనైతినె? మహీసురవంశ్యుఁడఁ గానె? దిక్కునీ
వే యని నమ్మియుంటి నను నేగతిఁ దేల్చెదొ భక్తవత్సలా!

ఉ. ఏలిన నేలకున్న మఱియెట్లొనరించిన నీటముంచినన్
పాలను ముంచినన్ గతి భవత్పదపంకజయుగ్మమే యటం
చాలిని బిడ్డలన్ విడిచి యల్ల హిమాద్రికి నేగి యందర
ణ్యాళిఁ దపంబు సేసి చరితార్థుఁడ నయ్యెద దీనబాంధవా!



# ఆంధ్రమునకు ఆది

విద్వాన్ గరిమెళ్ల సోమన్నగారు, యం. ఏ., యల్. టి.

తెలుఁగు సంస్కృతప్రాకృతముల వికృతి యని సన్న యాదులు తెలిపిరి.

శ్లో. ఆద్యప్రకృతిః ప్రకృతి శ్చాద్యే
ఏషా తయో ర్భవే ద్వికృతిః— నన్నయభట్టీయము.

ద్రావిడభాషలను విమర్శించిన కాల్‌డ్వెలు లోనగు పాశ్చాత్యపండితులు ఈభాషలు సిథియను భాషాకుటుంబ మునకు చేరినవని నిరూపించిరి. అరవముయొక్కయు, కన్నడముయొక్కయు ప్రాచీనవైయాకరణులు ఆయాభాషలు సంస్కృతప్రాకృతజన్యము లని నుడివిరి. వాస్తవము అతిసందిగ్ధ మయి యున్నది.


వ్యాసకర్త

ఆంధ్ర మనుపదము వేదములోను, పురాణములలోను, కావ్యములలోను, వైదేశికులవ్రాఁతలలోను ఉదాహరింపఁబడెను. ఈ పదము ప్రత్యేకభాషకు నామముగఁగూడ నుండెనేమో తెలియదు. మగధదేశముభాష మాగధి యనునటులే ఆంధ్రదేశపు భాషయు ఆంధ్ర మనఁ జెల్లవచ్చును.

కాల్‌డ్వెలు తన ద్రావిడవ్యాకరణములో ద్రావిడ భాషలకును సంస్కృతమునకును సర్వనామసంఖ్యాప దాదులలో చాలవ్యత్యాస మున్నందున వీనికి జన్యజనక సంబంధము గాని, సహజన్మసంబంధము గాని ఉండదనో దనిరి. ఈ వాదమునందు కొంతబలము గలదు; కాని ద్రావిడభాషలు సిథియను భాషలలోనివి యనుటకు కాల్‌డ్వెలు చెప్పినయుక్తులు బలముగ లేవు. కాని అతనియూహను ఇటీవలి చరిత్రపరిశోధనము బలపఱుచుచున్నది.

మూఁడవశతాబ్దినుండి తొమ్మిదవ శతాబ్దివఱకు దక్షిణదేశమును పల్లవులు పరిపాలించి రని స్థిరపడినది గదా! ఈపల్లవులు సిథియను లని తెలియవచ్చును. మన ద్రావిడభాషలలోని సిథియను పదప్రత్యయాదులు ఈపల్లవరాజులనాఁడు సంక్రమించియుండునా? కాల్‌డ్వెలునకు పల్లవరాజ్యవృత్తాంతము తెలిసినది కాదు.

ఇపుడు మనము మనభాష యుత్పత్తిని ఇంచుక ప్రశంసింపఁ గలము. తెలుఁగును ఇతరద్రావిడభాషలును పైశాచికభాషా వికృతు లని మనవా రందురు.

శ్రీమద్రామాయణకాలమున సంస్కృతము దక్షిణదేశమున వ్యాపకములో నుండెనని అందలి పేళ్లవలన తెలియును. గోదావరి, కృష్ణ, సుగ్రీవ, కుంభకర్ణ, విభీషణ, మండోదర్యాదిపదములు సంస్కృతము లంకవఱకు వ్యాపించెనని నిర్ధారణచేయును. ఇవి యన్నియు వాల్మీకికల్పితము లను వారితో మనకు ప్రసక్తి లేదు. ఇట్టి పదములు ద్రావిడపదము లయ్యును సంస్కృతములోనికి చొచ్చి తమ పూర్వవృత్తాంతమును పోఁగొట్టుకొనె నని ఇటీవల కొన్నిసిద్ధాంతములు బయలు వెడలుచున్నవి. ఈ నూతన కల్పనలను మనము ఇపుడు గమనింప నవసరము లేదు.

'ఇల్వల స్సంస్కృతం వదన్' అని దాక్షిణాత్య రాక్షసుడు వర్ణింపఁబడెను. హనుమంతుని మాటలు విని శ్రీరాముడు అతనిని గుఱించి ఇట్లు చెప్పెను:

'నానృగ్వేదవినీతస్య నాయజుర్వేద ధారిణః;
నాసామవేదవిదుషః శక్య మేవం ప్రభాషితుమ్.
నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతమ్;
బహువ్యాహరతానేన న కించి దపశబ్దితమ్.'

దీనివలన హనుమంతుని సంస్కృత పాండిత్యము అపారమని తెలియనగును. సంస్కృతము వెంబడినుండునది ప్రాకృతము గదా! రామాయణకాలములో సంస్కృత ప్రాకృతములు దక్షిణమున వాడుకలో నుండెనని మన మూహింపవలయును. కాళిదాసాదులు నాగపురపాండ్య రాజాదుల వర్ణించిరి. ఇందుమతీస్వయంవరమునకు వీరు వచ్చినపుడు సామాన్యభాష సంస్కృతమయియుండును.

అశోకుని ధర్మశాసనములు పాళిభాషలోనున్నవి. ఈభాష సంస్కృత ప్రాకృతములకు సంబంధించినది. ఈ భాష దక్షిణదేశమందునను ఆనాఁడు తెలిసియుండును. కానిచో మస్కి-సిద్దాపురము, జౌగడ మున్నగు దక్షిణ పురములయందు ఈభాషలో శిలాశాసనములు ఏల పుట్టును?

పల్లవులనాఁటి మైదవోలు హిరహడగల్లి శాసనములును, చారుదేవి శాసనములును ప్రాకృతములోనివి. ఇవి రమారమి నాల్గవశతాబ్దిలోనివి.

ఈకాలమున ప్రాకృత సంస్కృతములు దాక్షిణాత్యులకు తెలియనివి గావు.

ఇటుపై శాసనములు సంస్కృతములును, ఆంధ్రములును అయియున్నవి. నాల్గవశతాబ్దిలోని సముద్రగుప్త జయస్తంభమున ఎలమంచిలి మున్నగు స్థలములు పేర్కొనఁబడెను.

మనభాష పదసామగ్రిని బరిశీలింప మొదటి నుండియు నిది సంస్కృతప్రాకృతములపై నాధారపడి నట్లు తోఁచును. అమ్మ, అయ్య, నాయన, అక్క, బాబు తాత, మామ, నీరు, అగ్గి, కొండ, భూమి, సముద్రము, సూర్యుఁడు, దీపము, పెట్టె, కుండ, మంచము, కుంచము, బట్ట, వాణి, చీర మున్నగుమాటలు మధ్యను తెచ్చిపెట్టుకొన్నవై యుండవు. అమరావతి, ప్రతిష్ఠానపురము గోదావరి లోనగు పదములు ప్రాచీనమయినవి. నిత్యవ్యవహారములోనుండు వేలకొలఁది మాటలు సంస్కృతసంబంధము గలవి. నెయ్యి, నూనె, తాటి, ఆముదము, ఈత, చింత, మల్లె, కలువ, గారె, బూరె, జంతిక, పాలు, అప్పడము, సున్నము, బియ్యము, మెంతి, కంద, పెండలము, కాకర మున్నగుమాటలు సంస్కృతమునకు చేరినవి. గద్ద, రాంబందు, తీతువ్వ, కోవెల, పావురము, కుక్క, గాడిద మున్నగు జంతునామములు ఆర్యభాషకు చేరువ యగునవి.

తెలకలికి తిలలతో సంబంధము; కమసాలి కర్మశాలి; మంగలి మంగళవాద్య సంపాదకుఁడు; కంచరి కాంస్యకారుఁడు; కోమటి గోమటుఁడు; మాదిగ మాతంగుఁడు; గొల్ల గోకులుఁడు; చాకలి క్షాళకుఁడు, లేక క్షారకుఁడు; గోడ, బావి, పల్లె, ఊరు, వాడ, అడవి మున్నగుమాటలు తెనుఁగునకును సంస్కృతమునకును తొలినుండియుఁగల బంధుత్వమును దెలుపును.

ఇట్లు తెలుఁగు సంస్కృతప్రాకృతజన్యముగ కనఁబడును. నేను, నీవు, చెట్టు, పుట్ట, ఆయి, గోయి, తిను, కొను మున్నగుపదములు విలక్షణముగ నున్నవి. ఇట్టివి పల్లవులనాఁడు భాషలో చేరియుండవచ్చును. ఈ మహావిషయములు పరిశోధింపవలసియున్నవి. మన యూనివర్సిటీలు రెండును ఈ గొప్ప సమస్యను విమర్శింపవలెను. 'ప్రవాహినీదేశ్యా' అనిమాత్రము వైయాకరణులు శుద్ధాంధ్రమును గుఱించి చెప్పిరి. బంగాళీ, గుజరాతీ లోనగు భాషలవలెనె ఆంధ్రద్రావిడభాషలును సంస్కృత వికృతులై యుండును. పాళీభాషవలెనే కొన్ని విశేషములిందుఁ గలవు. విజ్ఞులు ఈవిచారమును బూనుదురుగాక!

---

# సుదాముని పుష్పసేవ

బల్లారి కృష్ణప్పగారు



వ్యాసకర్త

శ్రీవైకుంఠపురంబుకన్న ఘనమే వ్రేపల్లె? గోపాంగనల్
సేవల్ సేయఁగ నిందిరన్ మిగిలిరే? సేవించి పూజింప భూ
దేవశ్రేష్ఠులె గోపకుల్? వనములన్ దివ్యత్స్వరూపంబుతో
గోవత్సంబుల నేల మేపవలసెన్ గోపాలచూడామణీ!

సీ. పంటవెలందికిఁ బరమహర్షముఁ గూర్ప శృంగారమూర్తివై చెలఁగినావొ?
సురమౌని వీణకు సొంపులు నింపంగ మురళి హస్తంబునఁ బూనినావొ?
ఆకాశలక్ష్మికి నానందమొనరింప వ్యాళంబుపై నాట్యమాడినావొ?
మూఁడులోకములకు ముచ్చటఁగావింపఁ జెలులతో రాసంబు సలిపినావొ?
తెలియఁ జిత్రంబు నీమాయ దివ్యకాయ, కనకమయచేల, సంతతగానలోల!
పావనుఁడనైతి నానోము పండె నేఁడు; పూజలొనరింతు నర్పింతుఁ బూలసరులు.

సీ. పొగడమైతిమిగదా పుణ్యముల్ ఫలియింప విశ్వంభరార్చితు విశ్వవినుతుఁ
గోరమైతిమిగదా కోర్కులు దనియంగ సేవితామరపాదు శ్రీవినోదుఁ
జేరమైతిమిగదా చెలువు ధన్యతనొందఁ ద్రిజగమోహనవేషు దివ్యభాషుఁ
గానమైతిమిగదా కనుగవ వెతదీఱ వైనతేయతురంగు వారిదాంగు
ననుచు మదియందు గోపిక లనవరతముఁ దలఁచువాఁడవు నీవెకా ధన్యచరిత!
దివ్యచారిత్ర, దేవకీదేవిపుత్ర! దండమిడెదఁ గొనుము పూదండలెల్ల.

ఉ. మంచిది కాదటంచు ననుమానము నొందవు గొప్పదంచు మే
లెంచవు పద్మజాండమున కీశుఁడ వాద్యుఁడ వయ్యు, నీవు; నిన్
గాంచిన తల్లికంటెఁ గుతుకంబునఁ బెంచిన మాతకంటె లా
లించి విషంబు నీకిడిన లేమకు ముందుగ మోక్షమియ్యవే!

మ. ఫలమో, పుష్పమొ, గంధమో, తులసియో, పానీయమో, శాకమో,
కలమాన్నంబో, ఘృతంబో, పాలో, పెరుగో, కర్పూరతాంబూలమో,
సులభంబైన పదార్థ మెట్టిదయినన్ శుద్ధాత్ములై ప్రీతి నిన్
గొలువన్ దెచ్చినవారు ధన్యులుగదా గోపాల బాలాగ్రణీ!

మ. అరుదై, సద్గుణపుంజమై, శుభదమై, యానందమై, దివ్యమై,
స్థిరమై, వెల్గెడు నీస్వరూపము సదా సేవింపఁ జెల్వంబు లొ
విరులున్ లెన్నఁగఁ గూర్చినట్టి సరులున్ వేళావిశేషంబుచేఁ
దిరమై యున్నవి దాల్పవే ననుఁ గృపా దృష్టిన్ విలోకింపవే
వర పీతాంబరధారి! శౌరి! త్రిజగత్స్వామీ! ప్రభూ! శ్రీహరీ!

సీ. సరియనఁ జెల్లునే చంద్రికావిభవంబు పరమమంగళమైన వదనమునకుఁ
బరు డీడఁబోలునే పుండరీకములను గరుణామృతముచిల్కు కన్నుగవకుఁ
బోలుపవచ్చునే నీలమేఘచ్ఛాయ దివ్యమై వెలుఁగొందు దేహమునకు
దొర యన నొప్పునే వరపల్లవంబులఁ బద్మజాదులనేలు పాదములకుఁ
గాలచక్రంబు తిరిగిన కానరాక-నమసిపోయెడునవి నీకు సామ్యమగునె?
పూవులననెంత నేనెంత పుణ్యపురుష,-నిరుపమాకార, వైకుంఠ పురవిహార!

సీ. 'శ్రీహరీ' యని పిల్చి శిరమునుమూర్కొని తిలకంబు నొదుట నే దిద్దనైతి
'నచ్యుతా' యని చీరి యలకలు సవరించి పట్టుపుట్టంబులు గట్టనైతిఁ
'జిన్నికృష్ణా' యని చెక్కులుముద్దాడి ప్రీతిగా నన్నంబుఁ బెట్టనైతి
'బుడుత' రారమ్మని బొజ్జను నిమురుచు సొమ్ములం బెట్టి నేఁ జూడనైతి
ననుచుఁ జెఱయందు నీలీలలను దలంచి-వనటఁ గుందెడుఁ దల్లిని మనుపవయ్య!
కంసు విదళించి తాతను గావవయ్య!-పుష్పమాలలు ధరియించి పోగవయ్య!

క. మిక్కిలి చక్కని దండలు - నక్కఱపడి కుచ్చినాఁడ హర్షముతో నీ
చొక్కపుగళమునఁ దాల్పవె - మ్రొక్కెద నే రోహిణేయ! మోహనకాయా!

ఉ. కొల్చెద రోహిణీసుతునిఁ గొల్చెద జిష్ణునిఁ జిన్నికృష్ణునిన్
గొల్చెద నచ్యుతాగ్రజునిఁ గొల్చెద నందకుమారరత్నమున్
గొల్చెద నీలచేలధరుఁ గొల్చెదఁ గాంచనచేలు ముక్తికై
కొల్చెద రామకృష్ణులను గొల్చెద శుభ్ర వినీల కాయులన్.

---



# రేఫ అకారములు మైత్రింబొరయునా?

విద్వాన్ తాళ్లూరి రాఘవయ్యచౌదరిగారు

"నన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్" అను సూత్రముచేఁ జింతామణి యతిప్రాసములు రెంటియందును "రేఫ అకారములు మైత్రిం బొరయ"వని స్పష్టపఱుచుచున్నది. "యవలలు లఘ్వలఘువులు మైత్రింబొరయు; రేఫంబులు పొరయవు" అను సూత్రముంబట్టి బాలవ్యాకరణమతమం దును లఘ్వలఘు రేఫంబులకు మైత్రి లేదని తెలియుచున్నది.



వ్యాసకర్త

"కశ్చి ద్వదతి సాంగత్యం
యతావేవానయో స్తథా;
అపర చ్చాత్ర సాంగత్యం
ప్రాసేప్యపి చ కశ్చన."

అని యథర్వణాచార్యు లొకఁడు యతివిషయమున రేఫ అకారములకు మైత్రి సంగీకరించుచున్నాఁడనియు, మఱి యొకఁడు ప్రాసవిషయమున మైత్రి నొప్పుకొనుచున్నాఁడనియుఁ బరమతమును స్పష్టపఱిచి,

క. గ్రక్కునఁ జని వ్రాలుదునో
తెక్కలు గట్టుకొని దేవరిపుమేషపయిన్.
—ప్రభా. ప్ర.

క. పురసతుల విలోకనములు
సరసాలాపములు నర్మసంభోగంబుల్
మఱగి హరి మనల నొల్లఁడు
నరవరు లోయమ్మ! నూతనప్రియులు గదే.
—భాగవతము.

అను పద్యముల యతిప్రాసములకుఁ గ్రమముగా నుదాహరణంబులుగా నొసంగి,—

"అనయో స్సంగతిం యస్తు కరోతి కవితాకృతౌ;
అస్యా అత్యంతదోషత్వా ద్దుష్కవి స్సహి కథ్యతే"

అని రేఫఅకారములమైత్రిని, దాని నంగీకరించిన కవిని మిగుల గర్హించియున్నారు.

కావ్యాలంకార చూడామణియందు,—

క. లర మఱవ లేకతరవళు
లరయఁగఁ దమతమకె కవులయనుమతి
నరగుఁ బదాంత ముకారము [వళులై
పొరి నూదిన దూరి చనినఁ బుఘుబుభువు
[లగున్.

అనుదానిచే రేఫఅకారములకు మైత్రి నిరాకరింపఁబడినది.

క. ధర ఱ ఞ లను నీ రెండ
క్షరములు విన్నయది లేదు శబ్దము మొదలన్
మరఅలవము లను నేన
క్షరములు తమతమకె వళ్లు కమలాధీశా!

అనుపద్యముచేఁ గవిజనాశ్రయమున లఘ్వలఘు రేఫములకు మైత్రి నిషేధింపఁబడినది.

అనంతుఁడును,

క. ధర నెక్కటివళులై తగు
లరమఱవలు దానితోఁ దొలంగక లాకు
న్నరి శా యని విశ్రమ వే
శ రమాధిప, రెండునుం గలసి వర్తించున్.

అని పై రెండింటి సాజాత్యమును నిరాకరించెను. విపులముగాఁ జర్చింపఁ బూనుకొనిన యప్పకవియు,

తే. మహిని రేఫాక్షరంబును మఱి శతాంగ
నామక అకారమును సవర్ణంబు లయ్యుఁ
గావ్యములయందు నొకటికొకటి గలయక
తమకుఁ దామమె యగు నేకతరయతులన.

తే. కబ్బములు రేఫమునకు అకారమునకు
మైత్రి గలుగమిఁ గవిశిఖామణులు ప్రాస
వైర మనుచును గలపరు వానినెందుఁ
గూర్తు రారెండు నెఱుఁగక కుకవి జనులు.

అనువానిచే యతిప్రాసవిషయమై రేఫఅకారమైత్రి నిషేధించెను. కవిసార్వభౌమ బిరుదాంకితుం డగు కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున,

గీ. అరయ గురు రేఫ హల్లుతోఁ బెరసినపుడు
ప్రాసముల విశ్రమముల రేఫంబుతోడఁ
గలసి యుండును సుకవి పుంగవుల కృతుల
జగదవనసూత్ర గిరితనుజా కళత్ర!

అనుదానిచే యతిప్రాసముల రేఫఅకారములకు మైత్రి సంగీకరించినటులు తెలియుచున్నది. పై చర్చవలన రేఫ అకారమేళన విషయమై మతద్వయ మున్నటులు స్పష్టమగుచున్నది; కాని యందేది సమంజసమో యించుక విచారించి చూతము:

యతి విషయమున ముద్విధము లగు మార్గములాంధ్రకవులచే నంగీకరింపఁబడి లక్షణకర్తల సమ్మతివడసినటులు తెలియుచున్నది. (1) వ్యాకరణసిద్ధవర్ణ సాజాత్యము—ఉదా. క—గ. చ—జ. (2) తద్భవప్రక్రియను కల్పింపఁబడిన వర్ణసాజాత్యము—ఉదా. జ్ఞ—ణ—న. (3) ఉచ్చారణమునుబట్టి కల్పింపఁబడిన వర్ణ సాజాత్యము—ఉదా. జ్ఞ—గ. జ్ఞాపకము, గాపకము. యజ్ఞము, యగ్గెము. పైఁ జేర్కొనఁబడిన వర్ణసాజాత్యములలో నుచ్చారణమునుబట్టి కైకొనఁబడిన జ్ఞ, గ లకుఁగల యుచ్చారణము యొక్క సాన్నిధ్యముకంటె రేఫ అకారములకు నుండు నుచ్చారణ సాజాత్యమే మిగుల సన్నిహితమని నిరాఘాటముగా నిరూపింపవచ్చును.

మఱియు జ్ఞకారము, కవర్గప్రథమాక్షరంబులు నాల్గింటితో యతిచెందునపుడు, లకారము డకారముతో, డకారము ళకారముతో, ళకారము లకారముతో యతి చెల్లునపుడును, వకారము ప, ఫ, బ, భలతో యతిమైత్రి మెలఁగునపుడును, రేఫము అకారముతో యతి చెందకుండుట నిరాధారంబ కాక యాధారం బెద్దియైన కలదా? ఇదంతయు లక్షణకర్తల నిరంకుశసాహసచర్య తక్క వేఱు కారణము నాకుఁ దోఁచకున్నయది.

రేఫఅకారము లుచ్చారణములో మిగుల సన్నిహితములై యుండి మైత్రిఁ బొంద నర్హములై యుండినను, మహాకవి ప్రయోగములందు వానిమైత్రి నిరాకరింపఁబడుటంబట్టి యట్టిమైత్రి యంగీకరింపఁబడ దయ్యెనని చెప్పవలసిన నట్టి మహాకవి ప్రయోగములే మన సంశయచ్ఛేదము గావించి రేఫఅకారమైత్రి సాధుత్వమును జాటుచున్నవి. ఈక్రిందివానిని గమనింపుఁడు:

ఉ. నూఱ్వురు నొక్కచందమున
నొగతి సైరణచేసి నన్ను నా
సర్వకులంబు నుత్తమయ
శంబున నుంచితి రమ్మలార! మీ
కుర్విని సాటియేయబల?
లొండొక దేవతలుక్ బటుక్షమా
నిర్వహణం బొనర్చుటకు
నేరరు మర్త్యులఁ జెప్ప నేటికిన్?
—ఎఱ్ఱాప్రగడ రామాయణము

క. కాఱ్చిచ్చు గవిసి మృగముల
నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేఁచినకడిమిన్
బేర్చి మన సేనఁ బొదివె శ
రార్చుల నవ్వీరుఁ గన్నులారం గంటే!
—భీష్మపర్వము.

క. చెలఁగి పటుసింహనాదం
బులు అంకెలు గాఁగ వారు వొలిచిరి వృషభం
బుల క్రియ నొండొరులకు మా
ఱ్మలయుచుఁ దాఁకుచు నుదాత్తరభసోజ్జ్వలులై.
—ద్రోణపర్వము.

## ASYLUM FOR CHRONIC PATIENTS.

# ఆరోగ్యమే భాగ్యము

మీ అనారోగ్యము గుణపడవలయునని కోరిన తక్షణమే యీ క్రింది చిరునామాకు
మీ దేహతత్త్వ వివరములను వ్రాయుము.

## ఆంధ్ర ఆయుర్వేద వైద్యశాల, లిమిటెడ్ (బ్రాడ్వే బ్రాంచి.)

159 బ్రాడ్వే, మద్రాసు.

వైద్యపతి కోటా జయరామ నాయుడుగారు స్థానిక చికిత్సకులుగా నియమింపబడి వారివలన
అనేక పురాణవ్యాధిగ్రస్థులు స్వస్థపరుపబడి లెక్కలేని యోగ్యతాపత్రములు పొందబడియున్నవి.

ఇదియు

డాక్టరు ఆ. లక్ష్మీపతి B. A. M. B. C. M. భిషగ్రత్న, ప్రాణాచార్యులువారివల్ల స్థాపింపబడిన

## దీర్ఘవ్యాధిగ్రస్థుల ఆశ్రమము

| | | | | |
|---|---|---|---|---|
| (ఆస్త్మాస్పెసిఫిక్) శ్వాసకాసహరము 25 దినములకు | | | రూ. | 8-0-0 |
| ,, | ,, 10 | ,, | ,, | 4-0-0 |
| సంధివటి (వాతునొప్పిమాత్రలు) 25 మాత్రలు | | | ,, | 2-0-0 |
| సిద్ధమకరధ్వజము (సువర్ణసిద్ధరసాయనము) 25 | | ,, | ,, | 5-0-0 |
| చవనప్రాశలేహ్యము (ఆయుర్వేద టానిక్ రసాయనము) 1 పౌ డబ్బి | | | ,, | 3-0-0 |
| ,, | ,, | ¼ ,, ,, | ,, | 1-0-0 |

కొన్ని ప్రశంసాపత్రములను యీక్రింద చూడుము.

### Asthma of three years old Cured.

మ-రా-రా-శ్రీ. ఎమ్. వెంకట్రామయ్యగారు పార్టనరు మెసర్సు డి. ఎన్. అండుకో వేరు సెనగవ్యాపారస్థులు, మదనపల్లె రోడ్డు, చిత్తూరుజిల్లానుండి 16-8-26 తేదీన వ్రాసినది:—

నా బావమరిది సుబ్బన్న గత 3 సంవత్సరములనుండి వేసవి శీతకాలములందు ఉబ్బసముచే మిక్కిలి శ్రమపడుచుండెను. మేము అతనికి అనేక ఆంగ్లవైద్యులవద్ద చికిత్సచేయించితిమి. పేటెంటు ఔషధములనుకూడ యిప్పించితిమి. తుదకు వైద్యపతి కోటా జయరామనాయుడుగారి చికిత్సలో నుంచితిమి. 2 మాసములు వారి ఆస్త్మాస్పెసిఫిక్ ఔషధమును సేవించినంతనే వ్యాధి పూర్తిగా కుదిరినది.

### Asthma of 3 years Old.

మిస్టరు వి. ఆర్. జోసెఫ్, మలెరబ్బరుప్లాంటర్సు లిమిటెడ్, ఫీల్డుస్టేషను, లాహాట్, పెరక్, ఎఫ్. ఎమ్. ఎస్. నుండి 17-6-26 తేదీన వ్రాసినది:—

గడచిన 13 సంవత్సరములనుండి నేను ఉబ్బసవ్యాధిచే బాధపడుచుంటిని. అనేకచోట్లనుండి ఔషధములను తెప్పించి సేవించియు వృధాఅయినది. ఆ ఆ. ఫార్మసీ బ్రాడ్వే బ్రాంచిలోయున్న వైద్యపతి డాక్టరు కోటా జయరామ నాయుడుగారివద్ద చికిత్సను ప్రారంభించిన రెండునెలలోనే వ్యాధి పూర్ణముగ వదలినది. నాకు నూతనజీవము గలిగినది. వారు ఆస్త్మాస్పెసిఫిక్ నే వాడించిరి.

### Bronchitis Cured Wonderfully.

మ-రా-రా-శ్రీ. ఎం. పార్థసారథిపిళ్లె అవరిగల్, ఫోర్మన్, గవర్నమెంటు ప్రెస్సు, మదరాసు వ్రాసినది:—

గడచిన సంవత్సరమునుండి నాకు దగ్గు ఒగర్పు యుండినది. కొందరు దానిని ఉబ్బసవ్యాధని తెలిపినందున నాకు చెడు భయము గలిగినది. గనుక నేను ఆయుర్వేద వైద్యులవద్దను యితరులవద్దను ఔషధములను సేవచేయు కొన్ని రోజులవరకు మాత్రమే గుణముగా నుండినదిగాని పూర్ణగుణము కలుగలేదు. పిమ్మట నామిత్రులలో నొకరు వైద్యపతి కోటా జయరామ నాయుడు డాక్టరుగారితో పరిచయము గలిగించిరి. వారిచ్చిన ఆస్త్మాస్పెసిఫిక్ ను సేవించినందున పూర్తిగా గుణము గలిగినది.

### Chronic Eczema Cured.

మ-రా-రా-శ్రీ. టి. ఎచ్. ఎం. పద్మనాభయ్యగారు M. A. B. L., వకీలు బళ్లారినుండి వ్రాసినది:—

విడువక నన్ను 6 సం॥ లనుంచి బాధించుచుండిన మేహకారపు పొడలు డా॥ వైద్యపతి కోటా జయరామ నాయుడుగారి చికిత్సవలన 20 దినములలో పూర్తిగా స్వస్థమయ్యెను. నాకంతటి త్వరితముగా గుణము కలుగజేసినందుకు వారికిమిక్కిలి కృతజ్ఞుడను.

ఇతర కొన్ని యోగ్యతాపత్రములు కేటలాగు చూచిన విశదపడును. కోరిన ఉచితముగా పంపబడును.

ఓమ్

# శ్రీగౌతమీ గోరక్షణ శరణాలయము

## రాజమహేంద్రవరము

గోవధ కమేళా | శ్రీకృష్ణ గోపాల్ | కసాయికి రైతుగోవిక్రయము



గుప్తాగారు | గోరక్షణతోట, బిల్డింగులు.



దేవరపల్లి వెంకటనరసింహగుప్త,
ప్రధానకార్యదర్శి, రాజమహేంద్రవరము

గొప్ప సత్పాత్రత
జీవన్ముక్తి

మంచితెరుణము
కైవల్యప్రాప్తి

## దయాంతరంగహృదయు లగు మహాశయులారా!

పావనమగు గోరక్షణ గావింప

రాజమహేంద్రవరమున, శ్రీ గౌతమీ గోరక్షణ శరణాలయము ప్రతిష్ఠించినారము. దీనియందు, బక్కలై చిక్కి స్రుక్కియున్న వేనవేలు బీదగోవృషభములను కాపాడి రక్షించి, అపరద్వాపరగోకుల మనునట్లు ప్రసిద్ధినందింప ప్రయత్నించుచున్నారము. పవిత్రమగు నీయుద్యమమునకు లక్షాదిద్రవ్య మత్యావశ్యకమై యున్నది గాన, దాతలగు సత్పురుషు లీసత్పాత్రమునకు భూరివిరాళములు, వర్షాశనములు, చందాలు మున్నగు దానధర్మము లొసగి, తరగతివారి సంఘసభ్యత వహింపుడని సోదరీ సోదరులను ప్రార్థించుచున్నారము. ఈ యుద్యమమునందు 30 మంది గొప్ప విద్యావిభవసంపన్నాధికారు లగు సత్పురుషులు కట్టుదిట్టములగు చట్టనిబంధన లేర్పరచి కార్యనిర్వాహకవర్గ సంఘసభ్యత వహించి శ్రీ గవర్నమెంటులో సొసైటీ రిజిస్టరు గావించియున్నారు.

ఇట్లు
శ్రీ గౌతమీగోరక్షణ ప్రధానకార్యదర్శి,
దేవరపల్లి వెంకటనరసింహగుప్త.

26—2—27 వ సంవత్సరము
రాజమహేంద్రవరము

# THE
# Bezwada Spinning & Weaving Mills Ld.,

## ది బెజవాడ స్పిన్నింగు అండ్ వీవింగు మిల్స్ లిమిటెడ్, బెజవాడ.

రిజిస్టర్డు ఆఫీసు:—మెయిను కెనాల్‌రోడ్డు, బెజవాడ.

మిల్లుకట్టడములు:—కృష్ణాకెనాలు స్టేషనుకు సమీపమున నియమింపబడిన మూలధనము:—

**20,00,000** రూపాయలు. వాటా 1-కి రు 20 లు చొప్పున **1,00,000** వాటాలు.

(1-2-1927) చందా మూలధనము:— రు **2,87,100-0-0**

(1-2-27) వసూలుఅయిన మూలధనము:— రు **2,54,417-0-0**

## దేశీయపరిశ్రమలను జయప్రదముగావించెడి భారము మీయదియే!!!

1926 సం॥ ఆగష్టు 30 వ తేదిన గవర్నరుగారగు గోషన్ ప్రభువుగారు యీ మిల్లును తెరచి వారి యభిప్రాయమును యీ క్రిందివిధమున దెలిపిరి:—

"యీవైపుల నున్నవారలకు లాభకారియైన యీమిల్లును తెరుచుటకు నాకు చాల ఆనందముగా నున్నది. యీమిల్లు విశాలముగను, ఆరోగ్యకరముగను, కడునేర్పుతోను కట్టబడియున్నది. యిట్టి మిల్లు ప్రత్తిపంటలకు కూడలియును, మంచినీటివసతి, రైలువసతిగల ప్రదేశమునందు కట్టబడియున్నది. ఇట్టిమిల్లు స్థిరస్థాయిగాను లాభకారిగాను వుండుగాక." "దస్కతు గోషెన్"

వచ్చేనెలనుంచి తప్పక అనుదినము నేతపని జరుగును. కనుక దేశీయులందరు తమ శక్త్యానుసారము యీమిల్లులో వాటాలు తీసికొని యిట్టిసంస్థను స్థిరస్థాయిగా నుండునట్లు చేయుదురు గాక.—

ఇతర విషయములు తెలిసికొనుటకు చిరునామా:—

గూడూరి లక్ష్మణరావు, బి. ఏ.,—మేనేజింగ్ ఏజంట్ అండ్ డైరక్టర్, బెజవాడ.

## The Bezwada Spinning and Weaving Mills Ltd.,




దీ బెజవాడ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్సు లిమిటెడ్, బెజవాడ.

మ. ఇలకు న్వ్రోఁగునఁ బందుదీర.........దీవుల
గ్గలమై వ్రాల.........రాట్నంపు గుం
డ్రలు నాఁ జేనకొలంకులం బొరలి పాఱన్......
........................
—ఆముక్తమాల్యద.

శా. జేవుల్ మావు మతంగిమంబు సుమాని
శ్రీఖండముక్తాళియున్.........

సీ. రేఖలై మీఁదట జేవ్రలై రయము వ
న్నాగంపు గనడల్లు బాగు నెఱస......
—కళాపూర్ణోదయము.

క. గ్రక్కునఁ జని వ్రాలుదునో
ఱెక్కలు గట్టుకొని దివిజరిపు మేడలకున్.
—ప్రభావతీప్రద్యుమ్నము.

ఉ. తూరుపు నెల్ల వాఱుటయుఁ
దోరణ మంగళపాఠకస్తుతుల్
మీఱఁ దదీయ రాగముల
మేల్కని కాల్యసముచితక్రియల్
దీర్చి పాండుపుత్ర వసు
దేవసుతుల్ ప్రమదంబు మోములం
దేఱఁగ వేడ్కతో సరుగు
దెంచి సభాస్థలి నిల్చి రయ్యెడన్.
—జైమినిభారతము.

గీ. వనధి సర్వంకషం బయ్యె వలయునదికి
చేవ్రులనకాని చొఱరాని రీతిఁ దనరి
విశ్వరూపకుఁడయ్యె శ్రీవిభుఁడు కూర్మ
రూపములు సేవ్యుఁడగు నాగుణత్రులకును.
—కవికర్ణరసాయనము.

క. పురసతుల వి.........
సరసాలాపములు.........
మఱిగి హరి.........
సరవరు లోయమ్మ.........

ఈపద్యము పోతనకృతమని కొందఱు, కాదని మఱికొంద ఱును వాదులాడుచుండిరి. ఎవ్వరి కృతమైన నిందు రేఫ అకారసాంకర్యము మాత్రము గాన్పించుచున్నది. ఇటు లింక నెందఱుమహాకవుల ప్రయోగములందో లఘ్వలఘు రేఫములమైత్రి మిక్కుటముగాఁ గాడగట్టుచున్నది. గ్రంథ విస్తరభీతిచే వానినన్నిటి నిట నుదాహరింప మానితి. ఇట్లు లక్ష్యభూతము లగు మహాకవిప్రయోగములందే రేఫ అకార సాంకర్యము గన్పడుచుండ నయ్యది సాధువని చెప్పుటకు సందియమేల?

లక్ష్యములంబట్టి తత్సంస్కారము కొఱకు లక్షణ ములు పుట్టుచున్నవిగాని లక్షణములంబట్టి లక్ష్యములు పుట్టుటలేదని యెల్ల తెఱింగినవిషయమే. అట్లు లక్ష్య సంస్కారముకొఱకు (రేఫఅకారమైత్రి కొఱకు) లక్షణము చెప్పకుండుటయే కాక యయ్యది దుష్టమని నుడువుట లక్షణకర్తల కెంతవఱకు సముంజసమో చదువరులే యూహింతురు గాక!

"ఆధర్వణః" అను నన్నయభట్టీయాచార్యను కృతి యూపరిచ్ఛేదము నంతను యతివిషయమున నతివిపుల ముగాఁ జర్చింపఁదలంచిన యప్పకవి—అట్టితతి స్వేచ్ఛ గైకొని, సాహసం బవలంబించి, ఉన్న ప్రయోగంబులఁ గొన్నిటిని మార్చి, లేనిప్రయోగంబులఁ గొన్నిటినిఁ గల్పించిన యప్పకవి—రేఫ అకారమైత్రి దుష్టమని వ్యాఖ్యానము చేసినాఁడు. అంతియేకాక రేఫఅకారమైత్రి చెప్పఁబడినదను నెపమున భక్తాగ్రేసరుఁడు, కవిశ్రేష్ఠుఁడు నగు పోతరాజుయొక్క భాగవతమునుగూడ నెట్లు బేరు పెట్టి నిరసింపసాహసించెనో చూడుఁడు :

"ఉ. బమ్మెర పోతరాజకృత
భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహి నేమిటం గొదువ
యెంతయు నారసి చూడఁగాను రే
ఫమ్ములు ఱాలునుం గలిసి
ప్రాసములైన కతంబున న్గదా
ఇమ్ముగ నాదిలాక్షణికు
లెల్లఱు మాని రుదాహరింపఁగన్."

రేఫఅకారమైత్రి దుష్టమని పలుకఁ గంకణముగట్టు కొనిన యప్పకవ్యాదిలాక్షణికులా నియమమును సక్ర

మముగాఁ బాటించిరేమో యొక్కసారి వారికృతులఁబరి శీలించి చూతము.

"అట్టడి కాకునూరి పెదరంగయ" అని యప్పకవి తనకృతిని రేఫఅకార మైత్రి నుడివియున్నాఁడు.

"భరతనగనలసలంబులు
వరుసనె యిరువ్యారునెన్న వానవగణముల్
మఱి నహము లినగణంబులు
సరవిం దక్కినవియెల్ల చంద్రగణంబుల్.

—కవిజనాశ్రయము-భీమకవి.

"శ్రేణులుగట్టి నభోంతరాళమునఁ బాతెంబఱులు..."

—మనుచరిత్రము-పెద్దన.

"నాన్యేషాం వైధర్మ్యం" అను చింతామణి సూత్రమునకుఁ డీకవ్రాయుచు రేఫఅకారములకు మైత్రి నునుపరాదని నుడివిన బాలసరస్వతి తన చంద్రికావరిణయమందు—

ఉ. అక్కమలేక్షణా......నాదు మూఱుగా
మ్రొక్కము........పల్కు మూర్తిచేఁ
జిక్కితి వేగఁ బ్రోవు మని........తేటిరాయ నీ
తెక్కల మాటున స్నను భరించి లభింపుము కీర్తి
[పుణ్యముల్.

అని రేఫఅకారములకు మైత్రి నిలిపినాఁడు. కావున మహాకవుల కేమి, లక్షణ కర్తల కేమి, రేఫ అకారములపట్ల సంతగాఁ బరిశీలన లేకపోవుటంబట్టియు, నించుక యత్నభేదముతక్క యుచ్చారణమున నెక్కువ భేదము లేకపోవుటంబట్టియు, లఘ్వలఘు రేఫములకు మైత్రి యొప్పుటయే యుక్తము.

—:o:—

## రాముఁడు - అతిమానుషము

పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు గారు



వ్యాసకర్త

అడిగెదనయ్య! నిన్నొ కొకయంశము రాముఁడవైనయప్డు, మ
ర్త్యుఁడ వనిపించుకోఁ దలఁపుతో నిజమంచును మాయలేడి వెం
బడిఁబడి ధర్మపత్ని నెడఁబాసి యెఱుంగవుకాని తద్గతిన్
గడుసరి! యెల్లెఱింగితి ఖగంబునకుం దయచేయ సద్గతిన్.

గీ. అరయఁదుదయోగపథము తిర్యక్కులంబు-విప్రహత మందులో నట్టివిహగమున కె
పలుకుచేతన, మోక్షమియ్యఁ దెలిసినావు- తెలియదారిని వెదకియుఁ దెలియవేల?

మ. సకుభృద్వర్గరసాతలంబుగ భళీ! సప్తావనీజంబు, సా
యకి మొక్కంటనె డుల్ల నేసితివి సత్యాఢ్యుండ వీవందులో
నొకదానిం విదళింపఁడయ్యు కపిచే నుడ్డాడుకోఁతిక్ సహా
యకుఁగా స్వీయసహాగవేషణకు నెట్లర్పించితో రాఘవా!

గీ. అవని మానుషముం జూప నవతరించి, యారా! అతిదేవమహిమతో నలరినావు
కపివరానీతశైలసంఘములచేతఁ, గడలి కెవ్వారు సేతువుఁ గట్టఁగలరు?

ఉ. వారిధిదాఁట, వయ్యసురవల్లభుఁ గెల్వవు, తద్బలాబలం
బారయ వొక్కయించుకయు, నప్పుడె తత్పదమందు నిర్మలా
చారు, నుదారునిన్, దదనుజన్ము విభీషణు సంశయింప కో
శ్రీరఘురామ! యెట్టు లభిషిక్తునిఁ జేసితివో వచింపుమా.

మ. అరరే! దక్షిణవార్ధితీరమున నీవట్లుండి దూరాంతరో
త్తరవారాశిమహాంతరీపమున దైత్యశ్రేణి నొక్కమ్ముచేఁ
బరలోకంబునఁ జేర్పవే? యటులె దేవా! యిందు నేయుండి నీ
శరతీవ్రార్చుల లంక నేమిటికి భస్మంబీవు కావింపవో?

ఉ. ఎంతమహాపరాధి యది యెంతయు డస్సిన నాలమందు వి
శ్రాంతిని జెంది రమ్మని ప్రసన్నతఁ బల్కితివంట; మేలు మే!
లెంతదయామయుండవయ! యీ గుణనామము దేమి? దీనికే
మంత? మెవండు దీని నహహా నుతియింపఁగలండు? రాఘవా!

చ. నరజననైకభూషణ మనఁగ దగునట్టి పరాక్రమంబుచేఁ
దరిచితి వంబుధిన్ దశరథక్షితిపాలుఁడు కొన్కఁ గాఁగ నా
సరసిజసంభవాదులయు సన్నుతిఁ గాంచితి వట్టిసీ వహో!
దురమున నింద్రజిత్తున కెదుర్కొనఁజాలవ దేమి; రాఘవా!

గీ. అయ్యో! రాఘవ, నీచరణాబ్జయుగము-గాంచుభాగ్యంబు నాకెప్డు గలుగునొక్కొ-
మించిపోయెనుగా దైవవంచితుండ-దనుల తాఁడులతో పాటి తరుణమద్ది.

గీ. ఇనకుల మనుగ్రహింప నీవిందుఁ బుట్టి-నీగుణౌఘంబు వర్ణించి నెగడినావు
దానఁనే చెట్లు నీ సన్నిధానమహిమఁ-బండె నీవిరహంబుచే నెండె రామ!

ఉ. కాన మొకింతయేని నధికారము ధర్మమొనర్ప యోగముల్
బూనఁగ జ్ఞానముల్ బడయ భూతలి నిట్టి తృణాదులన్ భవ
న్మానితపాదపంకజసమర్పణ ధన్యతమాంవనీభవా
న్యానవి శేషపుణ్యమున నొందఁగఁ జేయవె, ముక్తి రాఘవా!

ఉ. నీదగుసచ్చరిత్రమున నిచ్చలుఁ గ్రోలెడు వాయుపుత్త్రుఁడే
కాదని ముక్తిఁ గింపురుషఖండమునందున నేటికిన్ భవ
త్పాదగతాంతరంగుఁడయి పల్కును నీచరితంబెయెంచు నొం
డేదియు లేక డెందమున నీదృశముల్ కద, నీచరిత్రముల్!

ఉ. అంతిపురంబునందున మహాపకృతిన్ బొనరించి నిన్ను నొ
క్కింత నమస్కరింప క్షమియించితి కాకము రామచంద్ర! నీ
యంతరమట్టిదాటనె మహాకలుషాత్ములమయ్యు మేము నీ
యంతిక మేగుదెంచినభయం బెడలింతు వటంచు నమ్ముటల్.

---

# 3. గ్రంథవిమర్శనము



## మేఘసందేశము

దీపాల పిచ్చయ్యశాస్త్రి గారు

మహాకవి కాళిదాసరచిత మేఘసందేశము కవితాపదార్థ ప్రధానమయిన ఉత్తమకావ్యముగాని కేవల శబ్దాలంకార ప్రౌఢీప్రధానమయిన క్షుద్రకావ్యము కాదు. కావుననే అందు విసువు పుట్టించు ప్రతిపదశ్లేషలు, త్రాడువారిన యనవసరోత్ప్రేక్షలు, నిరర్థకయమకములు, నీరసశబ్దచిత్రములు నందునకైనను లేవు. కావ్యమంతయును రసార్ద్రములైన యలంతియలంతి లలితశబ్దములతోఁ గూడి, ఉదాత్తభావబంధురమై, ప్రకృతి సౌభాగ్యప్రదర్శనదక్షమయిన కల్పనాశిల్పమునఁ దీరి, మఱింత రమణీయమై పాఠకులహృదయము నాకర్షించుచున్నది. మఱింతయేల! మేఘకావ్యమును మనసారఁ జదివితిమేని—అక్కలు చెక్కలెండి శల్యమాత్రావశిష్టుఁడై రామగిర్యాశ్రమములయందు వందుచున్న యక్షుండును, చిత్రకూటమునుండి కైలాసమునకుఁ బోవుమార్గమునఁ గన్నుల పండువు సేయు రమ్యదృశ్యములును, అలకాపురములోని యక్షుని సుందరభవనమును, ఆభవనమున అంటలుగట్టిన తలకట్టుతో, ధూమలుజాఱిన కృశాంగములతో, కాటుకసోంపులేని కందోయితో, శయ్యాతలమున మూర్ఛితయై కొన ప్రాణములతోఁ బడియున్న యక్షరమణియు, కన్నులఁగట్టినట్లు పొడకట్టుచురమట అనుభవసిద్ధము కవితాశిల్పమన్న నిట్లుండవలదా! అసభ్యతాదోషపంకిలముగాని శృంగారరసవాహిని ఈకావ్యమున వెల్లివారినది. కావుననే పండితులు "మేఘసందేశము లోకములోని శృంగారప్రబంధ సర్వస్వమునకుఁ బ్రభవమైన యూటబుగ్గ"యని కొనియాడిరి.

ఈ కావ్యమునకుఁ దాను కుదుర్చుకొనిన చక్కనిసంవిధానమే తన నిరుపమప్రతిభావిశేషమును, భావనాశక్తిని వినియోగించి, ఇట్టి మనోహర కవితాప్రదర్శనమును గావించుటకు మహాకవికిఁ జాలినంత యవకాశ మొసఁగినది.

శృంగారకవనమునకు ఒరవడియు, కవితాశిల్పమున కాదర్శప్రాయమునునగు "సందేశము"ను మనసుపుట్టి పలుమాఱు పఠించితిని. కావ్య మామూలము సవిమర్శముగఁ జదువుకొలఁది నాకందందు సందేహములు తోఁచెను. అల్పజ్ఞుఁడనగు నేను సాహసించి వానిని దోషములనియే యెన్నుకొని మిన్నకున్నచో మహాకవియెడ నపచార మొనర్చుట యగునేమోయని జడిసి సహృదయులగు ప్రాజ్ఞులు వాని సాధుతాసాధుతలను నిర్ణయింతురను విశ్వాసముతో ఇక్కడ వెల్లడించుచున్నాను.

### I రాజహంసలు

శ్లో. "కర్తుంయచ్చ ప్రభవతి మహీముచ్ఛిలీంధ్రా మవంధ్యాం
తచ్ఛ్రుత్వా తే శ్రవణసుభగం గర్జితం మానసోత్కాః;
ఆకైలాసా ద్బిసకిసలయచ్ఛేదపాథేయవన్తః
సంపత్స్యన్తే నభసి భవతో రాజహంసాః సహాయాః." పూ. మే.11.

అనుశ్లోకము:—శ్రవణసుభగం తే గర్జితం శ్రుత్వా భవతః రాజహంసాః సహాయాః సంపత్స్యన్తే (చెవికింపయిన నీయుఱుమును వినఁగానే నీకు రాజహంసలు తోడిబాటసారులు కాఁగలవు.)

అని మహాకవి మేఘహంసములకు మైత్రిని గల్పించినాఁడు. మేఘహంసములకుఁ బరస్పరవిరోధము జగత్ప్రసిద్ధము. ఇందులకుఁ గవులనేకులు సాక్ష్యమిచ్చుచున్నారు.

#### 1. కంకంటి పాపరాజు

మ. కనిరాక్షమత్తగజోత్కరోత్కరజఘాతోత్కరోత్కటాంభఃకణా
ద్రినభఃప్రాంచితతారముల్, సురనదీ రంగత్తరంగాబ్జరం
గనటద్ధాత్రసురంగ సంఘఘనశంకా కృద్ధినీలాసుకే
తన దీవ్యద్రథఘోరముల్, దశముఖోద్యద్వాహినీవారముల్.

—ఉ. రా. ఆ-4.

ఆకాశగంగాతరంగముల నోలలాడుచున్న హంసములకు రావణుని రథములమీఁదనున్న నీలాంశుకేతనములు మేఘము లనుశంకను (భీతిని) గలిగించుచున్న వనెను.

#### 2. అయ్యలరాజు రామభద్రకవి

మ. స్థిరమైత్రిన్ దనవారిలోఁ గలయఁగన్ క్షీరంబులుండం బర
స్పరభేదం బొనరించునంచఁ గలహంసశ్రేణులం జండభీ
కరఘోషంబున ధిక్కరించి కడుఁ గిన్కన్ బోలె వర్షోపలో
త్కరపాతంబున బిట్టు పారనడచున్ గాలాభ్రసందర్భముల్.

—రా. ఆ-6.

ఈకవి మేఘహంసములకుఁ గల విరోధమును మిక్కిలి చక్కఁగా నుత్ప్రేక్షించి విస్పష్టముగాఁ జెప్పినాఁడు.

### 3. కూచిమంచి తిమ్మకవి

సీ. "పరమహంసలఁ బోవఁ దలఁచుమని ఘనుఁడు నా
  త్వడి భంగ మొందని వాహినీశుఁ"

డని భీమ్యకుని వర్ణించుచో పరమహంస శబ్దములకు శ్లేషకల్పించి హంసలకును మేఘమునకును గల విరోధమును వెల్లడించెను.

### 4. సంకుసాల నృసింహకవి

"హ......అపూర్వ నిర్వహితృహంస ఘనాఘన!" క. ర. ఆ-౫.

అని తనగురువును సంబోధించియు,

క. "నిర్భరగతిఁ గరకాసం, దర్భంబులు రాలెనంత ధరపై జలదా
  విర్భావ నగ్నహంసీ, గర్భస్రవ దండపిండ ఖండములనఁగన్."

—క. ర. ఆ-6.

అని వడగండ్ల నుత్ప్రేక్షించియు హంసమేఘములకుఁ గల ప్రబలవిరోధమును ప్రకటించెను.

### 5. శ్రీ కృష్ణదేవరాయలు

క. ఉఱుము విని యులుకకై దివి
  నెఱిఁ బఱను హంసపటలి విడిచినఁ బడు న
  క్కఱచిన బిసలవవిసరము
  తెఱఁగున వడగండ్లు ధవళదీధితి రాలెన్." ఆ. మా. ఆ-4.

అని వడగండ్లను వర్ణించుటయే కాక,

సీ. ..............................
  "అరిహంసపంసన ప్రాగమంబు."

అని యూశ్వర దేవరాయలను వర్ణించియు హంసమేఘవిరోధమును దెలిపెను.

మఱియు,

### 6. మహాకవి బాణుఁడు

తన కాదంబరీకావ్యమున:—

"ఉదపాదిన......నవజలధరరవ భయచకిత కలహంస
  కులకోలాహల కోమలో......ధూమఘనినాదః."

అను రచనమును గావించి మేఘహంసములకుఁ గల విరోధమును దెలిపియున్నాఁడు. వారివీరి సాక్ష్యము లేల? కాళిదాస మహాకవి యీ కావ్యముననే, యీ ప్రథమసర్గముననే యిరువదినాల్గవ శ్లోకమున

"కతిపయ దినస్థాయి హంసా దశార్ణాః"

(కొంచెము దినములే నిలిచియుండు హంసలుకల దశార్ణ దేశములు) అనగా దశార్ణ దేశములు తమకుఁ బ్రీతికరము లయినను హంసలు నీ (మేఘ) మూలముగా త్వరగా విడిచిపోవును.—అనురచనమును గావించియున్నాఁడు. "కతిపయ" శబ్దమునకు బ్ర. వేదము వేంకటరాయ శాస్త్రిలవారు.—"కొలఁదిదినములే ఉండుట మేఘమువలని ఉపద్రవముచేతను, తత్క్షణమే పోక కొలఁది దినములైనను ఉండుట వానికి ఆప్రదేశములు రమణీయము లగుటచేత మఱియు ఆదేశములోఁ బది దుర్గభూములుండుటచేత, మేఘుఁడు దుర్గభూములయందు సహజముగా నిలుచుటచేతను, అతనికి దశార్ణ దేశమును దక్షిణమునుండి ఉత్తరమునకు దాటుటకు కొలదిదినములుపట్టును. హంసలును అపుడనే మేఘుఁ డెక్కడనుపచ్చిన నక్కడనుండి ఉత్తరముగాఁ బోవుచుండును. అందుచే అవియుఁ గొలఁదిదినములకే కాని ఆదేశమును బొత్తిగా విడిచిపోవు...హంసలు పలాయనమగుట...వర్షాకాల స్వభావము." అని ప్రయోజనమును వ్రాసిరి. కవిరచనవలనను, వ్యాఖ్యాతృవివరణము వలనను మేఘహంసములకు గలవిరోధము నిరూఢమగుచుండఁగా,

"రాజహంసాస్సహాయాః సంపత్స్యంతే"

అనుట యెట్లు పొసఁగును? శ్రీశాస్త్రిలవారు "మేఘుఁడా! లోకుల చెవులకు ఇంపయిన నీయుఱుమును విని నీకు (రాజహంసలు) సహాయకులు... కృతజ్ఞతచేతను, స్నేహముచేతను వారే నీసాంగత్యమునుకోరి నీతో వత్తురు. నీవు వారిని ప్రార్థింపవలసినది లేదు" అని వసుప్రయోజన వివరణములను వ్రాయుట యెట్లు పొసంగును?

### 11 ఇంద్రధనుస్సు

"రత్నచ్ఛాయా వ్యతికర ఇవ ప్రేక్ష్య మేతత్పురస్తా
  ద్వల్మీకాగ్రా త్ప్రభవతి ధనుఃఖండ మాఖండలస్య
  యేన శ్యామం వపు రతితరాం కాన్తి మాపత్స్యతే తే
  బర్హేణేవ స్ఫురితరుచినా గోపవేషస్య విష్ణోః." పూ. మే. 15.

అను శ్లోకమున:—

రత్నచ్ఛాయా వ్యతికర ఇవ ప్రేక్ష్యం ఆఖండలస్య ధనుఃఖండం ఏతత్పురస్తాత్ వల్మీకాగ్రాత్ ప్రభవతి.

(ఓయి మేఘుఁడా! పద్మరాగమణి ప్రభలమూడికవలె దర్శనీయముగాఁ బ్రకాశించుచున్న ఇంద్రధనుఃఖండము ఇదిగో! నీయెదుటఁ బుట్టకొనుండి పుట్టుచున్నది.) అని చెప్పఁబడియున్నది.

ఇందలి 'పురస్తాత్' అనుపదమునకు శ్రీ శాస్త్రిలవారు "మేఘుఁడు పోవుమార్గమున—అనగా ఉత్తరమున ఎదుటనున్నది. (ఇంద్రధనుస్సు) అదటగాక మఱియేదిక్కున నున్నను అతనిదేహమునకు తగులదు. చెప్పఁబోవు సామ్యము చెల్లదు." అని ప్రయోజనమును వ్రాసిరి.

ఉత్తరదిక్కున ఇంద్రధనుస్సు గలుగుట సహజమగునా? లేక కవి తానుచెప్పఁబోవు సామ్యము నిర్వహించుకొనుటకుఁగాను ఉత్తరదిక్కున నున్నట్లు చెప్పెనా?

## III ప్రక్షిప్తములు

"తత్సందేశం జలధరవరో దివ్యవాచా చచక్షే
ప్రాణాం స్తస్యా జనహితరతో రక్షితుం యక్ష వధ్వాః,
ప్రాప్యోద న్తం ప్రముదితమనాః సాపి తస్థౌ స్వభర్తుః
కేషాం నస్యా దభిమతఫలా ప్రార్థనా హ్యుత్తమానామ్."
—ఉ. మే. 56.

"శ్రుత్వా వార్తాం జలదకథితాం తాం ధనేశో ఽపి సద్యః
శాపస్యాన్తం సదయహృదయః సన్విధా యాస్తకోపః;
సంయోజ్యై తౌ విగళితశుచౌ దంపతీ హృష్టచిత్తౌ
భోగా నిష్టా నభిమతసుఖాన్ ప్రాపయామాస భూయః."
—ఉ. మే. 57.

మేఘసందేశ కావ్యాంతమున గనుపట్టుచున్న పై రెండుశ్లోకములును కథాశరీరమునఁ గ్రొత్తగా మొలచిన ఎక్కువ అవయవముల (ఆఱవ వ్రేలి)వలె నిష్ప్రయోజకము లగుటయేకాక సౌందర్యభంగకరములు నగుచున్నవి. ఆవిషయ మించుక విపులముగా విమర్శింతము.

సందేశకావ్యమునఁ గల ఇతివృత్తమేమి? ప్రోషితుఁడగు నొక యక్షుఁడు, భార్యావియోగదుఃఖమున మతిచెదరి, చేతనాచేతన జ్ఞానములేక, అపుగాముల విచారింపక, ప్రియురాలికిఁ దన కుశలవార్త తెలుపవలసినదని మేఘునిఁ బ్రార్థించుట. ఇట్టిప్రార్థన మింకవింతగాదు. ఏమన, విరహవ్యాకులతచే నున్మత్తులయినవారు ప్రపంచమును మఱచి, తమకుఁగనఁబడు ప్రతివస్తువుతోడను మొఱవెట్టుకొనుటయు, సాయము చేయుమనికోరుటయు, వానితో సంభాషింపదొరఁకొనుటయు, వాని తూష్ణీంభావమును తమకనుకూలముగా సమర్థించుకొని తృప్తినందుటయు, కావ్యప్రపంచమున ఆచారముగా వచ్చుచున్నది. చూడుఁడు: శ్రీరామునంతటి మహాపురుషుఁడు తన ప్రియురాలింగానక కానల వదకుచు—

### (శ్రీమద్రామాయణము)

శ్లో. "అపి కాచి త్త్వయా దృష్టా సా కదంబప్రియా ప్రియా,
కదంబ, యదిజానీషే శంస సీతాం శుభాననామ్." 11.
అశోక, శోకాపనుద, శోకోప హతచేతసమ్
త్వన్నామానం కురు క్షిప్రం ప్రియా సందర్శనేన మామ్. 16.
శార్దూల, యది సా దృష్టా ప్రియా చంద్రనిభాననా,
మైథిలీ మమ విస్రబ్ధం కథయస్వ న తే భయమ్. 17.
కిం ధావసి ప్రియే, నూనం దృష్టాసి కమలేక్షణే,
వృక్షై రాచ్ఛాద్య చాత్మానం కిం మాం న ప్రతిభాషసే. 18.
[షష్టితమస్సర్గః.

శార్దూలాది మృగములనేకాక అశోకాది వృక్షములనుగూడ నా ప్రియురాలిని జూచితిరా యని ప్రశ్నించుచు వెఱ్ఱివానివలె వనవెల్లఁ గ్రుమ్మరెను. ఇట్లే భారతమున నలునింగానక దమయంతియు, భాగవతమున కృష్ణునింగానక గోపికలును చెట్టుచేమలను ప్రశ్నించిరి. మా ప్రియులను జూపుడని మఱియు మఱియుఁ బ్రార్థించిరి.

అట్లే యక్షుఁడును వలపు తలకెక్కి, లోకజ్ఞానశూన్యుఁడై అచేతనమగు మేఘమును సందేశహరణార్థము యాచించెను. యక్షుని లోకజ్ఞానశూన్యత నాఁటగాఁగొని కాళిదాసమహాకవి (పూర్వమేఘమున) చిత్రకూటము మొదలు కైలాసపర్యంతముగల మనోహరప్రకృతిని భావనాశక్తిబలమున నాకర్షించి, కవితాశిల్పమున మఱింత రమణీయముగాఁ దీర్చి మన కన్నులయెదుట నిలుపఁగలిగెను. (ఉత్తరమేఘమున) మానవహృదయమును ద్రవింపఁజేయు కరుణరసమును వెల్లిగొలుపుటకును యక్షుని యవివేకితయే యాధారము. యక్షుని యవివేకము పాకము చెందుటకు మేఘుని యచేతనత పరమసాధనము. మేఘుఁడు మాటలాడనేరని అచేతనముగ నున్నంతవఱకే యక్షున కున్మాదమును కాళిదాసుకావ్యమునకు గౌరవమును, అనునది యిందలి రహస్యము.

కావ్యనిర్మాణమునకుఁ గథాపురుషుల విరహోన్మాదతాచేతనతలే ప్రేరకములును, ముఖ్యాధారములును. కల్పనాశిల్పమున నా రెండువిషయములును పరస్పరసంబంధము గల మూలసూత్రములు. మూలసూత్రములలో నేది పురివిచ్చినను, కావ్యము బిగువుచెడి, వదులువాఱి ఛిన్నభిన్నమగును. కావున మూలసూత్రముల కేపాటివిచ్ఛిత్తియుఁ గలుగకుండ కథారథమును నడిపించుకొనవలసినది కవికిఁ దప్పనివిధి. కాళిదాసుతనవిధి చక్కఁగా నెఱవేర్చుకొనెనా?

వియుక్తా జీవితాలంబనార్థియైన యక్షుఁడు, మేఘునుచే సందేశము నంప నమకట్టినట్లు కావ్యప్రారంభమునర్చి—చేతనసాధ్యమగు పనిని అచేతనమైన మేఘముచేఁ జేయింపఁదలఁచినాఁడేమి యక్షుఁడు? అను నాక్షేపమునకు—

"ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః క్వ మేఘః
సందేశార్థాః క్వ పటుకరణైః ప్రాణిభిః ప్రాపణీయాః;
ఇత్యౌత్సుక్యా దపరిగణయన్ గుహ్యక స్తం యయాచే
కామార్తా హి ప్రకృతికృపణా శ్చేతనాచేతనేషు." పూ. మే. 5.

పొగ, అగ్ని, నీరు, గాలి యనువానికలయికయైన మబ్బెక్కడ, సమర్థములయిన యింద్రియములుగల ప్రాణులచేఁ బంపఁదగిన సందేశార్థము లెక్కడ, అనువిషయమును, ఉత్సుకుఁడు గావున యక్షుఁడు విచారింపక (సందేశహరణార్థము) మేఘుని యాచించెను. కామాంధులగు వారికిది చేతనము, ఇది యచేతనము అను వివేకముండదు గదా?

అను (సొగసైన అర్థాంతరన్యాసముతో) సముచిత సమాధానమును జెప్పినాఁడు. ఆక్షేపమును సమాధానమును లోకసమ్మతములై కావ్యనిర్మాణమునకు నత్యావశ్యకములై, కవితాశిల్పమునకు వన్నెవెట్టుచున్నవి. ఈ ఆక్షేపసమాధానముల భావమేమి? విరహపీడితుఁ

నైన యక్షుఁడు లోకజ్ఞానము లేక తనగోడును దాను వెళ్లఁబోసుకొనె నేకాని, మేఘునివలనఁదా నేపాటి ప్రయోజనమును బడయఁజాలఁడు. అనగా సందేశకృత్యము జరుగదనికదా? కావ్యప్రారంభ మీరీతిమండ, మేఘునికి అచేతనత ప్రకృతి సిద్ధమైయుండ మఱియే భావమ్మునఁ గవి కులగురుఁడు, కథాసంవిధానమునకును బ్రకృతికిని విరుద్ధముగా

"తత్సందేశం......హ్యుత్తమా వాక్."

(ఆ మేఘశ్రేష్ఠుఁడు యక్షసందేశమును ఆయక్షవధువుయొక్క ప్రాణములను రక్షించుటకై, జనహితమైన ధ్వనికలవాఁడై (దేవరూపమును దాల్చి) దివ్యవాక్కులతో ఆమెకుఁ జెప్పెను. ఆమెయును ఆవార్తవలన సంతోషించిన మనస్సుకలదై యుండెను. అట్లేకదా! గొప్పవారిని ప్రార్థించినయెడల నెవరికోరికలు సఫలములు కాకుండును!)

అని కావ్యమును ముగింపునకుఁ దెచ్చెనో? ఆకాలపు ప్రభావమునో, యక్షుని యదృష్టమువలననో మబ్బు మాటాడనేర్చి సందేశమునందించినదే యుండుననుకొందము. ఇప్పు డేమయినది? "జలధరవరః చచక్షే" అను వాక్యమువలన మేఘునికిఁ బ్రాణము వచ్చినది. మూలసూత్రములలో నొకటి విచ్ఛిన్నమైనది. వెంటనే యక్షునకున్మాదము వదలినది. రెండవసూత్రము తునియలైనది. కల్పనాకౌశలము కళంకితమయినది. కథాసౌందర్యము మంటగలిసినది. స్వవచనవ్యాఘాతదోషము కావ్యకర్త కంటుకొన్నది. "చక్కగా భాషింపనేర్చిన మేఘుని నచేతనమనియు, ప్రాణియు, సర్వకార్యనిర్వహణదక్షుఁడునగు మేఘుని యాచించిన యక్షుని ఉన్మాదియనియు పేర్కొనుట నీకు న్యాయమగునటయ్యా" అని కాళిదాసమహాకవిని ప్రశ్నించుటకవకాశము దొరకినది. ఇంత యసందర్భముగా కావ్యపరిసమాప్తిగావింప నాకవీంద్రునకేమి యక్కఱగలిగెనో? మేఘుఁడు సందేశమునందించె ననకున్న—

"కేషాం నస్యా దభిమతఫలా ప్రార్థనా హ్యుత్తమానామ్."

అను తొన యర్థాంతరన్యాసమున కిఁక నవకాశము దొరకదని కాఁబోలు! పోనిండు "సందేశం చచక్షే" అను వాక్యముచే నమ్మి మబ్బు మాటాడనేర్చిన ప్రాణియే యనుకొందము. అట్లయిన యక్షుఁడు నోరునొచ్చునట్లు తన్ను స్తోత్రము చేయునపుడుగాని చిత్తము చెమ్మగిల్లునట్లు ప్రియురాలి వియోగదురవస్థను విన్నవించునపుడుగాని మఱియొక సందర్భమునఁగాని మాఱుపలుకక మూగమొద్దువలె నూరకుండునా? ఊఁ కొట్టనయిన మాఁకొట్టఁడా? ఎదుటివాఁడు గంటలకొలఁది ప్రసంగించుచుండ హాఁ-యనక అవ్యుతా-యనక బెల్లముగొట్టిన రాయివలె నుండుట ప్రాణిధర్మమా? ప్రకృతిధర్మమా? పాపము! తానెంత మొత్తుకొన్నను మబ్బు మాఱుపలుకమని యక్షుఁ డిట్లు సమర్థించికొని తృప్తిపడుచున్నాఁడు.

"కచ్చిత్సౌమ్య, వ్యవసితమిదం బంధుకృత్యం త్వయా మే
ప్రత్యాదేశా న్నఖలు భవతో ధీరతాం కల్పయామి;
నిశ్శబ్దోపి ప్రదిశసి జలం యాచిత శ్చాతకేభ్యః
ప్రత్యుక్తంహి ప్రణయిషు సతా మీప్సితార్థక్రియైవ." ఉ. మే. 54.

(ఓయీ సాధూ! నాకొఱకై బంధుకార్యమును నీవంగీకరించితివని తలంచెదను. నీవు బదులుమాట చెప్పకుండుట అనంగీకార సూచకము కాదు. మఱియేమన? అది నీస్వభావము. బదులుమాటచెప్పుట నీగాంభీర్యమునకు లోపము. (ఉఱుమకయే) వాగ్దానములు పలుకకయే నీవు నిన్ను యాచించు చాతకములకు జలము నిచ్చుచున్నావు. నావిషయమునను అట్లే చేసెదవు. ఏలయనిన సత్పురుషులు యాచకులకార్యమును చేయుదురుగాని చేసెదమని పలుకరు.)

అని—

మేఘుని ప్రతిగుణమును తన కనుగుణముగ సిద్ధాంతము చేసికొని సంతోషించుట వానికిఁ దప్పనివిధి. ఆవిధియే కావ్యప్రథనకారణమును మన కానందదాయకమును గదా!

కావ్యప్రారంభమునుండి తుదివఱకును, అనగాఁ బూర్వమేఘమున నఱువదియేడు శ్లోకములలోను, ఉత్తరమేఘమున నేబదియైదవ శ్లోకమువఱకును మేఘు మచేతనమనుచు వచ్చిన మహాకవి, యేబదియారవ శ్లోకమున "జలధరవరః చచక్షే" అనుట పొంది పొసఁగియున్నదా? ఇప్పట్టున పాఠకులకు సందేహము జనింపకుండు టెట్లు? సందేహము పొడమకుండునట్లిచో వ్యాఖ్యాత లేమయిన విశేషించి వ్రాసిరా? తిలకింపుఁడు:—

సంస్కృతవ్యాఖ్యాత; "జలధరవరః చచక్షే=ఉక్తవాన్" అని మాత్రము వ్రాసి "నచశంకా నచోత్తర" మన్నట్లు మిన్నకేగెను. మల్లినాథ సూరులవారి వ్రాఁతయు నిట్లుండునా! ఇఁక ఆంధ్రవ్యాఖ్యాతలగు శ్రీ శాస్త్రులవారు తమ పదప్రయోజనమున "జలధరవర్య" వరుఁడు కావుననే ఉపకారము చేసినాఁడు—అనగా సందేశమును చెప్పినాడు. అని కొంత విశేషించి వ్రాసి సందేహమునకే మఱింత చోటొసఁగిరి.

ఇది యిట్లుండ, "మొదలు లేదు శ్రీరామా" యన్నట్లు "చచక్షే" అనుటయే అసంబద్ధమును, అసందర్భమును నై యుండఁగా వీఁడు మిక్కిలి "దివ్యవాచా" (దేవవాక్కులతో) నట మేఘుఁడు సందేశమును చెప్పుట. ఇందులకు సంస్కృత వ్యాఖ్యాత:—

"కామరూపం మఘోనః" ఇతి పూర్వముక్తే నైవోక్తత్వాత్
తదానీం మేఘః దేవాకారీ భూత్వా తాదృగ్వాచా యక్షసందేశం
యక్షవధ్వా ఉవాచేత్యర్థః.—

(మేఘుఁడు కామరూపుఁ డని యక్షునిచే నిదివఱకే పలుకఁబడియున్నందున, అప్పుడు మేఘుఁడు దేవాకారమును దాల్చి, దేవవాక్కులతో సందేశమును చెప్పెను.) అని వ్రాసెను.

ఇచ్చో వ్యాఖ్యాతృసమర్థనము మిక్కిలి యద్భుతమును గొల్పుచున్నది. కార్యార్థియు, విరహోన్మాదియు, నగు యక్షుఁడు తన

యవసరమునుబట్టి మేఘుని గొప్పచేసి పొగడుటలో నున్న "కామరూప"మన్న పలుకా తనసమర్థనమున కాధారము? శ్రీశాస్త్రిలవారలో "దివ్యవాచా" వట్టి యీయుపములచే నభిప్రాయము తెలియదు గావున దివ్యవాక్కుల నె చెప్పెను" అని వ్రాసిరి. ఎట్లైనను యక్షుఁడంపిన సందేశమును మేఘుఁడు చెప్పియే తీరవలయునని శ్రీశాస్త్రిలవారును తలఁచియుందురా ?

అలకాపురమున కరిగియో, అరుగకయో, తాను 'వరుఁడు' కావునో మఱియొక కారణమునో మేఘుఁడు సందేశమును జెప్పినను చెప్పియుండవచ్చును గాక, పనిలేనిపనిగా దేవాకారమును దాల్చుట యెందులకు? యక్షుఁడైనను మొదట స్తోత్రసమయమున మాటవెంబడి మాటగా "కామరూప" మనెనేకాని నీవు దేవతవై దేవవాక్కులతో నారమణికడ భాషింపుమని కోరెనా? కోరినను కోరియుండవచ్చునుగాని యక్షుఁ డున్మత్తుఁడయ్యెను మేఘుఁడు దేవతయగునని తలంపలేదు. కావుననే సందేశప్రారంభమున

"కలభతనుతాంగత్వా క్రీడాశైలే నిషణ్ణ(స్సన్) విద్యుదున్మేష
దృష్టిమ్ అంతర్భవనపతితాం కర్తుమర్హ స్యల్పాభాసి." ఉ. మే. 20.

(ఏనుఁగుపిల్లయంత చిన్న యాకారమును దాల్చి క్రీడాశైలమునఁ గూర్చున్నవాఁడవై నీమెఱుపు చూపుల నాయింటిలోనికి నిగిడింపుము) అనియు,

"తస్మిన్ కాలే సాలబ్ధనిద్రా సుఖాస్యాత్ యది
స్తనితవిముఖస్సన్ యామమాత్రం సహస్వ" ఉ. మే. 36.

(నీవుపోయి చూచుసమయమున నామె నిద్రాసుఖ మనుభవించుచుండె నేని ఉఱుముక నిశ్శబ్దుఁడవై జాముసేపు మాత్రము కనుపెట్టుకొనియుండుము) అనియు,

"తాముత్థాప్య విద్యుద్గర్భస్సన్ స్తనిత
వచనైః వక్తుం ప్రక్రమేథాః." ఉ. మే. 37.

వ్యాఖ్యా: విద్యుద్గర్భః=అన్తర్లీన విద్యుత్క-ఇత్యర్థః. దృష్టిప్రతిఘాతేన వక్తుర్ముఖాలోకన ప్రతిబన్ధకత్వా న్నవిద్యోతితవ్య మితిభావః. స్తనితవచనైః= స్తనితా న్యేవవచనాని తైర్వక్తుం, ప్రక్రమేథాః=ఉపక్రమస్వ. (ఆమెను మేలుకొలిపి, మెఱపినయెడల దృష్టి ప్రతిహతమై మాటలాడువారి ముఖము కనఁబడక పోవునుగాన నీమెఱుపును నీలో నణఁచికొని నీయుఱుములను మాటలచేత సంభాషింప మొదలుపెట్టుము) అనియుఁ జెప్పినాఁడు.

ఇట్లు యక్షుఁడెప్పుడు చెప్పినను మేఘుని మేఘరూపముననే సందేశకార్యమును నెరవేర్చుమనెనుగాని దేవాకారమును దాల్చి దేవవాక్కులతో భాషించుమని కోరలేదు. యక్షుఁడు కోరినదానిని జొవరించుటకే సమర్థుఁడుకాని (ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః) మేఘుఁడు కోరకున్నను దేవాకారమును ధరించి తత్కార్యమును నెరవేర్చెననుటకంటె వింతకలదా ?

దేవాకారమును దాల్చిన 'పెద్దమనిషి' మేఘుఁడు సందేశమును యక్షరమణికి నెమ్మదిగా వచింపక, పడకకేయివేళ ఊరివారి కందఱికిని వినవచ్చునట్లు పెద్దగా అఱచి చెప్పెనట. ఆ యఱపునువిని (గాఢనిద్రలోనున్న) కుబేరుఁడు శైత్యము మేల్కాని సందేశమును వినెనట— చూడుఁడు.

"శ్రుత్వావార్తాం...భూయః" ఉ. మే. 57.

(కుబేరుఁడు మేఘుఁడు చెప్పినవార్తను విని జాలిపడి తత్క్షణమే శాపావసానము ననుగ్రహించెనట. ఆ ట్లాదంపతులను దుఃఖముతీర్చి సంతుష్టులనుజేసి మఱలఁ గూర్చి కుబేరుఁడు కాంక్షితభోగములను మునుపటివలెనే వారికిఁ గలుగఁజేసెనట. అట్లు వారతనికరుణచే మఱల క్షేమమును బొందిరట):—

ఇందుపై శ్రీశాస్త్రిలవారు, "సంయోజ్య=ప్రాపయామాస" అని లేజంతప్రయోగము చేయుటచేఁ గుబేరుఁడు కరుణించి తానే ప్రయత్నపూర్వకముగా వారినిగూర్చి సంతుష్టులంజేసి యిష్టభోగముల నొసంగెననియు—"భోగానిష్టా నభిమతసుఖాన్ ప్రాపయామాసభూయః" అనుట కావ్యాంతమందు మిగుల మంగళశ్రుతిగా నున్నదనియు, ఇందువలనఁ గవి వ్యాఖ్యాతృధ్యాపయితృపఠితృ శ్రోతృదులకెల్ల మంగళముద్దేశింపఁ బడినదనియు లిఖించి, ఈశ్లోకమున కొక పెద్దగౌరవమును, ప్రాముఖ్యమును నొసంగిరి. కాని ఈశ్లోకము మూలమునను, దీనికిఁ బైశ్లోకమగు "తత్సందేశ"ము మూలముననే, కాళిదాసమహాకవి కవితాశిల్పము కళంకితమగుటయును పాఠకులకు సందేహములు పొడముటయు, ఇట్టి విమర్శనము వ్రాయవలయుటయుఁ దటస్థించెనని నేను మనవి చేయుచున్నాను.

ఇంతకు నీకావ్యమున మేఘుఁడు *కామరూపి కావలసిన యవసరముగాని—వ్యాఖ్యాతలాతనిని కామరూపింగా భావింపవలసిన యవసరముగాని—సందేశమును చెప్పవలసిన యవసరముగాని—చెప్పింపవలసిన యవసరముగాని—బొత్తిగా లేదు. అలోకసామాన్య ప్రతిభాశాలియు, లోకజ్ఞుఁడునగు కాళిదాసమహాకవి స్వవచనవ్యాఘాతదోషభూయిష్ఠముగా కావ్యమును ముగింపనులేరు. ఏబదియైదవ శ్లోకమున "మాభూదేవం క్షణమపిచతే విద్యుతా విప్రయోగః". అను నాల్గవచరణముతోనే ప్రౌఢముగా కావ్యమును శుభాంతముగాఁ బరిసమాప్తి కావించెను. కాళిదాసకవితామర్మవేదియగు మల్లినాథసూరియు,

"ఏవం=మద్వత్, క్షణమపి=స్వల్పకాలమపి, తే=తవ, విద్యుతా-కళత్రేణేతి శేషః, విప్రయోగః=విరహః, మాభూత్=మాస్తు. 'ఆస్తే

*మేఘుఁడు కామరూపి యనఁగా వాయువశమున నాకాశమున ననేకరూపములు దాల్పఁగలవాఁడనుట యుక్తియుక్తము కదా!



శ్రీ బాలికా హిందీ పాఠశాల, గుడివాడ



శ్రీ హిందీపాఠశాల, గుడివాడ

కావ్యస్య నిత్యత్వాత్కుర్యా దాశిషముత్తమామ్. సర్వత్ర వ్యాప్తరేఖ విద్యా స్నాయకే చ్ఛానురూపిణీమ్.' ఇతి సారస్వతాలంకార దర్శనాత్కావ్యాన్తే నాయకేచ్ఛానురూపాఽయమాశీర్వాదః ప్రయుక్త ఇత్యమసంధేయమ్."

అని తనవ్యాఖ్యానమును ముగించినాడు. ఇచ్చట శ్రీ శాస్త్రిలవారును "మంగళార్థము కావ్యాంతమందు ఆశీర్వాదము" అని వ్రాసిరి. ఇట్లు నిర్దుష్టముగను, సర్వలక్షణసంపన్నముగను కావ్యము ముగియుచుండఁగా, పూర్వోత్తరసందర్భ విప్రతిపన్నములగు నాశ్లోకముల కేఁక నవకాశ మెక్కడిది? అవి కాళిదాస కృతశ్లోకములు గావనుటకు జంకఁబని లేదు. మఱియు, తద్వ్యాఖ్యయు మల్లినాథ కృతముకాదు. అగుచో 'మాధూ దేవ'మునఁ గావ్యపరిసమాప్తి సూచించుటెట్లు? ఈ శ్లోకములు నాశోలి యొత్తకుండుటెట్లు? వేయేల? ఆ రెండుశ్లోకములును నిస్సంశయముగాఁ బ్రక్షిప్తములే. రెంటిలో నొకటియగు 'శ్రుత్వావార్తాం' ప్రక్షిప్తమనియు దానికి మల్లినాథసూరి వ్యాఖ్యానము లేనే లేదనియుఁ జెప్పి సందర్గికారపండితులు, ఆశ్లోకమును తమగ్రంథములో ముద్రింపక విడిచిరని శ్రీ శాస్త్రిలవారే వ్రాయుచున్నారు. కాని "విడువ నిచ్చగింపక నేను ముద్రించితిని" అనియు వ్రాసిరి. సందర్గికారపండితులైనను మల్లినాథవ్యాఖ్య లేదన్న కారణమున వదలినట్లున్నదిగాని, విమర్శించి కథావిరుద్ధమన్న హేతువుల వదలినట్లు లేదు. అట్లయినచో-తత్సందేశ-మునుగూడ వదలిరే యుందురని నానమ్మకము.

ప్రక్షిప్తములగు నీశ్లోకములను కావ్యమునుండి తొలఁగించితిమేని కవికి స్వవచన వ్యాఘాతదోషమును, మేఘునికి దేవతావేషమును వేసికొని దివ్యవాక్కులతో భాషింపవలయునన్న ఇక్కట్టును దొలఁగుటయే కాక కావ్యమునకు మంగళాంతత్వమును గలుగును.

మఱియు, నే నీవ్యాసమును రచించినపిమ్మట, నిటీవలఁ జెన్నపురికిఁబోవఁ దటస్థించెను. అప్పుడు 'సందేశ'మును గూర్చిన నా యీ యూహ లెంతవఱకు సత్యములో-ప్రత్యంతరములను జూచి నిర్ణయింపఁగోరి మన్నతలఁపున, ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునకరిగి, అందొక కొన్ని ప్రతులఁ బరిశీలించితిని.

(1) తెలుఁగు అచ్చుప్రతి. (2) సందర్గికారప్రతి. (3) ఈశ్వర చంద్రుని ఎడిషను (4) Parab's Edition (5) Gildemistar's Edition (6) నేమిదూత. వీనియందు 'తత్సందేశ' మున్నమాట నిజము. కాని

(1) 1919 సం॥రమున తిరువాన్కూరు గవర్నమెంటు సీరీసులో టి. గణపతి శాస్త్రిలవారిచే-దక్షిణావర్తనాథవ్యాఖ్యా సహితముగాఁ బ్రకటింపఁబడిన ప్రతిలో ఈశ్లోకము లేదు.

(2) 1911 సంవత్సరమున రాయల్ ఏషియాటిక్ సొసైటీతరఫున ప్రొఫెసర్ E. Hultzsch గారు- శ్రీరాజానకానందదేవాత్మజ పరమాత్మ చిహ్నపరనామ వల్లభదేవ విరచిత మేఘదూతవృత్తితో బహుదేశకోశ వ్యాఖ్యాన పరిశోధన విమర్శపూర్వకముగా, సుపోద్ఘాతాదులను వ్రాసి ప్రకటించినప్రతిలో ఈ శ్లోకము లేదు.

వల్లభదేవుఁడు:—'మాధూ దేవం'

నీపమాలిన ప్రకాశేన మద్వత్ శివాపీ వివేకమపి తడిత్ప్రియయా
విరహో మాభూదితిభద్రం—అనియే ముగించినాఁడు.

(3) పూర్ణసరస్వతియు తన విద్యుల్లతావ్యాఖ్యానమున:—

తయాసహిత మవిరహాశ్చభూయా దిత్యాశిషా శ్లిష్టప్రయోగాచ్చ ఏతత్కావ్యశ్రోతృ వ్యాఖ్యాతౄదీనామపి మంగళసంప్రతిరిత్యేవ. మతిమంగలం—అనుటతోనే కావ్యపరిసమాప్తిఁ బొనర్చెను.

(4) అభినవభట్టబాణ బిరుదాంకితులగు పండిత. ఆర్. వి. కృష్ణాచార్యులవారు, పూర్ణసరస్వతిచే వదలఁబడి మల్లినాథునిచే వ్యాఖ్యానము చేయఁబడిన శ్లోకములనుగూర్చి ప్రచురించిరి కాని అందీ రెండు శ్లోకములును లేవు.

(5) 1818 సం॥రమున H. H. Wilson గారు కావించిన ఆంగ్లభాషాంతరీకరణమునను 'తత్సందేశ'ము లేదు. మఱియు,

(6) మల్లినాథుని (కొన్ని) వ్యాఖ్యలలోను (7) జినసేనుని వ్యాఖ్యానమునను (8) తంజావూరి ప్రతిలోను (9) Panabokke పుస్తకమునను (10) Stenzler's ప్రతిలోను లేదు. 'మాధూ దేవం' తోనే కావ్యము ముగింపఁబడియున్నది.

ఇట్లు పూర్వోత్తరసందర్భ పరామర్శమువలనను బహువ్యాఖ్యాన పరిశోధనములవలనను ప్రక్షిప్తమని నిర్వివాదముగాఁ దేలుచున్న 'తత్సందేశ' శ్లోకమును దమ ముద్రణమునఁ దొలఁగింపక పోవుటయే కాక శ్రీ శాస్త్రిలవారు "బొంబాయి ముద్రణమును మదరాసు తెలుఁగు ముద్రణమును బరికించి ఒకదాన లేనిదానిని మఱియొకదాన గ్రహించి యీముద్రణమును, ఆ రెంటికంటెను పుష్కలము గావించితి" ననుచు 'శ్రుత్వావార్తా'మునుగూడఁ జేర్చిరి. కాని-అప్రసక్తములును, కథావిరుద్ధములు నగువానిని చేర్చుటవలన పుష్కలతకుమారు, వికృతి వాటిల్లునేమో యని శ్రీ శాస్త్రిలవారికి వినయపూర్వకముగా విన్నవించుచున్నాను,

పుష్కలత యనఁగా గ్రంథబాహుళ్యము కాదుగదా? అగుచో సందర్గికార్ ఎడిషనులో నున్న,

శ్లో. ఇత్థంభూతం సురచితపదం మేఘదూతాభిధానం
కామక్రీడా విరహితజనే విప్రయోగే వినోదః;
మేఘస్యాస్మి న్నతి నిపుణతా బుద్ధిభావః కవీనాం
నత్వార్యాయా శ్చరణకమలం కాళిదాస శ్చకార.

అను శ్లోకము మేఘసందేశకావ్యమునఁ జేర్పఁబడినది కాదో?—




తమ్మల సీతారామమూర్తి చౌదరిగారు



వ్యాసకర్త

అధ్యాత్మవిద్యారహస్యవేదివతంస, ప్రణతిగైకొనుమయ్య పరమహంస!
తాపత్రయారణ్య దావానలోద్దీప, నతులివే సచ్చిదానందరూప!
కలుషదుర్వారాంధకారసారసమిత్ర, జోహారులందు మోశుభచరిత్ర!
జన్మమృత్యుమదేభ సంతానహర్యక్ష, వందనంబిదె సత్కృపాకటాక్ష!
నిరుపమానగుణాధార, నిర్వికార-దండమిదె కొండవీటి పత్తనవిహార!
దయనుజూడుము తథ్యమిథ్యావిభాగి-విశ్వవినుత సదుద్యోగి, వేమయోగి!

సీ. నీజాతి యగుటచే నిఖిలదేశములందు దొడ్డకీర్తి గడించె రెడ్డికులము
నీతల్లి యగుటచే నిరుపమప్రఖ్యాతి దీపించె (శ్రీ) యాంధ్రదేశజనని
నీయన్నదమ్ములై నెగడియుండుటచేత నవనిలోఁ బేరొందిరాంధ్రజనులు
నీభాషయగుటచే నిఖిలభాషలయందు బళిబళీ యని పిల్వఁబడెఁ దెలుంగు
నీమతంబౌట బుధవర్ణనీయమగుచు-వన్నెవాసియుఁగనె శివాద్వైతమతము
నీకు సరివార లెవ్వ రీలోకమందు-విశ్వసన్నుతగుణధుర్య, వేమనార్య!

సీ. సన్న్యాసివై యహింసాతత్త్వ మెఱిఁగించి భువనసన్నుతిఁగన్న బుద్ధునకును
దుర్మతంబులనెల్లఁ దూలించియద్వైత మవని నిల్పిన శంకరార్యునకును
మహివిశిష్టాద్వైత మతమొండు నెలకొల్పి యభినుతుల్ గొన్న రామానుజునకు
వీరశైవమతంబు వెలయించి జగమందుఁ బ్రఖ్యాతిఁ గన్నట్టి బసవనకును
సకలమతమర్మములనెల్లఁ జాటిచాటి-సాటిలేనట్టి మేటివౌ జననినీకు
నంబవై భారతాంబ ధన్యాత్మమయ్యె-వేమనకవీంద్ర, గుణసాంద్ర, విబుధచంద్ర!

సీ. అద్వితీయప్రతాపాగ్ని నెన్నికఁగన్న బలులఁ బల్నాటివీరులను గాంచి
చతురబ్ధివలయిత క్షితినెల్లఁ బాలించి శోభిల్లు రెడ్డిరాజులను గాంచి
ఆంధ్రభాషకు సమస్తాలంకృతు లొసంగి ఘనుఁడైన (శ్రీ)నాథకవిని గాంచి
కైవల్య సామ్రాజ్యఘంటాపథంబు నిర్మించి మించినయట్టి మిమ్ముఁగాంచి
దాశరథేయుఁడని బుధోత్తంసుఁడనఁగ-నభినుతుల్ గొన్న (శ్రీ) వేంకటాద్రిఁగాంచి
మాన్యతగడించె గుంటూరిమండలంబు-విబుధజనసంతతధ్యేయ, వేమరాయ!

సీ. కటికిబండలమీఁదఁ గాల్మోపినంతనే సరసాంబుధారలు జాలువాఱె
బ్రళయాగ్నికణముఁ జేపట్టినయంతనే చల్లనై కర్పూరశకలమయ్యె

నిండిపోయిన మ్రోడు నిటు తాఁకినంతనే రెపరెపఁ జివురించి విపులమయ్యె
భయదమౌ ఖడ్గంబుఁ బట్టినయంతనే గండడంగుచుఁ బూలదండ యయ్యెఁ
బులులఁ గన్గొన్నయంతనే పొంకమడఁగి-యింటికుక్కలవలె వెంట నంటి తిరిగె
సర్వశక్తిస్వరూప, శశ్వత్ప్రతాప-విగ్రహద్యుతిసితరవీ, వేమసుకవి!

సీ. వేదంబులన్నింటి విశదంబుగాఁ జూచి శాస్త్రజాలంబెల్లఁ జదివిచదివి
స్మృతులనెల్లను లసన్మతితోడఁ బరికించి సకలపురాణముల్ జాడ నెఱిఁగి
సూత్రమర్మంబెల్ల శోధించి శోధించి భాష్యత్రయంబెల్లఁ బాడిపాడి
గీతార్థములలోని లోతెల్లఁ బొడగాంచి మతములన్నిటనున్న మర్మ మెంచి
విసిగి వేసారి గతిలేక వెతలఁ జెంది-తుదకు నీ గీతములకుఁ బ్రస్తుతులొనర్చి
ముక్తిసాధించి రహహా! ముముక్షుకోటి-విశ్వమాయాపరిత్యాగి, వేమయోగి!

సీ. కాషాయవస్త్రముల్ కడకఁ దాల్పఁగనేల శిరమెల్ల బోడిగాఁ జేయనేల
దండంబులను బూని తారసిల్లఁగనేల ప్రకట రుద్రాక్షమాలిక లవేల
జింకతోళ్లను బూని చంకఁ గొట్టఁగనేల యోంకారనినదంపు టంకెలేల
పంచాగ్ని వేదనల్ పడి కృశింపఁగనేల వనభూములందు నివాసమేల
వెలయు జందెంబులను ద్రెంపివేయనేల-భూతదయలేనివారి కీర్తనలేల
యనుచు లోకంబునకుఁ జాటినట్టి నిన్ను-మఱవఁ దరమౌనె యయ్య వేమనకవీంద్ర!

సీ. కాలకూటవిషంబు గలపాత్రలో సముద్దీపించు నమృతంబుఁ జూపినావు
కంటకావృతమైన కాంతారసీమలో నెఱిరాచబాటఁ గన్పఱచినావు
గాఢాంధకార సంకలితమహారాత్రిలో మంచివెన్నెలఁ బ్రసాదించినావు
సర్వశూన్యములైన చవిటిపఱ్ఱలలోన నందనోద్యానంబు నాటినావు
భువనభయదంబులగు పెద్దపులులలోన-సాధు గోరాజముల మేపఁ జాలినావు
బళిర! నిన్గొనియాడ నెవ్వరితరంబు-రమ్యగుణభోగి, శ్రీవేమరాజయోగి!

సీ. బ్రాహ్మణుండననేల పంచముండననేల జాతియొక్కటె యంచుఁ జాటినావు
జీవుఁడే దేవుండు దేవుఁడే జీవుండు వేఱుగాదని విన్నవించినావు
సర్వభూతములందు సమతనిల్పనివాఁడు కడతేఱలేఁడంచు నుడివినావు
ప్రాకటంబుగ "సహంబ్రహ్మాస్మి" యనునట్టి సూత్రంబుఁ గనుమంచుఁ జూపినావు
విగ్రహారాధనంబెల్ల వెఱ్ఱియనుచు-జపతపోయాగదీక్ష నిస్సారమనుచు
గూటవేదాంతములు పొట్టకూటికనుచు-వెల్లడించితి పో వెకా వేమయోగి!

సీ. బ్రహ్మాదులకుఁ గనంబడరాని తేజంబు సులభంబుగా నీవు సూచినావు
ఇంద్రాదులకునైన నెదిరించినవిరోధి గండడంచి జయంబు గాంచినావు
సనకాదులకు నందఁజాలనట్టి ఫలంబుఁ గూర్చుండియే కోసి కుడిచినావు

జనకాదులకును దుస్సాధ్యమౌ బంధంబుఁ జప్పుచప్పున నద్దె విప్పినావు
నారదాదిమునుల్ పాడనేరనట్టి-పాట నుచ్చైస్స్వరంబునఁ బాడినావు
చేయలేనట్టి పనులెల్లఁ జేసినావు-నీమహాత్త్వం బనంత మో వేమనార్య!

సీ. నీకటాక్షముచేత మాకు నిత్యానిత్య వస్తుతత్త్వ మెఱుంగ వలనుపడియె
నీదయాదృష్టిచే నిఖిలధర్మాధర్మ పరిశీలన మొనర్చు భాగ్యమొదవె
నీయాదరంబుచే నిరుపమానంబైన లౌకికజ్ఞానంబు లభ్యమయ్యె
నీకృపామహిమచే నిత్యనిస్తుల్య నిర్మాలిన్య మోక్షసామ్రాజ్యమబ్బె
నిట్టి లోకోపకారివైనట్టి నిన్ను-మఱవఁదరమౌనె? జన్మజన్మములకైనఁ
దుహినసగభీర, సముదార, దురితదూర-కామువిపినకుఠార, శ్రీ వేమవీర!

సీ. దోషంబుగలవాఁడు దొరబిడ్డయైన నీ తగదంచు నడకాలఁ దన్నినావు
నిర్దోషియగువాఁడు నీచమానవుఁడైన భక్తి బ్రహ్మరథంబుఁ బట్టినావు
అతిపాపియైన దాసోఽహం బటంచన్న మించుప్రేముడి నుద్ధరించినావు
అడ్డైనవాఁడు తానబ్జసంభవుఁడైన నిర్లక్ష్యమొనరించి నెగడినావు
కలఁగి లోకంబులన్నియుఁ గంపమొంద-భీకరార్భటితో విజృంభించినావు
తిరుగులేని జయంబు సాధించినావు-అద్వితీయ ప్రకాశ, వేమావనీశ!

సీ. ఒరుల సొమ్మున కాస నొందు టెందులకంచు జీవకారుణ్యంబు శ్రేయమనుచుఁ
బరులచిత్తము నొవ్వఁ బల్కు-టొప్పదటంచు నున్నంతలోఁ దృప్తి నొందుఁడనుచుఁ
బగవానినైన వేఱుగఁజూడఁ దగదంచుఁ గోపంపు రూపంబు మాపుఁడనుచు
నీశ్వరారాధనం బెల్లవేళలయందు నిష్ఫలాపేక్షతో నెఱపుఁ డనుచుఁ
లోకులకు ధనల్పి యనేకకరుణ-జడితులగువారిఁ బరమపావనులఁ జేసి
ధర్మసంస్థాపన మొనర్చి తనరినట్టి-నిన్ను వర్ణింపఁదరమె? వేమన్నయోగి!

సీ. భాగ్యంబు గలదంచుఁ బరువులెత్తఁగలేదు, పేదనైతి నటంచు బెంగలేదు
కష్టంబులనుజూచి కంట నీరిడలేదు, సుఖము లబ్బెనటంచుఁ జొక్కలేదు
తెలివిగల్గె నటంచు "ధింధిమ్మి" యనలేదు, మఱపువచ్చెనటంచు మార్పులేదు
బంధితుండ నటంచుఁ బరితపించఁగలేదు, ముక్తిగల్గెనటంచు మురిసియలేదు
నృపతి యతఁడంచు గౌరవం బీయలేదు-సేవకుఁ డితండనుచు నింద సేయలేదు
సారిది నన్నింటి సమదృష్టిఁ జూచినాఁడ-వుత్తమోత్తమగుణధామ, యోగివేమ!

సీ. ఛీ.యన్నవారలే శివశివా పొరపాటు మన్నింపుఁడని బ్రతిమాలినారు
కాదన్నవారలే కానైతి మటంచు దాసానుదాసులై తనరినారు
పొమ్మన్నవారలే పూలపల్లకిఁ దెచ్చి వేంచేయుఁడనుచుఁ బ్రార్థించినారు
ఏమన్నవారలే యెఱుఁగమైతిమటంచు శ్రీపాదములఁ దలల్ మోపినారు
హుమ్మనుచు రొమ్ముఁ జఱచిన యోధులెల్లఁ-గడకు గతిలేక వడవడ వడఁకినారు
నీమహాత్త్వంబులెల్ల వర్ణింపఁదరమె?-విశ్వసన్నుత సత్కార్య, వేమనార్య!

సీ. నవరసాలంకారనవభావభరిత ప్రబంధంబు లొకవేయి పలుకవచ్చుఁ
బ్రజ్ఞాప్రభావ మేర్పడఁ బైకిఁ గ్రిందికి వేదంబులను వల్లెవేయవచ్చుఁ

గామాదిరిపువర్గ గర్వంబుఁ దూలించి మానినై వనసీమ మసలవచ్చు
మిథ్యాప్రపంచంబు తథ్యంబు గాదంచు విప్పి లోకుల కెల్లఁ జెప్పవచ్చు
విశ్వకవికోటిలో వేదవిదులలోన-ఘనమునిస్తోమమందు సుజ్ఞానులందు
నీకు సరివార లెవ్వ రేనియుఁ గల్గా రె? మహిత సద్గుణసాంద్ర, వేమనకవీంద్ర!

సీ. ఈనాఁటివఱకైన నీవు మెట్టినచోటఁ బదపంకజాంకముల్ చెదరలేదు
ఈనాఁటివఱకైన నీవు మ్రోగించిన విజయదుందుభిఘోష వెడలలేదు
ఈనాఁటివఱకైన నీవుపాడినయట్టి తత్త్వగానరవంబు తగ్గలేదు
ఈనాఁటివఱకైన నీమాత్రమును భవత్ బ్రహ్మతేజము ధాత్రిఁ బాయలేదు
నాఁడు మాచిత్తములలోన నాటుకొన్న-నీలసన్మూర్తిదళితార్తి నేటివఱకు
లేశమాత్రంబుఁ దా సంచరింపలేదు-అపరశంకరరూప, వేమావనీప!

సీ. నిష్కల్మషంబంచు నీకుఁ దోఁచినదానిఁ బద్యరూపంబుగాఁ బాడినావు
ఏవేళ నేభావ మెద నంకురించునో యావేళ నటు కైత నల్లినావు
ఫలవాంఛలేక లోకుల మెప్పులకుఁ గాక స్వాతంత్ర్యభావముల్ చాటినావు
అందందు భావంబులు దస్కరింపకే చిక్కులేని పథంబుఁ ద్రొక్కినావు
భాషకుం గట్టువడనీక భావమునకు-నిచ్చవచ్చినటుల స్వేచ్ఛ నిచ్చినావు
నిన్నుఁబోలిన కవు లెందు నున్నవారె? అఖిలసుకవిప్రధాన, వేమాభిధాన!

సీ. యతియందుఁ బ్రాసలో గతికిభంగములేక భావసంపుష్టి లోపంబు గాక
మార్దవస్ఫూర్తి నేమాత్రంబు రానీక యౌచిత్యమునకు నే హానిఁ దేక
రసపోషణమున నీరసము గన్పడనీక లోకోక్తుల కొంకింత లోటులేక
మాధుర్యగరిమ నేమాత్రంబు చెడనీక పునరుక్తిదోషంబు పుట్టనీక
చీకిపోవక నానాఁటఁ జేవఁదేలు-కండగల చిక్కని తెలుంగుకవిత నల్లి
మా కొసంగిన నీ మేలు మఱవఁగలమె? వినుతవిద్యానివేశ! వేమనకవీశ!

సీ. ఇసుమంతపదమునం దెట్లిమిడ్చెద వహో! కొండంతభావంబు నిండియుండు!
బాహ్యప్రపంచసంబంధంబులై మించు నుపమానములు ముద్దులొలుకుచుండు
నాచిత్రమేమో ప్రయత్నంబె లేకయే యతియుఁ బ్రాసము వచ్చి యతికిపోవుఁ
బరిచయంబగు మాతృభాషలో సహజం బనర్గళంబై ధార యలరుచుండు
వాక్యసంపూర్తి గావింపవచ్చునట్టి-రసముఁ జెడఁగొట్టు పడికట్టురాళ్లు శూన్య
మాంధ్రజాతీయకవిత నీదైనసొత్తు-వేమనాభిఖ్య, కవిముఖ్య, విబుధసఖ్య!

సీ. పల్లెకూటములందుఁ బ్రత్యక్ష మగుచుండె నీపద్యరాజముల్ నేర్పు వెలయఁ
బండితావళు లెల్లఁ బాడుచుండిరి వేడ్క నీసూక్తిరత్నముల్ వాసికెక్కఁ
గవివిధాతలనోటఁ గాపురం బొనరించె నీసత్కవిత్వవాణీమతల్లి
పామరప్రజతోడఁ బరిచయం బొనరించె సాటిలేనట్టి నీ యాటవెలఁది
నిష్కళంకభవద్దివ్య నీతికావ్య-మఖిల రాజాధిరాజసభాంతరముల
మాన్యతం జెందెఁ గద! యసామాన్యరీతి-విబుధజనసన్నుతౌదార్య, వేమనార్య!

సీ. రంగదీశ్వరశిరోరంగగంగాతరంగోద్వేగ మలరారు నొక్కచోట
మందారమకరందమాధుర్యధుర్యమై యొప్పారుచుండు నొక్కొక్కచోట
నవనవప్రసవపల్లవమార్దవంబుతో నుల్లాసమొను గూర్చు నొక్కచోటఁ
గవకాబ్జసారసంగ్రహాఘ్రాతపోతమత్తాలయుచుండును దావు లొక్కచోట
సార! నీ కవితాశక్తి యద్వితీయ-మనుటలో వింత రవ్వంతయైనఁ గలదె!
సరసకవితామహారాజ్య సార్వభౌమ-రమ్యగుణధామ, లోకాభిరామ, వేమ!

సీ. అగ్రహారశతంబు లార్జించె నొక్కండు, గౌరవోద్యోగంబుఁ గోరె నొకఁడు
పసిఁడిపల్లకి నెక్కి పరువులెత్తె నొకండు, కనకాభిషేకంబుఁ గాంచె నొకఁడు
గండపెండేరముల్ గామించె నొక్కండు, బిరుదరాజములకై పెనఁగె నొకఁడు
కరితురంగములంచుఁ గప్టించె నొక్కండు, రాజత్వమునకునై గోఁజె నొకఁడు
కాని నీవలె లోకోపకారదృష్టిఁ-దత్త్వమర్మంబు నెఱిఁగించి తనిపినట్టి
కవిశిరోరత్న మొకఁడైనఁ గంటఁబడఁడు-విమలసత్కీర్తిధామ, శ్రీవేమనామ!

సీ. ఆంధ్రదేశంబునం దల్లిబిల్లిగనల్లె, నీ కీర్తివల్లికల్ నిష్కళంక!
స్వేచ్ఛమై భారతక్షితిఁ జరించిన దహా! నీ కీర్తికాంత సంచితచరిత్ర!
ఖండాంతరములందు నిండిపోయెను భళీ! నీ కీర్తిచంద్రికల్ నిర్మలాత్మ!
లోకాంతరముల నస్తోకమై దీపించె నీ కీర్తితేజంబు నిర్వికార!
ఏజగంబున నేవీట నెవనినోట-వెలికిరాకుండె భవదీయ వినుతిగీత?
మిట్టి నిన్నభివర్ణింప నెవ్వఁ డోపు-విబుధహృత్పద్మరవితేజ, వేమరాజ!

సీ. పరదేశగౌరవప్రాభవాసహ్యమా నాంగ్లేయజాతియం దవతరించి
మహితాధికారనిర్వహణార్థ మేతెంచి యాంధ్రదేశంబునం దధివసించి
మహనీయమాధుర్యమార్దవంబుల కుబ్బి యాంధ్రసారస్వతం బభ్యసించి
భవదీయసుకవిత్వపఠనంబు గావించి యమితానందంబు ననుభవించి
మించి మీపద్యములను ముద్రించి వెల్లడించి భాషకు మేలు గావించినట్టి
సీ. పి. బ్రౌన్. సంతతంబుఁ బూజింపఁ దగఁడె? విమలమంత్రప్రయోగి! శ్రీవేమయోగి!

సీ. కోపంబు మాని సంతోషంబుల నడంచు రూపంబు నొకసారి చూపుమయ్య!
లలితంబులగు భావములతోడ నలరారు పలుకుతో నొకసారి పలుకుమయ్య!
కరుణారసాంబుసంకలితమై విలసిల్లు చూడ్కితో నొకసారి చూడుమయ్య!
తజ్జ్ఞులచ్చెరువందఁ దత్త్వగానామృతం బెలమిమై నొకసారి చిలుకుమయ్య!
"వత్స! సకలమనోరథావాప్తిర"స్తు-టంచు నొకసారి వేడ్క దీవించుమయ్య!
చెలఁగి నీదాసులందు నన్నఁ జేర్పుమయ్య-అఖిలసుగుణకలాప, బ్రహ్మస్వరూప!

సీ. పఠియించుచున్నాము ప్రతిదినం బతివాంఛ నిష్కల్మషంబైన నీ చరిత్ర
వల్లించుచున్నార మెల్లవేళల యందు నీతిదాయకమైన నీదు కవిత
సాగించుచున్నాము చక్కఁగా నేఁటేట నొనర నీదగు జయంత్యుత్సవంబు
ధ్యానించుచున్నా మితఃపరం బెఱుఁగకే యన్యాయంబైన నీ దివ్యమూర్తి
మఱవ లే దింతవఱకు నిన్మఱవ లేదు; మఱవ మిఁక నైన నెన్నిజన్మములకైన
మఱవవలదయ్య, వలదయ్య, మమ్ము నీవు-విబుధసంస్తుత్యచాతుర్య, వేమనార్య!



# ఉమాతపోవనము

విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రి గారు

తపోవనము

పార్వతి, మంజరి-ప్రవేశము

మం—దేవి, తపముచేఁ గృశించియున్న నీ శరీరమునకు వృక్షసేకముచే మఱింత బడలిక కలిగింతువేల? వన పాలనమునకు మే మున్నారముగదా? నీవు విశ్రాంతి దీసికొనుము.

పా—చెలీ! వృక్షసేకమాత్రమున నాయాసము గల్గునా? ఏమోకాని దినదినము నాకీవ్రతానుష్ఠానమం దభిలాష మధికమగుచున్నది. ఆయాసము దూరమగుచున్నది. ఇది భగవత్కృపా విశేషముగా నగపడుచున్నది.

మం—దేవి! ఏమి భగవత్కృప? నీకఠిన నియమములకు ఱాలైనఁ గఱఁగవలసినదే! కాని యాతని మన మించుకయైన ద్రవింపలేదు.

పా—చెలీ! కఠఁగ కేమి? ఆపరాత్పరుని కృపాపూర మవ్యాహతముగా నాపైఁ బ్రవహింపకున్న వ్రతచర్య నిర్విఘ్నముగఁ గొనసాఁగునా? నా కిదియ చాలును. సంతతము నామహాసీయుని నామాక్షరముల నుచ్చరించుచు నాతనిమూర్తి నాంతరమున విలోకించుచు, నాతనినే సర్వదా ధ్యానించుభాగ్య మెట్లు లభించు?

మం—నీవు స్వయముగా నాఁటి యాలవాలాదిసాధనములచేఁ బెంచిన లతావృక్షాదులందుఁ బువ్వులు ఫలములుగూడ నఖండముగ జనించుచున్నవి. ఆతని నాశ్రయించిన నీమనస్సునకుఁ బసిమియైన నగపడ లేదు?

పా—(సలజ్జము) చెలీ! యూరకుండుము. (ద్వారమువిలోకించి) సఖి! ఎవరో మునిపుంగవుఁ డిటు వచ్చుచున్నాఁడు. ఆహా! ఏమి యాయాకారము! శరీరము దాల్చిన బ్రహ్మచర్యవ్రతమువలె నున్నాఁ డీ మునికుమారుఁడు. మోమున బ్రహ్మతేజము వెల్లివిరియుచున్నది. శాంతరసము మూర్తీభవించియున్న యీ నటునకు యథాశాస్త్రముగా సపర్య లొనరించుటకు సామగ్రిని శీఘ్రముగాఁ గొనిరమ్ము. మార్గాయాసమున మిక్కిలి బడలినట్లున్నాఁ డీ వర్ణిసత్తముఁడు.

మం—దేవి, వాస్తవమే. ఈబ్రాహ్మణుఁడు సాక్షాద్దక్షిణామూర్తివలెఁ బ్రకాశించుచున్నాఁడు. నీ తపంబునకు మెచ్చి యనుగ్రహింప నవతరించినాఁడేమో, యీ మహానుభావుఁడు?

పా—చెలీ! వేవేగ నర్ఘ్యపాద్యాదులను గొనిరమ్ము. ఆ మహాత్ముఁడు సమీపించుచున్నాఁడు.

మం—ఆ మహాత్ముఁ డనఁగా శివుఁడేనా? వాస్తవముగా నీతఁడు శివుఁడే?

పా—చెలీ! అధిక వ్యర్థప్రసంగములు మాని ప్రకృతము నిర్వర్తింపుము. (అనిముని కెదురేగి, నమస్కరించి, తోతెచ్చి, యుచితాసనమునఁ గూర్చుండఁ జేయును.)

బ్రహ్మచారి—(కొంచెము సేద దేఱుట నభినయించి) తపోధనకుఁ గుశలమా? అనుష్ఠానమునకు వలయుకుశలు, సమిధలు సుఖముగా లభించుచున్నవా? స్నానమునకు వలయు జలము గలదా? శక్తి ననుసరించి తప మొనరించుచున్న దానవా? శరీరమును పీడింపఁ

సుమా? అదియే ధర్మమునకుఁ బ్రధాన సాధనము. నీవు నీరుపోసి పెంచిన యీలతలు బాగుగ చిగురు దొడుగుచున్నవా? చిరకాలమునుండి లత్తుకపూఁతని నీ యధరోష్ఠమున కీచిగురించుక పోలియుండును. చేతి యందలి దర్భ లతిపరిచయముచే నపహరించు నీహరిణములందు నీ మనము ప్రసన్నమేనా? చూచితివా? ఇవి తమచంచలములగు నేత్రములను నీకన్నుదమ్ముల సామ్యమొందింప యత్నించుచున్నవి. పార్వతీ! అందము పాపకందముగాదను నార్యోక్తి సరియగునదే సుమా? ఉదారదర్శనమ్మగు నీశీలము మహర్షులకుఁగూడ సన్మార్గము నుపదేశించుచున్నది. దశపూర్వోత్తరులతోఁ గూడ నీ పర్వతరాజు లోకోత్తరములగు నీచరిత్రములచేఁ బవిత్రుఁడైనరీతిని సప్తర్షికరోజ్ఝితబలిప్రసూన విరాజితములగు నీ గంగాజలములచేఁగూడఁ గాలేదు. అర్థకామములకుఁ దావీయనిమనముతోఁ గేవల ధర్మమునే నీవు సేవించుటంజేసి ధర్మమే త్రివర్గమున సారవత్తమమని నేఁదలంచుచున్నాఁడ. పార్వతీ! నీయంత నీవు విశేషముగా సత్కరించిన నన్నుఁ బరునిగా భావింపకుమా! ఏలన 'సఖ్యం సాప్తపదీన' మ్మని యార్యులు వక్కాణింతురుగదా? దానివలన బహుశాంతస్వభావముగల నిన్ను బ్రాహ్మణ స్వాభావిక చాపలముగల నేను గొన్ని ప్రశ్నము లడుగనున్నాఁడను. రహస్యము గాదేని వానికి యుక్తరీతి నుత్తరము లొసంగఁగోరుచున్నాఁడను.

(నేపథ్యమున—గీతము)

కలయ చరాచర కారణ మీశ్వర
మజ కేశవ దుర్జ్ఞేయమ్
విలయసమయ జలశోషణ బాడబ
మవిదుర్జయ మహిమానమ్;
సులలిత లలితా సుందరవదన స
వేందు విలోకన లోలమ్
గళగరళాసిత కాంతివిమోహిత
కాలమతీంద్రియ జాలమ్.

(పార్వతి నివ్వెరవడి బయలు చూచును. చెలి హర్షోత్కంఠముగ దిశ లాలోకించును.)

బ్రహ్మచారి— బాల! నీజనన మాపురాణబ్రహ్మ వంశమున; ముల్లోకములందలి సౌందర్యము ముద్దగట్టినట్లున్న దీశరీరము. ఐశ్వర్యమా, చెప్పనక్కఱ లేనిది. ప్రాయమా, క్రొంగ్రొత్త విలాసముల కాలయం బగు తారుణ్యము. ఇంకను దపముచే సాధింపవలసిన వస్తువేది? భరింప శక్యముగాని యనిష్టము సంభవించి నపుడు మానవు లిట్టి వ్రతచర్య లవలంబించుట చూచుచున్నారము. ఎంత యాలోచించి చూచినను నట్టి యనిష్టప్రాప్తి లేశమును నీయం దగపడకున్నదే! నీయాకార మెన్నఁడును శోకాస్పదము కాఁగూడనిది. పుట్టింట నవమాన మెట్లు గల్గును? పరులు ధర్షించిరన్నచో నదియు నసంభవమే. పాఁపతేని తల మానికము నూడఁబెఱుకుట కెవఁడు చేసాఁచును.

(నేపథ్యమున)

కలితచరాచర కారణ ధారణ
హరణాఖండైశ్వర్యమ్
హరిహరరూపవిభేద విహీనమ
ఖండాఖండ సురూపమ్;
రూపవిహీనం పాపవిదూరం
తాపత్రయహరణ నిపుణమ్
విపులజ్ఞాన విభవయోగి మనో
వేద్యం హృద్యచరిత్రమ్. కలయ.

(పార్వతి నివ్వెరపడును. చెలి హర్షోత్కంఠయై బ్రహ్మచారి నాలోకించును.)

బ్రహ్మచారి—కృశోదరి! ఏలనామాట లాలించుచు నివ్వెరపడుచున్నదానవు? హితుఁడవగు నా మాటల ననన్యచిత్తమున నాలింపుము. మూఁడుకాళ్ల ముదుకలు ధరింపవలసిన నారచీఱల నిట్టి పరిపూర్ణ యౌవనమునఁ దాల్పనేల? ఆభరణముల వీడనేల? ప్రదోషకాలమున రాత్రి చంద్రతారకాదులతో విరాజిల్లును

**3 వ ముద్రణము** **800 పుటలు** తక్షణమే ఆర్డరును పంపుడు

60 దినములలో సులభముగా ఇంగ్లీషు నేర్చుకొనవచ్చును

ఇదివరకు యిటువంటి పుస్తకము బయలు పడలేదు. ఇది క్రొత్తమాదిరిగా ఇంగ్లీషుమాటలాడుటకును, చదువుటకును, వ్రాయుటకును నేర్చుకొనదగిన సులభమైన తెనుగులో ప్రచురింపబడి యున్నవి. ఈ విషయమును అందరును గమనించి వ్రాయండి. తక్షణమే వ్రాయండి.

తక్కువధర! అపారమైన విషయము!!

తెనుగు అక్షరములను చదివితే ఇంగ్లీషు పదములను తెలుసుకొనవచ్చును. మీరు ఇంగ్లీషు నేర్చుకొనవలయునంటే దిగువ కనబరచియుండు పుస్తకమును తీసి చదువండి. దీనికి ఉపాధ్యాయుడు అవశ్యము లేదు. సులభముగను నేర్చుకొనతగినది.

# ఆంగ్లశిక్షాన్ లేక ఆంగ్లబోధిని




ఆంగ్ల రాజ్యాధిపత్యమునకు లోబడిన మనదేశములో ఇంగ్లీషుభాషయే ముందుకు వచ్చి ఒక్కొక్కరియొక్క మేలునకును, జీవనోపాయమునకును, నాగరీకమునకును కారణముగా ప్రకాశించుచున్నది. అందరికిని తెలిసినవిషయముగా యుండియు కొన్ని సందర్భముల వల్లను, సౌకర్యము లేనందునను కొందరు ఈభాషను నేర్చుకొనకుండ విడిచి వెనుక వ్యసన పడుటను మనము కండ్లార చూచుచు వచ్చుచున్నాము. ఈకొఱతను తీర్చివేయుటకు ఈ పుస్తకము లోకోపకారముగా వ్రాయబడినది. ఇంగ్లీషు నేర్చుకొనుటకు ఆశపడువారికి దీనికి మించిన సహాయము వేరొకటిలేదనునది నిజము.

దీనిలో సాధారణ వాడుకకు తగిన ఇంగ్లీషుపలుకులు శబ్దించువిధము వాటియొక్క అర్థములును తెనుగులోను ఇంగ్లీషులోను దిగువ గుర్తించియుండు చిన్నకథలును సామెతలును వాటియొక్క ఇంగ్లీషుఅర్థములును సులభశైలిలో కనుపరచబడియున్నది.

ఈ పుస్తకములో ముద్రించబడిన పదముల మాదిరి:

అడాప్షన్ Adoption=స్వీకారము     కామిక్ Comic=పరిహాసమైన
మ్యూజిక్ Music = సంగీతము     ప్లేన్ Plane=సమతి

ఉపాధ్యాయులు లేకుండనే సులభముగా ఇంగ్లీషు నేర్చుకొనుటకు ఉపయోగపడు పుస్తకము ఇదియే. ఇందులో ఒకపదమును శబ్దించువిధమును వాటియొక్క ఇంగ్లీషు అర్థమును, మృగములు, పక్షులు, దినములు, నెలలు, సంవత్సరములు, పుష్పములు, ఆయుధములు, పెండ్లి, సీమంత నోటీసులు మొదలైనవి ఇంగ్లీషులోను, తెనుగులోను వ్రాయువిధమును, చిన్నకథలును, సామెతలును వాటియొక్క ఇంగ్లీషుఅర్థమును నిండా సులభమైన శైలిలో చూపించబడియున్నది. సుమారు 590 పేజీలుగల పెద్దపుస్తకము. అందమైన బైయిండు చేయబడియున్నది. స్త్రీలకును, బాలురకును, వ్యాపారులకును, పనిచేయువారలకును, ఉపాధ్యాయులకును మిగుల ముఖ్యమైనది.

ఇందులో అనేకవిధ నూతన విషయములు చేర్చబడియున్నవి. ఆంగ్లము తెలియని చదువరుల కష్టమును తీర్చుటకుగాను కొన్ని మంచి తంతి సమాచార మాదురులును, ఒకరు ప్రాణము విడుచుకాలములో వ్రాయవలసిన ఉయిలు శాసనములును, నెలజీతలెక్కలు నెలవడ్డి వగైరాలును మొదలైనవియు సరియైన పద్ధతిలో ఈ పుస్తకములో అణగియున్నవి.

ఈ పుస్తకము 1-కి వెల రూ. 2. తపాలుచార్జి అణాలు 8.

**టి. రాజగోపాలు మొదలియారు,** 302, టంకశాలవీథి, మింటుపోస్టు, మదరాసు.

ముఖ్యగమనింపు:— ఇదేమాదిరి ఇతరులచే ముద్రించబడిన పుస్తకమును చూచి మోసపోకుడు. పుస్తకమును తీయుటకు మునుపు మాపేరును వర్తకగుఱుతును గమనించి చూడుడు.

గాని యనూరున కభిముఖమై వాలిపోదుగదా? నీవే యాలోచింపుము. పోనీ, యీ ఘోరతపముచే దేవలోకనివాస మభిలషింతువా; యది యస్థాన సంరంభమే. నీజనకుండగు హిమవంతుని భూములన్నియు దేవభూములే. పోనీ అనురూపవరునకై యీతప మందువా, తపము నేయ నక్కఱలేదు: రత్నము నితరులు వెదకి కొందురుగాని రత్న మితరులు దన్ను గ్రహించుటకుఁ గాఁ దహతహలాడదు. నిన్నుఁ బరిగ్రహించుట కితరులే తపమొనరించుచుండ నీకీ తప మేల?

(పార్వతి దీర్ఘదీర్ఘముగు వేఁడినిట్టూర్పు విడుచును.)

(నేపథ్యమున)

పండిత మానసపారచరణచణ
  పాదయుగం గిరిశయనమ్
ఖండాఖండవిభేద విహీన సు
  ఖప్రదనిజమహిమానమ్;
చండకర శశివిశాలకాంతి మతి
  లోక మతీశ్వర తత్త్వమ్
మండిత నిజపదభక్తం దండిత
  భవపాశం నకలేశమ్.   (కలయ.)

పా—(జనాంతికముగ) చెలీ కర్ణామృతమగు నీ గానము ఎక్కడనుండి వినవచ్చుచున్నదో కదా! ఆహా ఏమి! యీగీతమాధుర్యము! ఒడలు పరవశ మగుచున్నదే!

మం—దేవీ! నీయొడలు పరవశ మగుటకు గానమాధుర్యమా, గీత ప్రతిపాదితుండగు మహానుభావుని మాహాత్మ్యమా కారణము?

పా—చెలీ! పరిహాసము లాడకుము; విశేషించి యిట్టి మునిపుంగవుని సాన్నిధ్యమున.

బ్రహ్మచారి— అపర్ణా! నీవెవ్వేఁడి నిట్టూర్పు తపఃఫలము అనురూపవరుఁడుగానే తెల్పుచున్నది. అయినను నా మది కొంకనిర్ణయము తోఁచకున్నది. ఈ ముజ్జగములందును నీచే వేఁడికోల్పడయఁదగువాఁడు లేనేలేఁడు. అట్టితఱి నీప్రార్థనమును దిరస్కరించువాఁ డెవఁడు? అహాహా! నీమానసము నపహరించిన యాతఁడు కేవలము దొంగయే కాఁడు సుమా? ఱాతిగుండె వాఁడు కూడ నగును. చిరకాలమునుండి కర్ణోత్పల శూన్యమయిన కపోలదేశమునందు వ్రేలుచు పాకపాండరకలమాగ్రములంబోని జటల నెవ్వఁడు పేక్షింపఁ గలఁడు? వ్రతానుష్ఠానముచే మిగులఁ గృశించి యొండతాఁకుడుచే నల్లబాఱిన భూషణస్థానములు గల నిన్నుఁ జూచిన యేదయాళుని హృదయమునకు దివాకరకర పరిమ్లానమగు శశాంకలేఖ స్మృతికి రాకుండును? అయ్యయో! చతురావలోకనములుగల నీకందోయికిఁ దన ముఖమును లక్ష్యముగాఁ జేయని యానీప్రియుడు నిక్కముగాఁ దనంత తానే సౌభాగ్యమదముచే వంచింపఁ బడినవాఁడు. పోనిమ్ము; గౌరి! ఇంక నెంతకాల మిట్లు శ్రమము నొందెదవు? నేనుగూడ బ్రహ్మచర్యము వలనఁ గొంతతపము సేకరించియున్నాఁడ. దానిలో సగపాలు నీ కిడే యిచ్చెదను. దానిని గ్రహించి నీ యిచ్చకువచ్చిన వరుని గైవసము చేసికొనుము. కాని యావరుఁ డెవ్వరో వినఁ గుతూహల మధికముగాఁ గలదు. తెలిపినఁ దప్పులేదని యెంచెదను.

(పార్వతి మనోగతమును జెప్ప లజ్జించినదై పార్శ్వమున నున్న చెలిని క్రేఁగంటఁ జూచును.)

మం—మహాభాగ! నీకుఁ గుతూహలము గలదేని, దేనికై యీ దేవి, తామరపూవు నెండమాటుచేసినట్లు, తన శరీరమును దపస్సాధనముగాఁ జేసినదో, దానిని వినుము. ఈమానిని మహైశ్వర్యసంపన్నులగు మహేంద్రుఁడు మొదలగు దిశాధీశ్వరులనెల్ల నిచ్చ మెచ్చక కుసుమాయుధ విశసనమున సౌందర్యలుబ్ధుఁడుగా నెఱుఁగఁబడిన మహేశ్వరుని భర్తగా నలచినది. అనాఁడు దుస్సహపురారాతి హుంకారనిరాకృతమగు విషమాస్త్రుని బాణము రుద్రుపొంతఁ బోఁజాలక యీమె యెదపై కఠినాతికఠినపాతముగ నోనాటెను. కాముఁడనంగుఁడైనను నాతని యభీష్టమిట్లు నెఱవేఱినది. అది మొదలుగ మదనవేదనా భరముచే చందనాక్త

యఃయ్యును హిమానీశిలాతలములందైన నొక్క పరియైన నీవు నిద్రించి యెఱుంగవు. వనాంత సంగీత సఖులగు కిన్నరకన్యకలు హరచరితమును గానము సేయ వర్ణముల నాలపింపఁగానే కన్నీరు మున్నీరుగా గద్గదధ్వనులతో ననేకపర్యాయములు వారికిఁగూడ దుర్భరశోకము గల్పించెను. రాత్రి నాలవపాలుమిగిలి యున్నను కనులు ముకుళించియే 'నీలకంఠ! యెటకేగదవు? వలదు వలదు' అని వ్యాపాకల్పిత కంఠాలింగనముతో మేల్కాంచుచుందువు. ఈముద్దరాలు స్వహస్తముచే మహేశ్వరుని రూపము లిఖించి 'నీవుసర్వవ్యాపకుండవని పెద్దలందురుగదా? నీయందత్యంతానురాగముగలనీసేవకురాలి నేల తెలియఁజాలకున్నావు?' అని చంద్రశేఖరుని రహస్యముగా నుపాలంభించును. ఇట్లు మనోజరుజాపారము ననుభవించియు నా జగత్పతి ప్రసాద మొందుటకుఁ దగునుపాయము లితరములు లేమింజేసి తండ్రిగారి యనుజ్ఞనంది మాతోఁ గూడ నీతపోవనముఁ బ్రవేశించినది. ఈతపస్వినిచేత నే నాఁటఁబడిన తపస్వాత్ములగు నీవనస్పతులు చిరకాలమునకు ముందే ఫలించుచున్నవి. కాని యాచరాచరగురు నుద్దేశించిన యీమెకోరిక యీరికనెత్తనైన లేదు. కటకటా! దుష్కరతపః కృశాంగియై మాటిమాటికిఁ జెలికత్తెలకుఁ గన్నీరు గలుగఁజేయు నీబాలికను, అనావృష్టి పరిపీడితయగు భూమి నింద్రుఁడువోలె ప్రార్థిత దుర్లభుఁ డగు నా మహేశానుఁ డెప్పు డనుగ్రహించునో?

బ్రహ్మచారి—(పొంగి పొరలుచున్న హర్షమును బైకిఁ దెలియనీయకుండ మాటి) కోమలీ! నీచెలి చెప్పిన మాట వాస్తవమా? పరిహాసమా?

పా—(లజ్జనతికష్టముగ నణఁచికొని చేతితో జపమాల నందికొని త్రిప్పుచు మందస్వరమున) వేదవిదగ్రగణ్యా! నీవిప్పు డెట్లు వింటివో యట్లే యీవిధేయురాలు మహోన్నతపదవి నభిలషించి యున్నది. ఆ పదవి లభించుటకు సాధన నిరాతపమే. కోరికలకు దూరము లేదుగదా?

బ్రహ్మ—అహాహా! మహేశ్వరుని నేను బాగుగనెఱుంగుదును. నీవాతని నభిలషించుచున్నదానవు. ఆయమంగళాచారుని నీ వనువర్తించుట నాకెంతమాత్ర మనుమతము గాదు సుమీ!

(నేపథ్యమున)

కుండలి కుండలమండిత కర్ణం
  గూఢవిచిత్ర చరిత్రం
ధుండినాథకర ధూతదుష్టజన
  దుష్టకనిష్ఠ చరిత్రమ్;
దండిత కాలం పండితపాలం
  ఖండిత గజవరముండమ్
చండీకోపన చిత్తనివాకర
  ణార్పితనిజతను ఖండమ్. (కలయ.)

(మంజరి ఆశ్చర్యస్తంభిత యగును. పార్వతిసహర్షోత్కంప మభినయించును.)

బ్రహ్మచారి—ఓసి ముద్దరాలా! తుచ్ఛవస్తువునం దింత యభినివేశ మేటికి? వివాహకాలమందుఁ గల్యాణ కంకణము ధరించిన నీకోమలకరపల్లవము పాఁపకంకణముగల యాపినాకికరముతో నెట్లు ప్రథమ సమాగమమును సహించును? నీవుదాల్చిన పాలమీఁగడ వంటి యంచయంచుల పట్టుచీర నెత్తురు చుక్కల గార్చు నాపినాకి గజాజినము నెట్లు రాపాడునో నీవే యోజించుకొనుము! దివ్యభవనాంగణములందుఁబూల పరపులపై నుంపఁదగిన నీపాదచిహ్నములు, ఎముకలు, కేశములు మొదలగు నమంగళపదార్థములచే దూషితములగు శ్మశానవాటికలం దుంచుట శత్రువుల కేని సమ్మతమగునా? వెఱ్ఱిపిల్లా! త్రిలోచనాలింగనము నీకు సులభమే యగును. కాని హరిచందనాంచితమగు నీ చనుదోయిని జిభస్మరజము తావుకొనుటకంటె నింక ననుచిత మేదికలదు? అయ్యయో! మత్తదంతా

పర్వతారోహణయోగ్య వగు నీవు వివాహానంతరము
ముదుసలియెద్దు నెక్కి యూరేగుచున్నపుడు జనమా
త్రాలగోపాలము నవ్వి చప్పట్లుకొట్టకుండురా? ఈయవ
మానము నెట్లుభరింపఁగలవు? శ్రీహరీ! అవాంఛనీయ
మగు కపాలధారి సమాగమము నభిలషించి విశదకాం
తిగల యాశశాంకరేఖయును, లోకనేత్రములకు జ్యో
త్స్నావతారమవగు నీవును మిగుల శోచ్యదశ నొందు
చున్నారు. కట్టా! శరీరమందమా, వికటనయనములు
గలది; కులగోత్రములా, యెవ్వరు నెఱుఁగనివి; సంప
దలా, కట్టుబట్టయే చెప్పవలయును. హరిణనేత్ర!
లోకములో వరులకుండవలసిన సామగ్రిలో నీకపాలి
కేది కలదు? చాలుఁ జాలు! ఈతుచ్ఛవాంఛితమునుండి
బుద్ధిని మరల్పుము. మహాపుణ్య లక్షణములుగల నీ
వెక్కడ? అమంగళాచారుఁడగు నాతఁడెక్కడ? మఱి
మంతులెవరును శ్మశానశూలమునకు యూపమునకుం
బోలె వైదికసత్కారము లొనరింపఁ దలంపరు.

పార్వతి— (కోపముచే నధర మల్లలాడఁ, గనుబొమలు
ముడివెట్టి, కనుగొనల రక్తిమగదురఁ బెడమొగము
తో) ఓయి, వృథా వేదపాఠకుంఠీకృతకంఠా! నీవునిక్క
ముగా హరు నెఱుంగవు. ఎఱిఁగియున్న నిట్లందువా?
మందబుద్ధులు అతిలోకము, నవిజ్ఞేయ కారణమునగు
మహాత్ములచరితము ద్వేషింతురు. ఆపదలఁ దగిలం
చికొనుటకు నైశ్వర్యము నొందుటకును లోకము
మంగళము లగు గంధమాల్యాదుల ననుభవించు
చున్నది. నిష్కాముఁడై లోకైకత్రాణ పరాయణుఁ
డగు నామహాదేవునకు ఆశాపాశావపాశితములగు నీ
మంగళములతోఁ బనియేమి? శివుఁడు నిరుపేదయయ్యు
సంపదల నిచ్చువాఁడు; పరేతభూనివాసి యయ్యుఁ
ద్రిలోకనాథుఁడు; భీమరూపుఁడయ్యు మంగళప్రదాత.
ఆతని యాథార్థ్యము నెఱుంగఁజాలినవా రెవరు?
భూషణ భూషితమగుఁ గాక, లేక భోగివేష్టితమగుఁ
గాక; గజచర్మధారి యగుఁగాక, లేక దుకూలవాసమ
గుఁగాక; కపాలమాలా కలితమో, లేక శశాంకలేఖాం
కితమో యగుఁగాక; ఆవిశ్వాత్మకుని శరీర మిట్టిది
యని యేర్పరింప నలవియగునే? ఆపరమేశ్వరుని శరీర
స్పర్శమునఁ జితాభస్మము మిగులఁ బవిత్రతమమగును.
దేవతలెల్లరు నాయాదినటరాజు నాట్యకాలమందుఁ
దూలినచితాభస్మమును ఫాలములం బరిగ్రహింతురు
గదా! సంపద్విహీనుఁడై యెద్దు నెక్కి వాహ్యాళి
వెడలు నా పరాత్పరుని పాదాంగుళులకుఁ బ్రమత్తై
రావణారూఢుం డగు పురందరుండు వందన సమయ
మున నిజశిరస్స్ఫురన్మందారమాలారజంబున రక్తిమంబు
గల్పించుచునుగా! ఉన్మత్తుఁడా! భ్రష్టబుద్ధివై శివునియందు
దోషము గల్పింప నెంచియు నొక్కమాట మంచిదే
పల్కినాఁడవు. బ్రహ్మకుఁ గూడ నెవ్వఁడు కారణమో
వాని పుట్టువుఁ దెలియుటెట్లు? చాలుఁజాలు, నీ వివా
దము. ఓయీ, నీవు శంకరుఁ డెట్టివాఁ డని తలంచు
చున్నాఁడవో యట్లె యాతఁ డగుఁగాక. నామనము
మాత్ర మాతనియందే నిబద్ధభావమై యున్నది.
స్వేచ్ఛాచారులకు నిందాభయము లేదుగదా?

(బ్రహ్మచారి ఏదియో పలుకఁ బోవును.)

పా— చెలీ! యీదుష్టవటు వింక నేదో పల్కుటకుఁ బెదవు
లఁ గదల్చుచున్నాఁడు. వీని నావలకుఁ బంపివేయుము.
మహాత్ముల నిందించినవారు మాత్రము గాక యా
నిందల విన్నవారును బాపముల నొందుదురు. పోనీ,
యాతఁ డక్కడనే యుండనిమ్ము. నేనే వేఱుచోటికిఁ
బోయెదను (అని లేచి పయ్యెద జాఱుచుండ వెడల
నుంకించెను.)

(నేపథ్యమున)

సమదమదనసుమసాయక హృతనిజ
ధైర్య మపి క్షణకాలమ్
భ్రమ మహహో య దృశానలకీలా
జాలాదగ్ధసుమాస్త్రమ్;
దుర్భరఘోరతపః కృశదేహా మ
నన్యచిత్తా మచలసుతామ్



నిర్భరపాణిపీడనసుఖితా
మతిదయయా కుర్వాణమ్. (కలయ)

(పార్వతి ఆశ్చర్యభయసంభ్రములతో వెనుదిరిగి చూచు నంతలో బ్రహ్మచారివేషము నపనయించి శివుఁడు స్వస్వరూపముతోఁ జిఱునగవు మొలకెత్తుమోముతో "బాలా! పోకు పోకుము" అని పార్వతి చేయి పట్టుకొనును. పార్వతిసాక్షాత్కరించిన పరమేశ్వరునిఁ జూచి వణఁకుచు శరీరమునఁ జిఱుచెమ్మట గ్రమ్మ నెట్టకై యెత్తినపాదము నట్లే యుంచి యుండును.)

శివుఁడు—(చేయివీడి) అవనతాంగి! నేటినుండి నేను నీకు దాసుఁడను. సాటిలేని మేటితపముచే నన్ను సాయత్తఁ జేసికొంటివి. ఇంతవరకు నీవనుభవించు క్లేశముల నుపేక్షించినదానికిని ప్రియనిందచే నీకు మనఃక్లేశము కలిగించినదానికిని మన్నింపుము.

(అనునంతలోఁ బార్వతి యుటజాభ్యంతరమునఁ కేగును.)

మం—(శివునకు సాష్టాంగ మాచరించి) దేవా!

ఉ. ఎందు జనించి యెందుఁ జరి
యించితి నెందువిలీనమౌదు నిం
కెందు జనింపఁగల్గుదునొ
యీశ్వర! తాపము వాసి ప్రేమ మైఁ
జిందు భవత్పదద్వయ వి
శేషసపర్య లొనర్చి శాశ్వతా
నందము నొందునట్లుగ స
నాథను సేగ్గృప సేసి కావవే!

(అని ప్రార్థించుచుండఁ పార్వతికడనుండి కమలినివచ్చి)

కమలిని—దేవా! లజ్జాభయ సంభ్రమములచే మాదేవి మీకడనుండి వెడలుటకు క్షమింపుము. ఆమె బేల యగుట బాలగదా? జనకునిచేఁ బ్రదత్తయై మీ పరిచర్య సేయు టామెసంకల్పము. కావున నట్లను గ్రహింపుము.

శివుఁడు—సరే, అట్లే యగును. మీరు మీయిండ్ల కరుగుఁడు. ఎల్లి హిమవంతునికడకు సప్తమహర్షులఁబంపి పెండ్లిమాట లాడించెదను.

(అని యంతర్ధాన మందును.)

పా—సఖులారా! మహేశ్వరుఁడు తిరోహితుఁడై పోయి నాఁడే. మనమును నగరమున కేగుదము రండు.

(అని యందఱు నిష్క్రమింతురు.)

---

# భరతమాత

ఉన్నవలూరి వేంకటరామారావుగారు



వ్యాసకర్త.

మహితప్రబంధ నిర్మాణ నైపుణిఁగన్న కవివరేణ్యుల ప్రాపుఁ గాంచినావు
నిగమాగమప్రోక్త నియమపారగులైన బ్రహ్మవేత్తల మెప్పుఁ బడసినావు
పరిపాలనక్రియా ప్రతిభఁగాంచిన యట్టి యవనీపతులప్రాపు నందినావు
ఎనలేనిబల్మి మెన్నిక పోరాడు యోధాగ్రగణ్యులఁ గాంచి యలరినావు
శిల్పకళానల్ప శేముషీపరులైన చిత్రకారులకల్మిఁ జెలఁగినావు
పరమపాతివ్రత్య గరిమఁ జెన్నారు సాధ్వీమతల్లులఁ గాంచి వెలసినావు
పుడమి యెల్లను సస్యవిస్ఫురితఁ జేయు-పుణ్యవాహినీ సంతతిఁ బొందినావు
ధన్యతము రాలవెంతయుఁ దల్లి! నీవు-భవ్యగుణగౌరవోపేత, భరతమాత.

# ఉగాది కానుకలు-౨

నట్టి లక్ష్మీనరసింహము గారు

ఇప్పటికిఁ దొమ్మిదిమాఱు లైనది; ఇదిపదియవమాఱు: భారతీభాయి వీథి తలుపు తీసి మరల బయటికిఁ దొంగిచూచినది. పిల్లలను బరుండఁబెట్టిన వెనుక ఆమె యట్లు తలుపుతీసి చూచుచునే యుండెను. వీథిలోని స్తంభపుదీపము మసకవాఱె, యాఫాల్గుణబహుళత్రయోదశి చీఁకటిలో నేమియు స్పష్టముగాఁగనఁబడ నీయలేదు. అయిన నేమి? కన్నులు నిరర్థకములైనయెడల చెవులున్నవి గదా? అడుగుల చప్పుడగునేమో యని యామె చెవులు ఆక్కించి వినెను.

పదిగంటలరాత్రి కావచ్చినది. ఆతురము మాఱె యారాటములోనికి దిగి, యారాటమిప్పుడు భయముగాఁ బరిణమించుచుండెను. ఏమైనాఁడు తన మగఁడు?

ఉదయమున పదిగంటలకే భారతీభాయి భర్త, గదాధరదాసు బాబు, బయలుదేఱి వీథిలోనికి వెళ్లినాఁడు. "ఉద్యోగాన్వేషణార్థ" మని యతఁడు భార్య మొగము చూచి, వెఱనవ్వు నవ్వి, వెడలెను. వెళ్లినవాఁడు మరలి రాలేదు సరిగదా, యేమైనాఁడో కబురును లేదు. భారతి మంచి ధైర్యవతి. పేదఱికమువలని యిబ్బందులును, చిక్కులును సహజమైన యామె శరీరబలమునుగాని, మనోదార్ఢ్యమునుగాని తగ్గింపఁజాలవాయెను. అట్టి నిబ్బరము గలదియు నేఁటిరాత్రి కలవరపాటు చెందసాగినది. ఇరువురు పిల్లల ముద్దుమాటలు వినుచు దుఃఖమును మఱచి నవ్వుపెదవులతోఁ బగలెల్లను గడిపినదికాని, యిప్పుడు గుండె బరువుతో బితుకుబితుకు మనుచుండెను. మంజరికి గౌను గుడ్డయు, మదనునికి బూరయు, ఉగాది కానుకలు కొని పెట్టుట యెట్లన్నది కాదు; అంతకంటె హెచ్చు బితుకు. ఇంతయాలస్యము భర్తయెన్నఁడును జేయలేదు; పది గంటలరాత్రియైనను రాలేదేమి?



వ్యాసకర్త

నిట్టూర్పుపుచ్చి, కొంచెము పడఁకుతో, "పది నిమిషములలో వారు రానియెడల, ఏమైనను చేయవలెను" అని యామె తనలో ననుకొన్నది. ఏమిచేయుటో మాత్రము తోఁచలేదు. పోలీసువారికి తెలియఁజేయుట యొకటి యున్నది. "పదినిమిషములు" అని నోటిలో గొణుగుకొనుచు, ఆమె లోనికిఁ బోవఁబోయెను.

ఇంతలో, దగ్గఱపడుచున్న యడుగుల చప్పుడు వినఁబడినది. ఆయనకాదేమోయని భారతి ప్రాణములు బిగియఁబట్టి, నిదానముగా వినుచుఁ జీఁకటిలోనికిఁ బాఱఁజూచెను. దీపపు వెలుతురులోనికి రాఁగానే భర్తయన్న నిశ్చయముకలిగి, యామె హృదయమునుండి దీర్ఘనిశ్వాసము వెలువడినది.

కష్టముతోఁ గాళ్లీడ్చుకొనుచు గదాధరుఁ డిల్లు చేరెను.

భారతి చేరవరిగి, చేయూఁత యిచ్చి "ఆయాసముగా నున్నదా?" అని యడిగినది.



"ఆయాసముగా నున్నదా!"

"అవును; కొద్దిగా," అని దౌర్బల్యము తెలుపు చిఱునవ్వుతో నతఁడు లోనికిఁ బ్రవేశించి, భార్యతనకోటు తీయుచుండఁగా నామెతో "ఇంత యాలస్యమగునని నీకు కబురు పంపకలేకపోయితిని. ఏలయన—," అని యేమో చెప్పఁబోయెను.

భారతి యడ్డువచ్చి "మీరు సురక్షితులై వచ్చినారు; అదియే చాలును. భోజనమున కాలస్యమైనది; మఱి రండు," అని భోజనశాలకు దారితీసినది.

వంటయిల్లే వారి భోజనశాల. పీటమీఁద గదాధరుఁడు చతికిలఁబడెను. భారతి ప్రొయ్యికడకు వెళ్లినది. భర్త యేమో చెప్పఁదలఁచుకొన్నారని యామె యెఱుఁగును. అయినను, వివేకవతి కావునఁ దొందరపెట్టి యేమియును బ్రశ్నింపక, "రొట్టెలు కొంచెము వెచ్చపెట్టవలెను నాఁగుదురా? లేక, యాఁకలి యగుచున్నదా?" అని మాత్రమే యడిగినది.

"నీవేమియు తొందరపడకు. ఆఁకలియంతగా లేదు. అఱు, పదునేకంటలనడుమ కొంచెము రొట్టెయు కాఫీయు పుచ్చుకొంటిని," అని గదాధరుఁడు గోడకు చేరగిలఁబడి, రెండుకణఁతలను బొటనవ్రేళ్లతో నొక్కిపట్టి, కన్నులు మూసికొనెను.

కొంతసేపు నిశ్శబ్దము. ఆ తరువాత—

"భారతీ, పని దొరకినది. గొప్ప యుద్యోగము కాదు; శాశ్వతమైనదియు కాదు; మున్నాళ్లముచ్చటయే యనుకొందును." అని గదాధరుఁడు గద్గద కంఠముతో నాఁగెను.

తత్క్షణమే భారతి భర్తపార్శ్వమును జేరి, కంఠము కౌఁగిలించుకొని, "అయ్యో! ఏలవిచారించెదరు; ధైర్యము వహింపుఁడు," అని యతని చెవిలోఁబలికెను.

గదాధరదాసు బాబు చరిత్ర యంతగా నసాధారణమైనది కాదు. ధనికునియింటి యేకపుత్రుఁడగుటచేతఁ జిన్నతనము ముద్దుముచ్చటలతోఁ గడచినది. ఇరువది యేండ్ల యీడున నతని తండ్రి హఠాత్తుగా మరణించెను. అప్పుడే యాస్తికంటె హెచ్చుగానున్న సంగతి యప్పుడు లోకమునకు వెల్లడి యయినది. తండ్రి యనంతరము తల్లి మూఁడుమాసములుజీవించెను. అతనికి మిగిలినవారు భార్య భారతి, మూడేండ్ల మంజరి, చంటి బిడ్డఁడు మదనుఁడు.

జీవనోపాధి నిమిత్తము గదాధరుఁడు ప్రయత్నింపవలసివచ్చెను. స్నేహితుల సిఫారసుల మూలమున నతని కొక కంపెనీలో సెక్రిటరీపని దొరకినది. అతని బుద్ధి వ్యాపారవిషయములలో నంతగా రాణించినది కాదు. కంపెనీ రెండేండ్లలో దివాలా తీసినది.

అప్పటినుండియు గదాధరుని కుటుంబమునకుఁ జెడు దినములు ప్రారంభమైనవి. వ్యవహారజ్ఞానము చాలనివాఁడని యతనికి శాశ్వతోద్యోగ మెచ్చటను లభింపకుండెను. పక్షము దినములు పనియున్న పక్షమునకు, మాసముదినములుద్యోగాన్వేషణము. ఇట్లిక్కష్టముమీఁద సంవత్సరము గడచినది. కొద్ది గొప్ప మున్ను కూడఁబెట్టుకొన్న ధనమెల్ల వ్యయమయ్యెను. ఇప్పటికి నెలయయి పని

యన్నమాట లేదు. ప్రయత్నములెల్ల నిష్ఫలములు కాఁగా గదాధరుఁడు విసుగుపుట్టి, యెట్టిపనియైననుసరియే యొప్పుకొనవలయునన్న నిశ్చయముతో నాఁటియుదయము బయలుదేఱెను.

నిశ్చయప్రకారము పని యెట్టిదో యొకటి కుదుర్చుకొనియే వచ్చినాఁడు.

డగ్గుత్తుకపడిన గొంతుక సరదుకొని యతఁడు, "భారతీ, నాకిప్పుడు దొరకిన పని వేణునాథబాబు కంపెనీలో." అనెను.

"అయ్యో!" అన్నది భారతి.

"నీవు విచారింతువని నేనెఱుఁగుదును. అయినను, వేణునాథబాబు కన్నుల యెదుట నేను పడవలసిన యవసరము లేదు. నాస్థితిలో నున్న వారికి దర్శనమిచ్చువంతటి సామాన్యుఁడుకాఁ డతఁడు; మహాభాగ్యవంతుఁడైనాఁడు."

భార్య యేమి మాఱు పలుకునో యని గదాధరుఁడాగెను. ఆమె యేమియుబదులు చెప్పక, చూపులు త్రిప్పుకొని, కొద్దిగా నిట్టూర్చినది. వేణునాథబాబునామము తన భర్తకు విషప్రాయమని యామె యెఱుఁగును. కారణము భర్తయే తనతోఁ జెప్పియుండెను. గదాధరునితండ్రి భాగ్యవంతుఁడైయున్న కాలమున నతని ముఖ్యస్నేహితుల లోని వాఁడు వేణునాథబాబు. అట్టివాఁడు గదాధరునితల్లి లేమి కల్గి చేయిచాఁచినను సాయము చేయలేదు; ఎట్లున్నారో యని యాకుటుంబమువైపుఁ గన్నెత్తియుఁ జూడలేదు. "మలమల మాడి చత్తునుగాని యాదౌర్భాగ్యుని సాయమెన్నఁడును గోర"నని గదాధరుఁడు కోపమునఁ బలుసారులుపలికియుండెను. ఆవేణునాథబాబు కంపెనీలోనే యిప్పుడుపనికిఁ గుదురుకొనవలసి వచ్చినది, పాపము!

"అది యొక్కటియే నాకు గతిగాఁ గనఁబడినది. ఇదివఱకే యాకంపెనీలో—"

"ఎట్లు కుదురుకొనఁ గలరు? మనసొప్పవద్దా?"

"మనసొప్పనియెడల కడుపే యొప్పించును. కాని యిదివఱలోఁ బ్రయత్నించినను నిష్ప్రయోజనకరమై యుండెను. పనియొకటి యీనాఁడే యక్కడ ఖాళీ వచ్చినది. ఆసమయమునకే నేనచ్చటికి వెళ్లుటయుఁ దటస్థించెను." అని గదాధరుఁడు వెడనవ్వుతో, "నూఱేండ్లాలోచించినను నాకు వారిచ్చిన యుద్యోగ మేమో నీవు చెప్పలేవు," అనెను.

"నీచమైనదా? కష్టమైనదా?"

"నేఁటి నా యనుభవముఁ గూర్చి విన్న వెనుక, కడుపుకక్కుర్తిని మనుష్యు లెట్టిస్థితిలోనికి రావచ్చునో నీకు బోధపడును. అవమానకరమగు నాకథ నీముఖము చూచుచు చెప్పలేను; దూరమున కూర్చుండుము." అని గదాధరుఁడు చూపులు నేలవ్రాలిచి, వృత్తాంతము సవిస్తరముగాఁ దెలిపెను.

* * * *

కిసిమిసుపండుగకు ముందటిరాత్రి కిసుమిసు దేవత మనుష్యరూపమునవచ్చి, చిన్నపిల్లలకు బొమ్మలు మొదలగు నాటవస్తువులను కానుక తెచ్చి యిచ్చుచుండు నన్న గాథ క్రైస్తవులయం దున్నది. కలకత్తాలోని యొకపెద్ద యింగ్లీషుకంపెనీవారు తమ షాపునందుఁ బయిగాథ యుపయోగపఱచి, కిసుమిసు పండుగకు వారము దినములు ముందు నుండి, మంచువంటి తెల్లగడ్డముగల వృద్ధశ్వేతముఖుని చేత కిసుమిసు దేవత వేషము వేయించి యతఁడు దొరపిల్లల కాటవస్తువు లమ్మునట్లు నియమించుచుండిరి. కిసుమిసు దేవతయే స్వయముగా కిసుమిసుకానుక లిచ్చుచున్నాఁడని దొరపిల్లలు గుంపులు కట్టి వచ్చుటచేత ఆ షాపువారికి విశేషలాభము కలుగుటచూచి, వేణునాథబాబు కంపెనీవారు తమ బొమ్మలషాపులో నట్టి యుపాయమే యొకటి పన్నిరి. ఉగాదిపండుగకు వారము దినముల ముందునుండి, సొగసరియగు పడుచువాని చేత ఉగాదిదేవత వేషము వేయించి, యాదేవత యుగాదికానుకలు పిల్లలకిచ్చుచున్నట్లు ప్రకటింపఁగా, నాగరకము గల గొప్పయిండ్ల వంగదేశపు పిల్లలు గుంపులుకట్టి యచ్చటి యాటవస్తువులకొఱకు వచ్చుచుండిరి. ఇట్లు మూఁడు సంవత్సరములై జరుగుచుండెను. ఆయేఁడు వారి షాపులో ఉగాదిదేవత వేషము వేసినవానికి హఠాత్తుగా తీవ్రమైన

జ్వరము వచ్చినది. మఱిమూఁడుదినములకుఁగాని యమ్మకములు ముగియవు. క్రొత్తయుగాదిదేవతకొఱకు షాపువారు వెదకుచున్న సమయములో గదాధరుఁడు పనికొఱకు వెళ్లుట జరిగినది. రూపసియని షాపుపెద్ద యతనికి వెంటనే పని యిచ్చెను. నాటకములోని రాజవేషము వలె తయారై యుగాదిచిహ్నముగా వేఁపపువ్వులను,మామిడిపిందెలను కుచ్చుగా సమర్చియున్న జలతారు కుళ్లాయి ధరించి కుర్చీమీఁద కూర్చుండి, యాటవస్తువులను గొనుటకు వచ్చెడి బాలికాబాలురతోఁదదనుగుణ్యమైనసంభాషణముచేయుచు, ప్రొద్దుట నుండి రాత్రి తొమ్మిదిగంటల వఱకును కథ నడపవలెను.

* * * *

"ఉదరనిమిత్తం బహుకృతవేషం" అని గదాధరుఁడు ముగించెను.

"అయ్యో! ఎంతకష్టము!"

"కష్టమే; నీచమే. కాని, యీపనికి నాకు దినమునకు నాలుగురూపాయీల కూలి నిత్తురు. మధ్యాహ్నమున తిండి, సాయంకాలమున కాఫీయు దొరకును. నా పనియేమో విన్నావుగదా; ఇప్పు డేమందువు?"

మగనిప్రక్కకు మరలఁజేరి భారతి, "మీ వంటి ధైర్యవంతులు లేరందును," అని కన్నుల నీరు నించెను.

"ధైర్యమున కేమున్నది? ఆవేషమున నన్నెవ్వరును పోల్చుకొనలేరన్న నిబ్బర మొకటియున్నది. ఆపైని, అమ్మకమగుచున్నంతసేపును సిగ్గుపడుటకైనను దెఱపి యుండదు. నామాట కేమి? నేనీపనిచేయుట నీకవమానకరముగాఁ దోఁచుచుండలేదుగదా?"

"నా కేమి? అత్యవమానకరమే." కాని, భారతి తన నిజమైన యూహ వెల్లడిచేయక, యనుచిత మనునది యందేమియు లేదనియే సరదిచెప్పెను. "పిల్లలకు సంతోషము కలిగించుపని; సంతోషకరమైన పని; అన్యాయము లేనిపని;"—ఇవి యామె యుపయోగించిన వాక్యములు. మధ్యాహ్నభోజనము షాపులో సరియైనది పెట్టరేమో యన్నవిషయ మొక్కటియే తన యసంతృప్తికారణముగా నామె పలికెను. "ఉగాదిపండుగకు లోపుగా మీరింటియొద్ద భోజనము చేయరు కాఁబోలు?" అనియామె తటాలున భర్తపార్శ్వమును విడిచి, రొట్టెలుతెచ్చు మిషతో ప్రొయ్యికడకు వెళ్లెను. లేనిమెఱుఁగుల దుఃఖ మాఁపుకొనుటకు దారి కనఁబడలేదు, పాపము!

రొట్టెలు తినుచు గదాధరుఁడు, "పిల్లలకు బొమ్మలు కొనుటకై షాపులోనికి నాపూర్వపరిచితు లనేకులు వచ్చిరి గాని, వారెవ్వరును నన్నుఁబోల్చుకొనలేదు" అన్న మాటకు మరల దుఃఖము ముంచుకొనివచ్చినట్లయినది భారతికి! పాపము! భర్తకెంతటి కష్టస్థితి!

"భారతీ, పిల్లల యాటవస్తువుల నిమిత్తము మనవారెంత ద్రవ్యము తగులఁబెట్టుచున్నా రనుకొంటివి! అయ్యో, మన మంజరికిని, మదనునికిని ఉగాదికానుక ఒకటియు కొనిపెట్టలేనుగదా యను చింతయే యొరుల పిల్లలచేతులలో బొమ్మలు పెట్టుచున్నప్పుడెల్ల నన్నుఁ బీడించెను. అప్పుడు నాకు జగత్తంతయు నొక చిత్రనాటకమని తోఁచినది. వేషమువేసి కూర్చున్న యుగాది దేవతగానికి పిల్లలున్నారేమో, యుగాదికానుకలు వారికి కావలయునేమో యని యెవ్వరు నాలోచింపరుగదా!"

ఆమాటలకు భారతి దుఃఖప్రవాహము గట్టుతెగఁ గొట్టుకొని రావలసినదే. బలమైన మనోదార్ఢ్యమంతయు వినియోగించి యామెమెల్లగా, "జాలిగుండెవారు కొందరైనను ఉగాదిదేవత పిల్లలగుఱించి—"



"ఏమీ, జాలిపడియుందురా!......అయ్యో! భగవంతుఁడా!"

# వైశ్య మాడరన్ హోటల్ (వైశ్యులకు మాత్రమే)

19, గోవిందప్పనాయకన్‌వీధి, మద్రాసు (సౌందర్యమహాలుకు ఎదుట)

ఇది ప్రత్యేకముగా వైశ్యుల సౌకర్యార్థమై యేర్పాటుచేయబడినది. మిక్కిలి శుచిగాను, వైశ్యుల ఆచారవ్యవహారములకు తగినట్లును యేర్పాటుచేయబడినది. ఇచ్చటికి వచ్చినవారెల్లరును తృప్తిచెందియున్నారు. ఒకసారి పరీక్షించి చూడుడు.

ప్రొప్రైటరు, వి. రంగయ్యశెట్టి.

స్థలసంకోచముచే కొందరి వైశ్యప్రముఖుల అభిప్రాయము లీక్రింద పొందుపరుపబడి యున్నది.

1. ఆర్యవైశ్య సోదరులారా! నేను సుమారు 40 రోజులవరకు వైశ్యామాడరన్ హోటలునందు భుజించినాను. యిచ్చట మన ఆచార పద్ధతికి స్నానపానాదులకు మంచిగదులున్ను భోజనపదార్థాలు మంచిరుచికరముగా నుండును. అన్నివిధముల యీ హోటల్ యజమాన్లు మిక్కిలి దయతో ఆదరించుచున్నారు. (28-1-27) గాదె వెంకటరత్నం, మారుటేరు, పశ్చిమగోదావరి.

2. ఆర్యవైశ్య సోదరులారా! నేను యిదివరకు మనవైశ్యులహోటలులను అనేక సైనవిమద్రాసునందు చూచినాను. నాకుఅసంతృప్తికరముగా నుండినవి. యిప్పుడు వైశ్యామాడరన్ హోటల్ అనుభోజనశాల నూతనముగా యేర్పడినది. అచ్చట భోజనపదార్థములు అతి శుచిగాను రుచికరముగాను వుండుటయేగాక మన ఆచారవ్యవహారములకు తగినట్టియేర్పాట్లు అన్నియు యీహోటల్ ప్రొప్రైటరుగారు కలుగచేసి యున్నారు. ఇట్టి సౌకర్యమైనహోటలు యిదివరలో మనవైశ్యులలో లేనిలోపమును వీరు పూర్తిచేసిరి.

(6-8-26) డి. సి. కేశవగుప్త, హైస్కూల్‌కంట్రాక్టరు, తిరుత్తణి.

3. మన ఆర్యవైశ్యులగారు ఏర్పరుపబడిన వైశ్యా మాడరన్‌హోటలు నిండాశుచిగాను రుచికరముగాను పరిశుభ్రమైన భోజనపదార్థములును మన ఆచారవ్యవహారములు పద్ధతిప్రకారము యేర్పాట్లుచేసినందుకు చాలా సంతోషించుచున్నాను. నిండా పరిశుభ్రముగా నుండును. మిక్కిలి దయతో ఆదరించెదరు. వీరికి తగుప్రోత్సాహ మొసగుట మన ఆర్యవైశ్యుల ధర్మము.

కే. వేణుగోపాలచెట్టి, బి. ఏ., బి. ఎల్., వకీలు, బళ్లారి.

4. ఆర్యవైశ్య సోదరులారా! యీమాడరన్ హోటలునందు యిప్పటికి సుమారు ఒకసంవత్సరముగా నేమున్ను నా సహోదరులున్ను యింకా నాకుకావలసిన స్నేహితులున్ను దిగియుంటిమి. భోజనవసతులు, స్నానాదికర్మలకు బహువసతిగాను తృప్తికరముగాను, ఆచారములందు లోపములేకుండుటవల్ల యిచ్చటికి అందరువచ్చుటకు చాలముఖ్యమని తెలుపుచున్నాను.

(17-2-27) పి. బాలవెంకటసుబ్బయ్యశెట్టి, ధూస్వామి, చింతగుంట, ప్రొద్దుటూరు



## వెలస్వల్పము  ఆయుర్వేద వైద్యసంగ్రహము  ఫలమధికము

1 టో భాగము:—వ్యాధిస్వరూపమును, వానికి సులభముగా తమంతట తామే చేసుకొని వుపయోగించదగిన లఘుతరమగు 600 యోగములను తెలియచేయు గ్రంథము, ప్రతివారికిని యుపయోగము. 1 కి వెల రు 1—4—0

2 వ భాగము:—శుద్ధులు, భస్మములు, వంటిగుజ్జలిఔషధములు, ఆసవములు, అరిష్టములు, లేహ్యములు, ఘృతములు, తైలములు, చూర్ణములు, మొదలగు అన్నిరకముల ఔషధములను అనుభవసిద్ధముగా తయారుచేయు పద్ధతులతో వ్రాయబడియున్నది— ప్రతివారికిని, ప్రతివైద్యునికిని యుపయోగము. 1 కి వెల రు 1—12—0

## ఆరోగ్యదర్పణము

గాలి, యుదకము, ఆహారవిహారములు, మొదలగు విషయములనుగూర్చి ప్రతివారును తెలుసుకొనదగిన పుస్తకము.

1 కి వెల రు 0—4—0

## సుఖరోగచికిత్సాదర్పణము

సుఖరోగములు, అనగా అంటు, శగరోగము, ప్రదరము, సవాయిమేహము, అంటువాతము, మొదలగు స్త్రీలచే సాంక్రామికమగు వ్యాధులను చికిత్సచేయు సులభమగు యోగములుగల గ్రంథము ప్రతివారికిని యుపయోగము. 1 కి వెల రు 1—4—0

పై గ్రంథములకు వి. పి. ఖర్చులు ప్రత్యేకము

## ఆయుర్వేదచంద్రిక (మాసపత్రిక)

ఆరోగ్యమును పొందగోరు, ఆయుర్వేదమును తెలిసికొనగోరు, ప్రతివారును, చదువదగినది. మాదిరిసంచిక యుచితము.

సంవత్సరము 1 కి చందా రు 2—8—0

పి. శి. ఏ. అండు కో., ఆయుర్వేదసమాజము, పెరిదేపి, నెల్లూరు జిల్లా.



# ఆంధ్రగ్రంథమాల

## నెం. 7, తంబుశెట్టి వీథి, చెన్నపురి

ఆంధ్రాభ్యుదయమునకు వాఙ్మయాభ్యుదయమును, తన్మూలమున విజ్ఞానాభ్యుదయమును సాధనంబు లనువిషయము సర్వత్ర తెలిసియున్నది. ఆంధ్రాభ్యుదయమునకు దేశమునందు గ్రంథమండలులు, గ్రంథాలయములు, కళాప్రదర్శనములు మొదలగు సంస్థాపనలు పర్యాప్తంబులై యున్నవి. శ్రీయుత కే. వి. లక్ష్మణరావుగా రారంభించిన యాంధ్రవిజ్ఞానచంద్రికాగ్రంథమాల నేడు శాఖోపశాఖలతో భిన్నరూపముల వెలయుచున్నది. గ్రంథమాల లన్నియు యథాశక్తిని వాఙ్మయాభివృద్ధికి పాటుపడుచున్నవి. ఆంధ్రమాత నలంకరింపుచున్న గ్రంథమాలలం దిది యొకటిగ నుండగలదను విశ్వాసములో నీ ప్రయత్న మారంభమైనది. ఈ గ్రంథమాలయందు విజ్ఞానాభ్యుదయమునకు సాధనములై వివిధవిషయములకు సంబంధించిన గ్రంథములు రెండుమాసముల కొక గ్రంథమునంతున ప్రచురింపబడును. ఆంధ్రమహాజనులీ ప్రయత్నమును పోషింపుటకు ప్రార్థితులు.

### గ్రంథములు

1. శతకమంజరి (భక్తిసంపుటము):—వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, నారాయణ, కాళహస్తీశ్వరాదిశతకములు పది యిందుగలవు. ఒక్కొక్కశతకమునకు పీఠికయు, పాఠభేదములు గలవు. (ఈశతకములు విడిగను దొరకును.) ... ... ... రు ౧-౮-౦

2. బసవపురాణము (ద్విపద):—పాల్కురికి సోమనాథుడు. అనేకతాళపత్రమాతృకలను పరిశీలించి కూర్చిన మూలము. పాఠభేదములు సూచింపబడినవి. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన విపులమగు పీఠిక గలదు. ... ... ... రు ౨-౮-౦

3. గాంధిమహాత్ముని బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము:— రు ౦-౪-౦

4. కమలాక్షి (చిన్న చిత్రకథ):—రాయసం వెంకటశివుడుగారు, యమ్. ఏ., యల్. టి, ... ... ... ... రు ౦-౮-౦

5. నీతినిధి:—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. మానవజీవితనిబంధనము లిందు సూటిగా వివరింపబడినవి. రెండువేలయేండ్లకుపూర్వ మొక భారతీయబ్రాహ్మణునిచే రచియింపబడినది దీనిమూలము. ఇట్టి యుత్కృష్టనీతిగ్రంథ మాంధ్రగీర్వాణవాఙ్మయముల గానరాదు. ... రు ౧-౪-౦

6. జీర్ణవిజయనగర చరిత్రము:—కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ. కృష్ణదేవరాయల సామ్రాజ్యలక్ష్మీవిహారభూమియై వెలసిన విద్యానగరము (హంపీశిథిలముల) యొక్క ప్రాచీనచరిత్రము, ప్రకృతపు జీర్ణస్థితియు నిందు వర్ణితములైనవి. ... ...

7. త్యాగరాజస్వామి చరిత్రము (పద్యకావ్యము):—శ్రీ పసుమర్తి కృష్ణమూర్తి శాస్త్రిగారు. శ్రీరామభక్తాగ్రణియు, గాయకశిఖామణియు నగు శ్రీ త్యాగరాజుగారిచరిత్ర మిందు సరసముగ వర్ణింపబడినది. సందర్భానుసారముగ త్యాగరాజుగారు రచించిన కృతులు ౫౫ ఇందు చేర్చబడినవి రు ౦-౧౦-౦

(పోస్టుఖర్చులు ప్రత్యేకము)

కాశీనాథుని నాగేశ్వరరావు,
వ్యవస్థాపకుడు.

"ఏమీ, జాలిపడియుందురా? నాపిల్లలగురించియు వారి తల్లిని గురించియు, నానాజాతులవారును జాలిపడవలసిన యవస్థ తటస్థించినదా? అయ్యో! భగవంతుఁడా!"

భారతి తొందరగా, "రండు, మఱిరొట్టెలు చల్లాఱును. మీరు అలసియున్నారు. విశ్రాంతివలన మనోవేగము తగ్గును," అని భర్త భుజముమీఁద చేయివేసి, చెంతఁ గూర్చుండి, "మీరిందునఁ గూర్చి యనవసరచింత పెట్టుకొనకుఁడు. పిల్లలుగాని నేనుగాని తలఁపునఁ బడినయెడల, మాకొఱకే యీపని మీరు పూనుకొన్నమాట జ్ఞప్తికిఁ దెచ్చుకొనుఁడు; అప్పుడు మీరు చేయుచున్నది నీచకార్యముగాక ఘనకార్యమని తోఁచును," అని మనసు కలఁక తీర్చినది.

"రాగములు రెండు నేర్చుకొన్నయెడల, నాటకవేషమునకైన నీకుఁ బనికివత్తును," అని యతఁడు నవ్వెను. ఆనవ్వు మునుపటికంటెఁ జాల ప్రసన్నమైనది. "ఏమైనను ఉగాదిపండుగలోపలఁ బంట్రెండురూపాయలు గడింతును. ఎట్లు గడించిన రూపాయికైనను పదునాఱణాల విలువ తగ్గదుగదా!" అనుచు చేతులు కడుగుకొనుటకై యతఁడు లేచెను.

"మీరిప్పుడు గడింపఁబోవుచున్న రూపాయలకు విలువయే లేదు," అని భారతి మెల్లగా పలికి, చిఱునవ్వు నవ్వఁబోయి బొల్లుమన్నది.

ఆమె నోదార్చుట వలననే గదాధరునికి మనసు కలఁక పూర్ణముగాఁ బోయెను.

౨

వేణునాథబాబుగారి కుమారునికిఁ బ్రాణములమీఁదికి వచ్చియున్నదన్న పుకారు షాపులో నీమూలనుండి యామూలకల్లుకొని, తుదకు బొమ్మలమ్ము భాగమునకును వ్యాపించినది. వేణునాథబాబు కాలము మల్లిన వెనుక వివాహము చేసికొనెను. అతని కొక్కఁడే కొడుకు; అయిదేండ్లవాఁడు. ఆబాలుఁ డంతగా బలముగలవాఁడు కాఁడు; అతని శరీరతత్త్వము కడు సున్నితమైనది. ప్రాణములన్నియు నాచిన్నవానిమీఁదనే పెట్టుకొని వేణునాథబాబు కాలము గడుపుచుండెను.

షాపులోని నవుకరులందఱును వేణునాథబాబుగారికిఁ గలిగిన కష్టమునుగూర్చి జాలితో మాటలాడుచుండుట విని, గదాధరునికి విశేషమైనవింత కలిగినది. అరోగ్యుఁడైన యజమానికిఁ గష్టములు కలిగినప్పుడు సేవకులు సంతోషించుటే సహజముగాని, జాలిపడుట యరుదు. వారి యద్భుతప్రవర్తనమునకు హేతువు కనుఁగొనుటకు గదాధరునికి వ్యవధి లేకపోయినది.

పదిగంటలకతఁడు షాపులోనికి వెళ్ళఁగానే పని యారంభమయ్యెను. అప్పటికే యనేకులు వచ్చి బయట కనిపెట్టుకొనియుండిరి; తలుపులు తెఱవఁగానే వారందఱును మందగా లోపలికివచ్చిరి. ఉదయమునుండి రాత్రి వఱకును, ఊపిరియైనను తీయుటకు వీలులేని యంత యుక్కిరిబిక్కిరిగా ప్రజలుషాపులోఁ గ్రిక్కిఱిసియుండిరి. తనకున్న యోపిక యంతయు వినియోగించకున్న యెడల, గదాధరుఁడు పని కొనసాగింపలేకపోయియుండును. జవసత్త్వములన్నియుఁ బూర్తిగా నుడిగి, యతఁడు రాత్రి యిల్లు చేరుకొనుటచేత, పగటి వృత్తాంతములుభారతితోఁ జెప్పుటకైన నతనికి శక్తి చాలకుండెను. ఆవృత్తాంతములు వినవలెనని యామెకును గుతూహలము లేకుండెను. మాఱువేషముతో మగఁడు తమకొఱకు కష్టపడవలసి వచ్చెనన్నమాట యాయిల్లాలికి బహుకష్టముగాఁ దోఁచినది.

* * * * *

మూఁడవనాఁడు గదాధరుఁడు బయలుదేఱుచుండఁగా భార్య, "ఈరాత్రి యెన్ని గంటలకు వత్తురు? మామూలుగానా, చివరిదినముగనుక నాలస్య మగునా?" అని యడిగినది.

"చెప్పలేను. మామూలు వేళ మించరాదు. ఉగాది కానుకలు కొనవలసిన వారందఱు నీపాటికే కొనియుందురు. కొందఱుమాత్రము చివరికే యాపనిని త్రోసివేసి నేటిరాత్రి కొందురఁట. ఇట్లని యనుభవము

మూలమున షాపులోనివారు చెప్పినారు. నాకొఱకు కని పెట్టుకొనియుండవద్దు. పిల్లలకొఱకు ఉగాదికానుక లేమైన కొనితెచ్చెదను; అర్ధరూపాయి పెట్టినయెడల మంచియాట వస్తువులు వచ్చును," అని గదాధరుఁ డనెను.

అర్ధరూపాయి కర్చుపెట్టఁగల స్థితిలోఁ దాము లేమని యామె యెఱుఁగును. అట్లనుటకు మాత్రము, ఆమెకు నోరువచ్చినదికాదు.

"శుభవర్తమానము తెండు," అని యామెభర్తతో పలికినది. శాశ్వతోద్యోగ మేదైనను లభించునన్న లేని పోని యాశ భార్యకున్నదని యాతఁ డెఱుఁగును. అతనికి మాత్ర మట్టియాశలేశమును లేదు. ఉగాదిపండుగ తరువాత బొమ్మలచెల్లుబడితగ్గి, వేణునాథబాబు షాపులోని యాభాగమునకుఁ బనితగ్గును. ఇతర భాగములలో వ్యవహారజ్ఞానము చాలనివాఁడని యతనికి పనియీయరు.

పండ్రెండు రూపాయలవఱకే తనకును వేణునాథ బాబు కంపెనీకిని ఋణానుబంధ మని మనస్సులో నను కొనుచు, గదాధరుఁడు బయటికి వెళ్లెను. పండ్రెండు రూపాయలతో ఉగాదిపండుగ యారంభ మగుట శుభ సూచకమని యాలోచించుచు భారతి లోనికివెళ్లెను.

* * * * *

జీతములు ప్రారంభము కాక పూర్వము షాపు మేనేజరుతో రెండునిమిషములు మాటలాడుటకు గదాధరుని కవకాశము కలిగినది. గదాధరుఁడనఁగా నెవఁడో యా మేనేజరుకు మొదటినుండియు దెలియును గాని తెలిసినట్లు పైకి నటింపలేదు. శాశ్వతోద్యోగముఁ గూర్చి యెత్తఁగా వేణునాథబాబుగారినే యడుగవలయునని యతఁ డనెను.

నిరాశతో మొగము వ్రేలవేసికొని గదాధరుఁడు నిలిచియుండుట చూచి తోడిపనివాఁ డొకఁడు హాస్యముగా, "ఇదియేమి, ఉగాదిదేవత మొగము చిన్నపోయినది! ఇట్లయిన, కానుకలకు వచ్చు పిల్లలకు సంతోషమెట్లు కలుగును?" అని యులికిపడునటు వెన్ను తట్టెను.

ఇంతలో కొంతమందిపిల్లలు తల్లిదండ్రులతో కలిసి వచ్చిరి. "ఉగాదిదేవతా, ఉగాదిదేవతా," యన్న కేకలతో షాపు ప్రతిశబ్దించినది. కొందఱుపిల్లలు చేరువకు వచ్చి, యుగాదిదేవత తొడుగుకొన్న బట్టలు, వేసికొన్న కుళ్లాయి, పట్టిచూచిరి.

చూచి చూచి, యేడేండ్ల చిన్నవాఁ డొకఁడు, "నీవు నిజమైన యుగాదిదేవతవు కావు," అని గదాధరునితో ననెను. ప్రక్కనున్నవారు కిలకిల నవ్విరి.

ఇట్టిమాటలకు గదాధరుఁడు రెండుదినములైయల వాటు పడియున్నాఁడు. "అబ్బాయీ, ఉగాది దేవతనే నేను; సంక్రాంతి పురుషుఁడు నాకడపటి తమ్ముఁడు," అని చిఱునవ్వుతో జవాబు చెప్పెను.

"నేను నమ్మను, నమ్మను. దేవతలకు తప్పులు మూఁత పడవని బడిలో మా యయ్యవారు చెప్పినారు. నీకను తెప్పలు మూఁతపడుచున్నవి. నీవు మా వంటివాఁడవే. రంగు పూసికొని వేషము వేసినావు" అని యా బాలుఁడు నిర్భయముగా వెక్కిరింపసాగెను.

అట్టి వెక్కిరింపుపొందుట గదాధరుని కది ప్రథమము కాదు. అయినను, అతఁడు చిన్నపుచ్చుకొనెను. మొగము వెచ్చపడినది. వేషము విప్పి, విసరి నేలనుగొట్ట వలె ననిపించినది.

"ఉగాదిదేవతవు నీవన్న నమ్మకము నాకున్నది," అని సన్నని గొంతుకతో నైదేండ్ల చిన్నది యొకతె జంకుచు నతనిచేయిపట్టుకొని లాగినది.

గదాధరుఁడు వంగి యాపిల్లదానిని ముద్దులాడి, "అమ్మాయీ, ఉగాదిపండుగ నీకు సుఖకరమగునుగాక!" అని దీవించెను. కృతజ్ఞతయే యా దీవనకుఁ గారణము.

"మానాన్నయు నావలెనే నమ్ముచున్నాఁడు. ఏమి, నాన్నా" అని యాబాలిక వెంటనున్న తండ్రివైపు తిరిగినది.

"అవునమ్మా, సంక్రాంతి పురుషునికి పెద్దన్న; క్రొత్త యమావాస్యకు కొడుకు," అని యామెతండ్రి

గదాధరునివంకఁ జూచి కన్ను గీఁటి, "ఉగాది దేవతగారూ,



పండుగ దండాలండీ," అని యుపహాసగర్భితముగా చేతులు జోడించి నమస్కరించెను. అతఁడు గదాధరునికిఁ బూర్వ పరిచితుఁడు; ఒక్కబడిలో నతనితో చదువుకొన్న వాఁడు. ఆనవాలుమాత్రము పట్టలేదు.

వారిరువురును వెళ్లినతరువాత మూఁడునాలుగేండ్ల పిల్లలు కొందఱు గుంపుగావచ్చి చుట్టుకొనిరి. కేవలమును బాల్యమగుటచేత వారు గదాధరుని దేవత్వమును గూర్చి సంశయింపక పూర్తిగా నమ్మిరి. ఆసందర్భమే యయ్యు, ఆపసిపిల్లల విశ్వాసమతనికి సంతోషదాయక మైనది.

మధ్యాహ్నము దాఁటిన వెనుక మందలు మందలుగా వందలకొలంది పిల్లలను వెంటఁబెట్టుకొని పలువురు వచ్చిరి; వెళ్లిరి; అమ్మవలసిన యాటవస్తువులు చాల వఱకు తగ్గినవి. సాయంకాలమునుండియు మెఱుపుదీపములు వెలుఁగసాగెను. ఉక్క యధికమైనది. మనుష్య సమ్మర్దమున గాలిలేక యూపిరి సలుపరాకుండెను. షాపు నవుకరులు వేయిచేతులతో విధివిరామము లేకుండ తీవ్రముగాఁ బనిచేయుచుండిరి.

దీపములు పెట్టకముందే, యొక కబురు పుట్టినది: ఆరాత్రి యెనిమిదిగంటలకే షాపు మూసివేయుట జరుగు నన్నకబురు, అప్పటికి కొనవలసినవారు షాపులోనెందఱు మిగిలియున్నను సరియే. "ఆలాగున వేణునాథబాబుగారి యాజ్ఞ," అని మేనేజరు చెప్పెను. "పది పదునొకండు గంటలవఱకును క్రిందటిసంవత్సరమువలెనే యుండవలసి వచ్చు ననుకొంటిమి. పాపము! వేణునాథబాబుగారి చిన్నవాని కెట్లున్నదో? ఆకారణముచేతనే కాఁబోలు, షాపు మామూలు కంటె వేగిరముగా మూయించుచున్నారు. భగవత్కటాక్షమువల్ల ఆచిన్నవాఁడు ఱేపటియుగాదియే కాక, యిట్టియుగాదు లనేకములు చూచుటకు జీవించి యుండును గాక!" అని నౌకరులందఱు నైకకంఠ్యముగఁ బలికిరి.

* * * * *

కొన్ని యాటవస్తువులను పిల్లలకుఁ జేతితో నందిచ్చుటే తప్ప, బేరములు తెగఁగొట్టుపని యుగాదిదేవతది కాదు. అయినను, ఏడుగంటలు వేసినతరువాత మరగుజ్జు యొకదాని విలువవిషయమై యొక ముసలమ్మ తగవుపెట్టి గట్టిగా కేకలు వేయుచు, గదాధరుని యొద్దకు వచ్చినది. షాపువారు చెప్పినవెల మైదణాల తొమ్మిది పైసలు. నాలుగణాలునరమాత్రమే చేయుననియామె వాదము. మొసలివలె పట్టుకొనివిడువని యాముసలిదానిగోలమూలమున గదాధరునికి చెవులు గియ్యిమనినవి; తలకాయ రింగుమనుచుండెను. తాను నేర్చుకొన్న యుగాదికానుక యున్నది తప్ప మఱియేమాటయు నతనినోట వెలువడ లేదు. ఆలాగున ముమ్మాఱుపలికి నాలుగవసారి యనఁబోవుచుండఁగా, మేనేజరు అచ్చటికి వచ్చెను. ముసలి ఘోషవిని, బేరము నాలుగణాల యాఱుపైసలకే ఫైసలు చేసి, యతఁడు గదాధరుని 'పనియున్న'దని పిలిచెను.

"అయ్యా, క్షమింపుఁడు. నేను మఱి పనిచేయలేను; నిశ్చయముగాచేయలేను. గది గిఱ్ఱునతిరుగుచున్నట్లున్నది. ఈప్రజలు భూతములవలె మనుష్యులను కొఱుకుకొని తినుచున్నారు గాని, భూతదయ యున్నవారుగా కనఁబడరు. అందఱును స్వలాభపరాయణులే. నన్ను క్షమింపుఁడు. నావలన మఱిపనికాదు," అని గదాధరుఁడు హీనస్వరమునఁ బలికెను.

అతని చెవిలో మేనేజరు "మీరు చెప్పినదంతయు యథార్థమే. ఇఁక నీపని చేయవలసిన యవసరములేదు; ముఖ్యముగా మీకు లేదు. గదాధరబాబూ, ఇటువినుఁడు: వేణునాథబాబు గారి యొద్దనుండి కబురు వచ్చినది. జాగు చేయక మీరు వెంటనే వారియింటికి వెళ్లవలెను. ఇప్పుడున్న వేషముతోనే, అనఁగా ఉగాదిదేవత వేషముతోనే. ఆటవస్తువులు కొన్ని గోనెసంచిలో మూట కట్టి యుంచితిని, ఆమూటపట్టుకొని వెళ్లుఁడు. వేణునాథబాబు గారి పెద్దమోటారుబండి మీకొఱకు బయట సిద్ధముగా నున్నది," అని చెప్పెను.

గదాధరుఁ డతనిమొగమువంక వెఱ్ఱివానివలెఁ దేరిపాఱఁ జూచుచు, "మోటారుమూట కట్టుకొని వెళ్లవలెనా?" అనెను.

"గదాధరబాబూ, అలసి మతి చెదరినట్లున్నారు. తెలివి తెచ్చుకొనుఁడు. ఆటవస్తువుల మూటపట్టుకొని మోటారులో వేణునాథబాబు గారి యింటికి మీరు వెళ్లవలెను."

"ఎందుకు? నేను వెళ్లను; అక్కడకు నేను వెళ్లను."

"ఎందుకు మీరు వెళ్లననుచున్నారో, మీరెవ్వరో యీసంగతి యంతయు నాకుఁ బూర్తిగా తెలియును; వేణునాథబాబు గారికిఁ దెలియదు. పోల్చుకొనఁ జాలని వేషములో నున్నారు మీరు."

"అవును గాని, యెందుకు—?"

"వేణునాథబాబు గారి కుమారుఁడు చాలజబ్బులో నున్నాఁడు. ఒకవేళ బ్రదుకఁడేమో! రేపే యుగాదియని యా బాలునికి తెలియును. ఉగాదిదేవత నేటి రాత్రి తనకు కానుకలు తెచ్చియిచ్చు నను నమ్మకముతోఁ జూచుచున్నాఁడఁట! దీపముపెట్టినప్పటినుండియు, "ఉగాది కానుకలు పట్టుకొని యుగాదిదేవత యెప్పుడు వచ్చు?" నన్నపాటయే యఁట!-చీటీ వ్రాసి వేణునాథబాబు గారు మోటారు పంపినారు. ఉగాదిదేవతగారి కథ మీరు తెలివి తేటలతో నడిపిన యెడల, బాలుఁడు బ్రదుకుటకును వీలున్నదని డాక్టరు చెప్పినాఁడఁట! రండు, ఆలస్యమునకు వీలులేదు;" అని మేనేజరు తొందర పెట్టెను.

ఒక్కనిమిషమే గదాధరుఁడు సంశయించినాఁడు. ఆమఱు నిముసమున బయటికి నడిచి వెళ్లి, "నాభార్యకు వర్తమానము పంపుఁడు," అని మోటారు నెక్కెను.

3

మోటారు నెక్కి గమ్యస్థానమునకు చేరుకొన్న లోపున నేమి జరిగినదో గదాధరునికిఁ దెలియనే తెలియదు. తెఱచియున్న కిటికీల లోనుండి చల్లని గాలికొట్టి కొంచెము నిద్రపట్టినది. మోటారు దిగిన సంగతియు నతనికి జ్ఞప్తిలేదు. రోగి యున్న గదివెలుపట డాక్టరు తనభుజము మీఁదఁ జేయివేసి మాటలాడినప్పుడే పూర్తియైన మెలఁకువ వచ్చెను. అంతవఱకును కునికిపాట్లే.

డాక్టరు—"మీరు బహుజాగరూకతతో మెలఁగవలెను. ఈ యాటవస్తువుల సంచి భుజముమీఁద వేసికొనుటకు మీకభ్యంతరము లేని యెడల, అదియే మంచి పద్ధతి యేమో! ఆవిధముగానే యుగాదిదేవత వచ్చునని పిల్లవాఁడు నిరీక్షించుచున్నట్లున్నది. గదిలోఁ బిల్లవానిదప్ప, తదితరులెవరున్నను మీరు వారిని జూచినట్లు నటింపరాదు. ముఖ్యముగా గమనింపవలసిన విషయమేమనఁగా, మీరు నిక్కమైన యుగాదిదేవతయే యన్న నమ్మకము పిల్లవానికిఁ గలుగవలయును. ఆ నమ్మకము కలిగినయెడలఁ దృప్తి కలిగి యాతఁడు పరుండవచ్చును. నేను చెప్పిన సంగతులన్నియు నవగాహనమైనవా మీకు?" అని యడిగెను.

భుజము మీఁద సంచి పెట్టుకొని, "బోధపడినవి; నాశక్తివంచన లేకుండ మీరు చెప్పినట్లు చేసెదను;" అని గదాధరుఁడు సిద్ధమయ్యెను.

"నిద్రపట్టినదా, పిల్లవాఁడు బ్రదుకుట కవకాశమున్నది. ఆపై భగవంతుఁడున్నాఁడు."

"నన్ను చూచి బెదరు నేమో!"

"ఆ భయము లేదు. క్రిందటి సంవత్సరము తండ్రితో షాపు లోనికి వెళ్లి యుగాది దేవతను చూచిన వాఁడే. ఆటవస్తువులను మంచము ప్రక్క-కాళ్ల వైపున బల్లయున్నది. మఱి వెళ్లెదను. ఆలస్యమగుచున్నది."

"పిల్లవానిపేరు?"

మెప్పు తెలుపు చూపులతో. "మురళీధరుఁడు. ముద్దుకు మురళీ! యని కుద్దించి పిలుతురు," అని డాక్టరు తలుపు వంక వ్రేలితోఁ జూపించి, తాను వెనుకకు తగ్గెను.

"మఱొక్క-సంగతి. ఉగాదిదేవత మీఁది నుండి దిగు నని పిల్లవాఁడు చూచుచున్నాఁడేమో?"

"శేషు! పిల్లల తండ్రి కావలయును," అని డాక్టరు. "అందుఁ గూర్చి శంకపడిన యెడల, మీరే నమ్ముకొనుఁడు. మీరు కార్యము సానుకూలము చేసికొనివత్తు రన్న నమ్మకము నాకున్నది. వేణునాథబాబు గారికిఁ బుత్రభిక్ష పెట్టుటకే మీరు వచ్చితిరి." అనెను.

గదాధరుఁడు కన్నులు బాగుగాఁ దుడుచుకొని, దుస్తులు సరదుకొని, యుచ్ఛ్వాసనిశ్వాస సములుసమము గా వచ్చుచున్నట్లు చూచుకొని, తలుపు మీఁదఁ జేయి వేసెను. వేణునాథ బాబు మీఁదిపనిపగ యతని కిష్టము జ్ఞప్తి యైన లేదు. పిల్లవాఁడు జీవించునా మరణించునా?—ఇది యొక్క-టియే మనస్సులో నున్న యాలోచన. తనముద్దు బిడ్డఁడు మదనుఁడు తలఁపునఁబడి, లోకమందలి బాలురం దఱు నతనికిఁ బ్రేమింపఁ దగిన వారే యైరి.

చప్పుడు కానీయకుండఁ దలుపు మెల్లఁగాఁ ద్రోసి, గదాధరుఁడు లోనికి జారెను.

గది విశాలమైనది. దీపపు వెలుతురు మంచము కాళ్ల వైపున మాత్రమే హెచ్చుగా పడుచుండెనుమంచ మునకుఁ గొంచెమెడముగాఁ జీఁకటిలో స్త్రీపురుషులిరువు రొండొరుల చేతులను గట్టిగాఁ బట్టుకొని, కుర్చీలలోఁ గద లిక లేకుండఁ గూర్చుండిరి. ఇరువురును గ్రుంగియే యున్నారు గాని, వయోధికతయో మఱి యేహేతువో, పురుషుని క్రుంగు హెచ్చుగా నుండెను. వారి వైపున గదాధరుని చూపులుబిట్టు మాత్రమే నిలిచినవి. పగవాఁ డని తానూహించుచున్న యా భాగ్యవంతుని సామీప్య ముకారణమేమియో కాని, యతనికి మనోవైకల్యహేతువు కాలేదు. దిగువ చూపులతో నతఁడు మెల్లగా నెమ్మదిగా మంచము కాళ్ల యొద్దకు నడిచి వెళ్లి, భుజము మీఁదియాటవస్తువుల సంచి క్రిందికిఁ బదిలముగాదించెను.

మంచముమీఁదఁ గదలిక యన్న మాట లేదు. నిశ్శబ్దముగా బాలుఁడు బాలీసునకానుకొని, వెల్లకిలఁ గాళ్లు చాఁచుకొని యుండెను. ఎత్తు కొఱకు శిరస్సుక్రింద బాలీసు-కాక దిండును వేసి యున్నది. నిశ్చలములైనిగ నిగ మెఱయుచున్న పెద్దకన్నులు, రోగము చేతను పిక్కించి జ్వరతీవ్రమున నెఱ్ఱనైయున్న యా చిన్నవాని పలుచని మొగమునంతను నాక్రమించుకొన్నట్లున్నది. ఆ కన్నులు పెట్టి తదేకదృష్టితో నతఁడు క్రొత్తఁగావచ్చిన యుగాదిదేవత వంకఁజూడ సాగెను. ఆ దృష్టియందు వింత తప్ప మఱేమియు లేదు.

సంచిలోనుండి గదాధరుఁడు తాను దెచ్చిన యాటవస్తువు లొక్కొక్కటిగా వెలుపటికిఁదీసెను. అవి షాపులోని యెంపుడు బొమ్మలు. బల్ల మీఁదఁ బెట్టుటకు ముందు ప్రతి వస్తువును బాలుఁడు స్పష్టముగాఁ జూడఁ గలుగు నట్లు



"దీపపువెలుతురునను వానిని బరీక్షించుచున్న ట్లతఁడు నటించెను."

మీఁదికెత్తి, దీపపు వెలుతురునను వానిని బరీక్షించుచు నట్లతఁడు నటించెను. పిల్లవాని చూపు లతనిని క్షణమాత్రమును విడువకుండెను. ఆటవస్తువులమీఁది కతని దృష్టులు వెళ్లనే లేదు. ఉగాదిదేవతా విగ్రహామే యతని నాకర్షించినది.

తెచ్చిన యాటవస్తువులన్నియు గదాధరుఁడు బల్లమీఁదఁ బేర్చుట యయిన తరువాత, మంచము మీఁదినుండి, "వందనములు" అన్నమాట బలహీనస్వరముతో వచ్చినది.

మాటలాడవలె నన్న యేర్పాటుతో గదాధరుఁడు రాలేదు. అట్లయిన యెడల, దేవతయన్న నమ్మకము పిల్లవానికిఁ బోవునేమో యని యతని భయము. అయినను, అప్రయత్నపూర్వకముగా మాట లతనినోటినుండి యప్పుడు త్రోసికొని వచ్చినవి. ప్రేమ యుట్టిపడఁ జిఱునవ్వుతో నతఁడు, "మురళీ, నేను తెచ్చిన యుగాది కానుకలు నీకు నచ్చినవను కొందును. నీకు జబ్బు గనుకఁ పైనుంచి దిగిన యెడలఁ జెమ్మగాలి గది లోనికి వచ్చునని తలఁచి, గుమ్మము దారిని వచ్చినాను. ఇచ్చటనే మఱియొంచుక యాగ వలయు నని యున్నది కాని, నీవంటిపిల్లలు పలువురు నాకొఱకు కాచుకొని చూచుచుందురు. అందుచేత వెళ్లక తీరదు. నేను వెళ్లులోపల, నామాట యొకటి విందువా? అట్లయిన, సంతోషముతో పోవుదును," అని బాలుని చెంతకు వెళ్లి, "మురళీ, నా మాట విని నన్ను సంతోషపెట్టవా?" అని బతిమాలుచున్నట్లడిగెను.

పిల్లవాని పెదవులు కదలినవి. గదాధరుఁడు వంగి వినఁగా, "ఉగాదిదేవతా, నీ మాటతప్పక విందును;" అన్న పలుకు లస్పష్టముగా చెవిని బడినవి.

"అట్లయిన మురళీ, ఇదిగో ఉగాదిదేవత; నీతల క్రింది దిండు తీసివేసి," అని మెల్లగా పిల్లవాని దుర్బలశరీరము క్రిందికిఁ జేయిపెట్టి భద్రముగాఁ గొంచెము దిగజార్చి, "ఒకప్రక్కకు నిన్ను మెల్లగాఁ ద్రిప్పి" అని యొత్తిగిలించి "నిన్ను బరుండఁబెట్టును" అని గదాధరుఁడు పిల్లవాని కన్నులు తనచేతివ్రేళ్లతో మూసి, "మురళీ!" పరుండుము. హాయిగా నిద్రపోయి, రేపటి యుగాదికి జ్వరము లేకుండ లెమ్ము. అట్లయిన సంతోషించి, నేను నీకుఁ బ్రతి యుగాదికిఁ గానుకలు తెచ్చుచుందును," అని యూరకుండెను.

"ఉగాదిదేవత, నిజమే; అబద్ధము కాదు," అని మూసికొన్న కన్నులతోఁ బిల్లవాఁడు మెల్లగా ననెను.

"నిజమే; అబద్ధము కాదు."

"మానాన్న లాగున, నిజము?"

"మీనాన్న లాగున నిజము."

వెనుకనుండి చెక్కినట్లు చప్పుడు. ఆ తరువాత చాలసేపటివఱకు సంపూర్ణనిశ్శబ్దము.

ఎంతోసేపైన తరువాత, మెల్లగా, కష్టముగా, గదాధరుఁడు వంగియున్న తన శరీరమును దిన్నవగునట్లు పయికెత్తి లేచెను. ఒకటిరెండు నిమిషములవఱకును దానచ్చటనున్నదియు నతనికిఁ దెలియలేదు. తరువాతఁ జాగులాడుచు గదివిడిచివెళ్లి డాక్టరుతో, "నిద్రపట్టినది," అని గొణఁగి, గబాలున వెనుకకొఱఁగెను.

తెలివివచ్చి చూచుకొనఁగా, గదాధరుఁడు పరున్నది హంసతూలికా తల్పమనఁదగినపాన్పు. నోటియందు మందువాసన. అప్పుడే, తలుపు తెఱచుకొని డాక్టరు బయటికిఁ బోవుచుండెను.

మంచము ప్రక్క నిద్రలేమిని దెలుపుచున్న వాడు మొగముతో వేణునాథబాబు జాలిచూపులు చూచుచు నిలువఁబడినాఁడు.

"పిల్లవాఁడు నిద్రించుచున్నాఁడా?" అన్నది గదాధరుని మొదటిప్రశ్న.

"మామురళి నిద్రించుచున్నాఁడు. ఇఁక బ్రదుకుడు"నని డాక్టరుగారు చెప్పినారు. భగవంతుఁడు నిన్ను రక్షించునుగాక!" అని కంపితస్వరముతో వేణునాథబాబు జవాబు చెప్పెను.

"మఱి యింక నేను మాయింటికి వెళ్లవలయును" అని గదాధరుఁడు లేవఁబోయెను. ఆఁపఁదలఁచినట్లు వేణునాథబాబు చేయిమెత్తి, "కాఫీవచ్చుచున్నది. పాపము!



రాత్రి భోజనము నీకు లేనేలేదు......నాకుఁ దెలిసియున్న యెడల—" అని యేమో యనఁబోయి యూరకుండెను.

ఇరువురును గొంతసేపు మౌనము దాల్చిరి. అటు వెనుక జంకుతో వేణునాథబాబు, "గదాధరా, ఒకప్పుడు మీతండ్రియు, నేనును స్నేహితులము. నీవును —నీవును నాస్నేహితుఁడవు కమ్ము," అనెను.

దానికిఁ బ్రతివాక్యము రాలేదు.

"నీయూహలు నాకుఁ దెలియును. మీ తండ్రి యనంతరము మీయెడల నిరాదరణము చూపి యుంటిని. అది—అది పొరపాటే. అయినను దానికిఁ గారణము—ఉహుఁ! అందువిషయమై యేమియుఁ జెప్పను."

"కారణ మేమున్నది? భాగ్యముపోయి నీచస్థితిలో మేమున్నాము గనుక—"

"అది కాదు."

"మఱి యేమి?"

"మీతండ్రిమూలమున నా యాస్తిలో సగము పోయినప్పుడు, అది నాకుఁ దగినంత కోపకారణము కాదందువా?"

"మా యాస్తియా?"

వేణునాథబాబు వింతచూపులతో, "ఏమి? మీ తండ్రి యప్పులకు నేను జామీనుగా నున్నసంగతి నీకుఁ దెలియనే తెలియదా? అవి నేను తీర్చుకొనవలసి వచ్చినది. ఈసంగతి మీయమ్మ నీతోఁ జెప్పలేదు కాఁబోలు. వ్యవహారజ్ఞానము చాలక మీతండ్రి—"అని తటాలున నాఁగి, "క్షమింపుము. ఈ సంగతి నీ యెదుటఁ దేవలసినది కాదు. ఇది యంతయు నీకుఁ దెలియుననుకొంటిని. ఇంకను నాస్నేహమును నిరాకరింతువా?" అని ప్రార్థనా పూర్వకముగాఁ జేయిచాఁచెను.

గదాధరుఁడు చేయియెత్తి తనచేతిలో నుంచినంతనే యావృద్ధుమంచముపైఁ గూలఁబడి డగ్గుత్తికతో, "మురళి మాకు దక్కిన సంతోషమిప్పుడు కొలంతలేనిదైనది. నీ మూలమున నేఁడు మరలఁ బుత్రవతియైన తల్లి తన కృతజ్ఞత తెలుపవలెనని తొందరపడుచున్నది; రమ్మందువా?" అని యడిగెను.

గదాధరుఁడు కన్నులు మూసికొని, యంగీకార సూచకమైన శిరఃకంపము చేసెను.

౪

అప్పుడే భారతీభాయి తలుపుతెఱచి, భర్తవచ్చునేమో యని వీథిలోని కడుగుపెట్టినది. ఇంతలో మోటారు బండి యొకటి జఱ్ఱునవచ్చి యామెకుఁ బదియడుగులదూరమున నిలిచినది.

వేషముతోఁడి వింతవిగ్రహము భుజమునమున్న సంచితో బండిలోనుండి వెడలివచ్చి, "భారతీ, నేనే; భయపడకుము. ఉగాదిదేవతవేషమున నన్ను మనపిల్లలు చూచి సంతోషింతురని యిట్లు వచ్చితిని. లోనికి రమ్ము; పిల్లలను లేపుదము," అని యింటిలోనికి దారితీసెను.

"ఏమి, యేమి జరిగినది?" అని భారతి యాతురముతో వెంబడించినది.

బండిలోని పెట్టెలు దింపి లోపలఁ జేర్పించిన తరువాత గదాధరదాసు, "భారతీ, శుభవర్తమానము

నీవు కోరినట్లే తెచ్చితిని." అని రాత్రికథ యంతయు సవిస్తరముగా వినిపించి, "నేఁటినుండి నేను వేణునాథబాబు గారి సెక్రెటరీని. మొదటిలో, నెలకు నాలుగువందల



రూపాయిల జీతము. ఇది యాయన మనకిచ్చిన యుగాది కానుక," అని జేబునుండి తన యుద్యోగపత్రము తీసి భార్యచేతఁ బెట్టెను.

భారతి యానందముకంటె మంజరీమదనులసంతోషము పదింతలైనను హెచ్చు. ఉగాదిదేవతయై తమ తండ్రి యుగాదికానుకలు తమకొఱకు తెచ్చినాఁడని వారతనిచుట్టును తెయ్యిమని యాడసాగిరి. మంజరికి రకరకముల గానుగుడ్డలు, మదనునికి మంచిమంచి షరాయిలు, కోట్లు, టోపీలు: ఇవి పెట్టెలలోనివి. సంచివిప్పఁగా బయలుదేఱినవి: ఏనుఁగులు, గుఱ్ఱములు, కుక్కలు, ఇత్యాదులైన గాజుబొమ్మలు, బూరలు, చిన్న రెయిలుబండి, చిన్న తుపాకి,—,—,—. వారి యానందమునకు మేర లేదు.

చదువరులారా, ఉగాది కానుకల మూలమున మీకు, మీపిల్లలకు, నిట్టి యానందమే కలుగును గాక!

క్రొత్త సంవత్సరంబు మీకును, స్వదా(ం)త
జనులకు సుఖప్రదంబయి జరుగుఁ గాక!
ఇట్టి సంవత్సరంబు లనేకము లిటు
మీఁద మీకుఁ గల్గుతఁ బరమేశు కరుణ!

[ఈ కథకు శ్రీ మానికొండ రామారావుగారు, (బందరు) చిత్రములు వ్రాసిరి.

---

# గుహునియుక్తి

వెలఁగపూఁడి దాసయ్యచౌదరి గారు

అల్ల మిథిలాపురంబున కరుగునాఁడు
త్రోవఁగలబండ నీపదధూళి సోఁకి
నాతియై పోయె నయ్య, నా నావకూడ
నీపదరజంబు సోఁకుట నెలఁత యగునో?
కాక యేమైననయి నీటఁ గలియు నేమొ?
నమ్మరాదయ్య, లవమైన నమ్మరాదు
దోసఁగు గలదయ్య, నీపాద ధూళియందు
నిట్టువల్కితివని మొద నీర్ష్యఁ గొనకు.
సర్వమెఱిఁగిన వేదాంత చక్రవర్తి
జనకుఁడే నీవివాహంపు సమయమందు
సంశయోపేతుఁడై నీదు చరణములను
గగనకపుంబు శిరంబునఁ గడిగినాఁడు



వ్యాసకర్త

తమదు వర్ధాంగలక్ష్మి యా తల్లి సీత
యనుదినంబును మీదు పాదాబ్జములను
గడుగుచుండుటకునుగల కారణంబు
సంశయముఁ బొందుటే కదా, సత్యమరయ!
ఇన్ని యెఱిఁగిననాఁడ నిన్నెవ్విధమునఁ
బదముల గ్గడుగఁగనీక పడవమీఁది
కెక్కఁగా నిత్తునయ్య, యో యినకులేంద్ర!
జీవనాధారమియ్యది చెడినచెడవ
నిన్ననిన ఫల మిసుమంత యున్న దయ్య?
దీనుఁడను నాదుప్రార్థన తెఱఁగెఱింగి
పాదములనిమ్ము కడిగెద భక్తితోడ
రమ్యగుణసాంద్ర, శ్రీరఘురామచంద్ర!

# ఆయుర్వేద సమాజమువారి ఔషధరత్నములు పరీక్షించదగినవి.

## సిద్ధమకరధ్వజ



బంగారు మొదలగువానిభస్మములతోటి చేయబడినది. మేహము, క్షయ, పాండు, రక్తహీనత, శ్వాస, కాసలు మొదలగు సమస్త వ్యాధులను హరించి బలమును దేహపటుత్వమును కలిగించుటలో శ్రేష్ఠమయినది 20 మాత్రల సీసా రు. 4-8-0

## వసంతకుసుమాకరం

జగత్ప్రసిద్ధమయినది. మధుమేహము, అతిమూత్రము, శ్వాస, కాస, పాండు, క్షయ మొదలగునవి హరించి బలమును కలిగించును. రాజౌషధము తు 1కి రు 15-0-0

## పూర్ణచంద్రోదయం

సువర్ణమిశ్రమము, మేహము, నిస్సత్తువ, పాండువు, క్షయ మొ. వ్యాధులను హరించి బలమును కలిగించుటలో శ్రేష్ఠమయినదని అంగీకరింపబడిన ఔషధరత్నము. తులం 1-కి రు 12-0-0

## మదనకామేశ్వర లేహ్యం

శ్రేష్ఠమయినమూలికలతో చేయబడినది. బలహీనులపాలిటికల్పవృక్షము. మేహము, నిస్సత్తువ, నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము, మొ. వాటిని హరించి బలమును వీర్యవృద్ధిని, సంభోగశక్తిని, సంతానప్రాప్తిని కలిగించుటలో శ్రేష్ఠమయినది. 2డబ్బీలు చాలును. 20 తులముల డబ్బి రు 1-4-0

## క్షయారిష్టము

దగ్గులు, క్షయదగ్గులు, ఉబ్బసదగ్గులు మొదలగువాటిని హరించును. డబ్బి రు 1-0-0

## కాంతవల్లభరసం

శ్రీ. సంగ్రహణం, పాండు, క్షయ, మేహసంబంధ, పురాణజ్వరము, మొ. వాటిని హరించుటలో శ్రేష్ఠమయినది. తులం 1-కి రు 4-0-0

## పాలసుగంధిలేహ్యం

రక్తశుద్ధికి శ్రేష్ఠమయినది. సవామేహము, మేహపొడలు, మచ్చలు, యితర చర్మరోగములు, కీళ్లనొప్పులు, మలబద్ధము మొదలగువ్యాధులను హరించి రక్తమును శుభ్రపరుచుటలో శ్రేష్ఠమయినది. 4 డబ్బీలుచాలును. 20 తులములడబ్బి రు 1-4-0

## మహాఖండద్రాక్షలేహ్యం

సమస్తపైత్యములు, వాంతులు, త్రేపులు, ఆకలిలేకుండుట, మొదలగువాటిని హరించి మంచి ఆకలిని, జీర్ణశక్తిని కలిగించును. 15 తు డబ్బి రు 1-0-0

## రోజాపుష్ప లేహ్యం

మలబద్ధమునుహరించి కాలప్రవృత్తిని చక్కగా కలిగించును. పథ్యము లేదు సదా వాడుచుండవచ్చును 1 డబ్బి రు 0-10-0

## ఘనసారచందిని

అన్నివిధములగు, శగ, అంటురోగములు, స్త్రీల కుసుమవ్యాధులు, మూత్రపు మంటు, చురుకు, మొదలగు అన్నివ్యాధులను హరించుటలో చాలా ఉత్తమమయినది. 4 సీసాలుచాలును సీసా 1-కి రు 1-8-0

ఘనసారచందిని అత్తరు అనుపానముతో పుచ్చుకొనిన తక్షణమే సమస్తబాధలుహరించును. చందిని అత్తరు సీ. 1-కి 1-4-0

## మేహాంతకచూర్ణము

చాలాచౌక అయినను, గుణమునను శ్రేష్ఠము. మేహములు, కాళ్లుచేతులయందలి పగళ్లు, మంటలు, అతిఉష్ణము, ప్రాలుమాలిక, మూత్రము పచ్చగావచ్చుట, మొదలగువాటిని హరించును 8 తు. డబ్బి రు 1-0-0

## గంధకరసాయనము

పరిశుద్ధముగా తయారుచేయబడినది సమస్తరోగములను నిర్మూలముచేయును. జీర్ణించిన సవాయిలు, చర్మరోగములు, కురుపులు, కొరుకుపుండ్లు, తీటు, జిల, మేహపొడలు, మచ్చలు, కుష్ఠువులు, మొదలగు అపరిశుద్ధరక్తసంబంధమగువ్యాధులను హరించుటలో జగత్ప్రఖ్యాతిగలిగియున్నది. 15 తులములడబ్బి రు 2-0-0

## కందమూల రసాయనం

మూలవ్యాధి (మొలల జాడ్యము)కిది మంచిమందు. మలబద్ధము, ఆసనమందు రక్తచీముగాని వచ్చుట, మొదలగు అర్శస్సంబంధమగువ్యాధులను పోగొట్టును. డబ్బి 1-కి రు 1-0-0

## హేమసుందరం

బంగారుభాయగలది. మేహములు, అతిఉష్ణము, మూత్రకృచ్ఛ్రము, తాపము, నోటిపూత, అత్యుష్ణము, మేహవాతనొప్పులు, మొదలగువాటికి ప్రశస్తమయిన మందు. తులం 1-కి 2-0-0

(నోటు — పై రెండుఔషధములను కలిపిపుచ్చుకొనిన అమోఘమయిన గుణము కలిగించును.)

## అశోక

స్త్రీలపాలిటి కల్పవృక్షము. స్త్రీలు, ఋతుశూల, కుసుమవ్యాధులు, మొదలగు వాటివలననే సంతానవిహీనలగుచున్నారు. దీనిని సేవించినచో ప్రదరము, ప్రమేహము వంధ్యాదోషము, నడునొప్పి, ఋతుశూల కుసుమవ్యాధి మొదలగువానిని హరించి సంతానవతులనుగా జేయుటలో అమోఘమయినది. 40దినములువిడువక పుచ్చుకోవలయును. 8 ఔన్సుల సీసా (16 రోజులకు) రు 1-12-0
4 ఔ న్సులసీసా రు 1-0-0

ఇంకను మావద్ద శ్రేష్ఠమయిన అనేకఔషధములుగలవు. కోరినవారికి మా క్యాటలాగును ఉచితముగా పంపుదుము.

పోస్టుఖర్చులు ప్రత్యేకము.

పి. శి. ఏ. అండు కంపెని ఆయుర్వేదసమాజం - పెరిడేపి - నెల్లూరుజిల్లా

# అత్యద్భుత జ్యోతిషము



కొలదికాలములోనే వేలకొలది యోగ్యతాపత్రముల బడసిన మా జ్యోతిషము జైమిని, పరాశరాది మహర్షులు రచియించిన సూత్రముల ననుసరించి మిక్కిలి శాఖలాగాను ఋజువుగాను నున్నది. ఒక్కసారి నిదర్శనము జూచినచో మీకే బోధపడగలదు. జనన తేదీయు, వేళయు, జన్మస్థలమును గాని లేక ప్రశ్న కాలమును సుమారు వయస్సుగాని అంపినచో మీ భవిష్యత్తంతయు విపులముగా వ్రాయుదుము. 1. సామాన్యమైన 3 ప్రశ్నల కుత్తరము వ్రాయుటకు రు 1-4-0. 2. గుణాతిశయవర్ణనయుతయోగ సహిత సంవత్సరఫలం రు 2-4-0 3. ద్వాదశభావఫలములు రు 5-4-0. 4. ఐదుసంవత్సరములఫలం రు5-4-0 5. ఒక మహాదశాఫలం (అంతర్దశా విదశాసహా) రు 8-4-0 లు. 6. పూర్ణజాతకము సర్వసంగతులతో మరణాంతముపర్యంతం (మిక్కిలి అద్భుతముగా వ్రాయబడును.) రు 25-8-0. 7. నష్టజాతకము రు 30-8-0లు. 8. ఒక్కొకక్షేత్రభావము విపులముగా అనేక గ్రంథములనుండి సప్రమాణముగా విమర్శించి వ్రాయుటకు రు 3-4-0. 9. ఒక్క అయుర్భావము విపులముగా విమర్శించి అనేకమతములతో సాధించుటకు రు 5-4-0 లు. (సగము సొమ్మైనను అడ్వాన్సుగా పంపవలెను.)

నోటు:—సింహళద్వీపములోను, బర్మాదేశములోను, మైసూరు, రాజపుటానా, హైదరాబాదు, తిరువాన్కూరు, కాశ్మీర, మహారాష్ట్ర రాజ్యములలో మా జ్యోతిషాలయము విశేషప్రఖ్యాతి గాంచినది.

ఏ భాషలో (ఇంగ్లీషు-తెలుగు) వ్రాయవలయునదియు తెలుపవలెను. ఇంకా విశేషాంశములకు:—

ప్రొప్రైటరు:— శ్రీ జైమిని జ్యోతిషాలయము.

యలమంచిలి, విశాఖపట్నంజిల్లా, (అని వ్రాయవలెను.)

## ఆయుర్వేదవైద్య అంగర వెంకటాచార్యులు అండు సన్సు వారి ఔషధములు

### రత్నపురుషలేహ్యం

ఏకారణమువలనవచ్చిన, ఎంతకాలమునుండి శీర్ణించినదైనను, శుక్లనష్టమును పోగొట్టి బలము కలుగజేయు అద్భుతలేహ్యము. అనేకులచే కొనియాడబడుచున్నది. సేరు డబ్బీ రు. 3-4-0

### సెగ లేహ్యము

పచ్చని, ఎరుపు, తెలుపుగల సెగలను, మంట, పోటు, యిట్టి గుణములుగలవాటిని, శీర్ణించినవాటినైనను బాగుపరచును. మూడుపూటలలో గుణమిచ్చును. పథ్యము లేదు. డబ్బీ రు. 1-8-0

### షట్ఫలగంధకచూర్ణం

స్త్రీజాతి సవాయి సమస్తము. ప్రమేహం, పుంస్త్వ, సౌఖ్యములు, ఇట్టి సవాయిలుకు, అద్భుతముగాపనిచేయును. 4.తు. డబ్బీ రు. 2-0-0

### జ్వరాంకుశవటి

సమస్తజ్వరములను నివారించి వెంటనే మార్పుచేయునది. అనుపాన పత్రిక మందుతో కలదు. 50 మాత్రలు రు. 1-0-0

వంట ఔషధము మొదలగు 140 మందులు గల కేట్లాగు ఉచితముగా పంపబడును.

శ్రీ పట్టాభిరామవైద్యశాల, రాయవరము, తూర్పుగోదావరిజిల్లా.




# నరపతి

అడివి బాపిరాజు గారు బి. ఏ.

## ౧

ఓ నరపతీ! నువ్వు ముప్పైయిద్దరు రాజకుమారులు మోసే వివిధ రత్న సువర్ణ పల్యంకిక పై ఊరేగుతూ వుంటావు. గౌరీశంకర శృంగమహాహిమప్రదేశాలలో తిరుగాడే దేవమృగచామరాలతో నవయౌవన చంద్రికాస్నాతలైన మహారాజకుమారికలు పదహారుగురు మంజుల కంకణకింకిణీస్వనాలు వెలయ నీకు సదా వీస్తూవుంటారు. నీవైభవం యక్షపతి కుబేరుడికున్కూడా లేనేలేదు.

నరపతీ! నీ క్రీగంటి ఎరుపులు చూడగానే హిమాలయాది పర్వతములు కదలిపోతాయి. సదా సంతోషంతో ఉప్పొంగే ఒంటివాడైన సముద్రుడు ఇంకిపోతాడు. అనేకకోటి కోట్ల సైనిక వ్యూహాలు ఒక్కసారిగా ఇరువదియొక్క అక్షౌహిణులు గజతురగపదాతులు, సర్వనౌకాబలాలు నీ కన్నుల ముందు కరిగిపోతవి. మానవాళి నిబిడజనపదములు ఎడారులైతే మరుభూములు మహాపట్టణాలౌతవి. నీ బలసంపత్తి దేవదమాపతియగు కుమారునకే లేదు.

## ౨

ఆనరపతి ఒకనాడు ముప్పైరెండు మహారాజ్యాలకు పాలకులగు తన సామంతుల కుమారులు మోసే అందలమునుంచి దిగాడు. మంచి అందమైన వస్త్రాలు ధరించి అంతఃపురంలో అంతటా ఏమాత్రం దారికైనా ఎడంలేకుండా అడ్డంగా పండుకొనివున్నారు తానుజయించిన లాతిరాజ్యాలనుంచిఖైదీలుగాపట్టుకొనివచ్చిన మంత్రులు, సేనానాయకులు, రాజకుమారులున్నూ — వాళ్లపైనుంచి రాళ్లుపొదిగిన బంగారపుచెప్పులతో నడుస్తూ తనమందిరం చేరాడా రాజు.

ఆ మందిరవైభవం! మచిలీపట్టణపు పల్యంకపురీ ప్రతిసీరాదులు, గంధాతిముక్తక, శ్రీపర్ణి కాదిదారువుల శిల్పములుగల గోపానసీపటలాదులు, దంతస్తంభాలు, రత్నస్థగితసువర్ణ సింహాసనాలు, సింహశార్దూల మృగాదన కృష్ణసారాది మృగచర్మాలు, సువర్ణ ధూపదీప స్తంభాలు, కాశ్మీరపు పట్టుపనిచేసిన దుకూలాంబరముల చాందినీలు, అందుండి క్రేలాడు నీలగారుత్మతలోహితక వజ్రముల దీపపుబుడ్లు, భీమ హాయపుత్రాభిమన్యు రామరావణ సుందోపసుందాదివీరుల చిత్రలేఖనములు, స్ఫటిక రత్ననీలాది వివిధవర్ణ శిలలు, చంద్రశిలలు చెక్కిన శిల్పాలు.

ఆ నరపతివచ్చి పట్టుతలగడలు, పరుపులు, దిండ్లు వేసిన ఒక పీఠముపై అధివసించంగా పూర్ణచంద్రబింబాస్యలగు బాలికలు వచ్చి, కొందరు సువాసనలవేళ్ల విసనకఱ్ఱలతో వీస్తున్నారు, కొందరు వీణాగీతాలతో కంఠాలు మేళవించి కాకలీధ్వనులతో పాటలుపాడుతూ వున్నారు; కొందరు పాదసేవచేస్తూవున్నారు; కొందరు వర్ణకంచే పరిహారంతో ఆతని దేహమునకు లేపూత పూయుచున్నారు.


వ్యాసకర్త, చిత్రకారుడు

ఆనరపతి మహాసత్త్వుడు, ఆజానుబాహుడూ అయివున్నాడు. ఆతని విశాలమైనవక్షం హిమాలయపర్వతసానువులావుంది. ఆతని భుజాలు, చేతులు ఏనుగుకుంభాలు, తొండాలు. ఆనరపతి గౌరీశంకరశృంగంలా మహోన్నతరూపుడు. మల్లయుద్ధం గదాయుద్ధాలలో శక్తి తోమరం అసి అత్యంత నిపుణంగా వేయటంలో, యిరువదినాలుగు రకాలకత్తి సాములు, ఘాతము, గతి, వక్రము, ప్రతిఘాత, అపగతి, లక్ష్యము, వాటిల్లో అత్యంతంగా ప్రావీణ్యం వుంది. ధనుర్వేదంలో అర్జునుణ్ణి మించిపోతాడు. గజతురగశాస్త్రము లతనికి అశ్వినీ కుమారులకు మల్లే అతిచిత్రంగా వచ్చును.

ఆనరపతి చాలా అందమైనవాడు. ఆతనిచూస్తే అప్సరసలుమొదలయిన దివ్యనారీమణులకున్కూడా హృదయం కొట్టుకునేది. దేవతల్లోనే లేదు ఆతనితో సమానమైన సుందరమూర్తి. ఆతడు అన్ని కళల్లో, అన్నిశాస్త్రాలల్లో మహాసిద్ధి సంపాదించాడు.

సేనలు నడపడం, కొద్దిసేనలతో గొప్పసైన్యములను కూడా చీకాకుపరచి నాశనం చేయడం, ఘనవ్యూహాలు పన్నడం— వీటిల్లో ద్రోణాచార్యుడుకూడా అతనికి ఈడు కాడు. ఆతని సైన్యాల్లో భయంకరంగా యుద్ధము జరిగినప్పుడుకూడా భటులు ఎప్పుడూ కొద్దే నశించడం. రథగజతురగపదాతిదళాల ప్రతివీరుడు, సైనికుడు, సము

ద్రాల్లో ఆనరపతియొక్క యుద్ధనౌకల నావికులు అందరూ అత డంటే మహాప్రేమతో వుంటారు. వారికి నచ్చిననాయకుడు; గొప్పగా ధనమిచ్చు ప్రభువు; వారి హృదయం రంజించే వీరుడు.

దేశాలన్నీ ఓడించా డానరపతి; కానుకలుకొల్లలుకొన్నాడు. రాజసూయయాగములు మూడు చేసా డాచిన్నతనంలోనే.

పాలనచేస్తూ వుంటే ఆరాజును ఈనరపతి హేళనచేయడం, అతన్ని తన మహాసభలో అగౌరవ పర్చడం.

నరుల్ని వాహనంగాచేసి నైరుతినిమించిన రాక్షసుడై నరబాధకుడై మహాఅందగాడై ఆనరపతి భయంకరభుజగంలా, చండమృగాదవంలా క్రూరసౌందర్యంతో విరాజిల్లుతూ వుండేవాడు.

## 3

ఆనరపతికి ప్రపంచమన్న కోపము; నరులన్న హేయము. ప్రజలందరు కాకులగుంపులు. వాళ్లచిత్తవృత్తులు అతిచంచలమైన పొగమంచులు. ఉత్తమపురుషులకు సామాన్యమానవులు బానిసలు, వాళ్లకి చాకిరీ చెయ్యడానికే అపసరాలు పుట్టింది. ఈ ప్రపంచంలో మహాసత్త్వులుతప్ప యింకెవ్వరూ తల యెత్తి తిరగడానికి స్వతంత్రం లేదు. వాళ్లు సామంతరాజులైతే నేం మండలాధిపతులైతే నేం అందరూ ఒక్కడికే శుశ్రూష చేయాలిసిందే.

ఆ నరపతితో సమానమైన హోదాకలవాళ్లు లేనేలేరు. ఏరాజైనా తనక్రిందివాడే. భరతదేశం అంతా దిగ్విజయయాత్రలుచేసాడు పదిహేనుసార్లు. కామరూప,వంగ, మగధ, మాళవ, మత్స్య,పాంచాల, కాశ్మీర, గాంధార, సింధు, బర్బర, కాంభోజ, అవంతి, ఘూర్జర, పుళింద, కళింగ, పాండ్య, చేర, చోళ, కేరళాది సకలరాజ్యాలు ఆతనికి లోబడ్డాయి. ముప్పదియారు ద్వీపాలు సువర్ణ, యవ, కుశ, అపవర్ణ, జవన, సుమిత్ర, సింహళ, క్రౌంచాది ప్రాచ్యద్వీపములు, యవన, చంద్ర, అవరాంత,పాత్రారహరోమకాది ప్రతీచీద్వీపములు, వాటి ప్రభువులు ఆతని నౌకాబలాలకు జోహార్లు చేసారు.



"ఆ నరపతి గౌరీశంకర శృంగంలా మహోన్నతరూపుడు."

అంత మహాబలవంతుడై రాజ్యంచేస్తూ ఆనరపతి ప్రజాకంటకుడయ్యాడు. ప్రజలదగ్గిర పన్నులు ఎక్కువవసూలుచేయడమే కాదు; వాళ్లని దోచుకోవడమే కాదు; వాళ్లంటే వుండే నిరసనచేత వాళ్లకష్టసుఖాలు విచారించడంగాని, వాండ్లకు సౌకర్యాలు కలుగజేయించడం గాని, వాళ్లకు సరియైన న్యాయం కలిగేటట్టు చూడడం గాని సుతలామూ ఏమిన్నీ లేదు. తనకిందవుండే సామంతరాజులు ఎవరైనా తనమండలంలో ప్రజానురంజకుడై వారిని సకలధర్మయుక్తంగా పరి

## ౪

ఆరోజు అలా ఆమందిరంలో శయనించి వుండి మూలగా వీణవాయిస్తూవున్న ఒకదివ్యమోహన విగ్రహమైన చిన్నదాన్ని తన దగ్గరకు రమ్మని సైగచేసాడు ఆ నరపతి. ఆమెను వర్ణించాలంటే మనోహర సుగంధ కుసుమాలన్నీ వెలగికలగిపోతవి; మందమలయశీతల పవనాంకురాలు మాటుమణిగిపోతవి; మంజుల సౌదామినీలతలు మసకమసకై పోతవి.

ఇరువదివర్షాలు ప్రాయం వాడై ఆనరపతి వివాహము చేసుకొనలేదు. వివాహం ఆతనికేమీ ఇష్టంలేదు. స్త్రీఅంటేఅసహ్యము. జీవప్రపంచంలో హేయమైంది వనిత. వాళ్లు చాకిరీకొరకే కాని ఉద్వాహం చేసికోడానికా. ఆనరపతి ఘోటకబ్రహ్మచారి.

వణుకుతూ వచ్చింది ఆ కన్యక నరపతి ఎదుటకు. "భరతవర్షంలోవున్న అద్భుత సౌందర్య లావణ్యవతీగణములలోకల్ల నువ్వు చాలా అందమైన దానవుటగా! నీ కన్నులు ఆనందంలో నిర్మలనీలాభ్రగంభీరపథముల తేలియాడే సర్వవర్ణాల మినుకాడు నక్షత్రాల్ని, విచారంలో జలప్రతిబింబితకాదంబినీచ్ఛన్న సంధ్యాకాంతుల్ని, రౌద్రంలో భయంకరకాలాహి ఫణాగ్రజ్వలితరత్నాల్ని—ప్రేమలో శరత్పూర్ణిమాచంద్ర చంద్రికాంచల స్వచ్ఛనర్తనాల్ని పోలుతవిటగా! అయితేఏం! నాకు నిన్నుచూస్తే యీ అసహ్యం ఎందుకు?" అని నరపతి అడిగినాడు.

ఆబాల మాటాడలేదు.

"నీ హృద్యమైన దేహంతో, నీ కులికిపోయే వయ్యారంతో నిల్చున్నావు. హారాలతో వెలిగిపోతూవున్న నీకంఠాన్ని యీవేళ్లు నలిపివేస్తే యేంచేస్తావు?"

ఆఅబల ఒకఅడుగు వెనక్కి వేసింది.

"ఊఁ" అని ఆనరపతి ఆసనము పట్టుదిండ్లపై ఒరిగిపోయాడు.

అతని కర్కశహృదయంలో ఏదో తీరజాలనివ్యథ.

పసిపిల్ల లానరపతికి హేయపదార్థములు. అతడు రాజ్యాలలో సంచరిస్తూవుంటే నిరుపేదలు కంటబడగూడదు. ఏతలిదండ్రులైనా నరపతి ఎదురుగా పోనిచ్చారా, ఆ తలిదండ్రులకు నూటయిరువది కొరడాదెబ్బలు; ఆశిశువుకు ఒక చిన్న బెత్తపుదెబ్బ.

ఆ నరపతిరాజ్యంలో వుండేప్రజలకి అతడంటే భయం. పరాయిరాజ్యాలల్లో ప్రజలకి ప్రాణభయమే. ఏ మిడతల దండులా, ఏమహామారిలా సైన్యాల్తో వచ్చిపడ్తాడో అనిశ్చయం, ఎంతదూరాల్లోవుండే రాజ్యాలవారికీకూడా.

౫

అతడు సర్వశాస్త్రాలు మూలబెట్టాడు; సంగీతాదిమనోహర కళలు పటుమార్చాడు; సభలు, రాజ్యాంగమంత్రాలోచనలు మరిచేపోయాడు. మంత్రులంటే అసహ్యము. రాజపశువులువెంటనే అందలం ఎక్కడం, సైన్యశిబిరంలోకి పోవడం; వాళ్లతో మాయాయుద్ధక్రీడలు సలుపుతూవుండడం—అదే అతనికి నిత్యక్రీడ.

మళ్లీ దిండ్లమీదనుంచి లేచాడు. "ఓబాలికా, నేనుచేసిన మహాయుద్ధాలలోకెల్ల ఉత్కృష్టమైన రణరంగంలో, నాశక్తిని ఎవరును అంతరీతిగా కదల్పలేకపోయినటువంటి ద్వంద్వయుద్ధంలో నీ రాజ్యం సైన్యాలు, నీ తండ్రిసహాయనృపతుల సైన్యాలు ముప్పదినాల్గు అక్షౌహిణీల్ని, నీతండ్రిని ఓడించి నిన్ను చెరపట్టుకువచ్చా. ఏమిటి నిన్ను తీసుకువచ్చినలాభం? అప్సరలకన్న అందం అనిచెప్పే ఈ రాజకన్యకలందరంటె నాకు జుగుప్సమాత్రమే, నువ్వంటే కోపంకూడానూ—కాని మాటలకే భయపడి వెనకంజవేసావే నువ్వు నావేటకుక్కల ముందర వేయుటకుకూడా పనికిరావు."

ఆబాలిక కళ్లు మిరుమిట్లు గొలిపాయి. ఆమె శ్వేతఫాలము, పాటలకపోలము, అరుణములైన పెదవులు కంపించినై. "ఓనరపతీ నీకడనున్నటువంటి కాలేయకరాజాల్లో ఎట్టి భయంకరమృగాన్నయినా తీసికొనిరానిమ్ము; నన్నది ఏమిచేస్తుందో నీకన్నులు పరికిస్తవి గాక."

తోకతొక్కిన భుజంగంలా లేచాడానరపతి. సాయంకాలానికి సభ్యులు, తన ధనకటక మహాపట్టణంలోని ప్రజలు, సామంతులు; సైన్యాధిపతులు అందరూ మల్లరంగానికి రావాలని ఆజ్ఞపంపించాడు.

'ఏమిది రాజాజ్ఞ?' అని అందరూ చేరారు. అత్యంతవిశాలమైన మల్లరంగము కిటకిటలాడి పోయింది జనసమూహాలతో; మల్లరంగములో యిసుక రేణువులు ఆ అపరాహ్ణ సూర్యకిరణాలల్లో తళుకు తళుకు మని పోతోంది.

నరపతి లేరిచూడజాలని వైభవంతో వచ్చాడు; ఆయుధపాణులైన స్త్రీభటులు పారా యిచ్చే అందలంలో వచ్చింది ఆ బాలిక. ఆ అబలారత్నాన్ని రణరంగంలోనికి తీసికొనివచ్చారు. నరపతి సింహాసనం ఆక్రమించాడు. ఆబాలిక చేతిలో ఒకబెత్తము మాత్రమున్నది.

నరపతి కన్నుల్లో అపహాస్యపు వెలుగులు తిరుగుతూ వున్నవి.

ఆ నరపతి చేతితో సంజ్ఞచేయగానే ఒక వైపునుంచి రాక్షసు*డొకడు, భయంకర రూపంవాడు, కేవురించిన ఎఱ్ఱని రంగువాడు, మిట్టకోరలవాడు—చింపి జుట్టువాడు, మదించిన దేహంకలవాడు—ఎనిమిది అడుగుల పొడవువాడు—రాతిదిమ్మెల ఛాతీవాడు—మిడిగుడ్లవాడు—గట్టి బంగారపు గొలుసులో ఒక శునకాన్ని పట్టుకొని రణరంగంలోకి దుమికాడు.

౬

మంచుకొండలకి వుత్తరంగా పరమేరు, మహామేరు, సుమేరు అను పర్వతాలున్నవి. మహామేరువే పశ్చిమద్వీపాల పర్వతపంక్తులకు, భరతఖండ, ఉత్తర కురుదేశ, యక్షదేశముల మహీధరశ్రేణులకు మాతృస్థానము. అక్కడ గాలిచొరజాలని అడవులున్నై; ఆ అడవుల్లోంచి ఒక రాక్షసుడు, పెద్దపులికన్న భయంకరమైంది, సింహంకన్న వేగం కలది, ఏనుగులాంటి సత్వంకలది, ఒక మృగదంశకమును తీసికొని వచ్చి, ఆ నరపతి గాంధారదేశంలో దండుతో విడిసి వున్నప్పుడు అతని దగ్గిర నిల్చున్నాడు.

"ఓ రౌకిమీడా, నువ్వు నన్ను మల్లముష్టియుద్ధాల్లో గెలిస్తే నేనూ, సింహాన్నిచంపే నాకుక్కా నీకు బానిస లౌతాము. నువ్వోడిపోతావా! నీరాజ్యాల్లో నాయిష్టమైనట్లు ఒకనెలరోజులు వుండి నాఅడవులకు పోతా" అని ఆరాక్షసు డన్నాడు.

ఆమానవుణ్ణి ఎగాదిగా చూసా డానరపతి. వీరులతో యుద్ధం చేయడమే నరపతి జీవితం. సేనానాయకుల కెవరికీ యిష్టం లేకపోయినా వాళ్లు నరపతికి సలహా చెప్పలేరు. నిమిషంలో వాళ్ల ప్రాణం లేదన్న మాట. శార్దూల చర్మపుథడ్డీతో ముందుకురికాడా నరపతి భుజాస్ఫాలనం చేస్తూ. రెండు మహాసముద్రాల్లా, మదపుటేనుగుల్లా, ఉన్నత పర్వతాలవలె వాళ్లిద్దరూ ఒక యామం పోట్లాడారు. రాక్షసుని బలం అనంతబలపూర్ణుడైన నరపతి జవం యుద్ధనైపుణ్యము అతివిచిత్రము. రాక్షసుడు ఆయాసపడిపోతూ వున్నాడు; నరపతి బలమంతా కూడదెచ్చుతూవున్నాడు. ఒక్కసారిగా మెరుములా ఆరాక్షసుడు ఒళ్లుతెలియని ఆవవిరుస్న పోతులా రెండుగుప్పిళ్లు పైకెత్తి తనవిరోధిశిరము వ్రయ్యలుచేయడానికి ఉరికాడు. నరపతి అంతకన్న అతివేగముగా కండలుకట్టిన ఎడమచేయి తలపైకెత్తి ఆరెండుదెబ్బలు అందుకొని కుడిచేయి గుప్పిటతో పిడుగు

* ఒక అడవిజాతి మనుష్యుడు.

లాంటి ఒకసమ్మెటపెట్టు ఆరాక్షసునిముఖంపై ప్రయోగించాడు. రక్తం కక్కుతుంటూ ఆరాక్షసుడు పడిపోయాడు.

* * * *

ఆరాక్షసుడు కుక్కతో రణరంగంలోకి వురికి ఆబాలికను ఎగాదిగా చూసి ఆబంగారుగొలుసు విప్పాడు. నవ్వే పెదవులు ఆమె అందాన్ని యినుమడింపజేస్తూవుండగా ఘంగున తనమీదికి కోరలు తెరిచి వురికిన ఆభైరవానికంటె అమితవేగంలో ఆబాలిక పైకి తప్పుకొని తనచేతిబెత్తముతో ఆకుక్కముట్టెమీద అగ్నిశిఖలాంటి ఒకదెబ్బ చురుక్కుమనిపించింది. ఆజాగిలం బాధచే ఉరుములాంటి అరపు అరచింది. కోపంతో వెనక్కితిరిగి బాలికపైకి ఉరకకే పరుగునవచ్చింది. ఆబాలికమోముపై నవ్వు లేదు. మహాశక్తి తాండవమాడుతూంది. ఆమెచేతిబెత్తం మేఘాల్లో మెరుపైంది. ఆపారమేయసింహము మొగముచుట్టూ ఆబెత్తం జవజవలాడింది. ఆకుక్క ఏమీతోచక ఒకముహూర్తము చైతన్యరహితమైంది.



"ఆబాలిక పైకితప్పుకొని......ఒకదెబ్బ చురుక్కుమనిపించింది."

ఇంతటిలోకే చురుక్కుమని సన్నని బెత్తపుదెబ్బ సరిగా ఆకుక్క కళ్లపై తగిలి కళ్లు మూతపడిపోయినవి. కెవ్వుమని ఆ పారమేయపతి భూమిపై మూతిమోపి హృదయం కరిగే అరపు అరచినాడు. ఉరుమువంటి దాని గొంతుక కరిగిపోయింది.

ఆసునకరాజము భయపడిపోయింది. ఏమియు తోచక తాత్కాలికంగా గ్రుడ్డి అయిపోయిన కళ్లతో నిల్చింది. దానిడొక్కలు, దేహమువణికిపోయాయి. ఆబాలిక ఆబెత్తముపారవేసి అత్యంతమాధురీస్వనాలతో ఆకుక్కదగ్గిరకు పోయి దానితల తనఒడిలోవుంచుకొని దానిచెవిలో మాటలు చెప్పసాగింది. దానిఒడలు తుడిచింది. దాని కళ్లు ఒత్తింది. నీళ్లుకారుతూవున్న కళ్లువిప్పిం దాకుక్క; బాలిక మొగం చూసి గొంగురుధ్వనితో ఆమెమోము నాఘ్రాణం చేసింది. తన్నుఓడించిన ఆబాలికకు ఆకుక్కకు ప్రాణస్నేహం కుదిరిపోయింది. ఆబాలిక చురుకునాటులతో ఆసునకరాజముయొక్క కరకుతనం మటుమాయమై పోయింది. నీళ్లు సుడితిరుగు కవలనయనాలతో ఆబాలిక ఆకుక్కను ముద్దుపెట్టుకొని కౌగిలించుకొంది.

ఆమె జవ్వన నిలబడి ఆనరపతిదిక్కు చూసి "ఓనరపతీ, నువ్వు మహాబలవంతుడవట; మహాఖడ్గకృపాణయుద్ధాల్లో ప్రఖ్యాతి నొందినావట; నీకు నువ్వే సాటట. నువ్వు ఓడించినావని గర్వం పడుతూవున్న మాతండ్రిగారే నాకు గురువు. నేనూ సమస్తాయుధాలు అవలీలగా వుపయోగించేకౌశలము కలదాన్ని. నీవు వీరుడవైతే నాతో కరవాలయుద్ధానికి రమ్ము. నువ్వు మహాబలవంతమైనది అని అనుకునే ఈపారమేయము నాకు ఓడిపోయినది. దీనికిన్నీ దీనిన్నే హితుడను నీరాక్షసునకున్నూ పతివైన నిన్నూ నేను ఓడించేయగలను." అని కాంతులు మెరిసే చూపులు వెదచల్లుతూ ఆబాలిక అన్నది.

ఆనరపతికి కోపం వచ్చింది. ఆబాలికను ఆపాదమస్తకం చూసాడు. సింహాసనాన్నుంచి రెండంగల్లో ఆబాలికదగ్గరకు వచ్చాడు. ఆతనితోపాటు, సామంతులు, మంత్రులు, సేనాధికారులు, ఉద్యోగులు, సభ్యులు, ప్రజాసమూహం అందరూ లేచారు.

ఆనరపతి ఆబాలికభుజంపట్టి తీక్ష్ణంగా ఆమెమోము చూసాడు. ఒక్కవెడనవ్వు నవ్వాడు. తనఅంగరక్షబలాధికారికి శివకరవాలము తెమ్మని ఆజ్ఞయిచ్చినాడు. సింహాసనంపక్క ఆయుధపీఠము మీద వుంచిన నిశితకరవాలము— రత్నాలుతాపిన బంగారుపిడిగల దాన్ని— కవ్యాకుబ్జములో ప్రఖ్యాతివహించిన ఒకమహాసిద్ధుడు రచించినదానిని, ఓటమిఎరుగని ఆ ఆయుధరాజమునుతీసి ఆ వీరండలో ఝళిపించినాడు.

ఆబాలిక, ఆ అంగరక్షక భటాధికారిని పిలిచి అతనిచెవిలో ఏదేని ఒకరహస్యం చెప్పింది. అతడు ఆనరపతిఅనుమతితో రాజాంతఃపుర జన మందుపోటికి పోయి అక్కడ ఈబాలిక చెలికత్తెయైన ఒక అంగనదగ్గరవున్న ఒక సామానుపెట్టెపెట్టి కొనివచ్చి ఆ బాలికముందుంచెను. ఆమె ఆ పెట్టె నొకమీట నొక్కి, తెరచి, అందుండి పట్టుసంచిలో నున్న ఒరగలకరవాలము నొకదాన్ని తీసింది. ఆవరనుంచి సునాయాసంగా ఆ కరవాలము పైకిలాగి యుద్ధసన్నద్ధయై నిలిచింది. ఆవంకరకత్తికి వంతపుపిడే వున్నది. ఆకత్తిపై యిరవైనాలుగు అథర్వణవేదమంత్రాలున్నవి. ఆకరవాలము పూర్వకాలాన చంద్రునిహస్తాన్ని వెలిగిపోయేదని ఋషులు చెప్పుకొంటారు.

ఆనరపతి క్రూరనేత్రాలు ముడుచుకుని వలకలై తీక్ష్ణసూక్ష్మాగ్నులై పోయాయి. ఆబాలికమోము శక్తిపూర్వకమైన హాసచంద్రికలు వెదచల్లుతూనేవుంది.

వారిద్దరు యుద్ధం ప్రారంభించారు. సూక్ష్మకౌశలము కొంత చూపించాడానరపతి. ఆబాలిక వానినన్నింటినీ నడుమనే విరిచింది.

ముందున్న ఎడమకాలు వంచి కుడికాలు మనోవేగాన్ని ముందంజగా వేసి అసునుండి ఎదుటిఆయుధాన్ని తన ఆయుధంతో

మెరుములా పైకికొట్టి ఆమెలికె క్రిందినుంచుగా తిప్పి కత్తిపిడి పట్టిన ముష్టిరెయొక్క బొటనవేలిని పొడుచుటకు వరాలకమని పేరు. అనరపతి అమితవేగాన ఆమెను నిరాయుధగా చేయుటకని ఆకేర్పుచూపగానే ఆమెనవ్వుచు అతనికన్న అద్భుతమైన వేగంతో దానికి మారుఎత్తు వేసి తప్పుకొనుటేకాకుండా శూలవారియను పేర బరగు మెలికతో తన కరవాలము అతని నొసటుకు సూటిపెట్టింది. మహాకౌశల్యం గలిగినవా డగుటచేత అనరపతి అత్యాశ్చర్యంతో చంగున వెనక్కు దుమికినాడు.



అక్కడనుంచి ఖంగుఖంగుమని కత్తులు పోతులతో, చర్రుమను రాపిళ్లతో పన్నెండుమహూర్తములకాలము వారిద్దరు ద్వంద్వసమరం చేసినవారైనారు. కొంతకాలము ఆబాలిక మహాశక్తి అయినది. పక్కపోటులు, అడ్డకోతలు, నిలువుతీతలు, మెలికలు, వంపులు, అయిమలు ప్రవేటులు వడివానలోని చినుకుల్లా అనరపతిమట్టూవర్షింపచేసింది. వేటుకు అడ్డపాటు, వంపుకు నిలువుతెంపు, మెలికకు జర్రునవాలుక, తీతకు పదునువేత, వీనితో అనరపతి ఒక్క అడుగే, ఒక్క అడుగే వెనక్కు తగ్గతో ఏమరుపాటుకానిచూపులో కాపాడుకుంటూ ఆ రంగంచుట్టూ మూడుసార్లు తిరిగాడు.

విచిత్రమైన కేర్పుతో అనరపతి ఒక్క గంతున నూతనగతులు ప్రారంభించి ఆబాలికను సుడిగుండములోని పుష్పంలా ఆడించివేసినాడు. అంతకన్న మరియు మంచి విన్నాణంతో తన్ను రక్షించు కుంటూ ఆబాలిక ఏటుకు ఏటు, కోతకు కోత బదులిచ్చుచు వెనక్కి తగ్గినది.

ఆపోరాటము యింకను పది ముహూర్తములు సాగినది.

౭

ఏవేగాన వచ్చిందో, ఏ మెరుపుతో వచ్చిందో ఒక్క అతి సున్నితమైన వజ్రఘాతమువంటి పొడుపు; ఆ బాలికకు హృదయముకడ గాయము; చేతిలో కత్తి పట్టువీడి నవ్వులో కళ్లమూతపడ, "ప్రభూ నువ్వు విజయంగాంచి నావు సుమీ" అని అంటూ దిగజారి రణరంగములో పడిపోయింది. ఆమె గుండెలనుండి చివ్వున రక్తపువెల్లువ వెలివచ్చినది.

ఆ నరపతి వెఱ్ఱివాళ్లా చూసాడు ఇటూ అటూ. పడిపోయిన ఆ మహారాజు కుమారిత, ఆవీరకన్యక వైపు దృష్టిపోనిచ్చాడు. ఆగని కేమిటో మతిపోయిన ట్లైంది. ఒక్కసారిగా తెన్నెదిర్చిన ఈ తుచ్ఛ బాలిక కూలిపోయింది కదా అని నంలో పాన నిట్టూర్పు పుచ్చాడు.

వెలుపల మెరుపై, కారుమబ్బులలోనుంచి వెలిగిపోయే చంద్ర కిరణాల వండై, నడలిపడిపోయిన పూలదండలా వున్న ఆబాలిక మోము చూసాడు. ఏమిబుద్ధి పుట్టిందో తన కత్తి విసరి పారవైచి, చటుక్కున వంగి ఆబాలికను ఎత్తికొని తన హృదయానికి అదుము కొన్నాడు. అనరపతి కళ్లు నీటిసుళ్లు తిరిగినవి. "ఎంతటి రాసుండై మనిషిని! ఈదేవి పాదాలధూళి తాకుటకైన అర్హుడనుకానే! తుచ్ఛ హృదయంతో నాప్రాణానికి ప్రాణం, నా ఆత్మకు పరమేశ్వరి యైన నా దేవిని కరకుపిశాచివలె నరకునొన్నాను! దేవీ ఒక్కసారి కన్ను తెరవావా? మూఢుడైన యీపాపిని క్షమించవా?" అని వెడకిపోవు కంఠధ్వనితో విలపించాడు.



"ప్రజాసేవియు నగు మహారాజు ఆబాలికతో అధివసించి పరమపవిత్ర ప్రణయలీలాతన్మయుడై వున్నాడు."

# కైక పశ్చాత్తాపము

పిసుపాటి నారాయణశాస్త్రి గారు



వ్యాసకర్త

రామునిఁ గళ్యాణగుణో-
ద్దాముని భూధవమనస్సుధాశరధి నిం
కాముని సౌందర్యకళా-
ధాముని నడవులఁ జరింపఁ దఱిమితి నయయో!

సీ. పూచినతమ్మిపూఁ బొంకమ్ము సుంకమ్ము
నడుగుమోమున మందహాస మలరఁ
గాఱుకమ్ములఁ బొరఁజీరు నెమ్మేనిపై
బంగరుదుప్పటి భాసిలంగ
మృదుపల్లవశ్రీల నెదురించు నడుగుదోయిని గుందనపుటందె లనురణింప
రాక తొందరఁజేసి రాణించు పేరురమ్మునఁ గల మణిహారములు చలింప
దినదినము నాదుమందిరమ్మునకు వచ్చి-మ్రొక్కి దీవింపుమని వేఁడి ముద్దు లొసఁగి
సంతసముఁ గూర్చు శ్రీరామచంద్రుఁ బురముఁ-బాయఁజేసితి నిందలపా లయితిని.

క. "జననీత్రితయములోనన్-జనకుని చిత్తమున కెక్కఁజాలితి వీవే
పినతల్లీ!" యని ముద్దులఁ-దనుపు నయాలాపుపట్లఁ దలఁచితిఁ గీడున్.

క. తనుఁగన్న తల్లికింబలె-ననయము నా కుపచరించు చన్నివిధములన్
మనము నలరించు గుణనిధి-వనికిం జనెఁ బౌరులేడువఁగ నాకతనన్.

---

చిరునవ్వు నవ్వుతూ ఆబాలిక కన్నెత్తి "ఓ ప్రభూ, ఇప్పటికైనా మీహృదయం కరిగిందికదా! మీహస్తాల్లో నేను మరగి పోవుచున్నాను. అదే నా జన్మసాఫల్యం" అన్నది.

ఆనరపతి యొక్క రాతిగుండె ఆతని క్రౌర్యమహాగ్నిలోపడి కరిగి పోయినది.

ఆనరపతి ఆబాలిక వక్షస్స్థలానికి కట్టిన వస్త్రమును అత్యంత నిపుణత్వంతో సడలించి తీసివేసినాడు. ఆతని నిశితకరవాలము ఆమె హృదయాన్ని చీల్చలేదు. కాని కొంతమేర క్రిందుగా చిటికెన వ్రేలెడు గాయమైనది.

ఆనరపతి లీలాస్వరూపుడగు పరమేశ్వరుని పరమభక్తితో ఒక్కనిమేషము ప్రార్థించినాడు. ఇంతలో రాజవైద్యులువచ్చి తాత్కాలికోపచారాలు జరిపి ఆబాలికను సువర్ణపుటందలముపై అంతఃపురానికి తీసుకుని పోయారు.

౬

ఆనరపతి ప్రజాసేవకు డయ్యాడు. సామంతుల రాజ్యాలు స్వతంత్రమీయబడినవి. రామరాజ్యం అవతరించింది.

ఒక్క శుభముహూర్తాన వర్ణింపజాలని వైభవంతో ఆభూపాలునకును, ఆబాలికకును వివాహం జరిగింది. జంబూద్వీపమంతా దివ్యోత్సవం చేసికొన్నది.

సాయంసమయారుణకిరణాలు ఉద్యానవన భూములపై బంగారపు క్రమవారి చల్లినవి. ఒక శిలావేదికపై సార్వభౌముడును, భక్తపరాయణుడును, ప్రజాసేవియు నగు మహారాజు ఆబాలికతో అధివసించి పరమపవిత్ర ప్రణయలీలా తన్మయుడై వున్నాడు.

చ. "వినువుము మొండిపట్టుదల విశ్వహితుండగు రామభద్రుఁ డా
ప్పుడయిన నీకనిష్టమగు పోకడవోయెనె? రాజ్యమెల్ల నీ
కొడుకున కే యగుఁగా వనముఁ గోరకుబిడ్డ" కటంచుఁ గాళ్లపైఁ
బడి పలవించు వల్లభునిప్రార్థనఁ గేటునఁ బుచ్చి వైచితిన్.

ఉ. అంటినఁ గందుమేనుఁ గలయట్టి శిరీషసుమాభగాత్రికిం
బంట వలంతి కూఁతునకుఁ బైకొనుమైకముచే గుహూర్తుల
న్నింటిని గెంటి పాపమున నేరక కోరిక నారచీరలం
గంటికి విందుగా నిడిన కల్మష మేగతి నీఁగుదానవో!

క. "రా జగు నాకొమరుం" డను-యోజనయే కాని; "సుతవియోగము సైఁపం
గాఁ జాలక ప్రాణేశుఁడు-తాజీవింపఁ" డనుమాటఁ దలఁపఁగ నైతిన్.

క. "సుతుఁ క్షితిపతిఁ జేయం దన-పతి మృతి కొప్పికొనె, సుగుణబంధురు రాముః
వెతలం బెట్టెను, పాప చ-రిత కైక" యటన్న నింద రేఁగె జగమునన్.

క. దురభిప్రాయము సీతా-వరుపై నాకెపుడు లేదు; పాపాత్మిక మం
థర కొంపఁదీసె నిఁక నీ-దురితార్ణవమెటులు దాఁటుదును నకటకటా.

ఉ. నాచెవి నిల్లుగట్టికొని "నాపలుకుల్ వినుమేలుగల్గు" నం
చాఁచక బోధిచినన్ వదల కయ్యయి రీతుల నాకు నేమియుం
దోఁచని యట్లుచేసి తన త్రోవకుఁ ద్రిప్పి హఠాత్తుగాఁ బడం
ద్రోచె జనాపవాదమను దుస్తరవారిధిలోన, హా విధీ!

ఉ. పర్వమునాఁటి సాగరముభంగి నభంగురమైన మంథరా
దుర్వచనప్రవాహమునఁ దోఁగుటఁ దొంటివివేకమెల్ల గం
ధర్వపురంబుగాఁగ మతిదప్పెను, మోహముగప్పె; నవ్విధిన్
గుర్వఘదంబునైన క్రియకుం బ్రయతించితి నిందగాంచితిన్.

ఉ. "ఓదువు నీవు రాజ్యరమకుం బతికు భర్తవు జో"పటంచు నా
హ్లాదముతో రఘూత్తము నమక్షమునందుఁ ద్రికాలవేది వే
దాదినమస్తపారగుఁడునైన వసిష్ఠుఁడు పల్కినట్టి న
త్యాదృత సూక్తియున్ వితథమయ్యెను నాదగు పాపమెట్టిదో.

ఉ. దోసిలియొగ్గి మోమునను దుందుడుకింతయు లేక భాసురో
ల్లాసము తోఁగలింప నను డాసి నమస్కృతి చేసి సీత, "యు
త్తా! సెలవిమ్ము పోయెదము దండక"కం చనునప్పుడైన బే
రీసును మాని ప్రేమయుతదృష్టిని సమ్మతిఁ జూపనైతిఁగా.

చ. పురమున నెల్లవారలును బొంగుచు "రాజగు రాముఁ" డన్న సం
బరమున నన్నిశల్ నిదురమాని యినోదయ కాంక్షతోడ జా
గర మొనరించి నాదురితకార్యము తెల్లముగాఁగ; నన్ను నె
త్తుఱుఁగున దూరిపోకద, పదింబదిగా? కృత మూరకేఁగునే?

క. "రామునొకని వనికంపఁగ-భూమిపుఁ గోరితిని; మీరుపోనేటి" కటం
చీమాత్రమైన సీతా-సౌమిత్రులఁజూచి పలుకఁజాలకపోతిన్.

ఉ. బాపురె! యెన్ని చందములఁ బాతరలాడితి; నెన్ని రీతులన్
భూపునిఁ జిక్కువెట్టితి;-నపూర్వము మామకదుశ్చరిత్ర; మీ
క్ష్మాపయి నెందు నాకు నుపమానపదం బిడునట్టి కాంతయే
చేపడకుండఁగాక, ననుఁ జెందిన నిందయుఁ జెందకుండుతన్.

మ. వలదన్నం బతివెంట నేఁగ నటవీవాసమ్ముఁ గావింప మై
థిలి స్త్రీధర్మము నెంచి: ప్రాణవిభుఁ డంతే నన్నుఁ బ్రార్థించినం
జలమున్ వీడక యోడ కవ్విధముగా సాధించి బాధించి కా
నలఁ బుత్త్రున్ దివి జీవితేశు నిలువన్గాఁ జేసి నేనుంటి హా!

సీ. కడుజయప్రదముగాఁ గానున్న పట్టాభిషేక యత్నము వ్యతిరేకమయ్యె
సుతుపాలనముఁ గాంచు కుతుకంబుతో మించుక్షితిపతి నెమ్మనఁ జేష్టలుడిగె
మేదురకళ్యాణ వార్థైకసుఖిత యా జానకి హృదయంబు జల్లుమనియె
నేఁడుగాఁ దనయుండు రేఁడగునని యుబ్బు కోసలరాట్పుత్రి గుండెపగిలె
లక్ష్మణుం డూహలను నుపలముల హృదయ-వీథిఁగట్టిన సౌధంబు విఱిగి కూలె
మాటవెడలినమాత్ర నానోటినుండి-పాపనిష్కృతికిన్ సదుపాయమెద్ది?

సీ. ఇఱుకటపుంద్రోవ మొఱపఱా నేలపై గడ కొక్కటిగ నడుగిడెడు వేళఁ
బ్రియముగాకున్నను బేరాఁకటం జేసి నాల్కతో దుంపలనంజువేళ
బీతెండ తాఁకున నోరెండి కనుమూసి క్రాఁగిన చెడునీరు త్రాగువేళ
నడచిన బడలికన్ సుడివడి ముడితల్లు సెజ్జపై నెమ్మనుఁ జేర్పువేళ
సంఫ్రీవిజితపల్లవ శరీరాపహసిత-పుష్పమార్దవ, జనకరాట్పుత్రి సీత
యెంతగాఁ జింతనొందెనో యేమనియెనో-పాపినగు నన్ను నాజన్మ పాముగాను.

ఉ. అందముఁ జందముం గలిగి యన్నివిధంబుల దోసతోఁట పో
ల్కిం దనరారి నిత్యశుభలీలలఁ బెంపుగడించుచున్న యా
మ్మందిరమున్ శవాలయ సమానముఁ జేసియుఁ గాంచుచున్న నా
డెందము వ్రయ్యకుండునె పెకీలని, వజ్రమయంబె కానివో!

శా. "పట్టీ! నీకొఱ కెంతొ కష్టపడి సంపాదించితిన్ రాజ్యము
న్బట్టంబున్ వడిఁగట్టుకొ"మ్మనిన "ఛీపాపీ! పతిం జంపి స
మ్రాట్టయి మించఁగ నున్న రాము వనికిం బంపించితే" యంచు నన్
దిట్టెం బుత్త్రుఁడు; వానిపాటి మఱియున్ లేకుండె నాకయ్యెడన్.

ఉ. ఎంతగ నత్తిమోఁదికొని యేడ్చిన నేమి ఫలంబు? జానకీ
కాంతునిఁ జేరి తచ్చరణకంజములం బడి కోపశాంతి క
ల్పింతము వేఁడికో లుచితమైన యుపాయము మామకీన దు
ర్దాంత దురంత పాపశిఖి నార్పఁగలేవు తదన్యనిష్కృతుల్.

---



వ్యాసకర్త





సోమయాజుల వెంకటరామమూర్తి గారు, బి. ఏ.

౧

మాధవరావు రామవరంతాలూకా కచేరీలో హెడ్ గుమాస్తా వుద్యోగంలో వున్నాడు. అతడు పనిపాట్లు శ్రద్ధగా చేసుకుంటూ, ఒక్కనాడైనా కాగితముల విషయంలోగాని, సొమ్ము విషయములోగాని, తకరారు లేకుండా తనకి మాటరాకుండా జాగ్రత్తతో మెలగుతూ కాలక్షేపం చేస్తూవుండడంచేత తన అధికారులకి విశ్వసనీయుడుగాను, తనక్రిందగుమాస్తాలకి గౌరవపాత్రుడుగాను వుంటూవుండేవాడు. రామవరం వూళ్లోకూడా మాధవరావు పంతులంటే అందరికీ గౌరవమే.

నెలజీతం ఏభై రూపాయిలలోను ప్రావిడెంటు



"ఉత్తరంసగంమట్టుకిచదివేసరికి...మందహాసచంద్రిక ఉదయించింది"

ఫండు రు 3-2-0, స్టాంపుఖర్చు 0-1-0, పోగా మిగిలిన రు. 46–13–0 లోనూ కోమటి దుకాణానికి లెక్క పైసలుచేసి, ఇంటిఅద్దె రు. 4–0–0, యితర ఖర్చులు, మరి రు. 5–0–0, సీతానగరంలోనున్న తల్లికి రు. 10 లు పంపగా మిగిలినదాన్ని సేవింగ్సు బేంకులో నెల నెలకీ వేస్తూవచ్చి, ఆరూపాయలు ఏడాది కొక్కమారు తీస్తూ తనకీ, భార్యకీ, పిల్లకీ ఏడాదికి కావలసిన ఖద్దరుబట్టలు కొంటూ వుండడం అతనికి అలవాటు.

ఒకనాడు ప్రొద్దున మాధవరావు ఎనిమిదిగంటలకు ఆఫీసుకువచ్చి తనకుర్చీలో కూర్చొని అప్పుడే జవాను కరీం సాయిబు పోస్టాఫీసునుంచి తెచ్చినటపాలు విప్పిచూస్తున్నాడు. అందు ఒకవుత్తరం తన ప్రైవేటు ఎడ్రసుకు వచ్చినదాన్ని అటూఇటూ తిరగేసిచూచి చదవడం ఆరంభించాడు. ఉత్తరం సగంమట్టుకి చదివేసరికి అతని ముఖకమలం వికసించి, పెదవులమీాద మందహాసచంద్రిక ఉదయించింది.

ఆవుత్తరం సీతానగరంలో తనతల్లి అన్నపూర్ణమ్మ వద్దనుంచి వచ్చింది ; ఉత్తరం రెండుసార్లు చదువుకొని మడచి, తన కోటులోపల జేబులోవుంచి మాధవరావు ఆలోచన ఆరంభించాడు. పదినిమిషాలవరకూ అలాగే భావసముద్రంలో మునిగివున్న మాధరావు, సీతానగరం, తల్లి, ప్రయాణము, రైలుఖర్చు, మనియార్డరు ఈ ఆలోచనలు తప్ప ప్రస్తుతాంశములైన ఆఫీసు, టపాలు, కరీంసాయిబు, కాయితాలు ఈవిషయాలు యావత్తూ

మరచిపోయాడు; "తనను, భార్యను, పిల్లనీ చూడడానికి చాలా ఆతృతగావుం"దనీ, "కళ్లన్నీ కాయలుకాచిపోయా"యనీ, "కొద్దిరోజుల్లో ఏలాగైనా చూడక తప్ప"దనీ తల్లివ్రాసిన వాక్యాలు పదేపదే మనసులో తరచునరికి, అతనిహృదయంలో ఆనందామృతం పొడముచుండెను. అయితే తల్లి రైలుఖర్చులకీ, సీతానగరంలో చిల్లర అప్పులు తీర్చడానికీ, ముప్పదిరూపాయిలు పంపవలెనన్న భావం మనస్సులో పుడయించేసరికి, యిదివరకతనిమానస సముద్రంలో వుద్భవించిన ఆనందామృతం ఆవిరిరూపంగా ఎగసి, అస్థానే హృదయంలో దడదడ ప్రారంభం అయింది.

ఇంతలో గడియారం టంగు టంగున తొమ్మిదిగంటలు కొట్టుసరికి మాధవరావుకి మొదట మేముచెప్పిన భావాలన్నీ మాయమై, ప్రస్తుతాంశములైన ఆఫీసు కాగితాలు, కచేరీ, ఎదుటగోడకి ఆనుకు కూర్చొని, మధ్య మధ్య కునికిపాట్లు పడుతూ కవర్లు అంటించుతూవున్న కరీంసాయబు జ్ఞాపకం రావడంతోనే, తొందరగా ఆఫీసు కాయితాలన్నీ చూసి జవాబువ్రాయవలసినవాటికి బ్లూ పెన్సిలుతో రెండుముక్కలు గోకి ఎక్కువ వ్రాతపనివున్న కాగితాలు వేరే కట్టకట్టి కుర్చీలోంచి దిగ్గున లేచాడు.

సాధారణంగా ఆఫీసు పదకొండుగంటలకి ప్రారంభం అగుటచేత తక్కినగుమాస్తాలెవరూ పొద్దున్న రాలేదు. కాని ఆఫీసు దగ్గరగావుండడంచేత పొద్దున్నేవచ్చి టపాలు చూసి, కొంతపని ఆఫీసులో చూసుకోవడం మన మాధవరావు పంతులుకి అలవాటు. అతడు కుర్చీలోనుంచి లేచి తన డ్రాయరులోవున్న ముప్పదిరూపాయిలు లెక్కపెట్టి, బల్లమీద నొకమూలనున్న మనియార్డరుఫారం వొకటి తల్లిపేర వ్రాసి, ఇవతలికి వచ్చి కరీంసాయబు ఆఫీసుకు తాళంవేసి చెవి తనచేతి కిచ్చిన తరువాత తిన్నగా పోస్టాఫీసుకి బయలుదేరాడు. అక్కడ తల్లి పేర మనియార్డరుచేసి గృహోన్ముఖుడైనాడు.

౨

దాదాపు పదిగంట లైంది. మాధవరావు పంతులుభార్య కమలమ్మ వంటచేసుకుని భర్తరాకను ఎదురుచూస్తూ చావడిలో రాటంపెట్టుకు కూర్చొని దారం తీస్తూంది. కమలామాధవుల నోములపంట, వారి ప్రేమలతలోని ప్రథమపుష్పం, వారి అన్యోన్య ఆత్మలనేడు శీతల మేఘములకూడికచే జనించిన అమృతధారావృష్టి వారి పెన్నిధానము, వారి మురిపెంపుబిడ్డ, వారి చిట్టితల్లియగు ఇందిర తల్లిప్రక్కను కూర్చుండి తన ఖద్దరుచొక్కా జేబులో తల్లి వేసిన కందిపప్పు పైకితీసి బొమ్మరింట్లో వంట చెయ్యడానికి సిద్ధమవుతున్నది. కందిపప్పు లక్కపిడతలో వేసి కొంచెం నీళ్లుపోసి దానిని ఒకమూలను పెట్టి ఉఫ్ ఉఫ్ అని వూది నిరాశాసూచకములగు దృష్టులతో తల్లివైపు చూచి "అమ్మా, అమ్మ గుడగుడ మన దేమీ?" అని ముద్దుమాటలతో అడిగేసరికి, తల్లి కమలమ్మకు పట్టరానినవ్వు వచ్చి లేచి కుమార్తెను ముద్దుపెట్టుకుంది. సరిగా యిలాంటి సమయంలో మాధవరావు పంతులు యింట్లో ప్రవేశించాడు. అతడు గుమ్మంలో వుండడంచూచి, తల్లి ఆలింగనములోంచి బలవంతంగా తప్పించుకొని యిందిర, "నాన్న! నాన్న! నాన్న ఒచ్చేరు" అంటూ గుమ్మంలోకి పరుగెత్తింది. మాధవరావుపంతులు కూతుర్ని ఎత్తుకుని



ముద్దుపెట్టుకుని, "ఇందూ! అమ్మ తిన్నావమ్మా?" అని ప్రశ్నించేసరికి యిందిర "అమ్మా? అమ్మింకా వుడక లేదు" అని చెప్తూ క్రిందకు తండ్రి చేయిపట్టుకొని తను చేయి

పట్టుకోక పోతే తనతండ్రి మాధవరావు నడవలేకపోతా డేమో అన్నట్టిచూపులు ముఖంమీద తోపగా యిందిర తనతండ్రిని సావడిలో కుర్చీదగ్గిరకి నడిపించుకు తీసుకొని వచ్చింది. మాధవరావు పంతులు భార్యవైపు చూచి, "యింకా వంట కాలేదా?" అని అడిగెను. అప్పు డామె "కాకేమి? వంటయి అరగంట అయినది. ఇందు చెప్పిన మాట దాని బొమ్మరింట్ల 'సంగతి" అన్నది. మాధవరావు పంతులు మడతకుర్చీలో కూర్చొని, "యివాళ వేగం చేసినట్టుంది వంట" అనెను.

కమలమ్మ—"వేగమేదీ? పదకొండుగంటలు కావచ్చింది; మీకింకా ఆకలి వెయ్యడంలేదూ?"

మాధ—"నిన్ను చూడగానే నాఆకలి మాయమైంది" అని చిరునగవు వ్యక్తపరచాడు.

కమల—"నన్ను చూడగానే మీాకు మిమ్మల్ని చూడ గానే నాకు ఆకలి మాయమైపోతూంటే, ఇక మనకి బియ్యంఖర్చే లేదన్నమాట, ఇంక నేనూ రేపట్నుంచీ పొయ్యిలో నిప్పు వెయ్యను."

ఇంతలో మెల్లన కుర్చీలోనుంచి లేచి మాధవ రావు తనకోటును విప్పి కొయ్యకు తగిలించు చుండెను. అపుడు అతనిభార్య యగు కమలమ్మ "అదేమిటిచొక్కా జేబులో వుత్తరం? ఇవాళ వచ్చినదేనా యేమిటి? ఎక్క ణ్ణుంచి? అంతా క్షేమ మేనా?" అని వరుసగా ప్రశ్నించెను.

మాధ—"జే ను మరిచాను. అయిదారు రోజుల్లో మా అమ్మ వస్తూంది; ఆమె వ్రాసింది."

కమల—"ఏదీ, చదవండి."

మాధ—"నువ్వే చదువుకో!" అని అత డావుత్తరాన్ని భార్యచేతి కందిచ్చి యింటిలో స్నానం చెయ్యడానికి ప్రవేశించాడు.

3

మాధవరావుపంతులు భోజనంచేసి సావడిలో కుర్చీలో కూర్చొని తాంబూలం సేవిస్తున్నాడు. ఇందిర వుయ్యాల్లో పడుక్కొని నిద్రపోతూంది కమలమ్మ క్రింద కూర్చొని వుయ్యాలా ఆగిపోయినప్పు డల్లా వూపుతోంది. అపుడు వారిరువురికిని (అనగా కమలామాధవులకు) ఈ క్రింది సంభాషణము జరిగినది:—

మాధ—"ఉత్తరం ఏది? చదివావా?"

కమల—"లెక్క పంపించారా?"

మాధ—(కొంచము నసిగి) "లేదు—." లెక్క పంప లేదని చెప్పిన అబద్ధమే మాధవరావు నసుగుడలకు కారణం అని పాఠకు లిదివరకే గ్రహించి వుంటారు.

కమల—"అయ్యో! ఎందుకు పంపారుకారు? పాపం, ఆవిడ మరీ మరీ చూడాల్నుందని వ్రాస్తున్నారు కదా?"

మాధ—"ఆవిడ మనవిచూచి అప్పుడే రెండు సంవత్స రాలు కావచ్చింది."

ఇంతలో ఇందిరకు పూర్తిగా నిద్ర వచ్చింది.

మాధ—"లెక్క పంపించాలి మరి!—"

కమల—"సరే, తెలిసింది. మొన్ననే సేవింగ్సుబేంకులో రూపాయిలు తీసి, బట్టలు కొనేశారుగా? మళ్లీ జీతం అందుతేనేగాని లెక్కకు వీలులేదు—"

మాధ—"ఎవ్వరినైనా చేబదు లడుగుతాను. మళ్లీజీతం రాగానే యిచ్చేస్తాను."

కమల—"బదులా? బకర్ని బదులడగవలసినంత అవ సర మేమొచ్చింది? మొన్న పండక్కి మావాళ్లు నాకు నాసరంతకోసమిచ్చిన మూడుకాసులూ పెట్లోనే వున్నాయి; అవి అమ్మేసేయండి. తరువాత జీతం అందిన—" తరువాతిమాట కమలమ్మ పైకి రానియ లేదు. లోపలిమాట లోపలికే మళ్లిపోయింది. అయితే మాధవరావు "తరువాత జీతంఅందిన వెంటనే నీ కాసులు నీకు తిరిగి యిచ్చేయాలని—అంతేనా నీవు చెప్పదలచు కొన్న మాట?" అని ఆ వాక్యాన్ని పూర్తిచేశాడు.

కమలసంభాషణమును మరల్చునుద్దేశముతో, లజ్జితవదనయై "ఇచ్చినా సరే, ఇవ్వక పోయినా సరే." ఈమాటలు విని సంతసే మాధవరావు తనభావాల్ని



"తరువాత జీతంఅందినవెంటనే......నీవు చెప్పదలచుకొన్నమాట!"

ఆపుకో లేకపోయెను; ఆతని ముఖం అప్రయత్నంగా కమలముఖం వద్దకు ఆకర్షింపబడింది. వాళ్ల యిద్దరి పెదవులూ కలిశాయి. భార్యాభర్తలిద్దరూ అలా ఒకఅరనిముషం వరకూ ఆనందసాగరంలో తేలి వున్నారు; ఇంతలో వుయ్యాల్లో పండుకొని నిద్రిస్తూ వున్న యిందిర కదిలింది. భర్త మెడను చుట్టుకొని వున్న కమలహస్తములు అప్రయత్నంగానే వుయ్యాల్లా ఊచడానికి వెళ్లాయి.

మాధ—"కమలా, నేనిందాకా నీతో అమ్మకి సొమ్ము పంపలేదని చెప్పినమాట అబద్ధం సుమీ! నీపెదవుల్లో ఎలాంటి మహిమ వుందో కాని, అబద్ధంఆడిన నా పెదవులుకూడా పవిత్రమైన నిజం పలుకుతున్నాయి. విను: ఇప్పుడే ఆఫీసురూపాయిలు ముప్పై అమ్మపేరట మనియార్డరు చేసి వస్తున్నాను. ఆరూపాయి లెలాగైనా యివాళ సాయంత్రంలోపల ట్రెజరీలో కట్టాలి; లేకపోతే మాటవస్తుంది. ఎవ్వరికైనా బదులడగడానికి నాకు మనసొప్పిందికాదు. నాదృష్టికూడా మీవాళ్లు నీకిచ్చిన మూడుకాసులమీదే పడింది. అయితే, ఈ భావాలన్నీ నానోట వెలువడకముందే నువ్వు నీ కాసులు నాకిస్తానని నాకు మనస్సంకోచాన్ని తగ్గించినదానివయినావు!—"

కమల—"మీరు నన్ననవసరంగా పొగుడుతున్నారు."

మాధ—"భార్యాభర్తల ప్రేమ ఆత్మికము సుమా! అట్లు కాకున్న నీ భావములును నా భావములును అచ్చుగుద్దినట్లు ఏకమగునా? నాభావములు నీమానస దర్పణంలో ప్రతిబింబితమైనాయి. మన ఆత్మలు పరస్పరము సంభాషించుకొంటాయి."

ఇందిర—నిద్రలో "ఊఁ!"

మాధ—తుళ్లిపడి, నవ్వి "చిట్టితల్లి నిద్రలో కలవరిస్తోంది!"

౪

నాడు ద్వాదశి లక్ష్మివారము. కమలప్రొద్దున్న చీకటితోనే లేచి గృహకృత్యములు చక్కబెట్టుకొనుచుండెను. అత్తగారు అన్నపూర్ణమ్మ ప్రొద్దున్న ఏడు గంటల రైలులో వస్తుందని కమలమ్మ నాలుగుగంటలకే మేలుకొని, నీళ్లపొయ్యిలో నిప్పేసి, అత్తగారు వచ్చినతోడనే ఆమె స్నానానికి అనుకూలంగా వున్నట్లు వేడినీళ్లు కాచింది. పిమ్మట ఆరుగంటలగుటచూచి భర్త మాధవరావుని మేల్కొలిపింది. మాధవరావు పంతులు కాలోచిత కృత్యాలు నిర్వర్తించుకుని రైలుస్టేషనువద్ద తల్లిని కలుసుకొని యింటికి తీసుకురావడానికి బయల్దేరాడు. ఇంతలో, యిందిర మేలుకుంది. కమలమ్మ బిడ్డకు ముఖం కడిగి, తలదువ్వి, బొట్టుకాటుక తీర్చి, తెల్లనిఖద్దరుచొక్కాను తొడిగి పీఠ అరుగుమీద కూర్చోబెట్టి తానును అరుగుమీద కూర్చుంది. ఇంట్లో గడియారం ఏడుగంటలు కొట్టింది. ఆశబ్దం కర్ణపుటములలో పడినతోడనే కమలమ్మ మనోవీథిని భావపరంపరలు పరుగెత్తాయి. రైలు స్టేషనులోకి వచ్చి నిలపడడం, మూడవక్లాసు బండిలోంచి అత్తగారు అన్నపూర్ణమ్మ మెల్లగా దిగడం, తన భర్త తల్లి యెదుట మందహాసాలంకృతమైన ముఖంతో నిలబడడం,

వారిద్దరూ సామానుతోకూడా బండియెక్కడం, బండి మెల్లిగా బయల్దేరడం—అటుపిమ్మట కమల భావతరంగాలు నిలచిపోయాయి. ఆమె యిందిర నెత్తుకొని వీథిగుమ్మంచివరను నిలబడి వీథి కొకవైపునకే ముఖం తిప్పి చూస్తూ నిలబడింది.

పావుగంటలో వీథిచివరను బండి నడచిన చప్పుడయ్యేను. బండి వారి యింటివైపునకే వచ్చుచుండెను. దృష్టినిగుడించి చూస్తూవుండిన కమలమ్మ, బండిలో తన భర్త, అత్తగారగు అన్నపూర్ణమ్మ వుండడం చూచి, "ఇందిరా, మామ్మగారు వచ్చారు, చూడు!" అని బండివైపు చూపించేసరికి, బండిలో మాధవరావుని చూచి యిందిర "నాన్నగారే! నీకు మాతలురావు, ఏమీరావు!" అన్నది. అన్నపూర్ణమ్మ యిందిర కపరిచిత యగుటచేత కమలమాట లాబాలకు అర్థంకాలేదు.

బండి గుమ్మంలో నిలబడింది. బండిలోంచి అన్నపూర్ణమ్మ, మాధవరావు దిగారు. గుమ్మంలో పాదంపెట్ట



"మాధవరావు బండివాని డబ్బులు లెక్కబెట్టి అద్దె నిచ్చుచుండెను."

డమే తడవుగ అన్నపూర్ణమ్మ కమల చేతనున్న యిందిరను ఎత్తుకుని ముద్దాడి, "అమ్మా! కమలా, పిల్ల మెతుకు తింటుందా? మాటలు వస్తాయా?" అను ప్రశ్నలకి కమల జవాబు చెప్పిందో లేదో కూడ తెలిసికొనకుండానే అన్నపూర్ణమ్మ యిందిరను ముద్దాడి, మరొకమాటు ముద్దాడి, ఇంకొకసారి ముద్దాడి, కొంగున పదిలంగా ముడివేసివుంచిన మిఠాయి వుండను ఇందిరచేతిలో పెట్టింది. మాధవరావు బండివాని డబ్బులు లెక్కబెట్టి అద్దె నిచ్చుచుండెను. అన్నపూర్ణమ్మ, కమల, యిందిర—వీరు ముగ్గురును యింటిలోనికి ప్రవేశించారు. చావడిలోకి వచ్చి, అన్నపూర్ణమ్మ కోడలినె గాదిగాచూచి, "కమలం! నీళ్లు పోసుకుని ఎన్నాళ్లైంది?" అని రహస్యంగా అడుగుసరికి, కమల ఆశ్చర్యమును, సిగ్గును ముఖమున దోపగా, మందహాసము పెదవులమీాద తాండవింపగా, మెల్లన "మూడునెలలు కావచ్చింది" అన్నమాట యింకను పూర్తిగా నోటరాక పూర్వమే అన్నపూర్ణమ్మ, "తల్లికి ఈసారి కొడుకే, నామాట తప్పదు" అనెను. మాధవరావు యింటిలోనికి వచ్చెను. అతడు తల్లి అనిన మాటలు వినియుండినను విననట్లు నటించి, కోటును విప్పి కొయ్యకు తగిలించెను.

కమలమ్మ—"అత్తా, దూరప్రయాణం, చాలాబడలివుంటారు. వేడినీళ్లు పెట్టాను. స్నానం చెయ్యండి."

అన్నపూర్ణమ్మ— నవ్వుతూ "అప్పుడే వేడినీళ్లు పెట్టావూ? తల్లీ, నీకడుపు చల్లగా! నీకడుపున కొడుకు



"అన్నపూర్ణమ్మ కమలచేతనున్న యిందిరను ఎత్తుకుని..........

పుట్టి! నిన్న ఏకాదశి ఉపవాసం. రైలులో అయిపోయింది; ఇవ్వాళ ద్వాదశి. ఏముంది? స్నానంచేసి

అరగంటలో వంటచేస్తాను. అబ్బాయీ! మధూ! నీకచేరీ ఎన్ని గంటలకి?"

మాధ—"నాకచేరికి యేమీ తొందరలేదు. భోజనం చేశాక నిమ్మళంగా పదకొండు గంటలకి వెళ్తాను. కచేరీ దగ్గరగానే వుంది."

తనసామానంతయు సరిగా బండివాడు దింపాడో లేదో ఒక్కమారు చూచుకొని అన్నపూర్ణమ్మ చంకనున్న యిందిరను కమలచేతి కిచ్చి, స్నానంచేయుట కింటిలోనికి పోయెను.

ఇందిర—"అమ్మా! ఎవరే?"

కమల—"మామ్మ."

ఇందిర—"అంటే?"

కమల—"అంటేనా? నాన్నగారికి అమ్మ."

ఇందిర—"నాన్నగారి అమ్మ అయితే, నాన్నగారికి అమ్మ పెడుతుందా?"

కమల—నవ్వుచు "నాన్నగారికి పప్పు అన్నం కలిపి, నెయ్యివేసి మీమామ్మ తినిపిస్తుం దనుకున్నావా?" అని బిగ్గరగా నవ్వింది.

తల్లి ఏల నవ్వవలయునో యిందిర కర్థము కాలేదు. తల్లి వంటచేయులోపల ప్రక్కగదిలో రాటం పెట్టుకొని దారంతీయు నుద్దేశంతో కూర్చుండియుండిన తండ్రి మాధవరావువద్దకు పోయి యిందిర కూరుచుండెను. కమల యింటిలోనికి పోయి అత్తగారికి వంటకు కావలసిన పదార్థము లన్నియు సిద్ధముచేయుచుండెను.

*

మాధవరావు భోజనం ముగించి యీవలకు వచ్చి కూర్చుండెను. కమల నట్టింట పనిపాట్లు చక్కబెట్టుచుండెను.

అన్నపూర్ణమ్మ కుమారుని ప్రక్కనేలపై కూర్చుండియుండెను, ఇందిర తండ్రినోట తమలపాకు లొక టొక టిగా పెట్టుచు, వానిని నమలినకొలది అతనినోరెర్ర బడుటచూచి ఆశ్చర్యపడుచుండెను. ఇంతలో అన్నపూర్ణమ్మ మెల్లన యిందిరను తనవద్దకుదీసికొని యొడిలో కూర్చుండబెట్టుకొని, "నాయనా! మధూ! పిల్లతలమీద నాగరంవేస్తే బాగుండదూ?" అనుసరికి మాధవరావు, "బాగుండ కేమి? మరి నాలుగైదు నెలలకి ఎలాగైనా చేయిస్తాను. 'నాగరం చేయిస్తే పిల్లకీ తనకీ కూడా ఉపయోగపడుతుం'దని వాళ్లతల్లి కూడా అంది." ఈ సందర్భములో మాధవరావునకు భార్య తన కిచ్చిన మూడుకాసులమాటయు జ్ఞప్తికి వచ్చినను అతడు ఆ ప్రసంగము కొంచెమైనను తల్లియెదుట నెత్తలేదు.

అన్నపూర్ణమ్మ—"ఇందిరకి నే నొక నాగరం చేయించి పట్టుకొచ్చాను. మంచి నగిషీ, గోపాలకృష్ణుని విగ్రహం, రెండుతులాలెత్తు. సిస్తురూపాయిలు ఏభై పెట్టి చేయించాను" అనుమాటలను నవ్వు మొగముతో ననుచు, అన్నపూర్ణమ్మ తనపెట్టెవద్దకు జని కొంగున ముడివైచిన తాళపుచెవితో పెట్టెను దెరచి అందులో తనబట్టలమధ్యను, డబ్బిలో మూడు కాగితములలో నాలుగుగుడ్డలలో భద్రముగా దాచిన ఆ నాగరమును దీసి కుమారునికి జూపెను. ఇంతలో కమలమ్మ పనిపాట్లు ముగించుకొని, నాగరమును గూర్చి మాతాపుత్రులసంభాషణలోపలనుండి యీవరకే వినుచుండిన దగుటచే హాసితవదనయై, దృష్టుల నాతురత ఛూపట్టగ భర్తచేతనుండిన నాగరమును తానును జూచుచుండెను.

అన్న—"ఏమి, కమలా! నాగరం బాగుంది? నీకూ, పిల్లకీ వుపయోగం పడుతుందని చేయించి తెచ్చాను. రెండుతులాలెత్తు."

కమల—నాగరం ఎంతో బాగుంది. ఇలాంటి నాగరమే చేయిద్దామని మీ కొడుకు యత్నపడుతున్నారు. ఆయనయత్నం అక్కరలేకుండానే నేడు నాగరం సంభవించింది. ఇవాళ చాలా సంతోషమైన దిన

మత్తా!" అనుచు నాగరమును కుమార్తె తలపైనుంచి అత్తగారికి చూపి, "అత్తా! సరిగా కొలపెట్టినట్టు సరి



పోయింది" అనెను. పిమ్మట భర్తవైపు తిరిగి "నాగరం చాలా బాగుందండీ" అని పలికెను.

మాధవరావున కిదంతయు నొకకలవలె గానుపించినది. తనపై యింత అభిమానము, ప్రేముడి, వాత్సల్యము గలతల్లికి, తనబిడ్డయగు నిందిర కొరకు ప్రత్యేకముగ, అదేపనిగ మూడునూరులమైళ్ల దవ్వునుండి అభిమానపూర్వకముగ తన ఖర్చులనిమిత్త మేర్పడిన సిస్తు రూపాయిలు పెట్టి నాగరము చేయించి తెచ్చినతల్లికి, ఖర్చులకుగాను ముప్పదిరూపాయిలు పంపినందుల కాతడెంతయో గర్వపడసాగెను. తన భార్యకు నాగరము చేయించమని భార్య పుట్టినింటివా రొసంగిన మూడుకాసులకును తల్లి రైలుఖర్చులకు పోను అనుకొనిన నాగరము అప్రయత్నముగా యింటికి వచ్చుటయే కాక, పవిత్ర మగు మాతృదర్శనమును, అమూల్యము, మధురము నగు వాత్సల్యసుధాస్వాదనమును అతనికి కోరని కోరికగా సంభవించుటచేత మాధవరావు ఆనందసాగరమున నోలలాడు చుండెనని వేరుగా చెప్పవలయునా? తల్లి ఖర్చుల నిమిత్తము పంపిన ముప్పదిరూపాయిలకు నాత డెవ్వరికి ఋణస్థుడయ్యెను? మొట్టమొదట సర్కారునకు, పిమ్మట మధ్యాహ్నము తనకమల మూడుకాసులమ్మి సర్కారు ట్రజరీలో కట్టియుండుటచే భార్యకు ఋణస్థుడయ్యెను. తన భార్యకు, అర్ధాంగికి, తన్నే దైవమని నమ్మి తోడునీడవలె చరించుచుండిన తన "కమల"కు బాకీపడినచో నెట్టి నష్టమును లేదు. ఇంతకును అనుకొనిన నాగర మయాచితముగ, అప్రయత్నముగ, వాత్సల్యమయి యగు తల్లి (అన్నపూర్ణమ్మ) కోడలికి ప్రసాదించియే యున్నది కదా?

మాధవరావు పరిపరివిధములనాలోచించెను. ఎంత యాలోచించినను అతనికి తనివితీర లేదు. సౌఖ్యదాయకము లగు భావములుగొల్పు సంతోషమునకు మించిన సంతోష విశ్వ ప్రపంచమున నేమున్నది?

ఈలోపున కమల కుమార్తె యిందిరకు తలకునూనె రాచి దువ్వుచు జడ వేయుచుండెను. ప్రేమపూర్వకముగ నత్తగారు తెచ్చిన నాగరమును ఆమెసాధ్యమైనంత త్వరలో ఉపయోగింపనెంచి యుండెను. నీలాకాశమున చంద్రోదయ మగురీతిని యిందిర కుంతలములపై నాగరముఅందమును గొలుపునో లేదో యను తన యాతురము ఆమె మనంబున పెల్లుబ్బియుండుటయే ఆమె యిందిరకు అప్పుడే జడ వేయుటకు కారణము. ఎన్ని దినముల నుండియో నాగరము చేయించుకొనవలయునను తన యభీష్టమును భగవత్ప్రేరణముచే ప్రేమపూర్వకముగ దీర్చిన అత్తగారికి మనంబున వేయిసారులు నమస్కరించుచుండెను.

జడవేయుట పూర్తియైనది. నాగర మిందిర తలపై అందముగ మెరయుచుండుటజూచి కమలసంతోషమునకు మేరలేకుండెను. ఆమె ఇందిర నుద్దేశించి, "చిట్టితల్లీ, నాగరం మామ్మకి చూపించి, జేజేపెట్టు" అని నంతనే ఇందిర తన కోమలహస్తముల జోడించి ప్రతిదినమును తనతల్లి దేవునకు పూజ గావించునపుడు తానును ప్రక్కను నిలువబడి తల్లివలెనే నమస్కరించుట కలవాటుపడిన

దగుటచే తన తండ్రితల్లి యగు అన్నపూర్ణమ్మకు చక్కగా నమస్కరించెను. అది చూచి అన్నపూర్ణమ్మ ఆపుకొనెదమన్నను ఆగక పొరలివచ్చుచుండిన ఆనంద బాష్పములలో రెండింటినిమాత్ర మిందిరతలపై రాల్చి, తక్కినవాటి నటికష్టముపై మరల్చుకొని మనుమరాలగు యిందిరను రెండుచేతుల నెత్తికొని, "తల్లికి వేయేళ్లాయుస్సు! కన్నతల్లికి తమ్ముడుపుట్టి!" అని దీవించి మనుమరాలి ననేకసార్లు ముద్దాడెను.

౬

మాధవరావు రాత్రి పదకొండుగంటలపుడు పడక గదిలో మంచముపై కూర్చుండియుండెను. వేరొక మంచముపై యిందిర నిదురించుచుండెను. కమలమ్మ యిందిరను జోకొట్టుచుండెను.

మాధ—నీఋణము మాఅమ్మ తీర్చినది. నేను నీకు బాకీపడిన మూడుకాసులకును మారుగ నీకు నాగరము వచ్చినది.

కమల—(తలవంచుకొని) ఆత్మ లభేద మగుచోట ఋణమెక్కడిది? మీకును నాకును భేదములేదే!

మాధ—(చిరునగవుతో) నిజమే కాని, నీ ఋణము పూర్తిగా తీరలేదుసుమా! ఏలయన మూడు కాసులలో నీకు నాగరము వచ్చుటయేకాక నాకు అమూల్యమును, శీతలవర్షపాతమువలె హృదయసీమనుచల్లజేయజాలినదియును,ఆనందదాయకమునునగు మాతృసందర్శనము లభించినది. దీని వెల భావాతీతము; గణింపరానిది. అందుచే నీఋణ మీజన్మమున తీర్చజాలనేమో!

కమల—ఈ ఋణము జన్మ జన్మములకును తీరకుండును గాక! జన్మజన్మములకు మన మొకరినొక రనుసరించి జీవనమును గడుపుదుము.

మాధ—సాధ్వియన నీయట్టిది!

కమల—పొగడ్తలకు నేనెంతమాత్రము తగను!

ఉద్యోగరీత్యా దూరదేశమున నున్న కుమారుని గాంచు నుద్దేశముతో మనం బెంతయో ఉవ్విళ్లూరుచుండి మనుమరాలికి కానుకగా బంగరునగ నొకదానినిజేయించి రైలుఖర్చులకు సుతునివద్దనుండి ద్రవ్యమును దెప్పించుకొని కన్నులకరవుదీర కుమారుని కుటుంబము నెప్పుడు గాంచెదనా యని యాతురమున, తాను పయనముగావించిన రైలుబండికంటె వేయిమడుంగులు శీఘ్రగతిని తన కంటె నెంతయో ముందుగవచ్చిన మనోదృక్కుల మాధవరావుని బలగమును జూచుచు, తన భౌతిక దేహము ప్రయాణమొనర్చుచుండిన రైలుబండి మందగతికి తిట్టుకొనుచు వచ్చి ఎట్టకేలకు రామవరములో పడిన అన్నపూర్ణమ్మ యభిమానమును, భర్త కానందదాయకమును గౌరవనీయము నగురీతిని తనకు పుట్టినింటివా రొసంగిన మూడుకాసులను నిరాటంకముగ నిర్మలమానసముతో, ప్రతిఫల మపేక్షింపక భర్తకొసంగిన కమల ప్రేమమును ఈ రెంటిలో నేయది గాఢతరమో పాఠక సోదరసోదరీమణులే యూహింతురుగాక! ఈ రెంటికిని గల భేదమే వాత్సల్యమునకు ప్రేమమునకును గలభేదము. ఒకటి కారుణ్యమయుడగు నీశ్వరుడు భక్తులయెడ జూపునది; యింకొకటి సమానులగు నిరువురి పరస్పరానురాగము. ఒకదానికి అర్హానర్హ విచక్షణము కావలయును; ఇంకొకటి అకారణము, అప్రయత్నము, అయాచితము.— ఒకటి కాలానుకూలముగ నేతెంచెడి శీతలవర్షధార; మరియొకటి సంతతమును శీతలత నొసంగెడి మందమలయానిలము.




శతావధాని వేలూరి శివరామశాస్త్రి గారు

౧

కామన్నకు లక్షణము రాదు; వ్యాకరణ మసలే రాదు. ఏది పుస్తకము లయితే చదువుకొన్నాఁడు కాని అతనికి వానిలో ప్రతి పదమును అర్థమయినదన్న మాటయు లేదు. కాని అతఁడు చాటుపద్యము చెప్పినాఁడన్నచో గాలి దాని నన్ని దిక్కులకు తీసికొనివెళ్లినటులు ప్రచారమయి పోవును.

కొంగను కొట్టిన బోయవానిపై వాల్మీకి యొక్క ఆదికవిత్వము బయలుదేఱినది: కోపముచేసి గురువుగారి మీఁద కామన్న యొక్క ఆదికవిత్వము బయలుదేఱినది. దానితో కామన్న కామకవి అయినాఁడు.

గురువుగారి కోపమునకు ఒక హేతువున్నది. అసలు గురుశిష్యుల మార్గములే భిన్నములు. గురువుగారికి గులకరాలవలె నోరి కడ్డుపడు పదములు, టెంకాయ పాకము కల పద్యము లనినచో ప్రాణము. వారా పద్యములు వివరించి వివరించి చెప్పుచుండెడివారు; వానినే వల్లింపుమను చుండెడువారు.

ప్రయత్నముచేసి తెలిసికొనవలసిన పద్యము లనినచో శిష్యునికి శిరోవేదన; గులకరాలవంటి పదము లనినచో నతనికి దవడతీపు; టెంకాయపాక మనినచో వాని కోకర.

ఇటు లొకరేటికి, మఱియొకరు కోటికి తీయుటచేత కామన్న చదువు మూలఁబడినది. అతఁడు కామకవి అయి పోవుటచే గురువుగారి కడకు రాకపోకలు చేయవలసిన పని తీఱిపోయినది. కాని అతఁడు మంచి దనుకొన్న పుస్తకములు తెప్పించి చదువుకొన మొదలుపెట్టినాఁడు. గురుబోధ లేకయే తెలియుచుండుటవలనఁ గలిగినగర్వముయొక్క మహావేగముచే చాల పుస్తకములు పఠించినాఁడు. ఒకొక్క పుస్తకమును రెండు మూఁడు నాలుగు మాఱులను పఠించి చెఱకును సగము మాత్రమే నమలఁగలిగితి నని అనుకొనఁ జొచ్చెను.

ఏదేనివస్తు వనుభవపతితమై మనస్సు విశాలమైనపుడతఁడ దేపనిగా కవిత్వమల్లును. 'ఈవేళ ఏమిపద్యములు చెప్పితివి? వినిపింపు' మని అందఱును అతనికడ పడిగాపులు కాయుచుండువారు. కామకవి మనోహరముగా వానిని గానముచేసి వారివారిని తనుపుచుండువాఁడు. అతని పద్యములను ఆపద్ధతితో పత్రికలు ప్రకటించుకొను చుండెడివి. 'ఈపత్రికలో కామకవి పద్యములున్నవా'యని చదువరు లడుగుచుండెడువారు. పండితలోకము మాత్రము 'అబ్బే! అతి తేలిక పాకము! ఆఁడుదానికి కూడ అర్థమగును. ఒక అనుప్రాసమా? ఒక శ్లేషయా? ఒక బంధమా? ఒక ఏకాక్షర కందమా?' అని అనుకొనుచుండెడువారు.

౨

బాపట్లలో కామకవి చుట్టాలయింట వివాహము. కామకవి రయిలులో బాపట్లకు బయలుదేఱెను. అవి కాలేజీలు, హైస్కూళ్లు తెఱచురోజులు కాబట్టి విద్యార్థులు గుంపులు గుంపులుగా ఆరైలులోనే చెన్నపట్నము వెళ్లుచున్నారు.

క్రొత్తవానికి రైలులో పోవుటయే ప్రొద్దుపోక. అతఁ డెల్లపుడును గుమ్మముకడనే కూరుచుండి నేల రివ్వునఁ బరువెత్తుట చూచును; వంతెన లెన్నియున్నవో, ఏస్టేషను ఏవైపుననున్నదో గుఱుతుపెట్టుకొనును; దగ్గఱ డైరీయున్నచో అందు వ్రాసికొనుచుండును; ప్రతిస్టేషనులోను తాను దిగిపోవువానివలె తలుపుకడకు పరుగెత్తును. తెరువరులకు వాఁ డొకపిచ్చివాఁడేకాని పాపము మాయికుఁడు.

ప్రాఁతవానికి రైలొక యాతన. 'అబ్బా! ప్రతిస్టేషనులోను పన్నుండు నేమి?' అని నిందించును. చీట్లపేకయో, ఫలాహారమో, సంగీతమో, వివాదమో లేనిచో ప్రొద్దుపోదు. దానిమాట యేమి? రైలే కదలదు. వాఁడితరులమీఁద కాళ్లుపెట్టి నిదురించును. అయ్యది తన స్వగృహముయినటులు తెరువరులను లోనికిరాకుండ గెంటును. వాఁడు దిగిపోవునపుడు ఆస్థలమును శ్మశానమువలె విసర్జించి లేచిపోవును.

ఆరైలులో పయనించు వెంకటరావునకు కాలేజీ విద్యార్థులందఱకంటె పాటలోను, భాషలోను ఆసక్తియున్నది. అతఁడు కామకవిని పోల్చి ఆబండిలోనే తానును పయనించుట సఫలమని కామకవితో అనెను.

గాయకుఁడనినను, కవియన్నను కడు లోకువ. అడుగుటయే తరువాయిగా కొందఱును, మొగమును కని పట్టియే కొందఱును గానముచేయ నారంభింతురు. ఒకవేళ తాము బెట్టుచేసి వినిపింపకున్నచో, ఇంకను లోపమున్నదని సరస్వతి లోలోపల నవ్వుకొని పోవునేమో యని వారు భీతిల్లుదురు. కాఁబట్టి వారించుమించుగా 'Public property'.

వెంకటరావు కోరికమీఁద కామకవి లోఁగడ తాను చెప్పిన చాటుపద్యములు వినిపింప మొదలిడెను. అతని పాఠధోరణి కొంత గుఱ్ఱపుకదనువలెను, కొంత వృషుచలనమువలెను, పోనుపోను ధూమశకటధ్వనినే శ్రుతిగాఁ జేసికొన్న ఒకానొక నిశ్చలోచ్చైస్స్వరమున నంపన్నమయి యుండెను. అతని ముఖమున ఆనందము వెల్లివేయఁబడి నటులుండెను. సభ్యులలో నెచటను అలికిడి లేదు. అపుడు ధూమశకటముకూడ తనచప్పుడు నుపసంహరించుకొని వానిగానమును వినుచున్నదా యనునటులు దానిధ్వని యెవరికిని గోచరించుటయేలేదు. తెనాలిస్టేషనుకడ రైలు నిక్కముగా చప్పుడు మాని ఆఁగి వినఁదొడఁగినది. కామకవి కవితాస్వరము రెండింతల వికాసముతో జనుల నాకర్షించినది. వినుటకే కాఁబోలు రైలు అక్కడ పదినిమిషము లెక్కువ ఆఁగినది.

శ్రుతిలేనిపాట కష్టమని రైలు మఱల శ్రుతివేసెను. అతఁ డీశ్వర లీలపై వ్రాసినపద్యములు ప్రతివానిని పాతులోనికి కదిలించి వైచినవి. అతఁడు క్రమక్రమముగా వానిని చదివి చాలించెను.

'భాషాసంగీత'మని ఒకఁడు, 'భావసంగీత'మని ఒకఁడు 'Wave of bliss' అనిఒకఁడు, 'Gamut of Appolo' అని ఒకఁడు, 'Song of the Soul' అని ఒకఁడు కీర్తించిరి.

రుచిభేదములేక పదార్థమని ఒకటి ఉండదు. నింద లేక స్తుతి పూర్ణము కాదు. స్వరూపసాక్షాత్కారములేని భక్తుఁడు భగవంతుని దివ్య కళ్యాణ గుణముల నుతించి నుతించి నిందింప మొదలిడును. నిషేధము విధిలో లీనమయినపుడే అది సమగ్రమయి యుండును.

అపు డచట వినుచున్న వారలలో వైయాకరణ శిరోమణి యగు అనంతకృష్ణశాస్త్రి అతని కవితనంతయు వినివిని తుదకు కామకవిని చూచి "అయ్యా తా మేమి పఠించితి"రని యడిగెను.

"అయ్యా! నేనేమియు చదువుకొనలేదు."

"ఆసంగతిని మీకవిత్వమే చెప్పక చెప్పుచున్నది అనఁగా వాచ్యముగా చెప్పుచున్నది. మీరు దండిపండితు లయినఁగాని మీకవిత్వము రాణింపదు. అది యటుండె. మీ రేమి చదివి దీనిని వ్రాసినారు?"

"అయ్యా! నాకటులు తోఁచినది; వ్రాసితిని. ఇటులు చెప్పుటకు, ఏమిచదువుకొనుట, కేమిపని?"

"ఓహో! వ్యాకరణమురాక కవిత్వమా! అది సపిండీకరణము; అలంకారము లేక కారము; పాకము లేక శోకము; శయ్య లేక కొయ్య; వ్యంగ్యము లేక భంగ్యము. కవిత్వమనఁగా గొల్ల సుద్దులా? నైషధము చూచితివా? చూచుకొలఁది దానినుండి వింతలు దొంతులుగా పుట్టుకొనివచ్చును. కవిత్వమనఁగా అది; అది విద్వత్ కవిత్వము. —విద్వత్కవయః కవయః కేవలకవయః కేవలంకపయః" అని రెండుశ్లోకములు చదివి వ్యాఖ్యాన మనువదించి అందలి ఒకొక్కపదమునకు వ్యుత్పత్తి ప్రత్యయోత్పత్తి నిఘంటువులు, వ్యంగ్యవీచికలు, అలంకారములు, శయ్యలు, పాకములు మొదలగువానిని అనంతకృష్ణశాస్త్రి ఉపన్యసించుచుండఁగా బొబ్బల్లు వచ్చెను. అతఁడు 'నాయనా! చెడిపోవుచున్నావని ఇంతవట్టు చెప్పితిని. ఇఁకనైనను చదివి విద్వత్కవివి కమ్ము' అనియెను.

"మీకడనే చదివికొనవలయునా?" అని కాలేజీ విద్యార్థు లనిరి. అనంతకృష్ణశాస్త్రి ఈర్ష్యనే ఒకచూపుగా చూచెను.

అనంతకృష్ణశాస్త్రి శిష్యు లూరక కూర్చుండ లేదు. "కామకవిగారూ! వండుక అని ప్రయోగించితిరే; ఇదెట్లు సాధువు? అర్థానుస్వార శకటరేఫ సాంకర్యము కలిగించితిరే? అది కవిత్రయానుమతమా? 'దేవానాంప్రియ' శబ్దమును అన్యసమాసఘటితము చేసితిరే! అది అపాణినీయమే!" అనుచు ప్రశ్నపరంపర పరఁగించిరి.

"అయ్యా! నాకవియేవియురావు. నాకటులతోఁచినది; చెప్పితిని. లెస్సగా నున్నయెడల వినుఁడు; లేదా పోనిండు" అని కామకవి యూరకుండెను.

"కవిత్వమునకువ్యాకరణదోషములకును ఏమియు సంబంధము లేదు. వేమన్న పద్యముల కానందింతురు. తప్పులు పట్టరేల? వానిలో తప్పులు లేవా? పండితులు తప్పులనుకొను తప్పులతెడకయే అది. కాని ఆతప్పుల నతిక్రమించి అందలికవిత్వ మతిశయిల్లినది." అని కాలేజీ విద్యార్థులు స్వతంత్రవాదమును నెలకొల్పఁ దొడఁగిరి.

ఈవివాదమును సహింపనిదానివలె రైలు గుప్పు గుప్పుమని ధ్వనిచేయుచుఁ బట్టాలపై అనేక జర్జర స్వరము లుదయింప వాని శాసించుచండమున తానును అఱచుచు స్టేషనుముందాఁగెను. అనంతకృష్ణశాస్త్రి శిష్యసమేతుఁడై దిగి పోయెను. కాలేజీ విద్యార్థులు జయపెట్టుచు కామకవిని దింపిరి. కొంతవడికి రైలు అలపుసొలపులులేని తన నడకను క్రమ్మఱసాగించెను.

స్టేషనునుండి గ్రామములోనికి జననిష్క్రమణ బయలు దేఱినది. కామకవియే దానికడపటి బిందువు. అతఁడేదియో లోప మొనరించిన వానివలెఁ బెండ్లి యిల్లు చేరెను.

## 3

కామకవికి పెండ్లిసందడియంతయు ముండ్లదండడివలె నుండెను. అనంతకృష్ణశాస్త్రి చేసిన నింద ఒకమూర్తి తాల్చి అతని కనుల వ్రేలుచుండెను. అతఁడు:—

"ఆపరితోషా ద్విదుషాం
న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్;
బలవదపి శిక్షితానా
మాత్మ న్యప్రత్యయం చేతః."

అను పద్యము నూరక చదివికొనుచుండెను.

స్తుతింపుము; గుండేని మొగురును. నిందింపుము; బెండేని క్రుంగిపోవును. స్తుతిని తేనెనుండియు, నిందను తేనెటీఁగల ముండ్లనుండియు తీసియుందురు. ఈ రెంటికి చిన్ననాఁటనుండియు శాశ్వతికమగు పోరు.

కామకవి స్తుతి కుబ్బ లేదుకాని నిందకు క్రుంగిపోయెను. పండితు లన్నచో నతనికి భయమెత్తెను. పాణినియు సన్నయయు వ్యాకరణములు వ్రాయకుండిన నిటువంటివారి కెంతటి మేలు? అతనిలోనిపుడు పాణిని సన్నయాదులందు శ్రద్ధాబీజము పడెను. ఏమనఁగా పెండ్లికి వచ్చిన బంధువులలో పండితు లందఱు "కామకవీ! ఏమి చదువుచున్నావు?" అని అడిగినపుడు తాను గుటకలు మ్రింగుటకన్న నేమి ప్రత్యుత్తర మీయఁగలఁడు? శిష్య

లను జూచినపుడు తన్నేమి వెంటఁబడి యడిగిపోదురో యని బెంగపడి వారికి దూరముగా వర్తించుచుండెను. శిష్యులు నిక్కముగా వేఁటకుక్కలు. వారు ఇతర శిష్యులను ఉడుములవలె వెంటాడుదురు. కామకవికి వారి గాటు బాగుగా తెలియును.

సదస్సున అవధానులు వేదము చెప్పిన పిదప, పండితులను శిష్యులను కొన్ని శ్లోకములతో ఆశీర్వదించి వానికి మూఁడు, నాలుగు, ఐదు, ఆఱు అర్థములు చెప్పినపుడు కామకవికి శాస్త్రమురాని లోపము అద్దమున చూపించినటులాయెను. అపు డతఁడు మున్మొదట గురువుగారికిని తనకును గలిగిన మార్గభేదమును స్మరించెను.

కామకవి ఇల్లు చేరెను. వివాదపడిన గురువుకడ చదువ నతనికి చిన్నతనము తోఁచెను. కొన్నాళ్లకు తిరుపతి వెళ్లి అచటిపాఠశాలలో వ్యాకరణశాస్త్ర మారంభించెను. తీరుపాటయినపుడెల్ల కొన్ని వ్యాకరణసూత్రములను పద్యములలోనికి మార్చుచుండెను. అం దొకటి యుదాహరించుట అనావశ్యకము కాఁబోదు.

క. 'హోఢ' యన ఝల్ పరంబున
  ప్యాఢం బగుచోఁ బదాంత మొనరినచోనుఁ,
  హోఢా యగు 'లిహ్ + సు' అనఁ
  రూఢిగ 'లిఢ్' అగు బదారురుక్షువులారా!

ఇటులే కువలయానంద మంతయు పద్యములుగా మాఱుచున్నది. అమరము బట్టీపెట్టి నోరికానుపదముల నేఱుకొనుచున్నాఁడు. ఇఁకఁ దనమానసము విశాలమయినపుడు చెప్పు ప్రతిపద్యమునందును ఏశ్లేషయో, ఏగూఢవ్యంగ్యమో, ఏప్రాసమో లేకుండ లేదు. తొల్లి తనపద్యములను వినిపించి ఇతరుల నానందపఱచువాఁడు. కామకవిచుట్టు జనులు మూఁగుచుండువారు. ఇపుడో ఏకాంతమందు తన పద్యములు తానే చదివి తానే యర్థము చెప్పికొని తానే ఆనందించుకొనుచున్నాఁడు.

కొన్నాళ్లకతనికి కవిత్వము చెప్పుటకే తీరిక లేకపోయినది. గురువుగారు చెప్పిన పాఠమును వినుట తాను మరల చూచికొనుట, ఇంకొకరికడ చింతనచేయుట, తెలివితక్కువవాని నొకనిచూచి వానికి తాను మరల చింతన చెప్పుట, వెనుకటి పాఠము లేకరువు వేసికొనుట, ముందుగ్రంథము చూచికొనుట. వీనితో అతనికి గాలి గూడఁ బీల్చికొనుట కవకాశము లేకుండఁబోయినది. అతఁ డిపుడు *కవిత్వపు Vacuum అయినాఁడు.

కవిత్వ మెంతెంత అడుగు పట్టినదో శాస్త్ర మంతంత పెరుఁగుచువచ్చినది. కామకవి క్రమముగా భాష్యాంతము వ్యాకరణము, బాధాంతము తర్కము, అలంకారశాస్త్రము చదివికొన్నాఁడు. శాస్త్రాభ్యాసము పూర్ణమయినపిదప ఇల్లుచేరెను. శిష్యులు పలువురు చేరిరి. అతనికి ఇపుడు పాఠములు చెప్పుటతో సరిపోవుచున్నది. నడుమనడుమ పూర్వవాసనల వలన ఒకటిరెండు పద్యములు చెప్పుచు వచ్చుచున్నాఁడుగాని వానిని శిష్యులు తక్క ఎవరును ఆలకించుటలేదు. పూర్వపరిచయమువలన ఇతరు లెవరేని విననారంభించినను పూర్తికాకమునుపే లేచిపోవుచు "జల మల్లిపోయినది" అని అనుకొందురు. కామశాస్త్రి వీరికేమియు తెలియదని లోలోపల ననుకొనుచుండును. శిష్యులుమాత్రము గురువుగారు చెప్పిన సారస్యములను వారములకు వెళ్లినపుడు వారివారికిబోధించుచుండువారు; కాని వారు 'మాకు కొబ్బరికాయలు వలదయ్యా, అరఁటిపండ్లు కావలయు'నని అనుచుండువారు. శిష్యులు, విద్వత్కవిత్వ మనఁగా 'గొల్లసుద్దులును సువ్వాలపాటలునా?' అని అనుచుండువారు.

౪

ఆంధ్రదేశమున శతావధానసభలు, అష్టావధానసభలు, ఆశుకవితాసభలు వేలపువెఱ్ఱిగా జరిగిన పిదప ఆలోచించి ఆలోచించి వ్రాసియుంచిన ఖండకావ్యములను, భావకవిత్వములను, పాటలను వినిపించు సభలు

* గ, కవిత్వపు జొల్ల.

చిత్తవిత్తుగా జరుగుచున్నవి. ఒక ఉపన్యాసకునకు మఱొక యుపన్యాసకునకు పొత్తుకలియుట లేదు. వక్తలు చెప్పునది శ్రోతలకు తెలియుట లేదు. ఇంచుమించుగా ఆకాలమున కవిత్వపు అరాచకము ఉదయించినది. 'విమర్శకులు వింతవింతల సిద్ధాంతముల నెలకొల్పఁ దొడఁగిరి. అపు డెంతమంది కవులు బయలుదేఱిరో అంతమంది విమర్శకులును వారికి సహోదరులవలె బయలుదేఱి వారికవితలమీఁద దీర్ఘ విమర్శనముల వ్రాయుచుండిరి.

పూర్వపరిచితివలన కామకవికిఁగూడ ఒక సమితి తరఫున ఆహ్వానము వచ్చినది. ప్రకృతము కామకవి కడ తాను శాస్త్రాభ్యాసము చేయుకాలమున రచించిన పద్యములు తక్క మఱివిశేషపద్యము లేమియు లేవు. అతఁడు వానిని వ్రాసియుంచుకొనలేదు గాని అతనికడ చినఁగని తగులఁబడని—ఎత్తుకొనిపోఁబడని—ధారణాగ్రంథ మొకటి కలదు. కామకవి తత్సామగ్రితో ఉపన్యాస వేదిక నెక్కెను. అతఁ డాధారణాగ్రంథము విప్పి ఒకపద్యము చదివి దానికి వ్యాఖ్యాన మారంభించెను. ఒకొక్కపదమే నిర్వచించుచు ప్రయోగముల నుదాహరించుచు తాత్పర్యము చెప్పుచుండెను. సభ్య లొకరి మోము ఒకరు చూచుకొనుచుండిరి.

కొంతవడి కొకసభ్యుఁడు లేచి వినయముతో "అయ్యా, వ్యాఖ్యానము చెప్పనక్కఱలేని పద్యములు మాత్రమే చదువుఁడు. అథవా వ్యాఖ్యానమేని మానుఁడు" అని కోరెను.

కామకవి వ్యాఖ్యానముమాని మూలము చదువుచుండెను. 'ఇది అరబ్బీ'అని ఒకఁడు, 'పాండిత్యముయొక్క కవితావేషము'అనిఒకఁడు,'Galvanised iron'అనియొకఁడు అఱచుటకు వెనుదీయ లేదు.

అందఱు 'కామకవి కామశాస్త్రి అయిపోయినాఁ' డనిరి. అగ్రాసనాధిపతియు కామకవియుఁదక్క సభ్యులెంతసేపో లేరు. కామకవికి కవితాసమితుల కాహ్వానము మఱి రాలేదు.

కామకవి ప్రథమగురుపుత్రో వివాదమును, కాలేజీ విద్యార్థులస్తుతియు అనంతకృష్ణశాస్త్రి మండలింపును, నేటి సభ్యులయనాదరమును తలపోసి 'లోకోభిన్నరుచిః' అనుకొన్నాఁడు. అతనికి సభ్యులపై కొంచెమాగ్రహము కలుగకమానలేదు. "శాస్త్రవాసన యిసుమంతయు నెఱుఁగని వీరి కేమి తెలియును? లోకమునకు నచ్చుపుస్తక మొకటి రచించి యచ్చొత్తించినఁగాని నాసంగతి వీరి కెఱుక పడదు" అని అతఁడు తలఁచెను.

అష్టాదశవర్ణనముల చిఠా, విభావాను భావసంచారిభావ వ్యభిచారి భావముల లక్షణము, శతాధికాలంకారములు, సర్వవ్యంగ్యములు, నిఘంట్వరణ్యానిలో అసూర్యంపశ్యములైన పదములు, బంధముల జాబితాలు కంఠబద్ధము లయియే యున్నవికావున అతఁడు వానిని ప్రతిపదమందు భావించి భావించి ప్రబంధరచనకుఁ గడఁగెను. విద్యార్థులకు వేళకు పాఠ మందుట లేదు;ఒక్కొకరోజున అసలు లేనేలేదు. ఇంటివా రెవరికిని వేళకు భోజన మందుట లేదు.

కొన్నాళ్లకు ప్రబంధము తయారయినది. ఆలోచించి ఆలోచించి దానికి రెండు పేరులు పెట్టినాఁడు. ఒకటి 'కవితా విజయ'మని; రెండు 'కావ్యరాజ' మని.

చూడవచ్చిన ప్రతిపండితుని పది రోజు లుంచుకొని వినిపింప మొదలిడినాఁడు. ప్రతిపదసారస్యమును త్రవ్వి చూపుచున్నాఁడు. పండితులంతఱు'అమ్మా' అంటే 'అమ్మా'అన్నారు. కామకవి ఒకనాఁడు పని కట్టుకొనిపోయి అనంతకృష్ణశాస్త్రి కాప్రబంధమును వినిపించి ప్రశంసాపత్రికను తెచ్చికొనెను. కామకవి తనజన్మము సఫల మయిన దనుకొనెను. ఎవరు తనను నిందించిరో వారే తనను నుతించుటకంటె విజయము వేఱేచటనున్నది? దానిదెబ్బ నదియే గడించుకొనునను గర్వముతో ఏ రాజునకు దానిని కృతియీయకయే అప్పు తెచ్చి 'కవితా విజయ'మను మాఱుపేరుకల ఆ'కావ్యరాజము'ను అతఁడు అచ్చు వేయించెను.

స్వరూపము తాల్చిన ఆసరస్వతి తనయింట నధివసించుటకు ఏఁబదిరూకలు వెచ్చించి ఒక బీరువా నతఁడు చేయించి ఆపుస్తకముల నతిశ్రద్ధతో నతఁడు చక్కగా అందు పేర్చెను. పత్రికలలో అడ్వర్ టైజ్ మెంట్లకు ఇన్నూఱు రూకలు వ్యయపఱిచెను. రిప్లై కార్డులు అచ్చొత్తించి గ్రంథభాండాగారముల కన్నిటికిఁ బంపించెను. నోటీసు లచ్చువేయించి కవర్లలో పెట్టి గొప్పవారికిఁ బంపించెను. పోస్టునకు విరామము లేని పని కలిగెను.

మొత్తము మీఁద పది పదేనుగురు పుస్తకమును వి. పి. గా పంపవలసినదని లేఖలువ్రాసిరి.

గ్రంథభాండాగారాధిపతుల కడనుండి "అయ్యా! మేము పది సంవత్సరములనుంచీ ఈభాండాగారమును నడుపుతూ వున్నాము. మేము విద్వత్కవులు రాసే పుస్తకాలకే ఎక్కువ ప్రాధాన్య మిస్తాము. జగత్పండితులును విఖ్యాత కవులును అగు మీరు రచించిన ఈకావ్యరాజముచే మాభాండాగారము నలంకరించు కొనవలె నని తీర్మానించు కొన్నాము. అయితే సరస్వతి కుండే సహజదారిద్ర్యముచే ఉచితముగా తమగ్రంథముదయచేయుఁడని ప్రార్థిస్తూ వున్నాము" అని రిప్లై ఉత్తరములు కామకవి కడకు ప్రవహింపఁ జొచ్చినవి.

మఱికొందఱకడనుండి—"అయ్యా! నేను గ్రంథములు కొనఁదగినంత ధనికుణ్ణి కాదు; అయితే, చిన్నప్పటి నుండీ చదువుమీఁద వుండే ఆసక్తివల్ల ప్రతిగ్రంథమూ చూడాలనే ఆశ అధికంగా వుంది. ఎంతమంది ఎన్ని మాటలు చెపితే ఏమి ప్రయోజనం? తమకవిత్వానికి మిగతావన్నీ పిపీలికాయమానాలు. ఈ కవరులోనే తాము గ్రంథం పంపడానికి పోస్టుబిళ్లలు పెట్టుకోవడ మైనది" అని ప్రార్థనలు వచ్చుచున్నవి.

ఇటువంటి ప్రార్థనాపత్రికలు చూచుకొనుటకంటె ధనపత్రమును చూచుకొనుటయే కామకవి కిష్టతరము. ఎటు చూచినను ఒకఆర్డరు కనఁబడుట లేదు. అతనికి బీరువాచూచుచో భయము పుట్టుచున్నది. అం దేప్రతి యిఱికింపను తావు లేదు. పైఁగా ఇంటిలో చాలస్థల మాక్రమించినది. రోజులు కడచిన కొలఁది పుస్తకముల మీఁద బూజు పెరుఁగుచున్నది. రెణ్ణాళ్ల కొకతూరి దులపనియెడల చెద లెక్కుచున్నది.

కామకవి పండువులలో విమర్శకుల నింటికి విందులకు పిలిచెను. కవిత్వము, కావ్యము, రసము, భాష ఈ మొదలగువానిపై తనపాండిత్యిని వెల్లడించి, తనకావ్యరాజములోని కొన్నిపద్యములు వినిపించి, వ్యాఖ్యలు కురిపించి దానిని పత్రికలలో విమర్శింపవలసినదని ప్రస్తావించెను. విమర్శకులు కావ్యరాజముపై దీర్ఘవ్యాసములువ్రాసి పత్రికలకుఁ బంపిరి. కాని ఏపత్రికయు ఆవ్యాసములను బ్రకటింపలేదు. కామకవి ఆర్డర్లకు నిరీక్షించెను గాని వృథా ఆయెను. "ఇన్నిరూపాయలుపోసి అచ్చు వేయించితినిగాని అచ్చుఖర్చైన మళ్ల లేదు" అని చింతించెను. బీరువాతలుపు తీసి చూచినపు డతనికాపుస్తకములు పితృదేవతలశల్యములవలెఁ గానఁబట్టుచున్నవి. మచ్చునకు కొన్ని యిచ్చుచో వ్యాప్తికలుగునను నమ్మకముతో ఉచితముగాఁ గోరిన వారి ఉత్తరములు వెదకి కొన్ని నట్పేటుగా పంపినాఁడు; కాని అవికొన్నాళ్లకు తిరిగివచ్చినవి. "అయ్యయో!—నమః ప్రామాణ్యవాదాయ మత్ కవిత్వాపహారిణే" అని అనుకొన్నాఁడు.

శిష్యుల కందఱకు కావ్యరాజము పాఠము చెప్ప మొదలిడినాఁడు. మొదట ప్రథమగురువుపై తనకెంత కోపము వచ్చెనదో కవిత్వము చెప్ప నేర్చిన కొందఱు శిష్యులకు తనపైని అంత కోపము వచ్చినది. ఆకోపమే వారిలోని కవితావాసనను పూర్తిగా జాగరిల్లఁ జేసినది. మఱివారికి పాఠము చెప్పనక్కఱలేకపోయినది; కాని,కవితావాసన లేనిశిష్యులు కావ్యరాజమునే ఒకశాస్త్రముగా పఠింపఁ దొడఁగిరి.

కామకవి బస్తీలలోనున్న తన శిష్యులకందఱకు 'మీరును మీ అనుయాయులును' ప్రతి పుస్తకశాలలోను "కావ్యరాజము కలదా? కావ్యరాజము కలదా?" అని పలుమాఱులుఅడుగవలసినది' అని ఉత్తర

ములు వ్రాసెను. వారిలో నెవ్వరును గురువాక్యమును జవదాటలేదు. పదిమంది పదిపర్యాయములు అడుగుటతోడనే కావ్యరాజములకు (Demand) ఉన్నదని షాపుకీపర్ల మనస్సులకు నాటినది.

అపుడే ఆంధ్రపత్రికలోను కృష్ణాపత్రికలోను 'కావ్యరాజము; ఇది యొక మహాకావ్యము; విద్వత్కవులయిన కామశాస్త్రిగారిచే విరచితము; విమర్శకశేఖరులైన విశంకటశాస్త్రిగారిచే విమృష్టము; కొలది ప్రతులే కలవు; ఈనెలలోఁగా తీసికొను వారికి రెండుకూకలు మాత్రమే. వలయువారు గ్రంథకర్త కామకవిగారికి, బెజవాడ అనివ్రాసిన బడయఁగలరు' అని చిత్రమైన డిజైనుల మధ్య అడ్వర్ టైజ్ మెంటు ఆకర్షకముగా మఱల ప్రకటింపబడినది.

పుస్తకములకు ఆర్డర్లు రాఁదొడఁగినవి. కామకవి కత్తెర చేత పుచ్చుకొని కాకితములు కత్తిరించి పాకెట్లు కట్టి వి. పి. లు పంపెను. కామకవి బీరువా సగము ఖాళీ అయి అంగళ్ల బీరువాలలో క్రిక్కిఱిసినవి. అచ్చోటినుండి అవి విముక్తి కాలేదు. ఇపుడు దుకాణదారులు వాని విముక్తికి తీవ్రముగా ఆలోచించుచున్నారు.

---

## విబుధాలాపము

కల్లూరి వెంకటసుబ్రహ్మణ్య దీక్షితులు గారు

శ్రీలలనాధినాథ! బుధసేవితపాదసరోజయుగ్మ! ప్ర
క్షాళిత సర్వదైత్యకుల గర్వ! నమస్కృతు లయ్య నీకు, వి
శ్వాలయ! కావవే వరద! పారములేని విపత్పయోధిలోఁ
దేలుచు మున్గుచున్న మము దేల్చి దయామయ! దీనరక్షకా!

ఉ. కొండల నెత్తినావు మును గొల్లలకుం జెలికాడవై మహో
ద్దండ గభీరఘోరతర దర్ప ఫణీంద్ర ఫణాంతరంబులం
దాండవ మాడినావు సముదగ్ర పరాక్రమ! యాదశాస్యునిం
భండనమందు గూల్చుటొక భారమె నీకు నజాండరక్షకా!

శా. చింతంజేసి భవద్దయామృతరస శ్రీబిందుసందోహముం
బొందం జేతువు *పాదుకట్టనయిన స్వర్ణోన్నతు ల్దేవ! మా
యం దింతైన కృపారసం బిడవు మాయాలాప మాలింప వే
మెందు న్బోయెదువార మీ విటు లుపేక్షింప న్నిలింపాశ్రయా!

మ. స్థిరత న్ముప్పదిమూఁడుకోట్ల విబుధు ల్దిక్పాలు రర్కాదులుం
సరవిం స్వోన్నతి కర్హమైనగతి దాస్యంబందు వర్తింప ము

* పాదుకట్టు: మురళి అని అర్థాంతరము గ్రహింపవలె.

మ్మదమునైఁ శాసన మిచ్చి సర్వసుమనస్సామ్రాజ్య సంపత్పరం
పరలన్ హాయిగ నేల ఖాడెదు నహో పాపాత్మ దౌర్జన్యముల్!

శా. ఆలోకాంతముల న్నెలుంగు తన రాజ్యంబందు నందంద దు
ష్ట్రీలుం డీతడు రాక్షసానుచరులన్ శిక్షించి నిల్పెన్ రమా
లోలుం భక్తి భజించు శాంతుల తపోలోలాత్ములన్ యోగ్యుల
న్నీలం బాధల నొంప నాజ్ఞనిడి నిన్నిద్రప్రతాపంబునన్.

ఉ. జ్ఞాన మొకింత లేక సదసత్సువిచారవిహీనుడై కను
ల్గానక నన్యపూరుషుని గానగ బెగ్గిలు నట్టి దేవతా
మానవతీ వితానముల మానములన్ హరియించె నూరకే
మానుసె వారి కుట్టుసురు మాడ్చునుగా మొదలంట నీనినిన్.

చ. సురుచిర వస్త్రజాలముల సుందరహారమణీ విభూషితా
త్యురుతర వస్తుజాలముల నొయ్యన జూపుచు నాసగొల్ప వా
రరమర లేక ధర్మనిరతాత్మత వర్తిల జూచి వారలన్
పరిపరి రీతుల న్నిగుల బాధల బెట్టెదు నీచ దక్కటా!

శా. చేతన్ పెన్నెరు లూని యీడ్చి చెరలన్ జేర్పించి మానంబులన్
పాతివ్రత్యములన్ హరించి కుమతి ప్రావీణ్యత న్నించి త
 త్ప్రాతి ల్గన్పడకుండ జేసిన తదుద్యత్తీవ్ర శోకానల
జ్యోతుల్ హోరన నేడ్చుచుండు రబలల్ పూర్ణాశ్రునేత్రాంతలై.

ఉ. ధీరత యెల్ల డిందువడ దెల్పెడి బేమిక నీకు వీడుమున్
ఘోరుడు రాక్షసప్రభుత ఘోరము దేవత లేలుభూమి యం
దారసి చూడ సర్వవిబుధార్హములైన సమస్తశోభనా
చార పరంపరాళి కిట సత్యము ముప్పు ఘటిల్లె నీశ్వరా!

శా. చెప్పన్ లేమిక వాని దుండగములన్ జెప్పన్ భయం బయ్యెడిన్
తప్పు ల్సేసితి రంచు బందెల మమున్ దండించు నీచెప్పుమా
చొప్పు ల్దా నెటులైన విన్నవకటా చోద్యం బహో క్రూరుడో
యప్పా! దిక్కిక నీవె సుమ్ము ధరపై నప్పావుని న్గాల్పగన్.




వ్యాసకర్త.



# దక్షిణాఫ్రికా సమస్య

సింగంపల్లి వేంకటాద్రి గారు

ఎందఱో భారతీయులు మాతృదేశమున జీవనము చేయజాలక విదేశములకు బోవుచున్నారు. ఇట్లు పోవుటకే వలసపోవుట యని చెప్పుదురు. భారతీయులు పోవు వలసరాజ్యములు నానావిధ శీతోష్ణమండలములం గలవు. ముఖ్యములగు వలసరాజ్యములు నేటాల్, ట్రాన్స్‌వాల్, కేప్ ప్రావిన్స్, ఆరంజి ఫ్రీ స్టేట్, ఉగండా, కెన్యా, మారిషస్, జమైకా, ట్రినిడాడ్, సెంట్ లూసియా, గ్రెనడా, సెంట్ విన్‌సెంట్, సెంట్ కిట్స్, ఫీజీ దీవులు, బ్రిటిష్ గయానా, ఫ్రెంచి గయానా, డచ్చి గయానా, ఫ్రెంచిస్థానము లగు మార్టిన్ క్వి, గాడిలుప్, రీయూనియన్, సెంట్ క్రాయ్, సింహళము, పెనాంగ్, సింగపూర్, మలయాద్వీపకల్పము మొదలగునవి. ఈరాజ్యములలో మొదటి నాల్గును దక్షిణాఫ్రికా యూనియను లోనివి. ఈయూనియనులోనున్న భారతీయుల స్థితిగతులనుగుఱించి వ్రాయుటయే యీవ్యాసముయొక్క ప్రధానోద్దేశము.

ప్రస్తుతము నేటాలులో 1 లక్ష 40 వేలు భారతీయులును ట్రాన్సువాలులో 12 వేలును, కేప్‌రాష్ట్రములో 8 వేలును, ఆరంజి ఫ్రీస్టేటులో 200 భారతీయులు గలరని అంచనా వేయబడినది. వీరిలో 100-కి 67.27 గురు దక్షిణాఫ్రికాలో పుట్టినవారుగను, మిగిలినవారు భారతమునుండి వెడలిపోయినవారుగను నున్నారు. మొత్తముమీద వీరందరు భారతీయులుగనే పరిగణింపబడుదురు. భారతీయులు నేటాలునకు వలసపోవుట 19-వ శతాబ్దము నుండియే యారంభించిరి. నేటాలుయొక్క విస్తీర్ణము 17 వేల చదరపు మైళ్లు. 1842-వ సంవత్సరమున నీ రాజ్యము బ్రిటిష్‌వారి స్వాధీనమయ్యెను. అంతకుపూర్వ మియ్యది డచ్చి బోయర్లచే నాక్రమింపబడియుండెను. 1872-వ సంవత్సరమున నేటాలులోనున్న భారతీయులసంఖ్య 5700. 1892 సంవత్సరముననున్న భారతీయులసంఖ్య 38,365. వీరిలో కొందఱు కూలీవలనను, మిగిలినవారు వర్తకమువలనను, భూస్వాములై వ్యవసాయమువలనను జీవనముచేయుచుండిరి. భారతీయు లేటేట నేటాలునకు వందలకొలది, వేలకొలది వలసపోవుట కారంభించిరి. ఈ విధముగా బోవుటకు నేటాలురాష్ట్రప్రభుత్వమువారును, దక్షిణాఫ్రికా యూనియన్ ప్రభుత్వమువారును, ఇండియాప్రభుత్వమువారును ముఖ్యప్రోత్సాహకులుగ నున్నారు. 1860 మొదలుకొని 1908 వఱకు వలసపోవు భారతీయులకు ఎట్టినిర్బంధములును, ఆటంకములును లేకుండెను. 1860 మొదలుకొని 1880,1885 వఱకు దక్షిణాఫ్రికా శ్వేతజాతులవారు భారతీయులను మిగుల నాదరించుచు, వారికి కావలసిన సదుపాయములెల్ల నేర్పాటుచేయుచు నివేశములకు స్థలముల నుచితముగా నిచ్చుచు మిగుల ప్రోత్సహించుచుండిరి. అనేకపర్యాయములు యూనియన్‌ప్రభుత్వమువారును, ఇండియాప్రభుత్వమువారును దక్షిణాఫ్రికాలోని శ్వేతజాతులకును, శ్వేతేతరులకును రాజకీయములందుగాని, పౌరసత్వపు హక్కులందుగాని, మఱియేయితర విషయములందుగాని ఎట్టిభేదములు చూపబడవనియు, ఎల్లరు సమానులుగ నెంచబడుదురనియు బహిరంగముగాఁ బ్రకటించియుండిరి. ఆకారణమున భారతీయులు మఱింత యుత్సాహముతో వలసపోవుటకు సాగించిరి. భారతీయులలో పెక్కండ్రు స్వతంత్రించి గొప్పగొప్పవ్యాపారములు చేయుటకును, విశేషభూములు సంపాదించి ధనికులగుటకును మొదలిడిరి. వీరిక్రమాభివృద్ధిని, వర్తకసరళిలో కలుగుచున్న పోటీని జూచి శ్వేతజాతులవారు సహింపజాలక భయవిహ్వలచిత్తులై భారతీయుల నిర్బంధపెట్టుటకు నారంభించిరి. ఈభారతీయులలో చాలభాగము సింధుదేశపు మహమ్మదీయులును, పశ్చిమతీరప్రాంతములవారు నైయుండిరి. 1900 సంవత్సరమే నిర్బంధశాసనములకు మొదలు. నేటాలు ప్రభుత్వమువారు భారతీయుల నెవిధముగనైనను దేశమునుండి వెడలగొట్టుటకు బూనుకొనిరి. ఈకారణమున దక్షిణాఫ్రికాయందును, ఇండియాయందును భారతీయులలో నాందోళనము బయలుదేరెను. ప్రజానాయకులు ప్రభుత్వమువారిని వలసపోవుపద్ధతి రద్దుచేయునట్టి శాసనముల నేర్పఱుప ఒత్తిడిగావింపసాగిరి. అయినను ఇంతకుపూర్వమునుండి యచ్చటనున్నవారి కష్టములు గట్టెక్కు టెట్లు! రెండు మూడుతరములనుండి నివాసము లేర్పఱచుకొనిన భారతీయసంతతివారు తమవాణిజ్యమును, పెట్టుబడిధనమును, భూవసతిని వదలి భారతభూమికి రా నిచ్చగింతురా! వీరిలో పెక్కండ్రు హిందూదేశ

పెట్టిదో రెఱుుంగరు. భారతీయసాంప్రదాయములును, భాషలును, ఆచారవ్యవహారములును వారికి కేవలము నూతనములు. దక్షిణాఫ్రికాయే వారికి మాతృభూమిగా నుండెను. వారెట్లు హిందూదేశమునకు రానెంచెదరు? ఇయ్యది కేవలము అసంభవము. 1908 సంవత్సరమున కర్జను ప్రభువువంటి యభిమాని వలసరాజ్యములగురించి ప్రసంగించుచు "భారతీయులను మనము వలసరాజ్యములకు బంపుచున్నాము. వారి శరీరకష్టమువలన నవి భాగ్యవంతములును, సస్యవంతములు నగుచున్నవి. కాని అచ్చటి శ్వేతజాతులు భారతీయులను కుక్కలను గొట్టునట్లు కొట్టుచున్నారు. భారతీయులు తాము చేయు నేరములకు హింసింపబడుట, శిక్షింపబడుట లేదు. వారు చేయు పరోపకారమునకే శిక్షింపబడుచున్నారు. వారు శాంతస్వభావులు, పరిశ్రమాభిలాషులు, ధనమును కూడబెట్టు స్వభావముకలవారగుటచేతనే శ్వేతజాతులకు కంటకప్రాయు లగుచున్నారు" అని చెప్పియుండెను. ఆసందర్భమునసే కర్జను ప్రభువు 'ప్రతిభారతీయుడును దక్షిణాఫ్రికాయందు బ్రిటిషుసామ్రాజ్యపతాకమును సుస్థిరముగ నెలకొల్పుటలోను, దక్షిణాఫ్రికా భూ వాణిజ్య ఖనిజసంపదల నభివృద్ధిచేయుటలోను తనకు పాలు, బాధ్యత యుండెనని గుఱుతెఱుంగు' నని చెప్పియుండెను. భారతీయులు చెమటనూడ్చి దక్షిణాఫ్రికాలోగల మహారణ్యముల నాశనమొనర్చి సస్యవంతములగు భూములుగ జేసియు, రైలుమార్గముల నిర్మించియు, గనుల త్రవ్వియు, కాలువలు త్రవ్వియు భాగ్యవంతమైన దేశములలో నొకటిగా జేసియుండిరి. అట్టివారిని శ్వేతజాతులు దక్షిణాఫ్రికానుండి వెడలగొట్టుటకు యత్నించుటవలన వారిస్వార్థపరత్వము, కృతఘ్నత వెల్లడియగుచున్నది. ఏఱు దాటి తెప్ప తగులబెట్టుట యన నిదియే కాబోలు! బోయరుయుద్ధములలో బ్రిటిషువారు భారతీయులసహాయత విశేషముగ నైకొనియుండిరి. ఐనను భారతీయులకష్టములు సమసిపవికావు. భారతీయు లెంతసహనము, కష్టసహిష్ణుత గలవారైనను ఎంతకాలమని యోపికబట్టగలరు? తుదకు 1914 సంవత్సరమున గాంధిగారి నాయకత్వముక్రింద సత్యాగ్రహపద్ధతి నవలంబింపసాగిరి. 1-1-1914 తేదీన గాంధిగారు దేశాంగమంత్రి కొకలేఖను వ్రాయుచు దానిలో భారతీయుల కష్టపరంపరలను పూసగ్రుచ్చినట్లు వ్రాసి వానిని తొలగింపగోరెను. కాని ఎంతకాలమునకు న్యాయము ప్రసాదింపబడకుండెను. అందుచే భారతీయు లందఱు సమ్మెకట్టి సత్యాగ్రహము పూనిరి. ఇట్లు జరిగినమీదట కొంతకాలమునకు సంధి పొసగెను. దీనినే 'గాంధి-స్మట్సు అగ్రిమెంటు' అని చెప్పుదురు. ఆయొడంబడికయందలి నియమములు కాలక్రమమున భంగ మొనర్పబడుటయే కాక మీదుమిక్కిలి మఱికొన్ని చిక్కులు కలుగుట సంభవించెను. కారణాంతరములచే గాంధిగారు మాతృదేశమునకు వచ్చుట తటస్థించెను. ఆతరువాత భారతీయులస్థితి మఱింత దుర్భరమయ్యెను. హిందూదేశమున భారతశాసనసభయందు వివిధపక్షములవారును దక్షిణాఫ్రికాప్రభుత్వమువారి చర్యలను తీవ్రముగ ఖండించుచు నుపన్యసించిరి. దక్షిణాఫ్రికాయందును భారతీయులు బహిరంగ సమావేశము లేర్పఱచి తీవ్రముగ మాట్లాడుచు వచ్చిరి. దక్షిణాఫ్రికా బ్రిటిషుసామ్రాజ్యాంతర్గత దేశములలో నొకటియయ్యును, బ్రిటిషు సామ్రాజ్యప్రభుత్వమువారు తగినశ్రద్ధ వహించి తీవ్రమైన చర్య దీసికొనకయుండిరి. దీనివలన నాంగ్లేయుల సంకుచితదృష్టి, పక్షపాతబుద్ధి తేటతెల్లము కాగలవు. పోలక్‌వంటి ప్రముఖు లొకరిద్దఱు కొంచెముగా భారతీయుల కష్టముల బాప యత్నించుచు వచ్చిరి. 1918లో ఇంపీరియల్ వార్ కాన్ఫరెన్సులో మాట్లాడుచు సందర్భవశమున 'బర్ట్‌న్' దొరగారు ఈ విధముగా తెల్పియుండిరి: "దక్షిణాఫ్రికాలో నున్న జనులలో నధికసంఖ్యాకులు భారతీయులుగ నున్నారు. వారు మంచిప్రవర్తనగలవారుగను, శాసనబద్ధులుగను నున్నారు. అట్టివారిని శ్వేతజాతులు పశుప్రాయులుగ జూడక తమతో సమానముగా జూచుట క్రమమును, న్యాయమును నైయున్నది." ఇట్టివారు పార్లమెంటునందు మఱికొంద ఱుండిన భారతీయుల కష్టములు కొంతవఱకైనను తొలగింపబడెడివే!

1926 సం.న ఇండియాప్రభుత్వమువా రొకరాయబారవర్గ మేర్పఱచి దక్షిణాఫ్రికాకు పంపియుండిరి. వారిలో నధికసంఖ్యాకులు శ్వేతవర్ణులే. దీనినే 'పాడిసన్ డెప్యుటేషన్' అనియు నందురు. వీరు అచ్చట భారతీయుల స్థితిగతుల విచారించి ప్రభుత్వమున కొక నివేదన నంపియుండిరి. దానిలో భారతీయుల యగచాట్లు చాల వఱకు వ్రాయబడెను. వానిలో కొన్ని యుదాహరించెదను: "సార్వభౌముని ప్రజలలో శ్వేతవర్ణులకంటె భారతీయులు చాల హీనముగ నున్నారు. వీరికంటె సార్వభౌముని శత్రువర్గములో జేరిన శ్వేతవర్ణు లెక్కుడు స్వాతంత్ర్యము, హక్కులు గలిగియున్నారు. ఒక కేప్‌రాష్ట్రమున తప్ప మిగిలినవానిలో భారతీయులకు రాజ్యాంగమునం దెట్టిహక్కు, భోక్యములు లేవు. నేటాలురాష్ట్రమున నిటీవలవఱకు భారతీయు లనుభవించుచున్న మునిసిపాలిటీహక్కులు, బాధ్యతలు 1924 సంవత్సరమున తొలగింపబడెను. 1919 సంవత్సరమున నేర్పఱుపబడిన ఏషియాటిక్ అమెండుమెంటు ఆక్టు వలన భారతీయులు నివాసస్థలములుతప్ప మఱియేయితరభూవసతులను సంపాదింపకుండునటులు చేయబడెను." ఇదిగాక వారియభిప్రాయములు మఱికొన్ని గలవు. వ్రాయుటకు స్థలాభావముచే శంకించుచున్నాను. ఇండియాప్రభుత్వమువారి యాహ్వానముపై దక్షిణాఫ్రికాప్రభుత్వమువా రొకరాయబారవర్గమును గత సెప్టంబరు, అక్టోబరు మాసములలో బంపియుండిరి. వారు దేశమునంగల ముఖ్యపట్టణముల సందర్శించి భారతీయుల నాగరికత, పరిశ్రమాభివృద్ధి, వర్తకవ్యాపారసరళి మొదలగునవి గ్రహించియున్నారు. వారికి ప్రజాపక్షమున గాంధిమహాత్ముడును, సరోజనీదేవియు స్వాగతమిచ్చియుండిరి. 1926 డిసెంబరు నెలలో కేప్‌టౌను అనునగరమున రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు ఒకటి

జరుగునట్లు నిశ్చయింపబడెను. ఆసమావేశముయొక్క కార్యక్రమము జూచుటకును, భారతీయులదుస్థితి పీలగునంతవఱకు తొలగించుట కును మహోదారుడగు సి.యఫ్.ఆండ్రూసుగారు బయలుదేరియుండిరి. ఈరౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులో ఇండియా పక్షమున ప్రాతినిధ్యము వహించుటకు హబీబుల్లాఖానుగారును, శ్రీనివాసశాస్త్రిగారును, పాడిసన్ గారును నియమింపబడవచ్చునని యీవ్యాసము వ్రాయునాటికి ఊహింపబడెను. ఈసమావేశముయొక్క ఫలిత మెట్లు పరిణమింప నున్నదో చూడవలసియున్నది. దక్షిణాఫ్రికా యూనియనులో చేరిన వివిధరాష్ట్రములందు భారతీయులపై ప్రయోగింపబడుచుండిన శాసనావళిని ఈక్రింద క్రమముగా వ్రాయబూనితిని.—

## ఇమిగ్రేషన్

1913 సం. 22 ఆక్టు ననుసరించి మంత్రివర్గమున కీయబడిన అధికారములబట్టి ఇండియనులు వలసవచ్చుటకు తీవ్రముగ నిషేధింపబడుచున్నారు.

1908 సం. 36 ఆక్టుప్రకారము రెజిస్టరుసర్టిఫికేటు గలవారుగాని, వారిభార్యలుగాని, పదునారేండ్లలోపువయస్సుగల పిల్లలుగాని ట్రాన్సువాలులో ప్రవేశించుటకు హక్కు గలదు.

దక్షిణాఫ్రికా యూనియన్‌లో గల నానారాజ్యములలో నేదైన నొకరాజ్యమున ప్రవేశించుటకు, నివసించుటకు హక్కు కలిగినంతమాత్రమున అన్ని రాష్ట్రములలో ప్రవేశించుటకును, నివసించుటకును హక్కు గలదని ఎంచ వీలులేదు. ఈశాసనములకును మనదేశములో ఏనాడి, ఎటుకల సెటిల్ మెంట్లవిషయమై నిర్మింపబడిన శాసనములకును గల వ్యత్యాస మేమియు లేదు.

అనుమానింపబడినవా రందఱు వారంటు లేకుండగనే అరెస్టు చేయబడవచ్చును. అట్టివారు జరీమానాగాని, మూడుమాసములు శిక్షగాని విధింపబడి దక్షిణాఫ్రికా యూనియనునుండి వెడలగొట్టబడుదురు. (1908 సం. 36 ఆక్టు 6 సెక్షన్) కొన్ని నేరములక్రింద శిక్షింపబడినవారు యూనియనునుండి వెళ్లగొట్టబడుటయుగలదు.(22 సెక్షన్)

ఆరంజిఫ్రీస్టేటులో ఇంటినౌకరులుగ నుండగోరిన భారతీయులుమాత్రమే ప్రవేశించుటకు వీలుండును. మిగిలినవారు నిషేధింపబడుదురు.

ట్రాన్సువాలులో రాజ్యాంగ, మతవిషయములందు శ్వేతజాతులకును శ్వేతేతరులకును ఎట్టిసమానప్రతిపత్తులుగల హక్కు లుండజాలవు.

ట్రాన్సువాలులో శాసనసమ్మతముగ నివసించుచున్న భారతీయులలో మగవారందఱు స్మట్సు-గాంధిఒడంబడిక ననుసరించి యివ్వబడు నివాసయోగ్యతాపత్రముగాని, 1908 సం. 36 ఆక్టు ననుసరించి యివ్వబడు రెజిస్ట్రేషన్ సర్టిఫికెట్ గాని దగ్గఱ నుంచుకొని పోలీసు లేక మఱియేయుద్యోగిగాని కోరునపుడెల్లను చూపి తీరవలయును. తాత్కాలికముగనైనను వచ్చి, పోవు భారతీయ మతగురువులుగాని బోధకులుగాని ట్రాన్సువాలులో నున్నంతవఱకు పై జెప్పినట్టి ప్రవేశహక్కుపత్రము పొందియుండవలయును.

స్త్రీలుగాని, పదునారేండ్లలోపు పిల్లలుగాని ప్రభుత్వోద్యోగులు కోరినమీదట, తమయజమానులు, తండ్రులు ఫలానివారని నిర్ధారణ చేసితీరవలయు. ఇట్టిపత్రములు లేని భారతీయు లెవరైనను శిక్షాపాత్రు లగుటయేకాక యీరాష్ట్రమునుండి వెడలగొట్టబడుదురు.

## నివాస విషయములు

ట్రాన్సువాలులో వార్డులోగాని, ప్రత్యేకముగ నేర్పఱుపబడు ప్రదేశములలో గాని కాపురములుండ వీలుండును. పై ప్రదేశములలోగాక తదితరస్థలముల నేవిధమైన స్థిరాస్తి కలిగియుండరాదు. పైజెప్పినవార్డులుగాని, నివాసస్థలములు గాని మునిసిపాలిటీహద్దులలో జేరినవిగానుండి, నెలనెలకు పన్నులిచ్చుచు, నెలనెలకు టెన్యూరు (Tenure) పొందవలయు.

నేటాలులో ఇటీవలవఱకు ఇన్ డెన్చర్ పద్ధతిమీద పోని భారతీయులందఱు కాపురములుండు స్థలములవిషయమై యెట్టినిర్బంధములు లేకుండెను. కాని అప్పటను ట్రాన్సువాలులోవలె ప్రత్యేకపు గూడెములలో నుండవలసినట్టి నిబంధనములు కాలక్రమమున చేయబడుచున్నవి. ఆరంజిఫ్రీస్టేటులో ఊడిగముచేయు భారతీయులుతప్ప తదితరులు ప్రవేశించుటకుగాని, కాపురములుండుటకుగాని వీలులేదు.

## వ్యాపారవిషయము

ట్రాన్సువాలులో భారతీయులు నివసించుటకు అర్హతగలిగినంతమాత్రమున వ్యాపారము చేయబూనరాదు. పట్టణములలో వ్యాపారము చేయదలచిన భారతీయులు గవర్నమెంటు రెవిన్యూ లైసెన్సును, మునిసిపాలిటీ లైసెన్సును పొందవలయు. ఆహారపదార్థము లమ్ముటవిషయములో లైసెన్సు ఇచ్చు హక్కులు మునిసిపాలిటీలకు మాత్రమే కలవు.

గోల్డ్ లా ననుసరించి ఇండియనులు మొదలగు శ్వేతేతరులు వగలవ్యాపారముగాని, స్వర్ణకారకవృత్తిగాని, రత్నములచేరముగాని చేయరాదు. ఇండియనుల స్వాధీనములోనుండు ప్రదేశములందుదొరకు గనులపై వారి కట్టిహక్కు అధికారములు లేవు.

## నేటాలు

1905,1906,1909,1913 సంవత్సరములలో గావించిన 'డీలర్సు లైసెన్సుఆక్టుల' ననుసరించి వ్యాపారముచేసికొనుటకు పొందవలసిన లైసెన్సులు ఇచ్చు అధికారము 'లైసెన్సుఆఫీసరు' అను నొక ప్రభుత్వోద్యోగిహస్తమున నుంచెను. ఆతడు చిరకాలమునుండి వ్యాపారము

చేయుచున్నట్టి కాని, క్రొత్తగా వ్యాపారము చేయదలచినట్టి కాని భారతీయులకు లైసెన్సులు ఇవ్వక త్రోసివేయవచ్చును. అతని యుత్తర్వులపై లైసెన్సుబోర్డునకు అపీలుచేయవచ్చును. కాని ఆబోర్డు సభ్యులెల్లరు శ్వేతముఖులే. వారిలో విశేష భాగము వ్యాపారస్థులుగ నుందురు. నేటాలులో ఇండియనులు వ్యాపారముచేయుటకు ఎన్నియో ఆటంకము లుండును.

### కేప్‌రాష్ట్రము

ఇచ్చట వ్యాపారవిషయములో తీవ్రమైన నిర్బంధము లంతగా లేవు గాని ముందుముందు ఏర్పడు సూచనలు గలవు.

### విద్యావిషయము

ట్రాన్సువాలు 1917 సం. 25 ఆక్టు ననుసరించి శ్వేతేతరులు ప్రాథమిక విద్యాలయములందు మాత్రమే చదువ నర్హులు.

కేప్ రాష్ట్రములో ఇండియను బాలురు బాలికలు చదువ నెంచిన అచ్చటి యాదిమనివాసులకు (నీగ్రోలకు) ప్రత్యేకింపబడిన పాఠశాలలలో చదువ వీలుండును.

నేటాలులో శ్వేతజాతులవలె శ్వేతేతరులకు పెద్దవయస్సు వచ్చువంతవఱకు చదువ నర్హత లేదు. వాల్గవతరగతివఱకుమాత్రమే చదువ వీలుండును.

### ప్రయాణసౌకర్యములు

దక్షిణఆఫ్రికాయందలి రైల్వేలు అన్నియు యూనియనుప్రభుత్వము వారివే. భారతీయప్రయాణికులు అచ్చట యాదిమనివాసులకు, ఇతరనల్లజాతులకు ప్రత్యేకముగా నిర్మింపబడు బండ్లలోమాత్రమే ప్రయాణము చేయవలసియుండును. భారతీయులలో గౌరవవంతులుగ నుండువారు శ్వేతేతరులకు ఏర్పాటుపబడిన రిజర్వుకంపార్టుమెంటుల లో ప్రయాణముచేయవచ్చును. కొంతకాలముక్రిందట నల్లజాతిప్రయాణికులు ప్లాటుఫారములపై ప్రత్యేక పుతావుల నుంపబడెడివారు.

### ట్రాముబండ్లు

జోహాన్సుబర్గు, ప్రిటోరియావంటి ప్రధానపట్టణములలో నుండు ట్రాముబండ్లు మునిసిపాలిటీవారివిగ నుండినను వానిలో ప్రయాణము చేయదలచిన నల్లవారు వెనుక ప్రత్యేకముగనుండు చోట్లలోనే కూర్చుండవలయు. గాలి తీవ్రముగా కొట్టుచున్నను, వర్షము కురియుచున్నను, ఎండ బాగుగ తగులుచుండినను అట్లే ఉండవలయును.

### ప్రాతినిధ్యము

ట్రాన్సువాలునందు ప్రభుత్వాంగవిషయములలో భారతీయుల కెట్టిప్రాతినిధ్యము, హక్కు, బాధ్యతలు లేవు.

నేటాలులో భారతీయులకుగల స్వల్పహక్కులు సయితము కాలక్రమమున సడలింపబడుచున్నవి.

### పన్నులభారము

నల్లవారికి ప్రాతినిధ్యము ఉండినను లేకుండినను సంపూర్ణ ప్రాతినిధ్యముగల శ్వేతజాతులవలె సమానముగ పన్నులు చెల్లింపవలసియుండును.

నేటాలులోనున్న భారతీయుల వాణిజ్యపరిశ్రమాభివృద్ధిని జూచి సహింపజాలక అచ్చట ప్రభుత్వమువారు వర్ణవిభేదచట్టము (Color Bar Bill) అనుదానిని ప్రవేశపెట్టి నల్లవారు అనారోగ్యకరములు, ఊసరక్షేత్రసమన్వితములు నగు ప్రదేశములందు ప్రత్యేకముగా నుండునట్లు నిర్బంధించుచున్నారు.

పాఠకమహాశయులారా! చూచితిరా, భారతీయులు వలస రాజ్యముల బడుచున్న దురవస్థలు! సర్వేశ్వరుడు వీరికష్టములు గట్టెక్కునట్లు జేయుగాక!

---

## ముద్దరాలు

గున్నేపల్లి మృత్యుంజయకవి గారు

వలపు గేదంగి రేకులు గేలఁ గీలించి జొల్లెమ్ముపైఁ గూర్చు సుదతి కైన
మినుకుఁగాటుక వ్రేలికొన నప్పళించి వాల్గనుఱెప్పలను దిద్దు లలన కైన
గొనబు కుంకుమ నఖాంకురమందు నిఱికించి నుదుట నామముఁ దీర్చు ముదిత కైనఁ
గమ్మకస్తురిఁదూలికను మేళగించి చెక్కులఁజిత్తరువు వ్రాయు కలికి కైనఁ
దళుకుఁ దెలనాకుమడుపు లంగుళుల నించి-చేతి కందిచ్చు చెలి కైనఁ జిత్తమందుఁ
గలుగు నుత్తలపాటింతె-దెలియఁ జేయు-దాఁతు నునుసిగ్గునను ముద్దరాలుగాదె!



# అనపోత నాయకుఁడు

(రక్తాంజలి)

శ్రీ శేషాద్రిరమణ కవులు

వెలమవీరులలో రేచెర్లగోత్రీయులు సుప్రసిద్ధులు. చిరకాలము రేచర్లగోత్రీయులగు వెలమవీరులు కాకతీయసామ్రాజ్యపతాకచ్ఛాయను నివసించి, తద్విజయములకు నిరవకుంఠముగఁ బాటుపడి సుప్రసిద్ధులైరి. దేశమునం దైకమత్యము చెడి ఆంధ్రసామ్రాజ్యము పతనమొందినపిమ్మట నాంధ్రత్వము నిలువఁ బెట్టిన మహావీరాధివీరుఁడు ఈయనపోత నాయకుఁడు. ఈమహామహుని జీవితచరిత్రమునందు సుప్రసిద్ధవీరరసఘట్టమగు రక్తాంజలియను ప్రకరణము చరిత్రాభిరతుల కెఱుంగించుచున్నారము.

అనపోత నాయకుఁడు రేచెర్ల సింగమనాయని కుమారుఁడు. సింగమనాయఁడు కాకతీయద్వితీయ ప్రతాపరుద్రునియొద్ద సేనానాయకుఁడుగా నుండెను. కాకతీయసామ్రాజ్య మనఁబడు ఆంధ్ర సామ్రాజ్యము పతనమైనంతన సింగమనాయకుఁడు తనక్రిందనున్న సేనతో దేవరకొండ, రాచకొండ లోనగుదుర్గములను స్వాధీనపఱచి కొని ఛిన్నభిన్నమైన యాంధ్రసామ్రాజ్యమును బునరుద్ధరింపవలయునని స్వతంత్రపతాకము దాల్చి తక్కినదుర్గముల లోఁబఱచికొన బయలువెడలెను. కాకతీయసామ్రాజ్యమునకు సంబంధించిన సేనానాయకులు తమస్వాధీనమునందున్న దుర్గములకుఁ దా మధినాయకులై సింగమనాయకుని కంకితులగుటకు నిరాకరించుటచేఁ బలుతావుల సింగమనాయకుఁడు భయంకరసంగ్రామములకుఁ బాల్పడక తప్పదయ్యెను. సింగమనాయకుఁడు సహజముగ వీరమూర్తియుఁ బరాక్రమశాలియే కాక యమితసైన్యసహాయము గలవాఁడగుటచేఁ బలువురు లోఁబడి సామంతులైరి. ఒక్కమాఱు సింగమనాయఁడు జల్లిపల్లి దుర్గమును ముట్టడించుటకు వచ్చి గ్రామమునకు బయట దండువిడిసి యుండెను. జల్లిపల్లిదుర్గమునందున్న క్షత్రియవీరులు సింగమనాయని బావమఱఁదియగు చింతపల్లిసింగమనాయని మాయోపాయములచే మోసగించి కొనిపోయి కారాగృహమునందు బంధించిరి. సింగమనాయకుఁడీవార్త విని జల్లిపల్లిదుర్గము భేదింప సంగ్రామభేరి వేయించెను. జల్లిపల్లెలోని రాచబంటులు రాజులు భయపడి రాజీచేయుటకని పేరుపెట్టి రాయబారిగా తమ్మిశబ్రహ్మక్షత్రియనువానిని సంధికిఁ బంపిరి. తమ్మిశబ్రహ్మక్షత్రి మిగుల వినయవిధేయతలతో సింగమనాయకుని సమీపించి రాజకీయవ్యవహారములు మాటలాడుచు నమ్మిక కలుగఁజేసికొని జల్లిపల్లిదుర్గమును విడిచిపెట్టి పొండని వేఁడుకొనువానివలె సింగమనాయనిపాదములచెంతకు వచ్చి హఠాత్తుగా మొలలోని చురియతో సింగమనాయకుని రొమ్ములో నొకపోటు పొడిచి పాఱిపోయెను. హంతకుఁడు పాఱిపోయినంతన యీఘోరవార్త శిబిరమునం దంతటను నిముసములో వ్యాపించెను. ఆక్రందనధ్వనులతో నందఱు సింగమనాయని చుట్టుముట్టిరి. ఈవార్త వినినంతన సింగమనాయకుని కొమారులగు అనపోతనాయకుఁడు, మాదానాయకుఁడు తండ్రిని సమీపించి దీనవదనులై నిలువఁబడిరి. సింగమనాయఁడు బాధను సహింపఁజాలక 'కుమారులారా! నన్నిటుల ఘోరహత్య గావింపఁజేసిన జల్లిపల్లిరాచవారిని దెగటార్చి తద్రక్తముతో నాకుఁ దిలతర్పణాదికములు గావింపఁగాని నాయాత్మకు శాంతి కలుగదని కత్తిని బెఱుకుఁడని తెల్పెను. కుమారు లిరువురు పితాజ్ఞ నిర్వర్తింప బాసగావించి వెంటనె చురియను దీసిరి. సింగమనాయకుఁడు వీరమరణము నొందెను. అనపోతనాయకుఁడు పితృసందేశమును దీర్ప "రక్తాంజలి" దీక్షవహించిన కథాంశ మిది.

అనపోతనాయకుఁడు మాదానాయకుఁడు సోదరులు. వీరు రక్తాంజలితోఁ బితృతర్పణాదులు గావించిన కాలము నిర్ణయింపఁ దగిన యాధారములు గానరావు. అనపోతనాయకుఁడు రాజరక్తమునఁ బితృతర్పణాదు లొనరించి సోమకులపరశురామబిరుదమును గడించెను. ఈబిరుదము మాదానాయకుఁడు గూడ వహించినట్లు శాసనాంతరములలోఁ గలదు. కాని, ఇందుఁ బ్రధానకార్యకర్త అనపోతనాయకుఁడె. మాదానాయకుఁడు సహాయకారి. అనపోతనాయకునకుఁ గల సోమకుల పరశురామబిరుదము దెలుపు చరిత్రసాధనములఁ దెలిసికొందము.

* శ్లో. ముని రజని పరశురామః స్థానే వినియుజ్య వైష్ణవం తేజః,
సోమకులపరశురామే ధరా మవ త్యన్నపోత నృపతిః.

.................................................

* తా. మునియగు పరశురాముఁడు తన వైష్ణవతేజమును సోమకుల పరశురామునియందు నెలకొల్పెను. అతఁడే అనపోతనాయఁడై భూమియందు జనించెను.—అయ్యవలోలు శాసనము. చూ.

"సోమకులపరశురామాది జగత్ప్రసిద్ధబిరుద నామధేయప్రశస్తి సహితులైన.........అనపోతనాయనింగారు శా. శ. ౧౨౯౧ సం. అయ్యనవోలు అనపోతనాయని శిలాశాసనము."

ఈసోమకులపరశురామబిరుదము అనపోతనాయకుని రాచకొండ లోని శాసనము లన్నింటిలో, అనఁగా శా.శ. ౧౨౮౭ భైరవుని చెంతి శాసనము,౧౨౮౯ ఆంజనేయునిచెంత శాసనము,౧౩౦౦వినాయకుని చెంతశాసనము,౧౩౦౨గన్నేర్ల భైరవునిచెంతశాసనము,౧౨౮౯భైరవ గండిశాసనము—వీనియందుఁ గలదు. మాదానాయకుని (మాదవనాయకుని) ఉమామహేశ్వరశాసనములో సోమకులపరశురామబిరుదము గలదు. సర్వజ్ఞసింగభూపాలుఁడు రచించిన రసార్ణవసుధాకరమను నలంకారశాస్త్రమునందు అనపోతనాయకుని వర్ణించుచు

"సోమకులపరశురామే భుజబలభీమేఽధిభూమి గోపాలే,
యత్ర చ జాగ్రతి శాస్తరి జగతాం జాగర్తి నిత్యకల్యాణమ్."

అని సోమకులపరశురామబిరుదమును బ్రశంసించియున్నాఁడు. ఈవిధ ముగ శాసనములయందు గ్రంథాంతరములందున్న అనపోతనాయకుని సోమకులపరశురామబిరుదము నాధారముగాఁ గొని యాతని విజయ యాత్రాకథారాజమును సేకరించుదము.

అనపోతనాయకుఁడు మాదానాయకుఁడు బాలురైనను తండ్రియగు సింగమనాయని ఘోరమరణవార్త నాలించినంతన నిలచి చీలిపోయిన సైన్యమునంతయు గూడఁ దీసికొని మాటపలుకు బడిచేతను, మొగమోటముచేతను నసంఖ్యాక సైన్యమును జతపఱచి కొని పితృశాక్షి నిర్వర్తించుటకు జల్లిపల్లిదుర్గమును ముట్టడింప మహోత్సాహములో బయలువెడలిరి. వీరివెంట నడచిన సైన్యమునందు కాల్బంట్లు ౬౦,౦౦౦, అశ్వికులు ౨౦,౦౦౦, ఏనుగులు ౮,౦౦౦, సేనానాయకులు ౧౧,౦౦౦ మంది గలరని బిరుదగద్యము లందును జాటువులందును గలదు. ఇందలిసంఖ్య యతిశయోక్తియని త్రోసి వేయ వీలులేదు. సింగమనాయకుఁడు, ప్రతాపరుద్రుఁడు చెఱఁ గొనఁబడిన పిమ్మట ముఖ్యములగు దుర్గములను స్వాధీనపఱచికొని, యందలి సైన్యమునంతయు వశపఱచికొనెను. ప్రతాపరుద్రుని స్వాధీనమునందుఁ దొమ్మిదిలక్షలసైనికు లుండిరని చరిత్రగ్రంథము లందును, ఇతరగ్రంథములందును జెప్పఁబడుటచే నంతయో తక్కువయగు నీసైన్యము అనపోతనాయకుని స్వాధీనమునం దుండె ననుటలో నాశ్చర్య ముండదు. జల్లిపల్లి ముట్టడింపనేతెంచు వెలమ వీరులసైన్యంబు నెదిరింప రాచబలము మితిలేనిసైన్యమును సమకూర్చుకొని మొదలుతారుదుర్గము చెంగటనున్న చెంతెర్ల చెంత నెదిరించెను. వెలమ సైన్యము చెక్కుచెదరని పట్టుదలతో రాచబలముపైఁ బడి ఘోర సమరము గావించెను. జల్లిపల్లిదుర్గము నాకాలమున చాళుక్యులు పాలించుచుండిరి. పొలతారు, వినుకొండ, కుంట్లూరు, అరవపల్లి, త్రిపురాంతకము, కోలనుపాక?, ... ఈ ... రామగిరి లోనగుదుర్గాధీశ్వరులు,

రెడ్డివీరులు, కమ్మవీరులు లోనగువారు సైన్యములో చాళుక్యబలమునకు సహాయపడిరి. మిగుల భయంకరసంగరము చిరకాలము జరిగెను. రామలక్ష్మణులవలె వెలమసోదరులగు అనపోతనాయకుఁడు, మాదానాయకుఁడు ముందునిల్చి సేనల ప్రోత్సహించి విరోధిసేనలపైకిఁ బంపవారును భయంకరముగ సమరమొనర్చి విరోధిసైన్యమును పంచబంగాళము గావించిరి. సైనికులనాశనమును జూచినంతన రాచకొలపువీరు లందఱు వెనుకడుగువైచి ప్రాణభయముచేఁ జెంతెర్లదుర్గముఁజేరి తల దాచుకొనిరి. వీరసోదరు లంతలోఁ బోక సైన్యములో చెంతెర్లదుర్గమును దీవ్రతరముగాఁ గొన్నిదినములు ముట్టడించి లోని కాహారవస్తువులు, ఇతరసహాయము చేకూరకుండ నాటంకపఱచి కోటయంతయుఁ బగులఁగొట్టి దుర్గమును భేదించి యందలి రాజబృందము నంతయుఁ బట్టుకొనిరి. బంధితు లగు వీరులలో, పంటముమ్మడి, పంటమైలారురాజులును, ఉద్దండమండలేశ్వరుఁడు, సత్యకదేవుఁడు, కన్నడదేవుఁడు, ఉదయదేవుఁడు, కర్కశదేవుఁడు లోనగు చంద్రవంశక్షత్రియులు కొత్తకొండారెడ్డి, కొట్టూరి మారారెడ్డి, నారనగిరి నారారెడ్డి లోనగు రెడ్డివీరులు గలరు. అనపోతనాయకుఁడు విరోధుల నందఱ సంహరింప సైనికుల కాజ్ఞయొసంగి పితృమారకులగు జల్లిపల్లి చంద్రవంశక్షత్రియుల నందఱఁ గొని తెప్పించి వారల స్వయముగాఁ దాను ఖండించి రక్తము బానలనిండఁ బట్టి తండ్రికి విధ్యుక్తముగా రక్తాంజలితోఁ దర్పణాదుల నొసంగి యంతతోఁ బరితృప్తి నొందక వధ్యులగు రాజులమేను లోఁచిపించి మాంసములు వండించి కళేబరములు కొయ్యగానుగలలో నాడించి రసముదీసి అన్నపురాశిపైఁ బోసి భూతప్రేతపిశాచాదులకు బలియొసంగెను. ఈవీరరణవిజయానంతరము అనపోతనాయకుఁడు, మాదానాయకుఁడు "సోమకులపరశురామ" బిరుదమును వహించి వీరాధివీరులని ప్రఖ్యాతిఁబడసిరి. ఈవిజయమేసంవత్సరమున లభించినదో గుర్తింపఁదగు నాధారములు లేవు. ఈబిరుదము అనపోతనాయకుఁడు వహించినట్లు దెలుపుశాసనములలో శా. శ.౧౨౯౧ సంవత్సరమునకు సరియగు క్రీ. శ. ౧౩౬౯ లోని రాచకొండ రామాలయమునకుఁ జెంతనున్న శాసనమే మొదటిది.

అనపోతనాయకుఁడు క్షత్రియవీరులనుజయించి మిగులభయంకరముగా క్షత్రియరక్తములోఁ బితృతర్పణాదులు నెరవేర్చుటవలన జాతిశేషులగు క్షత్రియులకుఁ దక్కుంగలజాలకు మిగుల నవమానకరముగా నుండెను. అనపోతనాయకుఁ డింకఁ దన కెదురులేదని దేశమునంతయు నాక్రమించుకొనుటకుఁ గ్రొత్తసైన్యములను జేర్చికొని పెక్కుచోటులకు దండయాత్రల కేఁగుచు "సోమకులపరశురామబిరుదము"ను శాసనములం దన్నింటనో చెక్కించెను. రాచవారిది యవమానముగా భావించి యనపోతనాయకు నెదిరించి పోరాడించి జల్లిపల్లి రాచవారిపేరిట అనపోతనాయకుని రక్తములోఁ దిరుగ రక్తతర్పణాదు లొసంగి వీరమరణమొందిన క్షత్రియవీరుల కాత్మశాంతి గూర్పవలయునని తీవ్రయత్నములుచేసి ఫలము నభివృద్ధిపఱచికొనిరి. రాజనరే

భూపతులగు క్షత్త్రియవీరులు మానుకోటకుసమీపమునందున్న ఇనగుర్తి చెంత నొకకోటఁగట్టి యందు సురక్షితులైయుండి అనపోతనాయకుని సంగరమునకు రమ్మని వార్త నంపిరి. అనపోతనాయకుఁడు అందందున్న బలముల నన్నింటిని జతచేసికొని నియతకాలమునకు ఇనుగుర్తిదుర్గమును సమీపించెను. పరిమితసేనతో మాదానాయకుఁ డన్నయగు ననపోతనాయకుని గలసికొని సంగరాభిముఖుఁ డయ్యెను. ఇనుగుర్తికోటలో కొండ రాఘవరాజు, జగ్గరాజు, గోవిందరాజు, గోపరాజు, తిరుమల పోలరాజు, శ్రీపతిరాజు, మల్లదేవరాజు, కనకరాజు, బాలదేవళరాజు, చినలక్కరాజు, శ్రీనాథగౌతమీభూనాథరాజు మున్నగు క్షత్త్రియవీరశిరోమణులు ౨ లక్షల 60 వేల దళమును సమకూర్చుకొని అనపోతనాయకుని సైన్యము నెదిరించిరి. మిగుల భయంకరముగా నెడతెగక కొన్నిమాసములు సంగరము జరిగెను. ఉభయసైన్యములు తీసిపోనిధీరమునఁ జిరకాలము యుద్ధముచేసినను జయాపజయములు తేలవయ్యెను. అనపోతనాయకుఁడు, మాదానాయకుఁడు సేనల నడిపించుచు ముం దినుగుర్తికోటను బగులగొట్టింప నారంభించిరి. సైన్యములోఁ బడియుంటచేఁ గోట భేదించుచుండిరని లోనిక్షత్త్రియవీరులందఱు మాఱుత్రోవను గోట వదలిపోవుటచే వెలమవీరు లాక్షత్త్రియకుమారులను బంధించిరి. తమభూపాలకులు బద్ధులైరని విన్నంతన రాచభోజు లన్నియుఁ జెల్లాచెదరై నలుదిక్కులకుఁ జెదరిపోయెను. మాదానాయకుఁడు సేనవెంటఁగొని పాఱిపోవు క్షత్త్రియసైన్యము వంతయు బలిగొనెను. అనపోతనాయకుఁడు చిక్కినరాజుల నందఱిని చెంతనున్న గుండ్లచెఱువు చెంగటికిఁ గొనిపోయి శిరస్త్రాణసహితముగా ఖండించి రక్తవాహినిలో స్నానముచేసి నాఁటియాగ్రహావేశమును జల్లార్చుకొనెను. క్షత్త్రియవీరులయొక్కయు క్షత్త్రియసైనికులయొక్కయు అద్వితీయపరాక్రమజీవితమునకు స్థానికు లత్యాశ్చర్యము నొంది వీరమరణమొందినవా రందఱి పేరట వారివారి యాకారవేషభావల కనుకూలములగు విగ్రహములను చెక్కించి ప్రాతించి జ్ఞాపకార్థము ప్రతిసంవత్సరము ఉత్సవములు చేయించుచున్నారు. ఈవిగ్రహములు నేటికిని దర్శనీయముగ ఇనగుర్తిచెఱువుచెంగట నలరారుచున్నవి. అనపోతనాయకుఁ డీసంగర మేకాలమున నొనరించెనో, జల్లిపల్లియుద్ధమునకు ఈయుద్ధమునకు మధ్య నెంతకాలవిలంబము గలదో యెఱుంగనగు నాధారములు లేవు. ఇనుగుర్తియందును నాఁటిరాజులశాసనములుగాని, చరిత్రగ్రంథములుగాని లభించుట లేదు. మృతవీరుల స్మరణచిహ్నములగు వీరవిగ్రహములు, వీరరంగమని ప్రశంసగని రక్తప్రవాహములతో నిండిపోయిన పాడుపడిన కోటయు మాత్రము నేఁటికి దర్శనీయముగ నున్నవి. పల్లెవాండ్రు, శారదకాండ్రను కథకులు, పంబలవాండ్రు,పాడు పాటలలో క్షత్త్రియవీరులపరాక్రమజీవితము లిమిడియున్న వనిమాత్రము కొందఱు చెప్పియున్నారు. అవకాశమువెంట వానిని సేకరించుటకు మృతవీరుల చిత్రముల ప్రతిబింబములఁ దీయుటకుఁగూడఁ బ్రయత్నింప వలసియున్నది. మంచెళ్ల కృష్ణకవి నాఁటియనపోతనాయకుని రక్తతర్పణాదికథను జ్ఞాపకముంచికొని కాఁబోలు వెలుగోటి తిమ్మభూపాలునిఁ బ్రశంసించుతఱి నిటులు చెప్పియున్నాఁడు:

సీ. మదవద్విరోధుల మెదడు బోనము చేసి
ప్రత్యర్థి దంతముల్ పప్పు చేసి
కుటిలారిమాంసముల్ కూరగాయలు చేసి
వైరికండలు పిండివంట చేసి
ఉగ్రాహితుల గుండె లూరగాయలు చేసి
శత్రుబాహులను బచ్చళ్లు చేసి
అరిరాజరక్తంబు నానబాలుగఁ జేసి
నిష్ఠురారులక్రొవ్వు నెయ్యిచేసి
మెనసి నీఖడ్గభేతాళముఖ్యులకును
విందుఁ జేతువు సంగ్రామవీథులందు

*　*　*　*

అనపోతనాయకునిజీవితకాలము క్రీ. శ. ౧౩౪౪–౧౩౮౦ అని చరిత్రకారులు నిర్ధారణ మొనరించి యున్నారు. క్రీ. శ. ౧౩౨౩లో కాకతీయప్రతాపరుద్రుఁడు ఢిల్లీకిఁ గొంపోఁబడెను. సింగమనాయకుఁ డదిమొదలు స్వతంత్రరాజ్యస్థాపనమునకుఁ బాటుపడెను. సింగమనాయఁడు హత్యకు లోనగునప్పటికి అనపోతనాయకుఁడు మాదానాయకుఁడు ప్రాథవయస్కులుగామి జన్మకాలనిర్ణయము సందర్భశుద్ధిగా నే యున్నది. కాని అనపోతనాయకుని యంత్యము క్రీ. శ. 1380 అని మాత్రము విశ్వసింప వీలుగాదు. రాచకొండ గస్నేర్లభైరవునియొద్దఁగలఅనపోతనాయకునిశాసనము శా.శ.౧౩౦౨ సరియగు క్రీ. శ. ౧౩౮౦ లోనిది. ఇదియే యితనిశాసనములందు లభించినంతటిలోఁ గడపటిది. ఇంకను బరిశోధనము జరుగవలసియున్నది గావునను, ఇతనికుమారుఁడగు సర్వజ్ఞసింగభూపాలుఁడు రాజ్యమునకు వచ్చుట కింకఁ గొంతవ్యవధి గలదు గావునను, అనపోతభూపాలుఁడు క్రీ. శ. 1380లో మరణించె ననుటకుఁ బ్రబలాధారము లేదు గావునను అనపోతనాయకుని నిధనకాలమునుగూర్చి నిర్ణయము జరుగుట కింకను బరిశోధన మావశ్యకమై యున్నది.

అనపోతనాయకుని రాజధాని రాచకొండ. ఇది దర్శనీయమగు దుర్గరాజము. ఇది నిజామురాష్ట్రములోనున్న నల్లగొండకు ౨౫ మైళ్ల దూరములో నున్నది. హైదరాబాదునకు భువనగిరికి ౩౦ మైళ్ల దూరములో నున్నది. అనపోతనాయకుఁడు తాను రాచకొండఁ బాలించుచున్నానని రాచకొండలోని నాలుగుశాసనములలోఁ జెప్పుకొనుటయే కాక రాచకొండలోని రెండుకొండలపైనను దుర్గాదికములు బలపఱచితి ననియు అనపోతసముద్ర మని యొకతటాకమును నిర్మించితి ననియుఁ గూడఁ జెప్పుకొనియున్నాఁడు. అనపోతనాయకుని రాచకొండ నివాసత్వమును ఇతనికుమారుఁడగు సర్వజ్ఞసింగ

భూపాలుఁడు తన రసార్ణవసుధాకరమున నిట్లు ప్రశంసించి యున్నాఁడు:

"శ్లో. రాజా చ రాజాచలనామధేయా-
మధ్యాస్త వంశక్రమరాజధానీమ్;
సతాం చ రక్షా మసతాం చ శిక్షాం
న్యాయానురోధా దనుసంధధానః."

రాచకొండ, నాగానాయనికొండ యను రెండు శైలములకు బలవంతములగు కోటగోడలు కట్టఁబడెను. మధ్య రాచకొండనగరమున్నది. ఆనాఁటి వ్యూహనిర్మాణము, రాజభవనములు, శిబిరములు, దుర్గవిధము పరిశోధింపఁ దలంచిన యీ రెండుదుర్గములందు ననువగు చరిత్రాంశము లలభింపఁగలవు. రాచకొండ వంశక్రమరాజధానియని అనపోతనాయకుఁడు చెప్పికొనియున్నాఁడు. కాకతీయసామ్రాజ్యసేనాధిపతులై అనపోతనాయకుని పూర్వులు రాచకొండదుర్గమునం దుండి సామ్రాజ్యక్షేమము లరయువా రనియు, సింగమనాయనికాలమునుండి స్వతంత్రదుర్గ మయ్యె ననియు, అనపోతనాయకుఁడు శిథిలభాగములు బలపఱచి రాజ్యము వృద్ధిచేసికొని రాజధానీనగరముఁ గావించుకొనె ననియు విశ్వసింపవచ్చును. ఇతనిసోదరుఁడగు మాదానాయకుఁడు కొలఁదికాలమున కచటికి ముప్పది మైళ్లదూరమున నున్న దేవరకొండచేరి యటప్రత్యేకదుర్గ రాజును నొక దానిని నిర్మించి భిన్న రాజ్యమును బాలింపుచుండెను.

అయ్యనవోలు మైలారుగుడిలోని శాసనమునందు తాను ఓరుగల్లు, శ్రీభువనగిరి, రాచకొండ, సింగాపురము దుర్గముల కధిపతి ననియు దిగ్విజయయాత్రాసందర్భమున శా. శ. ౧౨౯౧, క్రీ.శ. ౧౩౬౯ లో అయ్యనవోలను గ్రామము నొసంగితి ననియు అనపోతనాయకుఁడు వ్రాయించికొనెను. ఈయనరాజ్యవిస్తృతి నెఱుంగుట కింతకంటె సాధారములు గానరావు. నిజాము రాష్ట్రములోని యాంధ్రదేశమంతయు ననపోతనాయకుఁడు స్వాధీనపఱచికొని నిరంకుశముగా రాజ్యము పాలించెనని చెప్పవచ్చును. నిజాము రాష్ట్రములోని సుప్రసిద్ధములగు కంభముమెట్టు, ఉర్లగొండ, నల్లగొండ, పానుగల్లు, దేవరకొండ, భువనగిరి, గోలకొండ, మెదకు, కనకగిరి, అనంతగిరి, రామగిరి, లోనగుదుర్గము లన్నియు అనపోతనాయకుని హస్తగత మయ్యెను. మధ్యనున్న రాచకొండ రాజధానిగఁ జేసికొనెను.

అనపోతనాయకుఁడు కేవలవీరుఁడే కాని విద్వాంసుఁడని కాని, కవుల నాదరించినవాఁడని కాని చెప్పుట కాధారములు గానరావు. సర్వజ్ఞ సింగభూపాలుఁ డీతనిని తండ్రియగుటచేఁ బలుతావులఁ బ్రశంసించి రసార్ణవసుధాకరమునం దుదాహరణము లొసంగెను గాని యందుఁ జరిత్రాంశములు గానరావు. రసార్ణవసుధాకరములోని యొకానొక* శ్లోకమువలన అనపోతనాయకుఁడు శ్రీశైలమునకు సోపానములు గట్టి సర్వజనగమ్య మొనరించినట్లు కలదు. అనపోతనాయకుఁడు, మాధవనాయకుఁడు కృష్ణ కీవలిభాగమును బాలించుచుంటి అద్దంకి, కొండవీడు లోనగు దుర్గముల లోఁగొని వేమారెడ్డియు అతనికుమారుఁడగు అనపోతారెడ్డియు పాలించుచుండిరి. సింగమనాయనికి, వేమారెడ్డికి, అనపోతనాయకునకు, అనపోతారెడ్డికి సంగరములు జరిగినట్లు బిరుదధారణములలో నొకరిని మించి యొకరు దానములలో నొకరిని మించి యొకరు ప్రయత్నములు గావించినట్లు తెలిసికొన నవకాశములు గలవు. రెడ్డివీరులు గుంటూరుప్రాంతముల నుండిపోవు యాత్రికుల కనుకూలముగ శ్రీశైలమునకు మెట్లుగట్ట పోటీగా వెలమవీరులు దేవరకొండప్రాంతములనుండి పోవుభక్తుల కనుకూలముగ మెట్లు గట్టిరి. వారును వీరు హేమాద్రిప్రోక్తదానముల నిర్వర్తించితి మని చెప్పికొనిరి. అనపోతనాయకుఁడు కృష్ణదాటి సైన్యసహితముగాఁ బలుమాఱు ధరణికోటప్రాంతములకు దండయాత్రకు వచ్చి ఆప్రాంతములఁ బాలించు ధనంజయగోత్రులగు రాచవారితోను వారికి బాసటగావచ్చిన అనపోతారెడ్డితోను బలుమాఱు పోరాడినట్లు చరిత్రగ్రంథములవలనఁ దెలియుచున్నది. రాముఁడు పరశురాముఁడు వలె అనపోతానాయకుఁడు అనపోతారెడ్డి పరస్పర జిగీషువులై చిరకాలము సంగ్రామములతోఁ గాలయాపనము గావించుటచే యవననృపులు అనపోతనృపాలుని స్వాధీనములో నున్న దుర్గములలోఁ గొన్నింటి లోఁగొనిరి. క్రమముగాఁ దరతరములు విరోధము రెడ్డివారికి వెలమవారికి అభివృద్ధిలోనికి వచ్చెను. అనపోతనాయకుని యనంతరము సర్వజ్ఞసింగభూపాలుఁడు రాచకొండదుర్గమును చిరకాలము పాలించి శ్రీనాథమహాకవి, బమ్మెరపోతరాజు లోనగు విద్వత్కవులకు నాశ్రయుఁడై యనేకగ్రంథముల రచించుటకుఁ బ్రోత్సహించుటయే కాక తానుగూడ నుత్తమగ్రంథముల రచించెను. అనపోతనాయకుని యనంతరము నూఱు నూటయిరువది సంవత్సరములవఱకు రాచకొండ వెలమవీరులగు రేచర్లగోత్రీయులకు రాజధానిగ నుండెను. అనపోతనాయకుని పరాక్రమాతిశయమును దెలుపు చాటుపద్యముల నొక్కటినిమాత్ర ముదాహరించి వీరాగ్రవీరుఁడు, పరాక్రమశాలి, శూరవతంసము నగు నామహామహుని జీవిత చరిత్రమునకు శాంతి చెప్పుచున్నారము:—

"సీ. అశ్వరేవంతుండు హయమును నెక్కిన
దండిరాజులగుండె ల్దిల్లదిల్లు
జరిని దద్భీకరకరవాలహతికిని
కర్ణాటసేనలు గళవళించు
సంగ్రామపార్థుని చాపటాంకృతులకుఁ
దెలుఁగురాజ్యం బెల్ల దిగులుచెందు
ప్రధననిశ్శంకుని బల్లెంపు ఢాకకు
నుల్కుల్కిపడుచుండు నోడ్డెరాజు
లరసి తలఁచినవో నుండఁదరము గాక
సారిది సురరాజధానులు సొంపు దక్కి-
రోటమందిరి సిందూరికోటబయల
సన్నుతఖ్యాతి యనపోత మన్నె రాజు."

*"శ్లో. రాజాపి రాజాచలనామధేయా, మధ్యాస్త వంశక్రమరాజధానీమ్; సతాంచ రక్షా మసతాం చ శిక్షాం న్యాయానురోధా దనుసంధధానః."



వ్యాసకర్త

# సౌలభ్యము

వడ్లమూడి వేంకటరత్నము గారు

పరమమహర్షి శేఖరసభాస్థలి నుద్గతభక్తిభావనం
భరితశ్రుతిస్మృతిప్రతతి భావమునం దలపోయఁ బోక యే
మెఱుఁగని గోపబాలకుల యిండ్లకడం జరియించి సుద్దులన్
మురిసినట్టోతువౌ భువనమోహన! వింతలు నీదు చైదముల్.

ఉ. వేణువు కేలనూని వెనువెంటఁ జరింతు మరుల్కొనంగ నీ
జానపదాంగనాజనము, సారసవాస సదానురక్త యా
శ్రీనలినాయతాక్షి నడనేసి యిదేమి? కిశోరచేష్ట లౌ
నా నలినాక్ష! మేలు! రసికాగ్రణి వౌదు తలంచి చూడఁగన్.



ఉ. నందకుమార! గోపలలనాజన పుణ్యఫలస్వరూప! ఆ
నందనిధాన! వీడి యుల నందక కౌస్తుభ వైజయంతులన్
పెందమి నేల గైకొనఁగ? వేణుశిఖావలబర్హ భూష లే
యందములోటు; మమ్ములఁ గృతార్థులఁ జేయఁ దలంచి కాదొకో!

ఉ. వాసవశంకరాది సురవర్యులు భక్తినొసర్చు పూజలన్
వీసరపుచ్చి భోగవరవీన్ బరసీమయ నాఁటెలంగు నీ
వాసము వీడి పల్లియలవాసము చేయుచు నాలమందలన్
జోషణసేయుదో భువనపోషక, ప్రేమ! నదెంత ప్రేమయో!

ఉ. లోకములోపల న్మనుజలోకము కల్గినదాని జూడకే
ప్రాకృయులభ్యవస్తుతతివాంఛల గ్రుక్కలు మ్రింగుకొంచుఁ గ
ష్టాకులమానుగాని, కల యన్నిటివీడి పవిత్రప్రేమ న
స్తోకముదంబు నొందు నినుఁ జూడర దేమొకొ! నందనందనా!

---

# ప్రాచీన హిందూ గ్రామ పరిపాలనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

## గ్రామలక్షణము

ప్రజలందఱు పాశ్చాత్య దేశములలో వలెను, ఇప్పుడిప్పుడు మన హిందూదేశములో వలెను పట్టణములలోగాక పూర్వము పల్లెటూళ్లలోనే నివసించుచుండువారు. అప్పుడు మన మాతృదేశమైన భరతవర్షమంతయు గ్రామములలోనే మాటుమణగి యుండెడిది. ఫల సస్యసమృద్ధి గలిగి గోబ్రాహ్మణ సంభరితములై పూర్వము గ్రామములు విలసిల్లుచుండెడివి. ఇప్పటికివలె రాకపోకలకు అప్పుడు రైళ్లు, ఓడలు, మోటారు బండ్లు లేకపోయినను ఒకగ్రామము ఇంకొకగ్రామముమీద ఆధారపడియుండవలసిన అగత్యము లేకుండెను.


వ్యాసకర్త

"అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడతెగక పాఱునేఱును ద్విజుడుం
జొప్పడిన యూరనుండుము
చొప్పడకున్నట్టి యూరు సొరకుము సుమతీ!

* * * * * *

పురికిని ప్రాణము కోమటి
వరికిని ప్రాణంబు నీరు వసుమతిలోనం
గరికిని ప్రాణము తొండము
సిరికిని ప్రాణంబు మగువ సిద్ధము సుమతీ.

* * * * * *

వరిపంట లేనియూరును
దొరయుండనియూరు తోడుదొరకని తెరువున్
ధర నృపతిలేని గృహమును
నరయంగా రుద్రభూమి యనఁదగు సుమతీ."

అను నీ పద్యములలో గ్రామలక్షణములు చక్కఁగ వివరింపబడినవి. అప్పిచ్చువాడు, వైద్యుడు, ఎడతెగక ప్రవహించుఏఱు, బ్రాహ్మణుడు, కోమటి, వరిపంట, దొర— ఇవి ప్రతిగ్రామమునకు ముఖ్యముగనుండవలసినయంగులు. ఇవి లేని గ్రామము గ్రామముకాదు. అప్పిచ్చువాడు-ఇప్పటి బ్యాంకి నిర్వర్తించువిధులను నిర్వర్తించువాడు; వైద్యుడు-వైద్యముచేయువాడు;జీవనది, — ప్రతిగ్రామమునను ముఖ్యముగ నాలుగువర్ణములవారు నుండువారుగనుకను, వారిలో ద్విజులనబరగు బ్రాహ్మణ, క్షత్త్రియ, వైశ్యులు మువ్వురును కర్మప్రధానమైన మతము నవలంబించినవారు గనుకను వారికి ప్రవాహోదకము ప్రధానమైనది. ఆరోగ్యవిధులను బట్టిచూచినను ఇది అత్యవసరము;ద్విజుడు —బ్రాహ్మణుడు లేనిదే పూర్వము దినమే గడచెడిదికాదు. ఏరువాక కట్టవలసివచ్చినను, పశువులను పొలములో గట్టివేయవలసి వచ్చినను, గుమ్మమునకు పచ్చనితోరణము కట్టదలచినను, విత్తనములు చల్లవలసి వచ్చినను, ఇంతయేల? అశుభమునకుగాని, శుభమునకు గాని, పూర్వము బ్రాహ్మణుడే ఆధారభూతుడు. మంచిదెప్పుడో అతడు చూడవలెను; చెడ్డదెప్పుడో అతడు చెప్పవలెను; మంచినక్షత్ర మతడు కనుగొనవలెను; పాప ప్రాయశ్చిత్తమాతడు జరిగింపవలెను; పుణ్యాదములైన వ్రతము లాతడు చేయింపవలెను; ఇట్లు పూర్వము గ్రామశరీరమునకు బ్రాహ్మణుడే గుండెకాయ; గ్రామసంఘముయొక్క బుద్ధి

అతనినుండి వికసించి ప్రజ్వలించెడిది; గ్రామ సంఘమున కతనినుండి బలము కలిగెడిది; రాజుకాని రాజతడు. సన్న్యాసికాని సన్న్యాసియతడు. అంతటి ప్రాభవము గల వాడు: అంతటి నిస్సంగుడు. కోమటి—వ్యాపారమునకు మూలస్తంభమైనవాడతడు. పారిశ్రామిక ప్రవృత్తులు, వ్యావహారికపు చురుకుదనము ఇది యంతయు నాతనిది; ఐహికచక్రమును కుమ్మరిసారెవలె త్రిప్పువాడతడు; బ్రాహ్మణు డొకయొద్దుకాసిన కోమటి మరియొక యొద్దు కాయువాడు; ఇద్దరును గ్రామమునకు కావడికుండలవంటి వారు. గ్రామాధిపతి—గ్రామసంఘమున కేయాపదరాకుండ దానిని వేయికనులతో గనిపెట్టువాడు గ్రామాధిపతి. అతడే దొర ఊరికంతకు; రక్షణకాతడే యాశ్రయుడు. గ్రామభటులు ఎండతెన్నివిధముల బాటుపడుచు గ్రామస్వాతంత్ర్యమును పోషించుచున్నను, వైశ్యులు గ్రామసంపద కెంతపెంపు గూర్చుచుండినను, బ్రాహ్మణులు గ్రామము యొక్క సాంఘిక హృదయక్షేత్రము నెంతపవిత్రముగ నుంచుటకు బాటుపడుచుండినను చంద్రుడులేని రాత్రివలె దొరలేని యూరు శోభించెడిదికాదు. గ్రామదుర్గమును బరిరక్షించువాడు గ్రామాధిపతి. అతడు తన విశాలములైన రెండుచేతులను బారలుసాచి గ్రామము నదిమికొని కాపాడిననేకాని సంఘశరీరమునకు రక్షణయేది? ఎవరిపని పాటు లెవరు మానుకొనెదరు? ఎవరిపని యెవరు విడిచినను గ్రామజీవనము యొక్క పరిపూర్ణతకు కొఱంతయే. అందువలన గ్రామరక్షణభారము గ్రామాధిపతిపై బడెను. అతడే గ్రామరక్షకుడు. వరిపంట—ఇదియున్ననే కాని గ్రామము గ్రామమనిపించుకొనెడిదికాదు. గ్రామములో అవసరమైన భోజనసామగ్రియనుదానికి 'వరిపంట' అను పదమును ప్రతినిధిపదముగ గైకొనంజనును. ఆ యూరికి గావలసిన అగత్యములైన వస్తువులకొఱకు గ్రామస్థులు మఱియొక గ్రామముమీద నాధారపడియుండరాదు. అందువలన పూర్వము ఏగ్రామమున కాగ్రామమే స్వయం సమృద్ధి గల్గియుండెడిది (Self-Contained). అందువలన ఒకగ్రామము ఇంకొక గ్రామముమీద నాధారపడవలసిన అక్కరలేకుండెను. ఇప్పటివలె రైళ్లు మొదలగునవి లేక పోవుటవలన ఒకయూరిపంట ఇప్పటంత సులభముగ వందలకొలది, వేలకొలది మైళ్లదూరమున నున్నచోటికి బోవ నవకాశముండెడిదికాదు. అందువలన పంటసరకులకు ధర లేకుండెను. అది యటుండ ఏయూరివారికి ఆయూరిలోనే ఆయూరిపంట వినియోగపడుచుండెడిది. తమయూరిలో లేనిదియు, తమకు గావలసినదియునగు సరకేదైన నున్నచో గ్రామస్థులు తమయూరిలో నేపంట విస్తారముగ నుండునో దాని నిచ్చివేసి తమకు కావలసినసరకును పొరుగూరినుండి తెసికొనువారు. ఈవిధమున వర్తకవ్యాపారము జరుగుచుండెడిది.

ఆయగాండ్రు

ఇట్లుకాక దైనికకార్యములలో అవసరమైన పని పాటులు చేయుట కెవరెవరు అవసరమో వారందఱు కూడ గ్రామము నిర్మాణమగునప్పుడే యేర్పడువారు. వీరిని ఆయగాండ్రనువారు. ఆయగాండ్రనగా గ్రామముయొక్క ఆయమును, ఆర్థికసంపదను వృద్ధిచేయుటకును, గ్రామ కార్యనిర్వాహణమునకును ఏర్పడినవారు: పురోహితుడు, రెడ్డి, కరణము, కుమ్మరి, కమ్మరి, వడ్రంగి, చాకలి, మంగలి, తలారి, మాదిగ—వీరందఱిని ఆయగాండ్రందురు. ఆ యాగ్రామముల పరిస్థితుల ననుసరించి వీరియొక్క సంఖ్య ఒక్కొక్కగ్రామమున ఇంతకంటె ఎక్కువగనుండ వచ్చును. సాధారణముగ నీయాయగాండ్రసంఖ్య పండ్రెండు. ఒక్కొక్క గ్రామమునకు ఇంతకంటె తక్కువమందియు ఉండిన నుండవచ్చును. కాని సాధారణముగ పైని పేర్కొనబడిన వారుమాత్రము తప్పక యుండువారు. వీరుకాక అగసాలి, నీరుకట్టు, బారిక లేక చేనుకావలి, షరాబు-ఈ మొదలగువారుకూడ నుండువారు. చేలకు నీరు వంతుల ప్రకారమిచ్చుచుండుట,—ఒక్కొక్కరి వంతైన తరువాత మరియొకరికి వంతు ప్రకారము నీరిచ్చుట—ఈవిధమైనపని నీరుకట్టువానిది. చేలు పంటమీద నుండగా వాటిని కాపాడుపని బారికవానిది. గ్రామస్థుల నగలు నాణెములు చేయుపని అగసాలివానిది; తాకట్లమీద బదు

ల్లించుట, డబ్బు వడ్డీకి వేసి ప్రజలసొమ్ము దాచిపెట్టుట, వెండి, బంగారము, రత్నములు మొదలగువాని మంచిచెడ్డలను పరిశీలించి వానికితగిన విలువగట్టుట ఈ మొదలయినపనులు వారివి. ఇంక కొన్నిగ్రామములలో వీరుగాక అక్కడి అవసరములనుబట్టి మఱికొందఱుకూడ నుందురు. వీరిలో అందఱుకూడ నొక్క గ్రామమున నుండవచ్చును, ఉండక పోవచ్చును; కాని అచ్చటి యవసరములనుబట్టి కొందఱైన నుండవచ్చును. కొన్నికొన్నిచోట్ల పౌరాణికుడు, జ్యోతిషికుడు, వైద్యుడు వీరుకూడ ఆయగాండ్రలో చేర్పబడియున్నారు. వీరందఱును గ్రామసంఘముయొక్క భటులు; గ్రామసంఘమునకు బనిచేయవలసినవారు. అందువలన వీరికి గ్రామములో ఆయావృత్తులకై మాన్యము లేర్పడియుండెడివి. వాటికి 'భటవృత్తి మాన్యములనియు, జాతికట్టు మాన్యములనియు పేరు. ఆయావృత్తులకొఱకేర్పడిన మాన్యముల ననుభవించుచు ఆయగాండ్రు గ్రామసంఘమునకు సేవచేయువారు; కారెపుగుల్లలు, నాగళ్లు మొదలగునవి గ్రామస్థుల కింకను అవసరమైన యితరపనులు చేయుటకు వారికి వేఱె కూలియుండెడిది కాదు. వారిట్లు ప్రతిదినము గ్రామసంఘమునకు జేయుపనులకు ప్రతిఫలము మాన్యమే. వర్తనలనబడు మామూళ్లు కూడ నుండెడివి కాని వారికి ప్రధానముగ మాన్యమే గొప్ప ఆకర్షణ. అప్పుడు అర్థమునకు, ధనమునకు ప్రాధాన్యము లేకుండెను. ఇప్పటివలె ధనముపెట్టినను ఏవస్తువు కావలసిన నది సమకూడకుండెడిది. ఇప్పటివలె నాణెమున కప్పుడంతచలామణీ యుండెడిది కాదు. ధాన్యమే క్రయవిక్రయాదివ్యవహారములకు చేతులు మార్చుకొను ప్రధాన 'మూల్యము', 'నాణెము'గ నుండెడిది. అట్టి దినములలో మాన్యమున్న నెట్టి యాకర్షణ యుండియుండునో యూహింపవచ్చును. గ్రామసంఘమునకు గావలసిన వ్యవహారములను ఆయావృత్తి భటులు సరిగా నిర్వహించిననే కాని వారికి మాన్యమును అనుభవింప నధికారముండెడిది కాదు. ఈవిధమున గ్రామసంఘమునకు కావలసిన వ్యవహారములను నిర్వహించు సేవకుల పనిని పరిశీలించువారు, పరీక్షించువారు గ్రామస్థులు; అట్టి సేవకులను మాన్యముల ద్వారమున గాపాడువారు గ్రామస్థులు; వారు పనిని సరిగ నిర్వహింపకపోయిన మాన్యము ననుభవించు ననుభవాధికారమునకు ఆటంకము కల్పించి శిక్షించువారు గ్రామస్థులు. ఈరీతిని గ్రామభటుల శిక్షకులును వారే; రక్షకులును వారే. అందువలన గ్రామభటులు తమతమ వృత్తులను శ్రద్ధతోను, అడకువతోను జరుపుకొనుచుండువారు. గ్రామమున కేర్పడిన యీభటులతో గ్రామసంఘశరీరము సంపూర్ణమై సర్వాంగసుందరమై యొప్పుచుండెను. గ్రామసంఘమునకు వీరు కాలుచేతులవంటివారు. సంఘము వారి ద్వారముననే అభివృద్ధి నొందుచు సాగిపోవుచుండవలెను. ఏగ్రామమునకు గాని వీరు లేనిదే సంపూర్ణత్వములేదు; స్వతంత్రజీవనము లేదు. వీరి మూలముననే ఒకగ్రామము ఇతరగ్రామములమీద నాధారపడియుండవలసిన యావశ్యకత యుండెడిది కాదు. ఈవిధమున నేగ్రామమున కాగ్రామమే స్వయంసహాయము చేసికొనుచు, స్వతంత్రజీవనము గడపుకొనుచు, తనవ్యవహారములను దాను జక్కదిద్దుకొనుచు, కాలము గడపుకొనుచు వచ్చెను. ఇట్టి గ్రామములే పూర్వము స్వతంత్రరాజ్యములుగ నుండెడివి. మనదేశపరిపాలనా తంత్రము ఇట్టి గ్రామములనుండియే మొలకలెత్తినది. హిందూపరిపాలనామహావృక్షమునకు గ్రామమే కూకటివేరు. అందువలననే తమ బాగోగులు తాము విమర్శించుకొని తమకు గావలసిన అనుకూల్యములు తాము తెలిసికొని నిరాడంబరజీవితమునుబుచ్చు పల్లెటూరి ప్రజల మనస్సునుండియు, మేధస్సునుండియు నావిర్భవించినది గావుననే హిందూపరిపాలనా తంత్రమునకు పటాటోపములేదు; ఆడంబరములేదు; పల్లెటూరి రైతుయొక్క నిరాడంబరశోభయే దానికిని గలిగినది.

**అగ్రహారములు: గ్రామములు**

గ్రామపరిపాలనావిధానమును సుకరముగ తెలిసికొనుటకై గ్రామములను ముఖ్యముగ రెండు విధములుగ భావించు టొప్పగును: అగ్రహారములనియు, గ్రామము

లనియు. ఇంకను నివిగాక గ్రామములలో పెక్కు భేదములు కలవు. ఈభేదము లన్నియు గ్రామభోగములవలనను, పన్నులవలనను, జనసంఖ్యవలనను ఏర్పడినవే. ఈభేదములే గ్రామ పరిపాలనా విధానమున భేదము లేర్పడుటకు కారణభూతము లయ్యెను. గ్రామములలో నెన్ని భేదములున్నను ముఖ్యముగ పరిపాలనావిధానమున దమ శాశ్వతముద్రను ముద్రించినవి ఆరెండే: అగ్రహారము; గ్రామము.

అగ్రహారముకూడ గ్రామమే కాని గ్రామము మాత్రము అగ్రహారము కాకపోవచ్చును. బ్రాహ్మణులకు దానమొసంగబడినట్టి గ్రామములు అగ్రహారము లనబడును. అగ్రహారములలో నివసించువారు ఒక్క బ్రాహ్మణులే; అందితరవర్ణములవా రుండరాదు. అగ్రహారమున బ్రాహ్మణులకే కాని యితరులకు భూమి లేదు. అగ్రహారమనగా ప్రత్యేకము ఏ యితరవర్ణముల వారికి నివసించుటకుగాని, సేద్యము చేసికొనుటకు గాని తావులేని బ్రాహ్మణగ్రామము. అందువలన అగ్రహారము యొక్క వ్యవహారమంతయు ప్రత్యేకము బ్రాహ్మణుల యధీనమున నుండెడిది. ఈ యగ్రహారములు రాజుల చేతను, సామంతులచేతను దమ కాశ్రితులైన పెక్కుమంది బ్రాహ్మణులకు దాన మొసంగబడిన వగుటచేత నొక్కొక్క గ్రామమున పెక్కుమంది బ్రాహ్మణులకు వృత్తు లుండెడివి. వృత్తులనగా భాగములు. ఎవరెవరి కెన్నెన్ని వృత్తులో అగ్రహారమును దానము చేయునప్పుడు దాతయే నిర్ణయము చేయువాడు. అందువలన అగ్రహారీకులను లేక అగ్రహారందార్లను వృత్తిమంతు లనువారు. కొన్నికొన్ని ఏకభోగములైన యగ్రహారములునుగలవు: అనగా నాగ్రామము ఒక్కని యనుభవము క్రిందనే యుండెడిది. ఇతరవర్ణములవారి అవసరము లేకుండ ఈ బ్రాహ్మణులైన వృత్తిమంతులే గ్రామకార్యములను నిర్వహించుకొనువారు.

ఇక రెండవది గ్రామము. ఇందు బ్రాహ్మణులేకాక అష్టాదశవర్ణములవారుకూడ నుండువారు. మన హిందూ సాంఘిక పద్ధతి ప్రకారము వర్ణములు పదునెన్మిదియున్నను అవి యన్నియు చతుర్వర్ణములలోనికి దిగి పోవును. అందువలన నొక్కొక్క గ్రామమున నాలుగు వర్ణములవారును, ఈనాలుగువర్ణముల ప్రాకారములోనికి జేరని యితరులు నుండువారు. వీరిది పంచమ వర్ణము. గ్రామవ్యవహారమంతయు నీయైదువర్ణములవారి చేతులలో నుండెడిది. అగ్రహారములలో నైననుసరే, గ్రామములలో నైననుసరే కొందఱు ఒకసభగాగూడి వ్యవహారములను పరిష్కరించుచుండువారు.

సభలు: పంచాయతులు:

అగ్రహారమున నేర్పడినయట్టి సభకు సభయనియు, సభ్యులకు మహాజనులనియు, సభవారనియు పేరు; గ్రామమున నేర్పడినయట్టి సభకు పంచాయతీయని పేరు. 'సభ' లో నుండువారందఱు బ్రాహ్మణులే. 'పంచాయతీ' లో నుండువారు పంచవర్ణములకు ప్రతినిధులుగ నుండదగిన ప్రముఖులు. అందువలననే గ్రామసభకు పంచాయతీయని పేరు కలిగెను. ఈసభలమూలమున-అవి పంచాయతీలైన నేమి, సభలైన నేమి- గ్రామపరిపాలనమును ముఖ్యముగ నడపుకొనుచువచ్చినవారు ప్రజలే. ఏగ్రామములో నుండే యిబ్బందులు, ఏగ్రామమునకు గావలసిన సౌకర్యములు ఆ గ్రామవాసులకే బాగుగ తెలియగలవు. అందువలన గ్రామములు సుస్థితిలోనుండి ప్రజాభ్యుదయమునకు తోడ్పడుచుండెడివి. ఒకగ్రామమున నొకతటాకమును నిర్మించుకొనవలసి వచ్చినను, దేవాలయాదికములు బాగుచేయుంచుకొనవలసివచ్చినను, ఇంతయేల? గ్రామమొత్తమునకు సంఘమున కుపయోగముగనుండు ఏకార్యమైననుసరే-గ్రామస్థులే సభారూపమున జేరి ఉమ్మడిమీద జరుపుకొనువారు. రాజునకుగాని, రాజ ప్రతినిధికిగాని అర్జీలు లేవు; మహజర్లు లేవు. రాజునకు దెలియజేయకుండ స్థానికముగ దమకుగావలసిన సౌకర్యములు తాము చేసికొనుటకు హక్కుస్వాతంత్ర్యము లుండెడివి. వారు చేయు పౌరహిత కార్యములలో రాజు జోక్యము కలిగించుకొనెడివాడు కాడు. అతని కాగ్రామమునుండి చెల్లవలసిన

పన్ను చెల్లిన జాలును. అందువలన గ్రామహితకార్యము లకు రాజునుగాని, అతని ప్రతినిధులనుగాని యాచింపవల సిన అవసరముండెడిది కాదు.

ఈవిధమున జరుపవలసిన గ్రామహితకార్యములను జరుపుట, గ్రామములోని తగవులను పరిష్కారముచేసి న్యాయము నొసంగుట, గ్రామములోని దేవాలయాదులకు చేసిన దానధర్మములకు ధర్మకర్తలుగనుండి ఆయావ్యవ హారములను సరిగా నిర్వహించుట—ఈవిధమగు కార్య ములన్నియు పైనుడివిన సంఘములే—అవి పంచాయతీ లైననేమి, సభలైననేమి—జరుపుచుండెడివి. అందు వలన నిజముగా ప్రజాపరిపాలనమంతయు సంఘముల, సభల చేతులలోనుండెను. ఈసభలను గుఱించియు, పం చాయతీలను గుఱించియు ఇంతవఱకు దక్షిణహిందూదేశ మున కనుగొనబడిన శాసనములవలన పెక్కువిషయములు తెలియవచ్చుచున్నవి.

ఇట్టి సంఘములు, సభలు ఉత్తరహిందూస్థానమున గూడ నుండినట్లు చరిత్రమువలన దెలియవచ్చుచున్నది. కౌటిల్యుని యర్థశాస్త్రమున నిట్టి సభలను గుఱించి చాల విషయములు తెలుపబడి యున్నవి. కౌటిల్య డనునది చాణక్యునికి మాఱుపేరు. చాణక్యుడు నందచక్రవర్తి యొద్దనుండెడు రాక్షసు డనుపేరుగల మంత్రికి ప్రతిస్పర్థియై, నందునివలన దనకు జరిగిన పరాభవము నేవో పాటిగాఁగొని నందవంశమును నిర్మూలించుటకై ప్రతిన వట్టి, తనకార్యనిర్వహణమున విఘ్నకరములగు రాక్షస వ్యూహములను భేదించి, తన శపథమును నెఱవేర్చుకొని, నందుని యనంతరము రాజ్యలక్ష్మిని చంద్రగుప్తునికి కట్టి పెట్టి యాతనిని చక్రవర్తినింగావించిన నీతిజ్ఞుడు. ఇతడు తనకు బూర్వులు విరచించిన నీతి శాస్త్రములను బరిశీలించి, తనకాలము నందలి పరిస్థితుల ననుసరించి భవిష్యద్రాజులకు గూడ నుపయోగపడునట్లు నీతి యెట్లుండవలసినదియు నాలోచించి, తర్కించి నీతి శాస్త్రమును వ్రాసెను. పూర్వము నీతి యనగా రాజ నీతియే. దానికే అర్థశాస్త్రమనిపేరు. ఈగ్రంథమువలన చంద్రగుప్త చక్రవర్తికాలమున రాజ్యాంగవిధాన మెట్లుం డెనో తెలియుచున్నది. పరిపాలనాసౌష్ఠవమున కప్పుడైదు సంఘములు, సభలుండెడివనియు, ఒక్కొక్క సంఘము లేక సభ తనకు నిర్ణీతమైన వ్యవహారములను జక్కబెట్టు చుండెడిదనియు దెలియుచున్నది. అయితే ఇవియన్నియు రాజపరిపాలనమునకు సంబంధించిన యంగములు. గ్రామ ములకు నిట్టి సంఘము లుండెడివనియు, ఇట్టి సంఘము లలో గ్రామవృద్ధులు సభ్యులుగానుండి గ్రామవ్యవహార ములను చక్కబెట్టు వారనియు, వ్యవహారస్వభావమును బట్టి సంఘమున పేరిసంఖ్య హెచ్చుచు తగ్గుచు నుండెడి దనియు, ఇట్టి సంఘములందలి సభ్య లిప్పటిరీతిని ఎన్ను కొనబడినవారు కాకపోయి నప్పటికి ఒకవిధముగ వారు గ్రామస్థులచేత సంఘసభ్యులుగ నుండుటకు పేర్కొనబడు వారే యనియు, గ్రామసంఘమువారి తీర్పులలో భేదాభి ప్రాయమెప్పుడు నుండెడిది కాదనియు, అట్లు భేదాభి ప్రాయమే యుండునెడల అధికసంఖ్యాకుల యభిప్రాయ ప్రకారమే కార్యములు జరుగుచుండెడివనియు, ఈవిధ ముగ గ్రామమునకు సంబంధించిన పరిపాలనా వ్యవహార ములను, ధర్మనిర్ణయములను, గ్రామహితకార్యములను గ్రామస్థులే నిర్ణయించి నిర్వహించువారనియు అర్థశాస్త్ర మువలన మనకు దెలియవచ్చుచున్నది.

చాణక్యచంద్రగుప్తుల నాటినుండి చంద్రధ్వజుల పరిపాలనము ప్రారంభమగు వఱకును, కొంతకాలమువఱకు వారిపరిపాలనమున గూడ, నిట్టి గ్రామసంఘములుండెడివని, అవియే, గ్రామవ్యవహారములను చక్కదిద్దెడివని శాసనా ధారమువలన దెలియవచ్చుచున్నది. ఈరీతిని ఉత్తరహిం దూస్థానమునను, దక్షిణహిందూదేశమునను గూడ పరిపా లనము ప్రజాపరిపాలనమే యనియు, నది హిందూనీతిశా స్త్రసంప్రదాయసిద్ధముగ నుండెననియు దెలియగలదు. కాని దక్షిణ హిందూదేశములోకంటె ఉత్తరహిందూస్థాన మున నధికముగ సంభవించిన విపరీతరాజకీయ విప్లవముల మూలమున గావచ్చును, గ్రామసంస్థ లచట బిగువుసడలి, క్రమముగ జెడిపోయి విధ్వస్తములయ్యెను. దక్షిణహిందూ

దేశమున మహమ్మదీయ పరిపాలనము భూమిని బాగుగ పాదుకొని వేరు తన్నువఱకు రమారమి క్రీస్తు పుట్టిన పిదప పండ్రెండు పదమూడువందల సంవత్సరములవఱకు మంచి యభివృద్ధిలో నుండినట్లు ముఖ్యముగ మన చెన్న రాజధానియందలి దక్షిణభాగమున ప్రసిద్ధదేవాలయము లలో గానవగు శిలాశాసనాదులవలన దెలియుచున్నది.

మహాసభలు: సభలు: కార్యనిర్వాహకసభలు

'సభ'లను గూర్చిన కట్టుబాటులను దెలుపు శాసనములు చాలభాగము—సంపూర్తిగనే యనవగును—చోళులనాటివి. పరాంతకుడు, పరకేసరివర్మ, రాజేంద్రచోళుడు, రాజరాజు, వీరరాజేంద్రచోళుడు, కులోత్తుంగచోళుడు—ఈ మొదలగు చోళరాజుల కాలములో నిట్టి శాసనము లనేకములు గానవచ్చుచున్నవి. ఈ కట్టుబాటులను దెలుపు శాసనములన్నియు బ్రాహ్మణాగ్రహారములందలి సభలకు సంబంధించినవివరములను మాత్రమే తెలుపునని మనము జ్ఞాపక ముంచుకోవలయును. ఇట్టి శాసనములు దక్షిణమున అఱవదేశముననే కానవచ్చుటనుబట్టి యట్టిసభలు ఒక్క ద్రమిళదేశముననే కాని, మన తెలుగు దేశమున లేకుండెనని భావింప వీలులేదు. తెలుగుదేశపు బ్రాహ్మణాగ్రహారములందలి యిట్టి సంఘములను సభలనియు, సభ్యులను సభవారనియు, మహాజనులనియు వ్యవహరించుచు వచ్చిరని యీవరకే తెలుపబడినది. ఇట్లు సభవారిని, మహాజనులను బేర్కొనిన శాసనములు తెలుగుదేశమునను, కన్నడదేశమునను జాల గానవచ్చినవి. ఇట్టి సభలయందు వక్తృత్వ మవసరమని తెలుపుచు, అట్టి వక్తలను బేర్కొన్న తెలుగుదేశపు శాసనములును గలవు.

ఆయాగ్రామముల—అనగా నగ్రహారముల—విస్తీర్ణ వైశాల్యములను బట్టి గ్రామపరిపాలనము సుకరముగ సాగుటకై ప్రతిగ్రామమున ఇట్టిసభలు ఒకటికంటె నెక్కుడుగ నుండెడివి. పరిపాలనాసౌష్ఠవము కొఱకేర్పడిన యిట్టి సభలు ఒకటికంటె నెక్కువగ నుండినపుడు అట్టివానిలో నొకటి ప్రధానమైనదిగ నుండెడిది; దానికి మహాసభయని పేరు: మిగిలినవన్నియు దానికి లోబడిన యుపసంఘములు లేక యుపసభలు. ఈ యుపసంఘములు వేఱువేఱు విధములైన గ్రామవ్యవహారములను చక్కబెట్టుచుండెడివి. ఉక్కల్ శాసనములలో ఒక మహాసభకు లోబడిన నాలుగు సంఘములు పేర్కొనబడినవి. అవి యేవనగా (౧) సంవత్సరసభ, (౨) తటాకసభ, (3) ఆరామసభ, (౪) న్యాయసభ. న్యాయసభయు, సంవత్సరసభయు నొక్కటియో, లేక అవి రెండును దేనికదివేఱో శాసనమునుబట్టి స్పష్టముగ దెలిసికొన వీలుగాకయున్నది. ఉమ్మత్తూరు శాసనములు మఱిరెండు సంఘములను పేర్కొనుచున్నవి: (౧) బంగారుసభ, (౨) పంచవారసభ.

ఆయాసభలపేళ్ల ననుసరించియే అవి నిర్వర్తింపవలసిన ధర్మములు తెలియుచున్నవి. 'బంగారుసభ' యనునది గ్రామమున చలామణిలో నుండు నాణెములను బరీక్షించునదియో, లేక విశ్వబ్రాహ్మణులు చేయునగలు నాణెములు సరిగ నున్నది లేనిది విచారించునదియో యైయుండవచ్చును. రెండవది 'పంచవార'మను పన్ను వసూలు చేయునదియని కొందఱును, కాదని కొందఱును ఇట్లభిప్రాయభేదములు కలిగియున్నారు. ఇందేది సరియైనదియు దెలిసికొనుట కింకను క్రొత్తశాసనములు దొరకినగాని సాధ్యము కాదు. చెంగల్పట్టు మండలమునందలి నిగరిలిశోళ చతుర్వేది మంగలమను నామాంతరమునం బరగు పరమేశ్వర మంగలమునకు పాలెముగనున్న నత్తమను గ్రామములోని శాసనములలో సంవత్సరసభ, ఊరిసభయని రెండుసభలు పేర్కొనబడినవి. సంవత్సరసభ ఉక్కల్ శాసనములలోను బేర్కొనబడెను. తిరుప్పార్కడల్ శాసనములు మఱికొన్ని సభలను బేర్కొనుచున్నవి. అందు ఉత్తరమల్లూరు శాసనములు పేర్కొను తటాకారామసభలు గాక (౧) కుడుంబుసభ [The great men for supervision of words], (౨) క్షేత్రపాలనసభ [The great men for supervision of fields], (3) రెండువందల మందిసభ [The great men (numbering) two hundred], (౪) గ్రామపాలనసభ [The great men for supervision

of the village], (౫) ఉదాసీనపాలనసభ [The great men for supervising (i. e., looking after) the Udasinas (ascetics?). ఈ సభలయందలి సభ్యులును, గ్రామమునందలి (యితర) బ్రాహ్మణులును, ఇతర గ్రామప్రముఖులును (ఇతర గ్రామములనుండి యాగ్రామము వచ్చియున్నచో) గలిసి 'గ్రామమహాసభ' యేర్పడునని శాసనములు తెలుపుచున్నవి. పై నుడివిన సభలన్నిటిలో (అనగా ఒక్క సభకంటె ఎక్కువ సభలుండునపుడు) మహాసభ యిప్పటి 'శాసననిర్మాణసభా'ధర్మమును నిర్వర్తించుచుండెడిది. మిగిలిన యుపసంఘము లన్నియు నిప్పటి కార్యనిర్వాహక సభాధర్మమును నిర్వర్తించుచుండెడివి. అయినప్పటికి గొన్ని శాసనముల ననుసరించి ప్రత్యేకము మహాసభ కొకకార్యనిర్వాహక సభకూడ నుండినట్లు తెలియుచున్నది.

ఈసభలకు ప్రతినిధుల నెట్టివారిని ఎన్నుకొనవచ్చునో, ఎట్టివారిని ఎన్నుకొనగూడదో, ఎన్నుకొనవలసిన ప్రతినిధుల కుండవలసిన లక్షణము లెట్టివో, ఎన్నుకోవలసిన విధానమెట్టిదో-ఇవియన్నియుగూడ శాసనములలోనే తెలుపబడినవి. ఇట్టి పద్ధతులను దెలుపునవి ముఖ్యముగ (౧) ఉత్తరమల్లూరు శాసనములు, (౨) ఉక్కల్ శాసనములు, (3) మాణూరుశాసనములు. ఉత్తర మల్లూరు ఉక్కల్ శాసనములలో చివర, దుష్టులు నశించి శిష్టులభివృద్ధి చెందుటకై యీ నిబంధనలు చేయబడిన వని వ్రాయబడియున్నది. దీని ననుసరించి చూడగా దుర్జనులైనవారు సభలో సభ్యులుగవచ్చుటచేత గ్రామ పరిపాలనము చెడిపోయెననియు, అందువలన తిరిగి సత్ప్రవర్తన గలవారు సభ్యులుగవచ్చుటకై యీశాసనములందు దెలుపంబడిన కట్టుదిట్టములు చేయవలసివచ్చెననియు నూహింపనగును. వేఱువేఱుగ్రామములందలి పరిస్థితుల ననుసరించి సభలసంఖ్య మార్పును బొందినట్లే అచ్చటచ్చటి వ్యవహారమునుబట్టియుసభ్యులసంఖ్యయు ఎన్నికనిబంధనలును మారుచుండెడివి. గ్రామములకువలెనే పెద్దపెద్దపట్టణములకును గొప్పసభ లుండెడివి. పట్టణములోనన్ని దిశల నున్న వారికిని సరియైనసౌకర్యములు కలుగునట్లును, సరియైన న్యాయము దొరకునట్లును, పరిపాలనా వ్యవహారములు సుకరముగ జరుగునట్లును జూచుటకై, ఇప్పటియట్లే, యవి వార్డులువార్డులుగ అనగా వాడవాడలుగ, విభజింపబడుచుండెడివి. ఒక్కొక్కవాడ కింతింతమంది సభ్యులు సభలో నుండవలెనని నిర్ణయ ముండెడిది.

సభ్యుల లక్షణములు: ఎన్నికలు

ఇట్టి సభలలోని సభ్యులందఱును గ్రామములలోని ప్రజలచేత ఎన్నుకొనబడవలసినవారే. ఇట్టి మహాసభల కెన్నుకొనబడవలసినవారి కీక్రింది గుణ విశేషము లుండవలెనని యొకశాసన మిట్లు చెప్పుచున్నది:*

"(౧) గ్రామములోని వృత్తిమంతుల పుత్త్రులలో సదాచారసంపన్నుడును, మంత్రబ్రాహ్మణమును ఒకధర్మశాస్త్రమును పఠించినవాడును, ఒక్కడు మాత్రమే మహాసభకు రానర్హుడు. గ్రామములో నొక్కవృత్తిని కొన్నవాడుగాని, దానముగా గ్రహించినవాడుగాని, స్త్రీధనముగ తనకుచేరినవాడుగాని, పైజెప్పిన లక్షణములు కలిగియుండినచో తనకుటుంబములో దానొక్కడుమాత్రమే మహాసభలోనికి రానర్హుడు.

(౨) వృత్తులను కొనిగాని, దానముగ పరిగ్రహించికాని, స్త్రీధనముగ సంపాదించికాని యున్నప్పటికిని నొక్కడే మహాసభలో సభ్యుడుగ నుండనర్హుడు. ముప్పాతిక, అర్ధ, పాతిక వృత్తులు గలవాడు సభ్యత్వమున కర్హుడుకాడు.

(3) వృత్తులను కొనినవారు తమకు నూలుగ సభను పొవుటకొక వేదమును పరిశిష్టములతో జదివినవారిని మాత్రమే యెన్నుకొనవలెను.

(౪) పై రెండవ నిబంధన ప్రకారము సంపూర్ణ సభ్యత్వమున కర్హులు కాని వా రెట్టికార్యనిర్వాహకసభయందును సభ్యులుగ నుండ నర్హులు కారు. ఈ నిబంధనబట్టి చూడ మహాసభలో నుండుటకు దగిన వారు ౧. కొంతయాస్తిని కలిగి యుండవలెను; ౨. కొంతనైతిక సంపత్తి కలిగియుండ వలెను; 3. కొంతవఱకు వేదమును, ధర్మశాస్త్రములను జదివికొనినవారుగ నుండవలెను అను నియమము లుండెడివని తేలుచున్నది. గ్రామములో వృత్తులున్నవా రయినను తగిన విద్య లేనివారు తమకు ప్రతినిధులుగ అట్టివిద్యకలిగినయితరులను మహాసభలోనికి బంపవచ్చును అను నేర్పాటు కూడ కావింపబడినది."

* శ్రీయుతులు దోచిభట్ల లక్ష్మీనరసింహము (ఆన్. డే. యల్. టి.)గారి 'ప్రజాస్వామిక ప్రభుత్వము'నుండి. తిరిగి తర్జుమాచేయ నవసరము లేనంత సభలకు సంబంధించిన నిబంధనలను గుఱించిన నూనవివరములు ఈగ్రంథమునుండియే గ్రహించి పొందుపఱిచితిని,

## అజంతాచిత్రములు













౧. మిగుల నాహ్లాదకరముగ చిత్రింపబడియున్న రాక్షస, కిన్నర, గంధర్వుల చిత్రములు.



౨. పందొమ్మిదవ గుహాలయమున వసారాయందలి చాందినీచిత్రము. ఇం దైదుగజములు కలవు. రెండుగజములు మాత్రము పోరాడుకొనుచున్నవి. చిత్రము స్వభావానురూపముగా నున్నది.

అయితే యీనిబంధనలు ప్రతిగ్రామమునకు నొక్కరీతినే యుండెడివని చెప్పలేము కాని ఎన్నుకోబడ వలసిన సభ్యుల స్వభావము ఎట్టిదిగనుండవలెనో తెలిసి కొనుటకుచాలును; అనగా ముఖ్యముగ మనము తెలిసి కోవలసిన విషయమిది: సభ్యులు ధర్మాధర్మవిదులై, వేద శాస్త్రపారంగతులై యుండవలెను. ఇట్టి మహాసభవారు కావించిన కార్యములను అమలులో పెట్టుటకు కార్య నిర్వాహక సభవారుండువారు. ఆసభలోనుండు సభ్యుల లక్షణములు కూడ నొకానొక శాసనమున నీరీతిని దెలుప బడినవి:

"(౧) కార్యనిర్వాహకుడగు వానికి వేలి (౫ ఎకరములు)లో నాల్గవవంతు భూమియైనను కట్టుబడి భూమి యుండవలెను.

(౨) గ్రామములో తన స్థలముపై కట్టికొనిన స్వంతగృహములో నాతడు కాపురముండ వలెను.

(౩) అతడు ౩౫—౭౦ సం. మధ్యవయస్సు వాడై యుం డవలెను.

(౪) అతడు మంత్రబ్రాహ్మణము వ్యాఖ్యానము చెప్పదగిన వాడుగ నుండవలెను. (మంత్రబ్రాహ్మణ మనగా వేదములును, బ్రాహ్మ ణములు నని కొందఱును, ఛాందోగ్యమునకు మంత్ర బ్రాహ్మణమను నామముండుటచేత ఛాందోగ్యమని కొందఱును చెప్పుదురు).

(౫) 'వేలి'లో ఎనిమిదవవంతు భూమి మాత్రము గలిగియున్న వాడైన యెడల నొకవేదమును, నాలుగు భాష్యములలో నేదో యొక భాష్యమును అధ్యయనము చెప్పగల వాడుగా నుండవలెను.

(౬) అతనికి వ్యవహార జ్ఞానము బాగుగ నుండవలెను.

(౭) అతడు సదాచార సంపన్నుడై న్యాయమార్గోప జీవియై యుండవలెను.

(౮) గతించిన మూడుసంవత్సరములలో నత డెట్టి కార్యనిర్వా హక సభ యందును సభ్యుడై యుండగూడదు. ఈ నియమము వార్షిక కార్యనిర్వాహక సభకు వర్తింపదు. అందలి సభ్యు లంతకు బూర్వము తోటలసభలయందును, చెఱువుల సభలయందును నుండి తగిన వ్యవ హార జ్ఞానము గలిగియుండినవారుగ నుండవలెను."

ఈరీతిని కార్యనిర్వాహక సభ్యుల లక్షణములు ఎట్లు తెలుపబడినవో అట్లే కార్యనిర్వాహకసభలో నుండ ననర్హులైనవారి లక్షణములుకూడ శాసనము లిట్లు తెలు పుచున్నవి:

"(౧) పూర్వము కార్యనిర్వాహకులుగ నుండి తాము నిర్వహిం చుచుండిన కార్యములకు సంబంధించిన లెక్కలను గ్రామస్థుల కొప్ప జెప్పని వారును, వారి బంధువులును అనగా వారి పినతల్లి పెదతల్లి కొడుకులు, మేనత్తమేనమామకొడుకులు, మేనమామలు, పినతండ్రి పెదతండ్రులు, సహోదరులు, మామగారలు (భార్యతండ్రి), భార్య సహోదరులు, అక్కచెల్లెండ్ర భర్తలు, అక్కచెల్లెండ్ర కొడుకులు, కూతుళ్ల భర్తలు, తండ్రులు, కొడుకులు.

(౨) వ్యభిచారులు పంచమహాపాతకములలో మొదటి నాలు గు పాతకములు చేసినవారు వారిబంధువులు (చూ. పేరా ౧.)

(౩) సంఘమునుండి బహిష్కరింపబడినవారు. నీచ సంసర్గము వలన మాత్రము బహిష్కారముపొందిన యెడల వారు ప్రాయశ్చిత్తము చేసికొన్నచో తిరిగి సభ్యులుగా నుండ నర్హులగుదురు. దుర్నీతికై వెలి పెట్టబడిన వారు ప్రాయశ్చిత్తము చేసికొనినను అర్హులు కారు.

(౪) తెలివితక్కువవారు, మందులు, పిచ్చివారు, దుర్నీతి పరులు.

(౫) తమబంధువులు సభ్యత్వమున కర్హులైనను తాము మాత్రము నిషిద్ధాన్నము భుజించుట వలనను (మనువు ప్రకారము ఇది సురాపాన ములో సమానము), పాపకర్మములు చేయుటవలనను, గ్రామకంటకు లగుటవలనను, పరస్త్రీ గమనదోషము వలనను, అర్హులుకారు. వీరు ప్రాయశ్చిత్తము చేసికొనుటవలన దమ బంధువు లర్హులగుదురు కాని తాము మాత్ర మెన్నటికిని కాజాలరు. ప్రాయశ్చిత్తకర్మములవలన మత సంబంధము లగు నాటంకములు తొలగునవచ్చును గాని సాంఘిక రాజకీయాటంకములు తొలగజాలవు.

పై నిషేధములు కాక ప్రత్యేకముగ పంచవార, సువర్ణ ఉప సంఘము లందుండుటకు గాడిద నెక్కిన వారును (అనగా పరదార గమనమువలన గర్దభముపై నెక్కునట్లు శిక్షింపబడినవారును), దొంగ సంతకములు చేసిన వారును తగరు."

ఈ పైవిధమున కార్యనిర్వాహకసభలో నుండు టకు ఎట్టివారు తగరో స్పష్టముగ నొకానొక శాసనమున దెలుపబడినది.

పైజెప్పబడిన లక్షణములుగల సభ్యులతో గూడిన సభలవలన గ్రామపరిపాలనము జరుగుచుండెడిది. ఈసంద ర్భమున సభ్యులయెన్నిక లెట్లు జరుగుచుండెడివో తెలిసి కొనుట యప్రస్తుతము కాదు.

"మహాసభ జరుగుట కొక నియమిత సంఖ్య (Quorum) సభ్యులు కూడి యుండవలెనను ఏర్పాటుండెను. ఉపసంఘము లెన్ని యుండునో యందలి సభ్యుల మొత్తపు సంఖ్యయైనను గూడిన గాని మహాసభ జరుగ గూడదు."

అయితే యిట్టి నియమము ఒకగ్రామమునకు సంబంధించిన శాసనమున గాన్పించుచున్నది. ఈనియమిత సంఖ్యయే ప్రతిగ్రామమునకు సంబంధించిన మహాసభకు నుండెడిదని నొక్కి చెప్పజాలము; కాని యిట్టినియమమేదో యితర గ్రామములందలి మహాసభలకు నుండియుండునని యూహించుట కది యవకాశము నిచ్చుచున్నది.

ఇక నెన్నికలు జరుగువిధాన మొక శాసనమున ఈరీతిని తెలుపబడినది: 'ఒకగ్రామములో పండ్రెండు వీధులుండెను. ఎన్నికలకొఱకవి ముప్పదివాడలుగ విభజింపబడెను.' ఆగ్రామమునకు సంబంధించిన యెన్నికలీ దిగువ వివరించిన రీతిని జరుగుచుండెడి వట.

"ఒక్కొక్కవాడ (Ward) లోని ప్రజలు ప్రత్యేకముగా కూడవలెను. మహాసభ నిర్దేశించిన మాత్రముల ననుసరించి యచట గూడిన ప్రతివాడును ఉపసంఘసభ్యత్వమునకు తగినవాని పేరు నొక చీటిపై వ్రాయవలెను. ఇట్లాయాముప్పదివాడలవారి చీట్లను ప్రత్యేకముగ ముప్పదికట్టలుగ కట్టవలెను. ఒక్కొక్క కట్టపై ఆయా వాడలపేర్లు వ్రాయవలెను. అప్పుడు గ్రామములోని పెద్దలును, పిన్నలును, అప్పటికి గ్రామమునందుండిన పూజారు లందఱును గ్రామసభాశాల (గ్రామచావడిలో) కూడవలెను. అప్పుడు ముప్పదివాడల చీట్ల కట్టలను నొకకుండలో నుంచి, బహిరంగముగ కుండలో నేమున్నదో తెలియని యొకపిల్లవానిని పిలిచి, చూడకుండ అందుండి యొకకట్టను తీయుమందురు. ఇట్లు తీసిన కట్టనువిప్పి ఆచీట్లను మఱియొక యుత్త కుండలోనుంచి బాగుగ కలిపివేయుదురు. ఆబాలుడప్పుడాకుండలో నుండి యొకచీటినితీసి మధ్యస్థునిచేతి కిచ్చును. ఆచీటిని పుచ్చుకొనుచున్నప్పు డచటి పూజారులలోని వయోవృద్ధుడు మధ్యస్థుడై యుండును. అతడు తన కుడిచేతి అయిదువ్రేళ్లను చాచి ఆచీటిని తన యరచేతిలో నుంచుకొని దానిమీది పేరు చదువును. పిమ్మట సభలోని పూజారు లెల్లరుకూడ నాపేరు చదువవలెను. ఇట్లు చదివిన చీటిని ప్రత్యేకముగ నుంచవలెను. ఆచీటి పేరుగలవా డుపసంఘసభ్యుడుగ నంగీకరింపబడవలెను. ఈరీతిగ నొక్కొక్కవాడ కొక్కొక్కని చొప్పున ముప్పదిమంది నెన్నుకొనుచుండిరి.

*　　*　　*　　*　　*

ఇట్లు మొదట ముప్పదిమంది యెన్నుకొనబడిన తరువాత నందులో గత సంవత్సరమున తోట కమిటీయందును, చెరువుల కమిటీయందును పనిచేసినవా రుండినయెడల వారును, విద్వాంసులును, వయోవృద్ధులును నగు పండ్రెండుగురు 'వార్షికోపసంఘము'గ నియమింపబడు చుండిరి. మిగిలినవారిలో పండ్రెండుగురు తోటలను పరిపాలించు కమిటీగను, మిగిలిన యాఱుగురును గ్రామములలో చెఱువుల బరిపాలించు కమిటీగను నియమింపబడుచుండిరి. ఈ రెండు కమిటీలకును సభ్యుల నెన్నుకొనుటలో నొక్కొక్కని పేరు మధ్యస్థుడు చదువుచుండగా లెక్కినవారు సరే యని తమసమ్మతిని తెలుపుచుండిరి. ఈ చిన్నసంఘములయందలి సభ్యులు పనిచేయవలసిన కాలము ౩౬౦ దినములుగ నిర్ణయింపబడి యుండెను. పిమ్మట వారు తమపనిని వదలుకొనలసి యుండెను. ఉద్యోగకాలమందు సభ్యులు తమ యధికారమును దుర్వినియోగపఱిచిన యెడల వారిని వెంటనే తొలగించుటకు మహాసభ కధికార ముండును."

ఇదియంతయు నొక గ్రామములో జరుగుచుండిన వ్యవహారము. ఇదియంతయు శిలలమీద శాసనరూపమున జెక్కింపబడినది. ప్రతిగ్రామమున సభల యెన్నికల విషయమున నిట్లు జరుగుచుండెనో లేదో చెప్పలేము; కాని యెన్నికలు పూర్వముండెననియు, గ్రామపరిపాలనము చక్కగ జరుగుచుండుటకై పెద్దపెద్ద గ్రామములలో వేలు వేలు ఉపసంఘములు ఉండెడివనియు, ఈ యుపసంఘములన్నియు ఒక పెద్దసభకు లోబడి పనిచేయుచుండెడివనియు, గ్రామమంత పెద్దది కాకపోయిన యెడల సంఘముల, సభలసంఖ్య తగ్గుచుండెడిదనియు నిశ్చయముగ నొక్కి చెప్పవచ్చును. కొన్నికొన్ని గ్రామములలో అచ్చటి మహాసభలో నుండవలసిన సభ్యుల సంఖ్య కూడ శాసనస్థము చేయబడుచు వచ్చెను. ఒక గ్రామమున వేయిమంది సభ్యులసభ (509-1913)యు, మఱియొక గ్రామమున ౫౧౨ గురు సభ్యులసభ (429-1917)యు, మఱియొక గ్రామమున ౮౦ మంది సభ్యులసభ (62-1914)యు—నిట్లే పెక్కురీతులసభలుకలవని శాసనములవలన దెలియుచున్నది. ఇట్టి మహాసభల కనుబంధములుగ నుండిన యుపసంఘములలో ధర్మాధికారసంఘములు (న్యాయస్థానముల్) కూడ నుండెడివి. ఇట్టి ధర్మాధికారసంఘములలో నొక స్త్రీకూడ సభ్యురాలుగ నుండినట్లు తెలియవచ్చుచున్నది (268-1910; 259-1909). దీని ననుసరించి పూర్వముఅనుభవవృద్ధులైనవారికి—స్త్రీలైననుసరే, పురుషులైనను సరే—సంఘములలో సభ్యులుగ నుండుట కర్హత ఉండెడిదని తెలియగలదు. ఈసం

ధర్భమున ధర్మశాస్త్రములలో చెప్పబడిన సభా లక్షణములు పేర్కొనుట సముచితము కాకపోదు:

"న సా సభా యత్ర న సంతి వృద్ధా
వృద్ధా న తే యే న వదంతి ధర్మమ్;
ధర్మః స నో యత్ర న సత్య మస్తి
సత్యం న తద్య చ్ఛల మభ్యుపైతి."

వృద్ధు లెచ్చటనుండరో యది సభ కాదు; ధర్మము నెవ్వరు చెప్పరో వారు వృద్ధులు కారు; ఎచ్చట సత్యముండదో యది ధర్మము కాదు; ఛలమునేదైతే పొందునో, అనగా నెపము ఎక్కడనుంచునో—ఒకయభిప్రాయముతో చెప్పినపదమునకు మఱియొక యభిప్రాయము చేసికొని యొసంగబడు ప్రత్యుత్తరమేదిగలదో—అందుసత్యముండదు, అది సత్యముకాదు అని పైశ్లోకము యొక్క తాత్పర్యము. అనగా కపటము (లేక ఛలము) గల సత్యమును, సత్యముకాని ధర్మమును, ధర్మము చెప్పని వృద్ధులును, వృద్ధులులేనిసభయు ఏదైతేగలదో అది సభ కాదు! అనగా అనుభవజ్ఞానమును, ధర్మనిర్ణయజ్ఞానమును, సత్యాభినిరతియు ఎచ్చటనైతే యుండునో అదియే సభ. ఇట్టి సభలే పూర్వము అగ్రహారములను గాని గ్రామములను గాని పాలించినవి. అయా సభలలో లోపము లున్నను—మానవుడు పరిపూర్ణుడు కాకపోవుటవలన మానవకృతములైన కార్యములందు లోపములుండుట సహజము—కాలక్రమమున లోపము లేర్పడి అభ్యుదయమున కాటంకములు గలుగునప్పుడెల్ల సభ్యులు వాటిని నెమ్మది నెమ్మదిగ సవరించుకొనుచుండువారు.

**పంచాయతులు**

ఇక 'గ్రామము'లలోని పరిపాలన కార్యనిర్వహణమునకును, ధర్మనిర్ణయమునకును, దుష్టశిక్షణమునకును ఏర్పడినసంఘములను పంచాయతులనువారు. గ్రామమున నివసించు పంచవర్ణములకు ఒక్కొక్కవర్ణమునకొకొక్క ప్రతినిధిచొప్పున నైదుగురు ప్రతినిధులుచేరి యీ సంఘ మేర్పడుటచేత దానికి పంచాయతి యనుపేరు కలిగెనని యిదివఱకే చెప్పబడినది. ఈసంఘమున ప్రతివర్ణమునకు ప్రతినిధులుండవలెనను నియమము- కట్టుబాటు ఉన్నను సాధారణముగ నంతమంది ప్రతినిధులు ఉండకుండుటయు, ఉండకపోవుటయు గూడ గలదు. ఒక్కొక్క వర్ణమునకే యెక్కువమంది యుండుటయు గలదు. మొత్తముమీద నీనియమ మెటులున్నను, ఏవర్ణము వారైననేమి, గ్రామము నందలి ప్రముఖులు—పెత్తనదారులు అందఱును జేరి ఈపంచాయతి సంఘముగా నేర్పడువారు. గ్రామవ్యవహారములను చక్కబెట్టునప్పుడును, తగవులు పరిష్కరించునప్పుడును, ధర్మసందేహములను తీర్చునప్పుడును ఈసంఘమువారు పరస్పరము సంప్రతించియే పనులు జరుపువారు. ఈసంఘసభ్యులే ఊరిపెద్దలు. వీరందఱును గూడ గ్రామస్థులచేత ఎన్నుకొనబడువారే. కాని యీ యెన్నికలు ఇప్పటియెన్నికలవంటివి కావు. మంచిచెడ్డలు తెలిసియుండుట, గౌరవ కుటుంబమున జన్మించుట, వాదప్రతివాదములను విని ఏదైన నొక పక్షమునకు మొగ్గకుండ తీర్పుచెప్పుట, గ్రామములో పెత్తనదారనిపించుకొనుటకు తగిన సంపత్తియుండుట—ఈ మొదలగు నవియే ఆసంఘము నందు సభ్యులుగ నెన్నుకొనబడుట కుండవలసిన లక్షణములు. ఈలక్షణములుగల వయోవృద్ధులైన బుద్ధిమంతులే పంచాయతి సభ్యులు. ఈలక్షణములు లేనివారు ధర్మనిర్ణయమునకు కూర్చున్నను ప్రజలు వారిని ధర్మజ్ఞులుగ నంగీకరించువారు కారు. అందువలన నట్టి లక్షణములు కలవారే పంచాయతి సభ్యులు. అందువలన ఇప్పటి సభాలక్షణముల ననుసరించి చూచిన పూర్వపు పంచాయతి సభ కాని సభ; సంఘముకాని సంఘము. పంచాయతిదారులు సభ్యులుకాని సభ్యులు. సాధారణముగ నీ పంచాయతులలో చాలమంది రెడ్లే సభ్యులుగ నుండువారు. ప్రతిగ్రామములోను పెత్తనమంతయు సాధారణముగ నీ రెడ్ల చేతులలోనే యుండెడిది. అందువలన వీరికి 'పెత్తనదారు' లనియు పేరు. వీరే పూర్వరాజవంశ శాసనములలో 'రాష్ట్రకూటప్రముఖులు' అని పేర్కొనబడియున్నారు. రాష్ట్రకూటులనగా రెడ్లు. రెడ్డిసంఘమున ప్రముఖులనే రాష్ట్రకూటప్రముఖు లనువారు. చాల పూర్వకాలమునుండి కృషి, పశుపాలనము—ఈ మొదలగు వ్యవసాయక వృత్తులందు రెడ్లే గొప్పపేరు గడించియున్నారు. అందువలన రైతు సంఘమునకు 'రెడ్డి' యనునది కాలక్రమమున వ్యవహారములో పర్యాయపదమైనది. ఈ పైని పేర్కొనిన యట్టి సంఘములతోను, సభ్యులతోను గ్రామవ్యవహారము సరళముగ సాగిపోవుచుండెడిది.



వ్యాసకర్త

# వివేకోపాసన

అనంతపంతుల రామలింగస్వామి గారు

శాంతం బేదియొ-ధ్వాంత మేదో-త్రిజగత్ స్వాంతంబ దేదో-గత
ధ్వాంతం బేదియొ-చిత్ప్రకాశ మెదియో-ధర్మైకమూలంబెదో
భ్రాంతాతీత మెదానో-యావిమలవిశ్వాధార మోంకార, మ
శ్రాంతంబేను భజించి వేడెదను నిర్వాణైకసంసిద్ధికిన్.

*          *          *          *          *          *

మ. వినుం నిర్వాణపదంబు నొందుటకు నుర్వి న్నాలుగుమార్గంబు, లే
వన, సత్కర్మ, వివేకభావము, విరాగావాప్తి, ప్రేమంబునా
జను, నీయార్యగురూపదేశమును విశ్వాసంబుతో నమ్మి నీ
వనయంబు న్మనఁజూడు మీయిలను దివ్యజ్ఞానసంపాదకా!

మ. పరియింపన్ దగు మార్గమియ్యదియె, యభ్యాసాను యోగ్యంబు నీ
పరమార్గంబు, తదీయసాధనము సర్వార్థానుసంసిద్ధిఁ జే
కురఁ జేయున్, సదసద్వివేకమని లోకుల్ దీని భావింతు, రీ
పరమంబైనపథానుగామివగు దివ్యజ్ఞానసంపాదకా!

మ. ధనమున్ గోరితిచి, కీర్తిఁ గోర్చియును, సంతానంబునున్ గోర్చి, నీ
జననిన్ గోరితిచి, తండ్రిఁ గోర్చి, నిజయోషారత్నమున్ గోర్చి, యా
శను నీవొందకు, మొక్కజన్మమున నే చల్లారు నీసర్వమున్
పని నీకేమియసత్తుతోడుతను, దివ్యజ్ఞానసంపాదకా!

మ. కనుమా! నిత్తెపుసత్తదేదొ, యదియేకా శాశ్వతం బుత్తమం
బును నాకాంక్షిత మవ్యయంబు విమలంబున్ మోక్షసంధాన ము
ర్వీని సద్దానినిఁ గాంచుచో మఱలఁ బేర్మిన్ జూడ వద్దాని నో
యనుజా! తద్ఘనసాధనంబుఁ గొను దివ్యజ్ఞానసంపాదకా!

మ. తెలివిన్ గల్గెడు వారలున్ మఱియు నెంతే తెల్వి లేకున్న వా
రలు రెండే తెగలుండ్రు మానవులలోఁ బ్రాముఖ్యమౌఁ దెల్వి యే
కులమో జాతియొ యేమతంబుఁ గల లోకుండీతఁడం చెన్నఁగా
వల దీవెవ్వనిఁ దెల్వినారయుము దివ్యజ్ఞానసంపాదకా!

మ. మనుజానీకముపట్ల నీశ్వరుఁడు నిర్మాణంబుఁ గావించిన
ట్టి నిబంధాళి రహస్య మెన్నుటయె వింటే జ్ఞానమానద్దియే
ఘనలోకైక పురోభివృద్ధి కగుమార్గం బన్యమార్గంబు లే
దనుజా! దీనఁ జరింప నెంచు మిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. ఎవఁ డీమార్గము నూనునో యతఁడు సర్వేశానుసాయుజ్యముం
దవులం దా నెదిరించ ధర్మమును, సద్ధర్మావలంబాత్ముఁడై
భువి కల్యాణముఁగోరి పాటుపడుఁ జంపుం స్వీయలాభాశ నీ
యవనిం తద్ఘనసాధనం జలుపు దివ్యజ్ఞానసంపాదకా!

మ. ఇటు సర్వేశునిపక్షమూను నతఁడా నిద్ధాత్రి నీసోదరుం
డెటనున్నం మత మేదియైనఁ గుల మింకేదైన నేపేరుతో
నటియింపం దలపోసినం వినుము జ్ఞానంబే ప్రధానాంశ మీ
పటుమంత్రంబు జపించుచుండు మిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. సదసద్ద్వంద్వ వివక్షణం బమిత సూక్ష్మం బేదసత్తైనో నిం
కెదియో నేమొ యసత్తు నీవెఱుఁగవోయీ! కష్టకార్యంబు నె
మ్మది నూహింపుము తారతమ్య మదె సుమ్మా యీశ్వరోపాసనం
బదె నిన్నీశ్వరుపజ్జఁ జేర్పుఁ దుది దివ్యజ్ఞానసంపాదకా!

శా. నీదేహంబును నీవు నిచ్ఛ యను రెంటన్ తారతమ్యం బగుం
నీదేహాశయ మేదియౌనో యదియే నీయిచ్ఛయౌం గాదు నీ
వాదిం దానిఁ బరీక్షఁ జేసికొనుమా యభ్యాసయోగంబు గా
వాదం బిం దొకయింత లేదు సుమ, దివ్యజ్ఞాన సంపాదకా!

శా. నీవీశుండవు, వాని యిచ్ఛయగుఁ జా నీయిచ్ఛయౌం బూను నీ
వా విశ్వాసము నంతరంగమున నీశాన్వేషణం జేయుమా!
నీ వేకాగ్రతనుండి సత్యమున సందేహంబుఁ బోనాడుమా!
యా విశ్వేశుని వాక్కె నీదియగు దివ్యజ్ఞానసంపాదకా!

మ. తమలాభంబులఁగోరుఁ గామమయహా తద్దేహముం స్థూలదే
హము నావెన్క మనోమయంబయిన దేహం బాత్మ తామన్న వే
షముతోడ న్నటియించు—మోస మిదియం సత్యంబు నూహించు ని
త్యము నన్నింటికి స్వామి వీవెఱుఁగు దివ్యజ్ఞానసంపాదకా!

శా. ముందంజం గొను భోగమన్న వెనుకం బోఁజూచుఁ ద్యాగంబనం
సందేహం బొకయింత లే దెఱుఁగుమా శారీరతత్వం బిదా
నెందున్ దేహము నీదువాహనము, నీయిష్టాప్తికై దాని నీ
వందం బొప్పఁగఁ ద్రిప్పుచుండు మిల దివ్యజ్ఞానసంపాదకా!

శా. కాపాడందగు నీదుగుఱ్ఱమును నెక్కాలంబునం దాదరం
బేపారం దగ మేపుచుండవలెనోయీ, నిర్మలాహారమున్;
రేపున్ మాపును దోముచుండవలె నోర్మిన్ జంపు వ్యాయామ మీ
వాపాదింపకు దాని కెన్నఁడును దివ్యజ్ఞానసంపాదకా!

మ. పరిపూర్ణం బగు హాయియున్ శుచియు సత్స్వారోగ్యముల్ గల్గు భా
స్వర దేహంబును గల్గకున్న కఠినవ్యాయామ మావశ్యమై
పరగున్ సాధనఁజేయఁజాల వయినన్ భ్రాంతిన్ శరీరాని కీ
వరయన్ బానిసవౌట కూడ దిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. ధనమున్ గోరెదు నోర్మినోడుఁ గడుసంతాపంబు నాశించు నిం
దను జేయున్ మరి పెక్కుకోర్కు లిటు నిత్యంబూని నీచిత్తవృ
త్తిని మార్పన్ వినుమయ్య! కామమయమౌ దేహంబు నీకోర్కులే
యనుచెవ్వానిఁ దలంపఁ బోకు మిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. అతిగర్వంబు మనోమయంబయిన దేహంబూను సత్యాల్పు లీ
క్షితిలో నెల్లరు దానికన్న నని తా స్వీయాభిలాషాప్తి నే
మతి నూహించును నీదు ధ్యానగతధర్మం బెంచఁగా నీదు త
ద్ధతమున్ జేయఁగ నిన్నుఁ ద్రిప్పనిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. అటులన్ నీదుసదాశలన్ దెలుప నూహం జెందు సద్దేహ మీ
వటులన్ జూచినఁ గావటం జెలుఁగు నీయిచ్ఛానుసారంబుగా
నెటులం ద్రిప్పినఁ దీర్ఘసాధనముగా నీవెంచు మద్దాని నీ
వటు లూహించుటయే వివేకమగు దివ్యజ్ఞానసంపాదకా!

మ. అవివేకుల్ వచియించు బోధనలు నీవాలింపఁగాఁబోకు స్థై
ర్యవిశేషాన నిగూఢమౌ ప్రకృతిధర్మం బెంచి శోధించి నీ
దు వివేకంబును బెంచి ధర్మమును నెందున్ బట్టి సాధించు త
త్త్వవిదుల్ సందియమొంద రట్టియెడ దివ్యజ్ఞానసంపాదకా!

శా. నీదౌ ధర్మము నాచరించునెడ నెంతే నిండుస్వాతంత్ర్య మీ
వాదిన్ గోరదొ యంత స్వేచ్ఛనిడు సుమ్మా స్వల్పకార్యంబులన్
బ్రోదిన్ నీదగు మానవానుజులకెల్లన్ సానుకూల్యుండవై
వాదుల్ పూనక వారితో నడువు దివ్యజ్ఞానసంపాదకా!

మ. ఇది సత్కార్య మలంతికార్య మిదియం చెంచన్ బ్రయత్నింప నె
య్యది సత్కార్యముగా జనుల్ దలఁతురో యద్దానికన్నన్ మహా
ముదమౌ నీగురుకార్యనిర్వహణసంపూర్తైక కార్యంబు నీ
కది కర్తవ్యము సిద్ధియే ఘనము దివ్యజ్ఞానసంపాదకా!

మ. ఉపయోగంబగు కార్యయుగ్మమున నీవూహించు మేలేదొ యు
ల్లపుడున్ రెంటమహోత్తమంబయిన కార్యంబేదియో దాని నీ
వపు డత్యంత మొనర్పుమోయి! ప్రజ లేమన్నన్ సరే యొంటిమై
నపమార్గఘ్నమగున్ వివేక మిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. ఘనమౌ పేదల కన్నదానమిడు సత్కార్యంబు నేఁ గాదనన్
ధనవంతుం డెవఁడైన నన్నమిడుఁ బేదన్ గాంచి దేహంబునుం
బెనుచుం గార్యముకన్న మిన్నయగు నెంతే నాత్మ కాహార మీ
వనయంబున్ సమకూర్చు కార్య మిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. కలదెంతో తెలియంగ నేర్చికొన జాగ్రద్వృత్తి నీవూని నీ
కలరుం జ్ఞానము నీకు సాయపడి మోక్షావాప్తిఁ జేకూర్చి ని
న్నలరన్ జేయుటకై ప్రయత్నమును జేయంజూడు మెవ్వేళ నీ
తెలివిన్ జ్ఞాని వివేకమం చనెడు దివ్యజ్ఞానసంపాదకా!

మ. భగవంతుండగు జ్ఞానరూపుఁడు దయావంతుండు నీజ్ఞాన మే
పగునంతంతకు వానిశక్తి యధికం బౌచుండు నీయందు; నీ
కగుజ్ఞానం బిసుమంతయూ నెడల నీవద్దానినిం బెంచఁగా
నగునోయీ! యదిపూర్ణమౌ దనుక దివ్యజ్ఞానసంపాదకా!

శా. విద్యాభ్యాసముఁ జేయుమా సతత ముర్విన్ నీవు పేర్మిఁ ద
ద్విద్యోద్భూత వివేకమూలమున నెంతే నన్యజీవాళి కీ
వుద్యద్రీతిఁ బరోపకారకరణం బొప్పారఁగాఁ జేయుమా!
ఆద్యున్ గొల్చుట కిద్ది సాధనము దివ్యజ్ఞానసంపాదకా!

మ. ఇతరుల్ నీవొకపండితుం డనుచు నూహింపంగ నాశించి యీ
క్షితి విద్యన్ గొనఁబోకు మజ్ఞత సదా కీడెంచు నంచెంచి న
మ్మి తదీయామలవిద్య నభ్యసన మొనర్మన్ జేయుమా! చేతు వ
ప్రతిమాన ప్రతిభన్ బరోపకృతి దివ్యజ్ఞాన సంపాదకా!

మ. పనిగా సత్యము నభ్యసించుము మనోవాక్కాయ కర్మంబులం
దనయం బీ వనృతంబెదో మఱియు సత్యంబేదొ యోజింపు మా
దిని నభ్యాస మొనర్పు మానసిక వృత్తిన్; కష్టకార్యంబు కా
దనుజా! యీబుత మభ్యసించుమని దివ్యజ్ఞానసంపాదకా!

మ. కలవెన్నెన్నో యసత్యవాదములు లెక్కన్ జేయ కవ్వాని నీ
వల మూఢాన్వితవాదబద్ధమతివై యల్లాడఁగాఁ బోకు ని
స్తులశాస్త్రస్థములంచుఁగాని మనుజస్తోమానువాదం బటం
చలవాదంబుల నమ్మఁబోకు మిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. విను నిర్వాణపథానఁబోవు నతఁ డుర్విన్ వారువీహాను నూ
హాను బాటింపఁడు స్వీయభావసుసహాయాసన్ జనన్ జూచు నీ
వును నట్లే పరిశీలనన్ జలిపి నేర్పున్ జూపి కర్తవ్య మూ
హాను జేయందగు వృద్ధిమార్గమిది దివ్యజ్ఞానసంపాదకా!

మ. అనువర్తించును నీకటంచు మది నూహన్ జేయు కెవ్వార లే
మనినన్ నిన్నొకవేళ దూఱినను నీవాక్రోశమున్ జూప కే
మన నజ్ఞాని యకోపి, కోపమనఁగా నజ్ఞానమౌఁ గాదె యె
వ్వని నీశత్రునిఁగాఁ దలంపకుము దివ్యజ్ఞానసంపాదకా!

మ. గురుశిష్యాన్వయ మెందుఁగాన గురువాక్యున్ నీదు వాక్యంబునన్
సరిగాఁ బోలిచిచూచి నీదయినభావ్యద్భావ మాచార్య భా
స్వరభావంబున కీడురానియెడ నీభావంబు నే మార్చు కొ
మ్మరయంగా గురుభావ ముత్తమము దివ్యజ్ఞానసంపాదకా!

మ. తలఁపున్ బూనఁగ మాటలాడు నెడ సత్కార్యంబులన్ జేయువే
ళల నాచార్యుఁ డెటుల్ దలంచెడునొ యాలాపంబు నెట్లాడునో
యలకార్యం బెటు తా నొనర్చెడునొ కోయంచీవు తర్కింపఁగా
వలయున్ నిక్కపుశిష్యుఁ డీవయిన దివ్యజ్ఞానసంపాదకా!

మ. పలుకంగావలె నున్నదున్నయటు లాపాదింపఁగాఁబోకు లో
కులపై నిందల నెందు నీవతిశయోక్తుల్ పల్కు కెవ్వేళ నే
పలుకున్ బల్కనసత్యమౌనొ యని కంపంబొందుచున్ సత్యమే
పలుకన్ సద్వ్రత మూనుచుండు మిల దివ్యజ్ఞానసంపాదకా!

మ. పనిఁ గావింపుము సత్యబద్ధమతి నభ్యాసంబుమై డెందమం
చని దానిఁ ఘటియించి కైతవగుణాచ్ఛాదుండవుంగాకు మే
మన నీమానసకాచగోళ మతినిర్మాలిన్యమైయుండుచో
ఘనదీప్తిన్ వెలుఁగొందు సత్యరుచి దివ్యజ్ఞానసంపాదకా!

శా. అంతంబందె నటంచు సంతసిల కీవయ్యా! స్వలాభంబు తా
నెంతన్ నీవు పరోపకారమును నూహింపన్ దరిందోఁచు న
శ్రాంతం బొండొకరూపుతో నయిన నేర్వంగల్గు దద్దాని న
త్యంతం బీవు వివేకమూలమున దివ్యజ్ఞానసంపాదకా!

మ. పయిఁ కెంతేఁ గడుఁ జెడ్డగాఁ బొలుచు నాప్రాణిఁ ఘసర్జింప కా
రయ మంతర్గతమైన యీశు కళ నౌరా! యిర్వురం దద్దియొం
డయి యుండున్ జుమ దానిమూలమున సాయంబీవు చేయంగనౌఁ
బయికిన్ దోఁచని తత్కళన్ దెలిసి దివ్యజ్ఞానసంపాదకా!



౪. మొదటి గుహాలయమునందలి చాందినీచిత్రము. ఇది యొక పారసీకాధిపుని అంతఃపురచిత్రము. ఆయనచేత నొక మధుపూరితపాత్రము కలదు. ప్రక్కన ఆయనభార్య కూర్చుండి ఏదియో యొక విషయమును చెప్పునట్లున్నది. ఇద్దరు పరిచారికలు మధుపాత్రముల బట్టుకొనియున్నారు. క్రింద నిద్దరు సేవకులు పళ్లెరముల యందు ఫలాహారముల నుంచుకొని అందిచ్చుచున్నారు.



[illegible]. రెండవగుహాలయమున నొక చాందినీచిత్రమునందలి యర్ధభాగము. దీనివ్యాసము సుమారు [illegible]డుగులు.

అజంతాచిత్రములు



౬. మొదటిగుహాలయమున నొక స్తంభశిఖరమున నుండు చిత్రము. రెండు వృషభములు పోరాడుచున్నవి.
చిత్రము స్వభావానురూపముగ నున్నది.



వ్యాసకర్త

# సిద్ధపురుషులు - శ్రీ బ్రహ్మానందతీర్థస్వామి

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

బ్రాహ్మణులకు జీవికలు ధర్మశాస్త్రమున మూఁడు చెప్పఁబడినవి. యాజనము, అధ్యాపనము ప్రతిగ్రహము. ఈ మూఁడును పరులసాహాయ్యముమీఁద నాయత్తములై యున్నవి. ఇందొక్కటియు స్వాయత్తము కాదు. ఏలయన,—లోకమున భగవదారాధనము, భగవద్భక్తి మున్నగువాని ప్రచారమునకుఁ బాటుపడుచుండుట యాజన మనఁబడు. ఈ వృత్తివలన నుపకారము గాంచినవారు మానసోత్సాహముకొలఁది నొసఁగెడి దక్షిణలే బ్రాహ్మణునకుఁ గలుగు ప్రతిఫలము. అధ్యాపన మన విద్యాప్రపంచవృద్ధికై పాటుపడుచుండుట; దీనియందును విద్యార్థు లగువారు మానసోత్సాహము కొలఁది నేమైన సాయముచేసిన నదియే బ్రాహ్మణుని జీవనాధారము. ప్రతిగ్రహమన దాతలు బుద్ధిపూర్వకముగ నిచ్చినదానిని గైకొనుట. వీనిలో నెద్దానియందైనను బ్రాహ్మణుఁ డింత యిమ్మని యడుగఁగూడ దని ధర్మశాస్త్రమున్నది.

తన యుదరపోషణభారమంతయు విశ్వమయుఁడైన పరమేశ్వరునందుంచి లోకకళ్యాణమునకై పారస్వతసర్వస్వమును, దానిపర్యవసానమైన విజ్ఞానవైభవమును, దాని పరమావధియైన పరమేశ్వరభక్తిసామ్రాజ్యమును ప్రపంచమునఁ బ్రోది సేయుచుండుటయే బ్రాహ్మణధర్మముగఁ గన్పట్టుచున్నది.

ఇట్టి బ్రాహ్మణోత్తముని యోగక్షేమభారము నేనే వహించెదనని శ్రీకృష్ణభగవానుఁడు భగవద్గీతలలోఁ జెప్పియుండెను గాన భగవత్ప్రీతిపాత్రమై లోకమెల్ల నాసాధుశిరోమణికిఁ గరావలంబము సెల్ల విషయములలోఁ జేయఁగలదు. అట్టిసాధువు తన ధర్మాచరణబలము వనే ప్రపంచమున ధర్మప్రచారము చేయఁగలిగియుండును.

"అహింసాప్రతిష్ఠాయాం తత్సన్నిధౌ వైరత్యాగః"

అని పతంజలి మహర్షి యోగశాస్త్రమున నొడివియుండెను. అహింసావ్రతమున సిద్ధిసంపాదించిన మహాత్ముని సన్నిధియం దితరులకుఁగూడ కోపము పుట్టదట. తపోవనములలోఁ బరస్పర శత్రుత్వముగల జంతువులు సైతము విరోధమును వదలి మైత్రితో నుండెనని పూర్వగ్రంథములలో వర్ణించుచుండుట యీసిద్ధాంతము నవలంబించియే యేర్పడినది.



శ్రీ బ్రహ్మానందతీర్థస్వామి

యథార్థముగ ధార్మికుఁడయినవాఁ డుపదేశింప నక్కఱ లేదు. వానిని జూచియే సన్నిహితులగువారెల్ల ధర్మపథాభిముఖు లగుదురు. "దర్శనాదేవ సాధవః" అనువాడుక యీ హేతువు చేతనే కలిగినది.

దీనికిఁ దార్కాణముగా సిద్ధపురుషు లనేకులు తమ సంచారముచే లోకకళ్యాణము సమకూర్చుచుండువారు కలరు. సుమారుతొమ్మిదియేండ్లక్రిందట "శ్రీ బ్రహ్మానందతీర్థులు" అనుమహానీయులు గుంటూరుజిల్లాకు దయచేసియుండిరి. వారు బాపట్లలో రెండు సంవత్సరములకాలము నివాసముచేసిరి. ఒకపని చేయుమనికాని, ఒకపని చేయవలదనికాని యొకరికిఁ జెప్పెడి యలవాటు వారికి లేదు. సమీపమునకు వచ్చినవారితోఁ బ్రియముగ మాటాడుచుండుట వారికి సాజము.

ఇట్లు వారు రాక నివసించుటంజేసియే పట్టణమునఁ జాలమార్పులు గలిగినవి. నాస్తికులు ఆస్తికులైరి. ధూర్తులు శాంతులైరి. దుష్టులు శిష్టులైరి. ఇట్లు చాలమంది జనులలోఁ జిత్తశుద్ధి యేర్పడుటయుఁ గొందఱు భగవదారాధనపరతులౌవారును, గొందఱు సద్గ్రంథపఠనాదరము వహించువారును గొందఱు గర్మనిష్ఠులగువారును నై యా దినములలో నక్కడిరీతి చూపఱులకు వింతగొల్పెను.

కావున బ్రాహ్మణ్యమన నిట్టిది. ఇట్టి బ్రహ్మవర్చసము జగమునఁ బొడకట్టిన లోకకళ్యాణమున కేమి కొదువ? ఎన్ని తెగలున్నను బరస్పరద్వేషము లేకయుండును? ఇట్టి బ్రాహ్మణజాతిని మనమున నుంచుకొనియే శ్రీశంకరాచార్యులవారు "బ్రాహ్మణత్వస్య హి రక్షణే రక్షితస్స్యాత్ సర్వో వర్ణాశ్రమధర్మః" అని గీతాభాష్యమున వ్రాసినారు.

ఇట్టి బ్రాహ్మణత్వ మెట్లు కలుగును? తపస్సుచే, గురుశుశ్రూషచే; సాత్వికాహారాదినియమములచే. మహాపురుషులయిన యీ బ్రహ్మానందతీర్థులవారి సుగుణగణములను, శుభమూర్తియు, సుచరిత్రమును గొంతవఱకుఁ దెలియఁజేయఁదలఁచి యీ క్రింది గద్యపద్యములు వ్రాయఁబడుచున్నవి:

శ్రీబ్రహ్మానందతీర్థులవారనెడి వీరు మహారాష్ట్రదేశమునఁ బుట్టిరి. చిన్నతనమునుండియు సాధుసంగమందపేక్ష వీరికి మెండు. ఆకారణమున జన్మభూమివదలి యనేకతీర్థములను, చాలక్షేత్రములను వీరు మెట్టిరి; యోగాభ్యాసము చేసిరి; మంత్రానుష్ఠానము లొనరించిరి; తపస్సు సల్పిరి; వాసుదేవసరస్వతీస్వామివారి యొద్దఁ జిరకాలము పరిచర్య గావించి వారియనుగ్రహము పడసిరి. తరువాత శ్రీశృంగగిరిమఠాధ్యక్షులు జగద్గురువులగు శ్రీసచ్చిదానంద శివాభినవ నృసింహభారతీస్వాములవారి చెంత కరిగిరి. చాలకాలము వారిని సేవించి వారియనుజ్ఞచే సన్న్యాసము పుచ్చుకొనిరి. అద్వైతభాష్యములు చదివిరి. ఆజగద్గురువులు సిద్ధిపొందినపిమ్మట శృంగగిరినుండి బయలుదేరివచ్చిరి. తర్వాత నెల్లూరు మొదలైనచోట్లనుండి యచ్చటిసాధుబృందముల కానందము నొసఁగిరి. పిదప బాపట్లకు వేంచేసిరి. అనేకులకు భక్తిజ్ఞానవైరాగ్యములఁ గృపచేసిరి. ఒకవేదపాఠశాల స్థాపించిరి. చివఱకు వారణాసిఁ జేరి మణికర్ణికాఘట్టమున సిద్ధిగాంచిరి. వీరిజీవితకాలము (40) సంవత్సరములకు లోఁపు. వీరిమహిమ కీక్రిందిపద్యాలు సమర్పింపఁబడినవి.

క. శ్రీదత్తాత్రేయ కృపా-ప్రాదుర్భూతాత్మ బోధపరిపాక కలా
మేదుర! గురువర! యతివర-సాదర శిష్యోద్ధరణచణాత్మ విచారా!

మ. భవవారాశి నిమగ్నులై బహుళపాపశ్రేణిలోఁ జిక్కి సం
స్తవనీయంబగు కేశవార్చనరసాస్వాదంబునన్ హీనులై
యవనిం జేడ్పడు పామరాళికి సహాయంబించు లేకుండ నీ
వవతారంబు సమాప్తిచేసితివె! బ్రహ్మానందతీర్థ ప్రభూ!

మ. కవివర్యుల్ కవియంచు గాయకజనుల్ గానప్రియుండంచుఁ గే
శవభక్తుల్ బహుభక్తియుక్తుఁడనుచున్ శాస్త్రజ్ఞులున్ సర్వశా
స్త్రవిశేషజ్ఞుఁడటంచుఁ బూజసలుపన్ సర్వాత్మతన్ జూపి నీ
వవతారం బుపసంహరించితివె! బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. అమలోదారమనీషతో జనుల కాహ్లాదంబు గల్పించి త
త్త్వము బోధించుచు సర్వకాల విలసద్వాత్సల్య వైరాగ్యసం
యమ ముఖ్యాధిక సత్వసంపదకుఁ దావై యొప్పితి వట్టి నీ
యమితోత్సాహము సంస్మరించెదము బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. కమనీయంబయి శాశ్వతంబగుచు భక్తస్వచ్ఛహృద్రత్న వే
శ్మములన్ బెక్కువిధంబులన్ నిలిచి పూజల్ గొనుచుం గాలాంతర
క్షమమై రాజిలు కీర్తిదేహ మిలపై స్థాపించి యాస్థూల దే
హము హేయంబని వీడియుంటివొకో! బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. అమరుల్ తేజముఁగాంచి భక్తిమెయి నర్ఘ్యంబిచ్చి పూదండ గం
ధమునం దుంచి నిజాలయంబులకు వేడ్కన్ గొంచుఁబోవన్ గవా
టములం దీసి యుపేక్ష సేయ నొక్కకంటన్ గాంచుచున్ బ్రహ్మధి
ష్ణ్యముఁ గైసేయఁగఁబోయి యుండువొకో! బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. "సమయం బియ్యది యెంతయున్ గలిమహాసామ్రాజ్య నిర్వాహయో
గ్యముగా నుండఁ దలంచినాఁడ వ్యతిరేకప్రక్రియన్ నీవు ధ
ర్మము సంస్థాపన సేయఁ జూచెదవు రమ్మా నీకదేల?" యంచు స
ఖ్యముగా నిన్ గొనిపోయె విశ్వపతి బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. తమముం బాపు భవత్కృపాబలముచే ధన్యత్వముం గాంచ భా
వములో నువ్విళులూరు సాధువుల సద్వాంఛల్ వృథా గాఁగ దే
శమునన్ సిద్ధజనప్రచారమను నైశ్వర్యంబు లోపింప దే
హముఁ గాశీపురిలోఁ దొలంగితివి బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. తిరహా దివ్యసమాధితోఁ గలసి భక్తిజ్ఞానవైరాగ్యముల్
వఱలన్ బ్రేమరసంబు భక్తతతిపై వర్షించు శాంతాస్య మా
ధురపూర్ణంబుగఁ దోఁచుచుండి పరతత్త్వధ్యాన సంధాన భో
గ్యరసాస్వాదముఁ జెల్వునొప్పితివి బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. జనచేతోహరణప్రవీణమగుచుం జంద్రాతపస్ఫూర్తియై
ఘనమోదోద్భవ మందహాసరుచి వక్త్రశ్రీల కాలంబమై
మనుచుండన్ దగు బ్రహ్మవర్చసముతో మాధుర్యధుర్యోక్తి మో
హనమయ్యెన్ భవదీయ దివ్యకళ బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. నియమాధీనత జన్మమాదిగఁ దపోనిష్ఠన్ విరాజిల్లి ని
శ్చయ దార్ఢ్యంబున నేకరించిన మహాస్సారంబో! శ్రీవాసుదే
వ యతీంద్రాంఘ్రి సరోజచింతన పరీపాకంబో నా యుష్మద
వ్యయ తేజంబు ప్రశాంతిఁ జిమ్మె భువి బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. గురుపాదాంబుజ భక్తి వేలుపులపై గాఢైకరాసక్తి శాం
కరభాష్యార్థ విచారమన్నఁ గడువేడ్కన్ జీవికా జీవిగాఁ
బరమాహ్లాదము గాంచుశక్తి బుధసేవాసక్తియు న్నీ మనో
హరచారిత్ర పవిత్రచిహ్నములు బ్రహ్మానందతీర్థప్రభూ!

శా. ఆబాల్యంబు విరక్తితోఁ బెరిగి దత్తాత్రేయదివ్యత్కృపా
ప్రాబల్యంబునఁ జేసి భక్తిరససంపత్పూర్ణమై శుద్ధ ధీ

తా బాంధవ్యము గాంచి యార్ద్రహృదయాబ్జాతంబు శోభిల్లఁ జే
లొ్వ బోధోన్నతితోడఁ బొల్చితివి బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. తమసంకల్ప విశేషదార్ఢ్య మెవరుం దర్కింపఁగాలేరు భా
వములో నించుక పాఠశాలపని సంభావించి మీరుండ క్షే
త్రము లేఁగల్గిరి కొంద ఱెందఱొ మహాత్యాగంబులన్ జూపి సా
హ్యములం జేసిరి భక్తిభావమున బ్రహ్మానందతీర్థప్రభూ!

మ. పరివస్యారసికుండు శాంతుఁ డధిక ప్రజ్ఞాఢ్యుఁ డంచున్ జగ
ద్గురు పీఠస్థ నృసింహభారతులు గోర్కుల్ దీరఁ బ్రేమించి త
త్త్వరహస్యానుభవం బొసంగి పనుపన్ బ్రహ్మాత్మతాస్ఫూర్త్యుదా
హరణం బేర్పడఁ బొల్చితీ వవనిఁ బ్రహ్మానందతీర్థప్రభూ!

సీ. పరిపూర్ణవిజ్ఞాన గరిమకుఁ గాణాచి, యమనియమాదుల కాటపట్టు,
చిరతపోబల సమార్జితసమాధికిఁ దావు, వైరాగ్యలక్ష్మికిఁ బట్టుకొమ్మ,
విలసిల్లు యోగసిద్ధులకు నుపఘ్నంబు, సర్వజ్ఞతకును విశ్రాంతిగృహము,
సమధికజ్ఞాన నిష్ఠకును బెట్టినపేరు, సద్భక్తిపారవశ్యమున కిరవు
మౌనముద్రావిభూతికి మందిరంబు, బ్రహ్మవర్చసమునకుఁ దార్కాణయనుచు
నిను నుతింతుమె కాని వర్ణింపఁగలమె? వర్ధితార్య! బ్రహ్మానందతీర్థవర్య!

శ్లో. జయతాదస్తః కేళిః, దేశికపదపద్మ సద్మ హృదయాళిః
సంచిత సద్గుణపాళిః, శ్రీబ్రహ్మానందతీర్థ యతిమౌళిః.

శ్లో. బహుసేవిత యోగీంద్రః, సంతతజాగ్రద్వివేక నిస్తంద్రః
విలసతి కరుణాసాంద్రః, శ్రీబ్రహ్మానందతీర్థ యతిచంద్రః.

శ్లో. కలయే దాత్మని తేజః, శ్రితవాఞ్ఛితదాన దేవతాభూజః;
విజితావిద్యాబీజః, శ్రీబ్రహ్మానందతీర్థ యతిరాజః.

శ్లో. పోషిత శమాదిపోష్యః, శ్రీమన్నరసింహభారతీ శిష్యః;
సువిదితశాఙ్కరభాష్యః, బ్రహ్మానందో హి విజయతేఽ ధృష్యః.

శ్లో. జయజయ నన్యప్రావృట్! దత్తాత్రేయాఙ్ఘ్రిపఙ్కజే మధులిట్
ప్రశమాధరిత పరివ్రాట్, శ్రీబ్రహ్మానందతీర్థ యతిసమ్రాట్.



# *ఔరంగజేబు పుత్త్రికాసంతానము

కానూరి వేంకటసుబ్బారావు గారు

[సారస్వత సమాజము]

ఔరంగజేబునకు దిల్రాసుభాను, నవాబుభాయి, ఔరంగబదిమహాలు, ఉదిపురిమహాలు, జీనాబది అని అయిదుగురు భార్యలు†. ఇందు దిల్రాసుభానువందు ఔరంగజేబు జేబఉన్నీసా, జీనాతున్నీసా, జుబ్దతున్నీసా అను ముప్వురు కుమార్తెలను, అజాము, మహమ్మదుఅక్బరు అను ఇద్వరు పుత్త్రులను బడసెను. నవాబుభాయియందు మహమ్మదుసుల్తాను, మహమ్మదుమొఅజ్జాము అను నిరువురు కుమారులును, భద్రఉన్నీసా అను పుత్త్రికయు కలిగిరి. ఔరంగబదిమహాలునందు మిహ్రఉన్నీసా అను పుత్త్రిక జననమందెను. ఉదిపురిమహాలునందు కాంబక్షు అను పుత్త్రుడు కలిగెను. జైనాబదికి సంతానము లేదు. ప్రస్తుతము ఇచట ఔరంగజేబు పుత్త్రికాసంతానమునుగురించి ప్రస్తావింతము. (విషయసౌలభ్యమునకై ఔరంగజేబు భార్యలయొక్కయు, వారిసంతానముయొక్కయు పట్టిక లీదిగువ నుదాహరింపబడుచున్నవి.)

I

ఔరంగజేబు=దిల్రాస్ భానుబీగము

1. జేబఉన్నీసా
2. జీనాతున్నీసా
3. జుబ్దతున్నీసా
(అజాము)
(మహమ్మదు అక్బరు)

II

ఔరంగజేబు = నవాబుభాయి

(మహమ్మదు సుల్తాను)
(మహమ్మదు మొఅజ్జాము)
4. భద్రఉన్నీసా

III

ఔరంగజేబు=ఔరంగబదిమహాల్

5. మిహ్రఉన్నీసా

IV

ఔరంగజేబు=ఉదిపురి

(కాంబక్షు)

సూ:—ఔరంగజేబు పుత్త్రికలకు నెంబర్లు ఉంచబడినవి.

## జేబఉన్నీసా

జేబఉన్నీసా క్రీస్తుశకము 1638 ఫిబ్రవరి 15 వ తేదిని ఔరంగజేబు ప్రథమభార్య దిల్రాసుభానునకు జననమందెను. ఈమె కాశ్మీరదేశస్థుడగు మీర్జా షుక్రుల్లా భార్యయగు హాఫీజామేరియంకడ విద్యాభ్యాస మొనర్చెను. జేబఉన్నీసా, విద్యాభిమానమునందును, బుద్ధికుశలతయందును తండ్రికి తీసిపోదు. కురాను గ్రంథ మీమెకు కంఠస్థము. కురాను బాగుగ జ్ఞప్తియందుంచుకొనగలిగినందులకు ఔరంగజేబు జేబఉన్నీసాకు 30,000 బంగారునాణెములు బహుమానముగ నొసంగెను. అరబ్బీ పారసీక భాషలయం దీమెకు మంచిప్రవేశము కలదు. ఈమె పారసీకభాషలో అన్నివిధములైన వ్రాతలను వ్రాయగలదు. ఈమె సొంతపుస్తకభాండాగారమందు చాలగ్రంథములు గలవు. ఈమెకు మంచి కవిత్వధోరణి కలదు. జేబఉన్నీసా వ్రాతలిపిలో శిథిలమగుచున్న గ్రంథరాజముల తిరిగి వ్రాయుటకు కొందరి నేర్పఱచి జీతము లిచ్చుచుండెడిది. గొప్పపండితులు, కవివరులు నీమెకడ జీతములు బుచ్చుకొనుచు క్రొత్తగ్రంథముల వ్రాయుచుండెడివారు. ఈమె కవులకు మంచిబహుమానము లిచ్చి ఔరంగజేబు ఆస్థానమున వారు లేనికొఱత దీర్చెను. జేబఉన్నీసా ప్రోత్సాహమువలనే కాశ్మీరమతగురువగు సఫీఉద్దీన్ ఆర్దుబెలి యనునాతడు గొప్పవిమర్శగ్రంథమగు తఫ్సీరుకాబీరును పారశీకములోనికి భాషాంతరీకరణ మొనర్చి జేబఉన్నీసా పేరున ఆగ్రంథమునకు 'జేబ-ఉత్-తఫ్సీ'రని నామమిడెను. జేబఉన్నీసాకడనున్న వ్రాయసకాండ్రు పెక్కాంతగ్రంథముల వ్రాసి ఈమెపేరిట ప్రకటించిరి. ఈమె పారసీకభాషలో చాల గ్రంథముల వ్రాసెను. ఒక్కగ్రంథమునకైన ఈమె గ్రంథకర్త్రి యని కాన్పింపదు. మారు పేరున వ్రాయుచుండెడిది. అయినను దివాను మాక్ఫి (మాక్ఫి=మారుపేరు) అనుగ్రంథ మీమెచే వ్రాయబడలేదు. మాక్ఫి కైటిలు అక్బరుభార్యకును, నూర్జహానునకును వ్రాసిరయున్నారు.

* ఈవ్యాసరచన కాధారములు:—Life of Aurangazeb by Sirkar; Anecdotes of Aurangazeb; Later Moguls by Manulli.

† వీరినిగురించి తెలిసికొనగోరువారు అక్షయ సంవత్సరాదిసంచికలోని 'ఔరంగజేబు భార్యలు' అనువ్యాసము చూడనగును.

జేబున్నీసా కొన్నిహిందూప్రేమతరంగములలో నాయకు
రాలినిగా చొప్పించియున్నారు. ఈమె ప్రవర్తనయం దిచ్ఛావర్తిని
యని ఇప్పటిజనశ్రుతి. కాని ఔరంగజేబుకాలమున గాని, ఆతఁడు
చనిపోయిన 50 సంవత్సరములకు లోపునఁగాని చరిత్రకారులు జేబ
ఉన్నీసా ప్రవర్తనయందు ఇచ్ఛావర్తిని యని వ్రాసియుండలేదు.
రాజసంబంధములగు అవినీతికార్యములను గ్రంథములందు వ్రాసినచో
రాజదండనకు పాత్రులమగుదుమేమో యనుభయమున చరిత్రకారులు
వ్రాయలేదనిన ననవచ్చును కాని కొందరు చరిత్రకారులు స్వేచ్ఛా
వాగ్వృత్తి నవలంబించిరి. అట్టివారిలో నొకఁడగు ఖాఫీఖా నీమె
దుర్వర్తనమునుగురించి యేమియు వ్రాసియుండలేదు. ఈతఁడు తనకు
తెలిసిన ప్రతివిషయమును పూసగ్రుచ్చినట్లు ఎవరికిని జంకక, బహి
రంగముగ వెల్లడిచేయు స్వభావము కలవాఁడు. ఖాఫీఖాను షాజహాను
జహాంగీరుల అవినీతిచేష్టల నిర్భయముగ తన మొగలుపేరుల చరిత్రమున
వెల్లడిచేసెను. అట్టివాఁడు జేబున్నీసా వలపువర్తనలను కప్పిపుచ్చి
వ్రాయమానెననుట పొసఁగుబాటులేని సంగతి.

ఔరంగజేబునకు భయపడ నగత్యములేని యూరపుదేశీయు
లగు బెర్నియరు, మనుచ్చి యనువార లీవిషయము నెత్తుకొనలేదు.
ఇందు మనుచ్చికి మహమ్మదీయుల కొలువునందలి విచిత్రముల వ్రాయు
టయం దక్కుడు అభిమానము. జేబున్నీసా గాథ లేమాత్రమైన
నాతని చెవికి సోకియుండునెడల నాతఁడు తనగ్రంథమున వ్రాసియే
యుండును.

జేబున్నీసాపై వ్రాయఁబడిన గాథలన్నియు 19 వ శతాబ్దిని
కల్పింపఁబడి యుండవలెను. ఇట్టికథలను ఆదిని లక్నోవాస్తవ్యు
లెవ్వరో ఉర్దూభాషలో రచించిరి. దీనిని లాహోరువాస్తవ్యుఁడగు
మున్షి అహమ్మదుద్దీన్ అనువాఁడు, మున్షి మహమదుద్దీన్ ఖాలిఫ్ అను
వాఁడు వ్రాసిన 'హయాతి జేబున్నీసా' గ్రంథమునుండి గ్రహించె
నని తోఁచుచున్నది. 'వెస్ట్బ్రుక్'ను నామె 'దివాను ఆఫ్ జేబున్నీ
సా' అనుగ్రంథమున నీక్రిందివిధమున ఉపోద్ఘాతరూపమున అహమ్మ
దుద్దీన్ వ్రాసినగాథను సంక్షిప్తముగ వివరించెను:—

"క్రీ. శ. 1662-వ సం॥లో ఔరంగజేబునకు జబ్బుచేసెను.
వైద్యులు కొంతకాలము ప్రదేశమును మార్పవలెనని చెప్పిరి.
ఔరంగజేబు కొలువుతోడను, సంసారముతోడను లాహోరు వచ్చెను.
ఆనగరమునకు వజీరు పుత్రుఁడగు ఎక్విలుఖా ననునతఁడు గవర్నరుగా
నుండెను. ఎక్విలుఖాను సుందరుఁడు; శౌర్యవంతుఁడు; సాహసికుఁడు;
విశేషించి కవి. ఆతఁడు జేబున్నీసా సౌందర్యమును, పాండిత్యమును
వినెను. ఆమెవ్రాసినపద్యము లాతఁడు చదివెను. ఆమెను చూడవలె
నని ఆత్రపడుచుండెను. నగరరక్షణ యను సాకుగల్పించుకొని ఆతఁ
డామెస్థానముచుట్టు తిరుగుచు ఆమెను చూచి వేడుకపడుచుండెను.
ఒకనాఁ డామె సులేమాను దుస్తులు ధరించి యోరనికిఁ గాన్పించెను.

'సౌధాంతమున ఎఱ్ఱనికాంతి ప్రత్యక్షమైనది' యని ఎక్విల్ ఖాను
ఆమె నుద్దేశించి పలికెను. ఆమెయు విని గ్రహించి 'సామదానభేద
దండోపాయములు గావి, ధనాదులు గాని దాని నందలే' నని
అన్యాపదేశముగఁ బలికెను.

జేబున్నీసాకు లాహోరునగరమన్న నెక్కుడగు ప్రీతి. ఆమె
పాలరాతితోఁ గట్టఁబడుచున్న మందిరమునకు చెలికత్తెలతో వెళ్లినదని
విని ఎక్విలుఖాను తోటవానివేషమును వేసికొని వలయు పరికరముల
మోసికొనిపోయి యెట్లో పారావాంద్రమునుండి తప్పించుకొని లోనఁ
బ్రవేశించెను.

ఆమె చెలికత్తెలతో చతురంగ మాడుచుండెను. ఎక్విల్ ఖాను
ప్రక్కనుండి పోవుచు 'నీకొఱకు తిరుగుచు గాలిదుమారము నైతి' నని
వ్యంగ్యముగ మాట్లాడెను. జేబున్నీసాయు 'ఎంతదుమారమైనను
నాతలవెండ్రుక నైనఁ దాకుటకు శక్తిచాల'దని యాతీతిగనే ప్రత్యుత్తర
మిచ్చెను. వారిరువురును చాలసారులు కలిసికొనిరి. ఈవార్తయెట్లో
ఔరంగజేబు వీనులఁ బడెను. వెంటనే యతఁడు ఢిల్లీనుండి తిరిగివచ్చి
ఆమెకు వివాహముచేయ ప్రయత్నమొనర్చుచుండెను కాని ఆమె
తాను స్వయంవర మొనర్తుననియు వరుల చిత్రపటములఁ దనకడకుఁ
బంపుమనియుఁ దండ్రిని గోరెను. అట్లే పంపియుండునెడల ఎక్విలు
ఖానునే కోరియుండును. ఔరంగజే బాతనిని తనకడకు రమ్మని
వ్రాసెను. ఇంతలో ఎక్విల్ ఖాను శత్రువు 'రాజపుత్రికను వరించుట
పులితో చెలగాటమువంటిది. ఔరంగజేబు నీచేతలన్నిటిని తెలిసి
కొనెను. నీవు కొలువునకు రాఁగానే ప్రతిఫల మందఁగల' వని
ఎక్విలునకు లేఖ వ్రాసెను. ఔరంగజేబు తనపై పగతీర్చుకొనఁ
దలచి యాపన్నాగమును బన్నెనని ఎక్విలు తలఁచి ఫీరుపై తనపద
వికి రాజీనామా నిచ్చుచు తనకు వివాహేచ్ఛ లేదని వ్రాసెను.
జేబున్నీసా చాల విచారించెను. 'ఎక్విలుఖాను మూర్ఖుఁడై నాకు
మర్యాద చూపక వెడలిపోయినాఁడు.' అని లేఖవ్రాసెనఁట. ఆ
వాక్యములకు ఉద్యోగమును వదలినాఁడను నర్థమును గలదు. అందుపై
నాతఁడు 'సజ్జనుఁడు తనకు రాఁబోవు నాపదను గుర్తించి మెలఁగు'
నని జవాబిచ్చెనఁట. ఎక్విలుఖా ననగా సజ్జనుఁడను నర్థము కలదు.

జేబున్నీసాను జూచుట కొకసారి ఎక్విలుఖాను రహస్యముగ
ఢిల్లీకివచ్చెను. వారిరువురును దోఁటలోఁ గలసికొనిరి. అట్టిసమయమున
చక్రవర్తి యచట ప్రత్యక్షమాయెను. అతఁ డాసమయమున నచటికి
వచ్చునని వారిద్దరును దలఁపలేదు. జేబున్నీసా ఎక్విలుఖానును
అచటనున్న నీటికాగులో దాచిపెట్టెను. ఔరంగజే బచటికి వచ్చి
ఆకాగులో నేమున్నదని ప్రశ్నించెను. 'కాఁచుటకు నీరమున్న' దని
జేబున్నీసా ప్రత్యుత్తర మిచ్చెనఁట. ఔరంగజేబు సేవకులఁ బిలచి
పొయిపైఁ బెట్టించెను. జేబున్నీసా కాఁగుకడకుఁబోయి 'నన్ను
వలచిన ప్రియుఁడవైనయెడల నామర్యాదఁ గాపాడు' మని చెప్పె

నట. ఆమె తనపద్యకావ్యమున 'ప్రపంచభోగముల నాశించు విటుని గతి అగ్నిచేతను శలభమువాడ్కి మాడుటయే' యని వ్రాసెను. అటు పిమ్మట నామె చెరయం దుంపఁబడెను!'

ఈపైగాథకును చరిత్రవిషయమునకు నేమాత్రము సంబంధము లేదు. ఈగాథ జేబున్నీసా మేనత్తయగు జహానారాకు చెంది యున్నది. ఎక్విలుఖాను చరిత్రకూడ దీనిని ఖండించుచున్నది

ఎక్విలుఖాను (వీరు అక్వీరునామాంతరము) పారసీకములో నున్న ఖ్వాఫీవాస్తవ్యుఁడు. ఈతఁడు ఆపైగాథలో చెప్పఁబడినటుల ఢిల్లీవజీరు పుత్రుఁడు కాఁడు. ఔరంగజేబు దక్కనురాజప్రతినిధిగ నున్నపు డీతఁడు జిలాదారుగా ఔరంగజేబుకడ ప్రవేశించెను. ఈతఁడు కవి. 'బక్వాసుద్ది' యను సాధువునందు భక్తిచే 'రాజీ' యను నామమును గూడ చేర్చుకొనెను. ఔరంగజేబు సింహాసనము కొఱకు ప్రయత్నము చేయునపుడు సంసారమును దౌలతాబాదుకోటలో విడిచి ఎక్విలును ఆనగరమునకును కోటకును గవర్నరుగా నియమించెను. 1658 ఫిబ్రవరి 6-వ తేదినుండి 1659-వ సంవత్సరము ఆఖరు వఱకు ఆపదవియందే యుండెను. 1660-వ ఫిబ్రవరి 8-వ తేదిని యమునాగంగానదులకు మధ్యప్రదేశమునకు ఫౌజుదారుగా నుండెను. 1661లో మరియొక కీలకోద్యోగమున నియమింపఁబడిరి. నవంబరు నెలనుండి రు. 750-లు పెన్షను(ఫించను)మీద లాహోరులో విశ్రాంతి తీసికొనెను. 1663 నవంబరులో ఔరంగజేబు సంసారముతో కాశ్మీరము నుండి తిరిగివచ్చునపు డాతని అంగరక్షకుఁడుగ నుండెను.

1664 జనవరిలో రహస్యాలోచనామందిరమునకు సూపర్నెంటుగా (Superintendent of Hall of private Audience) నియమింపఁబడెను; ఈకాలమున ఈతఁడనిన చక్రవర్తికి మంచి యభిప్రాయము కలిగినది. 1666 అక్టోబరులో ఉద్యోగమున నభివృద్ధి చెందెను. 1667 మెయినెలలో రాజబహుమానములను గూడ పొందగలిగెను. అటుతర్వాత పోస్టుమేష్టరు జనరలుగా నియమింపబడెను. ఏప్రిలునెలలో ఏ కారణముననో పదవికి రాజీనామా నిచ్చెను. తరువాత ఏడు సంవత్సరములవరకు కీతని చరిత్ర ఏమియుఁ దెలియదు. 1676 అక్టోబరులో రు. 1000-లు జీతముపైకోశాగారోపాధ్యక్షుఁడుగ నియమింపఁబడెను. ఈతఁడు 1680 లో సుబేదారుపదవి నందెను. ఆతఁడు చనిపోవునంతకు (1696) ఆ ఉద్యోగమునందే యుండెను.

ఈ చరిత్రాంశములు చూడ పైగాథ యసత్యమని స్పష్టమగుచున్నది. 30 సంవత్సరములకు తక్కువ వయస్సువానిని మహలునకు రక్షకుఁడుగ ఔరంగజేబు నియమించెనను టసంభవము. ఆకారణమున ఎక్విలు చనిపోవునప్పటికి ముసలివాఁడైయుండవలెను. 'మీర్జాబెడి'లను ఎక్విలు స్నేహితుఁడు వ్రాసిన లేఖ లీతఁ డొక సామంతప్రభువు కుమారుఁడని తెలుపుచున్నవి. అయినను లాహోరు ఉర్దూచరిత్రకారుఁడు బెర్నియరు స్వయముగ చూచెనని వ్రాయుచున్నాఁడు. బెర్నియరు మనుస్సీ వ్రాసిన దానినుండి యెత్తికొని జహానారావిషయమును వ్రాసెనే కాని జేబున్నీసావిషయ మేమియు వ్రాయలేదు. ఆకథయే మనము నిజమని నమ్మునెడల ఉద్యోగకాలమున అత్యంత్యదశలమాత్ర మాతనికి వీలుకలిగియుండవలెను. 1661-63 వర కాతఁడు తీసికొనిన విశ్రాంతికాలమునఁగూడ జీత మీయఁబడి యుండుటచే నాతఁడు ఉద్యోగమునకు రాజీ ఇచ్చినది చక్రవర్తిభయమున ననుటకు వీలులేదు. ఆతఁడు రాజీనామాయిచ్చిన కాలములో ఔరంగజేబు కోపమున కేకారణముననో భయపడియుండవచ్చును కాని తరువాత మరల గొప్పపదవియందు నియమింపఁబడుటచే ఈ గాథకు సంబంధించిన కారణమై యుండదు.

అటుతరువాత, 'అక్విలుఖానుసీళ్లతో వచ్చిన లేఖల తాను జాగ్రత్తగఁజూడనిదే యుత్తరులు విప్పరా' దని ఔరంగజేబు పుత్రుఁడగు మహమ్మదుఅక్బరు శాసించెనను సాధారమగుగాథయుకలదు. జేబున్నీసాకు సోదరుఁడగు మహమ్మదుపై నెక్కుడగు ప్రేమ కలదు. ఆకారణమున నాతని కన్నివిధములనో సాహాయ్య మొనర్చెను. ఆమె మహమ్మదుతండ్రిపైఁ గత్తిరొత్తునపు డెంతయో సాహాయ్య మొనర్చెను. ఆమెమహమ్మదు పేరిట వ్రాసినయెడలఁ జిక్కులుసంభవించునని 'మహమ్మదు అక్వి'లను మతాచారిపేర ఉత్తరప్రత్యుత్తరముల అన్నగారికి జరుపుచుండెడిది. జేబున్నీసా ఖురాను పండితురాలగుటచే మతాచారికి లేఖవ్రాయుట తప్పని యెంచరనియు, తమ్ము ననుమానించరనియు నట్లు చేసెను. పైకల్పితగాథకు సంబంధించిన ఎక్విలుఖాను ఈమెతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచుండెనని యనుమానింపఁబడెనను విషయము ఎక్విలు వెంటనే ఢిల్లీప్రతినిధిగ నియమింపఁబడుటచే నమ్ముటకు వీలు లేదు. అదియునుగాక, ఆమె అప్పటనే ఎక్విలు ఆధీనమున రాచఖైదీగాఁ జేయఁబడెను.

1681 వ జనవరిలో జేబున్నీసా తండ్రిపైఁ గత్తిగట్టినున్న మహమ్మదునకు సాహాయ్యముచేయుటచేఁ జెఱకు పంపబడెనని చరిత్ర ఘోషించుచుండ ఈగాథారోదన మెవరి కింపుపుట్టింపఁగలదు? 1681 జనవరి 16వ తేదిని మహమ్మదు ఓడిపోయి చెఱయందుఁ బెట్టఁబడెను. అతనిదగ్గఱ జేబున్నీసా వ్రాసిన లేఖలన్నియు దొరకెను. అందుచే జేబున్నీసా కీయఁబడుచున్న 4 లక్షలరూకలను ఆపుచేయుటయే కాక ఈమె ఆస్తియంతయుఁ దీసికొని సాలింఘురుకోటలో ఈమెను ఖైదుచేసిరని 'మసిరి అలంఘిరి' చెప్పుచున్నది.

జేబున్నీసానుగూర్చి చెప్పిన మరియొకగాథలో నీమె శివాజీని వర్ణించెననియు వారిరువురును ఉంగరములు మార్చుకొనిరనియు వ్రాయఁబడెను. ఈవిషయమును పారసీకచరిత్రకారులుగాని మహారాష్ట్రచరిత్రకారులుగాని వారిచరిత్రల నిరూపించియుండలేదు. అంగు హిందూమతాభిమానియగు శివాజీ మహమ్మదీయవనితను వరించెనను టెంతయాశ్చర్యకరము? విద్యాగంధములేని అనాగరికుఁడని మహమ్మ

దీయు లుద్దేశింప శివాజీని బందీకురాలుగ జేబఉన్నీసా వలచె నను టకుఁగూడఁ దావు లేదు.

జేబఉన్నీసా తక్కినజీవితకాల మంతయుఁ జెఱయందే కడ పెను. స్థానికచరిత్ర యిట్లు వ్రాయుచున్నది. "1702 మే 26 వ తేదిని జేబఉన్నీసా మరణవార్త ఔరంగజేబునకుఁ జేరెను. ఎంత కఠి నహృదయుఁడైనను పుత్రిక మరణవార్త విని యూరకొనఁగలఁడా, ఔరంగజేబు విచారమున కంతము లేదు. ఆఁయుదానికంటె నవ్యాయ ముగ విచారించెను. తరువాత కొంతసేపటికి ధైర్యమువహించి సయ్యదు అంజద్ ఖాను, షేక్ అతా ఉల్లా హాఫీజు ఖానులను దానధర్మాదుల యందు నియమించెను." ఆమెగోరి డిల్లీలోనున్న కాబూలుగేటు కావల 30,000 మహావృక్షములున్న తోఁటయందుఁ గట్టఁబడెను. కాని రాజపుత్రస్థానమున కరైలుమార్గము వేయునపు డాగోరి నాశ నము చేయఁబడెను.

## ii జినాతున్నీసా

జినాతున్నీసా, దిల్రాసుభానుబీగము ద్వితీయపుత్రిక. ఈమె క్రీస్తుశకము 1643 వ అక్టోబరు 5 వ తేదిని ఔరంగబాదులో జన్మిం చెను. 25సంవత్సరములుదక్కనులోఁ దండ్రియొక్క సంసారకార్యనిర్వ హణము చేసెను. ఔరంగజేబు మరణానంతరము ఈమె, అన్నయగు అజాముషాహరొండల నెక్కుడగు ప్రేమతో మెలఁగి అతనికి కార్యనిర్వ హణమున సహాయము చేయుటయందు పరిపూర్ణముగ శ్రద్ధ తీసికొనెను. ఆతఁడోడిపోయినను బహదూరుషాతో సఖ్యము చేసికొనుటకు సమ్మ తింపలేదు. ఆతఁడీమెకు పెన్షాబీగ మను బిరుదమునిచ్చి డిల్లీకిఁ బం పెను. ఈమె సత్ప్రవర్తనను దానధర్మములను జరిత్రకారు లెంతయో ప్రశంసించియున్నారు. జినాతున్నీసా తన వివాహకట్నము క్రింద ధనమును ఔరంగజేబుకడ తీసికొని 1700వ సంవత్సరమున 'జినాత్ ఉల్-మసీదును' కట్టించెను. 'కారీమసీ'దని దానికి మరియొక నామము కలదు. ఈమె ఆజన్మాంతము బ్రహ్మచారిణియైయుండెను. సత్ప్ర వర్తనమున నగ్నిశిఖ. ఈమె క్రీస్తుశకము 1721 మెయి 18 వ తేదిని డిల్లీయందే 80 వ పడియందుఁ జనిపోయెను. ఈమెచే కట్టింపఁబడిన మసీదునందే ఈమెను ఖననము చేసిరి. కాని తరువాత కొంతకాలమునకు ఆంగ్లేయ సైనికాధికారులు వారి నివాసముకొఱకు ఈమె సమాధి నెచ టికో మార్చిరి.

## iii జుబ్దతున్నీసా

జుబ్దతున్నీసాయును ఈబీగముకూఁతురే. ఈమె 1651-వ సెప్టెంబరు 2-వ తేదిని ముల్తానులో జనన మందెను. ఈమె పెద్దతండ్రి దారా ద్వితీయపుత్రుఁడగు సిఫిషుకోకు 1673-వ జనవరి 30-వ తేదిని ఇచ్చి వివాహము చేయఁబడెను. జుబ్దతున్నీసాకు అలీబహీరను బాల కుఁడు కలిగి ఆఱునెలలలో ప్రసే 1676 లో మరణించెను. ఈమె 1707 ఫిబ్రవరి 17-వ తేదిని జనిపోయెను.

## iv భద్రఉన్నీసా

భద్రఉన్నీసా క్రీ. శ. 1647 నవంబరు 17-వ తేదిని నవాబు భాయికి జననమందెను. చరిత్రకారు లీమెనుగురించి యేమియు వ్రాసి యుండలేదు. ఈమె కోటీగురుపువద్ద ఖురాను చదువుకొనెను. ఈమె 1670 ఏప్రియలు 9-వ తేదిని జనిపోయెను.

## v మిహ్రఉన్నీసా

మిహ్రఉన్నీసా 1661 సెప్టెంబరు 18-వ తేదిని ఔరంగ బదీమహాలునకుఁ గలిగెను. 1672-వ నవంబరు 27-వ తేదిని ఈమెను మురాదుయొక్క పుత్రుఁడగు యిజీదుభాఖ్షా కిచ్చి వివాహ మొనరిం చిరి. 1706-వ సంవత్సరం జూన్ నెలలో ఈమె చనిపోయెను.

---

# విరహావస్థ

పొన్నలూరి సూర్యనారాయణశర్మ గారు

తరుణరసాలోద్గతంబైన యభిరక్తపల్లవదివ్య ప్రభాళివలనఁ
బల్లవాశనముఁ బరిఢవిల్లిన పరభృతగానములలోని బెడఁగువలనఁ
బరభృతగానప్రభావానుసారులౌ సురుచిర షట్పదశ్రుతులవలన
షట్పదశ్రుతిఁగల సారస్యమునుమెచ్చు తమ్మికన్నుల చొక్కఁదనము వలన
గడలుకొనురాగరసమున నెడఁదమెల్ల-నెల్ల లేని ప్రియత్వంబు నెనసి పెనఁగఁ
జిత్తవికృతుల కగ్గమై చెలువుగుందు-విరహికి సుఖంబుగలదె మోహ్వేళనయిన?



శ్రీ బొజ్జన మహాత్ముడు రెడ్డిగారు



శ్రీ నూతి వెంకటసుబ్బయ్య శ్రేష్ఠిగారు



శ్రీ లేపాక్షి రామకృష్ణప్పగారు



శ్రీ పెనుమత్స సత్యనారాయణరాజుగారు



శ్రీ కొత్త సుబ్బరాజుగారు



శ్రీ డాక్టరు బూదిహాళ్ మాధవాచార్యులుగారు



శ్రీ దంటు సీతారామశాస్త్రిగారు



శ్రీ శ్రీరామ్ వీరబ్రహ్మముగారు



శ్రీ మహమ్మద్ అబ్దుల్ కరీం సాహెబుగారు



శ్రీ అధికార్ల సత్యనారాయణమూర్తిగారు



శ్రీ వాసిరెడ్డి రాములుగారు



శ్రీ సిరసనమల్లి కొండలరావుగారు



శ్రీ పి. ఏకేశలింగాచారిగారు



శ్రీ పి. దయమనికన్య గారు



శ్రీ గా. నయుదయ్యగారు



శ్రీ చేగు వీరరాఘవయ్యగారు



శ్రీ వారణాసి పరదేశిగారు



శ్రీ గుత్తుల సూర్యనారాయణగారు

సీ. వికసిత కింశుక వితతి ప్రసూనముల్ మెఱసి చూడ్కుల మిఱుమిట్లు గొలుప
ద్విజగణసేవిత విమల స్రవంతికా తనురూపముల కెద తాపపడఁగ
సహస్రంబులైన పయోజాత పరిమళములకుఁ జిత్తము గడుఁ గలఁగుచుండ
నారికేళాచూత ఫలామేయరస సమాస్వాదనంబుల మది వగలఁ గుంద
బ్రదుకుపైఁగల యాసఁ గీడ్వడుచు నచట-నచట విహరించి విహరించి యన్నమిన్నఁ
జేరు టెపుడో యటంచును గోరియుండు-విరహికి సుఖంబు గలదె యెవ్వేళ నయిన?

సీ. జలభారమునఁ గ్రుంగి శైలశృంగములపై విశ్రాంతిఁగొను కందబృందములను
దళుకు తళుక్కునఁ దన్నిర్గతములైన చంచలచంచలాసముదయములఁ
దత్కాంతిచేఁ దెన్నుఁదడవి ధైర్యముఁబట్టి సరసుఁజేరెడు నభిసారికలను
వానతుంపఱలకు వాహామై మెలమెల్లఁ దూఁగాడు ననిల పృథుకచయమ్ముఁ
జూచి చూచి మనంబున నేఁచినట్టి-బెట్టిదపుటాస లవియెల్లఁ బ్రిదిలిపోవఁ
బృథివిఁ బడిపోయి మిగుల నిస్పృహతఁ జూచు-విరహికి సుఖంబుగలదె యెవ్వేళ నయిన?

సీ. సితమేఘశకలాంతరితుఁడై తనుంజూచి యుపహాసించెడు కుముదాప్తుఁజూచి
శరసుమచ్ఛాయావిశదనీరములపైనఁ బ్రియుఁగూడికొను నంచపెంటిఁజూచి
చంద్రికాననసంబు సవరించి సొబగారు సప్తచ్ఛదంబుల సౌరుఁజూచి
శ్వేతసౌధముల గోష్ఠీరసానాసక్త కాముకమిథున విక్రాంతిఁజూచి
సైకతంబుల రతిసేయు చక్రవాక-మిథున గాఢానురాగంపు మేల్మిఁజూచి
వెతలు హృదయంబు మథియింప ప్రేలునట్టి-విరహికి సుఖంబుగలదె యెవ్వేళయందు?

సీ. స్వభవనప్రముములైన సస్యముల్ కాపుల కొంకనండ్ల వాడికి గుఱుతుగాఁగ
నిరులు గ్రమ్మెడు సాంద్ర హిమపూరములకుఁ జందురుఁడు దేజముఁదక్కి దొసఁగుగనఁగ
నాపాతమైన యత్యంత హిమానికిఁ జూత ప్రసూనముల్ స్రుక్కువడఁగ
శాద్వలనిహిత తుషారబిందువులకు రవిరశ్మిచాప మైంద్రంబుగాఁగ
సీతుపెనుబాధలకు నోడల్ సిలుఁగు లెనయ-శూన్య బాహుపరీరంభసుస్థిరతను
దినములు గణించుకొనుచున్న ధీరహితుఁడు-విరహికి సుఖంబుగలదె యెవ్వేళ నయిన?

సీ. కలువకంటుల బిగికౌఁగిళ్ల నలఁగుచు నిదురించు జనుల నెమ్మదిఁ దలంచి
చలిమంటలకుఁ జెంతనిలిచి క్రాఁగుచు నావులించెడుజనుల యిమ్మొంచియెంచి
వెలలేని పొలములఁ జెలువారు మిరెపపండులపిండు జోలు ఛాయఁ దిలకించి
నవరైన పరిణయోత్సవ సమాగత బంధుజన దంపతులయింపు ఘనతఁదలఁచి
తనకు బ్రదికెడునాస డెందమున లేక-యీశ్వరార్పణముగఁ దన యెల్లభోగ
మర్పణముసేసి నిస్పృహ నలసియున్న-విరహికి సుఖంబుగలదె యెవ్వేళ నయిన?

---




కోలవల వేంకటప్పాశర్మ గారు, యస్. ఏ., యల్. టి.

శ్లో. యా స్థాయిభావ రతిరేవ నిమిత్తభేదాత్, శృంగారముఖ్యనవనాట్యరసీ భవన్తీ;
సామాజికాన్ సహృదయాన్ నటనాయకాదీన్, ఆనందయే త్సహజపూర్ణరసోఽస్మి సోఽహమ్.

కావ్యశ్రవణపఠనముల చేతను, రూపకదర్శనము చేతను, గల్గు నానందము సర్వజనులకును స్వానుభవముచే తెలియంగినదైనను ప్రాచీనకాలమునుండియు నీవిషయమున నభిప్రాయభేదము లుండుటయు తథ్యములు, వానిని విమర్శించి సిద్ధాంతము సేసియున్నను పూర్వపక్షములే మన కలవాలుగా జెలంగా పుచుండుటయు ప్రత్యక్షముగా గనుచున్నాము. పాశ్చాత్య నాగరికతతోను, అందును నాంగ్ల వాఙ్మయముతోను మనపరిచయము హెచ్చిన కొలందియును, దేశీయ వాఙ్మయ పరిచయము తగ్గుట, అందుచే సనాతనములగు మనయాదర్శము లేవియో తెలియకయుండ వలసినంతవట్టుకైన నాదరణ సేయక పోవుటచే,



వ్యాసకర్త

"రీతి నీతివ్యవహృతీ రన్యదీయా ఉపాస్మహే"

అన్నట్లు షేక్స్పియరునో, షెకారిడీనో, టాల్‌స్టాయినో ఆదర్శముగా నిడికొని మన కాదర్శములుగాని, విజ్ఞానముగాని లేనియట్లు కొందఱు పారస్వతప్రియులు దారితప్పుచుండుటయు నిప్పుడు ప్రాయికముగాఁ గనుచున్నాము. అందుచే నప్పుడప్పుడు మనయాదర్శముల యొక్కయు శాస్త్రములయొక్కయు నౌత్కృష్ట్యమును జాటుచుండ వలసిన యావశ్యకత కానవచ్చుచున్నది. ఇందుచే సర్వవిషయముల నభినవ విజ్ఞానమును, ఆదర్శాంతరములను విమర్శింపకయే పరిత్యజింపవలసినదని కాదు. అనాగరికకోటిప్రవిష్టముకాని యేజాతిగాని, వ్యక్తిగాని తన విజ్ఞానమును, ఆదర్శములను అలవఱచికొనక అన్యాదర్శములచే చూఱపెట్టుకొని యభివృద్ధిప్రయత్నములఁ జేయుచుండుచోఁ గ్రమముగా స్వరూపనాశము సంభవిల్లి బ్రహ్మకాంబోయి తిమ్మినగుట సంభవించును. అట్టియభివృద్ధి కొండొకచో నభివృద్ధిగాఁ గన్పట్టినను వాస్తవముగా నది వాపుగాని బలుపుకాదు. ఈ వ్యాసములో నట్టివాటిలో నింటెనిగుఱించిమాత్రమే విచారింతము. అందులో (౧) రసస్వరూపవిభాగములో 'శోకరస'మని దుఃఖాంతకావ్యము లుండవలె ననుట; (౨) రసచర్వణా (అనుభవము) విషయమున నటులను ద్రోసిరాజనుట.

లోకమున మనుజుఁడు సుఖదుఃఖముల ననుభవించి పిదప సింహావలోకనము చేసికొన్నచోఁ దా ననుభవించిన సుఖదుఃఖ దృశ్యము లన్నియు నాకాలమున మనఃఫలకమునఁ జిత్రితములయి, వానిలోనున్న కార్యకారణసామగ్రివిషయకములగు రాగద్వేషములు స్వరసముల్లనే యుద్బుద్ధిల్లుటకు నిది యిట్టిదియని నిర్వచించుటకు వీలు లేని యనుభవవిశేష మొండు సాక్షాత్కరించును. పైఁదెల్పిన కార్యకారణసామగ్రియందును, అనుభవవిశేషములయందును నుండు లోపములను పరిమితత్వమునుఁ గలపోసి, అట్టి లోపములు లేనిదియు నట్టివిచ్ఛిత్తివిశేషమును గల్గించునదియు నగు కృతకప్రపంచము నొండు గల్పింప నమకట్టును. అట్టి కృతకప్రపంచనిర్మాణమున లోకోత్తరప్రజ్ఞఁ జూపిన మహానుభావులే మహాకవులు. ఆకృతకప్రపంచము నందలి వివిధానుభవములు తమకుఁ దగిన సంఘటనలలోఁ గేంద్రీకృతములై ప్రార్థితంబగు సుఖానుభవమును గల్గఁజేయును. ఇవియే కదా శ్రవ్యదృశ్యభేదంబుల నందిన కావ్యములు.

మన దేశమున, లౌకికవ్యవహారములనుగూడఁ బ్రయోజనవిచక్షుచే విభజించి, అన్నిటికిని మొత్తముమీద నాల్గేప్రయోజనము లని కోవిదులు నిర్ణయించియున్నారు. ఈ విషయమున విప్రతిపన్ను లగువా రెవ్వరును గానరారు. లోకమున నవి ప్రయోజనము లగుచో,

లోకానుకృతియై దాని ప్రయోజనములనే మఱియంతసమర్థతతోఁ గొలఁదికాలమునను గొలఁదిప్రదేశమునను గనుపఱచి 'సూక్ష్మములో మోక్షము'ను జూపింపనేర్పడిన కృతకప్రపంచమగు కావ్యప్రపంచమునఁగూడ నవియే ప్రయోజనము లగునని వేఱుగఁ దెల్పవలెనా? అందును ధర్మార్థకామములు మూఁడును త్రివర్గమని ప్రవృత్తిమార్గ ప్రయోజనములుగను, ఇవియొక్కొక్కటియు ధర్మానపేక్షత్వవిశిష్టములై క్రమముగా మోక్షోపయుక్తములగుటచే మోక్షము పరమప్రయోజనమై నివృత్తిమార్గప్రయోజనముగను నిర్ధారణచేసియున్నారు. ఈ మోక్షమను పరమప్రయోజనము పరమసుఖముకంటె వ్యతిరిక్తముకాదనియు నందుచే నుత్కృష్టమగు సుఖమే పరమపురుషార్థమనియు—

"తస్మాత్ దుఃఖాసంభిన్నం సుఖంహి
పరమపురుషార్థ ఇతి సర్వతంత్రసిద్ధాన్తః"

ఇత్యాదివాక్యములచేత హారిభక్తిరసాయనాది గ్రంథములయందు సిద్ధాంతీకరించియున్నారు. ఈసుఖమునే

"ఇతరేచ్ఛానధీనేచ్ఛావిషయత్వంసుఖత్వం"

అని తార్కికులును,

"సర్వేషామనుకూలతయా వేదనీయంసుఖం"

అని మఱియొకరు, మఱియొకవిధముగా మఱియొకరును ఇంకొకవిధముగా నింకొకరును నిర్వచించియున్నారు. దీనినే పరానందమని, ఇదియే పరబ్రహ్మస్వరూపమని—

"అయమాత్మా పరానందః పరప్రేమాస్పదం యతః"

ఇత్యాదివాక్యములచే శ్రీవిద్యారణ్యమునులును,

"ప్రజ్ఞాన మానందం బ్రహ్మ"

ఇత్యాదివాక్యములచే శ్రుతియు నిరూపించిరి.

"రసో వైసః రసంహ్యేవాయం లబ్ధ్వా ఽఽనన్దీభవతి"

ఇత్యాది శ్రుతివాక్యముల నూఁతకోలగాఁ గొని స్వయముక్త్యనుభవములచే నిర్ధారితమగు నీసుఖమునే ఆలంకారికులు "రసము" అని వ్యవహరించుచున్నారు. అందుచే నుపాధిభేదములచే నెన్నిభేదములుగా ననుభవములోనికి వచ్చినను రసస్వరూప మొక్కటియే కాని వేఱుకాదు.

'ఆనంద' 'సుఖా' పరపర్యాయమగు రసముయొక్క స్వరూపమును ప్రామాణికులె భిన్నభిన్నవిధముల నిరూపించియున్నారు. వానిలోఁ గొన్నిటి నిట నుదాహరించెదను:—

భరతుఁడు—నాట్యశాస్త్రమున

"రసఇతి కః పదార్థః? ఉచ్యతే ఆస్వాద్యత్వాత్?......
శ్లో. యథాబహుద్రవ్యయుతై ర్వ్యంజనై ర్బహుభిర్యుతమ్;
ఆస్వాదయంతిభుంజానా భక్తం భక్తవిదో జనాః.
భావాభినయసంబద్ధాన్ స్థాయిభావాం స్తథాబుధాః;
ఆస్వాదయన్తి మనసా తస్మాన్నాట్యరసాస్స్మృతాః."

మమ్మటుఁడు—కావ్యప్రకాశమందు

శ్రీ శంకుకభట్టనాయకాభినవగుప్తాచార్యుల మతములనే యొప్పుకొని, చిద్విశిష్టస్థాయిభావమే రసమని బ్రహ్మానందాస్వాదతుల్యమని నిర్ధారణ చేసెను:

"వ్యక్తస్సతై ర్విభావాద్యైః స్థాయీభావో రసస్స్మృతః."

వాగ్భటుఁడు—అలంకారము

"ఆరోప్యమాణ ఉత్కర్షం స్థాయీభావో రసస్స్మృతః."

జగన్నాథుఁడు—రసగంగాధరమున

"తత్కాలనివర్తితానందాంశావరణజ్ఞానేన, అతఏవ ప్రవృత్తపరిమితప్రమాతృత్వాది నిజధర్మేణ ప్రమాత్రా స్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానందేన సహ గోచరీక్రియమాణః ప్రాగ్వినివిష్టవాసనారూపః రత్యాదిరేవ రసః."

ధనికుఁడు—దశరూపకము

"విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః;
ఆనీయమానస్స్వాద్యత్వం స్థాయీభావో రసస్స్మృతః."

సింగభూపాలుఁడు—రసార్ణవసుధాకరము

"సాక్షాత్కారమివానీతైః ప్రాపితాస్వాదరూపతామ్;
సామాజికానాం మనసి ప్రయాన్తి రసరూపతామ్;
...సోఽయమానందసంభేదో భావకై రనుభూయతే."

అమృతరాయఁడు—సాహిత్యసారము

"విభావాద్యైరపజ్ఞాన చిద్వ్యద్యస్థాయ్యసౌ రసః;
యద్భావతత్స్వంయుతి వ్యక్తస్థాయ్యపాన్ని శ్చైవ సః.
రసో వైసరసంలబ్ధ్వా ఽఽనన్దీభవతిశ్రుతేః;
పతుశ్చేతమపవ్యాప్త పరమఃపరమాస్పదమ్."

పాఠకమహాశయులారా! ఇచట నుదాహరించిన ప్రమాణములచేఁ ప్రాచీనులయొక్కయు, నవ్యసర్వతంత్ర్యులు గాని నవీనులయొక్కయు మతములు నిరూపింపఁబడినవి. ఇంతియకాక చరమసిద్ధాంతము యొక్క బీజములు మొదటినుండియు నున్నను "స్వరూపానందానుభూతియే రసానుభూతి" యను పరమసిద్ధాంతము క్రమముగా

నెట్లు వికాసము చెందినదియును స్పష్టమగును. వీనిలోఁ దుట్టతుద కీయఁబడిన యచ్యుతరాయమతము అర్వాచీనమయినను ప్రాచీనముల వలెనే ప్రామాణికమని విమర్శకులచే నంగీకరింపఁబడుటచేతను, పూర్వమతముల నన్నిఁటిని జక్కఁగాఁ బర్యాలోచనచేయుటచేతను సుగమమును, నందఱకు నుపాదేయమును నగుచున్నది. ఈపండితుని చేతనే—

"శ్లో. శ్వా యథా చర్వయన్నస్థి తత స్స్వముఖశోణితమ్;
మత్వా తదీయం రమతే తద్వియోగేచ ఖిద్యతి.
తథైవానాదిసంస్కారై ర్జీవ శ్శబ్దాదికం భజన్;
తల్లాభేన తదిచ్ఛాయా ధ్వంసేంతర్ముఖమానసే.
ప్రతిబింబిత మానందం బ్రహ్మైవాత్మాన మద్వయమ్;
తదీయత్వేన మత్వాఽథ సుఖదుఃఖే వ్రజ త్యలమ్.
ఇచ్ఛోపశమ ఏవాతః వ్యంజకో వ్యవధానతః;
సుదృశాం ముకురో యద్వత్స్వరూపానందవారిధేః."

అని యుదాహరణపూర్వకముగా నిర్ధారణచేసియుండుటచేత, లోకములోని విషయానందముకూడ నావరణతొలఁగుటచేత స్ఫురించు స్వరూపానందమే కాని వేరుకాదను పరమసిద్ధాంతము సుప్రతిష్ఠితమైన పిమ్మట కావ్యానందమునకు గత్యంతరములఁ గల్పించుట క్షుద్రములగు మతాంతరములను నిలువఁబెట్టఁ బ్రయత్నించుటయు, కేవలము స్వసిద్ధాంతాజ్ఞానదౌర్భాగ్యమును ఉత్పథగామిత్వమును వెల్లడిచేయుచున్నదనుమాట స్పష్టమగుచున్నది. ఇదియుంగాక రసము బ్రహ్మస్వరూపము కాదన్నచో వేదవిరోధము; ఆనందస్వరూపము కాదన్నచో సకల ప్రామాణికానుభవవిరోధము. దుఃఖముగూడ రసమేయన్నచో రసైక్యాది సర్వమతవిరోధము ఘటిల్లెడును. కానసే ప్రబోధచంద్రోదయవ్యాఖ్యాతయగు నాదిల్లగోపప్రభుండును

"నిర్వహణసంధౌవిగళితవేద్యాన్తరః
సాక్షాద్బ్రహ్మానందఏవ"

అనెను.

ఈ రసస్వరూపసిద్ధాంతమును గొంద ఱలవఱచుకొనకయుఁ, గొంద ఱనాదరణచేసియుఁ బొరుగింటి పుల్లకూర రుచియన్నట్లు 'దుఃఖరస' మని, దుఃఖాంతకావ్యములని పాశ్చాత్యులపక్కి ననుసరించి కావ్యవిభాగమును నిర్మాణము చేయుచున్నారు. అందుచే మనలో నన్నియు సుఖాంతములు (కామెడీ) గానే యుండుట, దుఃఖాంతములు (ట్రాజెడీ) లేకుండుటయుఁ బెద్దలోపముగా నెంచుచున్నారు. ఈసందర్భమున మనకు పూర్వముగూడ కష్టాంతనాటకము లుండియుండవచ్చుననుటకు పతంజలిముని రచితంబులగు 'కంసవధ' 'బలిబంధనము' అనునవి అట్టివయియుండవచ్చునని యూహించుచున్నారు. 'వధ','బంధ'ము అన్నంతమాత్రమునఁ గష్టాంతములే కానవసరము లేదు. అట్టివియే యయియుండి యట్టిప్రస్తావ మంగీకృతమైనచోఁ బూర్వము విరళలక్ష్యములఁ బురస్కరించుకొన్న యాలంకారికులు పతంజలి ప్రామాణికుండగుటచే రూపకలక్షణముల నట్టివిభాగమును, రసగణనమున నట్టి రసాంతరమును నొప్పుకొనియుండెడివారు. మఱియు భర్తృహరినిర్వేదము దుఃఖాంతనాటకములలో నేకద చేర్పవలసియుండుననుదియు సమాధానము కాఁజాలదు. ఏలయన సత్కావ్యముల రస మెట్లుండవలయునను విచారమున నొక్కటి వెడలి యున్నచో నది యపవాదమగునుగాని ప్రమాణము కాఁజాలదుగద! ద్రౌపది బహుభర్తృకాత్వము ప్రమాణమని అట్టివిగూడ నుండఁదగునని యొప్పుకొందురా! కాన దుఃఖాంతరూపకప్రస్తావము ప్రాచీనాభిప్రాయమునకు విరుద్ధము కాదనవీలు లేదు. మఱియు విచారించినచో దుఃఖము రసమెట్లగును? రసము సుఖస్వరూపముగద! కాదు; మాకభిమతమగుటచే దుఃఖమును రసాంతరము నంగీకరింపవలసినదేయన్నచో సుఖైకప్రవాహమగు భూతప్రకృతి దుఃఖము నెట్లు కోరును? చివరకు సుఖముండునని తెలిసిన నేకద ఎవ్వఁడైనను నట్టిసుఖమును సంపాదింప దుఃఖమునకైన నియ్యకొనును! అనఁగా నుపాయముగా దుఃఖమున కియ్యకొనునుగాని యుపేయముగాఁ గోరుకొనఁడు. పసువైనను దనకు సుఖాపాదకమగు గడ్డిమొదలగునది మనోరూఢముకానిచో నీరుదాటుటయో బురదలో దిగిపోవుటయో మొదలగు కష్టముల కియకొనదే! ఈ విషయమునఁ బసువులకును, బండితులకును భేదము లేదని శ్రీశంకరదేశికుల భాష్యమున నిర్ధారణచేసినారే! దుఃఖమే రసము పరమావధియగు మాయమతమున జనులందు ప్రవృత్తి నెట్లుసాధింతురు? సర్వానుభవసిద్ధమగు సుఖప్రవణతను ద్రోసిపుచ్చి దుఃఖానుభవమును జనులు కోరుదురనుట యేటిన్యాయము! బరువును మోయుకూలీగాని, స్వవిధియని కష్టకార్యములనుఁ జేయు వృత్తిపన్నుఁడుగాని, యాయా పనులయం దుద్యుక్తులగుట లేదా యందురేమో అది పొరపాటు. తప్పనిదని మనసును సమాధానపఱచికొని విశిష్టతమము స్వప్రేమాస్పదమును నగు సుఖరూపమగు ఫలముమీఁద దృష్టియుంచి వానియందైనఁ బ్రవర్తించుచున్నారేకాని వేఱుకాదు. దుఃఖానుభవము చేత మనస్సునందలి కల్మషములు వదలి శుద్ధమగుచుండుట యనుభవసిద్ధమైనదగుటచే నట్టిచిత్తావర్జనరూపమగు ఫలమును గోరి దుఃఖమునందైనను జనులు ప్రవర్తింతురన్నచో—వాస్తవమే. అట్టి హృదయావర్జన మవాంతరమును ఉపాయరూపము నగుఫలమేకాని పరమప్రయోజనము నుపేయమును కాదు. ఈవిధముగా శుద్ధినొందిన హృదయమున అనుకృతుండగు లౌకికనాయకునిగుఱించినట్టి ప్రేమ లేక దయారూపమగు సుఖవృత్తియొక్క ఆవిర్భావమే 'కరుణరసము' అని చెప్ప నొప్పు. అందుచేత 'దుఃఖము లేక శోకము' అనునది స్థాయిభావావస్థయందేకాని రసావస్థయందు లేదు. కనుక కరుణరసము సుఖమే కాని, దుఃఖము కాదు. సాక్షాత్తుగాఁ గనవచ్చునట్టి కన్నీరు, వేదన,

కంపము మొదలగునవియైనను రసానుభవదశయందు ఆనందపరవశుఁ డగు భక్తునియందువలె నానందజన్యములే కాని దుఃఖజన్యములు కావు. ఈకరుణరసప్రాదుర్భావప్రకార మెట్టిదనినఁ గావ్యప్రకాశ వ్యాఖ్యాతయగు నాగేశోపాధ్యాయులవారు వ్రాసిచ్చినట్లుగా:—

"(ఏవంచ విభావాది సంవలితానందాంశ సాహిత్యేన సాక్షిభాస్యో రత్యాదీ రస ఇతి ఫలితమ్.) అతఏవ శోకాదిప్రకృతికే దుఃఖమయేఽపి కరుణాదావపి నిర్భరానందప్రకాశో నిర్బాధః, శోకాద్యవచ్ఛిన్నస్యాఽఽనందాంశే భగ్నావరణస్య కరుణాదిరసత్వా దితి దిక్."

అనుదానిలోఁ జెప్పనదియే.

దుఃఖరూపమగు విభావాదిజనితావరణముపోఁగా స్వరూపానందమే యగుటను బ్రకాశించును. వేయేల! సుఖాంతములయందు కంటె దుఃఖాంతములయందే స్వారస్యము మెండనువారిపక్షము ననుసరించి సహృదయులకు కరుణరసప్రధానము లగు కావ్యములయందేదియో "అనుకూలతయా వేదనీయము"గు ననుభవము కల్గుచున్న దని చెప్పకయే చెప్పుచున్నది. వాస్తవము పరికించినచో లోకమునఁ బుత్రవియోగాదిజన్యమగుదుఃఖము అట్టివానియందున్న ద్వేషాదులను మఱియు హృదయస్థము లగు నితరదోషములను గాల్చివ్యవలె భస్మము చేసి, అట్టి వియోగమునొందినవారియొక్క యభిప్రేతమును పునర్దర్శన సమయమునసే కద ఇబ్బడిబలముతో నానందరూపమునందిక్రొత్త మొల్కవలెఁ జిగురులఁ జేయును! లోకానుకృతియు. నీస్సితార్థపంధాయకము నగు కావ్యప్రపంచమున నన్యథా యెట్లగును! అందుచేత ఫలితాంశమేమన స్వసిద్ధాంతములం బరికింపక, పరాయిపోకడలకై ప్రాకులాడి నాయికానాయకులఁ జంపి పాత్రాంతరనాశనపాపమున కొడిగట్టి కరుణరసోదయము కాకుండగనే కావ్యపరిసమాప్తిచేసి చేతు లుగడిగికొని "మట్టమని చూడవచ్చిన దయ్యమై వెంటఁబడె"నన్నట్లు రసలోలుపులై వచ్చిన సహృదయుల పేశలమానసముల వ్రయ్యలుచేసి పరపీడనరూపమగు రాక్షసకృత్యమున కొడిగట్టికొనక గ్రంథరచయితలు, విమర్శకులును, సహృదయచక్రవర్తులగు భారతీయప్రామాణికుల క్షుణ్ణమార్గముల ననుసరించి స్వధర్మానపేతములగు క్రొత్తలనుమాత్రమే సేకరించి నిజమగు నభివృద్ధికి దారితీయుదురని ప్రార్థించుచున్నాను. కాని ఈవిచారమును ముగింపక పూర్వము బ్రహ్మశ్రీ గొల్లపూడి శ్రీరామశాస్త్రిలవారి యాంధ్రనాటకరంగమున నుదాహరించిన యుపపత్త్యాభాసములకు సంగ్రహముగానైనఁ బ్రత్యుత్తరముల నీయవలెను. అదియిట్లు: ప్రేక్షకులకుధర్మనైముఖ్యమునుగురించి విచారించు కావ్యశోకము లౌకికశోకముకంటె వేఱగుటచే ధర్మాధర్మవిచారణకు నవకాశములేదనుట యసమంజసము. ప్రయోజనైక్యము నుమెందటనే నిర్ణయించుకొంటిమి గద! అప్పుడు లేకుండుటయెట్లు? వాసనాల బ్ధమైన సహృదయత తక్కువగనుండువారవరైన నట్టిధర్మాధర్మవిచారణకు బూనవచ్చుననుట సాహసము. ప్రయోజనైక్యజ్ఞానముకల్గి సహృదయతగలవారే యట్టి విచారణకు బూనుదురు. ఇవి రెండును లేనివారే యవిచారితరమణీయములగు మార్గములకు నువ్విళులూరుదురు.

కష్టానుభవము శ్రేయోనిదానముకాదనికాని హృదయావర్జకముకాదనికాని యెవరుననరు. చల్వదుక్కులుదున్ని సిద్ధముచేసిన క్షేత్రమున ననురూప బీజావాపముచేయకయే గాలికి వదలి ఇష్టమువచ్చిన యంకురములను యదృచ్ఛగా మొల్వనీయవలదనిమాత్ర మనకతీరదు. బుద్ధకృష్ణదేవరాయలదృష్టాంతములు పరంపరగానైన రూపకాంతము లెట్లుండవలెను అను అంశమును దెల్పవు. అందఱికి నట్టి ఫలితములె కల్గునను నియమము లేదు.

అటులే కష్టప్రదర్శనము జీవితాదర్శము అని తెల్పిన విషయమును చిగురుకు సుఖాంతనియమ మనుచితమని చెప్పినదానికి హేతువు నాట్యమునకు లోకము ప్రమాణముకదా యని. ఇచట సూక్ష్మదృష్టితో విచారింపవలెను. లోకము ప్రమాణ మనునది సర్వజనసమ్మతమే. కాని యది యంగనిర్మాణమునందును స్వాభావికతాపాదనయందును మాత్రమేకాక ఫలమునందుఁగూడ నన్వయించినచో లోకమునకుఁ గావ్యమును బానిసను చేయుటయుఁ, గవిని నవివేకియు నస్వతంత్రుఁడు నగు ప్రకృతిచిత్రకారునిఁ జేయుటయు నగును గాని యభిజనసమ్మతమగు—

"శ్లో. అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః;
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరికల్ప్యతే."

ఇత్యాది వాక్యరహస్యమును గ్రహింపనట్లగును. ఫలమున ననఁగాఁ బ్రయోజనమున నీనియమమును బెట్టినచో స్వతంత్రత పోలేదా యందురేమో! లేదు. ఏలయన నట్టి విశిష్టప్రయోజనార్థమే కద కావ్యప్రపంచసృష్టి! లోకమున నట్టి యభిప్రేతాంతము నియతముగ లేకుంటనేకద అట్టిది కళాదర్శముకాదు! మక్కికిమక్కిగాఁ బ్రకృతిని కాపీచేయుటయే చాలునందురా, పాశ్చాత్యమతమునఁ గవియుఁ గళయు నట్టిబానిసలే యయినను బ్రాచ్యమతమునఁ గాదు. అందుచే నియమమావశ్యకమే. ఇది యింతటఁ జాలును.

ఇఁక రసచర్వణమునుగుఱించి: ఇది యెవరిసొమ్ము అనిన సహృదయులది యని యాలంకారికులందఱును నేకకంఠముతో నుద్ఘోషించుచున్నారు. ఈసహృదయత్వ మన నెట్టిదియని ఆనందవర్ధనాచార్యులవారు ధ్వన్యాలోకమున నిట్లు విచారణచేసిరి:

"కిమిదం సహృదయత్వంనామ? కిం రసభావానపేక్ష కావ్యాశ్రిత సమయ విశేషాభిజ్ఞత్వమ్? ఉత రసభావాదిమయ కావ్యస్వరూప పరిజ్ఞాన నైపుణ్యమ్? పూర్వ

స్మిన్పక్షే తథావిధ సహృదయ వ్యవస్థాపితానాం
శబ్దవిశేషాణాం చారుత్వ నియమో నస్యాత్; పున
స్సమయాన్తరేణాన్యథాపి వ్యవస్థాపన సంభవాత్.
ద్వితీయస్మిం స్తుపక్షే రసజ్ఞతైవ సహృదయత్వమితి."

దీనిలో ద్వితీయమునే అంగీకరించిరి. అందుచేతనే కావ్యాది పఠనపరిపాటి లేని ప్రాకృతుని కైనను దృశ్యకావ్యప్రదర్శనములు జూచుటవలన వనసుకరిగెను. కాని, 'సామాజికు'నకే రసచర్వణ కలదనుటలో నటునకుఁ గలదా లేదా యనుసంశయము కొందఱు బాధించియున్నది. అందుచేతఁ బ్రాచీనులలోఁ గూడఁ గొందఱు విప్రతిపత్తి గల్గియుండిరి. వారిలో నొక్కరుండగు బలదేవవిద్యాభూషణుండు తనసాహిత్యకౌముదియందు:—

"సచానుకర్త్రాదౌ జీవితార్థ మనుకృత్యాదౌ ప్రవృత్తేః
కింతు సభ్యేష్వేవ సవాసనేషు."

అని నిర్వచించినాఁడు. కాని యట్టిప్రాచీనుఁడే యగువిశ్వేశ్వరపండితుఁడు అలంకారకౌస్తుభమున:—

"కావ్యాదౌ నాయికాదీనాం సంబంధి విశేషీయత్వా
భావాభయాభాసరాహిత్యేన నాయికాత్వాదిప్రతీతి
బలాత్ ఉద్బోధితో విషయః."

అని యిస్వభావను భద్రపఱచుటచేతను, సంస్కృతటీకా పద్మశ్రీభట్టారకునిచేఁ బ్రమాణముగా నుదాహరింపఁబడిన శంకుకమతమునఁగూడ:—

"కృత్రిమైరపి తథా అభిమన్యమానైః"

ఇత్యాదివిశేషణములను సామాన్యముగఁ బ్రయోగించుటయే కాక తద్వ్యాఖ్యాతయగు నాగేశభట్టారకునిటీకలో

"...అనుసంధానమ్ కవివివక్షితార్థస్య సాక్షాద్దర్శక
ణమ్ తేననటాదీనామపి రసాస్వాద ఉపపన్నః"

అని నుడువుటచేతను నటులను కేవలము జీవికామాత్రప్రవృత్తులగు యంత్రములుగాఁ బరిగణించుట యన్యాయ్యమని స్పష్టమగుచున్నది. ఇంతకుఁ గొంద ఱిట్లనుకొన్నను బ్రదర్శకత్వమునకు నటత్వము హేతువు. రసాస్వాదనకు సామాజికత్వము లేక సహృదయత్వము హేతువు అగుటచే నటులు సహృదయులగుటకుఁ బ్రతిబంధకము కాన రాదు. అందుచేతనే యొకయాలంకారికుఁడు:—

"తేన నటస్యాపి రసానుభవః సహృదయత్వేనైవ;
న నటత్వేన"

అని నిర్వచించెను. ఇంతియకాక మన కనుభవమునందైనను సహృదయులై తాదాత్మ్యము నొందినటులు ప్రదర్శించుచున్నపుడే చూపరులును మైమఱచి యాయాభావముల లీనమగుదురు కానిమంత్రము చెప్పినట్లుగా నేర్చిన పాఠములు నొప్పఁజెప్పు నటునివలన రసోద్బోధము కలుగ నేరదు. ఇందుకు ఈతని లక్ష్మణస్వామ్యాదులగు నటపుంగవు లేనిదర్శనము. అందుచే నటులు తాదాత్మ్యము నొందుచోఁ బ్రహ్లాదనాటకము మొదలగువానియందుఁ బ్రాణములు తీయుట మొదలగు నమంగళములు, మఱికొన్ని శృంగారనాటకములయందు నసభ్యకృత్యములు రంగముననే జరుగునను పిచ్చిభ్రమలు కేవలము భ్రాంతిమూలకములు; ప్రౌఢవాదములు నని వేఱె చెప్పనక్కఱలేదు. అవి యేలజరుగవనఁగా స్వేచ్ఛాప్రయత్నమున నంతగాఁ దద్భావభావితుండయినను వాస్తవికములగు భేదసంబోధములు తెలియకుండగనే పని చేయుచుండుటం జేసి ఆయాకృత్యములు సమీపించునరికి నటునియుత్సాహమును స్తబ్ధము చేయును. ఎప్పుడో శ్రీభాగవతములో సుప్రసిద్ధమైయుండి యినుపగోళ్లు ధరించిన నటుఁడు హిరణ్యకశిపువేషధారిని వాస్తవికముగాఁ జంపెనాఁడన్నను దానికి సహృదయత్వభావనాకృతములగు ప్రాగ్వాసనలు కారణములుగాని భావనామాత్రము కాదు. అందుచేతనే కావ్యప్రకాశికయందలి మంగళశ్లోకమున "నటనాయకాదీనానందయే" అను విశేషణము.

ప్రాచీనాలంకారికులలోనైనను ఈవాదవైరస్యమునకు హేతువు కావ్యరసపరాఙ్ముఖులగు శ్రోత్రియులును, ప్రాపంచికతాత్త్వికులగు కొండఱుబోధాదులును దీని సవాదరణచేయుటచే, బ్రదర్శనవిధియువ్యుత్పన్నులును వరసికులును జీవికామాత్రాన్వేషకులు నగుకుంఠలచేతులలోఁబడి రానురాను ఆట్టివారిదే ఆధర్మమని తలంచుచుండుటగాఁ గనఁబడుచున్నది. కాని న్యాయముగా నది యట్టివారిది కాకుండుటయు, శిష్టులవారిలోఁ జాలమందివ్యుత్పన్నులు, సహృదయులు నగువారే (ఏమైచూరులని) భారతీయనాటకరంగము నుద్ధరింప నడుముకట్టినవారై పత్రికాపరిగ్రహము చేసి ఆయారసముల ననుభవపూర్వకముగాఁ బ్రదర్శించుటయుఁ గనినచో నటులయందు తాదాత్మ్యభావన, రసానుభవము నుండఁగూడదనువాదము ఎంత నిర్హేతుకము, నపకారకము నగునో తేటతెల్లమగును.

అందుచేత సారస్వతపునరుద్ధరణకాముకులగు సహృదయులు ఆవాదము తుచ్ఛమని పరిత్యజించి శోధనాపూర్వకముగా భారతరంగము నుద్ధరింతురని కోరుచున్నాను.

---


వ్యాసకర్త

# వాయస ప్రశంస

శ్రీ క్రొత్తపల్లి సూర్యారావు గారు

కాకమ యేటికే వగవఁ గాదు భవద్విధ దీర్ఘదర్శికిన్
లౌకికదుఃఖము ల్గవిఁ గలంపఁగఁజాలవు కాలకర్త నా
ళీకభవుండు దానిఁ దగిలించెను గాలుని చేతఁ దద్గతిం
జేకొని త్రిప్పఁజాలఁడె సృజించినయాతఁడుగూడ నెన్నఁడున్.

చ. పెరిఁగెనొ పెద్దవయ్యెనొ వివేకము విశ్రుతకీర్తిఁ గాంచెనో
పురుటనె సందుగొట్టినని పుట్టను గిట్టను రెండుగ్రుడ్డు లా
దరమునఁ బెంచినా వొకటఁ దక్కవ సేయవు ప్రాప్తిలేదు నీ
కు ఋణము దీఱె నింక నుమకు న్విడు మూదరిదారి చూడుమా.

ఉ. అందుమె కాని నీహృదయమందలి దుఃఖము మేమెఱుంగ ము
దుం దుది గావరాక యొకఁడుం దెలియంగనలేఁడు నిన్ను నే
మందుము బుద్ధిమంతులకు నజ్ఞతవాఁరిలు నొక్కపట్టునం
గందుఁబొమూఁదె నున్నమమకారము చేసెను పారవశ్యమున్.

మ. ఒకగ్రుడ్డుం జెడుపాము మ్రింగ నుభయుల్ హా యంచు మీరార్వ నే
ఒక యండంబును మీరు లేనపుడు దా నుర్విం బడం ద్రోసి దు
ష్పిక మాత్మీయము పెట్టిపోయె నదియే శ్రేయంబుగా నెంచి రి
ట్టికతంబాట విధాతృకృత్యములు పాటింపంగ దుస్సాధ్యముల్.

మ. కికురింపం దెలిపింత లేనటులు సుగ్రీవాజ్ఞగా మీరలే
యొకవేళం బ్రహరు ల్బరంప నిరువుర్ వ్యూహాంబు వన్నంగ నా
పిక పెట్లోర్చెనో యంతకాలమును మీప్రేమం బదేమయ్యెనో
యకటా! దీనిఁ దలంచి వీడఁగదవే యాత్మీయ దుఃఖావళిన్.

శా. నీయండంబును గుర్తుపట్టుగతి లేనేలేదు నీయందుఁ బో
నీ యేమయ్యెను నీమగం డతనికి న్నీ వెట్టియే పట్టనే
న్యాయంబే పరభృత్పదంబునకు మీరర్హుల్ ప్రశంసించెదం
గాయక్లేశభయంబు నొందు పికకాంతంగాంచి నేనవ్వెదన్.

మ. కలికాలంబున నాగరాంగనలకు భోగప్రీతియే కాని బి
డ్డలపైఁ బ్రేమ యొకింత లేదుగద కట్టా! భర్తయుర్ సౌకుమా
ర్యలయాశంక వి దేమి నా వెఱచు నౌరా చాలు నీరీతి కో
యిల సాఁపెల్ల వనప్రియంబనుచు నూహింపంగ లేరైరిగా.

చ. శివశివ చేయి దుల్పుకొని చెట్టుతుద న్వసియించి కుందు నీ
దవు సుతశోకముం దెలియు నట్టిర పండితులైన నట్టిచో
వివరములేని యీఁట లెనవింటను నూటను గూల్చె నీధవుం
దవు చిరజీవినామమును ధ్వమ్ముచేయఁగ మృత్యుమూషకర్.

ఉ. చీమ చిటుక్కుమన్న నతిశీఘ్రము లేచెదు మీకు నంతచే
మైమఱపయ్యె నయ్యెడ; నమాయికత న్వెత నొందనైన నీ
డేమనఁ గాకవంధ్య యని యేర్పడెఁ బొమ్మని యూరకుండఁగా
దేమిటికయ్యె నీబ్రదుకు హేయమొనర్చె విరించి కాకమా.

మ. ఎటులోదార్తు నకృత్రిమమ్మ నిను నే నీదుఃఖవారాన్నిధిన్
దిటవుం బోయె ధవుండు గూలె బ్రదుకేదీ దాన విశ్వస్తవై
తిటమీఁదం జిరజీవినీత్వమున మం దేమందు నీయొంటిపా
టెటుదీరు న్వివసించికోవు కలిలో నీనేమము ల్నగ్గునే.

ఉ. నెగ్గక యేమి లేరె గృహిణీతిలకంబులు నిన్నుఁబోలి తా
మగ్గిపోరక సమర్థలు మహాసతు లుర్వర లేకయున్న నీ
దిగ్గగనంబు లీకరణి దీటుగ నిల్చునె నీతిశాస్త్రముల్
ప్రగ్గను బోనుబోన నెడుమాటలు మాత్రము నిల్చియుండినన్.

చ. పురుషుఁడు స్త్రీయుఁ గర్కటతిపోకలఁ బోయెద రిద్దఱుండియుం
బురుషుఁడు స్త్రీ గతించినను బొందెదుకొందల మెంచ శక్యమా
పురుషవిహీనయైన యొకపోటి పదంపడి చేయు చేతలో
కరటకులాంగనామణిరో కాంచవు లోకము నేమిచెప్పెదన్.

ఉ. ఉలి వోకకైన దాని వినవొగ్గవు నీచెవి నే నెఱుంగుదుం
బలుచని వారిమాట యొకపాటిగఁ జూడకు నీకులంబులోఁ
గల నియమంబు నీతియును గాంచిన నచ్చెరు వౌ జగంబునం
గలుగదు వేఱుతావున గావున నే నొసరింతుఁ దన్నతిన్.

ఉ. తల్లియె నేర్పునో యటులు తండ్రియె నేర్పునొ కాన నేర్పునో
పిల్లతనంబునుండియును బెంకితనంబును మోహకృత్యము

జల్లఁగ నిద్రవోవఁ బెఱసత్త్వము కొల్కుల నేత్రవైద్యప
ట్లల్ల మలంబుఁ బుచ్చుటది యెవ్వరు నేర్పిన సబ్బు విద్యయో.

చ. గృహముల వీథులందున నరిష్టము వాప నరిష్టమే తెగుఁ
బహువిధమార్గశోధకులు పాటికివత్తురె దానితోడఁ బ్ర
త్యహము నహర్ముఖంబునను నా మిథునమ్మును గాంచ మేలు నా
సహనా నులింపశక్యమె విహాయసవర్తిని వాయసాగ్రణీ.

మ. మనుజుల్గాంచిన జీవితంబు విడువన్ మాకేల యీనింద యం
చును గాంభోలు రహస్యవృత్తి నడపున్ సుభ్రూ ప్రసంగడ బిదే
జనుఁడేఁ గొంచెము చింత సేసినను నాజన్మంబు సిగ్గిల్లఁగాఁ
జనుసందర్భము చెల్ల దే పొగడ ధ్వాంక్షాభిఖ్య న్యాయంబొకో.

ఉ. కాకులు లేక యొక్కక్షణకాలము వేగదు కర్మభూమిలోఁ
గాకులు సౌఖ్యహేతువులు కాకులు వైద్యులు కాకులాప్తులోఁ
గాకులు భద్రకారులును గాకులు శౌకునికుల్ భృశంబుగాఁ
గాకులు కాలసూచకులగుఁ గాకులు జోస్యులుగావె యద్ధరన్.

మ. బలిపుష్టం బను పేరు వైదికజనప్రాగల్భ్యముం దెల్పుఁ గ
ర్మలపై లోకుల శ్రద్ధఁ దెల్పు ననుటే మర్యాదగా కిల్లఁగా
కులకు న్నాజము తిండిపోతులకు మనోత్కసారహీనంబు క
ర్తలకున్ గౌరవమిచ్చి భోక్తలకు తుద్బాధాదు లూహింతురే.

శా. ఏసంస్కర్తలునుం బునఃపరిణయం బెన్నండు బోధింపలే
రీసంఘంబునఁ బక్షిరుంకలకు నే నీతి యేజాతిలో
భాసిల్లుం బెఱజాతి లజ్జపడ నేబా నల్పసౌఖ్యంబుపై
నాసల్లీన దీర్ఘకాల సుఖదప్రాణేచ్ఛ వాయుం గదా.

చ. పొగడుదుఁ గాని కాసినొకప్రొద్దున బిడ్డఁడు కింకపట్టి దుం
డగమున నేమియిచ్చినను డాపలి కాలను దన్ని వైచుచున్
మిగులఁగ నేడ్చువాని మరి మెచ్చుగ లడ్డువమిచ్చి సేదదే
ర్చఁగఁ దఱి వేచి తన్నుకొని పాఱినమాత్రము బువ్వఁదిట్టితిన్.

ఉ. ఏపదిమంది పెద్దలిటు లేకతఁ గూర్తురొ కాకిజంట వే
తేఁపగిదిం దమంతటను రెండును నొండొకటి న్వరించునో
బాపురె యీమిథఃప్రియముఁ బాయనికూరిమి యోర్పు బంధుసం
ఘాపరిమేయ గౌరవము సబ్బురపా టొదవించు నెంచినన్.

ఉ. చెల్ల! త దేకదృష్టి నివసించును గొట్టున విన్ని దిక్కులం
దల్లి తాక్షిపాతమున దాఁపరమెయ్యదు కీడుమేలుఁ దా
నల్లవిధంబులం దెలియు నేమఱుపాటది ప్రాణిలక్షణం
బల్లరిమూఁక పాలుపడి యాకులమందు నిదేమిచిత్రమో.

ఉ. ఈవికిరంబుమేల్లి గణియింపక చేకొని లోకమల్పమే
ధావివశంబు పాల్పడుచు దారుణదండన కెంతకష్టమో
చావనిచావు మాకళికి సత్యము మాకళి బాండగట్టి నా
సావివరంబుల్ గుట్టిన విచారవిదూరుడు గాక కాకియే.

శా. ఏరీతి న్నెలదప్పి నల్లుఁగుఁ దానేరీతిఁ బ్రాణేశుతో
నారీతి న్వెలిపుచ్చు నెన్నినెలలో దూజంట యొల్లించునో
ప్రారంభించును గూడుఁగట్టుటకు వృక్షాగ్రంబునన్ బుద్ధి ను
ద్వారంబైనను నేర్చునే పొగడఁ దత్తన్నైపుణిస్సంభృతిన్.

ఉ. వైజననంబు తా నెఱుఁగు వైఖరి మానవునందుఁ గల్గునే
సాజము పక్షిజాతి కనఁజాలుదుఁ గాకము నీడ మోయు చం
ద్రోజభవుం డొసంగిన సమున్నత నైపుణిఁ గాష్ఠసంగ్రహం
బోజగఁ జేసి కట్టుకొనియుండును గూటను గ్రుడ్లు పెట్టఁగన్.

చ. అడుగున బెద్దపుల్లలును నాపయి సన్నని పుల్ల లందుపైఁ
బడుకకుఁ బీచుఁగొల్లి సరిపడ్డటు గూరుచు నొక్కదాని నొ
క్కడుగని యంతెకాని యొకకాకియు నేర్పదు నేర్చుకోదు నె
క్కుడుశ్రమంబొందు నొక్క నెలకోసము పీసము రానిదానికై.

చ. నిపుణత శక్తియు క్తియును నేసవుఁగూరుపుఁ గల్గియున్న వి
కెపుడును భార్యభర్త యొకయింట వసింపఁగఁ గట్టుకోదు ది
ట్టపుబలుగూడు కూడదును డక్కులకుక్కలబిడ్డలక్కటా
కృపణత నాడుచుం గరలి క్రిందికిఁ ద్రోసిన నేమి నేసెదన్.

శా. ఆషాఢంబున గ్రుడ్లుపెట్టునటు గర్భాధానముం జేయుటల్
శేషాంశంబుల కంటు చిట్లలది యేసిద్ధాంతి బోధించునో
యాషాఢం బిది శూన్యమాసము కులారంభముం గాదునే
"యాషామాషిగఁ" బోవుదానికి ముహూర్తాదుల్విచారింతురే.

శా. ఏపంచాంగము చూచి వ్రాసితివి కాకీ వాన నీగూటికిన్
మోపాడు ల్మఱపొందరాని వొకట న్మోఁదొందె నీకయ్యయో
యేపాపంబు నెఱుంగవేని మఱి నీకెట్లబ్బె నీకష్టముల్
లోపంబేదియొ నీ ప్రయత్నమున కెట్లుం బట్టియుండుంజుమీ.

శా. పాటింపం బనిలేదు ఛాందసము లన్యాభావంబు నీకుండినం
బాటిం బట్టడు మేముమాత్ర మటు చెప్పన్మాన మేమాత్ర మో
లోటుండు న్భవదీయ మూరకయ యాలోచింప కిట్లున్న యో
చేటు ల్రావు నిరాగసుం గలఁచునే శ్రీశంభు నాజ్ఞావిధుల్.

---

# నాటకౌచితి

జనమంచి శేషాద్రిశర్మ గారు

శ్లో. కారుణ్యకర్బురకటాక్షనిరీక్షణేన, తారుణ్య సంవలిత శైశవ వైభవేన;
ఆపుష్ణతా భువన మద్భుతవిభ్రమేణ, శ్రీకృష్ణచంద్ర, శిశిరీకురు లోచనం మే.

—శ్రీకృష్ణకర్ణామృతము.

అభిరూపశేఖరులారా!

నాటకౌచితిం గూర్చి వ్రాయుట నీవిషయము వివాదగ్రస్తదికాదని నే నెఱుంగుదు. కాని యీకాలమున నది నానావిధముల మార్పు చెందుచున్నయది. మహనీయులు కొందఱు శ్రీరగిరులు కల్పించులు చేయుచున్నవారు. కాని యీ మార్పులవలనఁ గలుగు చెడుగుల వారు తలంపకేదనియు, తమకుఁ దోఁచిన మార్పు జరిగినచో నదియే యొక పురుషార్థమని తలంచినట్లును నే నూహించుచున్నాఁడను. ఈ నాయూహ వాస్తవము కాకపోవచ్చును. ఐనను ప్రాచీనులగు విద్వద్వరేణ్యుల భావము లెట్టివి? వాని మార్పు వీలుగలదా? దావలన లాభ మేమేనిగలదా యని యించుక విచారించెదను. ఈచర్చ నావంటి యల్పమతి చేయఁదగినది కాదనియుఁ బండితాఖండలుల కృత్యమనియు నే నెఱుంగకపోలేదు. కాని యూరకుండఁజాలక నాలుగుమాటలు వ్రాయఁబూనితి. భగవద్దత్తబుద్ధి పరికట్టుట న్యాయముకాదు గావఁ దోఁచిన యూహలను దెల్పుచున్నాఁడను.

లోకమున సత్ప్రవృత్తిని గాపాడుదాని నభివృద్ధి చేయుటకే మహర్షులు తమ జీవితమును వారపోసిరి. దానిం గాపాడు పద్ధతుల ననేకరీతులఁ గల్పించిరి. ఉపదేశరూపమున నందఱకది యలవడఁజేయ సాధ్యముగానిపని యని యాలోచించి పురాణముల వ్రాసిరి. వివిధ విధములుగ నిఁకనెన్నియో గ్రంథముల వ్రాసిరి. ఎన్ని వ్రాసినను, ఎన్ని విధములఁ జెప్పినను జాలదనియు వారనుభవమున గ్రహించిరి. మరలఁ గథారూపముగాఁ దెలుపసాగిరి. ఆపద్ధతియుఁ జాలదని వారూహించిరి. మఱికొన్ని పద్ధతులుగా దానిం గాపాడఁ బ్రయత్నించి యందొకటిగా నాటకరూపమునలరింపఁజేసిరి. దానివలన సత్ప్రవృత్తిరక్షణము సాగుసని వారనమ్మిరి. మహాత్ములభావములు నిష్ఫలములుగావు. కావున వారి యూహలు ఫలించుచుండును. ఆమార్గమునే యిప్పుడు మార్పఁజూచుచున్నారు. ఈమార్పువలనను లాభము లుండఁజాలవని చెప్ప వీలుండదు. అనుభవమునఁగాని యీయర్థము స్థిరతఁగాంచదు. ఊహించినచో మేలుండదేమో యను సంశయము గలుగుచున్నది.

వ్యాసకర్త

కావ్యము ద్వివిధము: శ్రవ్యకావ్యమని, దృశ్యకావ్యమని.

"శ్లో. చతుర్వర్గఫలప్రాప్తి
స్సుఖా దల్పధియామపి
కావ్యా దేవ యతస్తేన
తత్స్వరూపం నిరూప్యతే."

—సాహిత్యదర్పణము.

అనుటంబట్టి కావ్యము ధర్మార్థకామమోక్షముల సులభముగా నియ్యఁజాలునని ప్రాచీనులు సిద్ధాంతమొనరించిరి. కావ్యమునుండి ధర్మార్థకామముక్తులు గలుగునా యనిన,

"చతుర్వర్గ ఫలప్రాప్తిర్హి కావ్యతో రామాదివత్ప్రవర్తితవ్యం, నరావణాదివ దిత్యాది కృత్యాకృత్యప్రవృత్తినివృత్త్యుపదేశ ద్వారేణ సుప్రతీతైవ." అని నిరూపింపఁబడియె.

రామాదులవలెఁ బ్రవర్తింపవలయును; రావణాదులవలెఁ బ్రవర్తింపరాదు: అని చేయదగినది, చేయఁదగనిది యను ప్రవృత్తినివృత్తుల నుపదేశరూపముగాఁ గావ్య ముపదేశించుట సుప్రసిద్ధమే. ఈయుత్తమ ఫలము కావ్యమునుండి కలిగినందువనే, "కావ్యాలాపాంశ్చవర్జయేత్" అనునిషేధము పరాస్తమయ్యెను. దీని కుపబలముగా,

"శ్లో. ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసుచ,
కరోతి కీర్తిం ప్రీతించ సాధు కావ్యనిషేవణమ్."

అని ప్రాచీనోక్తి కనంబడియెడిని.

"కావ్యా ధర్మప్రవృత్తే స్తుతిరప్యనారాయణ చరణారవింద స్తవా దినా" యను నక్తియుక్తోక్తి స్పష్టమేకదా!

ఇట్లు మహోపకారములు కావ్యముద్వారం గలుగునని ఆలోచించి పూర్వులు దన్నిర్మాణమునం దనిమిషక ప్రవర్తనము వారిని లను వలనుసంజేయుటెంతో దృశ్యకావ్యముల నొనరించి తద్ద్వారా లోకమున కుపకారమొనరించిరి. భారతభాగవత రామాయణాదులు శ్రవ్యకావ్యములు: అనగా విని వానియందలి కథలను గ్రహింపదగినవి. వీనివలని యుపయోగములకంటె దృశ్యకావ్యములవలని యుపయోగములు హెచ్చని మనవారి భావమని స్పష్టము కాకమానదు. ఆదృశ్యకావ్యమే నాటకమనంబడును. దీనికి రూపకమనియుం బేరు గలదు. "నాటయతీతి నాటకమ్" అనియు, "రూపాణాం రామాద్యాకారాణాం ఆరోపాత్ నటేషు సన్నివేశాత్ హేతోః రూపకమిత్యుచ్యతే. తథాహి రూపయతి నటద్వారా రామాదీ ననుకరోతీతి రూపకమ్."

పూర్వుల రూపములందాల్చి వారే వీ రనునట్లు నటించుటచే నాటకమను పేరువచ్చెను. రామాది దివ్యపురుషులయు, సీతాది పురంధ్రీమణులయు ఆకారములు నటులయందునుంచుటవలన రూపకమను నామము ప్రథితంబయ్యెను. అనగా రామాదిరూపముల నటులను కరింతురు. కమకరూపక మనిభావము. నటుడు రామరూపము ననుకరించునట్టి రూపమును ధరించి రంగస్థలమున నిల్చి పూర్వము రామచంద్రుడు ఏయే సమయముల నేయేరీతులం బ్రవర్తించెనో యట్లు నటించి రంగస్థలమునందున్న వారెల్ల సీతడు రాముడే యని నమ్మునట్లుచేసి ఆరామప్రవృత్తినిబట్టి పురుషులును, సీతాదేవి ప్రవర్తనమును గనుగొని స్త్రీలును సత్ప్రవర్తన మన నిట్టిదని గ్రహించి యారీతి మెలంగవలెనని నిశ్చయించునట్లు చేయవలయును. నాటకమును జూచిన ప్రేక్షకులు కొంతకాలమైనను దానిని మఱువక యుండునట్లు చేసి మేలు నొందఁజేయుట నటకులపని. కావునే యిది నాటకమనంబడినది. రూపకమన్నను అర్థమిదియే; భేదము కానరాదు.

నాటకమును జూచి కథబాగున్నదని మెచ్చుకొనుట నాటకోద్దేశము కాదు. దానిం గాంచిన పామరులు కూడ దానియందువచ్చు మహాపురుషులయు, పతివ్రతలయు చర్యలం దిలకించి, యిట్టి ప్రవర్తనము పరమకొనినగాని ఖ్యాతియు, మర్యాదయు రాదని నమ్మియట్లు ప్రవర్తించుటకుం బూనవలయు. అట్టి పని శ్రవ్యకావ్యముల ద్వారా కలుగదని కాదు గాని నాటకముల మూలమున హెచ్చుగాకలుగునని పూర్వులభావము. నాటకదర్శనముచేం బూర్వరాజన్యులకుం బ్రజలకుంగల సంబంధములు, పతివ్రతలనడవడియు, ఆకాలమున దేశమునగల జనసామాన్యాచారములు, రాజోద్యోగుల ధర్మములు, వానివలనం బ్రజలకుంగలుగు నుపకారములు, వర్ణాశ్రమధర్మములు, మహాత్ములయద్భుతప్రభావములు, ఆకాలపుమనుజులభావములు, మతాభిమానము, రాజానందమహాస్మృతి, యిట్టి యనేకవిషయములు తెలియవలసియును. అంతియకాని 'బాగుగా వేషములున్నవి. పాటలు శ్రావ్యముగాం బాడబడినవి. వేషధారులకు తంత్రసారస్యము కలదు. స్పష్టముగా వాక్యములు వినంబడినవి. బాగుగ హాస్యముచెప్పంబడినది. వాద్యము, మృదంగము సొంపుగా వాయింపంబడినవి. యవనికలు కడు విచిత్రముగా నగపడినవి.' అనిగ్రహించుటకాదు. ఈభావము ప్రాచీనులకు నుండంబట్టియే నాటకమునఁగల కథ పరమపవిత్రమై, ప్రేక్షకులం దెంతమూర్ఖులున్నను వారికింగూడ నుంతయో, అధికముగనో నీతిని గఱపునదిగ నుండునట్లు వ్రాయంబడియెను. ఇట్లగుటచే నాటకమందలి యితివృత్తము నీతిదాయకముగా నుండవలయుననియే సిద్ధాంతము. అంతియకాని కథానాయకుడు నీచుడై, వానినుండి నేర్చుకొనవలసినవి అనీతులైనచో నది నాటకముకాదు; బూటకము. కావుననే,

"నాటకం ఖ్యాతవృత్తంస్యాత్"

అని సిద్ధాంతము చేయంబడినది. పోనిండు! ప్రాచీనులమతము త్రోసివేయుదము. బుద్ధిమంతు లొక్కరైనం జేరి నాటకమునం గథానాయకుం డెట్టివాడుగానుండవలయునని యూహించిన నేమితోంచును? పసుల కాపరి కథానాయకుడుగనుండిన మేలని తోంచునా; లేక యుత్తమ నాయకుడుగానుండిన మేలని తోంచునా? ఎట్టివారు రీవిషయము నాలోచించినను నాటకస్వరూప మిట్టిదని యెఱింగియుండినయెడలం గథానాయకుం డుత్తమనాయకుడుగ నుండవలయుననియే తోంచునని గట్టిగాం జెప్పవచ్చును.

నాటకముకలన మఱియొక లాభముగలదు. వంశమర్యాదల నెఱుంగుట; తద్ద్వారా వాని ననుసరింపవలయునని బుద్ధిపుట్టుట. ఈ లాభద్వయమునకన్న నెక్కువ దేమికావలయు! ఇట్టి లాభములు వ్రాయంబూనిన నెన్నియోకలవు. అవకాశము లేకమి వదలెదను. ఇట్టి యుత్తమలాభములను గల్గించు కల్పతరువు నాటకము. అట్టి నాటకము నెవరికిష్టం బుచినట్లు వారు మార్చినచో నెట్లుండునో చెప్పవలయునా? కథను గవి యిష్టానుసారము మార్చవచ్చును గదా యన్న నట్టి యధికారమును స్వేచ్ఛగాం బెద్దలే ప్రసాదించిరి. కాని మూలకథను, దానివలనం జెప్పంబడు నీతికిని విరుద్ధముగ నుండునట్లు కథను దాఱుమాఱు చేయవచ్చును. నాటకాంగములననుసరించి కథ మార్చంగూడదని యెవ్వరు నాక్షేపింపరు. కాని యామార్పువలన నొకలాభమైనం బ్రేక్షకులకు నుండవలయునని పెద్దలభావము. రంగస్థలమున నిండియుండు స్త్రీపురుషుల కేవగ్గింపని పద్ధతిని నాటకము వ్రాయవలయుననియే పండితులభావము. ఏమాత్రమైన మనసున కింపు జెఱుపింపంజేయు విషయము ప్రదర్శింపరాదని శాస్త్రకర్తలు సిద్ధాంతము చేసికొని దానిని మీఱరాదనిరి. ప్రదర్శింపరాని విషయము లెట్టివని పెద్దలు శాసించిరి.

"దూరాహ్వానం వధో యుద్ధం రాజ్యదేశాది విప్లవః,
వివాహో భోజనం శాపోత్సర్గౌ మృత్యూరతం తథా;

"దంతచ్ఛేద్యం నఖచ్ఛేద్యం మన్యద్వ్రీడాకరంచయత్,
శయనాధరపానాది నగరాద్యవరోధనమ్
స్నానానులేపనే చైభి ర్వర్జితో నీతివిస్తరః."

—సాహిత్యదర్పణము.

సుజనులారా! పైనుదహరింపఁబడిన విషయములం దేదియేని నాటకమునఁ బ్రదర్శింపవచ్చునా యని యూహింపుఁడు. నాటకమునఁ గవికి స్వేచ్ఛ కలదు కదా యని యం దేదేని ప్రదర్శించినచో బాగుండునా? పూర్వులనియమములన్ని యిట్టివే. అంకోళ్ళ‌ట్టిరైనఁ దొలఁగించిన నీతిని దొలఁగించినట్లే. కవి యిష్టానుసారము మార్పఁదగిన విధియని వారే సూచించిరి. కాని తప్పక యుల్లంఘింపవలయునని శాసించిన వానిలో మార్పఁదగిన దేకాలమునఁగాని లేదనక తప్పదు. నాటకము నీతిని బోధించుటకొఱకే యేర్పడినదని యంగీకరించినచోఁ బైమాట సిద్ధాంతము. అట్లుగాక నాటకము కాలక్షేపమునకే యేర్పడినదనియు, నదియెట్టి దేవగింపును బుట్టించినను బాధ లేదనియు నంగీకరించినచోఁ బూర్వులనియమములయం దొక్కటియైనఁ బాటింప నక్కఱలేదు. ఏకాలమునకైన, నేదేశమునకైన, నేసంఘమునకైన నాటకము నీతిని బోధించుట కేర్పడినది కావున సిద్ధాంతముచేయఁబడినదని గట్టిగ నమ్మకము నాకున్నది. కావున దూరమాలోచించి స్త్రీపురుషులు నిండియుండు రంగస్థలమున నాటకరూపమున నిందుకేనియుక్తి తిఁదలుపునట్టియు, నేవగింపును బుట్టించునట్టియు భాగ మొక్కటియైనఁ బ్రదర్శింపరాదని పెద్దలు తెల్పిరి. అట్టివియే నాటకలక్షణములు. అంతియకాని వాక్కు నరికట్టుటకుఁగా మన పెద్దలు ప్రయత్నింపలేదని మాటికి మాటికి చెప్పఁగలను. కాఁబట్టియే,

"వాక్యం రసాత్మకం కావ్యం దోషా స్తస్యాపకర్షకాః;
ఉత్కర్షహేతవః ప్రోక్తా గుణాలంకార రీతయః."

"శ్రుతిదుష్టాపుష్టార్థత్వాదయః కాణత్వ ఖంజత్వాదయ ఇవ, శబ్దార్థ ద్వారేణ దేహద్వారేణేవ, వ్యభిచారిభావాదేః స్వశబ్ద వాచ్యత్వాదయో మూర్ఖత్వాదయ ఇవ, సాక్షాత్కావ్యస్యాత్మభూతం రసమపకర్షయంతః కావ్యస్యాపకర్షకా ఉచ్యంతే. గుణాః శౌర్యాదివత్, అలంకారాః కటకకుండలాదివత్, రీతయః అవయవసంస్థానవిశేషవత్ దేహద్వారేణేవ శబ్దద్వారేణ తమేవ కావ్య స్యాత్మభూతం రసముత్కర్షయంతః, కావ్యస్యోత్కర్షకా ఉచ్యంతే."

అని శ్రీ విశ్వనాథకవిరాజ గారు సాహిత్యదర్పణమున స్పష్టపఱచిరి.

కావ్యదేహమునకు కీలు లవయవములు; అలంకారములు కటకకుండలాదులు; గుణములు శౌర్యాదులు; రసము ఆత్మ; ఇట్టి కావ్యదేహమునకు శబ్దద్వారమునఁ బ్రకాశము గల్గును. కావ్యదోషములనఁగాఁ జెవికింపుగాక, దుష్టములై, అర్థపుష్టియించుకయైన లేకయుండునవి. దేహమునకు నేత్రములలోఁ గాయలుకాచుట, కుంటితనము లోనగునవి యెట్టి సౌందర్యమునకు భంగమునాపాదించునట్టి దోషములో కావ్యదేహమునకు నర్థపుష్టి లేకుండుట లోనగునవి యట్టిదోషములు. ఎవ్వఁడేని గ్రుడ్డితనమును అలంకారమని భావించునా? అట్లే కావ్యమునకు శ్రుతిదుష్టత్వాదులను గుణములని భావింపరాదు. దేహముద్వారా లోకమున కుపకారముచేసినట్లు కావ్యదేహముద్వారా లోకులకు నీతిని దెలుపవలయును. దేహముద్వారా లోకులకుపకారముచేయు పెట్టిదో కావ్యదేహముద్వారా లోకులకు సన్నీతిని బోధించుట అట్టిది. కాఁబట్టి కావ్యము దోషరహితమైనదిగాక గుణభూయిష్ఠమై యుండవలయునని సిద్ధాంతముచేయఁబడినది. ఇట్టులుండ శ్రవ్యకావ్యములేగాక దృశ్యకావ్యమగు నాటకమున నిష్టానుసారము మార్పులను గల్పించి మేర మీరుట నీతిని బహిష్కరించుటగాక మఱేమగును?

ఎట్టి పామరుఁడైన హరిశ్చంద్రనాటకమును దిలకించిన సత్యమం దెంత మహిమయున్నదని భావించును. ఎట్టి నాతియైనఁ జంద్రమతింగాంచి యామెవంటి పాతివ్రత్యములకలుచుకొనవలెనని వాంఛించును. కావున నాటకములద్వారా చేయునుపకారమిట్టిదని తెలుపశక్యమే కాదు. దానికి సాటిచెప్ప వీలులేదు. దానికదియే సాటి. నాటకమున మార్పులు గల్గించిన నెట్టులుండునో కొన్నింటి నుదాహరించెదను:

1. 'రాజు-మంత్రీ, భోజనమునకు వేళయైనది పోవుదమా' యని వ్రాయుట రాజకుటుంబమర్యాదల నుల్లంఘింపఁబూనుట; లేక రాజకుటుంబమర్యాద లిట్లుండునని యెఱుంగకుండుట.

2. రాజపుత్రుఁడు సర్పమునుజూచి భయపడి పరుగిడెనని వ్రాయుట రసస్వరూప మెఱుంగకయుండుట.

3. రాజపత్ని వావివరుసలు గణింపక పురుషుంగామింప సాహసించెనని వ్రాయుట జాతిమర్యాద లిట్టివని యెఱుంగకుండుట.

4. వియోగదుఃఖమునఁ గంది కుంది మనోధర్మము చెడి చెట్టు చెట్టును గుట్టగుట్టను బ్రతిమాలుచుఁ దిరుగు దిగులీమణి నోట చమత్కారముగ మాటలు పలికించుట సందర్భశుద్ధి; యిట్టిదని యెఱుంగకుండుట.

5. రాజు సేవకునితోఁ బరిహాసపూర్వకము దోఁచుఁజేయు మాటలాడునట్లు వ్రాయుట యుక్తాయుక్త పరిజ్ఞానము లేకుండుట.

ఇట్టి వానినెన్ని యైనఁ జూపఁబూనిన నెక్కలేదను. ఈపై వ్రాసినవలన నాటకమునఁ బ్రధానవిషయమేది? మార్పునకుఁ దగిన విషయము లెవ్వి? మార్పనవసరము లేనివిషయములేవి? అను విషయము స్పష్టమాయెఁగదా!

నాటకమునఁ బద్యము లేల చేర్పవలయును? అను విషయమున నాకుఁదోఁచినవి నాలుగు మాటలు వ్రాసెదను.

"త్రివర్గసాధనం నాట్యమ్."

"నట ప్రయోజ్యాభినేయం నాటకాది, త్రివర్గస్య ధర్మార్థకామానాం సాధనం జనకమ్. తథాచ, లోకానురంజకతయా నాటకాదిదృశ్య

కావ్యాత్ ధర్మోజాయతే.తస్మాద్ధర్మస్తస్మాత్కావ్యమ్ ఇతిభావః.సమాన న్యాయాత్ నాట్యపదేన శ్రావ్యకావ్యస్యాపి సంగ్రహః ఇతివాన్వేయ పురాణే ఉక్తమిత్యన్వయః"అనివ్యాఖ్య.

"శ్లో. కావ్యాలాపాశ్చ యేకేచి ద్గీతకాన్యఖిలానిచ,
శబ్దమూర్తి ధరస్యైతే విష్ణో రంశా మహాత్మనః."

—విష్ణుపురాణము.

వీనింబట్టి నట్టిగా నాలోచింపఁ బద్యము లవసరములనియే తోఁచెడిని. దమయంతి యడవుల నిడుములఁ గుడుచుచుఁ దనఁబడును దిక్కుతెలియక మృగములను, వృక్షముల నడుగుచుఁ బద్యములు పాడెనా యని ప్రశ్నింపవచ్చును; అట్లు పద్యములు చదివియుండదని సమాధానము చెప్పవచ్చు; ఇట్లువ్రాయుట కవికిఁదగదని యాక్షేపింపవచ్చు. కాని దమయంతి దైన్యమును బద్యములద్వారా ప్రేక్షకులకుఁ దెలిపినట్లు మాటలచేఁ దెలుపఁబీలు లేదు. ఇది నిక్కము. భక్తిప్రేమములు లోనగునవి పద్యరూపమునఁ దెలుపుట చాలముంచిపద్ధతి. ఇట్టివిషయము లనేకము లాలోచించిరే మనపూర్వకవిపరేణ్యులు కాళిదాసాదులు ఆయాయి తావులఁ బద్యములను వ్రాసిరికాని స్వభావమెఱుంగక కాదు. దుఃఖసమయమున రాగములతోఁ బద్యములుపాడుట స్వభావవిరుద్ధము కాదా యని ప్రశ్నింపవచ్చునుగాని యట్లు పాడుట స్వభావవిరుద్ధము కాదు. ఆదుఃఖస్థితి యిట్టిదని తెలుపుట యొక్కటియే కవికృత్యము. నటుని పని దాని ననుకరించుటయే.అంతియకాని సాక్షాద్దమయంతివలె దుఃఖించుట యనరాదు. అట్టి భావమును ద్రష్టలకుఁ గనఁబఱచుట యనునది యిందలిసారము. అనఁగా దమయంతి యడవులఁ బడునిడుమ లిట్టివని తెలుపుట యవసరము. అది పద్యరూపమునఁగాని గీతికారూపమునఁగాని తెలిపినచో రంగస్థలవాసులకుఁ జక్కఁగాఁ దెలియఁగలదు. మాటలచేత నంత దృఢముగాఁ దెలియఁజేయ శక్యముకాదనుట యొక పొరపాటుగాదు. కావునఁ బద్యము లందందు సమయానుకూలముగా నునుచుట సమంజసమే యనవలయునని నాభావము. పూర్వకవివర్యుల భావమిట్లేయుండునని వారిగ్రంథములే చెప్పుచున్నవి. కాన పైభావము పరిత్యాజ్యము కాదు.

నాటకనియమోల్లంఘనము.

నాటక నియమములు వృథాకల్పితములు కావు. నాందీపద్యమును బఠించి రంగస్థలమున నిండియుండు సభ్యులకు హృదయాహ్లాదమును గల్గించి నాటకకథ యిట్టిదని తెలుపుట మర్యాద. ఆమర్యాద లేకుండఁజేయుట సభ్యుల నవమానపఱచుటయే. వేళ కాఁగానే యవనికోద్ఘాటనముచేయుట, లోపల రాజుగారుండుట యనునది న్యాయేతరము. రాజు ప్రవేశించుటకు ముందు వారిరాకను సూచించుట యాచారమై సకలదేశముల నొక్కరీతి వ్యాపించియుండఁగా నట్టి రాజమర్యాదను దొలఁగించుట సరసముకాదని నాభావము. ఇది నవీనపద్ధతియని సమాధానము రావచ్చును. ఇప్పటి రాజాగమనాచారము నైనను బాటింపవలదా? ఇదియే ప్రాచీనాచారము. ఎవ్వరికిఁ దెలుపకయుండ రాజు సింహాసనము నధిష్ఠించుట యెందైన, నెత్తటినైన నుండునా? అట్టి నవాచారమును మార్చుట కవికి దురాచారము గదా! అట్టి నాటకము నీతిబోధకముగాక కాలక్షేపమునకే యనవలయును. అట్టి చేరు వృద్ధినొందుట మంచిదిగాదు. రాజునందుఁ బ్రజలకు, ప్రజలపై రాజునకట్టి విశ్వాసప్రేమలుండవలయునో యట్టి మర్యాదల వీటికి బుచ్చరాదు. దాన లోకులకు హితము గలుగుట పొసఁగదు. అది పొసఁగనిచో నదినాటకమే కాదు. దక్కిన నియమములు కొన్నికొన్ని యెట్లువ్రాసినను జేరుచుండును గాని కొన్ని చేరఁజాలవు. వదలిపెట్ట వనువైనవానిని గ్రంథకర్తలే కవి యిష్టానురూపముగా వీనిని జేర్చునవచ్చు, వదలిపెట్టినను బాధలేదనిరి. పూర్వనియమములఁ బాటించుట చక్కనియాచారముల నాదరించుటయని భావము. వానిం ద్యజించుట యన సదాచారముల దూఱుమాపుటయని యర్థము. కాఁబట్టి నాటకనియమములందుఁ జేరఁగనిన ముఖ్యవిషయముల వదలక వీనిని గ్రమ్మరింపు కథను నైకాని చక్కఁగా సులభముగా వ్రాయుట లోకోపకారమని నాయాశయము. దీన దేశగౌరవమును గాపాడిన పుణ్యము లభించును. కాన నియమోల్లంఘనము చేయఁబూనరాదు. దానిచే నాటకౌచితి పాడగును. అది కారాదుకదా! కేవలప్రాచీన నియమము లన్నియు ననువర్తింపఁదగినవని చెప్పఁబూనలేదు. కాని యందు విధివాక్యములవంటి నియమములఁ బాటింపకతప్పదు. అవియే నాటకౌచితిని శోభింపనవి. తక్కుంగల నియమముల నుల్లంఘింపవచ్చునని పెద్దలే యనుమతి నొసంగిరి.

సంఘసంస్కరణము లావశ్యకములని "సత్యంవద, ధర్మంచర" అను విధివాక్యముల వీటికి బుచ్చవగునా? అవియేకాలమందును మార్పఁదగనివి. అట్లే ప్రాచీననాటకలక్షణములలోఁ గొన్ని యేకాలమునందును మార్పఁదగనివి. అట్టివానిని బట్టుపట్టి మార్పఁబూనుట పైవాక్యములను ద్రోసివేయుటవంటిది. కాఁబట్టి యట్టి పనికిఁబూనక సాధుమార్గముల ననుసరించి నాటకముల వ్రాయుట యుచితమని తోఁచెడిని. పాత్రప్రవేశనిష్క్రమణాదు లుచితరీతి నుండవలయుననుట న్యాయము కాదనరాదు. అవియే కథాసంవిధానమునకు మిక్కిలి యుపయోగకరములు. నాటకమునఁ దమకున్న పాండిత్యమునజూపి దీర్ఘసమాసము లుంచరాదు.

"శ్లో. భవేదగూఢశబ్దార్థః క్షుద్రచూర్ణకసంయుతః."

"అగూఢః అనాయాసబోధ్యః శబ్దార్థోయస్మిన్ సః; సపునః ప్రహేలికావ ద్దురూహశబ్దార్థ ఇతిభావః; క్షుద్రైర్నాతిదీర్ఘైః చూర్ణకైః వక్ష్యమాణలక్షణైః అల్పసమాసఘటితైర్గద్యవిశేషైః సంయుతః; ఏతేన భవభూతికృతరూపకత్రయే దీర్ఘసమాసఘటితగద్య బహులతయా దోష ఏవేతి ధ్వనుసంధేయమ్" అని వ్యాఖ్య.

సాధుమతులారా! చూచితిరా మనపూర్వుల ప్రతిభ! నాటకమున వాక్యము లనాయాసబోధ్యములు కావలయునఁట. అల్పసమాస ఘటితములుగ నుండవలయునఁట. అనఁగా సభ్యులకొండొకసులువుగా గ్రహింపఁదగిన ట్లుండవలయునని శాసించిరి. అహా! ఏమి నారికరుణ! ఏమి పూర్వుల నాటకాభిరుచి! అట్టి దానిని మనమేల త్యజింపఁబూనవలయును? దాన లాభమేమియో గోచరింపకున్నయది.

'ప్రయోజన మనుద్దిశ్య నమందోఽపి ప్రవర్తతే'

అన్నట్లు ఏదో ప్రయోజనముండికయున్నవారేల యట్లు ప్రయత్నింతురన్న మొండిపట్టుదలయే యనుటకన్న వేఱొండు చెప్పఁజాలకున్నయది. కావునఁ బ్రాజ్ఞులు చక్కఁగా నాలోచించి నాటకాభిరుచిని గాపాడుదురు గాక! దానఁ దెలుఁగుబాసకు గౌరవము పెంపొందుఁగాక! అని వారిని కోరుచున్నాను. తాఁబట్టిన కుందేటికి మూఁడేకాళ్ళనక యుచితరీతి నాటకముల వ్రాయుమ నితరులఁ బ్రోత్సహించుచు నాంధ్రభాషాజనని సగౌరవపఱుపఁదురని వినయమునఁ జేతులొగ్గి వేఁడుచున్నాఁడను.



# ఎవ్వరు ధన్యులు?

(పంచరత్నములు)

అయ్యదేవర బాలా త్రిపురసుందరమ్మ గారు

ఖలదురాలోచనంబులఁ గూలఁగఁద్రోచి-పాపమార్గావరోధంబుఁ బరఁగఁజేసి
యీశ్వరునిఁ గొల్చురీతుల నెఱనుగల్గి-ధాత్రివసియించువారెపో ధన్యతములు.

గీ. ఎఱుకమతిలేక భువిలోన నెన్ని పాప-కార్యములఁ జేసెనను వెక్క-సారమెఱఁగి
పాపపరిహార మొనరించు పథముఁ దెలిసి-ధాత్రివసియించువారెపో ధన్యతములు.

గీ. నిత్యశక్యాణు మనములో నెల్లప్రొద్దు-నిలిపి చరియించు సాధుల నేర్పుతోడఁ
గొలుచుచునెయుండి కపటంబుఁ గోలుపుచ్చి-ధాత్రి వసియించువారెపో ధన్యతములు.

గీ. గర్వమతి ధూర్తుఁ గోపినిఁ గామవశుని-నిర్మలానందు వంచించు నీచమార్గుఁ
జేరరానీక యీశ్వరచింతనమున-ధాత్రివసియించువారె పో ధన్యతములు.

గీ. అంగహీనుల బీదల నాదరించి-యెల్లవేళల నయమార్గమే వెదకుచు
జీవసమితిని రక్షించి ప్రీతిగల్గి-ధాత్రివసియించువారె పో ధన్యతములు.





వ్యాసకర్త

# జ్యోతిశ్శాస్త్ర పూర్వచరిత్ర—రాశిచక్రము

గర్భాం అప్పారావు గారు, బి. ఏ.,

జ్యోతిశ్శాస్త్రము శాస్త్రములన్నిటిలో పురాతనమైనది. మానవ జ్ఞానోదయమున కాదియని చెప్పవచ్చును. ఇయ్యది తేటతెల్లము. ఆదినుండియు సూర్యోదయాస్తమయసమయ చిత్రకాంతిప్రదర్శనమును, సర్వదిగ్వ్యాప్తమగు చీకటియును మానవుల కతిమనోహరములై వారిమనస్సుల కట్టిచిత్రప్రదర్శన హేతుజ్ఞానమునపు కోరిక పొడమజేసియుండును. సూర్యుడు, ఉషఃకాలము, ఆకాశము, మున్నగువానిగూర్చిన ఋగ్వేదమందలి మంత్రములు బహుశః ఖగోళ జ్యోతిస్సముదాయముయొక్క విస్మృతమగు కార్యక్రమమును వెనో శ్లాఘించుటకు జేసిన ప్రథమయత్నములవలె గన్పట్టుచున్నవి. (చూ. సూర్యసిద్ధాంతము. అధ్యా—12-8).

దృశ్యమయమవనికాభ్యంతరమునమందు ప్రధానరహస్యము ఇప్పటికి తెలుపబడకపోయినను దృశ్యమయములు తాళక్రమమున జరుగుచుప్పక ప్రదర్శింపబడుచుండెను. ఈప్రదర్శనము మానవునిదృష్టి నాకర్షించుట తప్పలేదని చెప్పవచ్చును. మరియు శాస్త్రము పరిమాణసంబంధి కావున జ్యోతిశ్శాస్త్రదృశ్యమయములు లెక్కింపతగినవే. అందు చేరినవి. ప్రతిమానవుడును సూర్యుడు, చంద్రుడు, నక్షత్రము పోవుచుండెడి యాకాశమార్గమును తప్పనిసరిగా అనుసరించి పరీక్షించియుండక తీరదు.

దక్షప్రక్షమున (అనగా భూమ్యాకాశములు కలియునట్లు కనుపించుస్థలమున) ప్రతిదినము స్థిరమాత్రము ననుసరించి సూర్యాదిగ్రహములు ఉదయించుచుండుటను, అస్తమించుచుండుటను భూమిపైనుండు వస్తువులతో సంబంధము కల్పించుకొని యుండుట పూర్వమానవునికి తప్పనికార్యమై యుండెననుట నిర్వివాదాంశము.

సృష్ట్యాదినుండియు నియమముతప్పని యీజ్యోతిర్గణప్రవర్తన మానవునిదృష్టి నాకర్షించుట యటుండగా జ్యోతిర్గణము మానవుని దైనికజీవితానుభవముతో సంబంధముకలిగియుండుటచే వానిజీవిత చక్రపరివర్తనమును కొలుచుకొనుసాధన మయ్యెను.

వేయిలీ అభిప్రాయముప్రకారము మనహిందూదేశమున సరియైన జ్యోతిర్గణపరీక్ష ప్రారంభమయ్యెను. ఈవిషయనిర్ధారణ నక్షత్రనిదర్శనములపై నాధారపడియున్నదని మున్ముందు చూపబడును. వేదములందు వర్ణింపబడిన యజ్ఞకర్మలు జ్యోతిశ్శాస్త్రజనితములే. నక్షత్రసముదాయము ననుసరించి తిరుగుచున్న చంద్రునిబట్టి యిట్టివి నియమింపబడినందునను, మరివిషయములందు ఈగ్రహసముదాయములను ప్రాముఖ్యము నొసగినందువలనను వేదకాలమున జ్యోతిశ్శాస్త్రపరిజ్ఞానమున మనపూర్వులు ఆరితేరియుండిరని చెప్పుట సాహసముకాదు.

మానవుడు సంచారజీవనముచేయు పురాతనకాలమందుసయితము జ్యోతిశ్శాస్త్రగణితము అమలులో నుండెను. ముఖ్యముగా సౌరమానము ననుసరించి దినప్రమాణము గణింపబడియుండవలెను. అయినను సౌరమానముప్రకారము సంవత్సరప్రమాణము రమారమి 365¼ దినములని స్థిరపరచుటకు వేలకొలదిసంవత్సరములు పట్టియుండెను. అయిన నాకాల మిప్పటికి బహుపురాతనము. క్రీ.పూ. 2205 సంవత్సర ప్రాంతమందలిదగు 'మాకింగు' అను గ్రంథమునకు 'యావో' (చీనా దేశము. క్రీ. పూ. 2357) అనువానికాలమున సంవత్సరమునకు 365¼ దినములని పరిగణింపబడినట్లు తెలుపబడియున్నది. కొందఱిమతమున హిందూదేశమందీసిద్ధాంతము ఇంతకుపూర్వమే చేయబడియుండెనని తెలియుచున్నది.

నిజముగా సిద్ధాంత మర్యద్భుతము. ప్రథమతః ప్రతిదినము ఉదయించుచున్న సూర్యుడొక్కడే యనియు, చంద్రుడొక్కడే యనియు నిర్ధారణయు, ఖగోళాకారముగూర్చిన యభిప్రాయస్థాపనయు నవసరమైయుండెను. బల్లపరుపుగానున్న భూమి నావరించియున్న ఖగోళ మర్ధగోళముగా నిర్ధారణచేయబడి యుండవలెను. క్రమక్రమముగా ఖగోళమొక సంపూర్ణగోళమని తెలియవచ్చెను.

5,000 సంవత్సరములక్రిందటి చీనాదేశపుగ్రంథములలో నీవిషయనిర్ధారణ తెలుపబడియుండుటయేకాక స్థిరనక్షత్రసముదాయమున సూర్యునియునికి మార్పుచెందుచుండుటయు, చీనాదేశశాస్త్రజ్ఞ లెరిగి

యుండిరనియు చెప్పబడెను. ఇంతకుపూర్వము మనదేశపుజ్యోతిశ్శాస్త్రజ్ఞులు స్థిరనక్షత్రములకును (అనగా ఒకదానికి ఇంకొకదానికి గలదూరమెన్నడు మార్పుచెందకుండునట్టియు, స్థిరమైనవృత్తాకారమార్గమును జుట్టినవ్వునట్టియు నక్షత్రములు) చరనక్షత్రములకును (సూర్యాది గ్రహములకు ఫయిరేను) గలభేదము కనుగొనియుండిరి. ఈసిద్ధాంతము సూర్యసిద్ధాంతమున విశదపరుపబడియున్నది. ఈసిద్ధాంతము నక్షత్రములు మధ్యాహ్నమునకూడ ఆకాశమండలమున నుండియుండునని సిద్ధాంతము ననుసరించినదై యుండవలెను.

నక్షత్రసమితిసంబంధము గలుగజేసి అయనముల యొక్కయు (Solstices), విషువత్తులయొక్కయు (Equinoxes) స్థలనిరూపణ చేయుమని 'యాకో' తనజ్యోతిశ్శాస్త్రజ్ఞుల నాజ్ఞాపించెనని, మనము చదివినపుడు జ్యోతిశ్శాస్త్రము పరిశీలనమందును, సూత్రీకరణమునందును క్రీ. పూ. 2300-వ సంవత్సరమునాటికే అత్యున్నతదశ పొంది యుండెనని తెలియవచ్చుచున్నది. కావున ఇదివరకు సూచించినట్లు వేదకాలమున నీవిషయము వ్యాప్తిలో నున్నదనుట నమ్మరానిది కాదు. వేదమంత్రములు, జ్యోతిశ్శాస్త్రదృక్పథమున వివరించు మహాపురుషుల విమర్శలు కేవలకల్పనలని చెప్పుట యుక్తమని తోపదు.

చీనాదేశశాసనములందు ప్రభుత్వజ్యోతిశ్శాస్త్రజ్ఞులగు 'హిహూ', 'హొ' లిరువురు క్రీ. పూ. 2159-వ సంవత్సరమున గ్రహణాగమమును గూర్చి పొరపడినందున రాజుచే మరణశిక్షనొందిరని చెప్పబడియున్నది. దీనిని బట్టి గ్రహణములు కొన్నిచోటుల, ఆకాలమునందువలెనే ఉత్పాతహేతువులుగా భావింపబడియుండెనని చెప్పవచ్చును. ఖగోళదృగ్విషయములే భయభక్తులకు కారణముకాగా తాత్కాలికజలప్రళయహేతువులగు గ్రహణములు ఉత్పాతహేతువులగుట వింతకాదు. సూర్యచంద్రసంచలనమే రాత్రిందివములను కలిగించుటచేతను, కాలపరివర్తనముచేతను, మానవజీవితమున మార్పులుకలిగించుచుండు గ్రహణములు, ధూమకేతువులు గుప్తములును, హానికరములును అగుఫలితములు మానవునికి కలిగింపకపోవు. ఇట్టిభవిష్యద్విషయనిర్ధారణ చేయుచుండెడివారి నమానుషధీమంతులనుగా భావించి వారిని దైవజ్ఞులని చెప్పుచుండెడివారు. ఇట్టి నమ్మకముచేతనే జ్యోతిశ్శాస్త్రబాల్యమున సిద్ధాంతభాగమును, జాతకభాగమును భేదభావముపొందక పరస్పరసంబంధమున వృద్ధిపొందుచు మిగుల నాదరింపబడుచుండినవి.

పైవిషయము చీనాదేశస్థులు రాహువు గ్రహణములకు దెలుపు సూత్రము నెరిగియుండిరని తెలియజేయుచున్నది. ఇది వారి శాస్త్రాధిక్యము నంతగా తెలుపదు. ఋగ్వేదసంహితయందు చంద్రునివృద్ధిక్షయకారణములు చక్కగా నిరూపింపబడినవి. సూర్యునివల్లనే చంద్రుడు కాంతిని బొందుటయు, నమావాస్యనాడు సూర్యకిరణము లెట్లు చంద్రుని పైబడి ప్రతిఫలింపబడునో తెలుపబడియున్నది. ఈ మహద్విషయము గ్రహణసంభవ మెట్లుకలుగుచున్నదో తెలుపుట కాధారమైయున్నది.

మరియు నిజముగా జ్యోతిశ్శాస్త్రమున మిగుల పరిశ్రమచేసి యభివృద్ధిగాంచిన కాల్డియనులు గ్రీసుదేశము నాగరికతాస్థితికి రాకపూర్వము గ్రహణచక్రసూత్రము (saros) కనిపెట్టిరి. ఈచక్రమున 223 చాంద్రమాసము లున్నవి. ఈచక్రకాలపరిమాణము 18 సంవత్సరముల 11 దినములు; లేక 6,585 దినములు. భూమి ననుసరించి చంద్రకక్ష్యాపాతము (Node) తిరిగితిరిగి యీకాలపరిమితిలో ప్రారంభస్థానము నాక్రమించును. కాల్డియనులు ఈనియమితకాలమందు ఏక్రమమున గ్రహణములు సంభవించినవో ఆక్రమముననే మరల సంభవించుచుండునని కనుగొనిరి. దీనిని గ్రహించుటకు, గ్రహణసంభవము సూర్యుడు, భూమి, చంద్రుడు, చంద్రునికక్ష్యాపాతము ఒక్కసమరేఖలో నుండవలెనని జ్ఞప్తియం దుంచుకొనుట యవసరము. క్రమముతప్పక గ్రహణము లిట్లు సంభవించుటకుగల కారణము భూచంద్రుల సంచలనము లందు మార్పులేకుండుటయే. ఈగ్రహచక్రసూత్రముయొక్క స్పష్టార్థము తెలిసియుండక పోవచ్చును. దీని నిర్ధారణ గ్రహణములను సంవత్సరములకొలది పరిశీలించుటవల్లనే కలిగినది. ఇదిగాక కాల్డియనులు నక్షత్రవివరణపటములు తయారుచేసి సూర్యాదిగ్రహముల మార్గమును కనుగొనుటకు రాశిచక్రము నుపయోగించెడివారు. ఈనక్షత్రవివరణపటములను నావికాయాత్రకై వాడుకచేసెడివారు. గ్రహణచక్రసూత్రమొక్కటియే వీరు స్వతంత్రించి తయారు చేయగలిగిరి.

## రాశిచక్రము

ఈరాశిచక్రమును కనుగొని దానినుపయోగించినవారిలో మొదటివా రెవరో చెప్పుట కష్టసాధ్యము. హిందూజ్యోతిశ్శాస్త్రజ్ఞులు రెండువిధములను కాలమును గణించెడివారు: చాంద్రమానతిథులను, సౌరమాన రాసులను. ఇందు చాంద్రమానగణితమే పురాతనము. ఏమన, నక్షత్రమార్గమున చంద్రసంచారము పరిశోధించుట కవకాశము కలదు. సూర్యసంచారమును తేజోనిరోధమున అట్లు ప్రత్యక్షముగా గుర్తించుట సంభవింపనేరదు. చంద్రసంచారము ననుసరించి సూర్యసంచారమును గుర్తింపవలసియుండును. ఇది యిట్లుండగా చంద్రసంచారము సూర్యసంచారముకంటె కొంత క్రమముతప్పియుండుటచేతను సూర్యునిబట్టి మానవజీవితము లెక్కింపబడుటచేతను సూర్యసంచారమే అనుభవమునకును, శాస్త్రజ్ఞానమునకును అత్యవసరమై తిథులకంటె రాసులకు ప్రాముఖ్యము కలిగినవి. కావున చాంద్రమానమే సూర్యమానముకంటె పురాతనమని చెప్పవచ్చును. హిందూదేశమందు పూర్వము మహావిషువము (Vernal equinod- సూర్యుని మేషరాశిప్రవేశము) కృత్తికాదిగ పరిగణింపబడుట చూడ మనదేశముననే చాంద్రమానగణితము ప్రారంభమైనదని తెలియవచ్చుచున్నది. కృత్తికాదిగా మహావిషువము ప్రారంభముకావలెనన్న క్రీ. పూ. 2,300 సంవత్సరముల ప్రాంతమందు జరుగవలెను. అంతకుపూర్వము రాశిచక్రోపయోగము ఎచ్చటను కానరాలేదు. ఈ విషయ మొప్పుకొనినయెడ రాశిచక్రము ప్రథమమున హిందూదేశమందే యుపయోగింప

బడెనని చెప్పవచ్చును. ఏలయన తిథులపద్ధతి హిందూదేశమందే పూర్వమునుండియు వాడుకలో నుండెనని సర్వజనాంగీకారమగుటచే హిందూదేశము రాశిచక్రజననమునకు కారణమైనది.

పైవిషయనిర్ధారణమం దెక్కువచర్చ జరిగియున్నను విశేష ఫలితము లేక రాశిచక్రమును కనుగొనినవా రెవరో సరిగా తెలుపబడ లేదు. చీనాదేశస్థులు స్వతంత్రముగా కనుగొనినయంశములనుబట్టి హిందువులు నక్షత్రసముదాయచిహ్నముల నవలంబింపగలిగిరని బియట్ శాస్త్రవేత్త తెలిపెను. వీబరుపండితుడు (Prof. Weber) అరబ్బీలును, చీనాదేశస్థులును హిందూనక్షత్రసముదాయచిహ్నముల నవలంబించిరే వారి వారినక్షత్రపథసూత్రములు వాడిరని రుజువుచేసియున్నాడు. చంద్రునివృద్ధిక్షయముల లెక్కించుటయు, చాంద్రమానపద్ధతియు అరబ్బీలు హిందువులవద్దనుండియే గ్రహించిరనియు తెలిపియున్నాడు. ఈవిషయము కోల్‌బ్రూక్ (Colebrook) బలపరచెను. కాని వీబరుపండితుడు రాశిచక్రపద్ధతి బేబిలన్‌లో ప్రారంభమైనదని ప్రతిపాదించెను. కొంతసందేహముతో విట్నీ (Whitney) పండితుడు ఒప్పుకొనెను. ఈనిర్ధారణ నిలుచుట కాధార మేదియు లేదు. బేబిలన్ సిద్ధాంతము సూర్యసంచారమున నాధారపడియున్నదని యిప్పుడు రుజువుచేయబడినది. పైనిచెప్పినట్లు సూర్యసంచారము ననుసరించి సిద్ధాంతముచేయుట చంద్రసంచారము ననుసరించి సిద్ధాంతముచేయుటకు తరువాతిదియే యనునంశము సరియైన యెడ—ఇది నిజమని పైని రుజువుచేయబడినది—బేబిలన్ సిద్ధాంతము కూడ నొకరినుండి గ్రహింపబడినదే యయియున్నది. జ్యోతిశ్శాస్త్ర విమర్శకులు ఈపరిణామపద్ధతియంతయు నొక్కటియే యని చెప్పినను హిందూదేశము, చీనా, బేబిలన్, గ్రీసుదేశములందు జ్యోతిశ్శాస్త్రము సరిసమానముగా నభివృద్ధిచెందుచుండియుండవలెను. ఇందు చాలవరకు ముఖ్యాంశములందు హిందూదేశమే ముందంజవేసినట్టి కనుపట్టుచున్నది.

రాశిచక్రమును కనుగొనినవా రెవ్వరైనను స్థిరనక్షత్రసముదాయ చక్రసూత్రోపాయము బహుపురాతనమైనదియు పూర్వపు జ్యోతిశ్శాస్త్రజ్ఞుల అద్వితీయప్రతిభను చాటునదియు నైయున్నది. ఈకాలమందు నక్షత్రశాలలు, దూరవస్తుప్రదర్శనయంత్రములు మున్నగువాని మూలమున సూర్యస్థితిగాని, మరేగ్రహస్థితిగాని ఎప్పుడైన అనాయాసముగా దెల్పవీలగును. ఒకస్థలముయొక్క మధ్యాహ్నరేఖను, గ్రహ ముత్తరించుక్షణమును నక్షత్రఘటికాయంత్రమూలమున తెలిసికొనిన చాలును. పూర్వపుసిద్ధాంతుల కిట్టిసాధనము లేమియు లేవు. వారు వివిధనక్షత్రసముదాయములు అగోచరమగు సూత్రమున గట్టబడిన వనియు, ఖగోళమును అంటియున్న వనియు, ఈఖగోళ మొక అక్షముచుట్టు తిరుగుచున్నదనియు భావించిరి. (సూర్యసిద్ధాంతము. అధ్యా. XII. ౫౫). తరువాత ఖగోళమందు ఒకవరుస నాక్రమించియున్న నక్షత్రకుటుంబ మొకటి కలదనియు నక్షత్రపథమున సూర్యుడు, చంద్రుడు తక్కిన గ్రహములు తిరుగుచున్నవని తెలిసికొనియుండురు. క్రమక్రమముగా ఈనక్షత్రసముదాయమే మార్గ సూచక స్తంభములవలె సూర్యాదిగ్రహసంచారనిర్ణయమునకు ఉపయోగింపబడినవి.

పైవాదము మరియొకరీతిగా చెప్పవచ్చును. ఖగోళమందు సూర్యపథము వృత్తాకారమున నున్నదని యిప్పటిజ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నది. దీనిని తగినరీతి 12 భాగములు చేసినయెడ నొక్కొకటి యొక్కొకనక్షత్రసమితిచే నలంకరింపబడియుండును. ఇం దొక్కొక్కటియు, వానివాని పరిమాణములందు కొంచెము భేదమున్నను, ప్రత్యేకగుణరూపములుగలదియై యున్నది.

ఏదేనొకరాశినుండి గమనించినయెడ సూర్యుడు ఒక్కొకరాశిని కొంచెమెచ్చుతగ్గుగా ఒకమాసమున నతిక్రమించుచుండును. సూర్యుడేరాశిలోనుండునో యారాశిపేరున నామాసమును పిలుచుట సూర్యసంచారవర్ణనచేయుట యొకపద్ధతి. అటులేయున చంద్రమార్గముకూడ నొకవృత్తాకారమును పొందియుండుటచే నీమార్గసంబంధముచేగూడ కాలగణనచేయుట మరియొకపద్ధతి. ఈరెండవపద్ధతి హిందువులు మొదట అవలంబించిరి. మొదట నీమార్గము 28 భాగములుగను, తరువాత 27 భాగములుగను చేయబడెను. ఒక్కొకవృత్తభాగ మొకతిథిగా భావింపబడెను. (సూర్యసిద్ధాంతము అధ్యా I. 13). ఈ విషయ మిదివరకే సూచింపబడెను. సూర్యపథము, చంద్రపథము ఖగోళమం దొక్క మండలమందే యుండుటచే సూర్యచార, చంద్రచార, తిథుల సంబంధముచేతను, రాసులసంబంధముచేతను దెలుపవచ్చును. మొదటిదే అనగా, సూర్యసంచారమునుబట్టి కాలనిర్ణయముచేయుటయే సరియైన పద్ధతి. ఈరాశిచక్రము చీనాశాస్త్రజ్ఞుల మతప్రకారము 365 భాగములుగను, ఈకాలపువారిమతప్రకారమునను, సూర్యసిద్ధాంతమందు చెప్పబడినట్లును (సూ. సి. అధ్యా I. 20) 360 భాగములుగను చేసినయెడ నొక్కొకభాగమును సూర్యసంచారమున కొకదినము పట్టును. ఈ భాగము లొక్కొకటియు మరల చిన్నచిన్న భాగములుగా చేసినయెడ గణితము కచ్చితముగా నుండును. రేఖాగణితము, యంత్రసాహాయ్యము వాడుకలోలేని ఆపూర్వకాలమున రాశిచక్రము ననుసరించి ఖగోళము సూర్యఘటికను (Sun dial) సూర్యుడు కాలసూచిగను ఉపయోగించు పూర్వశాస్త్రజ్ఞులకీర్తి గణనాతీతము. సూర్యచంద్రసంచరిత మగు ఈ రాశిచక్ర మొకసన్నని ఖగోళభాగమై సూర్యుడు పోవుమార్గము మధ్యనుకలదియై యున్నదనుజ్ఞానమే పైవిషయనిర్ధారణకు వీలు కలిగించినది.

సూర్యచంద్రులసంచలననిర్ధారణ సరిగా చేయబడిన తరువాత గ్రహగణితము స్వభావసిద్ధముగా ప్రారంభమైనది. రాశిచక్రమును తదుపరి గ్రహచక్రసూత్రమును కనుగొనుటకు ఆధారపడిన పరిశోధనలు క్రమక్రమముగా గ్రహసంభవమునకు సూర్యచంద్రుల స్థితులు, వాని చలనములును ముఖ్యములను సంశయము గుర్తించుటకు మార్గము చూపినవి. ఈసూత్రము ప్రత్యక్షముగా రుజువుచేయబడి సిద్ధాంతము చేయబడినది. ఈ విషయమున పూర్వసిద్ధాంతులకు ప్రత్యక్షమైన చలనములే నిజమగుచలనములని భావింపబడెను, చలనము

సూర్యునిదైనను భూమిదైనను గ్రహణసంభవనిర్ధారణకు భేదమేమియు కనుపింపదు.

రాసుల నమసరించి సూర్యసంచారపరిశోధన, జ్యోతిశ్శాస్త్ర ముఖ్యాంశములలో నొకటియగు అయనచలనమును (Precession of the equinoxes) కనుగొనుటకు మూలాధారమై యుండవేలెననుట నిర్వివాదాంశము. మనజ్యోతిశ్శాస్త్రజ్ఞు లీఅయనచలనము గమనించుటలో ప్రథమస్థాన మలంకరించియుండుటచే నీయంశమునుగూర్చి సంగ్రహముగా జెప్పుచు నీవ్యాసమును విరమించుచున్నాను.

విషువత్కాలములు (Equinoxes) అనగా రాత్రిందివములు సమముగా నుండుకాలములు సంవత్సరమున రెండుపర్యాయములు సంభవించును. ఒకటి మార్చినెల 21 వ తేదీని; రెండవది సెప్టెంబరు 23-వ తేదీని కలుగును. ఈదినములందు సూర్యుడు భూమధ్యరేఖపై నుండును. మొదటిది మహావిషువము (Vernal equinox) రెండవది విషువము (Autamnal equinox) అనిపిలువబడును. సూర్యు డీకాలములందు నాక్రమించు రెండుగురుతులను కలుపుసమరేఖ విషువత్సమరేఖ (The line af equinoxes)యని చెప్పబడును. ఇయ్యది సూర్య మార్గధ్రువము (pole of the-ecliptic) ను చుట్టివచ్చుచుండును. ఈ చలనము సూర్యుడు నక్షత్రమార్గమున కదలుచు పోవుదిక్కునకు వక్రగతిగా జరుగుచుండును. ఈచలనమునకే అయనచలన మందురు. ఇయ్యది పూర్తిగా చుట్టివచ్చుటకు 26,000 సంవత్సరములు పట్టును.

ఈవిషయము సూర్యచలనము నక్షత్రపథమున నెట్లు మారుచుండునో పరిశీలించుటచే నిర్ధారణచేయబడెను. సూర్యు డొకవిషువత్తునందుండునపుడు ఏనక్షత్రముతో గలిసియుండెనో మరల నావిషువత్తునకు వచ్చునపుడు ఆనక్షత్రమునకు కొంచెముదూరమగును. ఈదూరము రమారమి 72 సంవత్సరముల కొకడిగ్రీచొప్పున అగుచుండును. ఈవిషయము హిపార్కస్ అనునతడు క్రీ. పూ. 134 వ సంవత్సరమున కనుగొనెను. హిందువులు, కొందఱమతమున, ఈవిషయము క్రీ. పూ. 1192 సంవత్సర ప్రాంతమున కనుగొనిరని తెలుపబడినది. ఈకాలము సరియగునో కాదో కాని సూర్యసిద్ధాంతమున తెలుపబడినది. దీని వడి గణించుటలో హిందువులు టోలెమీ కంటె ఎక్కువనిపుణత గలిగియుండిరి. శతాబ్దమునకు $1\frac{1}{2}$ డిగ్రీచొప్పున తిరుగునని చెప్పిరి.

పైవిషయముల బరిశీలింప మనదేశము జ్యోతిశ్శాస్త్రమునందు మిగుల ప్రావీణ్యము వహించియుండెనని తెలియవచ్చుచున్నది. ఒక్కయీశాస్త్రమందే కాక పెక్కుశాస్త్రములందును సంపూర్ణజ్ఞానము కలిగియుండెను. ఇట్టిమనశాస్త్రములకు సరియైనవాడుక లేకపోవుట కడు శోచనీయము. వానియందు కృషిసల్పి వానిని ప్రచారములోనికి దీసికొనివచ్చుట మనవిధి. వంగదేశీయు లీవిషయమున మిగుల పాటుపడుచున్నవారు. కలకత్తావిశ్వవిద్యాలయమున యమ్.ఏ. పరీక్ష పఠనీయ విషయములలో "పూర్వకాలపు హిందూదేశచరిత్ర, శాస్త్రములు" అను విషయ మొకటి వేరుగా చేర్పబడుచున్నది. అందు పూర్వహిందూదేశ గణిత జ్యోతిశ్శాస్త్ర వాస్తుశాస్త్రములు మున్నగునవి బోధింపబడుచున్నవి. మద్రాసు విశ్వవిద్యాలయములో నిట్టియేర్పాటు లేకపోయినను మన ఆంధ్రవిశ్వవిద్యాలయ మీవిషయమున కలకత్తా విశ్వవిద్యాలయము ననుకరించుగాక!

## గోపికా పరితాపము

కొమరవోలు నాగభూషణరావు గారు



వ్యాసకర్త

అరుణరుచిప్రకాశిత సమంచితహాభపదీయ పల్లవా
ధరమును వేణువందు లలితశ్రుతి మీఱఁగఁ జేర్చి నల్లరాల్
గరఁగఁగఁ జేయు నీదు మృదుగానసుధారసవాహినీతతుల్
గురియఁగరాదె నాపయిని? గోపకుమార! సుసాంధ్యవేళలన్.
తనరఁగ నీదుచెంత సతత ప్రమదప్రదమౌ విపంచికా
స్వనమునఁ బ్రేమగీతికల సస్వరయుక్తిగ మేళవించి ని
న్ననయము మాధురీరసమహాంబుధి నూఁపెదనోయి నాపయిన్
గనికరమూని యొక్కపరి గాఢపుఁ బ్రేమఁ గవుంగలింపుమా!
వికసితమై మరందము స్రవించెడి పద్మవనంబుపై నళి
ప్రకరము సంతసంబొదవ వ్రాలినభంగి మదీయమానసం
బకలుషభక్తి నీయెడనె యాశ్రయమందె విలీనమయ్యె నో
వికసితపద్మనేత్ర! కనుపింపవె! యీమధుమాసశార్వరిన్.
అలలితప్రసూనచయ మల్లన నవ్వుచునుండ శర్వరీ
వేళల నిన్నుఁగూడి వనవీథిని శారదచారుపూర్ణిమా
బాల శశీముఖోద్గళిత పాండురచంద్రికలందుఁ బూఁగుటు
య్యాలల నూఁగ నాకు మనసాయెనురా! యదురాజశేఖరా!



వ్యాసకర్త

# పురాణస్థగ్రహణకథాదర్పణము

కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి గారు

శ్లో. దృష్టిభ్రమా ద్యథార్కేందో ర్వ్యుపరాగ స్తథా జగత్
ఆత్మ న్యారోప్యతే తస్య శుద్ధస్య శ్వేతరాన్వయః. ఖచరసర్పాణామ.

పురాణములనమ్మి మనహిందువులు సూర్యచంద్రగ్రహణములంగూర్చి తప్పుటూహలఁ గలిగియున్నారనియు, రాహువనుపాము మ్రింగుటచే గ్రహణములు గలుగుచున్నవను పిచ్చినమ్మకము గలిగియున్నారనియు, నదియంతయు వట్టియవివేకమనియుఁ, బాశ్చాత్యులీగ్రహణతత్త్వముంగూర్చి తమగ్రంథములలో సత్యమును బ్రకటించిరనియు, నం దిట్టిపిచ్చియూహలు లేవనియు మన నవనాగరికసోదరులు పుస్తకములు వ్రాసియు, నుపన్యాసముల నిచ్చియు హిందువులమగు మనలను, మనపెద్దలను బరిపరివిధములఁ బరిహసించుచున్నారు.

పరికించిచూడ ఘనవివేకుల మనుకొను మననవనాగరకు లెందులకు మనలను, మనపూర్వులను హేళనము చేయుచున్నారో యందులకే మనవారు జ్ఞాననిధులనియు, సత్యజ్ఞులనియుఁ గొనియాడఁదగినవారుగాఁ గాన్పించుచున్నారు. ఈయంశమును ఋజువుచేయుటకై పురాణస్థగ్రహణకథారహస్యవిచార మిందుఁ గావించుచున్నాను.

ఈవిషయమై మనశాస్త్రము లేమి చెప్పుచున్నవి?

పురాణాదుల నటుంచి మన జ్యోతిశ్శాస్త్ర మేమి చెప్పుచున్నదో కనుఁగొందము. ఏమన గ్రహణాదికముంగూర్చి సత్యజ్ఞానమును గలిగించునవి జ్యోతిశ్శాస్త్రములు. పురాణాదికము లర్థవాదములు మున్నగునవి కలిగియుండును; కావున విషయమును బ్రత్యక్షముగఁ దెలుపవు. శాస్త్ర మున్నదున్నట్టు తెలుపునదికావున శాస్త్రవిచారము ముందుగఁ గావించుకొందము.

సూర్యసిద్ధాంతముంబట్టి

మనలో నతిప్రాచీనమగునట్టియు, మనవారందఱిచేతను గౌరవింపఁబడునట్టియు సూర్యసిద్ధాంత మీవిషయమై యిట్లు తెలుపుచున్నది:

శ్లో. ఛాదకో భాస్కర స్యేందు రధస్థో ఘనవద్భవేత్,
భూచ్ఛాయాం ప్రాఙ్ముఖశ్చంద్రో విశ త్యస్య భవే దసౌ.

సూర్యునకును భూమికిని నడుమ చంద్రబింబము మేఘమువలె నడ్డువచ్చుటచే సూర్యగ్రహణమును, భూమియొక్క ఛాయలోఁ జంద్రుఁడు పడిపోవుటచేఁ జంద్రగ్రహణమును గలుగుచున్నవని దీనిభావము.

బ్రహ్మసిద్ధాంతముంబట్టి

శ్లో. ఛాదకోఽధస్స్థితి శ్చాద్య ముపరిస్థం శశీరవిమ్,
ఛాదకాధస్స్థితా శశ్వ ద్భూచ్ఛాయా మునిస త్తమ!

క్రిందనున్న చంద్రుఁడు సూర్యుని కడ్డముగను, క్రిందనున్న భూచ్ఛాయ చంద్రుని కడ్డముగను వచ్చుటచే సూర్యచంద్రగ్రహణము లగునని దీనిభావము.

వసిష్ఠసిద్ధాంతముంబట్టి

శ్లో. ఉద్భూతాఖిలధరణీచ్ఛాయా ఛాదయతి చంద్ర ముపరిస్థమ్;
స్థగయతి రవి ముపరిస్థం పశ్చా ద్దాగత్య శీఘ్రగ శ్చంద్రః.

పైకిలేచిన భూచ్ఛాయ పైనున్నచంద్రుని కడ్డువచ్చును; పైనున్న సూర్యునికి నడుమ నడ్డముగా వచ్చి

చంద్రబింబము దానిని గప్పివేయును; కాన గ్రహణములు కలుగును- అని దీనితాత్పర్యము.

సిద్ధాంతశిరోమణింబట్టి

శ్లో. పశ్చాద్భాగా జ్జలదవ దధస్సంస్థితో భేత్య చంద్రో
భానో ర్బింబం స్ఫురదసితయా ఛాదయ త్యాత్మమూర్త్యా.

* * * * * *

శ్లో. పూర్వాభిముఖో గచ్ఛన్ కుచ్ఛాయాంత ర్యత శ్శశీ విశతి;
తేన ప్రాక్ప్రగ్రహణం పశ్చా న్మోక్షో౽స్య నిస్సరతః.

ఇందువలనఁగూడ సూర్యసిద్ధాంతమునందువలెనే సూర్యునకును, మనకును గాంతిలేని చంద్రబింబ మడ్డు వచ్చుటచే సూర్యగ్రహణమును, భూచ్ఛాయలోఁ బడి పోవుటచే చంద్రగ్రహణమును గలుగుచున్నట్లు స్పష్టమగుచున్నది. ఈయది పాశ్చాత్యప్రకృతిశాస్త్రములందు గ్రహణములంగూర్చి యేమి తెల్పంబడియున్నదో దానినే మనజ్యోతిశ్శాస్త్రమును దెల్పుచున్నట్లు స్పష్టము చేయుచున్నది. జ్యౌతిషము వ్రాయుసందర్భమున సత్యజ్ఞానమును వెల్లడించిన మనపెద్దలు పురాణాదికములు వ్రాయుసందర్భమున నవివేకులై యసత్యాంశములఁ బ్రకటింతురా? ఇతరగ్రంథము లేమిచెప్పుచున్నవో కనుఁగొందము.

శ్రుతు లేమి చెప్పుచున్నవి?

శ్రుతి. యత్వా సూర్యస్వర్భాను స్తమసా విధ్యదాసురః;
అక్షేత్రవి ద్యథా ముగ్ధో భువనా న్యదీధయుః.

—ఋగ్వేదము-సౌరము.

ఓసూర్యుఁడా! నిన్ను నెపుడు అసురుఁడైన రాహువు చీఁకటిచేఁ గప్పివేయుచున్నాఁడో యపుడు భువనస్థ జనులు మూఢులవలె యథార్థమును గ్రహింపలేకయుందురు-అని ఋగ్వేదము.

శ్రుతి. సువర్ భాను రాసుర సూర్యం తమసా విధ్యత్.

—కృష్ణయజుర్వేదము.

స్వర్భానువు చీఁకటిచేత సూర్యునిగప్పి వేయుచున్నాఁడు- అని కృష్ణయజుర్వేదశ్రుతి చెప్పుచున్నది.

శ్రుతి. స్వర్భాను ర్హవా ఆసురః సూర్యం తమసా వివ్యాధ.

—మాధ్యందినశ్రుతి.

స్వర్భానువు (అనఁగా రాహువు) చీఁకటిచే సూర్యునిఁ గప్పివేయుచున్నాఁడు-అని మాధ్యందినశ్రుతి బోధించుచున్నది.

పురాణము లేమి చెప్పుచున్నవి?

బాగుగా నాలోచించిచూచినఁ బురాణములును గ్రహణములంగూర్చి సత్యమునే బోధించుచున్నవి.

దేవీభాగవతములో గ్రహణముఁగూర్చి యిట్లు చెప్పఁబడియున్నది:

సూర్యచంద్రమసో ర్దూరా ధ్భవే చ్ఛాదకః కారకః॥

(దూరమునుండి సూర్యచంద్రులకు రాహు వడ్డమగుచున్నాఁడు.)

రాహువు ఛాదనకారకుఁ డగుచున్నాఁ డనేకదా సర్వశాస్త్రములును బోధించుచున్నవి? ఇఁక నిందు విరుద్ధ మేమున్నది? పురాణములును గ్రహణకారణమును దెల్పునపుడు సత్యమునే ప్రకటించినవి.

కావ్యములంబట్టి

చమత్కారప్రధానములైన కావ్యములంగూడ గ్రహణములంగూర్చి యథార్థము చెప్పఁబడుచువచ్చినది.

కవికులసార్వభౌముఁ డగు కాళిదాసు తన రఘువంశములో నిట్లు చెప్పియున్నాఁడు:

"శ్లో. అవైమి చైనా మనఘేతి కింతు
లోకాపవాదో బలవా న్మతో మే;
ఛాయా హి భూమే శ్శశినో మలత్వే
నారోపితా శుద్ధిమతః ప్రజాభిః"

(భూచ్ఛాయ చంద్రుని మాలిన్యముగలవానినిగా లోకమునకుఁ దోఁపఁజేయుచున్నది.)

ఈశ్లోకము గ్రహణములంగూర్చి నిక్కమైనస్థితిని బోధించుచున్నదని పండితవరులగు రామేశచంద్రదత్తుఁడుగారు తమగ్రంథములలో వ్రాసియున్నారు. మఱియు నింకనొకకావ్యకారుఁడు:

......ర్భువదీయ ప్లావనం తమోగ్రహచ్ఛాదితచంద్రమండలమ్:

అని వర్ణించియున్నాఁడు.

వీని నన్నిటినిబట్టి చూడగా మనదేశములో వివేకి లోకమున కంతెకును గ్రహణములంగూర్చియథార్థము తెలియునని బాగుగా బోధపడుచున్నది. ఈసత్యజ్ఞాన మొక్క బ్రాహ్మణులకేకాదు, శూద్రులకును గలదు. శూద్రుఁడగు రామరాజభూషణుఁడు తనవసుచరిత్రములో నిట్లు వర్ణించియున్నాఁడు:

ఉ. చండతమంబు పర్వలన సంధి నొకానొకవేళ రాజమా
ర్తాండులఁ బట్టి గ్రాయునది దారుణచండతమంబె? ఈ మహో
ద్దండతమం బఖండగతిఁ దార్కొని క్రమ్మర నీదు రాజమా
ర్తాండులఁ బర్వ సంధిఘటితగ్రహిమంబు నిరంతరంబుగన్.

కాన హిందూదేశమునందలి వివేకులెల్లరును సర్వవర్ణములవారును ఆదినుండీ యిప్పటివఱకును పాశ్చాత్యులవలెనే గ్రహణములకు తమస్సు(నీడ) కారణ మను యథార్థజ్ఞానము గలిగియుండిరని మనము నిశ్శంకముగాఁ జెప్పఁకొనవచ్చును.

పురాణస్థార్థవాదముంగూర్చి

ఇట్టి సత్యజ్ఞానముగల మనప్రాచీనులు పాము సూర్యచంద్రుల కఱచి బాధించుటచే గ్రహణము లగుచున్నవని తలంతు రనుట యుచిత మెంతమాత్రమును గానేరదు. పురాణస్థములగు నర్థవాదములందు మఱియొకలాగున వ్రాయఁబడియున్న మాట సత్యము. వానిభావము తెలిసికొనుమార్గము వేఱు. సరిగ తెలిసికొనిన నదియు శాస్త్రోక్తాంశమునే చక్కగ బోధించునని మనము గ్రహించుకొనవచ్చును. మనము శాస్త్రస్థకథకును, బురాణస్థకథకును గలసంబంధమును విచారించి చూచుకొన్న యెడల మనసవనాగరకులు పిచ్చికథలుగా భావించు మనయితర గ్రంథములందలి కథలుకూడ మనవారి ఖగోళరహస్యజ్ఞతనే వెల్లడించునని తేలును. ఎట్లన:—

అర్థవాద మేమి చెప్పుచున్నది?

ఇఁక సూర్యచంద్రగ్రహణంబులఁగూర్చి యర్థవాద మేమి చెప్పుచున్నదో కనుఁగొందము. ఈవిషయమై శ్రీమద్భాగవతమున నిట్లున్నది.

మ. అమరవ్రాతములోనఁ జొచ్చి దివిజాండై రాహు పీయూషపా
నము సేయంగ గని చంద్రభాస్కరులు సన్నల్సేయ నారాయణుం
డమరారాతి శిరంబు చక్రహతిఁ దున్మాడెన్ సుధాసిక్తమై
యమరత్వంబును జెందె మూర్ధము తదన్యాంగంబు నేలంబడెన్.

గీ. అజుడు వానిశిరము నంబరవీథిని
గ్రహము నేసి పెట్టి గారవించె
వాఁడు పర్వములను వైరంబు దప్పక
భాను చంద్రములను బట్టుచుండు.

మఱియును మనప్రబంధములలో "సోముఁడా నినుఁ బెద్దపాము గఱవ" అని రాహువు నొకపాముగాఁ జెప్పియున్నారు. శాస్త్రములలో సత్యమును బ్రకటించిన మనవారు మఱల నిట్టి యూహలకు బురాణాదులం దెట్లు తావొసంగిరో కనుఁగొనవలసియున్నది. పురాణముల గమనికం గన నయ్యవి సత్యమును మూలముగాఁ బెట్టికొని దానిపైఁ జమత్కారములఁ గల్పించిపెట్టి చదువరులకుజ్ఞానమును గల్గించునట్టివి, యనగా నర్థవాదముల మూలముగా సత్యమును వెల్లడించు స్వభావము కలవని వివేకు లగువారి కందఱకును బోధపడకపోదు. కాన మనలోఁ గల యర్థవాదముల రహస్యముం గనఁ బ్రయత్నము చేయుదము. ఈవిషయమై ముచ్చటించుటకుఁ బూర్వము రాహ్వాదిగ్రహములంగూర్చి మనవారి కెట్టితలంపు కలదో ముందుగా విచారించుకొనవలసియున్నది. కావునఁ బ్రప్రథమమున నావిచారముఁ గావించుకొందము.

రాహువుంగూర్చి

రాహువన నెట్టితలంపు మనపూర్వులకుఁ గలదో తెలిసికొనఁ బ్రయత్నింతము.

తమస్తు రాహుః స్వర్భాను స్సైంహికేయో విధుంతుదః.

అని అమరము తెలుపుచున్నది. ఇందు రాహువునకుఁ దమస్సని పేరీయఁబడియున్నది. దీనివలన సమస్తరహస్యములును బోధపడుచున్నవి. తమస్సనగాఁ జీఁకటి. రాహువు చీఁకటియని దీనివలనఁ దేలుచున్నది. రాహుకేతువులకుఁ దమోగ్రహము లనువాడుకకూడఁ గలదు. వీరు నీలవర్ణులనియు, నీలాంబరచ్ఛత్రాదిధరులనియు మనగ్రంథములందుఁ దెలుపఁబడియున్నది. ఆగ్రహములు తమోమయములు కావుననే వారితో సంబంధించిన దంతయు నల్లని

దైనట్లుబోధింపఁబడినది. ఈరాహువును మనగ్రంథ మను కులనుటకుఁ గారణ మేమందు రేని, వేదాదికము ప్రకాశించుపదార్థముల దేవత లనెననియు, ప్రకాశహీనములై భీతిదములైయుండువాని నసుర లనెననియు మాక్సుముల్లర్ మున్నగు విదేశపండితులుగూడ వ్రాసియున్నారు. కావున రాహ్వాదుల నసురులనినంతన ఏహానియును లేదు. పాశ్చాత్యుల ప్రకృతిశాస్త్రములును రాహువు చీఁకటియనియే కదా తెలుపుచున్నవి! మఱియు మనగ్రంథములు-

పశ్య మత్త్ర ప్రవక్ష్యామో భూచ్ఛాయా రాహుమండలమ్.

అని మొఱలుపెట్టుచున్నవి. దీనింబట్టి మనవారెల్లరును భూమ్యాది గ్రహములఛాయనే రాహువనిరని తెలుచున్నది. ఇంకను "విధుంతుదః" అను పదముకూడ మనవారి గ్రహణరహస్యజ్ఞతను వేయినోళ్లఁ జాటుచున్నది. విధుంతుదుఁడనగాఁ జంద్రునిమ్రింగువాఁడని యర్థము. రాహువు చంద్రుని మ్రింగు నను తలంపుమాత్రమే మనవారికిఁ గలదు కాని సూర్యునిమ్రింగు ననుతలంపు లేదు. కావుననే 'సూర్యంతుదః' అనునామము పుట్టలేదు. ఈ రాహు వొక్కఁడు కాఁడు; పెక్కురు కలరు. సూర్యగ్రహణమునకుఁ గారణభూతుఁడైన రాహువు చిన్నవాఁడనియుఁ, జంద్రగ్రహణమునకు హేతుభూతుఁడైనరాహువు పెద్దవాఁడనియు (ఆకృతిలో) దేవీభాగవతాదులలోఁ జెప్పబడియున్నది. అట్లు తెలుపుటకుఁ గల కారణ మేమన, సూర్యగ్రహణమునకుఁ గారణమైనది చంద్రచ్ఛాయ. ఆనీడ మేఘమువలె మనకన్నుల కడ్డువచ్చుటచే సూర్యుఁడవిచ్ఛిన్నకాంతితోఁ బ్రకాశించుచున్నను మనముచూడలేము; కాన సూర్యగ్రహణము సంభవించుచున్నది. భూమండలచ్ఛాయవలనఁ జంద్ర గ్రహణము సంభవించుచున్నది. ఆనీడలోఁ జంద్రుఁడు పడిపోవుటచేఁ జంద్రగ్రహణము సంప్రాప్తమగుచున్నది. చంద్రమండలము భూమండలముకంటెఁ జిన్నదగుటచే సూర్య గ్రహణమునకుఁ గారణభూతుఁడైనరాహువుచిన్నవాఁడుగను, చంద్రగ్రహణమునకుఁ గారణభూతుఁడైన రాహువు పెద్దవాఁడుగను బురాణములందు వర్ణింపఁబడియుండెను. ఈవ్యాసమునఁగల మొదటిపటములోఁ జంద్రునుండిపుట్టు రాహువు (ఛాయ) మీఁది భాగమునందును, భూమినుండిపుట్టురాహువు (ఛాయ) అడుగునను నీయఁబడియున్నవి. వానిని జూచుకొనిన వానివాని ప్రమాణాదులు బోధపడును.

దీనింబట్టి పురాణములు కూడఁ బాశ్చాత్యప్రకృతిశాస్త్రములు దెలుపు రహస్యమునే స్ఫురింపఁ జేయుచున్నవని తేలుచున్నది.

భూగ్రహసూర్యచంద్రగ్రహములు

భూమి, చంద్రుఁడు, సూర్యుఁడు మున్నగుగోళములెల్లను వెలగపండువలె గుండ్రముగ నుండుననియు, సూర్యుఁడు గ్రహరాట్టనియు, నన్నిగ్రహములను మించిన పెద్దగ్రహమనియు మన పురాణాదిగ్రంథము లన్నియుఁ జెప్పుచున్నవి. మఱియును సూర్యుఁడు తిరుగుటలేదనియుఁ సూర్యునిఁ జుట్టి భూమియేతిరుగుచున్నదనియు నైతరేయ బ్రాహ్మణము, దేవీభాగవతము, ఆర్యభటసిద్ధాంతము మున్నగునవి నొక్కి-వక్కాణించుచున్నవి. వీనినన్నిటిని బట్టికూడ గ్రహములఁగూర్చియు, గ్రహసంచారములంగూర్చియు, గ్రహణములం గూర్చియును మనపండితులు పురాణాదుల ద్వారమునఁగూడ సత్యజ్ఞానము గలవారైయున్నారని మనము గ్రహించుకొనవలసియున్నది. అట్లైనచో రాహు వొక్క-పామనియు, నయ్యది పగచే సూర్యచంద్రులను మ్రింగుననియు చెప్పుట యవివేకము కాదాయుందు రేని, అట్లెంతమాత్రమును కానేరదు. మన నవనాగరకు లేకథను పిచ్చికథగా భ్రమించుచున్నారో యాకథనుబట్టియే మనవారు సత్యజ్ఞానము గలవారని తేలుచున్నది. మనపెద్దలు ఖగోళమును బాగుగఁ బరిశీలించి చూచి గ్రహణము లెట్లువచ్చునో యాప్రతిమల నిప్పటి పాశ్చాత్య పండితులవలెనే గ్రంథములందు వ్రాయుచుండెడివారు. ఆగ్రంథములయందుఁగల ప్రతిమలను గాని, యాకాశమునందుఁగల స్వర్భాను బింబాదులను గాని గ్రహింపఁగలవారు రాహువును నల్లత్రాఁచుగను, నయ్యది చక్రముచే రెండుఖండములుగ ఖండింపఁబడినదిగను, శిరో

భాగము సర్పాకారము కలదిగను, సన్నగుభాగము కేత్వాకారము(పూర్వభాగో ఽభవద్ధ్వజః) కలదిగను వర్ణింపఁబడుటయందలి సారస్యమును గ్రహింపలేకపోఁగ, పాశ్చాత్యపండితులు గ్రహణమును దెల్పుటకై యిచ్చు ప్రతిమనే యిా ప్రక్కనిచ్చి తద్ద్వారముగాఁ బురాణస్థగ్రహణకథా రహస్యమును వివరించి తెలుపుచున్నాఁడను. తేజ మొక్క గుండ్రని పదార్థముపైఁ బడిన పుడు తేజముగల ప్రక్క నావరించియుండు వస్తువు సగము వఱకు వెలుఁగు గలిగి యుండును. ఆ తేజస్సు పడని సగమునుండి చీకటి (నీడ) బయలువెడలి సర్పమువలె మొదట లావుగను, తుదిఁ గడు సన్నముగనునుండి నల్లత్రాఁచువలెఁ గాన్పించును. ఈ ప్రక్కపటములోఁ జంద్రునియొక్కయు భూమియొక్కయు ఛాయ లెట్లు వ్యాపించియున్నవో చూపఁబడినది. పటములో నున్న అ, ఇ, ఉ, ఏ, ఐ, అను ప్రతిమ భూచ్ఛాయయై యున్నది. అది నల్లని త్రాఁచువలె నుండుటచే దానిని మన పురాణకారులు పామని చెప్పిరి. మనము మన వెన్నెముకను వెనుఁబా మనుచున్నాము. దానిని బామనుటకుఁగూడ నాకృతి




యట్లుండుటయే కారణము. అరీతిగనే రాహుగ్రహము గూడ బాముగాఁ దెల్పఁబడెను. ఇంక నీరాహు వమృతము గొనుటకై దేవతలపంక్తిని గూర్చుండెననుటయందలి సారస్యముఁగూర్చి కొంచెము ముచ్చటించుకొందము. 'దివ్'అను ధాతువునుండి పుట్టిన దేవతాశబ్దమునకుఁ దేజస్సుకలది యని యర్థము. సురలు తేజోమయులైనప్పుడసురులు తద్వ్యతిరేకముగాఁ దమోమయులై యుండఁ దగినదికదా! కావునఁ జీకటి యసురులలోఁ జేర్పఁబడియుండె. ఆ హేతువుచే భూచ్ఛాయ యసురత్వ మొందె. ఇది భూమినుండి వెడలి, యతిదూరమువఱకు నాకాశమున వ్యాపించియున్న దగుటచే దీనికి స్వర్భానువని పేరు వచ్చినది. ఇది యాకసమున వ్యాపించియుండుటచే దేవతలపంక్తిలో, ననగా సూర్యచంద్రాదిగ్రహములపంక్తిలో నిది చేరినట్లు వర్ణింపఁబడియున్నది. ఇట్లు దేవతలలోఁ జేరియున్న యీతమస్సును విష్ణువు చక్రముచే ఖండించెననికదా పురాణము తెల్పుచున్నది? ఆచక్ర మేదనినఁ జంద్రుఁడు భూమిచుట్టును దిరుగుమార్గమే. ఈకక్ష్యకే చక్రమని పేరీయఁబడినది. ఈయది గుండ్రమై చక్రాకారము గలిగియుండుటచే దీనికిఁ జక్రమని పేరు వచ్చినది. చంద్రగ్రహము పుట్టినతరువాతఁగదా సూర్యచంద్రగ్రహణములు ప్రారంభమైనవి? ఇప్పటి భూతత్త్వవేత్తలు భూమినుండి యొకప్పుడు చంద్రుఁడనుభాగము విడి వేఱగు గ్రహమాయెననియు, నప్పటినుండియు నీచంద్రగ్రహమేర్పడెననియుఁ జెప్పుచున్నారు. సముద్రమథనకాలమునందు భూమి (భూమిలోని పాలసముద్రము)నుండి చంద్రుఁడు పుట్టెనని మన శాస్త్రములు చెప్పుచున్నవి. నడుమ నడ్డమువచ్చి సూర్యగ్రహణమునకును, భూచ్ఛాయలో పడి చంద్రగ్రహణమునకును చంద్రుఁడే కారణభూతుఁడగుచున్నాఁడు. కాఁబట్టి చంద్రుఁడు పుట్టిన దాదిగా సూర్యగ్రహణ చంద్రగ్రహణములు కలుగుచున్నవి. ఆ హేతువుచేఁ జంద్రుఁడుపుట్టిన దాదిగా గ్రహణములు కలుగుచున్నట్లు పురాణములు ఘోషించుచున్నవి. ఈ చంద్రునికక్ష్య యేర్పడుటకుముందు సర్పాకారముగల

రాహు వొక్కఁడే యుండెడివాఁడు. చంద్రుఁడు బయలు వెడలి యతనికక్ష (ఆకాశమున సంచరించుమార్గము) ఏర్పడినతరువాత ముఖభాగము అ,ఇ,ఏ,ఐ, అను సక్షరములచే



నైనది. రాహువని ప్రత్యేక సంజ్ఞ నందెె. కాఁబట్టియే దానిని శూర్పాకారము కల దానినిగ మనపెద్దలు తెలిపిరి. ఇంక చంద్రకక్ష కీవలఁ గల భూచ్ఛాయకు, అనగా ఇ, ఉ, ఏలచే నైన రెండవ భాగమునకుఁ, గేతువను పేరీయఁబడినది. కేతు వనగ "జెండా". ఆయాకారమున నదియుండుటచే దానికి కేతు వనుపేరొసంగఁబడినది. అ, ఇ, ఏ, ఐ, లచే బోధింపఁ బడుభాగము చేఁటవలె నుండుటచే దానికి శూర్ప మను పేరు వచ్చినది. శూర్ప మన చేఁట. చంద్రమార్గముచే భూచ్ఛాయ ఖండింపఁబడి, రెండుముక్కలై ఊర్ధ్వభాగమనియు, నధోభాగమనియు వేఱువేఱు నామముల నందుటచే పురాణకారులు రాహువు చక్రముచే రెండుభాగములుగ ఖండింపఁబడినట్లును, మొదటిభాగము రాహువుగను రెండవభాగము కేతువుగను నున్నట్లును తెల్పిరి. చదువరుల యుపయోగార్థమై శూర్పాకారముగానున్న రాహుభాగమును(అ,ఇ,ఏ,ఐలచేనైనదానిని) కేత్వాకారముగానున్న రాహుభాగమును (ఇ,ఉ, ఏలచే నైనదానిని) వేఱువేఱుగ నీప్రక్కపటములం దిచ్చియున్నాను. వానిం జత్తగించిన బుద్ధిమంతు లెల్లరును మన



పురాణకారా లిచ్చిన రూపరేఖాదుల రహస్యము గ్రహించుకొనఁగలరు. ఈవిధముగా రాహువునకు మనవారిచ్చిన యాకృతిని బట్టియు, రూపరేఖాదులను బట్టియు, నారాహువు మఱల రెండు భాగములై యుండుటకుఁ జెప్పిన యుపపత్తినిబట్టియు, ఆ ఖండించిన దాని నామరూపములంబట్టియు, రాహుకేతువుల కీయఁబడిన వేత్వేఱాకారాదులం బట్టియు బుద్ధిమంతులకు గ్రహణరహస్య మంతయుఁ బురాణాదులందుఁగూడ జ్యోతిషశాస్త్రము లందుఁ దెల్పఁబడినదానికి భంగము లేకుండఁగనే యితిహాసముగా (అర్థవాదముగా) సత్యమే తెలుపఁబడియున్నట్లు బోధపడకపోదు.



సమస్తజాతులవారి మత గ్రంథము లందును నిట్టి యితిహాసములు (myths) కలవు. ఈ యితిహాసములనే పాశ్చాత్యులు మైథాలజీ (mythology) అందురు. "A myth has generally a foundationin fact, and often conveys a deeper meaning than people suspect" అని మాక్సుమూలరు దొరవారు వ్రాసియున్నారు. ఇతిహాసము (అర్థవాదము) సత్యముమీఁదనే నిలిచియున్నదని దీనిభావము. కాఁబట్టి పురాణస్థగ్రహణకథయు జ్యోతిశ్శాస్త్రము లందుఁ దెలుపఁబడిన యంశములనే వెల్లడిచేయుచున్నదని లోకులు గ్రహించుకొనవలసియున్నది.

# అక్షర శారదా ప్రశంస

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావు గారు, బి. ఏ., యమ్. ఆర్. ఏ. యస్.

శృంగపురాధినాథుఁడు ప్రసిద్ధజగద్గురుశంకరుండు[1] ప
న్నుంగని "శారదాంబిక కనూన కటాక్షముగల్గె; నింకఁ బూ
జింగను ముత్తమోత్తమ యశంబుల నాంధ్రవిశారదా!" యటం
చుం గరుణాతిరేకమునఁ జూపఱు లెన్న బహూకరించినన్.

తే. శారదాపీఠపతి యాజ్ఞ జాదులునుఁ బ్ర-సాదమని వెండిసల్పెద స్తవము; నిట్టి
పూజఁ బునరుక్తిదోషంబు[2] పొసఁగదనుచు-నక్షరకలాప, శ్రీశారదాసురూప!

క. అత్యంతముఁ జూచినచో-సత్యం బెందైన నెఱుఁగఁజాలము: నిన్నున్
ప్రత్యహమును వాడెద మా-కృత్యాదులఁగూర్చి తెలియకే యక్షరమా!

శా. ఆకారంబు నెఱుంగఁజూడ ద్వివిధంబై[3] తోఁచె నో శారదా,
నాకందోయికి నేఁడు; నందొకటి, వీణాపాణి, వాగర్థ స
త్సాకారంబగు శబ్దరూపమును సవ్యంబారవంబై వినన్
రాకే పుస్తకపాణి, యక్షరసువర్ణంబుల్ విచిత్రాకృతిన్.

చ. అది తొలిరూపమా నిజమె యక్షరశారద; సృష్టి కాదినిన్
మొదలిన మానవుండు ధ్వనినే యెఱిఁగెన్ శ్రవణంబె జ్ఞానసం
పదకు పథంబుగాఁ జనె సమస్తము శబ్దమె; నాదమూర్తివై
మొదట నెఱుంగఁగాఁబడుట పోలునుగాదె వివాదమేటికిన్.

క. ఆశబ్ద వికారంబే-ప్రాశస్త్యము నందె వేదభాజనమై వా
క్కోశంబుల; తల్లిపి సం-కాశంబగు రూప మవలఁ గాదే పుట్టెన్.

ఆ. అవలఁబుట్టి తనినయంతఁ జిన్నతనంబు-గలుగ; దందు[4]లోపములను దీర్చి
జ్ఞాన మిలను బెఱుఁగఁగా దోహదముఁగూర్చ-నవతరించు శారదాంబ, నీకు.

శా. వక్తృశ్రోత లొకే యెడం గలియు నావశ్యంబునున్, శేముషీ
యుక్తస్ఫూర్తికిఁ దత్ప్రచారమునఁ గాలోదగ్ర విచ్ఛిత్తి, యా

---

1. శృంగేరీ జగద్గురు శ్రీమచ్చంద్రశేఖర భారతీస్వామి.
2. అర్థాంతరమున నిట్టివర్ణన నింతకు మును పెవ్వరును చేసియుండరు (Original) అని.
3. శారద "వీణాపుస్తకపాణి" యనుట శబ్ద-అక్షరరూపములకు సూచన.
4. శబ్దరూపంబుగనే యుండినయెడల గలుగు త్రివిధలోపములను తరువాతి పద్యమున జూడనగును.

శ్లోకాక్తంబుల్ బహుజిహ్వాలంగను నసత్యోద్రేకమున్ మాన్పను
ద్వ్యక్తంబై లిపిరూప మొందుకృప నీ కొప్పారదా శారదా!

మ. అవివేకాంధతమిస్ర భేదనచణోద్యద్దీపజాలంబొ! మా
నవపూర్వార్జితపుణ్యభూరుహలతాంతశ్రేణియో! సర్వకా
లవిపశ్చి జ్జన శేముషీ ధనఘట ప్రాతంబొ నాన్ శారదా,
యవతారం బొనరించి తక్షరగణఖ్యాతస్ఫుర ద్రూపవై.

ఉ. తాంత్రిక పద్ధతిన్ బహువిధంబులు[5] నుద్భవ మొంది, లెక్కతో[6]
మంత్రసమాఖ్య దివ్య మహిమంగని, దిగ్దళకంబుచేతనా
మంత్రణమంది నీకనిన మంగళరూప బహుత్వమందులన్,
సంత్రప[7]లేక, యేకతాగనం జనుఁగాంచె విశేషబుద్ధికిన్.

మ. తొలుతన్ రూపపు నామమై, పిదపఁ దత్పూర్వోక్తభాగంబునై,
తొలి శబ్దంబయి దాన, నావెనుకఁ దద్ద్యోతాచ్ఛ వర్ణంబునై,
పలుచిహ్నంబులఁ దీలునంది, జగతిన్ వ్యాపించి, జ్ఞానోదయో
జ్జ్వలశేఖాకృతిఁ గాంచి[9] యక్షరవిలాసా, ప్రోవవే మర్త్యులన్.

తే. వివిధముచ్చారణస్థాన భేదమునను-వర్ణభావంబునన్ మానవప్రతతికి
సంచిత జ్ఞాననిక్షేపసరణిఁ గంటి-వవిదితాద్యంబ, లిపి శారదా మదంబ!

సీ. కర్పూరాదుల వృక్షకాండంబులన్నాటు లీలలఁగంటి విలేఖ[10]నాఖ్య
రెల్లుగుజ్జులఁ బ్రోధి నల్లినపటముల వ్రాయుటఁగంటివి వర్ణ[11]మనఁగఁ

---

5. మతమునందలి తాంత్రికమును, వ్యవహారమునందలిదియు.

6. పంచాక్షరీ, అష్టాక్షరీ మొదలగునవి.

7. మనది యనుకొనుచుండిన యీలిపి వేఱొక్కరివలన గలిగెనని యొప్పికొనుటకు దురభిమానము పొందనీకున్న.

8. బహుత్వమున నేకత్వము (Unity in Diversity) గాంచుటయే బుద్ధికి పరమావధి.

9. విశదమగుటకు ఉదాహరణము: ఫినీషియాదిభాషలలో బెత్ అనగా గోడలో గట్టబడిన యిల్లు. మనకు భిత్తి అన గోడ. కాన | ⌐ ఈరూపము మొదట బెత్ (భిత్తిక)ను తెల్పెను. పిదప ఈరూపము బిత్ అనియో, బెత్ అనియో మాటయొక్క మొదటి భాగమును తెల్పెను. ఆవెనుక "బె" లేక "బి" యను ధ్వనిని తెల్పెను. ఆపయిని అందుండు బవర్ణమును మాత్రము దెల్పెను. ఈరూపమును మారిమారి b, B, ब రూపముల నందెను. అట్లు మారినను దీనిపేరు బెత్ (బీటా)గనే యుండెను. "బ"యని తరువాత సంస్కరింపబడెను. అట్లనే, భాష లన్నిటను మొదటి యక్షరమగు అ, A, లేక ఆల్ఫా యనునది అలెఫ్ (ఎద్దు తల లేక యెద్దు) అను & రూపమునుండి కలిగెను. కామ (ఈశ్వరుడు) అను ||| రూపమునుండి क "క" కలిగెను.

10. తొలుత నీరూపములు పెంకులమీద చెక్కుచుండిరి. అందు కాయుధము "లిఖుస్" అని అస్సీరి యాదులలో (క్రీ. పూ. 5000) అనుచుండిరి. దానినుండియే లిఖ్, లేఖన్యాదులు అని యూహకు. సంస్కృతమున సరియగు వ్యుత్పత్తి లేదు.

11. ఈజిప్టులో పెపిరస్ అనురెల్లుతో చాపలవలె నల్లి, రంగులతో వ్రాయుచుండెను. కానవర్ణము. (ఇంగ్లీషు) లెటర్ అనుదానికిని నిదియే వ్యుత్పత్తి. కాక, వేదములధ్వని యను నర్థమిచ్చు "వర్ణము" చూపున దనుట వర్ణ మారొ.

ప్రస్తరంబుల శైలభాగంబులం గాడి శాశ్వతఁగంటి నక్షర[12]సమాఖ్య
అలిఫి నాదినిగల్గి యలరుటఁగంటివి లిపియన లిఫియన లిఖి[13]యనంగ
పట్టలను దాటియాకులఁ గట్టుగ్రంథి[14]-నుంట గ్రంథంబవైతి, వీవొక్క వేళ
తోలుపటముల నుంటఁగాఁబోలు పుస్త[15]-కంబవయి శారదా, నిధానంబ వయితి.

ఉ. నైలనదింజరించి పులినంబుల గీసిన చిన్న బొమ్మలున్[16]
తేలుచు భారతాపగ, గుణించిన కోణ[17]విచిత్రరూపముల్
శైలము లెక్క పక్షి యనుసంగతి వ్రాయు త్రిభంగి రేఖలున్[18]
చాలవె నీకతల్ తెలుప, శైశవమందలి క్రీడఁజూడఁగన్.

సీ. సింధునదీతీర సీమలగంభీర గతినాడు నీ కప్పగంతులాట[19]
పాణినితాతతో బడి గడుసుదనంపుఁ బోకలనాడు దోబూచు[20]లాట
బుద్ధుని ముద్దులమాటలై రంగారుకుండలంగను బొమ్మరిండు[21]లాట
బౌద్ధభిక్షుకులతో వనవిహారంబుల నాటకరికంబన నాడునాట[22]
అలయశోకునిపీటఁ జెలరేగి రెండువిధముల నీవాడు కంబములమాట[23]

---

12. క్షరము (నాశము) కానిది అని. ధ్వని క్షరమగుట లేనగౌరవముగల యూర్యుల కసంబద్ధము. శిలాలిఖితములు నాశనము కావని చెప్పనక్కరలేదు.

13. ద్వితీయాక్షరము పి, ఫీ, ఖి యగుట, ఈవూరుమాగాని ఇంగ్లీషు ph పోలు ఫ అని తెలియవలెను. లిపి యనునది ఈధ్వని నిచ్చు లిఫి లేక (అ) లిఫ్ అగును. ఇదియే పురాతనభాషలలో తొలియక్షరము అలెఫ్ (Aleph)=ఎద్దు తలయని నామతేము.

14. భూర్జ...తాళ, మొదలగు వానిని కట్టుగ్రంథి (ముడి).

15. పొస్త అనగా తోలు అదిభాషలలో; తోలుముక్కలమీద వ్రాసికట్టుట ఒకకాలమున నుండెను. పార్చిమెంటు తోలుపటము. పొస్తక లేక పుస్తకమిదియే. సంస్కృతమున పుస్తకమునకు వ్యుత్పత్తి దొరకకపోవుచు.

16. ఈజిప్టున నైల్ నదీతీరమున తొలిలిపి బొమ్మల(వస్తువుల రూపముల) తోనే వ్రాయుచుండిరి. ఇదియే హీరోగ్లిఫిక్స్.

17. ఇప్పటి మెసపటోమియాలోని యూఫ్రటీసునదికి తొలుతటి పేరు (యు) ఫిరతు—భిరతనది. ఆభూమికి భరత భూమియని క్రీ. పూ. 3000-4000, పరసుండెను. ఇటరాజ్యముచేసిన బాబిలోనియనులు జ్ఞాపకచిహ్నములను కోణ (శూల)ములతో బలె వ్రాయుచుండిరి. ఈకోణలిపికే హనిఫారము లిపియని పేరు.

18. బెహిస్టూన్ దుర్గముశిఖరంబున డెరయస్ వ్రాయించిన త్రిభాషాశాసనము. ఇందు లిపికి డిపి యని యున్నది. పారశీకమున డలల కళ్లేదము.

19. సింధుతీరమున మహేంజొదేరో యందు మిక్కిలి లోతున వ్రాతలుగల పెంకులు వెలువడుచున్నవి. కప్పగంతులు నీటియందు పెంకులతో నాడుదురు.

20. అచ్ అని హల్ అని నడుమ కనబడకుండియు కనబడునాట.

21. బుద్ధుని చిహ్నములను పిప్రావాపాత్రమునందు దానిపై వ్రాసినవ్రాతలు.

22. గాలినొక్కరు రూపించిన యక్షరమును ఇంకొక్కరు గుర్తింపుట ఆకర్షకమని బౌద్ధజాతకాముల తెలియును. భిక్షుకులుండుచోట్లు విహారములు.

23. అశోకుని శాసనములు ఖరోష్ఠి, బ్రాహ్మియని రెండు లిపులతోనే వ్రాయబడెను. లలితవిస్తరమున చెప్పిన 64 లిపులును తరువాత ప్రక్షిప్తములు.

పిదప రాజులఁ బేరుపేరఁబిల్చుచుఁ జిత్రముగను రేకులనాఁడు బొమ్మ[24]లాట
ఆట లిట్టివి మిఠిమిఠా[25]నాఁడినట్టి-బాల్యవేళల నీకుండు భాసురాంగ
విలసనావ్యక్తతను[26]గని వినిన నేఁడు-సాంగలావణ్యవగు నిన్ను ఉంగఁగలమె?

చ. కొకిబికివేసమెల్ల యొటకో చనఁ జిత్రము దిద్దినట్టులున్
సకలవిధాంగ సౌష్ఠవము చక్కఁ బయల్పడ రూపరేఖ లం
బకముల కింపునింప జిగివట్రువలందగి ముద్దులొల్క స
త్కికములఁ గూర్చుహారము గతి న్నుతిఁగాంచితి జవ్వనంబునన్.

తే. యౌవనంబిట్లమర లీల నచ్చుపడుటఁ[27]-గాలపరిణామ భయము మించుకయును లేక
శాశ్వతాకార రేఖల జగతి మనెదు-సార్థనామంబ, యక్షరశారదాంబ!

క. స్మృతికందని కాలపు సం-గతులిపుడుం గాంచఁజేయు కరుణ, న్నీతో
క్షితియెల్ల యక్షరంబగు;-గతిమనుటయె స్వర్గమగును గాదే దేవీ!

చ. జగమునఁగల్గు సంఘములసభ్యత లెన్నఁ బ్రమాణమీవు నిం[28]
పగు భవదీయరేఖ కననౌనట నద్దియ పుణ్యభూమి దు
ర్భగులనఁ జెల్లునామొఱకవారిఁ గురుంబుల[29] బోలకుండ శ్రీ
మింగులుట మాపయిన్ కరుణమేకొనుటంగదె యక్షరాకృతీ!

ఆ. కత్తికన్న మిన్న కలమ[30]యనెడిమాట-నీదు సేవ మనుటఁగాదె కల్గె
కత్తివలదు మాకుఁ గామితార్థముగూర్చి-సర్వసుఖములిమ్ము శారదాంబ.



24. చిత్రములను (ఆయా రాజుల ధ్వజాదులకు బొమ్మలు) గలిగియుండు (తామ్రశాసనము) రేకులని యర్థాంతరము.

25. ఆటు పెన్నపాదము లుండుటయు మిఠిమిఠాలుటయే.

26. నాటియక్షరములు నేటివానివలె కానరావు: వంకరటింకరలనుట.

27. యౌవనంబు ఇట్లు అమరన్ లీలన్ అచ్చు (ముద్రణము) పడుట అనియు, యౌవనంబు ఇట్లు అమరలీలన్ (దేవతలవలె) అచ్చుపడుట (స్పష్టమగుట) అనియు. అచ్చువలన అమరత్వము=నిత్యయౌవనము కలిగెను; మార్పులు లేవు.

28. నింపు=సమగ్రము. అన్ని ధ్వనులను తెలుపగల లిపి.

29. వీరు లిపి నెఱుఁగక యింకను అనాగరికులయి యున్నవారిలో కొందఱు.

30. జొన్నదంటు, రెల్లు మొదలైన వానితో చేసిన వ్రాతకలము. లాటినులో కలమస్ అనరెల్లు. సంస్కృతమున "కలమాగ్రపింగలా" చూడుడు. తెలుగున కలమన జొన్న, నెమరులోనగు తేలికవస్తువులతో చేసిన పడవ.



# సూర్యుఁడు

దర్భా యజ్ఞేశ్వర సోమయాజి గారు, బి. ఏ., యల్. టి.

మ. దివనాథుండు, గభస్తి, భాస్కరుఁడు, వాదిత్యుండు, పూషుండు, జీ
వనముం గైకొని జీవసంఘములకు దివ్యప్రాభవోపేతుఁడుం,
జనలోకైక సుబోధకుండు, సకలాశాప్రస్ఫురన్మూర్తి, జీ
వనజాతాప్తుఁడు, కర్మసాక్షి, లతపాపఘ్నుండు రవిం గొల్చెదన్.

చరాచరమయప్రపంచము యొక్క సంభవమున కేజగజ్జ్యోతి యాధార భూతమగుచున్నదో యాసూర్యుని యాకారమును గూర్చియు, దానిభౌతికస్థితులను గూర్చియు, దానిచలనమును గూర్చియు, దాన నేయే వస్తువు లున్నవో వానినిఁగూర్చియు, దాన నేయే మార్పులు కానఁగల్గుచుండునో వానినిఁగూర్చియు, దానికి సంబంధించిన మరికొన్ని విజ్ఞాన విషయములం గూర్చియు, నాకేర్చువిధంబున నీ దిగువఁ బ్రకటించెదను.

మనసౌరకుటుంబమునకు మూలపురుషుఁడును, దానఁగల గోళము లన్నిటఁ బెద్దవాఁడును, వానియన్నిటిమధ్య రమ్యముగాఁ బ్రకాశించుచు వానికిఁ దేజఉష్ణములనొసఁగి వెలిఁగించువాఁడును, ఖగోళమున స్థిరుఁడును నై యున్న సూర్యుఁడు గూడ నొక తేజోమయంబైన గొప్పగోళము. ఈ గోళ మాకసంబున స్థిరముగ స్థానమునందే యుండి ప్రకాశించుచున్నను, భూమివలె నిడివాడ తన యక్షముమీఁద స్థిరముగ కాలావధులలో సంపూర్ణభ్రమణములను జేయుచు భ్రమించుచున్నది. ఈసూర్యగోళముయొక్క వ్యాసము 864,000 మైళ్లు. సూర్యునివ్యాసము భూమియొక్క వ్యాసమునకు 109 రెట్లు. ఇది దాదాపు $1.390 \times 10^{11}$ శతమీటరు లగుచున్నది. రాత్రింబవళ్లు తెగకుండ ప్రయాణము చేయుచు, గంట కరువది మైళ్లచొప్పునఁ బోవు పొగబండి రైదేండ్ల కాలములో సూర్యు నొక్కసారి చుట్టిరాఁగలదు. సూర్యగోళమును 10,000,000 సమానభాగములుగా భాగించినచో నొక్కొకభాగము భూమికంటెఁ బెద్దదిగా నుండును. సూర్యగోళము భూగోళమునకు 332,000 రెట్లు బరువుండును. భూమియొక్క బరువు $1.317 \times 10^{25}$ పౌనులైనచో సూర్యునిబరువు $4.38 \times 10^{30}$ పౌను లగును. సూర్యగోళముయొక్క సాంద్రత భూగోళముయొక్క సాంద్రతలో 0.256 వ వంతగుచున్నది; అనగా దాని సాంద్రత 1.415 అగుచున్నది. మనము భౌతికప్రయోగశాలలందు విద్యుచ్ఛక్తిచే ప్లాటినముతీఁగెను కాంతిమంతముగా నొనర్పఁగల్గుచున్నాము. ఇంకనుష్ణముగా దానినొనరించితిమేని యాప్లాటినముతీఁగె కరఁగును. మనకు సాధ్యమగు నుష్ణోగ్రత యిదియే. సూర్యుని యుష్ణోగ్రత దీనికంటె నెక్కువగా నుండును. సూర్యబింబముయొక్క యుష్ణోగ్రత 6000, శత విభాగిపరమాంశములు (Absolute) అని ప్రకటించియున్నారు. సూర్యుఁడు భూమినుండి 92,700,000 మైళ్ళ దూరమున నున్నాఁడు.



వ్యాసకర్త

ఎట్టి యంత్రసహాయమును లేకయే సూర్యునిఁ బరీక్షించి చూచితిమేని యది చదునైన గుండ్రని బిళ్ళవలెఁ గాన్పట్టును. దూరదర్శనయంత్రసహాయమున రంగుటద్దముగుండా సూర్యునిఁ జూచినచో, మండుచున్న గొప్పగోళముయొక్క యొకసగము మనవైపునకుఁ దిరిగియున్నట్లు గ్రహింతుము. సూర్యగోళమున వెలిఁగెడి పదార్థజాలము 'ఘనపదార్థమా, ద్రవపదార్థమా, లేక వాయుపదార్థమా?' యనుశంక చూపఱుల మనంబులకుఁ బొడముకమానదు. దూరదర్శన యంత్రముగుండా చూచిన మానవుల కది ద్రవపదార్థమయము కాదని సునిశ్చితముగాఁ దెలియును; కాని సూర్యబింబముయొక్క యుపరిభాగము మాత్రమేని ఘనపదార్థసమన్వితము కాదని మనము నిరూపింపవచ్చును. సూర్యబింబముయొక్క సాంద్రత భూమియొక్క సాంద్రతలో 0.256 వ వంతని పైన ప్రకటించితిని. భూమియందలి పదార్థజాల మంతయు ఘనపదార్థములుగాను, జలపదార్థములుగాను మారియుండుటచే భూమియొక్క సాంద్రత యెక్కువయగుచున్నది. అగ్నిపుంజమగు సూర్యుఁడు వాయుపదార్థసమన్వితమైన పెద్దగోళమని తెలియవచ్చుచున్నది. సూర్యునిగర్భమున నీవాయుపదార్థములు మిక్కిలి నిబిడముగా దృఢబద్ధములై యున్నవి. కావుననే దీనిసాంద్రత భూమియొక్క సాంద్రతకంటెఁ దక్కువగుచున్నది. సూర్యునిసాంద్రత యది వాయుపదార్థభూయిష్ఠమైనదని సూచించుచున్నది. దీనిభ్రమణవిధి భూమియొక్క

భ్రమణ విధానమునకుఁ గొంచెము భిన్నముగనున్నది. "కారింగ్టన్, స్పోరర్" అను నిద్దఱు శాస్త్రజ్ఞులు సూర్యలక్ష్మకములనెడు (Sunspots) నీగోళముయొక్క మధ్యరేఖిక భ్రమణకాలము 25 దినములని ప్రకటించిరి. 'కారింగ్టన్' అనువాఁడీభ్రమణకాలపరిమాణము నీదిగువసమీకరణముచేఁ బ్రకటించియున్నాఁడు: 'వే' దినవేగము, 'అ అక్షాంశవృత్తము' (latitude) నైనచో

$$“\text{వే} = 865' - 165' \text{ జ్య}\frac{7}{4}\text{ అ}” \text{ అగును.}$$

పరికొంద ఱీవిషయమునుగురించి తరచితరచి శోధనలనొనరించి వివిధరీతుల సమీకరణములను స్థాపించియూర్ధ్వాక్షాంశవృత్తములందు సూర్యబింబముయొక్క భ్రమణవేగపరిమాణమునం దెట్టికొంతయుఁ గాన్పించుట లేదనికాని యిది విశ్వాసపాత్రముకాదని కొందఱు వక్కాణించిరి. సూర్యునిమధ్యరేఖిక భ్రమణకాలము 24.6 దినములనియు, 30° అక్షాంశవృత్తముల మీఁదిభాగముల భ్రమణకాలము 263 దినములనియు, 60° అక్షాంశవృత్తభాగముల మీఁదిభాగముల భ్రమణకాలము 31.2 దినములనియు, 80° అక్షాంశవృత్తభాగముల మీఁదిభాగముల భ్రమణకాలము 35.3 దినములనియుఁ బ్రకటించుచు, 'ఏడమ్' అనువాఁడీకాలప్రమాణములను నిర్ణయించుట కీదిగువ సమీకరణము నొసఁగియున్నాఁడు: సూర్యునిదినకోణభ్రమణపరిమాణము శ యై, అక్షాంశవృత్తపరిమాణము అ యైనచో

$$“\text{శ} = 10.62^\circ + 3.99^\circ \text{ కోజ్య}^2\text{ అ}” \text{ అగును.}$$

దూరదర్శకయంత్రముగుండా చూచినచో సూర్యబింబమునందచ్చటచ్చట కొన్ని మచ్చలగపడును. వీనిని సూర్యలక్ష్మకములని వ్యవహరించుచున్నారు. సూర్యలక్ష్మకములసంఖ్యయందును, పరిమాణములయందును జాలవ్యత్యాసములుగాన్పించుచున్నవి. కొన్నిసమయములందు సూర్యగోళము నిష్కళంకమైనదానివలెఁ గాన్పించుచుండును. సూర్యలక్ష్మకముల సాధారణరూపము నీదిగువపటము ప్రకటించుచున్నది.



1. సూర్యలక్ష్మకముల సాధారణరూపము

వీనిమధ్యభాగము మిక్కిలి చీకటిగానుండును. ఈనల్లనిప్రదేశమునకుఁ జుట్టు కొలఁదిప్రకాశముగల ప్రాంతసీమయుండును. ఈసూర్యలక్ష్మకముల తత్త్వములనుగూర్చి పలువురు పలుతెఱఁగులసిద్ధాంతములను వెలయించియున్నారు.

ఒకానొకరిది సూర్యునికిని భూమికిని మధ్యనున్న యవకాశమునందుండి చుట్టుఁదిరుగుచున్నయంశములై యుండనోపునని వాక్రుచ్చిరి. కాని యదియొకమృష యని యూహించు నవలోకనక్రమము వెలయించుచున్నది. సూర్యగోళముయొక్క యంచునఁబొడగట్టిడి యొకసూర్యలక్ష్మకమునుగూర్చి దాని నడవడికఁ బరీక్షింపుము. అది నానాఁటు సూర్యగోళపుటంచునుండి దూరముగఁబోవుచుఁ గొన్నినాళ్లకు సూర్యబింబముమధ్యకువచ్చును. ఈస్థితియందాలక్ష్మకము చూపరకుఁ జాలవిస్తృతముగాను, పెద్దదిగాను, రమ్యముగాను నగపడును. ఈయవలోకనముల నొకకొన్ని దినములు సలుపుము. నానాఁటు నదిసూర్యబింబముయొక్క రెండవయంచుకడకుసాగుచు చిన్నదగుచున్నట్లు గోచరించు




2. సూర్యలక్ష్మకముల క్రమరూపములు

చుండును. క్రమముగానీలక్ష్మకములలోని చీకటిభాగము క్షీణించినట్లగపడియగపడి యాలక్ష్మకమాగోళపుటంచుదరిఁ జేరునప్పటికినల్లనిమచ్చయగపడక కొలఁదిప్రకాశముగల దానిప్రాంతసీమమాత్రమగపడును. అది నానాఁటు గోళపురెండవయంచుకడకుఁ జేరును. అయ్యది యందుననుండి యగపడుటను గూడ నరుదుగ చూచుచుందుము. ఈలక్ష్మకముసూర్యగోళముచుట్టుఁ దిరుగువస్తువే యైనచో నది గోళపుటంచును జేరిన తరువాత కొంతకాలము బింబమునకు గొంచెము దూరముననుండియైన మన కగపడవలెను. లక్ష్మకములు బింబపుటంచునకుఁ జేరి యదృశ్యమగుచుండుటే చూచుచున్నాము కాని, బింబమునకును వానికిని నడుమఁ గొంచెమేని దూరమున్నట్లును, నవి యంచులకు వచ్చి బింబమునుండి విడివిడిగాఁ బ్రకాశించుచు మరుఁగుపాటుఁ జెందుచున్నట్లును నెన్నఁడును నెవ్వరికినిఁ గాన్పింపలేదు. కావున నివి గోళస్థవికారములేయని యంగీకరించి సిద్ధాంతీకరించిరి.

ఈ లక్ష్మకములను శ్రద్ధతోఁ బరిశీలించిచూచిన శిల్పకశాస్త్రజ్ఞులీ లక్ష్మకముల యాకృతులందలి మార్పులు దృక్పర్వతావశంబునఁ గల్గిన వేయనియు, నీ లక్ష్మకములు బింబోపరిభాగస్థ ఖాతములనియు గ్రహింతురు. బింబోపరిభాగముకంటె లోపలిభాగము నల్లగా

న్నదనియు, లక్ష్మకములు బింబోపరిభాగమునుండి లోపలికి దొలిచిన గిన్నెలవంటి గోతులనియు ననుకొనినచో నీలక్ష్మకముల యాకృతినై చిత్ర్యములనట్టి విశదీకరించి ప్రకటింపనచ్చును. లక్ష్మకము మన కెట్టయెదురుగా నున్నపుడు వివరమధ్యముగుండా బింబముయొక్క లోపలి నల్లని భాగము మన కగపడుచుండును. అది బింబపుటంచునను డాసినకొలఁది నాళాతము యొక్క పార్శ్వములలో నొకటి మిక్కిలి హ్రస్వమగుచు నెడమువైపు వెలుగుచు పార్శ్వము రెండవవైపు దానికంటె క్షీణించినట్లగపడును. అది బింబపుటంచుఁ జేరుటకి దాని పార్శ్వములలో నొకటి మరుగుపడి రెండవది మాత్రమే కాన్పించుచుండును. కావున లోపలి నల్లనిభాగ మొకయించుక మాచాయగా నగపడెడిని. దాని రెండవ పార్శ్వము మాత్రము ప్రస్ఫుటముగాఁ గాన్పించెడి.

ఈ లక్ష్మకము లెల్లపుడు నొకేదిశకుఁ గదలుచున్నవనియే నిర్ధారణమగుచున్నది. ఇంతియకాక యేదేని యొక లక్ష్మకము సూర్యుని వంచుఁజేరి యాదిశయందదృశ్యమైనచో నది 12 లేక 13 దినముల వఱకుఁ గాన్పింపక, యటుదముక సూర్యగోళపు రెండవ దిశయందలి యంచుకడ నది మఱల గోచరించుచుండును. అవి సూర్యునిముందు భాగమును జుట్టి వచ్చుటకు తీసుకొను నంతకాలములోనే దాని వెనుక భాగమును జుట్టివచ్చుటకుఁ గూడ తీసికొనుచున్నట్లు తేటపడుచున్నది. వీనిని గూర్చి చేసిన తీవ్రావలోకనములవలన నివి 25 దినముల 5 గంటల కాలావధిలో సూర్యునిఁ జుట్టివచ్చుచున్నట్లు వ్యక్తమగుచున్నది.

వివిధాకృతులు గల్గి పలుతెఱంగులుగఁ గాన్పించెడి యీలక్ష్మకము లన్నియు దాదాపుగా నొకేకాలావధిలో సూర్యునిఁజుట్టివచ్చుచుండుట యనుదాని కొకసునిశ్చితమైన కారణమును నిరూపించు టావశ్యకము. సూర్యుఁడుకూడ భూమివలె నొకగోళమే. భూమిదాని కక్ష్యమీఁద దినమున కొకసారి భ్రమించుచున్నదని మన మెఱుంగుదుము. సూర్యుఁడు గూడ నిట్లు భ్రమించుచుండుట సహజమే. సూర్యుఁడు 25 దినముల 5 గంటలకాలములో నొక భ్రమణమును జేయుచుండినచో మన వైపునకు గోళార్ధమొక పక్షము దినములలో వెనుక ప్రక్కకుఁ బోవును. దీనంజేసి లక్ష్మకముల భ్రమణమునకుఁ గారణ నిరూపణముఁ జేయవచ్చును. ఈ లక్ష్మకములు సూర్యుఁడిరువదియైదు దినముల యైదు గంటల కాలావధిలో తన కక్ష్యమీఁద భ్రమించుచున్నాఁడని ప్రకటించుచున్నవి. ఇదిగాక లక్ష్మకముల స్థానములను బట్టి వాని భ్రమణకాలావధులు కూడ మారుచుండును. గోళమధ్యరేఖమీఁది లక్ష్మకము లొకసారి సూర్యునిఁ జుట్టివచ్చుటకు $25\frac{1}{3}$ దినముల కాలమును దీసికొనును. 30° యక్షాంశవృత్తము మీఁది లక్ష్మకము లింకొక దినము నధికముగాఁ దీసుకొనుచున్నవి. ఇంకను నున్నతములగు నక్షాంశవృత్తములమీఁది లక్ష్మకముల భ్రమణకాలావధు లింకను నెక్కువగా నుండును.

ఈ లక్ష్మకములందు దృక్పార్శ్వతలమునఁ గలుగుమార్పులు మాత్రమే కలుగుచున్నవని యనుకొనఁజనదు. ఆయాప్రత్యేక లక్ష్మకములందు పలువిధములైన వికారములును, గంపములును బొడఁగట్టుచుండును. ఈ లక్ష్మకములలోఁ గొన్ని కొన్నిదినములు మాత్రమేయుండును; మఱికొన్ని కొన్నివారములు మాత్రమే యుండును; ఇకమఱికొన్ని కొన్నిమాసములు మాత్రమే యుండును. తదనంతర మివి యంతర్ధానము నందుచుండును. ఈ లక్ష్మకములు నానాటఁబుట్టుచు గిట్టుచునుండును. సూర్యబింబముమీఁది లక్ష్మకము లొకకొన్ని కొన్ని కొన్ని తావులం దంతర్ధానమునందుచుండును. మఱికొన్నిచోట్ల నిక కొన్ని లక్ష్మకములు నూతనముగా నుద్భవిల్లుచుండుటయుఁ జూచుచున్నాము. సూర్యలక్ష్మకము లస్థిరములు. వీనిని సూర్యోపరిభాగమునఁ బొడగట్టెడి చంచల వికారములనియే చెప్పవలెను. మనకగపడెడి సూర్యుని యుపరిభాగము ఘనపదార్థ జలపదార్థములలో నెద్దానితోఁగూడినది యును గాదనియు, మనకగపడెడి సూర్యబింబోపరి భాగము వాయుపదార్థసమన్వితమనియుఁ దోఁచవచ్చుచున్నది.

పెద్దవియగు సూర్యలక్ష్మకములు సాధారణముగా రెండుగాని యంతకంటె నెక్కువగాని వేరువేరుభాగములుగ విభక్తమగుచుండును. ఒక్కొక్కప్పుడివి వేయిమైళ్ళకన్న నెక్కువకాని వేగపరిమాణముతో నివి విడిగా జరగుచున్నట్లగపడుచుండును. అప్పుడప్పుడీలక్ష్మకములకు సంబంధించి భీతావహములై రమ్యముగానుండు వికారములు కాన్పించుచుండును. మిక్కిలి తీక్ష్ణములైన తేజోగ్రంథులు హఠాత్తుగా నుద్భవములై కొన్ని నిమిషములుమాత్రమే కాన్పించును, నవియాడగట్టుస్వల్పకాలమునందు సెకనునకు దాదాపు నూఱుమైళ్ళకన్నెక్కువకాని వేగముతో కదలుచుండును. ఒకానొకశాస్త్రజ్ఞుఁడు సూర్యలక్ష్మకముల యొక్క నంచదగ్గర నిండుచంద్రులవలె వికసించు తేజోవంతములగు పదార్థములను రెండింటినిమాచెను. ఇవివాని ప్రాంతసీమలనున్న స్థానముల కంటె నైదాఱురెట్లు తేజోవంతములుగఁ బొడగట్టినవి. ఇవి యీలక్ష్మకము మీఁదుగా పూర్వదిశకు సమానాంతరములుగానుండు రేకమీఁదఁ గదలుచుఁ గ్రమముగాఁ జిన్నచిన్నవై, కాంతిరహితములై యైదునిమిషములకాలములో దాదాపుగా ముప్పదినూఱువేలమైళ్లదూరము ప్రచారముచేసి, కట్టకడకదృశ్యములైనవి.

కేవలము భూమికిసంబంధించినదగు చుంబకత్వమునకును (magnetism) సూర్యలక్ష్మకములకును నేదో యొక సన్నిహితసంబంధమున్నట్లు గ్రహించుచున్నారు. సూర్యలక్ష్మకములు చాల నగపడినప్పుడే మూఁడంటురాని దిక్సూచులు మిక్కిలి క్షోభితములగుచుండుటఁ జూచుచున్నాము. ఒకశాస్త్రజ్ఞఁడిరువదిమూఁడు సంవత్సరములకాలావధిలో 135 చుంబకత్వపు తుపానుల వరుసె యీసంబంధమును నిరూపించియున్నాఁడు. ఈచుంబకత్వపుతుఫాను పట్టిననాఁడు భూమియొక్క చుంబకత్వమునం దెక్కుడభివృద్ధి గల్గుటయు, సూర్యగోళోపరిభాగమున ననేకమార్పులు నొడముటయు నీతఁడు



హిందూ యువజనసంఘము, కొండపల్లి



ఆంధ్ర సోదరసంఘము, జెముషెడుపూరు



శ్రీ భాగవతుల సుబ్బరామయ్యగారు



పడ్డారు కట్లవైద్యము

"ఆయుర్వేదపద్ధతుల ప్రకారము చికిత్సాచరణమునగా, త్రిదోషములనెరిగి, వ్యాధినిదానముచేసి, ధాతువైషమ్యమునకు చికిత్సింపవలయునా, లేక వ్యాధిలక్షణములకు చికిత్సింపవలయునా యనువిషయమును దెలిసికొని, సాధ్యాసాధ్యకృచ్ఛ్రసాధ్యముల నెరుంగుట యన వచ్చును. అసాధ్యరోగచికిత్సాచరణమునకు సాహసించి ఆయుర్వేద వైద్యులు పూనుకొనరాదు. మూలముగ నాయుర్వేదచికిత్సాప్రణాళిక యంతయు శోధనమనియు, శమనమనియు రెండువిధములుగ విభజింప వచ్చును. ప్రతివ్యాధియందును ముందుగ సామ, నిరామవిచారణకు గడంగి, సామమయినచో రోగికి ఉపవాసరూపమయిన లంఘనాదులచేత చికిత్సచేయవలయును. ఇట్టిచికిత్సాచరణమునకు "శోధనచికిత్స" యనియు, "సంశోధనచికిత్స" యనియు నామములు. రోగము నిరామముగనుండినచో ప్రత్యేకముగ రోగమునకే చికిత్సింపవలయును. అట్టిచికిత్సాచరణమునకు "సంశమన" చికిత్సయని నామము. శోధనశమనరూపములగు నీరెండుచికిత్సలును దోషములయొక్క స్వాస్థ్యమును సరిపరచుటకే చేయబడును. ఆయుర్వేదముయొక్క పరిహారోద్దేశముగూడ దోషసామ్యమును గలిగించుటయే; ఈసందర్భమున సంశోధనచికిత్సాంతర్భాగములకు "పంచకర్మము"లను గూర్చి వివరింపవలసియున్నది.

1. వమనము:—ఆమాశయదోషములను వెడలగొట్టుటకుగాను వాంతులు గలుగజేయుట.

2. విరేచనము:—పక్వాశయమును, ఆంత్రములను శుభ్రపరచి అక్కడదోషములను వెడలగొట్టుటకుగాను విరేచనముల గలుగజేయుట. అనేకవిధములగు రోగములకు అనుకూలములగు అనేకవిరేచనౌషధములు గలవు.

3. శిరోవిరేచనము:—మెడకు పైభాగమున గలుగు రోగములందు నస్యరూపమున నౌషధముల నుపయోగించి, తద్ద్వారా మలస్రావముల గలిగించుట.

4. ఆస్థాపన, 5. అనువాసన, ఈరెండును వస్తికర్మ లనబడును. అనగా గుదమార్గమున వస్తిమూలకముగ లోనికిచ్చు నౌషధములు.

ఈవస్తికర్మయందుగల విభేదములు, క్రియానైపుణ్యములు అన్నియు పాశ్చాత్యవైద్యులకు సరిగ తెలియవు. వారిపద్ధతియం దీకర్మను ఒకవిధముగనే ఆదరించెదరు; విభేదములు లేవు. వివరించెదను:

1. నిరూహవస్తి:—కషాయాదులచేత నాంత్రముల శోధనము చేయుట.

2. అనువాసనవస్తి:—దీనినే స్నేహవస్తి యని కూడ వనియెదరు. అధోభాగమునందు వాతమును శమింపజేసి ఆంత్రములను శుద్ధపరచుటకు తైలాదుల మిళితమైన కషాయాదులచేత చేయబడు వస్తికర్మ.

3. పిచ్ఛావస్తి; 4. బృంహణవస్తి; 5. క్షేమజవస్తి, అనుపేరిట వస్తికర్మలచే పోగొట్టబడు రోగము లనేకములు గలవు. వీనియందుప యోగించెడు ద్రవ్యములు అనేకములు చెప్పబడినవి. కొన్నిరోగములందు వస్తికర్మయొక్క ప్రాధాన్య మీక్రిందిశ్లోకమువలన తెలియగలదు.

వస్తిం చికిత్సార్ధ మితి బ్రువంతి, సర్వాం చికిత్సా మపి వస్తిమేకే.

"వస్తికర్మ చికిత్సయొక్క సగభాగముగను, లేకచికిత్సయంతయు వస్తికర్మతోడనేయున్నదనియు కొందరువైద్యులయభిప్రాయము."

ఆయుర్వేదమును సవిమర్శకముగ పఠింపకయే, ముందుగా తమ యభిప్రాయమును తొందరపాటుతో చెప్పువారు ఇట్టి చికిత్సాపద్ధతులనన్నిటిని పరికించినచో ఆశ్చర్యమునొందెదరు. ఇట్టి విషయములనన్నిటిని పరికించినచో అశాస్త్రీయమని కాని, నిరాధారమని కాని చెప్ప సాహసింపరు. ఉభయవైద్యములందును ప్రవీణులగు కొందరు ప్రసిద్ధవైద్యులవల్లనే ఆయుర్వేదము కొన్ని విషయములలో పాశ్చాత్య వైద్యమునకంటె విశేషగుణకారియనియు, శాస్త్రీయమనియు చెప్పు వారిని జూచితిని. ఒకరోగముయొక్క నిదానమునే కాక రోగియొక్క శరీరతత్త్వమునుగూడ గమనించునట్లు చేయునది ఆయుర్వేదవైద్యశాస్త్రము తప్ప మరొకటి లేదు. ఇట్టివిశేషమును అనేకులు పాశ్చాత్యవైద్యులు, సరిగ గ్రహింపలేకపోయిరి. పాశ్చాత్యులవల్ల గ్రహింపబడకపోయినను పాశ్చాత్యవైద్యపుంగవులగు మహామహోపాధ్యాయ గణనాథసేన్, యామినీభూషణరాయిగార్ల యనుభవమున పాశ్చాత్యులకంటె తమకు విజయము గలుగుటకు కారణము ఆయుర్వేదపద్ధతుల ప్రకారము చికిత్సచేయుటచేతనేయని వారివల్లనే విన్నాడను. గణనాథసేనుగారు నాతో వారియనుభవమున "క్వయినా" యొక్క ఉపయోగమునుగూర్చి యిట్లు చెప్పిరి:—"మలేరియాకు" క్వయినామందుఅయినను, రోగియొక్క ప్రకృత్యాదులను గుర్తెరిగి వాడవలయునని నాయభిప్రాయము. ఇట్లు ఎరుగక వాడినచో గుణము కలుగకపోగా కొన్ని ఉపద్రవములుగూడ గలుగుచున్నవి. అట్టియెడ క్వయినాతోడ కుదరని "మలేరియా" జ్వరమును ఆయుర్వేదవైద్యుడు, తనయౌషధములచే వెంటనే కుదుర్చుచున్నాడు. గాని చికిత్సాచరణమందు రోగనిదానమే కాక, రోగియొక్క ప్రకృతి, సత్త్వము, సాత్మ్యము ఇత్యాదులు గూడ తెలిసికొనుట అత్యావశ్యకము. రోగియొక్క ప్రకృతి, సత్త్వ సాత్మ్యాదులను తెలుసుకొనలేక రోగనిదానము తెలుసుకొని చికిత్సించినను రోగము కుదురుట కష్టమగుచుండును. నిదానముతోపాటు ప్రకృత్యాదులగూడ తెలుసుకొనుట చికిత్సాచరణమునందు చాలవరకు లాభకరము. ఆయుర్వేదవైద్యులతోపాటు, ఆంగ్లవైద్యులకు చికిత్సాచరణమునందు విజయము చేకూరకపోవుటకిదియొక ముఖ్యకారణమని తెలిసికొనవలయును. ఆంగ్లవైద్యులు రోగియొక్క ప్రకృతి, సత్త్వాదులను దెలిసికొనుటకు ప్రయత్నింపరు. వారికి కేవల రోగనిదానమే ప్రధానము. ఆయుర్వేదవైద్యు లట్లుగాక నిదానముతోపాటు ప్రకృతి, సత్త్వాదులను తెలిసికొనుట ముఖ్యముగా పరిగణించెదరు.

కొన్ని ఔషధములు సేవించుటవలన, రోగనివారణ మయినను కాకపోయినను మాలినముగ మరికొన్ని రోగము లోకప్పు డుద్భవింప వచ్చును. అట్టిగుణములు గలిగినదానినిగూడ వేరొకరోగముక్రింద పరిగణించి ఆంగ్లవైద్యులు Idiocyncracy అని పేర్కొనిరి.

ఇట్టి గుణములకలిగించు నౌషధములు కొన్ని యాంగ్లవైద్యమున గలవు; క్వయినా, బ్రోమైడు, అయొడైడ్ మొదలయినవి. క్వయినాపుచ్చుకొనుటవల్ల గలుగు దుర్గుణములు ఆంగ్లవైద్యులకు మొదట తెలియవని చెప్పిన యాశ్చర్యముకాదు. ఆయుర్వేదవైద్యమున ద్రవ్యములయొక్క రసవీర్యవిపాకాదులను బట్టి ఫలానిప్రకృతిగలరోగికి ఫలానిద్రవ్యము సరిపడునను పద్ధతి ననుసరించి ఔషధద్రవ్యము లన్నియు నుపయోగింపఁబడుచున్నవి. రోగియొక్క ప్రకృతియు, ద్రవ్యముయొక్క రస వీర్యాదులును ఒకటికొకటి సరిపడినవి యైనచో మాత్రాధిక్యముగానిచ్చినను దుర్గుణములు కలుగనేరవు. ఆంగ్లవైద్యమున యిట్టిరసవీర్యవిభాగముల ప్రకారము ద్రవ్యములయొక్క గుణాగుణములను నిరూపింపక, కేవల మనుభవమున "క్వయినా" చలిజ్వరముల పోగొట్టుచున్నదిగాన దాని కిదే "స్పెసిఫిక్" అను మూఢనమ్మకములో నుద్ధతముగా వాడుచున్నారు గాన దాని సేవనమువలన కలిగే దుర్గుణములు కలుగుచునే యున్నవి. వాటికి తరువాత వేరు చికిత్స యవసరమయిన చేసికొనుచునే యున్నారు. మా వైద్యశాస్త్రము (Scientific) శాస్త్రీయము అనువారిసంగతి యిట్లున్నది."

శ్రీగణనాథసేనుగారు తాము నాడీస్పందనమునుబట్టి, రోగిశరీరప్రకృతిని, ప్రత్యక్షనిదర్శనపూర్వకముగ జూప ప్రయత్నించుచున్నారని వినుట కెంతయు సంతసముగుచున్నది. ఇట్టి పరిశోధనాత్మకములగు కార్యములకు ఆయుర్వేదజ్ఞులు గడంగుట యెంతయు శుభప్రదము. ఇట్టి కార్యములవలన ఫలసిద్ధి నిబడసినచో అచిరకాలములోనే ఆయుర్వేదము తన తొల్లిటియాస్నత్యమును బడయగలదు. బుద్ధిమంతులు, విశాలహృదయులు, నగు కొందరు ఆంగ్లవైద్యులుగూడ ప్రస్తుతపరిశోధనముల ననుసరించి, ఇట్టిసనులయందు శ్రద్ధవహించినచో ఆయుర్వేదమునందు గల కొన్నియపూర్వవిషయములు ప్రత్యక్షముగగూడ మనము జూడగలభాగ్యమబ్బునని యాశించుచున్నాను.

మన ఆయుర్వేదశాస్త్రముయొక్క నిదానక్రమము సులభముగను, శాస్త్రీయముగను ఉండి, సామాన్యవైద్యులుగూడ ననుసరింపతగినట్లున్నది. కొన్నిచోట్ల ఆంగ్లవైద్యధురీణులు అసాధ్యమునివదలిన రోగములనుగూడ, మనవైద్యులు కుదుర్చుచుండుట జూచుచున్నాము. ఆయుర్వేదవైద్యశాస్త్రముయొక్క చికిత్సాపద్ధతులన్నియు శాస్త్రీయముగను, సవిమర్శకముగను, విశదముగ చిక్కులుతీర్చి దిద్దినట్లు, సామాన్యులుగూడ ననుసరింపదగినవనుటకు సందేహము లేదు. ఒక ఉదాహరణము చూపెదను:—

ఆయుర్వేదమునందు స్నేహకర్మ స్నేహరూక్షభేదములచే రెండువిధములు. ఈరెండువిధములగు కర్మలు నేయేవ్యాధులయం దెట్లు ఉపయోగింపవలయునో శాస్త్రమునందు చక్కగవివరింపబడియున్నది. ఈవిషయజ్ఞానము ఆయుర్వేదజ్ఞులకు బాగుగ దెలిసియుండును. ఒకదాని కింకొకటి యుపయోగింపరు. ఆంగ్లవైద్యులన్నన్నో, ఇట్టి స్నేహరూక్షభేదములు దెలిసియున్నను, ఏరోగమునం దేది ఉపయోగింపవలసినదియు తెలియక తారుమారుసేయుచుందురు. నాప్రియమిత్రుడగు ఒక ఆంగ్లవైద్యుడు ఒకానొక "మహారాజునకు" వాతరోగమును జికిత్సింపుచు, దానియందు స్నేహకర్మ యావశ్యకమని తెలిపినను, యిట్టి దావశ్యకమని నిర్ణయింపజాలక, కొంతకాలము చికిత్స నొనరించి తుదకు విజయముబడయజాలక "ఎలెక్ట్రిక్ ట్రీటుమెంటును" చేసిరి. వారిచేత నయినపాట్లు పడిరి. మహారాజుగారి స్థితి నానాటికి తీసికట్టు అగుచుండెను—తుద కీవ్యాధి నాపాలబడెను. చికిత్స నారంభించితిని. ఘృత, తైలాదులతో గూడిన, స్నిగ్ధస్నేహము పనిచేయునని తెలిసికొని ఆయుర్వేదమునందు ఏమాత్రము విశ్వాసములేని మహారాజుగారిని, నమ్మించి, వ్యాధి కుదిర్చి, వారివల్లనే ఆయుర్వేదచికిత్సాపద్ధతి మహత్తరమయినదని యొప్పించితిని. నేను చదివిన పాశ్చాత్యవైద్యశాస్త్రజ్ఞానమెందులకు నా కీసందర్భమున అక్కరకురాకపోయెను. మహర్షి పుంగవులయొక్క విజ్ఞానసర్వస్వమువలనిప్రయోజనము, ఆయుర్వేదముయొక్క ఘనత వాకప్పుడు తెలిసివచ్చెను. మహారాజుగారు సంపూర్ణారోగ్యమునొంది యథాస్థితిని వారికార్యములందు ప్రవర్తించుచుండిరి. ఇటువంటి యుదాహరణము లెన్నిచూపినను జూపవచ్చును. ఇది అవసరముకాదు. అయినను ఒక్కసంగతిమాత్రము చెప్పకతప్పదు.

పాశ్చాత్యవైద్యశాస్త్రమునందు, ఎక్కువ తీవ్రమగు జ్వరమునందు చల్లనిపదార్థము మంచుగడ్డ (Ice) నుపయోగించెదరని యెల్లరెరింగినవిషయమే; ఇట్టిచికిత్సాపద్ధతి ప్రతిజ్వరమునందును చేయుట, ఆయుర్వేదచికిత్సాపద్ధతిప్రకారము శుద్ధ అవివేకవిలసితము! పిత్తప్రధానజనితములగు జ్వరములందుమాత్రమే ఇట్టిచికిత్సలు హితము. తదితరములగు శ్లేష్మ, వాత జనితజ్వరములందు ఉపద్రవకరము. ఇట్టి విచక్షణ వారికి లేదు! అన్నిజ్వరములను పరిమితావస్థ దాటినతరువాత, నిట్టిమంచుగడ్డచే చికిత్సించుట ఎంతయుపద్రవకరము!!

వైద్యసోదరులారా! మీ రేజాతికి జెందినవారైనసరే, ఏదేశవాసులయినను సరే, ఏవైద్యపద్ధతి నవలంబించుచున్నను సరే, మానవకళ్యాణమును గోరి, ఒకసారి త్రిదోషపద్ధతియన నెటువంటిదో తెలిసికొనుటకు ప్రయత్నింపుడు. దీనిని తెలిసికొనుటచే వ్యాధులను శాస్త్రీయముగను, జాగ్రత్తగను, నిశ్చయముగను చికిత్సించుటకును, సులభముగ రోగవినిశ్చయము చేయుటకును ఉపయోగపడును. ఇతరవైద్యశాస్త్రములు మీ కిట్టి సంపూర్ణజ్ఞానము నియ్యజాలవు. ఈ త్రిదోషపద్ధతి మీ హైందవవిజ్ఞానమును ద్విగుణీకరింపనుండెను. ఈపద్ధతిననుసరింపని వైద్యము నిరుపయోగము. దీనిని దెలిసికొనని వైద్యులు యమదూతలు!

మరియు నీసందర్భమున ముఖ్యముగా జెప్పవలసిన మరొకవిషయముగూడ కలదు. మహర్షు లేర్పరచిన త్రిదోషసిద్ధాంతము సార్వ

కాలికముగా, సార్వత్రికముగా, మార్పనక్కఱలేకుండ, సర్వసంపూర్ణముగ విచక్షణతో నేర్పరుపబడినది; వైద్యులకు జ్యోతివలె మార్గదర్శకమగునది. ఈవైద్యపద్ధతియందు చేరని క్రొత్తవ్యాధులుగాని, పరిహరించుటకు దారిని చూపింపబడనివిగాని లేవు. సిద్ధాంతములయొక్క పునాదు లంత కట్టుదిట్టముతో నేర్పరుపబడినవి. ఇప్పుడు దినదినాభివృద్ధియగుచున్నదని చెప్పబడుచున్న అల్లోపతి, హోమియోపతి, ఆస్టియోపతి, హూనీహ్యూర్, వాక్సిన్ థెరపీ, సైకోథెరపీ, మొదలగు వైద్యపద్ధతులయొక్క సిద్ధాంతములు, నిష్పక్షపాతబుద్ధితో విమర్శించినయెడల, దీనికనురూపములయి దీనిచేరికను గోరుచున్నవేకాని, వేరుకాదు. పై వైద్యపద్ధతులయొక్క సిద్ధాంతములు చాలవరకు ఆయుర్వేదమునకు సమన్వయపరిచి, వాటియొక్క అసంపూర్ణతను, ఆయుర్వేదముయొక్క సంపూర్ణతను నిరూపించెదను.

ఆయుర్వేదమున:—1. హేతువిపరీతము:—వ్యాధియొక్క సరియగు కారణమును గనిపెట్టి, ఆకారణమునకు విరుద్ధగుణమును గల్గించు నౌషధము నుపయోగించి చికిత్సించుట హేతువిపరీతచికిత్స యనబడును. శైత్యకారణముచేగలుగు వ్యాధికి విపరీతగుణముగల ఉష్ణచికిత్స హేతువిపరీతచికిత్స యనబడును. ఈహేతువు బాహ్యాభ్యంతరభేదములచే రెండువిధములు.

2. వ్యాధివిపరీతము:—వ్యాధియొక్క స్వభావము, లక్షణములు మొదలగువాట్లను నిర్ణయించి దానికి విరుద్ధగుణము నిచ్చు నౌషధముల ప్రయోగించుట వ్యాధివిపరీతచికిత్స యనబడును. అతిసారమునందు చిరుబొద్ది, విషమునకు విరిసెన యిచ్చుట వ్యాధివిపరీతచికిత్స.

3. హేతువ్యాధివిపరీతము:—వ్యాధి హేతువునకు, వ్యాధికి గూడ విరుద్ధములగు గుణముల గల్గించు చికిత్స హేతువ్యాధివిపరీతచికిత్స యనబడును. వాతజనితమగు శోథరోగమునందు దశమూలముల ప్రయోగము హేతువ్యాధివిపరీతచికిత్స యగును.

4. హేతువిపరీతార్థకారి:— వ్యాధిహేతువునకు అనురూపమగు చికిత్స. అనగా, పిత్తప్రధానమైన వ్రణమునకు ఉష్ణవీర్యచికిత్సలు హేతువిపరీతార్థకారి చికిత్సయగును.

5. వ్యాధివిపరీతార్థకారి:—వ్యాధికనురూపగుణము గల ఔషధములచే చికిత్స. అనగా, వాంతులగునపుడు ఇంకను వాంతులను గలుగజేయు మదనఫలముయొక్క ప్రయోగము వ్యాధివిపరీతార్థకారిచికిత్స యనబడును.

6. హేతువ్యాధివిపరీతార్థకారి:—వ్యాధి హేతువునకు,వ్యాధికిగూడ అనురూపమగు నౌషధములయొక్క ఉపయోగము హేతువ్యాధివిపరీతార్థకారిచికిత్స యనబడును. అనగా, విషమునకు విషముయొక్క ప్రయోగము ఈచికిత్సక్రింద పరిగణింపబడును.

ఈపైచెప్పబడిన చికిత్సలేకాక అన్నమును విహారమును దేశకాలాదులను గూడ విపరీతార్థములచే నెరుంగునది.

ఈపైన గనుపరచినయారువిభాగములను చక్కగ విమర్శించి చూచినయెడల హేతువిపరీతార్థకారి, వ్యాధివిపరీతార్థకారి, హేతువ్యాధివిపరీతార్థకారి అను నీమూడువిభాగములు (పైన గనుపరచినవాటిలో 4,5,6 విభాగములు) హోమియోపతీసిద్ధాంతముల కవిరోధము లయియున్నవనియు, హేతువిపరీతము,వ్యాధివిపరీతము, హేతువ్యాధివిపరీతము అను నీమూడు విభాగములు (పైవాటిలో 1, 2, 3) ఇప్పటి అల్లోపతీసిద్ధాంతమున కనురూపముగనున్నవనియు విశదమగుచున్నది. మరియు పైవాటిలో 4, 5 విభాగములగు హేతువిపరీతార్థకారి, వ్యాధివిపరీతార్థకారి అను నీరెండును, ఇప్పుడు అమలులోనున్న (Vaccine Therapy)కి సరిగ సమన్వయపడును.

ఈసంగతులన్నియు నాలోచించిచూచినయెడల మనమహర్షుల శాస్త్రజ్ఞానమునకు మనము దిగ్భ్రమ చెందవలసినదేకాని వేరుగాదు.

ఆయుర్వేదజ్ఞుల మతప్రకారము పైచెప్పినవ్యాధి విపరీతార్థకారిచికిత్స వ్యాధిని ఉపశమింపజేసినను, విపరీతార్థకారి గనుక మరొకదోషమును ప్రకోపింపజేయు సామర్థ్యముగలదిగా నెంచి కొంత రీచికిత్సాపద్ధతిని బహిష్కరించిరి. ఈవాదమున కనుగుణముగా మనము ప్రస్తుతము (Vaccine Therapy) వల్ల చికిత్సబొందినవారలకు తద్వ్యాధి ఉపశమించినను, వేరొకవ్యాధిచే పీడింపబడుచుండుట యెరింగియున్నాము.

ఇక ఆయుర్వేదశాస్త్రమునగల చికిత్సాసౌలభ్యమునుగూర్చి చెప్పవలసివచ్చినపుడు ముఖ్యముగ వివరింపవలసిన విషయ మింకొకటి గలదు; అదిస్వాస్థ్యరక్షణమునుగూర్చినది:

వ్యాధికలిగినపిమ్మట చికిత్సించి, దానిని నివారించుటకంటె, ముందుగనే అట్టివ్యాధులు రాకుండ కాపాడుకొనుట మిగుల శ్రేష్ఠమగుపద్ధతియని అందరెరింగినవిషయమే. అట్టి యీవిషయమును గూర్చి ఆయుర్వేదగ్రంథములు వివరించియున్నవి. ఇదిగాక వ్యాధికి కారణముగలిగి శరీరమున నేదైన దోషప్రకోపము గలిగినవెంటనేకూడ గనుగొని, ఆవ్యాధి రాకుండ జేయునుపాయములుగూడ చక్కగ వివరింపబడియున్నవి. ఏవ్యాధియైనను తనసహజస్వరూపము చూపకముందే హేతువును, పూర్వరూపమును, దోషచయ ప్రకోప ప్రశమములను గనిపెట్టి, ఆవ్యాధిని వ్యాపింపజేయకుండ నిర్మూలనమొనర్చుటకు ఉపాయములు నిరూపింపబడియున్నవి. ఇట్టిసౌలభ్యము ఇతరశాస్త్రములందు లేదనిన అతిశయోక్తి కానేరదు.

కాన్పూరువైద్యవరులగు డాక్టరుప్రసాద్‌లాల్ ఝా, యల్. ఎం. ఎస్ గారు దీనినిగూర్చి యిట్లు చెప్పుచున్నారు:—

"పాశ్చాత్యవైద్యపద్ధతి నవలంబించువైద్యులు దోషములయొక్క ప్రకోపావస్థను ప్రథమమున గుర్తింపజాలరుగదా! తుదకు రోగముయొక్క ప్రథమావస్థనుగూడ గుర్తించుట వారికసాధ్యముగ నుండును. మనకట్టిసౌలభ్యము గలదు. దోషములయొక్క చయ, ప్రకోప, ప్రశమావస్థలభేదముచే కనుగొనునట్లు మనకు మహర్షులు మార్గమేర్పరచియున్నారు. దోషములయొక్క తరతమావస్థల నెరింగి, అట్టి తారతమ్యమును

గలుగనీయక సమస్థితియందుంచుటయే ఆరోగ్యమని ఆయుర్వేదజ్ఞుల యభిప్రాయము. అట్టి అవస్థ ఎట్టిదనగా:—

సమదోషస్సమాగ్నిశ్చ సమధాతు మలక్రియః,
ప్రసన్నాత్మేంద్రియమనాః స్వస్థ ఇత్యభిధీయతే.

దోషసామ్యము, అగ్నిసామ్యము, ధాతుసామ్యము, మలద్వారములు వాటిక్రియను సరిగ నిర్వర్తించుచుండుట, మనస్సు, ఇంద్రియములు, ఆత్మప్రసన్నమైయుండుట ఇవి స్వస్థలక్షణము. ఇట్టి అవస్థనొందినవాడే స్వస్థుడు. అనగా సంపూర్ణారోగ్యభాగ్యశాలి.

ఇట్టి యీ వైద్యచికిత్సాపద్ధతియందేయు నిమర్శించుతేరి, ఆయుర్వేదచికిత్సాపద్ధతి మహోత్తమమైనదనియు, కేవలం "ఈహారేటికి మెథడ్" కాదనియు తెలియగలదు.*

---

# కవికుమార!!!

దుర్గమహంతి సోదరులు

శ్యామలాకాశ విశాలరంగంబున జలదమాలికల స్వేచ్ఛాచలనము
మధుమాసపికవధూమంజుగీతంబులఁ బ్రణయరాగముఁ గొల్పు భావసరణి
వికచాంబుజస్రవన్మకరందలహరులన్ రాపాడి ప్రవహించు తీపుతేట
పరిపూర్ణకౌముదీ భరితయామినులందుఁ దళ్కుబెళ్కులనీను తరళకాంతి
హృదయదర్పణమందు చిహ్నితములగుచు-నీదు లేఖినితోఁగూడి నిర్గతమయి
విహరణము సేయుచుండు నీ విశ్వమందు-నవనవకళాప్రచార, యో కవికుమార!!

సీ. కనులఁ జూడఁగరాని కమనీయసౌధ పర్వతకాననాది సద్వస్తుచయము
ఆలకింపఁగరాని యలఘుమోహనమయ సంగీతకాకలీస్వానఝురము
చవిఁ జూడఁగారాని సరసపీయూష తరంగమాధుర్యధారానికరము
అనుభవింపఁగరాని యానందకేళీవిలాససముజ్జ్వల లాలనమ్ముఁ
గలిగి నీసృష్టిభావ సంకలితమగుచుఁ-బ్రతిఫలించును హృదయదర్పణమునందు
సరసుఁ డొక్కండె యెఱుఁగు నాజాడలెల్ల-నవనవకళాప్రచార! యో కవికుమార!!

సీ. శూన్యాంతరిక్షంబుఁ జూచుచు నలఁతి నిట్టూర్పులఁ బుచ్చెద వొక్కమాటు
మానముద్రవహించి మదినేకధాయత్త మొనరించుచుందు వింకొక్కమాటు
శరపరంపరలవాక్చాతుర్యముంజూపి యుద్ధతి రచియింతు వొక్కమాటు
ప్రకృతిసౌందర్యముఁ బరికించి తన్మయ మొందుచునుందు వింకొక్కమాటు
లలితకవితాలతాంగీ విలాస మగ్న-మానసుఁడవయి యున్మత్తమనుజుఁబోలెఁ
గడపెదవు రసమయముగాఁ గాలమెల్ల-నవనవకళాప్రచార! యోకవికుమార!!!

---

* ఈవ్యాసము 'ఉస్మాన్ కమిటీ రిపోర్టు'ననుసరించి వ్రాయబడినది.

# ౧౦. ప్రకీర్ణకము



వ్యాసకర్త



## వ్యాసులు

పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి గారు

వేదవిభాగమును, పురాణములను, బ్రహ్మసూత్రములను, మహాభారతసంహితను జేసినవాఁడు వేదవ్యాసుఁడనియు, వాఁడు కృష్ణద్వైపాయన, ద్వైపాయన, బాదరాయణ, పారాశర్యాది నామములు కలవాఁడనియు సామాన్యముగా వంపరును దలఁతురు. కాని వేదవిభాగకర్తలు, పౌరాణికులు, బ్రహ్మసూత్ర స్మృతి శిక్షా భారత సంహితాది కర్తలు వేర్వేఱుగా నుండిరని తెలియరు. విష్ణు, కూర్మ, దేవీ భాగవత, భాగవత పురాణములలో వ్యాసులు పెక్కండ్రు కలరని కలదు. విష్ణు, కూర్మ, దేవీభాగవత పురాణములలో నిరువదెనమండ్రు వ్యాసు లాయాయుగములలో వేదభాగముఁ జేసినట్లు గలదు. వేదానుక్రమణికలం బరిశీలించి చూచిన నేయే వ్యాసుఁ డేయే వేదభాగములకుఁ గర్తయో తెలియవచ్చును. 'వ్యాస' యనునది బిరుదుకాని స్వతస్సిద్ధమగు పేరు కాదు. వ్యాసశబ్దమునకు నీవిధమగు నిర్వచనము చెప్పఁబడెను:—

[1]"ఏ హేతువుచే వేదములను విస్తరింపఁజేసెనో ఆ హేతువుచే వ్యాసుఁడని చెప్పఁబడెను."

ఇరువదెనమండ్రు వ్యాసుల పేరుల నీక్రిందను దేవీభాగవతము ననుసరించి వ్రాయుచు, విష్ణు కూర్మపురాణములలోఁగల భేదముల నుదాహరింపుచు, వేదానుక్రమణికల ననుసరించి వేదములలో వారి కెంతెంత భాగమున్నదియు, వారు చేసిన యితరగ్రంథములను నాకుఁ దెలిసినంతవఱకు వ్రాసి, పిమ్మట కృష్ణద్వైపాయనుని గుఱించి వ్రాసెదను. ఇందుఁ జెప్పఁబడిన "మంత్రద్రష్టలు" కొందఱు దేవతలుగా సూత్రవృష్టిలోఁ గాన్పింతురు కాని వారు దేవతలు కారనియు, ఆ పేరుగల ఋషులే యనియుఁ దలఁపవలయును.

### 1. స్వాయంభువు

ఈతఁడే వేదములను విభజించినవాఁడు. ఈతనినే "స్వాయంభువుమను" వనికూడ పురాణములు వాకొనుచున్నవి. విష్ణుపురాణములో మొదటివ్యాసుఁడు "బ్రహ్మ" యని కలదు. బ్రహ్మపేరుతో "అథర్వవేదములో" నూరు సూక్తములును, కృష్ణయజుర్వేదములో నొకకాండమును గలవు.

### 2. ప్రజాపతి

ఈతఁడు కృష్ణయజుర్వేదములో సౌమ్యాదికాండలకు కర్త. సామాథర్వవేదములలోఁ గొన్ని సామములు, సూక్తములుకూడ కలవు. ఈతనిని "కశ్యపప్రజాపతి"[2] యను పేరుతోఁ గొన్ని పురాణములు చెప్పుచున్నవి.

### 3. ఉశనుఁడు (శుక్రుఁడు)

"ఉశనో" నామముతోఁ గొన్ని సామములు, శుక్ర నామముతోఁ గొన్ని యథర్వసూక్తములుం గలవు. శుక్రున "కశనో" నామము నిఘంటువులఁ గలదు. శుక్రనామముతో నీతిశాస్త్రమును ఉశనో నామములో నొకస్మృతియు [3]ప్రసిద్ధములై యున్నవి. భార్గవపురాణమను పురాణముకూడ కలదు. శుక్రునకు భార్గవనామముకూడ ప్రసిద్ధము.

### 4. బృహస్పతి

కృష్ణయజుర్వేదములోని ౯ కాండలకుఁ గర్త. ఋగథర్వవేదములలోఁ గొన్ని సూక్తములును, సామవేదములోఁ గొన్ని సామములు నీతని

---

1. "వివ్యాస వేదాన్ యస్మాత్స తస్మాద్వ్యాస ఇతిస్మృతః."-ఆదిపర్వము "63 అధ్యా."
2. కశ్యపనామముతోఁ గొన్ని ఋక్కులు సామములు కలవు. అటు "మారీచకాశ్యపుడు" అనుటచే నీతఁడు వేఱని తలఁపవలసియున్నది.
3. ఔశనసస్మృతి.

పేరునఁ గలవు. 1 బృహస్పతిస్మృతి; బృహస్పతి నీతిశాస్త్రముకూడ కలదు.

## 5. సవిత

"ఆదిత్య" నామముతోఁ గొన్ని ఋక్కులు సవిత యనునామమును గొన్ని యాగ్నేయసూక్తములును కలివు. ఆదిత్య సవితృనామములు సూర్యపరమైయున్నవి. సూర్యునినుండియే శుక్లయజుర్వేదము పుట్టెనని పురాణములు వాకొనుచున్నవి. అరుణనామమునఁ గృష్ణయజుర్వేదములో నొకకాండకలదు.

## 6. మృత్యువు

"మృత్యు"నామముతో వేదములోను పురాణములలోను గ్రంథమేదియుఁ గాన్పింపలేదుకాని కఠోపనిషత్తునందు మృత్యువను నాచార్యునిచేఁ జెప్పఁబడిన కొంతభాగమున్నది. యమ నామముతోను, యమీ నామముతోను, వైవస్వత నామముతోను ఋక్సామాథర్వ వేదములలో సూక్తములు, సామములు కొన్ని కాన్పించుచున్నవి. ఋగ్వేదముయొక్క దశమ మండలములో వైవస్వతయముఁడనియు, యమఋషి యనియు ఇద్దరుమునులయొక్క సూక్తము లున్నవి. సామవేద ప్రథమపర్వమున "మృత్యువాహోహితుఁ"డను నొకఋషి కలఁడు. యమియనునామె వైవస్వతనామముతో నొకతెకలదు. ఆమె యమునిభార్యయో సోదరియో తెలియదు. ఆమె పేరున ఋగ్వేద దశమమండలమునఁ గొన్నిసూక్తములు కలవు. పురాణములలో యమునిసోదరి యమున కలదు. ఆమెయే యమునానది. యముని పేరున స్మృతికూడ కలదు. 3

## 7. ఇంద్రుఁడు

ఇంద్రనామముతో ఋగ్వేదదశమమండలమునఁ గొన్నిసూక్తములు కలవు. వైకుంఠుఁడను నింద్రుఁడొకఁడు; ముష్కములుగల యింద్రుఁడొకఁడును ఇరువురు కాన్పించుచున్నారు; (క్రీ. శ. (16) శతాబ్దారంభమున నందతిమ్మన్న ముక్కుపెద్దదగుటచే ముక్కుతిమ్మన్న యైనటుల) అండములు పెద్దవగుటచే నీతనిని "ముష్కవానింద్రః" అని ఋషులుచెప్పిరి. సూక్తద్రష్టలగు ఇంద్ర యమాది మునులు వేదసూక్తములలో ఇంద్ర యమాది దేవతలచే నుతింపఁబడియుండుటగ మనింపఁ దగినది. ఇంద్రనామముతో వేఱుగ్రంథములు కాన్పింపవు.

## 8. వసిష్ఠుఁడు

ఋగ్వేదములో నేడవమండలమునకుఋషి. సామాథర్వ వేదములలోఁ గొన్నిసామములును సూక్తములుకూడ కలవు. వసిష్ఠధర్మశాస్త్రమొండుకలదు. వసిష్ఠరామాయణముకూడ కలదుగాని అది కాశ్మీరదేశమునఁ గొన్నిశతాబ్దములకుఁ బూర్వముండియున్న "అభినందనపండితుని" చే జేయఁబడినదని దానిఁజదువఁగా విశదపడఁగలదు.

## 9. సారస్వతుఁడు

ఈతని పేరునఁగల గ్రంథమేదియుఁ బ్రసిద్ధిగ నాకుఁ గాన్పింపలేదు. తైత్తిరీయబ్రాహ్మణమున సారస్వతాధ్యాయములుమాత్రముకొన్ని కాన్పించుచున్నవి.అవి సావిత్రాచయనీయజ్ఞ సంబంధమైనవి. బ్రాహ్మణులయిండ్లలోను వివాహాదస్యకాలమున వానిని ముఖ్యముగాఁ జెప్పుదురు. సారస్వతాధ్యాయములు సారస్వతప్రోక్తములేమో శోధింపవలసియున్నది.

## 10. త్రిధాముఁడు

ఈతని పేరునఁగల గ్రంథమేదియుఁ గాన్పింపదు. కాని ఋక్సామ వేదములలో గొన్నిసూక్తములు సామములు త్రిత, త్రిశోక, త్రిశిర నామములతోనున్నవి కాన్పించుచున్నవి. అవి యీత్రిధామునకన్వయించునేమో శోధింపవలెను.

## 11. త్రివృషుఁడు

త్రిధామునిగ్రంథములవలెనె యీతనిగ్రంథములును మృగ్యములు. మార్కండేయపురాణములో త్రివృషునిస్థానమున వృషభుఁడు పేర్కొనఁబడెను. ఆపేరునఁగల గ్రంథములును కాన్పింపవుకాని ఋగ్వేదములో ఋషభుఁడను ఋషియొక్క సూక్తములు కొన్ని కాన్పించుచున్నవి.

---

1. మంత్రఋషులు కాండఋషులునని వేదఋషులు రెండువిధములుగా నుందురు. దీనినిగురించి అరుణమున ౧-౧-౧లో నిట్లున్నది. "నమ ఋషిభ్యో మంత్రకృద్భ్యో మంత్రపతిభ్యః" అని. పైమంత్రమునకు భాష్యముఁజేయుచు విద్యారణ్యులు "మంత్రకృద్భ్యో" మంత్రం పశ్యంతీతి మంత్రకృతః, యద్యప్యపౌరుషేయే వేదే కర్తారో న సంతి. తథాపి కల్పాదా వీశ్వరానుగ్రహేణ మంత్రాణాం లబ్ధారో మంత్రకృత ఇత్యుచ్యంతే; తల్లాభశ్చ స్మర్యతే. శ్లో. యుగాంతేఽంతర్హితాన్వేదాన్ సేతిహాసాన్ మహర్షయః; లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతా స్స్వయంభువేతి సంప్రదాయప్రవృత్త్యై, మంత్రాణాం పాలనాన్మంత్రపతయ ఇత్యుచ్యంతే" అని వ్రాసిరి. పైమంత్ర మంత్రభాష్యముల యర్థముల నాలోచింపఁగా మంత్రకృత్తులనగా మంత్రఋషులనియు, మంత్రపతులనగా కాండఋషులనియు తాత్పర్యమగుచున్నది. వేద "మపౌరుషేయ" మని భారతీయులలోఁ బెక్కండ్రు తలఁతురు. దానిని విద్యారణ్యులు కల్పాది నీశ్వరానుగ్రహముచే మంత్రములఁబొందినవారని సమర్థించుట గమనింపవలసియున్నది. నాతాత్పర్యమున భగవదనుగ్రహమున నలౌకికజ్ఞానము నొంది దానిని ఛందోరూపముగా గానముఁ జేసినవారు మంత్రఋషులు; ఆయాఋషి ప్రోక్తమంత్రములనొకటిగా సమకూర్చి కాపాడినవారు మంత్రపతులు. వారే కాండఋషులు నని. "యమస్మృతి."

## 12. భరద్వాజుఁడు

ఋగ్వేదములోని యాఱవమండలమున కధిపతి. సామవేదములో గొన్ని సామములు నథర్వములోఁ గొన్నిసూక్తములు నీతనివై యున్నవి. మఱియు భరద్వాజశిక్ష, భరద్వాజకల్పము, భరద్వాజసంహిత యను ధర్మశాస్త్రముకూడ కలదు. భరద్వాజుఁడు వ్యాకరణశాస్త్రముఁగూడ జేసెనట. కూర్మపురాణములో భరద్వాజునిస్థానమున "శరతేజుం" డను ఋషి పేర్కొనఁబడెను. కాని శరతేజుని గ్రంథ మేదియుఁ గాన్పింపదు. భరద్వాజునకు శరతేజుఁడను పేరుకలదేమో చూడవలసి యున్నది. భరద్వాజశిక్షపై నాంధ్రుఁడగు "పాలమకన్ని సూరావధాని" భాష్య మొండు కలదు. సూరావధానియెప్పటివాఁడో తెలియదు.

## 13. అంతరిక్షుఁడు

ఈతనిగ్రంథ మేదియుఁ గాన్పింపదు. కాని "సత్యశ్రవణుఁడు," "త్రైరూపుఁడు"నను నామములుగల ఋషిప్రోక్తములగు కొన్ని ఋక్కులు ఋగ్వేదదశమమండలమునఁ గాన్పించుచున్నవి. సత్యశ్రవణ, త్రైరూపశబ్దములు అంతరిక్షశబ్దార్థములుగా ధ్వనియగుచున్నవి. కూర్మపురాణములో నంతరిక్షునిస్థానమున "ధర్ముఁడు" అని కలదు. తాపసుఁ డగు "ధర్ముని" సూక్తములు కొన్ని ఋగ్వేదమునఁ గలవు.

## 14. ధర్ముఁడు

ధర్మునిసూక్తములు ఋగ్వేదమునఁ గొన్నికలవనియు, ఆతఁడు ఋషియనియు పైని వ్రాసియున్నాను. ధర్మునిగ్రంథ మేదియు వేఱు కాన్పింపదు. కూర్మపురాణములో ధర్మునిస్థానమున "తరసుఁడు" చెప్పఁబడెను. తరసునివృత్తాంతము గ్రంథాంతరములనుండియేమో చూడవలసి యున్నది.

## 15. త్రైయ్యారుణి

"త్రైతహవ్యఆరుణి" ఆరుణి (ఉద్దాలకుఁడు) అను ఋషిప్రోక్తములగు సూక్తములు ఋక్శుక్లయజుర్వేదములలోను సామ శుక్లయజుర్వేదోపనిషత్తులలోను కొన్ని కాన్పించుచున్నవి. కాని "త్రైయ్యారుణి"కృత గ్రంథ మేదియుఁ గాన్పింపదు.

## 16. ధనంజయుఁడు

గోత్రప్రవరఖండలో విశ్వామిత్రపరంపరగల "ధనంజయుఁ"డను నొకఋషి కలఁడు. ఆతఁడు గోత్రప్రవర్తకుఁడనియే కాని యాతనిగ్రంథము మృగ్యమై యున్నది. "ధనంజయ"శబ్దమునకు "అగ్ని"అను నర్థము కలదు. అగ్నిఋషి కృష్ణయజుర్వేదమునం దేడుకాండల కధిపతిగా నున్నాఁడు.

## 17. మేధాతిథి

ఋక్సామాథర్వ వేదములలోఁ బెక్కుసూక్తములు సామములు మేధాతిథి ద్రష్టములై యున్నవి. కూర్మ విష్ణు పురాణములలో "మేధాతిథి"స్థానమునఁ గ్రతుంజయుఁడని కలదు. మేధాతిథి యజ్ఞముఁ జేయగా నింద్రుఁ డాయజ్ఞముఁ జెఱుప మృతమేషమునం బ్రవేశించినటులును, మేధాతిథి యింద్రునిఁ జయించినటులును వేదమున నొకగాథ కలదు. "సుబ్రహ్మణ్యోంసి"యను యజ్ఞఋత్విక్కు "మేధాతిథేర్మేష" యని యజ్ఞములలో నింద్రునాహ్వానించుట వైదికులకు విదితమై యున్నది. అందువలన మేధాతిథి "క్రతుంజయ"బిరుదము కలవాఁడై యుండెనేమో! అంగిరసునిపుత్రుఁడగు మేధాతిథి కణ్వపుత్రుఁడగు మేధాతిథి యిరువురు వేదఋషులుకలరు. ఇందే మేధాతిథికి వ్యాసబిరుదముకలదో తెలియదు. కణ్వపుత్రుని సూక్తములు విస్తారముగా ఋగ్వేదమునఁగలవు. కాన కాణ్వుఁడే వ్యాసుఁడని తలఁతును.

## 18. ఋతుంజయుఁడు

ఈతనిగ్రంథమేదియుఁ గాన్పింపదు. విష్ణుపురాణములో ఋతుంజయునిస్థానమున "సంజయుఁడు" అని చెప్పఁబడెను. సంజయుని గ్రంథములు నాతని చరిత్రమువలెనె మృగ్యములు.

## 19. అత్రి

ఋగ్వేదములోని యైదవమండలమున కధిపతి. అత్రిస్మృతి యొండుకలదు. విష్ణు కూర్మ పురాణము "అత్రి" స్థానమున భరద్వాజునిఁ జెప్పియున్నది. ఇదివఱకొక భరద్వాజుఁ జెప్పియుండుటచే నత్రియు వ్యాసుఁడై యుండునని ఋగ్వేదములోని యొకమండలమున కధిపతియగుటచే నూహింపవలసియున్నది. ఇద్దరు భరద్వాజులుండినటులు గాన్పింపదు. అత్రివంశజుల సూక్తములు, సామములు కూడ ఋక్సామవేదములఁ బెక్కు కాన్పించుచున్నవి.

## 20. గౌతముఁడు

ఋగ్వేదములోఁ, బెక్కు సూక్తములు సామవేదములోఁ గొన్ని సామములు నీతనివై యున్నవి. గౌతమకులజులగు "నోధా"మొదలగు వారును ఋగ్వేదములోఁ బెక్కుసూక్తములకు కర్తలై యున్నారు. సూత్రరూపకమగు ధర్మసూత్రములకును శ్లోకరూపకమగు ధర్మశాస్త్రమునకు న్యాయదర్శనమునకు నీతఁడు కర్తయై యున్నాఁడు.

## 21. ఉత్తముఁడు

పురాణములలో నీపేరుకలవాఁడు మూడవమనువు. ఉత్తమ నాముఁడు కర్తగాగల గ్రంథము లేవియుఁ గాన్పించుటలేదు కాని మను నాముడు కర్తగాగలవి ఋక్సామవేదములలో సూక్తములు సామములు కొన్ని కాన్పించును. స్వాయంభువమనువునకు బ్రహ్మ యని పేరుండుటచే మనువనునతఁడు "ఉత్తముఁడే"నియు బ్రహ్మయన స్వాయంభువనియు "అనుక్రమణికలం" జేసినవారి తాత్పర్యమైయుండును. అందువలన నీతఁడు ఋక్సామవేదములలోఁ గొంతకు భాగస్వామి యని తలఁతును. కూర్మపురాణము "నాద్ర్యశ్వుఁడు" అనువాని "సత్త

ముని" స్థానమునఁ జెప్పుచున్నది. వాధ్ర్యశ్వనాముఁడు కర్తగాఁగల గ్రంథమేదియుఁ గాన్పింపదు. కాని వాధ్ర్యశ్వుఁడు గోత్రప్రవర్తకుఁడుగా ఆశ్వలాయన శ్రౌతకాండమునఁ గలఁడు.

## 22. వేనుఁడు: వాజశ్రవసుఁడు.

వేనుఁడను చక్రవర్తి కాఁడితఁడు. వేనునకు వాజశ్రవస, ఆరుణి ఉద్దాలక నామములుండినట్లు పురాణములవలనను, కఠోపనిషత్తువలనను దెలియవచ్చును. వేనుఁడు ఋషిగాఁగల సూక్తములు ఋగథర్వవేదములలోఁ జెప్పఁబడుచున్నవి. ఆరుణి, ఉద్దాలక నామములతో ఛాందోగ్య బృహదారణ్యకోపనిషత్తులలోఁ గొన్ని బ్రాహ్మణములు ఖండములు కాన్పించుచున్నవి. వాజశ్రవసనామముతో నుండిన గ్రంథమేదియుఁ గాన్పింపదు. వాజశ్రవసుఁడు గొప్పయన్నప్రదాతయనియు సత్రయాగములో సర్వము దానమిచ్చుటయే కాక నచికేతుఁడను కుమారుఁగూడ యమునకు ననుమతి మీఁదనే యాజీవమాటఁ దప్పకుండఁగ మృత్యువునకు దానమిచ్చెననియు తైత్తిరీయబ్రాహ్మణమువలనను కఠోపనిషత్తువలనను దానిఁ దెలిఁగించిన "దగ్గుపల్లి దుగ్గయ్య' మిక్కిలి మల్లికార్జున" కవుల నాచికేతూపాఖ్యానములవలనను దెలిసికొనఁగలము.

## 23. సోముఁడు

కృష్ణయజుర్వేదమునఁ దొమ్మిదికాండలకు ఋషి; కొన్ని సామములుకూడ కలవు. వ్యాకరణ మొండు కలదు. విష్ణు కూర్మపురాణములు సోమునకుబదులు "సోమశుష్మాయనుండను తృణబిందుఁ" డని చెప్పినవి. సోమశబ్దసామ్యముచే యజుర్వేదానుక్రమణిక చంద్రుఁడని చెప్పినది. అన్నియు నొక్క యర్థముకలవియే.

## 24. తృణబిందుఁడు (వాల్మీకి)

తృణపాణియను ఋషియొక్క సామములు కొన్ని కలవు. విష్ణు కూర్మ పురాణములు తృణబిందునిస్థానమున వాల్మీకిం జెప్పియున్నవి. వాల్మీకిశబ్దము నడుమవచ్చిన నామమని పౌరాణికులు వాకొనెదరు. అందువలన వాల్మీకియొక్క పూర్వనామము "తృణబిందుఁడ"ని యుండనోపు. తృణబిందునకుఁ దృణపాణియను పేరుకూడ యుండుననియు, ఇది వాల్మీకియొక్క పూర్వనామమై యుండుననియుఁ దలఁతును. వాల్మీకి గాయకుఁడు; రామాయణమును వీణపైఁ బాడించెనని రామాయణమునఁ జెప్పియున్నాము. తృణపాణికూడ సామగాయకుఁడేను. వాల్మీకికి తృణబిందునామముకలదని పురాణములలోఁ గలదు. కాన, తృణబిందు, తృణపాణి శబ్దములు వాల్మీకిపరమై యున్నవని నాదృఢాభిప్రాయము. వాల్మీకి కృతరామాయణమే లోకములోని ప్రథమకావ్యము. ఈతఁడు లౌకిక కవికులగురువు. ఏకవియు వాల్మీకిని నుతింపకుండఁగ నుండఁడు. వాల్మీకి కృత ప్రాకృతవ్యాకరణ సూత్రములు కలవు. వాల్మీకియొక్క ప్రాకృత సూత్రములపై వాంధ్రులగు "రామానంద (1) ఎలకూచిబాలసరస్వతి, అప్పయదీక్షితులు" విపులవ్యాఖ్యానములఁ జేసియున్నారు. అతని రామాయణముపై పలువ్యాఖ్యలు కలవు.

## 25. భార్గవుఁడు

ఋగ్వేదఋషులలో "చ్యవనుఁడు, స్యూమరశ్మి" యను నిరువురు భార్గవులు కలరు. అథర్వవేదసూక్తములు కొన్ని భార్గవప్రోక్తములు. ప్రసిద్ధిగల చ్యవనుఁడే యిరువదిరెండవ వ్యాసుఁడైయుండెను. "చ్యవనసంహిత" యను జ్యోతిశ్శాస్త్రగ్రంథ మొకటి కలదు. భార్గవపురాణకర్తృత్వము శుక్రునికై యున్నది. విష్ణు, కూర్మపురాణములు భార్గవునిస్థానమున "శక్తి" యని చెప్పియున్నవి.

## 26. శక్తి (పరాశరుఁడు)

శక్తికృత గ్రంథమేదియుఁ గాన్పింపదు. విష్ణు కూర్మ పురాణములు శక్తియొక్క స్థానమునఁ "బరాశరు"నిఁ జెప్పియున్నవి. శక్తి పుత్రుఁడు పరాశరుఁడని మనకుఁ దెలిసియున్నది. పరాశరకృతగ్రంథము లనేకములు కలవు. ఋగ్వేదములో ననేకసూక్తములు పరాశరకృతములు. పరాశరస్మృతి జగత్ప్రసిద్ధమైయున్నది. పరాశరస్మృతి 12 అధ్యాయములు ముద్రితము. నాకడనుండిన పరాశరస్మృతి వ్రాఁతప్రతి 22 అధ్యాయములు కలదై యున్నది. ఇందు సన్న్యాసధర్మము లభిహితములైయున్నవి. దీనినింకను శోధింపవలసియున్నది. పరాశరగృహ్యసూత్రములు, పరాశరజ్యోతిషము ప్రసిద్ధినొందియున్నవి. మఱియుఁ బరాశరుఁడే సమస్తపురాణప్రవర్తకుఁడని విష్ణుపురాణములోఁ గలదు. వ్యాసబిరుదముచే సమస్తపురాణకర్తృత్వము కృష్ణద్వైపాయనునకే స్థూలదృష్టిచే లోకము కట్టిపెట్టుచున్నది. విష్ణుపురాణములోని యీయంశముఁ జెప్పు పరాశరవాక్యములను రెండుపద్యములనిట వ్రాయుచున్నాను.

మ. వినుమైత్రేయ, మదీయశైశవకథా వృత్తాంతి మంభోరుహా
సనపుత్రుండు జగన్నుతుండగు పులస్త్యబ్రహ్మ యేతెంచి మ
న్నన లేపారఁగ నన్నుఁగన్గొని పురాణశ్రేణికిం గర్తవీ
వని నాకున్ వరమిచ్చిపోయెఁ బ్రమదవ్యాపార మేపారఁగన్.

క. అదికారణంబుగా నా, కొదవె పురాణప్రణీత యోగ్యత నీవి
ట్టిది గోరి నన్ను నడిగితి, విదినీకుం జెప్పువాఁడ, నాద్యంతంబున్.

పైకారణములచేఁ బురాణకర్తయగు వ్యాసుఁడు పరాశరుఁడేకాని కృష్ణద్వైపాయనుఁడు కాఁడు.

## 27. జాతుకర్ణి

ఈతఁడు ఋక్శాఖాప్రవర్తకుఁడగు శాకల్యునిశిష్యుఁడై తనకు శాకల్యుఁడిచ్చిన శాకల్యసంహితను మూఁడుభాగములుగాఁ జేసియు వేదా

(1) రామానందునకుఁ బూర్వనామము చెరుకూరి లక్ష్మణసూరి. ఈతఁడు వాల్మీకిసూత్రములకు 'షడ్భాషాచంద్రిక' యనువ్యాఖ్యనం జేసియున్నాఁడు. ఎలకూచిబాలసరస్వతి 'షడ్భాషావివరణము'ను, అప్పయ్యదీక్షితులు 'ప్రాకృతమణిదీపము'ను, వాల్మీకిసూత్రములపై వ్యాఖ్యలుగాఁ జేసిరి.



యస్. ఆర్. దాసుగారు
ఇండియా ప్రభుత్వపు లా మెంబరు



ఖానుబహాదూరు అన్సారు సాహెబ్ బహదరుగారు
నూతన మద్రాసు షెరీపు



శ్రీ అమినుల్లాగారు, ఆఫ్ఘనురాజు



శ్రీ యదునాథ సర్కారుగారు



హెచ్. సి. పాప్వర్తుగారు



కీ. శే. గోవిందమీననుగారు

మదరాసు: అసోసియేటెడ్ ప్రెసు| మేనేజరు,



కీ. శే. ఎ. శ్రీరాముగారు



కీ. శే. ఆరవమహమ్మదుగారు, టర్కీ-సుల్తాన్



కీ. శే. నెమలిసుబ్బారావు గారు

ర్థమును జెప్పుటకుపయోగించు నిరుక్తముఁజేసియు "బలాక, పైంగ, వైతాళ, విరజ"లను నలుగురుశిష్యులకు జెప్పెనని శ్రీమద్భాగవత ద్వాదశ స్కంధమునఁ గలదు. ఇప్పుడు మనకుఁగాన్పించు ఋక్సంహిత శాకల్య సంహితయే. దీనినే జాతుకర్ణి మూఁడుభాగములుగాఁ జేసియుండును. నేఁడుకాన్పించు నిరుక్తము (వేదనిఘంటువుయొక్క టీక) యాస్కునిచేఁ జేయఁబడినది. జాతుకర్ణియొక్క వేదశాఖలవలెనే యాతని నిరుక్తము నేఁడునశ్యమైయున్నది. జాతుకర్ణియొక్క యిరువదియేడవ వ్యాసత్వముఁగూర్చి కొన్ని సందియములున్నవి. అవియేవనగా జాతుకర్ణినిఁ బురాణము లిరువదియేడవవ్యాసుఁడనినవి. * ఈతఁడు శాకల్యుని శిష్యుఁడు. శాకల్యుఁడు "మాండుకేయుఁడ"ను మునికడ ఋక్సంహితను నేర్చెను. మాండుకేయుఁడు "ఇంద్రప్రమితి"యను వానిశిష్యుఁడు; ఇంద్రప్రమితి "పైలుని" శిష్యుఁడు; పైలుఁడు వేదవ్యాసునికడ ఋక్సంహితఁ బొందెను. అనఁగా జాతుకర్ణి వేదవ్యాసుని శిష్యవర్గములో నైదవతరమువాఁడు. ఇట్టి జాతుకర్ణి వ్యాసవంశవృక్షములో నిరువదియేడవవాఁడు కాఁగా నాతని కైదు పురుషాంతరములకు ముందుండిన కృష్ణద్వైపాయనుఁ డిరువదియెనిమిదవ వ్యాసుఁ డెట్లగును? మఱియు జాతుకర్ణియొక్క గురువునకు గురువగు "ఇంద్రప్రమితి"యొక్క సహాపాఠియగు బాష్కలుఁడు "పరాశరునిగురువని" భాగవతమున నున్నది. ఈ పరాశరుఁడు కృష్ణద్వైపాయనుని తండ్రికాఁడా? ఆలోచింపఁగా జాతుకర్ణియొక్క గురుపరంపరలలో మూలపురుషుఁడగు వేదవ్యాసుఁడు కృష్ణద్వైపాయనుఁడుకాక యేవసిష్ఠుఁడో యై యుండునని తలఁపవలసియున్నది. చేసంచిన యైదుతరములకుఁ బిమ్మటనుండినవాఁడు ముందుగ వ్యాసుఁడై పిమ్మట మూలపురుషుఁ డెట్లధికారియగును. పైల జైమిని సుమంతు వైశంపాయనులు వ్యాసశిష్యులని పురాణములలోఁ గలదు. వేదఋషులు పెక్కండ్రొక్కపేరుతోఁ బిలువఁబడుట వేదానుక్రమణికం జదివినవారికిఁ దెలియును. ఉదాహరణమునకొఱకు పెక్కండ్రొక్కపేరుతోడనే పిలువఁబడినవారిని వ్రాసెదను.

విశ్వామిత్రు లిరువురు, 1. దేవరాయనిపుత్రుఁడు, 2. గాధిపుత్రుఁడు.

కణ్వులిరువురు, 1. ఘోరునిసుతుఁడు, 2. కపీకునిసుతుఁడు.

మేధాతిథులిరువురు, 1. అంగిరసునిసుతుఁడు, 2. కణ్వసుతుఁడు.

ఇట్లే భార్గవ, గౌతమ, జైమిని, యాజ్ఞవల్క్యాదులు పెక్కండ్రు కలరని వేదానుక్రమణికలను, ప్రవరఖండలను జదివిన విశదమగును. పైకారణములచే జాతుకర్ణిగురుపరంపరలోని వ్యాసుఁడు కృష్ణద్వైపాయనుఁడు కాఁడని స్పష్టమగును.

## కృష్ణద్వైపాయనుఁడు

ఈతఁడే లోకములోఁ బ్రసిద్ధినొందినవ్యాసుఁడు. ఈతని మొదటిపేరు కృష్ణుఁడు. యమునానదీద్వీపమున నివసించుటచే ద్వైపాయనుఁడనియు, సత్యవతీపుత్రుఁడగుటచే సాత్యవతేయుఁ డనియు, పరాశరసూనుఁడగుటచేఁ బారాశర్యుఁడనియు పేరులు కలిగెను. ఈతఁడు మహాభారతాంతర్గతమగు "జయ"మను గ్రంథమును రచించెను. అది (8800) గ్రంథమని [1]మహాభారతముయొక్క మొదటి యధ్యాయముచే నూహింపఁబడుచున్నది. వ్యాసశిక్ష, వ్యాసస్మృతి యను గ్రంథములు కూడ సాత్యవతేయకృతములుగాఁ గాన్పించుచున్నవి. ఏవేదమునందును "కృష్ణద్వైపాయన" నామముతో నొక్కకాండగాని, ఖండగాని సూక్తముగాని కాన్పింపదు. ఋగ్వేదదశమమండలములో మూఁడుసూక్తములు కృష్ణుఁడను ఋషిచేఁ జెప్పఁబడినట్లున్నవి. అవి 33 ఋక్కులుమాత్రమె యైయున్నవి. ఈ కృష్ణుఁడెవఁడు? శ్రీకృష్ణుఁడు కాఁడు. శ్రీకృష్ణుఁడు ఛాందోగ్యోపనిషత్తులో దేవకీపుత్రుఁడుగాఁ జెప్పఁబడెను. అసురుఁడగు కృష్ణుఁడొకఁడు ఋగ్వేదప్రథమమండలమునఁ జెప్పఁబడెను. ఆసురములు, పార్థ్వములు నను కొన్ని సూక్తములు ఋగ్వేదదశమమండలమునఁ గలవుకాని సూక్తప్రవర్తక కృష్ణ నసురుఁగాను, దేవకీపుత్రుంగాను చెప్పనందున పైకృష్ణర్షి సాత్యవతేయుఁడై యుండునని తలఁతును. ఇంతటివ్యాసు లిన్నిన్ని గ్రంథములఁ జేసియుండఁగాఁ శ్రుతి, స్మృతి, పురాణేతిహాసములన్నియు సాత్యవతేయకృతములేయని లోకము తలఁపోయుట విచిత్రము. కృష్ణద్వైపాయనుఁడు గోత్రప్రవర్తకఋషి కాఁడు. తక్కినవ్యాసు లించుమించు గోత్రప్రవర్తకఋషులని గోత్రప్రవరఖండలఁ జదివిన విశదమగును. ఏమువలన సాత్యవతేయుఁడు గోత్రప్రవరప్రవర్తకుఁడు కాలేదో?

కృష్ణద్వైపాయనుని వైదికఋషులంతమసంఘమునఁజేర్చుకొనుట కిష్టపడలేదని తోఁచుచున్నది. ధర్మజుఁ డశ్వమేధయాగముఁ జేయఁగా కృష్ణద్వైపాయనుఁ డధ్వర్యముఁ జేసినట్లు మహాభారతమునఁ గలదు. "ఐతరేయ" బ్రాహ్మణములో నశ్వమేధయాగకర్తల పేరుల నధ్వర్యుల పేరులతోఁ జెప్పఁబడియున్నవి. అందు పరీక్షిత్తునికుమారుఁడు "జనమేజయుఁడు" కావషేయుఁ డధ్వర్యుఁడుగా నుండ నశ్వమేధముఁ జేసినట్లు గలదు. దుష్యంతుని పుత్రుఁడగు భరతుఁడు "మామతేయుఁ"డధ్వర్యుఁడై యుండ నశ్వమేధముఁ జేసినట్లు గలదు. భరత, జనమేజయులకు, నడుమనుండిన రాజులలో, ధర్మజుఁ డొక్కఁడే యశ్వమేధముఁ జేసినవాఁడు. అట్టి ధర్మజుని పేరును, వ్యాసుని పేరును;

---

* శ్రీమద్భాగవతము, ద్వాదశస్కంధము, ఆరవయధ్యాయము.

1. బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణుఁడు సాత్యవతేయుఁడుకాఁడని లోకమాన్య తిలకుగారు గీతారహస్యములోను బ్రll పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు ఆంధ్రబ్రహ్మసూత్రభాష్యపీఠికలోను స్పష్టపరచిరి. కాన బ్రహ్మసూత్రకర్తృత్వ బాదరాయణ సంబంధము సాత్యవతేయునకు లేదని తలఁతును.

2. మహాభారత రచనావిధానమని ఆం. సా. పరిషత్పత్రికలో నేను వ్రాసినవ్యాసములో విశదపరచితిని.

"విశదేయ" బ్రాహ్మణమునఁ గాన్పించమికిఁ గారణము ధర్మజవ్యాసుల సాంకర్యజన్మలచేతను వాటికాలమున వారొనరించిన ఘాతుకములు, అన్యాయములునగు కార్యములచేతనే యని యూహింపఁబడుచున్నది. ధర్మజుఁడు సాంకర్యజన్మకలవాఁడు. యుద్ధమున విశేషఘాతుకకార్యముల నొనరించెను.[1] కృష్ణద్వైపాయనుఁడు స్మృతులననుసరించిచూడ "నిషాదుఁడు" పురాణములలో బ్రహ్మచారి, పిమ్మట సన్న్యాసియని యుండినను, వితంతువులగు విచిత్రవీర్యుని భార్యలయందు సంతతిఁబడసెను. కృష్ణద్వైపాయనుని యన్యాయస్త్రీసంగమమునుఁ గూర్చి "పూర్వమీమాంసకులు" విమర్శించికొని రొటులనో సమాధానపరచికొనిరని "తంత్రవార్తికము"లోని "ద్రౌపదీపంచపతిత్వవిచారము" అను ఘట్టమునఁ జదివిన విశదమగును. కాని రాజసంబంధముచేఁ గృష్ణద్వైపాయనుఁడు మాటచెల్లుబడి కలవాఁడై, తక్కిన వ్యాసులకంటె విశేషప్రఖ్యాతి నొందెను. ఈవ్యాసునికి స్మృతివిరుద్ధములగు ప్రవర్తనములు పెక్కులు కలవు. (1) నిషాదజన్మ (2) శూద్రులగు సూతసంజయాదులకు వేదాది విద్యలఁ జెప్పుట (3) బ్రహ్మచారియైనను వితంతువులగు రాజపత్నులయందు బిడ్డలఁ గనుట. (4) ఒకస్త్రీకిఁ బెక్కండ్రుపతులగుట కంగీకరింపఁజేసి ద్రౌపదీవివాహముఁ జేయించుట. (5) కర్ణాదుల జన్మకాస్త్రీ యమేయని కుంతితోఁ జెప్పుట మొదలగు నన్యాయప్రవర్తనములచేతనె వైదికఋషులు తమగ్రంథములలో నీతని పేరునుఁ జెప్పరైరి. ఋగ్వేద సూక్తము "లనువాదాస్పదములు." మఱియు ఋగ్వేదదశమమండలమును, అథర్వవేదములోఁ గొన్ని కాండలును, ప్రాచీనములు కావని కొందరు తలఁతురు. అందువలనఁ గృష్ణర్షిప్రోక్తసూక్తములు నవీనముగాఁ గూర్పఁబడినవేమో యను సంశయముగూడ కలదు. ఎట్లయినను వేదవిభాగకర్తృత్వమాత్రము కృష్ణద్వైపాయనునిది కాదనియు, బ్రహ్మసూత్రకర్తృత్వము, పురాణకర్తృత్వముగూడ, పారాశర్యునిది కాదనియు, భారతాంతర్గత "జయ" కర్తృత్వమే యాతనిదనియుఁ దలఁపవలసియున్నది.

---


వ్యాసకర్త

## ముస్తాబు

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

ఏసమయమున వత్తువో యేమొ యనుచుఁ
బవలు రేయియుఁ గనురెప్ప వాల్పకుండఁ
గూడుఁ గూర్కులు మాని నీకొఱకుఁజూచి
వాడె నామోము కనులెఱ్ఱవారె నేడు!

తగిన ముస్తాబుతో నిన్నుఁ దారసిలఁగఁ
బసుపుఁబూసితి మోమున, వాలుఁగనులఁ
గాటుకను దిద్దికొంటిని, కన్నుబొమల
నడుమఁ గుంకుమ తిలకమ్ము నిడితిఁ గృష్ణ!

కాని, నీపట్టుపుట్టమ్ముఁ గాంచినంతఁ
బసుపువన్నియ వెలవెలఁబారె! మేని
చాయఁగని కాటుకయును బాష్పముల జారె!
ముద్దు లొలికెడుచెంగావి మోవిఁజూచి
పొడముఁ గెమ్మట నుదుటను బొట్టుకరఁగె!
పై మెఱుంగులు నిలచునే పద్మనేత్ర!

"రా ధి క"

---

1. ధర్మజుని యుద్ధాన్యాయములు, కృష్ణద్వైపాయనుని తంత్రములు, నాచే వ్రాయఁబడిన "మహాభారతచరిత్రము" అను గ్రంథమున విశదీకరింపఁబడినవి.



వ్యాసకర్త

# నవీనత

నడకుదుటి వీరరాజు పంతులు గారు

" ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందు పరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్."

ప్రపంచము నంతను నవీనతయే ప్రతిపాలించుచున్నది. ప్రకృతియంతయు నవీనతచేతనే ప్రకాశిత మగుచున్నది. ప్రజాజీవితము లెల్ల నవీనాశాభిముఖంబుగనే ప్రయాణము చేయుచున్నవి.

ఈ నవీనతయే వర్తమానపీఠము నధిరోహించి, గతమునకు వీడుకోలును, ఆగతంబునకు స్వాగతంబును గల్పించుచున్నది. అనాద్యము, ననంతంబును, పరిభ్రమణ శీలంబును నగు కాలచక్రము నందలి తెకుజెకు నందును వింతవింత మెఱుంగులతో ననుక్షణంబును సాక్షాత్కరించుచున్నది ఈనవీనతయే. ప్రారంభప్రభవముల ప్రాచీనత కీనవీనతయే మూలకారణ మగుచున్నది. ఈనవీనత యందు హృదయాకర్షక మగు దివ్యశక్తియున్నది. నవీనతారాధకులు తద్దర్శనంబునకును, తద్భావనంబునకును వేడుక పడుచుందురు. కావుననే యఖిలదేశ్ల నాటిదై యిప్పుడు నూతనముగఁ దోతెంచిన ప్రభవ సంవత్సరాదియం దెల్లవారికి నానందదాయకమగు నవీనత్వమే గోచరించుచున్నది!

ప్రత్యూషపవనాంకురములయందును, ప్రభాతారుణ కిరణంబులయందును, ఉషస్సమయ సంకీర్తనంబుల యందును, ఉన్నతోన్నత శిఖరంబులయందును, విమల సరోవరవీచికలయందును, వికచకుసుమ సౌరభములయందును, నరసవల్లికలయందును, చారుపల్లవములయందును ఈనవీనతయే వెల్లివిరియుచున్నది.

సకలజీవులును సంతతమును నవీనతనే సన్మానించుచుందురు. వస్త్రములు, వాహనములు, నగలు, నాణెములు, సంఘములు, సమావేశములు, చదువులు, సంగీతములు, పండుగులు, పబ్బములు, పెండ్లిండ్లు, పేరంటములు, మాటలు, మర్యాదలు, చిన్నెలు, సింగారములు, ఒప్పులు, ఒయ్యారములు, వింతలు, విలాసములు, బిరుదులు, భేషజములు, పదవులు, ప్రభుత్వములు, మొదలగువానియం దన్నిటను నవీనతయే మనోమోహనకరమైనది. దీని తళుకుబెళుకులు కన్నుల మిఱుమిట్లు గొలుపుచుండును; దీని యడుగుచప్పుడులు వీనులవిందు సేయుచుండును. దీని చలువసోఁకుడులు మేనులఁ బులకలెత్తించుచుండును; దీని వన్నెచిన్నెలు డెందములఁ గందళింపఁ జేయుచుండును. ఇది తామరకుఁ దరణి కిరణము వలె, కలువకు నెలపొడుపువలె, పిల్లకు తల్లి యొడివలె, కాముకునకుఁ గలికిపలుకువలె, నెమ్మికి నీలమేఘమువలె, కోకిలకుఁ గోమలపల్లవమువలె, వసుమతికి వసంత విలాసమువలె, సస్యములకు సమవృష్టివలె, పేదకు పెన్నిధానమువలె, భక్తునకు భగవన్మూర్తివలె, సకల జీవులకు నానందకరమైనది. కాని యిది క్షణభంగురము మెఱపు

వలె మెఱసి, గాలివలెఁ గడలెల్లఁ గ్రమ్ముకొని, ఆకాశమువలె నంతర్హితమై పోవుచుండునే!

ఓ నవీనుఁడా! గ్రహచారముతోఁ గాలమును, బరిమళముతోఁ బవనమును, వెలుఁగుతోఁ జీఁకటియును, బ్రకృతితోఁ బరిణామమును, భవముతో నాశమును నను గమించుచున్నట్లు నీతోఁ బ్రాచీనత వెంబడించుచునే యున్నదిసుమా! క్షణక్షణమును నిన్నుఁ గబళించుచునే యున్నదిసుమా! నిముసములో నీనవీనత ప్రాచీనతాగర్భమున మునిఁగిపోవుచున్నది. అయినను నీనవీనలీల అనుక్షణము విశ్వాంతరాళమునఁ దృణాదిమేరుపర్యంతమును, పిపీలికాదిబ్రహ్మపర్యంతమును గోచరించుచునే యున్నది. నీ వవ్యయుఁడవు. నీభావపరిణామపరంపరలకంతమే లేదు. నీ వవ్యక్తమూర్తివి. ప్రాచీనతకును, నీకును జన్యజనకసంబంధ మున్నది. అంతియ కాదు. నీరూపపరిణామమే ప్రాచీనత. నీవేసినయడుగు నవీనము; నీతీసినయడుగు ప్రాచీనము. నీకును బ్రాచీనతకును గల యంతర మభేద్యమైనది; అవేద్యమైనది. మీపరస్పర సంబంధము పరమాశ్చర్యకరమైనది. లోకమునందు నవీనులు ప్రాచీనసంతతివార మని చెప్పుకొనుచుండఁగా, ప్రాచీనత నవీనతాసంతతి యగుట పరమాశ్చర్యము గాదా? దానం జేసియే లోకమునకుఁ గ్రొత్తయనిన నంత వింతయైనది.

ఈవింతకు వేడుకపడియే ప్రాచ్యులు, పాశ్చాత్యవేషములను వేయుచున్నారు. హైందవులు క్రైస్తవమతమును స్వీకరించుచున్నారు. పాతాళవాసులు భారతీయాచారములను బాటించుచున్నారు. శ్రోత్రియకులజులు చుట్టలు త్రాగుటయు, శూద్రకులజులు సూత్రధారులగుటయు, ఆయుష్కర్మకై ఆఁడుది వేడుకపడుటయు, కాటుకపై మగవాఁడు కన్ను వేయుటయు నీవింతకు భ్రాంతిపడియే. ఈవింతకు ముచ్చటపడియే క్రోఁతిరక్తముచే నూతనయౌవనమును సంపాదించుచున్నారు. ప్రాతపేలికలతో పాయిజామాలను గల్పించుచున్నారు. ఈవింతకొఱకే చిత్రవిచిత్రనాటకములు సినిమాలైపోయినవి. అపరంజివీణెలు హార్మోనియము లైపోయినవి! కాగడాలు (Gas) గాస్లైట్లయిపోయినవి. ఆటలో వింత, పాటలో వింత. కట్టులో వింత. జుట్టులో వింత. ఇంతయేల? ఈ వింతలన్నియు నవీనతయందలి కోరికచేఁ గలిగినవే!

ఈనవీనతాసందర్శనమునందు గల యనురాగముచేతనే అంగారకగ్రహమునందలి జీవులతో నాలాపించుటకాయత్తపడుచున్నారు. ఆదిత్యమండలములోని యసితచిహ్నముల నవలోకించుట కాత్రము నొందుచున్నారు. ప్రాలేయాచలశిఖరారోహణమునకై ప్రాణముల నర్పించుటకుఁ బాల్పడుచున్నారు. మరణించిన జీవులతో మాటలాడుటకై మంత్రాలోచనము సేయుచున్నారు. విశ్వప్రదక్షిణములఁ గావించుచున్నారు. విశాలసాగరముల నుత్తరించుచున్నారు. ధరణీతలమును ద్రవ్వివైచుచున్నారు. పర్వతపంక్తులను బగులఁగొట్టుచున్నారు.

ఈనవీనతయందలి తన్మయత్వముచేతనే అవ్యక్తుండగు బాలుఁడు చందమామతో నయ్యాటలాడుచున్నాఁడు. ప్రేమమయి యగుజనని బిడ్డని వచ్చియు రాని పలుకులకు వన్నెలు దిద్దుచున్నది. విరహిణి యగు విరిబోఁడి వెన్నెలబైట నిలువంబడి వేఁడినిట్టూర్పులు వెలిపుచ్చుచు విభునిరాక కెదురుచూచుచున్నది. విమలచరిత్ర యగు వీరవనిత విజయాకాంక్షి యగు విభుని కంఠమున విరిదండ నలంకరించి వీడ్కొలుపుచున్నది. విశ్వహితైషిణి యగు వీరమాత స్వీయసంతానమునకు స్వార్థత్యాగమును సంబోధించుచున్నది. ఈనవీనత నభిలషించియే సరససల్లాపములు, చతురఖేలనములు, భావగోపనములు, ప్రణయకలహములు మొదలగు విచిత్రలీల లెన్నియో కల్పింపఁబడుచున్నవి.

ఈనవీనతకొఱకే కవి కావ్యసృష్టిని గల్పించుచున్నాఁడు. శిల్పి చిత్రసృష్టిని జేయుచున్నాఁడు. గాయకుఁడు స్వరసృష్టిని గావించుచున్నాఁడు. పండితుఁడు పరిష్కరించుచున్నాఁడు. సద్గురువు సంస్కరించుచున్నాఁడు. సార్వభౌముఁడు శాసించుచున్నాఁడు.

ఈనవీనతయే సమయానుసారముగా వసంతఋతువును గ్రీష్మఋతువుగను, గ్రీష్మమును వర్షఋతువుగను, వర్షఋతువును శరదృతువుగను, శరత్తును హేమంతఋతువుగను, హేమంతమును శిశిరఋతువుగను మార్చిమార్చి తుదను ప్రభవగాఁ జేసివైచినది.

ఈనవీనతయందలి ప్రేమచేతనే కోకిలలు చిగురుచిగురునకును, తుమ్మెదలు పువ్వుపువ్వునకును, చిలుకలు పండుపండునకును, తెమ్మెరలు కొమ్మకొమ్మకును, పరిమళములు దిక్కుదిక్కునకును, వెన్నెలలు దేశదేశములకును వెదకికొనుచుఁ బోవుచున్నవి.

ఈనవీనతయందు గలయాదరమువలననే అచ్చాంధ్రభాషయం దన్యదేశ్యపదములు చేరినవి. ప్రాచీనగ్రంథములయందు ప్రక్షిప్తములు చేరినవి. మతములయందు భిన్నభావములు చేరినవి. ఆచారములయందు సౌకర్యములు చేరినవి. మానవజీవితములలో మార్పులు చేరినవి.

ఈనవీనతయే భాషాప్రపంచముఁ బ్రవేశించి శ్రుతులు, స్మృతులు, ఇతిహాసములు, పురాణములు, ప్రబంధములు, నాటకములు, నవలలు, ఖండకావ్యములు వ్యాఖ్యానములు, విమర్శములు, చరిత్రములు, పద్యములు గద్యములు, వ్యాసములు, ఉపన్యాసములు మొదలగు నెన్నియో రూపములతో నవతరించినది.

ఓనవీనా! జీవులయుత్సాహశక్తుల నుద్రేకింపఁ జేయుటలో నీసమాను లెవ్వరున్నారు? నిన్నుపాసించువానికిని నీవలెనే వెనుకయుడుగు లేదు. నీభక్తులు నిరంతరమును నిన్నె వెదకికొనుచుందురు. మహాసముద్రమధ్యమునం బడి, ఆశాతరంగముల నల్లలాడి, దిక్కుదోఁపక తిరుగాడుచున్న 'క్రిస్టఫర్ కొలంబసు'నకు అపరూపద్వీపరూపమున సాక్షాత్కరించి 'అమెరికాఖండము' ననుగ్రహించితివి. గుడగుడ నుడుకుచున్న కూటికుండయొద్దఁ గూరుచుండి నివ్వెఱపాటుతో నిరీక్షించుచున్న నిఱుపేద 'జేమ్సు వాట్టు'నకు ఆవిరిశక్తిరూపమున నగపడి యాతని పేరు ప్రపంచమునం దంతటను వ్యాపింపఁ జేసితివి. సహస్రాధికయోజనముల దూరమునుండి సాగరముల నతిక్రమించి వచ్చిన 'వాస్కోడిగామా'కు కల్లికోటరూపమునఁ గటాక్షించి భారతలక్ష్మిని పాశ్చాత్యదాసిగఁ జేసివైచితివి. స్వదేశాభ్యుదయమునకై సత్యాగ్రహదీక్షం బూని, సర్వసంగపరిత్యాగియై, శాంతసమాధినిష్ఠుండై, జగత్ప్రసిద్ధిం గాంచుచున్న కర్మయోగి యగు 'గాంధిమహాత్మ'నకు ఖద్దరురూపమునఁ గరావలంబన మిచ్చి 'మాంచెస్టర్' మరలకు మరలని మాంద్యము నిరవుకొనఁ జేసితివి. ధర్మప్రజాపరిపాలనమునకై దారి వెదకుచున్న 'దాదాభాయినౌరోజీ' మహాశయునకు 'కాంగ్రెస్' రూపమునఁ గరుణించి నిరంకుశప్రభుత్వమునకు నివ్వెఱపాటు గల్పించితివి. సంఘవైషమ్యములను సమయించుటకై సాహసించి స్వార్థత్యాగియైన 'చిత్తరంజను'నకు స్వరాజ్యదర్శరూపమున సన్నిధిసేసి మతవైషమ్యములను మటుమాయము చేసివైచితివి. దేశోద్ధరణకంకణధారియై దీక్ష వహించిన కర్మవీరుండగు కాశినాథునకు 'ఆంధ్రపత్రికా' రూపమున నభయంబునొసఁగి, ఆంధ్రలోకంబున ముక్కోటిదేవతల నొక్కసారిగ మేలుకొలిపితివి. నీసాక్షాత్కారము నిత్యానందకరమైనది. నీసంసేవనము నిత్యోత్సాహకరమైనది. నీసమావేశము నిత్యనూతనమైనది.

ఓనవీనా! నీవింకను నెన్నియవతారము లెత్తనుంటివో! ఎందఱెందఱి హృదయముల నాకర్షింపనుంటివో! ఏయే కష్టసుఖంబులఁ గల్పింపనుంటివో! ఎవ్వరు చెప్పఁగలరు? నీ వసంతమూర్తివి. ప్రభవమునందును, పరిణామమునందును నీయాద్యంతములు గానవచ్చుచున్నను నీస్థితి లోకమునందు నిత్యముగనే నెలకొనియున్నది.

ఓనవీనా! నీపశ్చాద్భాగమును భావించినచోఁ బ్రాచీనతయు, నీపురోభాగమును నిరీక్షించినచో నవీనతయు గోచరించుచున్నది. ఏకమూర్తియందే భిన్నభావములు గానవచ్చుచున్నవి. ఏకభావమునందే భిన్నమూర్తులు తోఁచుచున్నవి. వెనుదిరిగిచూడని పశ్చాత్పురోగమనములు గల మీయుభయపురుషను నెచ్చటనుండి వచ్చి

నారు? ఎక్కడకుఁ బోవుచున్నారు? భావభేదమే కాని ప్రాచీనుఁడు నీకన్న భిన్నుఁడా?

ఓనవీనా! నిత్యచంచలుండ వయ్యును నిత్యదర్శనీయుండవగు నీయడుగులలో నడుగులువైచి, నీయందే దృష్టినిడి, నిఖిలజీవులును నీతోడనే ప్రయాణము చేయుచున్నవి. శుభాశుభములు, సుఖదుఃఖములు, జయాపజయములు, జననమరణములు మొదలుగాఁగల ద్వంద్వభావములచే సమ్మిళితంబగు చరాచరప్రపంచమునందంతటను నీమూర్తియే నిండియున్నది. నీయందే సుఖదుఃఖాది భావములన్నియు నిండి నిబిడీకృతములై యున్నవి. నీవు దివ్యమూర్తివి. ఓనవీనా! విరాణ్మూర్తివగు నీకు ధన్యవాదములు!

"లోకంబులు లోకేశులు
లోకస్థులుఁ దెగినఁదుది నలోకం బగు పెం
జీఁకటి కవ్వల నెవ్వం
డేకాకృతి వెలుఁగు నతని నేసేవింతుఁ."

---

# జన్మభూమి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

కనులుగానక తనబిడ్డ లను గ్రసించు
నాఁడు బెబ్బులిపురుటాలి కాత్మదేహ
మొసఁగినట్టి యాస్వార్థశూన్యుఁడు దయాబ్ధి
బుద్ధుఁ డుదయించె నీ స్వర్ణభూమియందు.

తారకాచంద్రసూర్యులు తమతపో వి
శాలతేజస్సు చాలమిఁ జాలఁగుంద
దివ్యమూర్తిని దర్శించి దేహమర్ఘ్య
ముగనిడిన ఋషు లీపుణ్యభూమివారు.

చక్కనగు మంత్రశక్తి హస్తమునఁబూని
పోలెఁ బాషాణముల దారువులను బ్రాణ
ములను బోసి యాడించిన పుణ్యశిల్పి
ముఖ్యులుజనించి రీకర్మభూమియందు.

వీణమెట్టులు స్వర్గసోపానములుగఁ
బాటలంబాడి ప్రాంతపర్వతము హృదయ
మదికరఁగి యేఱులై పాఱునట్లు చేసి
పొలుచు గాయకు లీ దివ్యభూమివారు.

పాణిధర్మపతాకనాఁ బట్టి శాత
ఖడ్గ మాహవక్షోణి కఖండభక్తిఁ
దమ్ము బలినిచ్చుకొన్న నిస్తంద్రశౌర్య
ధాములు పుట్టి రీక్షాత్రభూమియందు.

విశ్వజాతికి నొక బడిం బెట్టి వారి
కొక్కటే పాఠముం జెప్పి యుచ్చకంఠ
మునను బాడించిన యఖండపూజ్య శేము
షీమహామనంతు లీ జ్ఞానభూమివారు.

అలప్రజారాధనమున కర్ధాంగిఁ బరమ
సాధ్వి నింతుమాలాలి నిస్సంశయముగ
నడవికంపియు దుఃఖింప నైన వెఱచు
భూధవుఁడు రాముఁ డీయార్యభూమివాఁడు.

ఆ మహాత్ముల పూతతేజోఽబ్ధియందుఁ
గెరటములము గాకున్న శీకరములమని
నైన గర్వింపవచ్చు; సింహావలోక
నంబుఁ గావించి చూచికొనంగరాదె?

ఖండఖండాంతరముల నఖండమైన
యీదృశైశ్వర్య విస్ఫూర్తి యెందు లేదు
కన్నుగుట్టుచు నున్నది కాని శ్వేత
జాతి కిది హరింపఁగనైన శక్తిలేదు.

పెక్కు జన్మలనుండియుఁ బేరుకొన్న
పాపములు గడ్డకట్టిన తాపములును
విచ్చిపోవుఁ; జేయెత్తి యావేశమునను
మ్రొక్కుఁడీ జన్మభూమి కో పుణ్యులార!




పొరనంది జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., యల్. టి.

మనుజుడు సాంఘికజంతువని శాస్త్రజ్ఞులు చెప్పుదానికి నిర్వచనముగా మనుజకోటిలోని వ్యక్తి విడిగా ఒక్కడే ఇతర వ్యక్తులతో సంబంధము లేకుండా జీవించియుండ లేడని కొందరు చెప్పుతూ ఉంటారు. ఇందుకు ఉదాహరణముగా చిమ్మెటలు, చీమలు, తోడేళ్లు మొదలైన గుంపులోనే జీవించేస్వభావముగలజంతువులను పేర్కొనుచుందురు. అలాగే మనుజుడుకూడా పరిణామములో ఒక స్థితిలో గుంపులోనే జీవించియుండేవాడని సంఘశాస్త్రజ్ఞులు సోపపత్తికముగ నిర్వచించుచున్నారు. ఈసంబంధమును స్పష్టపరుచుటకు ఒక ఉపమానమును చెప్పుచుందురు. గుంపు ఒక శరీరమువంటిది. వ్యక్తులు అంగములవంటివారు. ఈసామ్యమువలన వ్యక్తులకు ప్రత్యేకమైనస్థితి కూడా లేకున్నట్లు సూచింపబడుచున్నది. చిమ్మెటలవంటి అల్పప్రాణులలోకూడా వ్యక్తులు ఆహారనిద్రాదిశారీరక వ్యాపారములవిషయమై స్వతంత్రులవలె ప్రవర్తిస్తున్నవి. ఎల్లప్పుడూ కలిసేఉండి, ఏవ్యాపారముచేసినా గుంపుఅంతా కలిసే చేస్తూ, ఉనికి వ్యక్తులకు కావలసిన ఆహారసంపాదనలోకూడా గుంపుఅంతాకలిసే పని చేస్తూ ఉండుటవలన, ఆప్రాణులవిషయమై వ్యక్తి స్వతంత్రవస్తువుగా గానరాకున్నా గుంపుతెచ్చిన ఆహారములోనివంతును తిని, జీర్ణించుకొని, శరీరయాత్ర నడుపుకొంటూ ఉన్నంతవరకూ దానిని ఒకఅంగముగా వర్ణించి, దాని పృథక్స్థితినిమాపునట్టి నిర్వచనమును ఆమోదించకూడదు గదా! అట్టిస్థితిలో మనుజునివిషయమై ఆఉపమానమును యథాశ్రుతముగా పట్టించుట ఎక్కువపొరపాటు అగును. గుంపును విడిచి ఉండనము ఎరుగని చిమ్మెటతోను, గుంపును విడిచినంతమాత్రాన జీవించలేని తోడేలుతోను మనుజుని పోల్చి, అన్నిటి సాంఘికాధారము ఒక్కరీతిదే యని వర్ణించుట అపసిద్ధాంతమగును. ఆహారనిద్రాదిబాహ్యవ్యాపారములకేకాక, ఆహారసంపాదనాదివ్యక్తి కృత్యములకేకాక, మనస్సంబంధమైన ఉత్కృష్టవ్యాపారములలోకూడా స్వతంత్రముగా జీవిస్తూన్న మనుజునివిషయములో ఈసంబంధమును సూక్ష్మముగా పరీక్షించి నిర్వచింపవలసియున్నది.

మనుజునివిషయములో గుంపునకును, సంఘమునకును భేదమున్నది. గుంపుకంటె సంఘము ఎక్కువవిన్యాసములను పొందియున్నది. గుంపుకంటె ఎక్కువగా సంఘమే మనుజునివిషయమై ప్రభావము కలది. ఈప్రభావము చాలాసూక్ష్మముగా ఉన్నది. పరిణామములో జరిగినమార్పులలోకెల్ల ముఖ్యమైనది మనుజుని మనోనిర్మాణము. దానిలో జంతుసంబంధమైన పైత్రవ్యగుణములు ఇమిడియుండిపోయినవి. వాటిలో ఈసాంఘికజీవనము ఒకటి. కొన్నికొన్ని వ్యాపారములలో, ముఖ్యముగా ప్రాథమికమనుజునికి ఆవశ్యకమైన వ్యాపారములలో, అనగా యుద్ధము, వేట, వ్యవసాయము ఈ మొదలైన వాటిలో, గుంపులోనివారు చాలమంది కలిసి పనిచేసేటట్లైతే వ్యక్తులకు లాభము కలుగుతూ ఉండేసమయములవలన జంతువులనుండి సంక్రమించిన సాంఘికగుణము దృఢపడినది. సంఘమునకు చెందియుండుటవలన వ్యక్తికీ, సంఘమునకూ కూడా అధికప్రయోజనము సమకూరుతూ ఉన్నట్లు స్పష్టమైనది. ఇట్లు క్రమముగా అనేకసోపానముల ద్వారా ఎన్నోతరములనుండి సంక్రమించిన ఈసాంఘికవాసన మనే గుణము వాసనరూపమున మనుజుని మనోనిర్మాణములో ఇమిడియున్నది. దీనికే సాంఘికవాసన అని పేరు.

ఈవిధముగా సంఘము వ్యక్తికి ప్రబలమైన పరిసరము. ఆధునిక వ్యక్తిని తయారుచేయుటలో చాలా ఎక్కువగా ప్రభవించినది. వ్యక్తికి సహజమైన స్వరక్షణవాసనచేతనే తయారై యుండిన యెడల వ్యక్తి యొక్క మూర్ఖత్వము, పశుత్వము ఏమీ మారియుండక పోయియుండును. వ్యక్తిత్వసహజమైనగుణములు పూర్తిగా స్వలాభముకొరకే ఉపయుక్తములవుతూ, స్వలాభమే ప్రపంచమందు పరమావధిగా అంగీకృతమై, వ్యక్తికి వ్యక్తికి పరస్పరసంఘర్షము మిక్కుటమై మనుజప్రపంచము ఈనాటికి నాశనమై పోయియుండును. అలాగుకాక సాంఘికవాసన సానపెడుసానమీద వ్యక్తిత్వసామర్థ్యము అరగదీయబడి, మనుజుని ధర్మము ఆధ్యాత్మికముగా మారినది. స్వరక్షణముకంటె పరులరక్షణము, స్వలాభముకంటె పరులక్షేమము, ఇహలోకముకంటె పరలోకము ఎక్కువ వాంఛనీయ వస్తువులైనవి. దినచర్యలో ఉత్కృష్టాదర్శములను వ్యక్తులు, సంఘములు మరచి ప్రవర్తిస్తున్నా, ధర్మనిర్ణయసమయమునను, విచారణకాలమందును, ప్రవృత్తి పరీక్షావసరమునను ఎవరూ వాటిని మరవలేదు. ఇట్లు సాంఘికవాసన వ్యక్తులను అభివృద్ధిలోనికి తెచ్చుటకు ప్రవర్తించేదే అయినా, వ్యక్తులుమాత్రము అట్టి అభివృద్ధికి రాకుండాఉన్నారు. ఎందుచేత? ఈ అవస్థలను నిర్వచించి, మనుజుని ఉత్కృష్టస్వభావమునకు నచ్చచెప్పి, లోకమును అభివృద్ధిలోనికి తీసుకొనివచ్చుటకు ప్రయత్నిస్తూవుండే వ్యక్తుల మనోనిర్మాణము,

* గతసంవత్సరాదిసంచికలో స్వరక్షణవాసనగురించి వ్రాసియుంటిని. సాంఘికవాసనగాక సంభోగవాసన మరియొకటి; ఈమూడు కలిపి మనుజుని మనోనిర్మాణసామగ్రిగా ఉన్నవి.

సామాన్యవ్యక్తుల మనోనిర్మాణము ఒక్కరీతిగా లేవు. సాంఘికవాసన ఇద్దరిపై ఒక్కవిధముననే ప్రభవిస్తూ వుండలేదు. సాంఘికజీవన మనే పరిసరమును లోంగదీసినవారు ఆదర్శపరాయణులు. ఆపరిసరమునకు లొంగిపోతున్నవారుసామాన్యులు. తమవ్యక్తిత్వమును శుద్ధపరచుకొని, దానిని సాంఘికనిరోధములనుండి అతిక్రమింపజేసుకొని, వ్యక్తులుగా విజృంభించినవారు ఆధీమంతులు. అందరూకూడా అట్లు విజృంభింప వలెనంటే వ్యక్తి యెట్లు ఈసాంఘికవాసనకు లొంగిపోతున్నదీ కనుక్కొనవలసియున్నది.

గుంపుతో కలిసియుండడము, ఏకార్యముచేసినా గుంపుతో కలిసిచేయడము, గుంపుయొక్క ఆమోదమును కోరుతూ తనప్రవృత్తిని సరిపెట్టుకొనడము, ఈ సాంఘిక వాసన యొక్క వ్యక్తస్వరూపము. అందుచేత సంఘ మనేపరిసరము ఇతరపరిసరములవలె వ్యక్తికి బాహ్యవస్తువు గాక, వ్యక్తిమనోనిర్మాణములో ఒక అంశగా ప్రభవిస్తుంది. ఆంతర్యమైన దగుటచేత దానిప్రభావము చక్కగా ఒంటుపట్టదు. అది చేసేపని అంతా తనమనస్సే చేస్తున్నట్లు భావించి, వ్యక్తి ఒకవిధముగా మోసపోతున్నాడు. కాబట్టి తనమనోవృత్తులలో వాస్తవముగా వ్యక్తియొక్క స్వంతమెంతో, సంఘముయొక్క ప్రబోధప్రతిఫలమెంతో తెలుసుకొనుట సులభము కాకున్నది.

సంఘము, సాంఘికప్రభావము ఉన్న దన్నజ్ఞానము, సంఘముతో కలిసియుండా లన్నఅభిలాష, ఆలాగు ఉండడములో పొందే ఆనందము, ఈమూడు విధములైన వృత్తులలో వ్యక్తమవుతూ ఉన్న దే సాంఘికవాసన. మంచిఆహారము, సొగసైనస్త్రీ యెట్లు అబాధితముగా పొందదగిన వస్తువులుగా కనబడునో, అట్లే సంఘముతో కలిసియుండా లన్న భావముకూడ ఇతరతర్కము, లాభాలాభవిచారణ అక్కరలేకుండానే అంగీకృతమవుతూ ఉంటుంది. సంఘములోనివారు తన్నుగురించియెట్లు భావిస్తున్నారు అనేభావన,సంఘములోనివారు తనను మెచ్చుకోవలెనన్నకోరిక, సంఘములో తాను జనప్రియుడై ఉండాలనే ప్రయత్నము–ఇవన్నీ ఆవాసనయొక్క వికృతులు. అందుచేతనే గుంపులో ఉన్నవారి ప్రబోధములు కేవలసూచనలరూపమున అవ్యక్తముగా ఉన్నా, వ్యక్తిపై అతిసూక్ష్మముగా ప్రభవిస్తవి; వ్యక్తి వాటిని సులభముగా అంగీకరిస్తాడు. ఇట్టిజోగు ఉండడముచేతనే వ్యక్తియొక్క అభిప్రాయములు, రుచివిశేషములు, మంచిచెడ్డల పరిష్కారనియమములు, మరియు, నీతి, ధర్మము మొదలైన ఆధ్యాత్మికవృత్తులు అన్నీకూడా వ్యక్తిపరములే కాకుండా సాంఘికములు అవుతూ ఉన్నవి. గుంపులోను విరివిగా వాటుకొనియున్న అభిప్రాయములప్రకారము తన అభిప్రాయము లున్నప్పుడు సాంఘికవాసనయొక్క ప్రవృత్తి అడ్డుండకపోవుటచేత, వ్యక్తియొక్క మానసిక శక్తి ప్రవాహమునకు ఆటంకము ఉండదు; అప్పుడు మనస్సునకు సుఖముకలుగును. ఆలాగు కాక, గుంపులోని వాటితో ఏకీభవించక తనవ్యక్తిత్వమును పాలించినచో సాంఘికవాసనతో విరోధము కలిగి దుఃఖము కలుగును.

ఇట్లు సిద్ధమైన సాంఘికనిర్బంధములలో కెల్ల ముఖ్యమైనది నీతి. నీతియనగా వ్యక్తియొక్క ప్రవృత్తిని నియమించే యేర్పాటు. మనుజుని ప్రాథమికావస్థలో అట్టి సాంఘికనియమములవలన వ్యక్తి తన జీవనవ్యాపారమును బాగా నడుపుకొగలిగినాడు కాబట్టి, సంఘబోధనలను వ్యక్తి ఆమోదించుటకు అలవాటుపడ్డాడు. ప్రారంభమందు ఉపయోగకరములైనవి, ఇప్పుడు నామమాత్రములైనా, సంఘములో అవి నిలిచేయుండుటచేత వ్యక్తికి బాధగా ఉంటుంది. అవి నిరర్థక నిర్బంధములని వ్యక్తి వాటిని నిరాకరించబోతే, సంఘము వాటిని నీతి అన్న పేరుతో నిలుప యత్నిస్తుంది. వాటికి నీతిఅన్నపేరు పెట్టిన్నీ, సంఘమునకు క్షేమమన్నఆశపెట్టిన్నీ, కట్టుబాట్లని చెదిరిస్తున్నా వాటిని నిలుప సంఘముయత్నిస్తుంది. ఈపోరాటములో సాంఘికవాసనకు ఎక్కువప్రయోజనము కలుగుతుంది. ఈనీతికిన్ని, దేశపరిపాలన శాసనములకున్ను సామ్యము, భేదము రెండున్నూ ఉన్నవి. శాసనముల యెడల ప్రజలకు భక్తివిశ్వాసములుండి, ఆమోదముతో వాటిని అంగీకరించి, ప్రవర్తించుటకు ఈ సాంఘికవాసన చాలాసహకారి: ఇది సామ్యము కాని శాసనములను ధిక్కరించిన వ్యక్తులను దండనములమూలమున లొంగదీయుటకు సంఘము వెనుకదీయదు: ఇది భేదము. ఈదండనముల మూలమున పాలించుటకుకూడా సాంఘికవాసనయొక్క సాహాయ్యము చాలా ఆవశ్యకము; ఎవరో కొద్దిమంది వ్యక్తులు తిరుగుబాటు చేసినప్పుడే దండనము సాధ్యమవును కాని అనేకమంది తిరుగుబాటు చేసినచో శాసనము నిష్ఫలమగును. ఆకొద్దిమందిని అంతసులభముగా దండించి శిక్షించుటకు సాంఘికవాసనయొక్క సాహాయ్యమును పరిపాలకులు తీసుకొంటున్నారు. అందుచేత నీతినియమములవిషయమై యున్నట్లు శాసనముల విషయమై అవ్యక్తముగా ఉండకుండా సాంఘికవాసనాప్రభావము బహిరంగముగా ఉంటుందని చెప్పవచ్చును. సంఘములోనివారు ఆలోచించి ఈ శాసనములను స్పష్టముగా ఉండేటట్లు రచిస్తారు. నీతో, అట్లు కాదు; అవ్యక్తముగా, పరంపరగా, అనాదిగా అన్నట్లు అనుక్రమితముగా మనోనిర్మాణములో బాల్యదశనుండీ ప్రవేశించి ప్రభవిస్తుంది. సంఘముచేయు దూషణభూషణలుమాత్రమే నీతిపాలనలో ప్రసక్తములయే దండనములు. నీతిని ఉల్లంఘించి మనోబాధను, దానిద్వారా శరీరబాధను అనుభవింపవలెను; శాసనముల నుల్లంఘించి శరీరబాధను, దానిద్వారా మనోబాధను అనుభవింపవలెను. కాబట్టి నీతిని బహిరంగముగా ఉల్లంఘించేవారు అరుదు; శాసనములను తిరస్కరించేవారు ప్రతిదేశములో ఉన్నారు. ఆలాగే హృదయపూర్వకముగా అంగీకరింపకుండా, బహిరంగముగా తిరస్కరించకుండా శాసనములను నిర్లక్ష్యభావముతో మాస్తూ వ్యక్తులు సులభముగా ప్రవర్తించగలరు. నీతివిషయమై ఈవైరుధ్యము అంతగా ఉండదు. కొన్ని నీతినియమములుకూడా అనంగీకారశాసనములవలెనే వ్యక్తములై యుండుటచేత వాటినికూడా బహిరంగముగా తిరస్కరింపవచ్చును. కాని ఎక్కడైనా మనస్సారా అంగీకరించి, ఆ అంగీకరించిన దానిప్రకారము ప్రవర్తిస్తేనే ఋజుప్రవర్తన కాగలదు. అట్టివ్యక్తే

# డిల్లీ సామ్రాజ్యశాసనసభ-కాంగ్రెసు సభ్యులు



శ్రీ యం. కే. ఆచార్యగారు



శ్రీ ఏ. రంగస్వామి అయ్యంగారు



శ్రీ యం. యస్. శేష అయ్యంగారు



జనాబ్ సైయద్ ముర్తుజా సాహేబ్ గారు



శ్రీ ఆర్. కే. షణ్ముఖం శెట్టిగారు



శ్రీ కే. వి. రంగస్వామి అయ్యంగారు



శ్రీ బత్తిని పెరుమాళ్లనాయుడు గారు



శ్రీ సి. దొరసామి అయ్యంగారు



శ్రీ టంగుటూరి ప్రకాశపంతులుగారు

మహనీయుడు. కాని యెట్టివ్యక్తికీకూడా శాసనతిరస్కారము బాధాకరము అగుటచేత నీతికి, శాసనములకు భేదము ఉండకతీరదు. అట్లు బహిరంగముగా ఉల్లంఘించకపోయినా వాటిని నిర్మూలించుటకే ఆవ్యక్తులు ప్రయత్నించుటవలన సంఘతేజము క్షీణిస్తుంది. ఇట్టి వ్యక్తులపై సాంఘికవాసన బలము తగ్గిపోయి, వారి వ్యక్తిత్వమునకు తావు ఇచ్చివేస్తుంది.

ఇక్కడ చెప్పిన నీతిని, శాసనములనే పేర్కొని, ఇంకా అవ్యక్తములుగా ఉండేఆచారములు, మర్యాదలు, లాంఛనములు ఈ మొదలైన సాంఘికప్రవృత్తివిశేషములను విడిచివేయడమైనది. వీటి అన్నిటిలోను ఇది తప్పు, అది ఒప్పు, ఇది మంచి, అది చెడ్డ అని నిర్ణయించే అధికారము ఎవరికి కలదు అని విచారించేటప్పుడు ఈసాంఘికవాసనయొక్క ప్రభావము తెలియగలదు. ఈచిన్నచిన్న సంగతులలో కూడా వ్యక్తి తనఇష్టముప్రకారము ప్రవర్తించలేక ఏదో ఒకపద్ధతిని అవలంబించుటకు కారణము ఆవాసన ప్రభావమే. సంఘమునకు అంత బలము కలదు. ఇంతెందుకు! సంఘము అంగీకరిస్తేనే సత్ప్రవర్తనమవుతుంది. సంఘము అంగీకరించని దానిని చేస్తే దుష్టుడు అవుతాడు. ఈసంఘాంగీకారము ఉంటే మనస్సుకు సౌఖ్యము, శాంతి ఉంటవి. వీటిని పోగొట్టుకోలేకే ప్రాచీనసాంఘికస్థితులలో ఉన్నవారందరూ బహిష్కారమునకు దండనమునకుకంటె ఎక్కువగా భయపడేవారు. ఇప్పుడు భయపడుతున్నవారుకూడా ఉన్నారు.

కాని క్రమముగా ప్రపంచములో అనేక కారణములచేత ఈ సాంఘికనిరోధము తగ్గుతూ ఉంది. వ్యక్తియొక్క వ్యాపారములు సంఘమునకు చెందినవికాక తనస్వలాభమునకే చెందినవగుటచేత, ఆవ్యాపారములలో వ్యక్తికి సంఘముయొక్క సాహాయ్యము తగ్గిపోయినది. ఆయా విషయములలో సంఘమునకు వ్యక్తికి వైరుధ్యము కలిగింది అన్నమాట. ఇట్లు స్వలాభపరాయణులు ఒకవైపునుంచి సాంఘికనిరోధమును త్రోసివేస్తూవుంటే, వ్యక్తిత్వపరాయణులు తమశక్తిపైనే ఆధారపడుతూ తమకు నచ్చినకార్యములను చేయ ప్రారంభించి సంఘనిరోధమును తగ్గించివేసినారు. ఆధునికసంఘములలోను, రాష్ట్రములలోను, వ్యక్తిత్వాభిలాష వృద్ధిచెందుతూ వున్నా, సాంఘికవాసన బలము సామాన్యజనులలో ఎక్కువగానే యున్నదని చెప్పవలెను. వ్యక్తులు వ్యక్తులుగా ప్రవర్తించలేనందున సాంఘిక రాజకీయ దుర్మార్గము లన్నిటికి వీలు కలుగుచున్నదనిన్నీ, అన్నివిధములైన బాధలకు వ్యక్తిత్వస్థాపనమే పరమౌషధమనిన్నీ నమ్మినసంస్కర్త లందరూ ఈ వ్యక్తిత్వాభిలాష అభివృద్ధిచెందవలెనని కోరుతున్నారు. పూర్వస్థితులలో వలె శరీరపోషకములైన భౌతికసామగ్రీసంపాదనకు సహాయపడే వ్యక్తిని లొంగదీయలేని ఈసాంఘికవాసన ఆధ్యాత్మికవిషయములలో ప్రభవిస్తూ పూర్వముకంటె ఎక్కువహాని చేస్తున్నదని వారి అభిప్రాయము. యుద్ధములు, ప్రబలుల పీడన, అన్యాయ్యపరిపాలనము, బీదల అసహాయత, ఈమొదలైన వెన్నో ప్రపంచమందు తత్త్వజ్ఞుల బోధనలను తిరస్కరిస్తూ నిలిచియుండుటకు కారణము వ్యక్తులు తమ వ్యక్తిత్వమును, సాంఘికపు బానిసతనమును చక్కగా గ్రహించలేకపోవుటయే అని వారి అభిప్రాయము. శరీరసంబంధములలో ముక్తుడైనవ్యక్తి ఆధ్యాత్మికసంబంధములలో ముక్తినికోరక ఊరుకోలేడన్న ధైర్యము చేతనే సంస్కర్తలు నిరాశ చెందక వారి ప్రబోధమును కొనసాగిస్తూన్నారు.

వ్యక్తిత్వమును స్థిరపరచుకొనుటకు ముఖ్యసాధనము వ్యక్తికిగల బుద్ధియే. బుద్ధికి ముఖ్యలక్షణము తర్కము. తన అభిప్రాయమునూ, ప్రవృత్తికార్యమునూ, కోరికనూ ప్రతిదానినీ చక్కగా వ్యామోహరహితముగా పరీక్షించి, ఆయావృత్తుల మూలకారణములను, సబబులను, ఉద్దేశములను, తనబుద్ధికి వ్యక్తపరుచుకోవలెను. అట్లు తర్కించిచూస్తేనే కాని దేనికినీ తన అంగీకారమును, ఆమోదమును నిర్ణయించకూడదు. అట్లు చేయుటవలన అన్నీ తనఅభిప్రాయము లవుతవి. సంఘాదేశములు తన ఆదేశము లవుతవి. సబబులేనివి త్రుళ్లిపోతవి. జ్ఞానాగ్నిలో వాసనాంధకారమున జన్మించినవి భస్మము అవుతవి. ఇట్లు ప్రవృత్తిని నిర్ణయించునప్పుడు మనశ్శక్తి అంతా వాసనల ఆధీనమునుండి బుద్ధిఆధీనమై వ్యక్తిని దివ్యపురుషునిగా మార్చుతుంది. ఇది సులభము కాదని వ్యక్తులు వెనుకదీయక ప్రయత్నించినచో క్రమముగా సంఘములో జంతుసంబంధమైన సాంఘికవాసన బలము పోయి, వ్యక్తిత్వసహకారబలముగా మారుతుంది. అప్పుడు సుదినములు వచ్చినట్లు భావించవచ్చును. ఇంద్రియసుఖమును ఇచ్చుసామగ్రిని సంపాదించుటకు అలవాటుపడ్డ అల్పపరిశ్రమ ఈ జ్ఞానార్జనకు శత్రువు. జ్ఞానప్రాప్తికి దగ్గరదారులు, సులభమార్గములు లేవు. కాబట్టి కొన్నికొన్ని సమయాలలో గొప్ప కల్పనాశక్తిని చూపించగలిగిన వ్యక్తి, గొప్పఆవేశములో అమిత ధైర్యమును పూనగలిగినవ్యక్తి, అన్ని వేళలలోను ఆబుద్ధిశక్తిని చూపించలేకున్నాడు. పదేపదే పట్టుదలతో తనఆత్మను పరీక్షించుకొంటూ, తనలో తాను విచారణచేస్తూ ఉన్నవ్యక్తి ఈబంధనములను దాటగలడు. ఆత్మగౌరవమును ఎక్కువచేసుకొని, అహంకారమును గాని నమ్రతనుగాని అమితము కాకుండా ఉంచుకొని, సంఘమును విడువక సంఘమునకు లొంగిపోక, ఎల్లప్పుడూ తనబుద్ధిబలముమీదనే ఆధారపడి ప్రవర్తించువాడు అట్టివ్యక్తి కాగలడు. అట్టివ్యక్తి పరిపూర్ణమైన సంఘమునకు బానిసగాక ఉత్తేజకుడు అవుతాడు. అతని ఆదర్శములకు సంఘమును ఎత్తుతూ తనజీవనయాత్ర నడుపుతాడు. ఈపరిస్థితులలో అట్టివ్యక్తులకు మహనీయులని మనము నామకరణము చేస్తూ ఉన్నాము. వారిబోధనలద్వారా వ్యక్తులు మారి, వ్యక్తుల ప్రవర్తనద్వారా సాంఘిక రచన మారుతుంది. అప్పుడు సాంఘికవాసన సాంఘికబుద్ధిగా మారుతుంది.

# ఈశ్వరప్రార్థన

మంగిపూడి

వేంకటశర్మ గారు

నాశంబయ్యెడు దేశసంపద కదుఁ నానాఁటికిన్ నేటికిన్
దేశద్రోహులె దేశనాయకులుగా సేవించుచున్నారు ద్ర
వ్యాశాపేశు లిలేశులైరి ప్రజలో యజ్ఞాననిద్రాళు లీ
దేశక్షోభము మాన్పి శాంతినిడు తండ్రీ, సర్వలోకేశ్వరా!

దేశం బన్యులచేత జిక్కిన దరిద్రీభూతమై పోవు ద
ద్దేశీయుల్ ప్రతిభావిహీనులగుచుఁ దీనత్వముఁ బొంది యే
యాశల్ లేక వృథానశించెదరు శూన్యారంభు లా వ్యర్థు లా
శ్రీశా, నిన్ను భజింపనేర్తురె దయాబ్ధీ సర్వలోకేశ్వరా!

ఒకవేళన్ దనదేశదుర్దశలు పెల్లాహించి దుఃఖించు నిం
కొకవేళన్ దనదేశముక్తి కుపముఁ యోజించు గాంధ్యార్యుఁడే
యొకవేళన్ ఘనదీక్షలో మునిగి తానుండుఁ బరాధీన దో
యకలంకా, యిక నెప్డు నిర్గోలుచు నయ్యా, సర్వలోకేశ్వరా!

స్వాతంత్ర్యేచ్ఛ జనించినట్టి నరుఁడా స్వాతంత్ర్య సామ్రాజ్యల
క్ష్మీతేజంబును గాంచి సర్వసుఖముల్ సిద్ధించి శాంతిస్ఫూ
ర్త్యుత్సాహం బనుదాక నిద్రగొమనే, చింతించునే పోరముఁ,
శ్రీతిగ్మాగ్రోల్లాస నిరతమైన గరుణాబ్ధీ సర్వలోకేశ్వరా!

అకటా భూరము లేమిచేసిరో కదయ్యా, భారతుల్ భారతుల్
ప్రకటప్రాభవవైభవాఢ్యులగుచుఁ బ్రాసిల్లు కాలంబునన్
బ్రకృతం బిచ్చపుబానిసీల మకటా, మా స్వేచ్ఛ మా కీవ దే
సుకృతం బిచ్చెదొ నీకు నేకము నమస్సుల్ సర్వలోకేశ్వరా!


వ్యాసకర్త

# సౌభ్రాత్రము

జనమంచి సీతారామస్వామి గారు

> "ఉ. చెప్పిరి నీతివాక్యము లశేషముగా మనపుస్తకంబులన్
> జెప్పిన వెల్ల వల్లనయుఁ జేసితి నాచరణంబుమాత్రమే
> చొప్పడకుండె నీవిధుల చొప్పన నెప్పుడుఁ జేయ నామదిన్
> ద్రిప్పి కృపారసంబుఁ బ్రసరింపఁగఁ జేయవె భక్తవత్సలా!"

మనదేశము దుర్దశ పరికింపఁగా జనులలో సౌభ్రాత్రమున్నది పూర్ణానుస్వారమైనట్లు తోఁచెడిని. ఐకమత్యము సర్వశ్రేయోదాయకమని తలఁపనివారు లేరు; పలుకనివారు లేరు; వ్రాయనివారు లేరు. కాని వర్తనలో నది యెక్కడను గనఁబడకున్నది. పెద్దలు, విద్యావంతులు, దేశోద్ధారకులు, నాయకశిరోమణులు అని యెన్నికగన్నవారలలోనే పెక్కండ్రు పరస్పర ద్వేషమూని, యొకరి నొకరు తిట్టిపోసికొనుచు, ఒండొరుల యుద్యమములకు విఘ్నములు గలిగింప యత్నించుచు సౌభ్రాత్రభావము గగన కుసుమప్రాయముగా నొనరించుటకంటె దేశానర్థమున్నదా? అట్టి మహనీయులే అట్లున్న యెడల ఇంక సామాన్యులమాట వేఱె చెప్పవలయునా?

పాశ్చాత్యుల నాగరకత ఐహికభోగైకప్రధానమని నిందించుట సులభము. కాని, అట్టినింద కోడిగట్టకుండుట యెంతకష్టము! ఇంగ్లాండులో ఎన్నో కక్షలుగలవు; ఎన్నో పోరాటము లగుచున్నవి; ఎన్నో విధములఁ బరస్పర దూషణములు ప్రబలుచుండును. రాజకీయస్వాతంత్ర్య మపేక్షించు ప్రతిదేశమునందును అట్టిపద్ధతి ఉండక తప్పదని కొందఱు వాదింతురు. కాని, ఒకసంగతిమాత్రము మఱువరానిది. ఇంగ్లండు మొదలగు పశ్చిమ దేశములలో సామాన్యసమయమున ఎంతటికలహము లున్నను, దేశసంరక్షణావశ్యకత సంభవించునప్పుడు మాత్రము సర్వకక్షులు నొకటై ధనప్రాణములు సమర్పించుటకైన సిద్ధపడును. అది యునుగాక, ఆదేశములు స్వపరిపాలనాసౌఖ్యము లనుభవించుచునే యున్నవి. మనదేశమో, పరదేశ ప్రభుత్వశృంఖలాబద్ధము. పాశ్చాత్యనాగరకతా భూతావిష్టము. ఘోరదారిద్ర్యపిశాచపీడితము. వారికిని, మనకును ఉపమానము గలదా?

స్వరాజ్యసిద్ధికై మనము విశ్వప్రయత్నము చేయవలసియున్నది. అది ప్రథమకర్తవ్యము; ముఖ్యధర్మము. ఎవరిమట్టుకువారే ధనమునకో, అధికారమునకో, పలుకుబడికో, కీర్తికో రాత్రింబవళ్లు దేవులాడుచున్న యెడల, అంతఃకలహములు ప్రబలకమానవు. ఏలయన, ధనాధికారమాహాత్మ్య మట్టిది. "మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమోనమః" అనుసూక్తి మనము వినలేదా? అధికారముగూడ అంతచెడ్డదే.

చ. వినయముఁ దోఁపనీదు మద
వృద్ధికిఁ దోడ్పడుఁ బెంచు గర్వమున్
కనులను జూడనీదు మఱి
కర్ణములన్ విననీదు బంధులన్
మునుపటియట్లు సన్నిధికిఁ
బోఁగనీ దధికారరోగ మే!

మనుజునిఁబట్టుకొన్న నది
మానుపు వైద్యుఁ డెవండు రాఘవా!

ధనాధికారమోహమదిరాపానపరవశులై పెనఁగులాడువారికి సర్వజనసోదరభావముండుననుటకంటె వెఱ్ఱి గలదా? కావున, స్వార్థత్యాగము జగత్కల్యాణసిద్ధికిఁ బ్రధానసాధనముగాఁ బరిగణింపఁబడవలెను. అదియే సౌభ్రాత్రవృత్తరాజమునకు మూలము.

శ్రీమద్రామాయణముకంటె లోకోపకారకగ్రంథరత్నము లేదని నానమ్మకము. అందు వర్ణింపఁబడిన దాశరథుల సౌభ్రాత్రము అత్యద్భుతమైనది; అమృతోపమానమైనది; అనన్యసామాన్యమైనది. ఆహాహా! తన ప్రయత్నమేమియు లేకయే లభించిన రాజ్యలక్ష్మిని జేకొననొల్లక, అగ్రజునియెడల అనుపమానురాగము వెల్లడించిన భరతునినామము చెవిసోకునరికి ఒడలు పులకరింపని మానవాధముఁడు గలఁడా! అమ్మహాత్ముఁడు అత్తవారి యింటనుండి అయోధ్యానగరమున కరుదెంచినవెంటనే రామవియోగదుఃఖ మాపుకొనలేక వెక్కి వెక్కి యేడ్చుచున్న పౌరులను, బంధువులను, మిత్రులను, దాసదాసీజనమును జూచి తానట్టె కొయ్యయై నేలఁగూలి, కొంచెము సేపటికిఁ దెలివొంది, యెదుట "నాకుమారుని కేకదా రాజ్యమంతయు సిద్ధించిన" దని పొంగిపోవుచున్న కైకేయీజననితో దుస్సహాగ్రహమున పలికిన పలుకులు హైందవపూర్వనాగరకతాకీర్తిదుందుభిస్వనములై ఈలోకమున్నంతకాలము సౌభ్రాత్రప్రభావమును చాటుచుండునుగదా! అమాట లొక్కసారి చెవులపండువుగా విందము:

"చ. అడవుల రామచంద్రుఁడు జ
టాజినముల్ ధరియించియుండ, నేఁ
బుడమి భరించి భోగములు
పొందఁగలానటె యిట్టిచోప్పు లే
దెడఁగల? వింక నన్ను మొగ
మేమిటెఱింగుదుఁ జూతు? కోపమున్
గడుపునఁబుట్టి యీభువన
గర్హకుఁ బాత్రుఁడనైతి రాక్షసీ!

భోగిగానుండుటకు నవకాశము లెన్నోయున్నను పితృవాక్యపరిపాలనార్థమై యోగివేషమూని, కల్యాణవస్త్రములు ధరించినట్లె పరమానందభరితుఁడై యరణ్యములకుఁ బ్రయాణమైన లోకోత్తరచరిత్రుఁడు, శ్రీరామచంద్రమూర్తికిఁ దగినతమ్ముఁడుగదా భరతుఁడు! కావుననే కవికులగురువగు కాళిదాసు భరతప్రశంసచేయునప్పుడొకచోట ఆనందమున మైమఱచి యీక్రిందిఅమృతగుళికను రచించి మన కమూల్యధనముఁ బ్రసాదించినాఁడు:

శ్లో. లంకేశ్వరప్రణతి భంగదృఢవ్రతం త
ద్వంద్యం యుగం చరణయో ర్జనకాత్మజాయాః;
జ్యేష్ఠానువృత్తి జటిలంచ శిరోఽస్యసాధో
రన్యోన్యపావన మభూ దుభయం సమేత్య.

(తా. తన్నుభర్తగాఁ గైకొనుమని రావణాసురుఁడు చేయు దండప్రణామములకు భంగమొనర్చుటయే నిశ్చలవ్రతముగాఁగలిగి వానిని తన్నివేయఁగల శ్రీజానకీదేవి పాదయుగమును, నాఅన్నగారు జటాజినములు ధరించియుండ నేనుమాత్రము మఱొకవేషమున నుండునాయని ప్రతినచేసిన శ్రీభరతుని జడలుగట్టినశిరస్సును ఉభయముగూడి అన్యోన్యపావన మొనరించెను).

అది, సీతాదేవి పాదపద్మములకు భరతుఁడు సాష్టాంగనమస్కారము చేసె నను సందర్భమునఁ జెప్పఁబడినది. ఔను; భరతుఁడు పావనుఁడుగానిచో మఱెవఁడు? దశరథకుమారుల కీడైన సౌభ్రాత్రసంపన్నులు మఱెవరు? అట్టివారు మనపూర్వులని చెప్పుకొనుచు మనమైకమత్యములేక ధనాధికారములకోసము కలహించుట లజ్జాకరముగాదా? అందఱము శ్రీభారతమాతబిడ్డలముగామా? ఐహికలంపటత్వము తగునా? త్యాగబుద్ధివలదా? దేశాభివృద్ధి యక్కఱలేదా? భర్తృహరిచెప్పినట్లు "మాతృయౌవనోద్దార వనీకుఠారములమై" జనియించినవారమా? ఇన్నింతకాలము? ఇంకనైన నిజమైన సౌభ్రాత్రముగలిగి సార్థకజన్ములగునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాక!

# శ్రీకస్తూరీదేవి విద్యాలయ తృతీయవార్షికోత్సవము

సందర్భమున రాయప్రోలు సుబ్బారావు గారు రచియించిన పద్యములు

కోశం బమ్ముల బోలె ధారణ తపోక్తుల్ దాల్చి, మంత్రోదయా
వేశజ్వాలల భేదవాదకుహనా బీజంబులం గాల్చి; దా
రాశోపంబడనీయ కంతరములన్, బ్రాణవ్రతన్యాసులై
దేశోద్ధారకయోగముం నెఱపుఁ దక్షిణ సోదరీసోదరుల్.

సీ. వైదికావరణ మర్యాద తేజరిలంగ నన్నయ తీర్చిన నలినముఖులు
శాస్త్రవర్చస్సు పిక్కటిలంగఁ దిక్కన మాంసగించిన యభిమానవతులు
వివిధకోమలరేఖ లవఘళింపంగ శ్రీనాథుండు దిద్దిన నాణకత్తె
లాంధ్రజీవత్కళయందమ్ము లెగఁబోయ సూరన్న మలిచిన సూత్రవతులు
పరుషసరళరేఖా పరంపర వెలార్ప-కళలరూపంబులో రూపకళలొ యనఁగ
సాహితీదర్పణముల సాక్షాత్కరించు-ఆంధ్రసాధ్వీమతల్లుల కంజలింతు.

ఉ. క్షేత్రమునర్కిరమోమ్మఖకృపీణ విమలీభవదార్ద్రహృత్తపో
గాత్రముగాక యెం దమృతకల్పన కోపమి సత్యమేని? యీ
సూత్రము నేలపట్టరు యశోవతు లందఱు, వీరమాతలై
ధాత్రిభరంబు డింపరె? యధర్మ నికర్తన ధారణారతిన్.

మ. పరమన్ వ్యోమమునన్ వెలుంగు సవికల్పజ్యోతికానందసుం
దర లీలాగృహమైన యీప్రకృతి సౌందర్యం లేదె నానాభయం
కర భద్రంకర రూపముల్ మనుజగత్కల్యాణ యోగార్థమై;
పురుషుం జూడుఁడు వీరపుత్రునిగ సంభోజాస్య, లాత్మద్యుతిన్.

సీ. కేవల నిర్గుణ భావమౌ పరమాత్మ, సంశ కాదిమనిష్ఠయయిన ప్రకృతి
కాలరూపమున నాకాశప్రవాహకల్లోలవీచికల వెలుంగు కాళి
నిఖిలసౌభాగ్యచిహ్నిత మంగళాకారమునను జగచ్ఛోభఁ బెనుచు లక్ష్మి
శబ్దాకృతిని బ్రపంచము నావరించి అతురవిభూతులతో నెసంగు వాణి
సృష్టిచక్రము చక్కఁగా ద్రిప్పుచున్న-ఆదిశక్తి యవస్థాంతరాకృతులుగ
ధ్యానవీథి నధ్యయనించు డాంధ్రసతులు-వీరపుత్రానుశాసనాభీష్టసిద్ధి.

సీ. తనరాజ్యసీమానితంబముల్ దాటనరులఁ బాఱఁదోలిన రుద్రమాంబ
తనమనోదీప్రాగ్రమును గణితస్నేహలహరిఁ దేలిచిన లీలావతి సతి
బిరుదులందిన రాచ బిడ్డల బొమ్మలచాయ నాడించిన నాయకమ్మ
తనసూత్రపాలు బాలునికి నవ్వుచుఁ గరవాల మొసఁగిన మాంచాలదేవి
తెలుఁగు దేవళముల వెలుఁగుచు నున్నారు-మలఁగిపోక తారకలవిధాన
వీరవాసరముల నారాధనము సల్పుఁ-డమృత యోగదీప్తు లుండు సతులు!

---



# దేవాలయప్రవేశము

వల్లూరి సూర్యనారాయణరావు గారు

దేవాలయములలోకి నిమ్నజాతులు పోవచ్చునా యను సాంఘిక సమస్య మనల నిప్పు డెదుర్కొను చున్నది. అస్పృశ్యతానివారణ జరిగినగాని స్వరాజ్య సంపాదనకు మన మనర్హులమని మన మందరము ఒప్పు కొనవలసిన విషయమే. కాని దేవాలయములలోకి వీరిని పోనీయవచ్చునా? పోయినపుడు ఎక్కడనుండి స్వామిదర్శ నముచేసికొనవలసియున్నది? ఈ విషయములను గురించి యింతవరకున్న శాస్త్రములను, ఆచారములను పరిశీలిం చిన తరువాత ఆచరణయోగ్యము లగు నిబంధనలను గురించి మన మాలోచించవచ్చును. వితంతు వివాహ ములను చేసికొన్న బ్రాహ్మణులను తక్కిన యనుష్ఠాన పరులగు బ్రాహ్మణులవలె గర్భాలయములలోనికి పోకూ డదని మద్రాసుహైకోర్టువారు తీర్మానించిరి (13 మ293). జడ్జి ముత్తుస్వామిఅయ్యరుగారు పూర్వశాస్త్రములప్రకా రము వితంతూద్వాహము లంగీకరింపబడినవా లేవాయను నంశము అప్రస్తుతమనియు, జనసామాన్యములో నెట్టి యాచారము ప్రబలియున్నదో దానినే విచారించవలసి యున్నదనియు సెలవిచ్చిరి. ప్రతిదేవాలయములో అక్కడి యాచారము లెట్లున్నవో చూడవలెనుగాని అన్ని వర్ణ ములవారును లోపల ప్రవేశించుట కంగీకరించిన అహోబ లము, జగన్నాథము మొదలగు కొన్ని దేవాలయములలో వలె పల్లెకు దేవాలయములైనంతమాత్రముననే మామూ లు ఆచారములకు విరుద్ధముగా ప్రజలుజరిగించుటకు వీలు లేదు. ఈమతస్థాపనలువర్ణాశ్రమధర్మములతో సంబంధిం చినవగుటచే వీనిని మొదట స్థాపించినవారు ఇప్పు డమ లులోనున్న నిబంధనలను, మేరలను యేర్పరచినట్లు [illegible] ~~ఇండియను~~ వలెను. శైవాగమసూత్రములను, వైష్ణవసాంప్రదాయముల ను అనుసరించి యీదేవాలయములు ప్రతిష్ఠింపబడినవి. గొప్పకోవెలలో గర్భాలయము, సభామంటపము, మహా మంటపము, ద్వారమంటపము, బహిర్మంటపము, మొద లగునవి యుండును. మాలమాదిగలు మొదలగు నిమ్న జాతులు, గోపురదర్శనముతో తృప్తిపొంది ఉత్సవవిగ్ర హములను బయట నూరేగించునపుడు చూడవచ్చును. బహిర్మంటపములోతక్కువవర్ణములలోనిశూద్రులు, మహా మంటపములో వైశ్యులు, క్షత్రియులు, అగ్రజాతులవార మనియనిపించుకొనుశూద్రులు, సభామంటపములో బ్రాహ్మ ణులు, గర్భాలయములో అర్చకబ్రాహ్మణులు నుండవలెను. మనపంచమసోదరులు హిందువులైనను, శ్రీరంగము లోని శ్రీరంగనాయకస్వామినిగాని, మంగళగిరిలోని పాన కాల నరసింహ స్వామినిగాని, తిరుపతిలో శ్రీవేంకటేశ్వర స్వామినిగాని, సింహాచలములో శ్రీలక్ష్మీనృసింహస్వామిని గాని, యీ మొదలగు మూలవిరాట్టులను ఎన్నడు చూచుటకు నోచుకొనలేదు. మన చిన్నకోవెలలో ఈనిమ్నజాతులు తప్ప తక్కిన యన్నివర్ణములవారు కలిసి మహామంటపములో సమావేశ మగుచు నే యున్నారు.

ఇట్టి సందర్భములలో, దేవాలయ ప్రవేశసంస్కర ణము, సత్యాగ్రహ మవలంబించినంతమాత్రమున, ఆచ రణలోనికి వచ్చుట కడుదుర్లభము. ఏకమతస్థులైనను క్రైస్తవులలో తెల్లజాతివారలకు ఒకగుడియు, నీగ్రోలకు, క్రైస్తవులకు మరియొకగుడియు స్థాపించు

కొనుచుండగా మన మతాచారములలో గొప్పమార్పులు ఏమియు జరుగక పూర్వపువర్ణాశ్రమధర్మములనే పట్టుకొని యూగులాడుచున్నంతకాలము నీదేవాలయములలోకి నిమ్నజాతులకు ప్రవేశ ముండనేరదు. ఇప్పటి న్యాయశాస్త్రములు వీరి కేవిధముగను సహాయముచేయలేవు. సంఘసంస్కరణప్రియులగు జడ్జిసదాశివయ్యరుగారు సహితము ప్రస్తుతము అమలులోనున్న ఆచారముల ప్రకారము తీర్పు లీయవలెనుగాని వేదాంతసూత్రములనుబట్టికాని, కృతయుగములోని ఆచారములను బట్టికాని తీర్పుల నీయకూడదని చెప్పిరి (27 మ. లా. జ 253). కాబట్టి మనయగ్రజాతులకు, జాతీయదృక్పథము మారవలసియున్నది. ఈలోపుగా మన పంచమసోదరులు తమ యాత్మగౌరవమును నిలబెట్టుకొని, బాహ్యశుచిని అలవడజేసికొని, తమలోనుండియే స్వార్థరహితులను, విద్యాధికులను నాయకులుగ నేర్పరుచుకొని, అహింస, ప్రేమ గలిగి పనిచేసినయెడల, తక్కిన వర్ణములవారితో సరిసమానముగు సాంఘికహక్కులను సంపాదించుకొనవచ్చును. గోవధచేసి గొడ్డుమాంసమును, పందిమాంసమును భక్షించు హిందువులను, తురకలతో సమానముగానే హైందవదేవాలయములలోకి రానీయకుండుటలో వింతయేమి? కాబట్టి వీరికిష్టమైన యెడల, తాము ప్రత్యేక దేవాలయములను కట్టుకొనవలెను. కర్మను, పునర్జన్మమును, ఆత్మనిత్యత్వమును హైందవమతమునకు ప్రధాన పునాదులగుటచే వీనియందు నమ్మకముగల యేవర్ణము వారైనను, తమపుట్టుకతో అసంతృప్తినొందక తమకుల ధర్మమును విడువకుండ క్రమముగా దానిని నెరవేర్చుకొనుచు నుండినయెడల, ఉత్కృష్టమైన జన్మము ముందు కలుగుననియు, ఒకప్పుడు ఆజన్మముతోనే వీరికి మోక్షముకూడ రాగలదనియు, తమధర్మము నుల్లంఘించిన బ్రాహ్మణులు సయితము ఉత్తరజన్మములో నధోగతిపాలు కావచ్చుననియు మనశాస్త్రములన్నియు ఘోషించుచున్నవి. వీనినన్నిటిని బ్రాహ్మణులు తక్కిన జాతుల వారిని అణచివేయుటకు కల్పించిరని వాదించినను, ఇప్పటి వర్ణాశ్రమధర్మములను మొదలంట తుడిచిపెట్టి పూర్వవైదికమతమునే అనుసరించు ఆర్యసమాజమతములో చేరినయెడల ఈ దేవాలయములతో వీరి కవసరమేలేదు. సగుణోపాసనయందు నమ్మకముండి, భక్తిమార్గ తత్పరులైయుండు నిమ్నజాతులు, పూర్వమునుంచి అనుశ్రుతముగా వచ్చుచున్న వర్ణాశ్రమధర్మముల సళ్లు ఇంకను వదలించుటకు ప్రేమతోను, ఓర్పుతోను ప్రయత్నింపవలెనేకాని దౌర్జన్యముతో సమానత్వమును సాధించుటవలన లాభము లేకపోగా, అనవసరమైన వైషమ్యములకు కారణభూతులగుదురు. వీరికి నాలవజాతి వర్ణములో చేరినశూద్రులు కూడ అడ్డు తగులుదురు. దేవాలయపుబిల్లును చర్చించునపుడు సత్యమూర్తిగారు జస్టిసుపార్టీవారిమీద నేరముమోపుటకై పంచములు దేవాలయములలో ప్రవేశించుటకు తన కెట్టియభ్యంతరము లేదని వీరయ్యర్ గారి యుపపాదనను బలపరచిరి. కాని, అట్టి యభ్యంతరము తనశాఖవారికేకాక బ్రాహ్మణేతరుల కందరికిని కలదని యెరిగియుండియు చౌకయైన గౌరవమును, ఔదార్యమును కనపరచుటకు ప్రయత్నించిరేకాని, నిజముగా తాను త్రికరణశుద్ధిగ ఈసంస్కరణ నంగీకరించియుండరు. అట్లు అంగీకరించినయెడల ఈయన రాజనీతిపరుండుకాడని చెప్పవలసివచ్చును. తాను చెప్పినదానియందు తనకు నమ్మకములేనియెడల ఈయన లోకవంచకుడని చెప్పవలసివచ్చును. మన దేవాలయములు హైందవమతముతో సంబంధించి రూపోపాసనకును, భక్తికిని నిలయములై బ్రాహ్మణార్చకుల స్వాధీనమునందున్నను, మహారాజులు, జమీందారులు, నాటుకోటసెట్లు, అన్నివర్ణములలోని భక్తులు ననేక యీనాములను, కానుకలను సమర్పించి వీనికి ధర్మకర్తలుగ నున్నారు. పూర్వమతాచారములకు లోబడియే అనేకమంది బ్రాహ్మణేతరధర్మకర్తలు వీనిని ఇప్పటికిని పరిపాలించుచున్నారు. అనేకలక్షల ద్రవ్యమును ఈ సంస్థాపనలకు వెచ్చించుచున్నారు. వీరందరకును ఏవగింపుగల సంఘసంస్కరణమును బలవంతముగ చొప్పించుటకు ముందు మనరాజనీతిధురంధరులు హైందవజనసామాన్యముయొక్క యభిప్రాయమును గమనించి చట్టములను చేయవలెను. దేశాచార కులాచారములలో మార్పులు చెందినకొలది ఈ సాంఘిక సమస్యలు పరిష్కరింపబడును.



# శ్రీ గాంధి నామము

ఏనుగు తమ్మిరాజు గారు

భారతఖండ విముక్తికారకయి
ప్రభవమందెను గాంధినామము
భారతీయులకెల్ల మోక్ష
ప్రదము తెలియగ గాంధినామము
భారతీయుల జన్మసత్వము
పదిలపరచెను గాంధినామము
భారతుల నిజసర్వశక్తి
ప్రతిభయైనది గాంధినామము
సకలసద్ధర్మసత్కర్మముల ని
శ్చలత దెల్పును గాంధినామము
శాశ్వతానందప్రదంబయి
సౌఖ్యమొసగును గాంధినామము
భావదాస్యము పారద్రోలెడు
ప్రణవమంత్రము గాంధినామము
హీనసత్వము పరిహరింపగ
బూనివెలసెను గాంధినామము
సర్వజన సౌలభ్యమైనది
సౌమ్యమైనది గాంధినామము

సకలశాస్త్రము లెఱింగి మెలగిన
సత్త్వభావము గాంధినామము
శ్రేయభావము లేనిజనులకు
పెన్నిధానము గాంధినామము ||ం||
దానభేదము లెఱుగకుండగ
సకలుమన్నది గాంధినామము
శాస్త్రభేదము లల్లుజనముల
చాయనందును గాంధినామము
సర్వసమ్మతమైన తత్త్వము
సంగ్రహించును గాంధినామము
స్వప్రకాశము శాంతియుక్తం
బప్రమేయము గాంధినామము
సర్వసజ్జన పూజనీయము
సర్వసుఖదము గాంధినామము
జన్మస్వాతంత్ర్యం బొసంగెను
సంగ్రహింపుము గాంధినామము
సచ్చిదానందప్రభావము
శాంతిరూపము గాంధినామము

# రుచులు, అభిరుచులు - బాలురందు వీనినెట్లు వ్యక్తపఱచి పోషింపనగును

నరసింగు వీరరాఘవయ్య గారు, బి. ఏ., యల్. టి.

సాధారణముగ 'రుచు'లన భౌతికపదార్థముల నాస్వాదించుటవలనఁ గలిగినరసములు. ఏద్దయేని ఫలమునుగాని, మధురమగు పదార్థమునుగాని, వంటకమునుగాని నమలినపు డుత్పత్తియగు 'రసము'నకు 'రుచి' యనఁబడు. ఇట్లు జనించురసములను 'సామాన్యరుచు'ల నఁదగు. ఇవి క్షణభంగురములు. వీనిని 'జిహ్వోత్పన్న' రసములనిన అనవచ్చును.

'అభిరుచు'లన—భౌతిక పదార్థ సౌందర్య దర్శనమున నరులం దుత్పన్నమగు 'ఆధ్యాత్మికరస'మని నిర్వచింపనగును. ఇయ్యవి శాశ్వతానందదాయకములు; నిత్యములు; భౌతికపదార్థ సౌందర్యగ్రహణోత్పన్నములు.

అభిరుచులు భిన్న భిన్న వ్యక్తులందువివిధముగానుండును. అనఁగా బాహ్యప్రకృతినిజూచి నరులంద రొక్కటే రీతిగ నానందించరు. బాహ్యప్రకృతిలో నొకటగు సూర్యోదయమునుగాని,సూర్యాస్తమయమునుగానియొక చిత్రకారుఁడు గనిన తత్క్షణమ యాదృశ్యమును తన హృదయఫలకమునఁ జిత్రించి, తిరికవేళలం దాదృశ్యమును పెక్కురంగులతో రమ్యముగను, మనోహరముగను లిఖించును.

ఆదృశ్యమునే కవి వీక్షించిన నాతని మనోభావము లుద్రేకించి, వాక్పరంపరల మూలమున వివిధరీతుల నద్దాని వర్ణించును.

ఇవ్విధముననే వివిధ మానవులందు వివిధముగ నొకదృశ్యము పనిసేయును.

పై నుదహరింపఁబడిన సూర్యోదయ దృశ్యము గాని, సూర్యాస్తమయదృశ్యముగాని, కృషికర్మలందు నిమగ్నులై, పలుమారు కన్నులారఁగాంచి, యెట్టివికారమును జెందని కృషీవలుని మనము చూచి యుందుము. అతనియం దాదృశ్యములు రసోద్రేకములు గాకుండు టేమి?

భౌతికపదార్థ సౌందర్యగ్రహణమునకును, తజ్జన్య రసాస్వాదనమునకును నాయా వ్యక్తులందు తత్సంబంధ వాసనలయొక్క యునికియే కారణమని యెఱుంగనగు.

సంస్కృతభాషావాఙ్మయమున మనోహరములును, హృదయంగమములునగు కావ్యముల సృష్టికర్తలగు కాళిదాస, భవభూతి, మాఘ, దండ్యాదులగు వారును, ఆంధ్రభాషావాఙ్మయనిర్మాత లగు నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడ, పెద్దనాదులును, ఆంగ్ల వాఙ్మయ ప్రపంచరంగమునఁ బేరెన్నికగన్న షేక్స్పియర్ ప్రభృతులును సామాన్యదృశ్యములలోని సౌందర్యరసమును గ్రహించియు, వనవిహారసమయములందు ఫలపుష్పభరిత తరువులఁ బొడగనినపుడు ఆయాబాహ్యప్రకృతి యొక్క సౌందర్యసౌభాగ్యరసముల కుతుకబంటిగ నాస్వాదించి యందుపై వెల్లివిరిసిన వాక్పరంపరలమూలమున హృదయంగమముగ వర్ణించిరి.

బాహ్యప్రకృతియొక్క సౌందర్యగ్రహణమునకు నరులందు మిగుల సున్నితమగు 'రసగ్రహణశక్తి' యత్యవసరము. తామరపుష్పమునందుండు మధువును బీల్చు షట్పదమునకుఁ బోలె, ప్రతినరునియందును బాహ్యప్రకృతియొక్క సౌభాగ్యసౌందర్యగ్రహణములకు వివేచనాశక్తియు, గుణగ్రహణపటిమము నవసరములు.

ప్రపంచమునందుఁ బేరెన్నికఁగన్న గ్రీకు, రోమక శిల్పులును, సమస్తదేశములందలి గాయకశిఖామణులును, చిత్రకారకులును, కవులును నిరంతరము సామాన్యజన

లోచన గోచరంబులగు బాహ్యప్రకృతియొక్క విలాసములను, దృశ్యములను లెస్సగ గ్రహించి, తమతమకళలం దవ్వానిని మూర్తిమంతముగ నొనర్చిరి.

ఈలోకోత్తరపురుషులయొక్కయు, మహనీయులయొక్కయుఁ గృతుల లెస్సగ గ్రహింపవలెననిన బాహ్యప్రకృతియొక్క దృశ్యములందు సతత పరిచయమును, గుణగ్రహణశక్తి పాటవంబులును బ్రధానములు.

మహాకవియగు నతఁడును, బ్రసిద్ధిఁజెందిన చిత్రకారకుఁడును బాహ్యప్రకృతియందలి మనోహరములగు దృశ్యములనే తనతనకళలందుఁ బ్రతిబింబింపఁ జేయును గాని వెగటును, రోఁతయుఁ బుట్టించుదృశ్యములఁ జేపట్టరు. ఇందులకు నిదర్శన మేమన:—

సంధ్యాసమయములం దొక నదీతీర దృశ్యము నొకానొక చిత్రకారకుఁడు చిత్రించునపు డప్రవాహమున కిరువంకలఁ బెరిగియున్న రమ్యములగు లతా గుల్మములను, రెల్లుఁబొదలను, సంధ్యారాగప్రభలను, ఆకసమునఁ బఱతెంచుచున్న పక్షులను జిత్రింపవలయునే కాని తదితరములఁ జిత్రింపంజనదు. ప్రతిశిల్పమునకును సౌందర్యమే ప్రాణము.

మానవులు విశ్వముయొక్క బాహ్యప్రకృతిని తమ తమ శిల్పములం బ్రతిబింబింపఁ జేసి, దర్శించి, యానందింతురు.

ధూమశకటమునఁ బ్రయాణము సేయునపుడు జనులు తచ్ఛకటగమనమును, దాని కిరుపార్శ్వములనుండు వివిధదృశ్యములను జూచుచుఁ జనుచుండు టెల్లరెఱింగిన విషయమే. ఈ ధూమశకట ప్రయాణికులం దొక కవి యుండుట తటస్థించెనేని యాతఁ డాశకటగమనమును, నయ్యది వంతెనలమీఁదఁ బోవునపు డుత్పన్నమగు సంగీతరవమునకు తాళమానములును, మృదంగధ్వనియు నేకీభవించినపు డెట్టి శబ్దమగునో అటువంటి యవ్యక్త మృదుమధుర మగు నాదమును నిజభావనా బలంబున మార్దవముచేసి, పద్యాత్మకముగ రచియించును. ఇట్టి పద్యములఁ జదువునపు డందులీనమై యున్న యనుభవసిద్ధ దృశ్యము లేమానవునిఁ దలపింపఁ జేయవు?

ఇటులనే బాహ్యప్రకృతియొక్క ప్రతిబింబములగు పెక్కుఛాయాచిత్రములును నరులకుఁ జిత్తరంజకమగును. జనసామాన్యముమూలప్రకృతియొక్క సౌందర్యగ్రహణమునకు విముఖులై, తత్ప్రతిబింబములగు వివిధశిల్పములంజూచి యానందింతురు. ఇట్లుసేయుట మానవప్రకృతిసిద్ధమని నుడివిన ఒకానొక పాశ్చాత్యకవివరుని వాక్యముల నిందుఁ బొందుపఱచెద:—

“మానవ జీవితమంతయు ప్రకృత్యనుకరణమునను, తదనుసరణమునను గడచుచున్నది. నరునిప్రథమజ్ఞానాంకురములు బాహ్యప్రకృత్యనుకరణముననే కలుగుచున్నవి.”

పై నుదాహరింపఁబడిన తెఱంగున, మానవుఁడు తనమేధాబలమునను, భావనాబలంబునను గడించి, సమకూర్చిన కళలన్నియు మూలప్రకృతియొక్క యనుకరణములని చెప్పనొప్పగును.

ప్రకృతియంతయు నమూల్యమగు గనివంటిది. ఒక్కొక్క నరుఁడును తనయిచ్చవచ్చిన మచ్చున యథాశక్తిమెయిఁ బ్రకృతియందలి దృశ్యములయొక్క గుణగ్రహణమొనర్చి, తజ్జన్యరసము ననుభవించి, వివిధములుగఁ బ్రతిబింబముల నొనర్తురు.

మాతృభాషా పాండిత్యమునుగలిగి, ముద్దులొలుకు తేటమాటలతో గ్రంథరచనసేయ వలంతియగు నాతఁడు ప్రకృతియొక్క గుణవిలాసముల ననుభవించి, తా ననుభవించిన తెఱంగున గద్యాత్మకముగనో పద్యాత్మకముగనో వర్ణించును.

బాలు రందు లీనమై బీజరూపముననున్న యీ యభిరుచుల నెట్లు వ్యక్తపఱచి పోషింపనగును?

బాలుర మాతృభాషా వాఙ్మయ గ్రంథములలోని హృద్యములగు రచనలను వారికిఁ బఠనీయములుగా



# శివాజీ

కాళూరి వెంకటరామారావు గారు

కట్టించినావు దుర్గమ పర్వతారణ్యముల వేనవేలు కోటలనుపెంచి
వర్తించితివి నిజధ్వజవిలోకనమాత్ర రిపుకోటి హృదయనిర్భేదకముగ
సాధించితివి మహోత్సాహవిస్ఫూర్తిమై శత్రుదుర్గముల లక్షలకు మించి
నిలిపినాఁడవు సుంత నలివోవనీక సుస్థిరమైనయటు మాతృదేశయశము
వరభవానీవిశాలకృపాతరంగ-మాలికా డోలికాజాలలాలిత ప్ర
శస్తజన్ముఁడవో భాగ్యశాలివీవు-శ్రీశివాజీ మహారాజ! సిద్ధతేజ!

పటువింధ్యాచల గహ్వరంబులును నాపై సర్వజంతూత్కరో
త్కట నానాఘనకాననంబులు భవద్బాహాబలోన్నత్య వి

---

నొనర్చుటవలనను, అవకాశము గలిగినప్పుడు విద్యార్థుల నుపాధ్యాయులు విశాల బాహ్యప్రదేశములకుఁ గొంపోయి, యచ్చటి ప్రకృతియొక్క సహజసౌభాగ్యసంపదల నుచితమగు క్రమమునఁ గనుపుటయు నవసరములు. బాలభటోద్యమవ్యాప్తికై యత్నించువార లీవాంఛనీయమగు విషయమునకుఁ దమ శిక్షాక్రమమునఁ బ్రధానస్థాన మిచ్చినఁ దదుద్యమ మెంతయు మేలు సేయును.

ఇంతియ కాక, చరిత్రాత్మక గ్రంథములను, పురాణేతిహాసములను సహితము పఠనీయములుగ నొనర్చవలయు. చరిత్ర సంశోధనంబునను, తత్పఠనంబునను, బాలురు మహాపురుషులయొక్క జీవితములను, వారనుభవించిన జీవితపరిణామములను లెన్నగ గ్రహించినపుడు వారి మనోభావములు రసార్ద్రములగును. ఏలయన, సోదరమానవుని కష్టదశలనువీక్షించునపుడు సంతాపముఁ జెందనిచిత్తమును, ఆపురుషుని యభ్యుదయకాలంబున నూరటఁ జెందని చిత్తవృత్తిని మన మెచ్చటను గానము. రసగ్రహణమునకు రసార్ద్రమగు చిత్తవృత్తియవసరము.

బాలురయందలి యభిరుచుల వ్యక్తీకరణమునకును, తత్పోషణమునకును బైనుదాహరింపఁబడిన శిక్షాక్రమము మిగుల వాంఛనీయము.

---

స్ఫుట శౌర్యాగ్నిని సర్వశాత్రవతతిఁ జుట్టాడి వర్తించు న
ప్పటి నీసింహనినాదకోటి ప్రతిరావం బిచ్చు నీనాఁటికిఁ.

అరిరాజ సైన్యఘోరాట్టవీ దహన దావానలం బేవీరు బాహుబలము
శరణాగతానంత సామంతపటలికి పెట్టనికోట యేవిభునిరక్ష
ఘన మాతృదేశభాగ్యస్ఫూర్తి రహియించి ప్రబలె నేధన్యుభర్త పాలనంబు
మానితంబే మహామహు జన్మభారతకల్యాణలక్ష్మికి కడుపుపంట
అనుపమాన యశోరాజితాఖిలాంత-రాళకృత దుర్నిరీక్ష్య మేరాజుతేజ
మట్టి నిన్ స్మరియింపఁగ నఘముపాయు-శ్రీశివాజీ మహారాజ! సిద్ధతేజ.

నీతండ్రి సైనికనికరపాలనదక్ష ఘనబాహుబలయుతుం డనఘమూర్తి
నీతల్లి బహుపురాణేతిహాసజ్ఞాన సారసంవేదియౌ వీరమాత
ఘనశైలదుర్గమ కాంతారరక్షితస్థలముసూ నీదగు జన్మభూమి
రణరాజివైరి మారణకార్య చాతురీపారగుల్ నీదగు వీరభటులు
అట్టినీశక్తి దుర్వారమౌచు సర్వ-శత్రుభూపాల శుద్ధాంతజనసహస్ర
హృదయదారుణపాటవ మేటివింత?-శ్రీశివాజీమహారాజ! సిద్ధతేజ!

తనపట్టి నుయ్యాల నునిచి మంజులగతి మాత పాడెడి జోలపాటలందు
గగనచుంబిత తరంగములతో నిర్ఝరుల్ గావించు వరవిశ్వ గానమందు
సమరోన్ముఖోత్సాహ సైన్య సంతోష సంజనిత గంభీరగర్జనములందు
తొలు సంజవేళ మంజుల వాతగతులలోఁ దేలు విహంగ గీతికలయందు
వినఁగఁ జెవికల్గు దేశభక్తునకు నెపుడు-విమలమై, విశ్వభరితమై వెలయునీదు
భవ్యయశమది కర్ణపర్వమ్ముఁ జేయు-శ్రీశివాజీ మహారాజ! సిద్ధతేజ!

శాంతమై, పూజనీయమై శాశ్వతముగ-భారతీయుల మానసఫలకములను
ఘనతరసువర్ణవర్ణ సంకలితమగుచు-నీ వినిర్మలనామంబు నిలిచిపోవు
శ్రీశివాజీమహారాజ! సిద్ధతేజ!





# పత్రికా నిర్వహణము

కొడాలి శివరామకృష్ణారావు గారు

పత్రికా నిర్వహణము సులభమైనపనిగాదు. అందును ఆంగ్ల భాషయందు ప్రచురించు పత్రికలకన్న స్వదేశభాషలయందు ప్రచురించు పత్రికల నిర్వహణము కడు భారము. పత్రికానిర్వహణమునకు కొన్ని అంగము లేర్పడినగాని యాపత్రిక సక్రమముగ సాగనేరదు. పత్రికానిర్వాహకునకు ముఖ్యముగా ముద్రాయంత్రము, సంపాదకవర్గము, విలేఖకులు మున్నగు అంగములను సమకూర్చుకొనవలసియుండును. పత్రికలలో కొన్ని దినపత్రికలుగను, కొన్ని వారపత్రికలుగను, కొన్ని మాస పత్రికలుగను ప్రచురింపబడుచున్నవి. మాస, వారపత్రికలమాటయెట్లున్నను దినపత్రికనడుపువారెల్ల పైయంగముల నేర్పరచుకొనిదే పని ప్రారంభింపవలసియుండును. రానురాను దేశమున పత్రికాపఠనాభి లాష హెచ్చుచున్నది. స్వయముగా డబ్బిచ్చి తెప్పించుకొనువారి కన్న తేరగా పత్రికను చదువువారే పాఠకులలో హెచ్చుగా నున్నను పఠనాభిలాషమాత్రము హెచ్చుచున్నందుకు సంతసింపవలసియున్నది. ఇప్పుడు దినపత్రికలముందర, వారపత్రికలన్నను, మాసపత్రికలన్నను విలువలేకయున్నది. దినపత్రికను చదువమరిగినవారెల్ల వారపత్రికలను, మాసపత్రికలను గాంచినప్పుడు తాతలకాలమునాటి వృత్తాంతములని హసించెదరు. నిరసింతురుగదా యని వారపత్రికలయొక్కయు మాస పత్రికలయొక్కయు అవసరము దేశమున లేకపోలేదు. పోస్టుసౌకర్యములున్న పట్టణములకే దినపత్రిక లుపయోగించునుగాని జబ్బుగా నుండి మందు పంపుమని వ్రాసిన, దినవారము లైనవెరి నుత్తరములు చేరు గ్రామాదులకు వారపత్రికలు, మాసపత్రికలు నుపయోగింపక దిన పత్రిక లుపయోగించునా? డబ్బున్నవారికి దినపత్రికలుగాని లేనివారికి వారపత్రికలు మాసపత్రికలు శరణ్యములుగదా.

## స్వంతభవనము

పత్రికానిర్వహణమునకు స్వంతభవన మవసరము. పిల్లి కూనలను త్రిప్పులాగు ఆఫీసు నొకచోటునుండి మరియొకచోటకు త్రిప్పుచో సామానుల నష్టము, కాలహరణము జరుగుటయే కాక, వదలరాని డిక్లరేషన్ బాధయు కలుగుచుండును. బాడుగయింట్లయున్నచో అద్దెహెచ్చించలేదనీ, మాకవసరము వచ్చినది యిల్లు ఖాళీచేయుమనీ యింటి యజమాని బెదరింపు. డిక్లరేషన్ చిక్కుపెట్టి పత్రికనడచుట కిబ్బంది కలిగింపవచ్చునవెడి యుద్యోగుల కుతంత్రములకు నెనము కలుగు ముండును. ఈచిక్కులనుబట్టి స్వంతభవన మవసరమని పొడకట్టక మానదు. దినపత్రికను నిర్వహించుటకు స్వంతభవనము కావలెనన్న సుమారు 30, 40 వేలు వెచ్చించినగాని యీదినములలో భవన మేర్పడదు. స్వంతభవనము లేకున్నను ఎట్లో నెట్టవచ్చునుగాని స్వంతముద్రా యంత్రము లేనిది అడుగైనను పని సాగదు.

## ముద్రాయంత్రము

పత్రిక జయముగ సాగవలెనన్న సక్రమముగ వెలువడుట ముఖ్యము. ఏమాత్ర మాలస్యమయినను పత్రికయెడల గౌరవము తగ్గును. ఏనాటి దానాడు వెలువడక మర్నాడు వెలువడినను పత్రికయందు మంచిభావము తొలగిపోవును. ఇతరుల ముద్రాయంత్రములయందు ముద్రించుటచేతనే అనేకపత్రికలు నిలిచిపోవలసివచ్చినవి. వారు సకాలమున కియ్యరు. ఇవ్వకున్న పత్రికలకు మంచిపేరుండదు. అచ్చాఫీసువారి ఆలస్యముచే పత్రిక సకాలమున వెలువడలేదను విజ్ఞప్తు లెన్నియోసారులు పత్రికలయందు గాంచుచున్నారము. ఇచటను డిక్లరేషన్ బాధలు గలవు. మాస, వార పత్రికలమాట యెట్లున్నను దినపత్రికను నడుపువారు ముద్రాయంత్రమును స్వంతమునకు గొనకతప్పదు. మునుపు వెయ్యిరూపాయలలో అచ్చాఫీసు ఏర్పడెడి. ఇపుడో వేలకొలది సంఖ్యకు పెరిగినది. ఇందులో ఈమిషనులలో మనుష్యులు త్రిప్పేవి కొన్ని, ఎలెక్ట్రిసిటీవలన తిరిగేవి కొన్ని, మనుష్యులు అచ్చుకూర్చేవి కొన్ని, సీసముదీసి కైపులోసైని కొన్ని, గంటకు వేలకొలదికాపీలను వైచి పారవేయునవి కొన్ని-ఇటులనే దీనిలోను నూతనవిధములు, పోటీలు గలవు. ఏకాలమునకు తగినటు లాకాలమునకు ముద్రాయంత్ర మును అభివృద్ధిపరచుకొనిననేకాని పోటీకి నిలుచుట కష్టము. సుమారు 20,30 వేలు వెచ్చించినగాని దినపత్రికకు సరియగు ముద్రాయంత్రము లభింపదు. అచ్చుకూర్చువారలలో చాలమంది స్వల్పవిద్యావంతులు గను, స్వల్పజీతగాండ్రుగను ఉందురు. వీరికి పొట్టముందర దేశాభిమాన మనునది తెలియదు. వీరలలో 3 గురు 4 గురు పెద్దజీతగాండ్రుందురు. వీరివలననే అచ్చుకూర్పుపనియంతయు సకాలమున పూర్తిగ జరిపించవల సియుండును. వీరు కేవలము ద్రవ్యాపేక్షాపరులుగాక దేశాభిమానపూరి తులై యుండినచో పని సక్రమముగను, ఉత్సాహకరముగను జరుగును.

అట్టివారిని ఏర్చి నియమించుకొనినపుడే స్వామదారుని అదృష్ట మన వచ్చును.

## సంపాదకవర్గము

స్వామదారుడు కంపాజిటరు పని మొదలు సంపాదకుని పనివరకు తెలిసినవాడై యున్నచో తనపత్రికను చక్కగ నడపుకొనగలడు. అనుభవజ్ఞుడగుటచే నెక్కడ నేకష్టముగలదో గ్రహించి, దానిని చక్కబెట్టుకొన గలడు. స్వామదారుడు, అనుభవజ్ఞుడు కానిచో పత్రికా నిర్వహణమునకు లోటుగలుగక మానదు. స్వామదారుడు సంపాదకుని పనిని నిర్వహింపగలవాడైనచో పత్రికయదృష్టమనియే చెప్పవచ్చును. అతని యిష్టవచ్చినరీతి వ్యాసములను వ్రాసుకొనును; ప్రచురించుకొనును. వాటి కతడే జవాబుదారు. సాధారణముగా స్వామదారులు ధనాఢ్యులుగ నుందురు. వీరు సంపాదకులను జీతమిచ్చి యేర్పరచుకొందురు. ఈజీతము నైకొనుసంపాదకులయవస్థ వర్ణనాతీతము. స్వామదారుని అభిప్రాయముల కనుగుణ్యముగా వ్యాసములు వ్రాయవలెను. లేనిచో అభిప్రాయభేదములు, అంతఃకలహములు తప్పవు. సాధారణముగా మనదేశములో లాభమార్జించుపత్రికలు ఒకటిరెంటికన్న లేవు. నష్టముమీద నడపబడునవే విరివిగాగలవు. అట్టితరి శాల్తి విజముపత్రికలకు వ్యాపింపలేదు. స్వామదారులకు హెచ్చులాభములే లభించిన లాభము పంచవలెనన్న తగాదాలుకూడ వ్యాపించెడివే. నష్టముమీద నడచుచున్నవి గనుకనే యిచ్చిన జీతములతో తాబేదారివర్గము సంతుష్టినొందుచున్నది. సంపాదకుడు సమర్థుడును, ఓపికగలవాడును, ధైర్యసాహసములు గలవాడును, ఉత్సాహవంతుడును నై యుండవలెను. సంపాదకుడు తనకువచ్చిన పత్రికల నన్నిటిని జదువవలెను. తంత్రీవార్తలను జదువవలెను. అప్పటికప్పుడు అవ్యవధిగ తనఅభిప్రాయములను (సంపాదకీయములను) వ్రాయుచుండవలెను. ప్రజలలో కార్యోత్సాహములను అభిప్రాయములను ఆందోళనలను గలిగింపగల సమర్థుడుగా నుండవలెను. వారమాసపత్రికల విషయములో చక్కగ నాలోచించి సంపాదకీయములను వ్రాయువ్యవధియుండునుగాని దినపత్రికకు నట్లుగాదు. నిమిషములమీద పని కావలెను. చదువరులుకొందరు ఉద్రేకమును గలిగించుశైలి కావలెనందురు. మరికొందరు సౌమ్యముగ నుండవలెనందురు. కొందరు తిట్టుకవిత్వ ముండవలెనందురు. వేఱుకొందరు గ్రాంథికముగ నుండవలెనందురు. కొందరు గ్రామ్యము కావలెనందురు. ఇందరిని మెప్పింపలేకున్నను మెప్పించులాగున సంపాదకుడు ప్రయత్నింపవలసి యుండును. వర్తకులకు వ్యాపారవిషయములు కావలెను. ఆటగాండ్రకు ఆటలనుగురించినవిషయము లుండవలెను. ఏయేవారికి కాయావారి వార్తలుండవలెను. ఇందరిని తనియించులాగు సంపాదకుడును, ఉపసంపాదకులును పత్రికను రచింప ప్రయత్నింపవలెను. ఆంగ్లపత్రికలకన్న స్వభాషాపత్రికలకు ప్రతిదీ తర్జుమాచేయుపనికద్దు. ఈభారము ఉపసంపాదకులపైబడును. లైబ్రరీసహాయ మెట్లున్నను సంపాదకుడు ఉపసంపాదకులు పాతగాథలను తెలిసినవారై యుండవలెను. సంపాదకత్వము కవిత్వము చెప్పుటవంటిది. ఇది నేర్చుకున్నవచ్చునది కాదు. భగవంతుని దయవలన పుట్టుకొని రావలసినదై యున్నది. ఇట్టి సంపాదకుడును ఉపసంపాదకులును తమ కిచ్చుజీతములనే ప్రాధాన్యముగా జూచుకొనక దేశశ్రేయము నెంచి పనిచేయువారు లభించినచో పత్రిక సౌమ్యముగ నడచును.

## ఉపవిలేఖకులు

సంపాదకవర్గమునకు కార్యనిర్వాహక వర్గమునకు,కంపాజిటర్లకు దాదాపు నెలకు 2, 3 వేలు కావలెను. సంపాదకవర్గము, కార్యనిర్వాహకవర్గము తర్వాత ఆయాకోస్తాలనుండి పట్టణములనుండి వార్తలను దెప్పించుకొనుటకు విలేఖకులను నేర్పరుపవలెను. వీరు తంతిద్వారాను, ఉత్తరములద్వారాను వార్తల సంపుచుందురు. తంత్రులఖర్చులక్రిందను, విలేఖకుల జీతములక్రిందను సుమారు 2 వేలు ప్రతినెలకు ఖర్చగును. ఆంగ్లేయపత్రికయైనచో వచ్చినతంతులను కొలదిమార్పులతో నట్లనే ప్రచురింపవచ్చును. దేశభాషాపత్రికలలో తర్జుమాచేసి ప్రచురింపవలయును. దీనిక్రింద కొంతకాలహరణము జరుగును. అందుచే ఆంగ్లపత్రికతో స్వదేశభాషా పత్రిక పోటీచేయుట కష్టమగుచున్నది. ఆంగ్లపత్రికకు ఆంగ్లభాషవచ్చిన ఏకొలదిమందియో వార్తలనంపుదురు. వ్యాసములను వ్రాయుదురు. సాధారణముగా పట్టణములనుండి మాత్రమే యిట్టివి వచ్చుచుండును. స్వదేశభాషాపత్రికకు నియమించుకొనిన విలేఖకులుగాక ప్రతిగ్రామమునుండియు వ్రాయగలవారెల్ల వ్యాసములను వ్రాసి పంపెదరు. ఇందులో కొందరు వ్యాసములో సారమున్నను లేకున్నను అచ్చులో తమపేరు పడిన చూచి సంతోసింపవలెననువా రుందురు.దీర్ఘ వ్యాసములు వ్రాసిన గట్టివారమనుకొందురని వ్రాయువారు కొందరుందురు. ముక్తసరుగా వ్రాసి పత్రికకు సహాయముచేయువారు కొంద రుందురు.

సాధారణముగా ప్రతిదినము పత్రిక ఏ 20 పేజీలో, 24 పేజీలో ప్రకటింపబడునుకొనుడు. ఇందులో విదేశవార్తలు, దేశీయవార్తలు, జాబులు, వార్తాలేఖలు, వ్యాసములు, వర్తకవిషయములు, లాపాయింట్లు, నాటకప్రదర్శనములు, రైళ్లరాకపోకలు, ధరప్రతులు, కందుకక్రీడలు, సంపాదకీయములు మున్నగునవెన్నియో ప్రచురింపవలసియుండును. ఇప్పుడు బొమ్మలులేనిది పత్రిక యనుపించుకొనుటలేదు. అట్టితరి విలేఖకులు వ్రాసినజాబులును, వ్యాసములును అన్నియు ప్రచురింపబడునెడల ఈ 24 పేజీలుకూడా అందులకే సరిపోవు. అట్టితరి కొన్నిలేఖలు, వ్యాసములు నిలిచిపోక తప్పవు. అప్పుడు నావ్యాస మేలపడలేదని జాబువచ్చును. 24 గంటలలో సంజాయిషీ కోరుదురు. పత్రికానిర్వాహకులు సాధారణముగా తా మెట్టిశ్రమకు పాత్రులగుచున్నారో విలేఖకులుగూడ నట్టిశ్రమతోనే వ్రాసియుందురని గ్రహించి సాధ్యమైనంతవఱకు వ్యాసములను ప్రచురింపవలయునని చూతురు. కాని అచటగల తావునుబట్టి, వ్యాసాంశము పత్రికకు పనికివచ్చునా

లేదా యనుసంగతినిబట్టి గ్రహించి పత్రికానిర్వాహకులు ప్రచురించు చుందురు. ఒక్కొక్కప్పుడు తావులేక ప్రచురింపదగినవి నిలిచి పోవుట కద్దు.

ఈ సంగతులన్నియు విలేఖకులకెందుకు? వారికి కావలసినదెల్ల తమవ్యాసము పడినదా లేదా యనునదే. ప్రతివారు తమవ్యాసము మంచిదనియే యనుకొందురు. తమకస్తూరీ తెలియక ముద్రింపలేదో, తమభాష అర్థముకాక ముద్రింపలేదో దీర్ఘవ్యాసముగా నుండుటచే తావులేక ప్రచురింపలేదో వ్యాసము పనికిరానిదగుటచే ప్రచురింప లేదో గ్రహింపక లేనిపోని నిందారోపణలు పత్రికాసంపాదకవర్గము వారి కాపాదింతురు. పైగా నావ్యాసమును తిరిగిపంపుడని బెదిరింతురు. ఇదెంతయు చింతనీయము. విలేఖకులు సాధ్యమైనంతవరకు క్లుప్తముగా వ్రాయుదురేని పత్రికలవారికి సహాయభూతులుగా నుందురు. రాజ ద్రోహపిశాచ మొకప్రక్కను, మానవష్టభూతమొకప్రక్కను పత్రి కల నావేశింప వేచియుండుననియు గ్రహింపవలెను. ఒకరిని తూల నాడుటకంటె సౌమ్యముగ మంచిమాటలతో దెలుపుపద్ధతిని వ్రాత యున్న విలేఖకులకును,పత్రికలకు శ్రేయమనియు అట్టిపత్రికకు విలువ యుండుననియు తెరుంగు టుత్తమము.

చదువరులు

ఇంత ధనవ్యయమునకు, రాజకీయబాధలకు లోనై పత్రికను నడుపుటకు బూనినచో చందాదారులబాధ వచ్చును. చందాదారు లగు దురనుతలంపుతో మొదట తెలిసినపేర్ల వారికి పత్రిక నంపుదురు. ఇట్లు కొన్నాళ్లు జరుగును. ఇందులో కొందరు రేపర్లనే విప్పరు. కొం దరు అటుత్రిప్పి యిటుత్రిప్పి పారవేతురు; కొందరు మొదటినుంచి చివరవరకు చింతనచేతురు. కొంద రదిలే దదిలేదని విమర్శింతురు. కొం దరు చందాహెచ్చిందురు. చందాసొమ్ము రాలేదని వి. పి. చేయగా కొందరు త్రిప్పివేతురు. ఇప్పుడు పైగా పార్టీలంటూ వచ్చినవి. ఈ పత్రిక మాపార్టీకిచేరినదిగాదందురు. ఇన్ని బాధలకు లోనై ఏపది యేండ్లపాటో చేతివచ్చునుతో పత్రికను నడపగా నడపగా దాని పొట్టపోసుకొనునో లేదో సందియముగానుండును. స్వానుభవమున కింత యోపిక లేనిచో పెట్టుబడియంతయు నష్టమేయగును. మనదేశములో ఆంగ్లేయమునగాని, స్వభాషలయందుగాని ప్రచురింపబడు దినపత్రికలు ౫౦ వరకు నుండవచ్చును. వీటిలో పట్టుమని 10 వేలమంది చందా దారులను గలిగిన పత్రికలు ౫, 6 కంటె ఎక్కువయుండవు. నష్టము నకో, లాభమునకో యోర్చి పత్రికను నడుపుచుంటె కాలక్రమమున చదువువారిసంఖ్య హెచ్చుచున్నందుకు సంతసము.ఏయుద్ధమో, ఏయెన్ని కలో వస్తే ఈచదువరుల యుత్సాహము అతిశయించుచుండును. తమ బాగుకొరకు ప్రచురించుచున్నప్పుడు ప్రజలయాదరణ యిట్లుండ తమను అడుగడుగునకు విమర్శించు పత్రికలపై ప్రభుత్వమువారికి నిరా దరణ, నిర్లక్ష్యము, కోపము ఉండుట యాశ్చర్యము లోనిదిగాదు. వారు తమచేతులలోనున్న రాజకీయాస్త్రముల నుపయోగింపజూచుచుం దురు. పత్రికాపాఠకులకన్న ఆదినుండి అంత్యమువరకు పోలీసువారు, ట్రాన్సులేటరు ఆఫీసువారు శ్రద్ధగా పత్రికను చదివి బాణప్రయోగ సమయము నాకాంక్షించుచుందురు. అందులోని ప్రజోపయోగమగు సంగతులను గ్రహించి వాటికై పాటుపడుమాట యెట్లున్నను ఛిద్ర ముల నన్వేషించుటమాత్రము గలదని ప్రభుత్వమువారు ప్రయోగించు రాజద్రోహబాణములే నిదర్శనములుగ నున్నవి. ఇన్ని యవ్వగండము లతో పత్రిక నడచుచున్నను పల్లెటూళ్లవారు కొందరు వార్తాపత్రికల లోని వార్తలు పుక్కిటిపురాణములని భావించువారు నేటికిని గలరు. కాలక్రమమున ప్రభుత్వదట్టము లెట్లు పత్రికాస్వాతంత్ర్యము నరికట్టు చున్నదియు గ్రహించినచో పత్రికానిర్వాహకుల కష్టములువారికిగోచ రించును. వారు సత్యములనే ప్రచురింతురో, నీలివార్తలనే ప్రచురిం తురో గ్రహింపగలరు. ఇంతకు పత్రికలవారిగతి త్రిశంకుస్వర్గమువలె నున్నది. ఎవరికొరకు ప్రచురింపబడుచున్నవో యట్టి ప్రజల యాద రణ వారికబ్బుటలేదు. ప్రభుత్వమువారికినుక తప్పదు. ఇదియే యింత వెచ్చించి పత్రికానిర్వాహకులు సంపాదించుకొను మహదైశ్వర్యము. ఈవిషయమును గురించి గ్రంథము వ్రాయవచ్చును గాని కాలదిలో పత్రికానిర్వాహకులబాధలు తెలుపుటయే యీవ్యాసాభిప్రాయము గాన నింతటితో విరమించెదను.

---



దేవులపల్లి వేంకటాచలపతిరావు గారు



వ్యాసకర్త

అదె వీక్షింపుమి పోతరాజుకనులం దశ్రుల్ విజృంభించు శా
రద మోమునుగని బుజ్జగించెడిని గారాబంబు మై, చూడు మ
ల్లదె కైసేయుచునున్నవాఁ డచట విద్యానాథుఁ డెన్నెన్ని సం
పదలన్, భూమలభారతీసతికి సౌభాగ్యంబుగన్ సోదరా.

సీ. వేదవేదాంతార్థవిధి గురులింగసత్త్వవిబోధ యొనరింపఁగలిగె నిచట
పారమార్థిక భాష్యసారంబు రామానుజస్వామి మును జర్చ సలిపె నిచట
గణపతిదేవుని గలిసి తిక్కనగోష్ఠి నెల్లూరుప్రభునకై నెఱపెనిచట
ఆత్మ దేశోద్ధరణార్థమై శూరులు వీరలోకము జేరినార లిచట
కవిత శిల్పంబు కళలు వికాస మొంది-జీర్ణ శేషంబులై పెంపుచెడియె నిచట
చూచి స్మరియించి మౌనివై సుంత సేపు-అశ్రుతర్పణ మిడరాదె యాంధ్రపుత్రి!

సీ. రెడ్డిసోదరుల దోర్విక్రమ శౌర్యాగ్ని దీప్తిమై వెలిఁగిన దివ్యభూమి
వెలమ వీరుల బాహుబల విక్రమాది సంపదలకు నెలవైన మాతృభూమి
కమ్మనాయకుల నిష్కల్మష శాతాసికలన జేనొందిన కర్మభూమి
మంత్రినియోగుల మాతృసేవాదీక్ష పాలుపొంద జేసిన పుణ్యభూమి
కాలగర్భాంతరస్థమై కన్నుమూయ-కారణంబేమొ యూహించి కనుల విప్పి
జీర్ణ శేషంబులై యున్న శిల్పకళలఁ-జూతురావయ్య నీ వాంధ్రసుతుఁడ వేని.

సీ. మహి కాకతీయసామ్రాజ్యమహాధ్వజ ముడువీథి నడయాడుచున్న యపుడు
హరికథాసంకీర్తనామృతధారల పోతన చిలికించి పోసినపుడు
అతులితాలంకారకృతిని విద్యానాథకవి వ్రాసి విఖ్యాతి గాంచునపుడు
తెలుఁగుపౌజుల వాఁడి యలుఁగులు వైరులగుండెలలో గ్రుచ్చుకొన్న యపుడు
నాగరకతా విశేషవిన్యాసకళల మించు గీతికజగము లాలించునపుడు
ఆంధ్రసామ్రాజ్య మొందిన యతిశయమ్ము-తలఁచి చింతింతువే యాంధ్రతనయ నీవు.



# అక్షయసంవత్సర విశేషములు

౧౯౨౬ మార్చి

౧౫. శ్రీ జె. యమ్. సేను గుప్తాగారు మొదలగు స్వరాజ్య పక్షసభ్యులు బంగాళా శాసనసభనుండి నిష్క్రమించిరి.

౧౬. మద్రాసుశాసనసభనుండి స్వరాజ్యపక్షసభ్యులు నిష్క్రమించిరి.

౨౦. దిగుమర్తి హనుమంతరావుగారు కీర్తిశేషులైరి.

౨౬. సర్. కృష్ణ గోవిందగుప్తగారు కీర్తిశేషులైరి.

ఏప్రిల్ ౧. నూతన రాజప్రతినిధి ఇర్విన్ ప్రభువు ఇంగ్లండునుండి బొంబాయి చేరిరి.

౨. రీడింగు ప్రభువు బొంబాయినుండి ఇంగ్లండునకు బయలు దేరిరి.

౬. రాజప్రతినిధి ఇర్విను ప్రభువు ఢిల్లీ చేరిరి.

౨౩. కలకత్తాలో హిందూమహమ్మదీయ కలహములవలన ప్రాణనష్టము మెండుగగలిగెను.

౨౪. శ్రీలాలా లజపతిరాయిగారు స్వరాజ్యపక్ష సభ్యత్వమును వదలుకొనిరి.

౨౯. సర్ టి. విజయరాఘవాచారిగారు కదడా జాతీయవస్తు ప్రదర్శనము నుపక్రమించిరి.

౩౦. గోషన్ ప్రభువుగారు బెజవాడలో ఆంధ్రవిశ్వ విద్యాలయమును స్థాపించిరి.

మే ౩. పార్లమెంటు సభ్యుడు సక్లత్‌వాలాగారు హైడ్ పార్కులో రాజద్రోహపు టుపన్యాసము లిచ్చుటచే అరెస్టుచేయబడిరి.

౫. సక్లత్‌వాలాగారు జామీనిచ్చుట కంగీకరింపకపోవుటచే 2 నెలల బందెకు పాల్పడిరి.

౨౫. అబ్దుల్ కరీమ్ (రిఫ్ఫులనాయకుడు) ఫ్రెంచి వారికి లొంగిపోయెను.

జూన్ ౯. హైదరాబాదు పీతామహుడు సయ్యద్ హుస్సేను బిల్గ్రామిగారు కీర్తిశేషులైరి.

౯. ఆంధ్రనాయకులలో నొకరగు రా. సా. మానాజి రాజుగారు బొంబాయి కార్పొరేషను సభ్యులైరి.

౨౫. సక్లత్‌వాలాగారి కారాగారవిముక్తి.

౧౯౨౬ జూన్

౨౮. చిత్తరంజన దాసుగారి కుమారుడు చిరరంజన దాసుగారు కీర్తిశేషులైరి.

జూలై ౧౮. ఆంధ్ర చిత్రకారులు ఏ. శ్రీరాముగారు కీర్తిశేషులైరి.

౧౫. కలకత్తాలో హిందూమహమ్మదీయ కలహములు మరల పెరిగినవి.

౨౫. విద్వాన్ వీణ శేషణ్ణగారు కీర్తిశేషులైరి.

౨౬. మద్రాసులో బ్రాహ్మణబ్రాహ్మణేతరపక్షముల పరిస్థితులను పరికించి రాజప్రతినిధికి తెలుపుటకు కార్యనిర్వాహకసభ్యుడు (లామెంబరు) గౌ. యస్.ఆర్.దాసుగారు మద్రాసుకు వచ్చిరి.

ఆగస్టు ౮. పండిత మదనమోహన మాలవ్యాగారు వంగప్రభుత్వపుటాజ్ఞ నుల్లంఘించి నేడు కలకత్తా ప్రవేశించిరి.

౧౬. కలకత్తా ప్రెసిడెన్సీ మాజిస్ట్రేటుగారి యుత్తరవు నుల్లంఘించుటచే డా. మూంజీగారికి నాగపురములో సమను లంపబడెను.

౧౯. పండిత మాలవ్యా డా. మూంజీగార్లపై ప్రభుత్వము వారు తెచ్చిన అభియోగములు త్రోసివేయబడెను.

సెప్టెం. ౫. శ్రీమాన్ యస్. శ్రీనివాస అయ్యంగారు 41వ భారతజాతీయమహాసభకు అధ్యక్షులుగనెన్నుకొనబడిరి.

౧౫. స్వతంత్రపక్షమునకు పం. మదనమోహన మాలవ్యాగారు అధ్యక్షులుగాను, లాలా లజపతి రాయిగారు కార్యదర్శిగాను ఎన్నుకొనబడిరి.

౧౬. హిందూదేశపు దేవాలయములబిల్లు ఆమోదింపబడినది.

,, శ్రీయుత బులుసుసాంబమూర్తిగారు శాసనసభకు అభ్యర్థిగ నిలువనవీలు లేదని ప్రభుత్వమువారు నిషేధించిరి.

౨౩. దక్షిణాఫ్రికా రాయబారులు చెన్నపురికి వచ్చిరి.

అక్టో. ౧. డా. బిసెంటుగారి 80-వ జన్మదినము.

౨. గాంధిమహాత్ముని 57-వ జన్మదినము.

౧౬. గౌ. వి. జే. పటేలుగారు భారత శాసనసభకు అధ్యక్షులుగానెన్నుకొనబడిరి.

౨౨. యస్. రంగస్వామిఅయ్యంగారు, హిందూపత్రికా సంపాదకులు, కీర్తిశేషులయిరి.

౧౯౨౬ నవంబరు

౧౦. జార్జి బెర్నార్డుషాగారికి 'నోబెలు' సారస్వత బహుమాన మొసంగబడెను.

౨౮. ఆంధ్రరాష్ట్రీయమహాసభ, అధ్యక్షులు:- కందుల వీరరాఘవస్వామి నాయుడుగారు

" ఆంధ్రరాష్ట్రసంస్కరణసభ, అధ్యక్షులు - డా. పి. వరదరాజులు నాయుడుగారు.

౨౯. 13-వ ఆంధ్రమహాసభ, అధ్యక్షులు - శ్రీరాజా వెంకటాద్రి అప్పారావుగారు, పులుసూ్యరు జమీందారు.

౩౦. 5-వ హిందీమహాసభ, అధ్యక్షులు-భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు.

" ప్రథమాంధ్రగాయక మహాసభ, అధ్యక్షుడు - హరినాగభూషణముగారు.

" ఆంధ్రమహిళాసభ, అధ్యక్షురాలు-శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు.

" ఆంధ్ర గ్రంథాలయమహాసభ, అధ్యక్షుడు-వాశం కృష్ణారావుగారు.

డిసెం. ౧. డా. ముత్తులక్ష్మమ్మగారు చెన్నపురి శాసనసభకు సభ్యురాలుగా ప్రభుత్వమువారిచే నియమింపబడిరి.

౩. స్వతంత్ర వాదులగు శ్రీడాక్టరు పి. సుబ్బరాయనుగారు చెన్నరాష్ట్రమునకు ప్రధానమంత్రిగా నియమింపబడిరి.

౪. శ్రీ. ఏ. రంగనాథ మొదలియారుగారు, డి. బ. ఆరోగ్యస్వామి మొదలియారుగారు చెన్నరాష్ట్రమునకు మంత్రులుగా నియమింపబడిరి.

౧౨. ప్రొఫెసరు రాధాకృష్ణనుగారు (కలకత్తా విశ్వవిద్యాలయమున అధ్యాపకులు) అమెరికానుండి తిరిగివచ్చిరి.

౧౩. డాక్టరు పార్వతీబాయిగారు పంజాబుశాసనసభకు సభ్యురాలుగా నెన్నుకొనబడిరి.

౧౫. శ్రద్ధానందస్వామిహత్య—హంతకుడు అబ్దుల్ రషీదు.

౨౬. 41-వ భారతజాతీయమహాసభాసమావేశము, గౌహతి, అధ్యక్షులు—శ్రీమాన్ యస్. శ్రీనివాసఅయ్యంగారు.

" అఖిలభారత సేవాదళ మహాసభ, అధ్యక్షుడు—పండిత నెహాౄగారు.

౨౮. రాజకీయఖైదీల మహాసభ, అధ్యక్షుడు-డా. బి. యన్. దత్తుగారు.

" శ్రీయుత పి. వి. యస్. నరసింహరాజాగారు చెన్నరాష్ట్ర శాసనసభ కధ్యక్షులుగా నెన్నుకొనబడిరి.

౧౯౨౬ డిసెంబరు

౨౯. హిందూమహాసభ, అధ్యక్షులు—పండిత మాలవ్యాగారు.

౩౦. మిస్ యస్. ఇ. జె. జకరయగారు మదరాసు సెనేటు సభకు సభ్యురాలుగా ఎన్నుకొనబడిరి.

౧౯౨౭

జనవరి ౧. సక్లత్వాలాగారు ఇంగ్లాండునుండి బొంబాయికి వచ్చిరి.

౧౯. శ్రీ. వి. జె. పటేలుగారు నూతనభారత శాసనసభకు నధ్యక్షులుగ మరల నెన్నుకొనబడిరి.

౨౪. హిందూదేశమునుండి భారతసైన్యము చీనాకు పంపబడెను.

౨౫. డా. ముత్తులక్ష్మమ్మగారు మదరాసు శాసనసభకు ఉపాధ్యక్షురాలుగ ఎన్నుకొనబడిరి.

౩౧. మాళీవమహమ్మదు యాకూబుగారు(స్వతంత్రవాది, ప్రభుత్వ నియుక్తసభ్యుడు) భారతసభకు ఉపాధ్యక్షులుగ నెన్నుకొనబడిరి.

ఫిబ్రవరి ౩. కూర్మపుగంటి రాఘవేంద్రరావుగారు మధ్యరాష్ట్రము లందు ప్రధానమంత్రిగ నియమింపబడిరి.

౧౩. ఖడ్గపురం రైల్వేసమ్మె ప్రారంభము.

౧౬. డాక్టరు ఆర్. పి. పరంజపేగారు ఇండియాకౌన్సిలు సభ్యులుగా నియమింపబడిరి.

౨౧. గౌ. డా. పరంజపేగారు బొంబాయి మంత్రిగానుండి ఇండియామంత్రి కార్యాలయ సభ్యులుగ నియమింపబడిరి.

౨౪. స్టేటుకౌన్సిలులో దక్షిణాఫ్రికా ఒడంబడికయందలి షరత్తులు ఏకగ్రీవముగా ఆమోదింపబడినవి.

మార్చి ౩. స్టేటుకౌన్సిలులో అయస్సంరక్షణశాసనము (Steel Protection Bill) అంగీకృతమైనది.

౪. డి. బ. కె. యస్. చంద్రశేఖరయ్యరుగారి సతీమణి చెంగల్పటు జిల్లా బోర్డు సభ్యురాలుగా మైసూరు ప్రభుత్వము వారిచే నియమింపబడిరి.

౫. ప్రొఫెసరు కే. బి. రామనాథ అయ్యరుగారు కీర్తిశేషులయిరి.

౧౫. చెన్నపురి శాసనసభయందు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర తీర్మాన మంగీకరింపబడెను.

" న్యూ ఇండియా ఆంగ్ల దినపత్రిక అంతరించినది.

౧౬. శ్రద్ధానందస్వామిని హత్యగావించిన అబ్దుల్ రషీదునకు మరణదండనము విధింపబడెను.



Printed and Published by K. Nageswara Row, at the Andhra Patrika Press, 7, Thumbu Chetty St., G.T., Madras

# అమృతాంజనం డిపోవారి

## సుప్రసిద్ధౌషధముల జాబితా

| | |
|---|---|
| జీర్ణరసాయనము మాత్రలు అజీర్ణమునకు | 1- 4 |
| వజ్రగుళికలు ధాతుపుష్టికి | 1- 0 |
| జ్వరహారి జ్వరములకు సీసా 1-కి | 0-12 |
| అమృతాంజనము సీసా 1-కి | 0-10 |
| మూలశంకకు తైలము డబ్బి 1-కి | 0-12 |
| తామరతైలము, తామర, తీటకు | 0- 6 |
| కలరా మాత్రలు, వాంతిభేదులకు | 0- 6 |
| తేలుమందు, తేలుకాటుకు సీసా 1-కి | 0- 8 |
| దంతశూలహారి, పండ్లపోటుకు | 0- 8 |
| కర్ణశూలహారి, చెవిపోటుకు | 0- 6 |
| గజ్జికి తైలము, గజ్జిచీడలకు డబ్బి 1-కి | 0- 4 |
| పగుళ్లకు తైలము, శీతపగుళ్లకు | 0- 4 |
| పేలకు మందు సీసా 1-కి | 0- 6 |
| చందన అత్తరు 1 ఔన్సు | 2- 0 |
| కుష్ఠుకు తైలము డబ్బి 1-కి | 0- 8 |
| దంతచూర్ణము, పండ్లుతోముటకు | 0- 2 |
| సుఖభోగి మాత్రలు | 1- 0 |
| సుఖభోగి తైలము, పుండ్లకు | 1- 0 |
| రోమహారి, వెండ్రుకలు ఊడుటకు | 0- 8 |
| మోహినితైలము, వెండ్రుకలు పెరుగుటకు | 0-12 |
| చుండుకు నూనె సీసా 1-కి | 0- 6 |
| గ్రహాణిమాత్రలు డబ్బి 1-కి | 0- 8 |
| జులాబి మాత్రలు, మలబద్ధమునకు | 0- 8 |
| కుసుమారిమాత్రలు, కుసుమవ్యాధులకు | 1- 0 |
| శగకు ద్రావకము సీసా 1-కి | 1- 0 |
| కఫహారి, శీతకట్టు దగ్గులకు | 1- 0 |
| ,, చూర్ణము దగ్గుకు, డబ్బి 1-కి | 0-8 |
| సుందరితైలము, ముఖకాంతికి డబ్బి 1-కి | 0-8 |
| శిరోవేదన మాత్రలు, తలనొప్పులకు | 0-12 |
| నేత్రాంజనము, కంటివ్యాధులకు | 0- 4 |
| ఉబ్బసమునకు మందు | 0- 2 |
| వాయుపుపోట్లకు మందు డబ్బి 1-కి | 1- 0 |
| విరేచనములకు మాత్రలు డబ్బి 1-కి | 0- 8 |
| కస్తూరిమాత్రలు పెద్దవి, మంచివి 50-కి | 0-10 |
| వాముకర్పూరము సీసా 1-కి | 0- 6 |
| నేపాళదేశపుకస్తూరి, మంచిది తు1-కి | 36- 0 |
| కుంకుమపువ్వు 1-వ రకం తు. 1-కి | 3- 8 |
| పచ్చకర్పూరం తు. 1-కి | 3- 8 |

## అమృతాంజనం డిపో,

మదరాసు. బొంబయి.






TRADE
MARK



# ఆంధ్రపత్రికా కార్యాలయమున దొరకు గ్రంథములు

| | |
|---|---|
| రాష్ట్రభాషాహిందీప్రథమ పుస్తకము-రామానందశర్మ ... ... | ౧–౩–౦ |
| శ్రీరామవిజయము (నాటకము)—కే. వెంకటరమణరావు ... ... | ౦–౮–౦ |
| శారదాంబ, (శ్రీనర్మబోధిని) నాటకము—టి. శ్రీనివాస రాఘవాచార్యులు ... | ౦–౪–౦ |
| శబ్దకామధి (నిఘంటువు)—శిరోభూషణము వేంకటరంగాచార్యులు ... | ౧–౪–౦ |
| ఆంధ్రోద్యమము—మొదటి అయిదు ఆంధ్రమహాజనసభల అధ్యక్షుల ఉపన్యాసములు, తీర్మానములు, చిత్రములు గలవు ... ... ... ... | ౧–౮–౦ |
| ఆరాధనవిధి—ముదిగొండ నాగలింగశాస్త్రి ... ... ... | ౦–౪–౦ |
| ఆత్మజిజ్ఞాసాసంఘము—పారనంది జగన్నాథస్వామి. శరీరము విడిచినతరువాత ఆత్మస్థితిని గూర్చి చెప్పునది ... ... ... ... ... | ౦–౮–౦ |
| సత్యవత్యుపాఖ్యానము—మల్లంపల్లిమల్లికార్జునశాస్త్రి; అ. ౫, రసవత్ప్రబంధము ... | ౧–౦–౦ |
| గురుబోధామృతము (వేదసారము)—కట్టమంచి తిరుమలమ్మ; భక్తిరసభరితములగు పాటలు | ౦–౪–౦ |
| తిలకుమహాశయునిజీవితము, సంపూర్ణోపన్యాసములు—మానికొండ సత్యనారాయణశాస్త్రి | ౨–౪–౦ |
| తత్త్వమచంద్రిక (ప్రథమభాగము)—సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి ... | ౧–౦–౦ |
| సంగీత శమంతకమణి ... ... ... ... ... | ౦–౮–౦ |
| ఆంధ్రశబ్దచింతామణి (సటీకము)—పారనంది రామశాస్త్రి ... ... | ౦–౧౨–౦ |
| మహర్షి దేవేంద్రనాథ ఠాకూరు స్వీయచరిత్రము:—మొక్కపాటి రామమూర్తి | ౨–౮–౦ |
| శ్యామాసుందరము (నవల)—ఒంతెరి పక్కినాథము; (రంపయుద్ధము) ... ... | ౧–౦–౦ |
| బారిష్టరు పార్వతీశం (భా. ౧)—మొక్కపాటి నరసింహశాస్త్రి ... ... | ౧–౮–౦ |
| రామదాసు నాటకము ... ... ... ... ... | ౦–౧౦–౦ |
| గాలవఋషి నాటకము ... ... ... ... ... | ౦–౧౨–౦ |
| మనశ్శరీరములపై పరిసరముల ప్రభావము ... ... ... | ౦–౧౨–౦ |
| శతకకవుల చరిత్ర—వంగూరి సుబ్బారావు ... ... ... | ౩–౭–౦ |
| కవిత్వతత్త్వవిచారము ... ... ... ... ... | ౨–౮–౦ |
| ఆంధ్రసర్వకళాశాల విద్యాప్రవృత్తి ... ... ... ... | ౦–౪–౦ |
| హిందీ తెలుగు నిఘంటువు—పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి (జేబులో నిముడునది) | ౧–౦–౦ |

| | | | |
|---|---|---|---|
| హిందీ మొదటివాచకము ... | ౦–౬–౦ | దేవకీనందన శతకము ... | ౦–౨–౦ |
| హిందీ బాలశిక్ష ... | ౦–౬–౦ | ఒంటిమిట్ట రఘువీరశతకము-అయ్యలరాజు త్రిపురాంతకుడు ... | ౦–౨–౦ |
| సకలనీతిసమ్మతము ... | ౦–౮–౦ | నారాయణశతకము ... | ౦–౩–౦ |
| అభిమానకము ... ... | ౦–౧౦–౦ | కాళహస్తీశ్వర శతకము ... | ౦–౪–౦ |
| నవచోళచరిత్ర (ద్విపద) ... | ౦–౧౨–౦ | దాశరథిశతకము-కంచర్ల గోపకవి... | ౦–౩–౦ |
| ఏకభాషాలిపి ప్రశంస ... | ౦–౪–౦ | రంగశాయి శతకము ... | ౦–౨–౦ |
| శ్రీనృహరిశతకము-పాలకురికి సోమన | ౦–౪–౦ | శ్రీరామతారకశతకము ... | ౦–౩–౦ |
| సర్వేశ్వర శతకము-యథావాక్కుల అన్నమయ్య ... | ౦–౪–౦ | రామచంద్రశతకము-పైడిపాటి వెంకట నృసింహకవి ... | ౦–౨–౦ |

ఆంధ్రపత్రికా కార్యాలయము, (తపాలపెట్టె 212.) 7, తంబుశెట్టివీథి, చెన్నపురి.





